## సదాశివ సమారంభాం


గురు దక్షిణామూర్తి


గురు వేదవ్యాస మహర్షి


గురు శుక మహర్షి


గురు నారద మహర్షి


గురు వాల్మీకి మహర్షి


గురు శ్రీకృష్ణ

## శంకరాచార్య మధ్యమాం


గురు దత్తాత్రేయ


గురు బాబాజీ


గురు గౌతమ బుద్ధ


గురు ఆదిశంకరాచార్య


గురు రామానుజాచార్యులు


గురు జ్ఞానేశ్వర్


గురు రవిదాస్


గురు కబీర్ దాస్


గురు చైతన్య మహా ప్రభువు


గురు నానక్


గురు రాఘవేంద్ర స్వామి


గురు వీరబ్రహ్మేంద్ర స్వామి


యోగి వేమన

## అస్మదాచార్య పర్యంతాం


గురు త్రైలింగ స్వామి


గురు లాహిరి మహాశయ



గురు రామకృష్ణ పరమహంస, అమ్మ శారదాదేవి


గురు వివేకానంద


గురు సాయి బాబా


గురు అరబిందో


గురు రమణ మహర్షి


గురు యోగానంద


గురు భక్తివేదాంత ప్రభుపాద


గురు మళయాళస్వామి


గురు విద్యాప్రకాశానందగిరి


గురు చంద్రశేఖర పరమాచార్య

## వందే గురుపరంపరాం..




## భారత ప్రభుత్వపు వెబ్ సైట్ - డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా

## http://www.new.dli.ernet.in

Digital Library of India: Inc ×

www.new.dli.ernet.in

# Digital Library of India

Hosted by: Indian Institute of Science, Bangalore in co-operation with
CMU, IIIT-H, NSF, ERNET and MCIT for the Govt. of India and 21 major participating centres.

Home | Vision | Mission | Goals | Benefits | Content Selection | Current Status | People | Funding | Copyright Policy | FAQ | RFP

Books Journals Newspapers Palm-Leaves (Manuscripts)

Title: Ramayanam
Author:
Year: to
Subject: Any Subject
Language: Telugu
Scanning Centre: Any Centre

Clear | Search

Presentations and Report
Statistics Report
Status Report
Feedback | Suggestions | Problems | Missing links or Books

Click here for PDF collection
DLI MIRROR at IUCAA Data Center PUNE

DLI

For the first time in history, the Digital Library of India is digitizing all the significant works of Mankind.

Click Here to know More about DLI New!

| Books | Journals | Newspapers | Manuscripts |
|---|---|---|---|
| Rashtrapati Bhavan<br>CMU-Books<br>Sanskrit<br>TTD,Tirupathi<br>Kerala Sahitya Akademi | INSA | Times of India<br>Indian Express<br>The Hindu<br>Deccan Herald<br>Eenadu<br>Vaartha | Tamil Heritage Foundation<br>AnnaUniversity NEW! |

Title Beginning with.

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

Author's Last Name

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

Year

1850-1900 | 1901-1910 | 1911-1920 | 1921-1930 | 1931-1940 | 1941-1950 | 1951-

Subject

Astrophysics | Biology | Chemistry | Education | Law | Mathematics | Mythology | Religion | For more subjects...

Language

Sanskrit | English | Bengali | Hindi | Kannada | Marathi | Tamil | Telugu | Urdu

# అతి విశిష్టం ఈ దానం!

స్వామి వివేకానంద

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్న్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.



రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, జవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖

మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

APOLLO
SUCCESS SERIES

LATEST REVISED EDITION

బి.ఏ.,

# ఆర్థిక సిద్ధాంతం

ప్రథమ సంవత్సరము



*Legal Note :*

Inspite of many efforts taken to present the book without errors, some errors might have been creptin. So we do not take any legal responsibility for such errors and ommissions. If they are brought to our notice they will be corrected in the next edition.

# REVISED COMMON CORE SYLLABUS

## B. A. DEGREE EXAMINATION

*(Examination at the end of First Year)*

## ECONOMICS

### Paper I: Economic Theory

**Weightage of Marks**

**I. SCOPE** 5

Micro and Macro Economics - Circular flow of economic activities.

**II. DEMAND** 20

Concept of ordinal utility - indifference curve analysis - Consumer's equilibrium - Price, Income and Substitution effects - Derivation of Demand Curve - Law of Demand - Elasticity of Demand - Types of measurement.

**III. PRODUCTION** 15

Production function - Law of variable proportion - Returns to scale - Concept of cost - Opportunity cost - Types of costs - total, average and marginal costs - Short-run, long-run costs - Supply curves.

**IV. MARKETS** 20

Concepts of equilibrium firm - Price and output determination under Perfect competition - monopoly and discriminating monopoly - monopolistic competition - Concept of kinky demand curve in Oligopoly.

**V. NATIONAL INCOME** 10

National Income - Concepts and components-measurements of National Income - Pricing of factors of production-Marginal productivity theory.

**VI. INCOME AND EMPLOYMENT THEORY** 15

Elements of Classical theory - Keyne's theory of Income determination - Concept of APC and MPC - consumption function - Concept of MEC in investment functions Multiplier and accelerator - Liquidity preference theory of interest - relevence of Keyne's theory to developing economies.

**VII. MONEY AND BANKING** 15

Concept of Money and RBI classification - $M_1$, $M_2$, $M_3$, $M_4$, - Value of money and cost of living index - Credit creation by commercial banks - Outline of RBI monetary policy - concept of inflation - Cost push, demand pull and Philip's curve - Consequences and control of inflation.

# CONTENTS

అధ్యాయము 1

# సూక్ష్మ, స్థూల అర్థశాస్త్రము

**ప్రశ్న 1) సూక్ష్మ, స్థూల అర్థశాస్త్రముల మధ్య విచక్షణ చేయుము.**

**లేదా**

**సూక్ష్మ, స్థూల ఆర్థిక విశ్లేషణలకు భేదాన్ని విశదీకరించి వాటి ఉపయోగమును తెల్పుము.**

**లేదా**

**సూక్ష్మ అర్థశాస్త్ర విశ్లేషణ ప్రాముఖ్యత, పరిమితులు ఏవి ?**

**(Very Important)**

**జవాబు :** ఆధునిక అర్థశాస్త్రవేత్తలు ఆర్థిక విశ్లేషణను రెండుగా విభజించారు. అవి :

i) సూక్ష్మ ఆర్థిక విశ్లేషణ లేక సూక్ష్మ అర్థశాస్త్రం.

ii) స్థూల ఆర్థిక విశ్లేషణ లేక స్థూల అర్థశాస్త్రం.

ఈ రకమైన విభజనను 1933లో మొదటిసారిగా "రాగ్నార్ ఫ్రిష్" (Ragnar Frisch అనే అర్థశాస్త్రవేత్త చేశాడు. తర్వాత ఇది సర్వత్రా ఉపయోగపడింది. సూక్ష్మ ఆర్థిక విశ్లేషణకు "డేవిడ్ రికార్డో", "J.B. సే", "J.S. మిల్", "మార్షల్ " మొదలయిన అర్థశాస్త్రవేత్తలు ప్రాముఖ్యం ఇచ్చారు. అలాగే స్థూల ఆర్థిక విశ్లేషణకు ప్రాముఖ్యత నిచ్చి బలపరచినవారిలో "లార్డ్ J.M. కీన్స్" అతి ముఖ్యుడు. ప్రస్తుతం సూక్ష్మ ఆర్థిక విశ్లేషణ **"ధరల సిద్ధాంతం"** (Price Theory) గాను, స్థూల ఆర్థిక విశ్లేషణ **"ఉత్పత్తి - ఉద్యోగితా సిద్ధాంతముగాను"** పరిగణింపబడుతున్నాయి.

**i) సూక్ష్మ ఆర్థిక విశ్లేషణ :** వ్యక్తుల ఆర్థిక కార్యకలాపాలను అధ్యయనం చేసేది సూక్ష్మ అర్థశాస్త్రం. ఇది **'వైయక్తిక యూనిట్'** (Individual or minute units) లను పరిశీలిస్తుంది. అంటే ఒక వినియోగదారుడు, ఒక సంస్థ, ఒక పరిశ్రమ, ఒక ఉత్పత్తి కారకం మొదలైన వైయక్తిక యూనిట్‌ల ప్రవర్తనను పరిశీలిస్తుంది. సూక్ష్మ ఆర్థిక విశ్లేషణ ఒక వస్తువు ధర ఎలా నిర్ణయించబడుతుంది, ఒక వినియోగదారుడు గరిష్ట సంతృప్తినెలా పొందుతాడు, ఒక సంస్థ లేక పరిశ్రమ ఎప్పుడు సమతౌల్య స్థితిలో ఉంటుంది, ఒక్కొక్క

**ప్రశ్న 2) సూక్ష్మ ఆర్థిక విశ్లేషణ స్వభావమును, ప్రాముఖ్యతను తెల్పుము.**

**జవాబు :** ఆర్థిక వ్యవస్థలో వైయక్తిక యూనిట్లను తీసుకొని, వాటిని విశ్లేషణ చేయటాన్ని "సూక్ష్మ ఆర్థిక విశ్లేషణ" అంటారు. సాంప్రదాయ ఆర్థికవేత్తలైన "ఆడమ్ స్మిత్", "డేవిడ్ రికార్డో", "J.S. Mill", "J.B. Say" మొదలగువారు సూక్ష్మ ఆర్థికవిశ్లేషణకు ప్రాముఖ్యత ఇచ్చినారు. సూక్ష్మ అర్థశాస్త్రము ఆర్థిక వ్యవస్థలోని చిన్న చిన్న యూనిట్లను పరిశీలించి వాటి ప్రవర్తనను, స్వభావాన్ని, ఫలితాలను విశ్లేషణ చేస్తుంది. అందుచే సూక్ష్మ అర్థశాస్త్రాన్ని, "సూక్ష్మ ఆర్థిక విశ్లేషణ" అని అంటారు. ఒక వినియోగదారుని గురించి, ఉత్పత్తి సంస్థను గురించి, సూక్ష్మ అర్థశాస్త్రములో పరిశీలిస్తాము. ఒక వినియోగదారుడు తన ప్రయోజనాన్ని ఏ విధంగా గరిష్టం చేసుకుంటాడు, ఒక సంస్థ గరిష్ట లాభాలను ఏ విధంగా పొందగలుగుతుంది, వినియోగదారుడు, సంస్థ ఎప్పుడు సమతౌల్య స్థితిని చేరుకుంటాయి అనేది ఈ శాస్త్రములో పరిశీలించడం జరుగుతుంది.

అలాగే వైయక్తిక డిమాండు, సప్లయ్‌లను గురించి, ఉత్పత్తి కారకాల సప్లయ్, డిమాండులను గురించి, సూక్ష్మ అర్థశాస్త్రము విశ్లేషణ చేస్తుంది. ఈ శాస్త్రము ముఖ్యంగా వస్తువుల యొక్క ధరలు, ఉత్పత్తి కారకాల యొక్క ధరల నిర్ణయాల గురించి పరిశీలిస్తుంది. ధరల నిర్ణయానికి ఎక్కువ ప్రాముఖ్యత ఇవ్వడము వల్ల సూక్ష్మ అర్థశాస్త్రాన్ని "ధరల సిద్ధాంతము" అని కూడా అంటారు.

**సూక్ష్మ అర్థశాస్త్ర ప్రాముఖ్యత :**

1) సూక్ష్మ ఆర్థిక విశ్లేషణ వనరులను అభిలషణీయంగా ఉపయోగించటానికి తోడ్పడుతుంది.
2) సూక్ష్మ ఆర్థిక విశ్లేషణ సమగ్రమైన ధరల సిద్ధాంతాలను రూపొందించడానికి తోడ్పడుతుంది.
3) సూక్ష్మ అర్థశాస్త్రము వినియోగదారుడు పరిమిత వనరుల నుంచి గరిష్ట సంతృప్తిని పొందటానికి తోడ్పడుతుంది.
4) సూక్ష్మ అర్థశాస్త్రము ఉత్పత్తిదారులకు వనరులు కేటాయించటంలో డిమాండు, ఉత్పత్తి వ్యయాలను అంచనా వేయడంలో తోడ్పడుతుంది.
5) సూక్ష్మ అర్థశాస్త్రము అంతర్జాతీయ వ్యాపార, విదేశ మారక ద్రవ్యానికి సంబంధించిన సమస్యను పరిష్కరించటానికి తోడ్పడుతుంది.
6) సూక్ష్మ అర్థశాస్త్రము అనేక ఆర్థిక సిద్ధాంతాల ఫలితాలను విశ్లేషణ చేయటానికి ప్రభుత్వానికి తోడ్పడుతుంది.

సూక్ష్మ అర్థశాస్త్ర విషయ వస్తువు ఈ క్రింది చార్టులో చూపబడింది.




**ప్రశ్న 3) స్థూల ఆర్థిక విశ్లేషణ స్వభావము, ముఖ్యాంశాలను పేర్కొనుము.**

**జవాబు : స్థూల ఆర్థిక విశ్లేషణ :** స్థూల అర్థశాస్త్రాన్ని ఎక్కువ ప్రాముఖ్యతలోనికి తీసుకొచ్చిన ఆర్థికవేత్త "J.M. కీన్స్". అందుచే "J.M.కీన్స్"ను స్థూల అర్థశాస్త్రానికి మూలపురుషుడుగా పరిగణిస్తారు. ఆర్థిక వ్యవస్థ అంతటిని ఒక యూనిట్‌గా తీసుకొని పెద్ద పెద్ద మొత్తాలను గురించి పరిశీలించే దానిని "స్థూల ఆర్థిక విశ్లేషణ" అంటారు. స్థూల అర్థశాస్త్రము వైయుక్తిక యూనిట్లను గురించికాక మొత్తము ఆర్థిక వ్యవస్థ పనిచేసే తీరుతెన్నులను విశ్లేషణ చేస్తుంది.

సూక్ష్మ అర్థశాస్త్రం ఆర్థిక వ్యవస్థలోని సూక్ష్మ అంశాల ప్రవర్తన విశ్లేషణను, స్థూల అర్థశాస్త్రం వివిధ అంశాల మొత్తాలకు ఉన్న పరస్పర సంబంధాన్ని వాటి ప్రవర్తనను చర్చిస్తుంది. స్థూల అర్థశాస్త్రం ఒక సంస్థ యొక్క ఉత్పత్తిని, ఉద్యోగితా స్థాయిని సమష్టి డిమాండును గురించి పరిశీలిస్తుంది. అలాగే వైయుక్తిక వస్తువుల ధరలను కాక సాధారణ ధరల స్థాయిని నిర్ణయించే అంశాలను స్థూల అర్థశాస్త్రం విశ్లేషణ చేస్తుంది. నిరుద్యోగిత, ఆర్థికాభివృద్ధి, ఆర్థిక స్థిరత్వం, వ్యాపార చక్రాలు, ద్రవ్యోల్బణం, ప్రతిద్రవ్యోల్బణము మొదలగువాటిని గురించి స్థూల అర్థశాస్త్రము విశ్లేషణ చేస్తుంది. స్థూల అర్థశాస్త్రము ఆర్థిక వ్యవస్థలోని ఆదాయ ఉద్యోగితా స్థాయిలను నిర్ణయించే అంశాలపై దృష్టిని కేంద్రీకరించడం వలన ఈ శాస్త్రాన్ని **"ఆదాయ ఉద్యోగితా సిద్ధాంతము"** అని కూడా అంటారు. స్థూల అర్థశాస్త్రము పరిశీలించే విషయాలను ఈ క్రింది విధముగా చెప్పవచ్చును.

1) స్వల్పకాలంలో ఉత్పత్తి, ఉద్యోగితా స్థాయిలను నిర్ణయించు అంశాలను పరిశీలించడం.

2) స్వల్పకాలంలో వ్యాపార చక్రాలు ఏర్పడటానికి గల కారణాలను విశ్లేషణ చేయడం.

3) దీర్ఘకాలంలో ఆర్థికాభివృద్ధిని ప్రోత్సహించే అంశాలను విశ్లేషణ చేయటం.

**స్థూల అర్థశాస్త్ర ప్రాముఖ్యత :**

1) స్థూల ఆర్థిక విశ్లేషణ సహాయంతో ఆర్థిక వ్యవస్థ పనిచేసే తీరుతెన్నులను తెలుసుకొనవచ్చు.

2) ఉద్యోగితా స్థాయి, ఉత్పత్తి స్థాయి, ధరల స్థాయికి సంబంధించిన సిద్ధాంతాలను రూపొందించటానికి స్థూల ఆర్థిక విశ్లేషణ తోడ్పడుతుంది.

3) ఆర్థిక వ్యవస్థ పురోగతిని తెలుసుకోవడానికి ఈ విశ్లేషణ ఉపయోగపడుతుంది.

4) అంతర్జాతీయ ఆర్థిక సమస్యలకు నివారణోపాయాలు తెలుసుకోవడానికి ఈ విశ్లేషణ తోడ్పడుతుంది.

5) స్థూల ఆర్థిక విశ్లేషణ అన్ని రకాల ఆర్థిక వ్యవస్థలకు (పెట్టుబడిదారీ ఆర్థిక వ్యవస్థ, సామ్యవాద ఆర్థిక వ్యవస్థ, మిశ్రమ ఆర్థిక వ్యవస్థ మొదలగువాటికి) ఉపయోగపడుతుంది.

స్థూల అర్థశాస్త్ర విషయ వస్తువును ఈ క్రింది చార్టులో చూపినాము.




**ప్రశ్న4) సూక్ష్మ, స్థూల అర్థశాస్త్రములను నిర్వచించి, వాటి మధ్యగల తేడాలను వివరింపుము.**

**జవాబు :** అర్థశాస్త్ర విషయ వస్తువును ముఖ్యముగా రెండు విధములుగా విభజించవచ్చును. అవి : 1) సూక్ష్మ అర్థశాస్త్రము, 2) స్థూల అర్థశాస్త్రము. ఈ రెండు పదములను మొట్టమొదటిసారిగా 1933 సం॥లో ప్రొఫెసర్ 'రగ్నార్ ఫ్రిచ్' అను ఆర్థిక శాస్త్రవేత్త ఉపయోగించెను. సూక్ష్మ అర్థశాస్త్రమందు ధరల విధానము ప్రముఖ పాత్ర వహించగా స్థూల అర్థశాస్త్రమందు జాతీయాదాయము, సాధారణ ధరల స్థాయి, ఉద్యోగిత స్థాయి మొదలగువాటి ప్రాముఖ్యము ఎక్కువగా ఉండును.

**సూక్ష్మ అర్థశాస్త్రము :** సూక్ష్మ అను పదము "మైక్రోస్" అను గ్రీకు పదము నుండి వచ్చినది. మైక్రోస్ అనగా సూక్ష్మమైనది. 'బౌల్డింగ్' అను ఆర్థిక శాస్త్రవేత్త అంచనా ప్రకారము సూక్ష్మ అర్థశాస్త్రము వైయుక్తిక సంస్థ వేతనము, ఆదాయము. వైయుక్తిక పరిశ్రమ మరియు వైయుక్తిక వస్తుసేవల ధరల గురించి తెలియజేయును కనుక సూక్ష్మ అర్థశాస్త్రము వైయుక్తిక యూనిట్లు గురించి తెలియ జేయును. అందువలన సూక్ష్మ అర్థశాస్త్రం మొత్తం అడవిని గురించి గాక కేవలము చెట్లను గురించి మాత్రమే తెలియజేయును అని చెప్పవచ్చును. సూక్ష్మ అర్థశాస్త్రమందు ధరల నిర్ణయానికి ఎక్కువ ప్రాముఖ్యము యివ్వబడును. సూక్ష్మ అర్థశాస్త్రం ప్రకారము ధరలు, సప్లయి మరియు, డిమాండ్‌ల మధ్య సమతౌల్యమును తెచ్చును. కనుక సూక్ష్మ అర్థశాస్త్రమును "ధరల సిద్ధాంతము" అని అందురు. ఈ శాస్త్రములో వస్తువుల ధరలు మరియు ఉత్పత్తి కారకాల ధరలు ఏ విధంగా నిర్ణయించబడునో వివరించబడును. 'మార్షల్' వ్రాసిన సూక్ష్మ అర్థశాస్త్రమును గురించి ముఖ్యముగా వివరించును.

**స్థూల అర్థశాస్త్రము :** స్థూల అను పదము "మాక్రోస్" (Macros) అను గ్రీకు పదమునుండి వచ్చినది. మాక్రోస్ అనగా స్థూలమైనది. కనుక స్థూల అర్థశాస్త్రము మొత్తము విషయములగు జాతీయాదాయము, మొత్తం ఉద్యోగిత స్థాయి, జాతీయోత్పత్తి. మొత్తం పెట్టుబడి, మొత్తం వినియోగము, మొత్తం పొదుపు, సాధారణ ధరల స్థాయి మొదలగు విషయములను గురించి పరిశీలించును. స్థూల అర్థశాస్త్రము మొత్తం ఆర్థిక వ్యవస్థను గురించి పరిశీలించును. 'బౌల్డింగ్' అను శాస్త్రవేత్త అంచనా ప్రకారం స్థూల అర్థశాస్త్రము వ్యక్తిగత ఆదాయము గురించి కాక, మొత్తం ధరల స్థాయి గురించి, జాతీయాదాయము గురించి, వైయుక్తిక ధరల గురించి కాక, వైయుక్తిక ఉత్పత్తి గురించి కాక, జాతీయోత్పత్తిని గురించి పరిశీలించును. కనుక స్థూల అర్థశాస్త్రము మొత్తం ఆర్థిక వ్యవస్థ యొక్క తీరుతెన్నులను గురించి పరిశీలించును.

స్థూల అర్థశాస్త్రమును "ఆదాయ సిద్ధాంతము" లేదా "ఆదాయ ఉద్యోగితా సిద్ధాంతము" అని అందురు. యిందు ఆదాయ ఉద్యోగితా స్థాయి నిర్ణయానికి ఎక్కువ ప్రాముఖ్యత ఇవ్వబడును. కీన్స్ వ్రాసిన స్థూల అర్థశాస్త్రమునకు ఎక్కువ ప్రాముఖ్యత నిచ్చెను.

**సూక్ష్మ, స్థూల అర్థశాస్త్ర భేదములు :**

| సూక్ష్మ అర్థశాస్త్రము | స్థూల అర్థశాస్త్రము |
|---|---|
| 1) వైయుక్తిక యూనిట్లను గురించి పరిశీలిస్తుంది. | 1) ఆర్థిక వ్యవస్థ మొత్తాన్ని ఒక యూనిట్‌గా పరిశీలిస్తుంది. |
| 2) ఒక వస్తువు యొక్క ధరను గూర్చి విశ్లేషణ చేస్తుంది. | 2) సాధారణ ధరల స్థాయిని గురించి పరిశీలిస్తుంది. |
| 3) సూక్ష్మ అర్థశాస్త్రము వస్తువులు ఉత్పత్తి కారకాల ధర నిర్ణయానికి ప్రాముఖ్యత ఇస్తుంది. | 3) స్థూల అర్థశాస్త్రము ఆదాయ ఉద్యోగితా స్థాయిలను నిర్ణయించు అంశాలకు ప్రాముఖ్యత ఇస్తుంది. |

| సూక్ష్మ అర్థశాస్త్రము | స్థూల అర్థశాస్త్రము |
|---|---|
| 4) సూక్ష్మ అర్థశాస్త్రాన్ని 'ధరల సిద్ధాంతం' అని అంటారు. | 4) స్థూల అర్థశాస్త్రాన్ని "ఆదాయ ఉద్యోగితా సిద్ధాంత" మంటారు. |
| 5) ఒక వ్యక్తి ఖర్చును తగ్గించి పొదుపును పెంచడం మంచిదని ఈ విశ్లేషణ తెలుపుతుంది. | 5) స్థూల విశ్లేషణలో ఖర్చును తగ్గించినచో పొదుపు పెరగటానికి బదులుగా తరుగుతుంది. ఇది సమాజ శ్రేయస్సుకు మంచిదికాదు. |
| 6) ఒక వ్యక్తి ఆదాయమును గురించి పరిశీలించును. | 6) జాతీయ ఆదాయమును గురించి పరిశీలించును. |
| 7) ఒక సంస్థలో వేతనాల తగ్గింపు ఆ సంస్థలో ఉద్యోగితా స్థాయి పెంచును. | 7) సార్వత్రిక వేతనాల స్థాయిని తగ్గిస్తే సమష్టి సప్లయి తగ్గి నిరుద్యోగిత పెరుగును. కావున స్థూల విశ్లేషణలో నిజము కాకపోవచ్చును. దీనిని "స్థూల అర్థశాస్త్ర వైపరీత్యం" అంటారు. |

**ప్రశ్న 5) చక్రరూప ఆదాయ ప్రవాహము వివరింపుము.**

**లేదా**

**ఆర్థిక కార్యకలాపాల చక్రరూప ప్రవాహమును తెల్పుము.**

**జవాబు :** ఆదాయము ఒక ప్రవాహము వంటిది. ఈ ప్రవాహము చక్రము వలె ఉంటుంది. స్వేచ్ఛా వ్యాపార ఆర్థిక వ్యవస్థలో వ్యాపార సంస్థలు లాభ దృష్టితో వస్తువులను ఉత్పత్తి చేస్తాయి. ఈ వ్యాపార సంస్థలు ఉత్పత్తికి కావలసిన ఉత్పత్తి కారకాలైన భూమిని, శ్రమను, మూలధనాన్ని కుటుంబాల నుండి కొని ఉత్పత్తి కారకాల యజమానులకు ప్రతిఫలంగా భాటకము, వేతనము, వడ్డీలను చెల్లిస్తాయి. ఈ విధముగా కుటుంబాలు ఉత్పత్తి కారకాలను అమ్ముకొని ఆదాయాన్ని సంపాదించుకొంటాయి. ఈ ఆదాయాన్ని తిరిగి వస్తు సేవలపై వ్యయము చేస్తాయి. ఇట్లు కుటుంబాలు చేసిన వ్యయము వ్యాపార సంస్థలకు ప్రవహించును. ఈ విధముగా ఆదాయము చక్రము మాదిరిగా వ్యాపార సంస్థల నుంచి కుటుంబాలకు, కుటుంబాల నుంచి మరల వ్యాపార సంస్థలకు ప్రవహిస్తుంది. అందుచే దీనిని "చక్ర రూప ఆదాయ ప్రవాహము" అన్నారు. ఈ చక్ర రూప ఆదాయ ప్రవాహ స్వరూపాన్ని క్రింది పటములో చూపినాము.




వ్యాపారరంగము కుటుంబ రంగము నుంచి ఉత్పత్తి కారకాలను భూమి, శ్రమ, మూలధనము మరియు వ్యవస్థాపనలను ఉపయోగించుకొని తద్వారా వస్తూత్పత్తి చేసి కుటుంబ రంగమునకు సమకూర్చును. వ్యాపార రంగము కుటుంబ రంగము నుంచి ఉత్పత్తి కారకములను ఉపయోగించుకొన్నందు వలన వాటికి ప్రతిఫలంగా భాటకము, వేతనాలు, వడ్డీ మరియు లాభములను సమకూర్చును. కుటుంబ రంగము తమకు వచ్చే ఆదాయమును తిరిగి వ్యాపార రంగము ద్వారా ఉత్పత్తి అయిన వస్తువులపై వ్యయము చేయును. ఈ విధంగా ఆదాయ ప్రవాహము చక్ర రూపంలో ఉండును.

# SHORT QUESTIONS

**ప్రశ్న 1) స్థూల అర్థశాస్త్ర వైపరీత్యము పేర్కొనుము.**

జవాబు : సూక్ష్మ అర్థశాస్త్ర దృష్ట్యా కొన్ని భావనలు నిజమైనవిగా ఉంటాయి. ఒక్కొక్క యూనిట్‌ను దృష్టిలో పెట్టుకొని పరిశీలిస్తే అవి వాస్తవికమైనవిగా ఉంటాయి. కాని ఆర్థిక వ్యవస్థ మొత్తాన్ని దృష్టిలో పెట్టుకొని చూస్తే అవి నిజంగా ఉండవు. అంటే స్థూల అర్థశాస్త్ర దృష్టిలో అవి నిజము కావు. వీటినే "స్థూల అర్థశాస్త్ర వైపరీత్యాలు" అంటారు. ఉదా॥ ఒక సంస్థ వేతనాలను తగ్గిస్తే ఉత్పత్తి వ్యయం తగ్గి, ధరలు తగ్గి ఫలితంగా డిమాండు ఉత్పత్తి పెరిగి ఉద్యోగిత పెరుగుతుంది. కానీ సార్వత్రిక వేతనం రేటును తగ్గిస్తే శ్రామికుల ఆదాయాలు తగ్గి, డిమాండు తగ్గుతుంది. ఫలితంగా ఉత్పత్తి తగ్గి, నిరుద్యోగిత ఏర్పడుతుంది. సూక్ష్మ విశ్లేషణలో నిజమైనది స్థూల విశ్లేషణలో నిజం కాకపోవచ్చు. దీనినే "స్థూల అర్థశాస్త్ర వైపరీత్యము" అంటారు.

**ప్రశ్న 2) సూక్ష్మ అర్థశాస్త్రము.**

జవాబు :ఈ అధ్యాయంలోని 2వ ప్రశ్న జవాబు క్లుప్తంగా వ్రాయండి.

**ప్రశ్న 3) స్థూల అర్థశాస్త్రము.**

జవాబు :ఈ అధ్యాయంలోని 3వ ప్రశ్న జవాబు క్లుప్తంగా వ్రాయండి.



అధ్యాయము 2

# డిమాండు సిద్ధాంతము - డిమాండు వ్యాకోచత్వం

**ప్రశ్న 1) 'డిమాండు' అంటే ఏమిటి ? డిమాండు నిర్ధాయకాలు ఏవి ?**

**లేదా**

**డిమాండును నిర్ణయించు అంశాలేమిటి ?**

**లేదా**

**ఒక వస్తువుయొక్క డిమాండ్‌ని ప్రభావితం చేసే వివిధ కారకాలు ఏవి?**

**(Important)**

జవాబు : **డిమాండు :** ఆర్థిక వ్యవస్థలో డిమాండుకి అత్యంత ప్రాధాన్యత వుంది. డిమాండ్‌ని బట్టే యావత్తు వస్తుసేవల ఉత్పత్తి జరుగు తుంది. ఈ వస్తుసేవలు కోర్కెలను తీర్చుకోవటానికి ఉపయోగపడతాయి. కోర్కెలు ఎప్పుడూ పెరుగుతూనే ఉంటాయి. అయితే ఇవి పెరిగినంతగా వస్తుసేవల ఉత్పత్తి పెరగడం సాధ్యం కాదు. అందువల్ల వస్తుసేవలకు కొరత ఉంటుంది. కాబట్టి వాటికి 'ధర' చెల్లించి పొందవలసి వస్తుంది. దీన్ని బట్టి డిమాండు కేవలం కోర్కెల మీద కాక కొనుగోలు శక్తి మీద కూడా ఆధారపడి ఉంటుందని తెలుసుకోవాలి. కనుక కొనుగోలు శక్తి నుండి ఒక వస్తువుని పొందాలన్న కోరికనే డిమాండు **(Demand means desire backed by willingness and ability to Pay)** అనాలి. డిమాండు ఎల్లప్పుడు ఒక ధరకు, సమయానికి సంబంధంతో ఉంటుంది. ఒక నిర్ణీత కాలంలో ఒక ధర వద్ద ఒక వస్తువు ఎంత పరిమాణంలో కొనబడుతుందో ఆ పరిమాణాన్ని "ఆ వస్తువు యొక్క డిమాండు' అంటారు. ఉదాహరణకు, ఒక వ్యక్తి మామిడిపండు ధర ఒక రూపాయి అయితే రోజుకు నాలుగు పండ్లను కొనడానికి ఇష్టపడతాడు. దీన్నే "మామిడిపండు యొక్క డిమాండు" అంటారు.

**డిమాండును నిర్ణయించు అంశాలు :** ఒక వస్తువుకు డిమాండు ఎల్లవేళలా ఒకే రీతిగా ఉండదు. పరిస్థితులను బట్టి, కాలాన్ని బట్టి ఆ వస్తువులకుండే డిమాండు మారుతూ ఉంటుంది. ఒకానొక సమయంలో ఒక వస్తువుకుండే డిమాండు కొన్ని అంశాలపై ఆధారపడుతుంది. ఈ అంశాలనే "డిమాండు ప్రేరణలనీ", "నిర్ధాయకాలనీ' (determinants of demand) అంటారు. అవి :

**1) వస్తువు యొక్క ధర :** ఒక వస్తువు యొక్క డిమాండు ముఖ్యంగా ఆ వస్తువు యొక్క ధర మీద ఆధారపడుతుంది. వస్తువు ధర ఎక్కువగా ఉంటే డిమాండు తక్కువగాను, ధర తక్కువగా ఉంటే డిమాండు ఎక్కువగాను ఉంటుంది. అయితే జీవితావసర వస్తువులైన గోధుమ, బియ్యం, మందులు మొదలగువాటికి ధరతో సంబంధం లేకుండానే డిమాండు ఉంటుంది. మిగిలిన వస్తువుల విషయంలో డిమాండుపై ధర ప్రభావం ఉంటుంది.

**2) వినియోగదారుల ఆదాయం :** ప్రతి వస్తువు యొక్క డిమాండు ఆ వస్తువు యొక్క వినియోగదారుల ఆదాయాలమీద ఆధారపడి ఉంటుంది. వినియోగదార్ల ఆదాయాలు ఎక్కువగా ఉంటే వస్తువులకు డిమాండు ఎక్కువగాను, ఆదాయాలు తక్కువగా ఉంటే డిమాండు తక్కువగాను ఉంటుంది. క్లుప్తంగా వినియోగదారుల ఆదాయము మారినప్పుడు డిమాండు మారుతుంది. ఇందుకు కారణం ఆదాయాలు పెరిగినప్పుడు కొనుగోలు శక్తి (Purchasing Power) పెరగడం, ఆదాయాలు తగ్గినప్పుడు కొనుగోలు శక్తి తగ్గడమే.

**3) వినియోగదార్ల అభిరుచులు :** ఒక వస్తువు యొక్క డిమాండు ఆ వస్తువుని వినియోగించేవారి అభిరుచిని బట్టి ఉంటుంది. అభిరుచులలో మార్పుల వల్ల డిమాండులో మార్పులు వస్తాయి. వస్తువు వినియోగదార్ల అభిరుచులకు అనుగుణంగా ఉంటే డిమాండు ఎక్కువగాను, లేకపోతే డిమాండు తక్కువగాను ఉంటుంది.

**4) ప్రత్యామ్నాయ వస్తువుల ధరలు :** ఒక వస్తువు యొక్క డిమాండు అదే ప్రయోజనాన్ని ఇవ్వగల ఇతర ప్రత్యామ్నాయ వస్తువుల ధరలను బట్టి ఉంటుంది. ప్రత్యామ్నాయ వస్తువుల ధరలు ఎక్కువగా ఉంటే వస్తువు డిమాండు ఎక్కువగాను, ప్రత్యామ్నాయ వస్తువుల ధరలు తక్కువగా ఉంటే వస్తువు డిమాండు తక్కువగాను ఉంటుంది.

**5) జనాభా :** జనాభాలో మార్పులు డిమాండులో మార్పులను తెస్తాయి. జనాభా పెరిగి వినియోగదారులు ఎక్కువగా ఉంటే వస్తువులకు డిమాండు ఎక్కువ గాను, జనాభా తగ్గి వినియోగదారులు తక్కువగా ఉంటే వస్తువుల డిమాండు తక్కువగాను ఉంటుంది. అంతేకాక జనాభా యొక్క లైంగిక నిష్పత్తిలో మార్పులు కూడా డిమాండుపై ప్రభావాన్ని కలిగి ఉంటాయి. జనాభాలో స్త్రీల సంఖ్య పెరిగితే స్త్రీలు ఉపయోగించే కాటుకలు, జడపిన్నులు, గాజులు, చీరెలు మొదలగువాటికి డిమాండు పెరుగుతుంది. అదేవిధంగా జనాభా యొక్క వయో విభాజనంలోని మార్పులు కూడా డిమాండులో మార్పులను తెస్తాయి. జనాభాలో వృద్ధుల సంఖ్య పెరిగితే చేతి కర్రలు, కళ్ళజోళ్ళు మొదలగువాటికి, పిల్లల సంఖ్య పెరిగితే పాలడబ్బాలు, ఆటబొమ్మలు మొదలగువాటికి డిమాండు పెరుగుతుంది.

**6) శీతోష్ణస్థితిలో మార్పులు :** డిమాండుపై శీతోష్ణస్థితి ప్రభావం ఉంటుంది. శీతోష్ణస్థితి మారినప్పుడల్లా వస్తువుల డిమాండులో కూడా మార్పులు వస్తాయి. చలికాలం పోయి ఎండాకాలం రాగానే ఉన్ని దుస్తులు, స్వెట్టర్లు మొదలగువాటికి డిమాండు తగ్గి, చల్లని పానీయాలు, చెప్పులు మొదలగువాటికి డిమాండు పెరుగుతుంది.

**7) ఆదాయ విభజనలో మార్పులు :** జాతీయ ఆదాయ విభజనలో గల వ్యత్యాసాలు తగ్గితే కొన్ని వస్తువులకు డిమాండు పెరుగుతుంది వ్యత్యాసాలు ఎక్కువైతే ఆ వస్తువుల డిమాండు తగ్గుతుంది.

**8) వినియోగదారుల కొనుగోలు ఆసక్తిలో మార్పులు :** వినియోగదారులు పొదుపును తగ్గించుకొని కొనుగోలు ఆసక్తిని పెంచుకుంటే చాలా వస్తువులకు గల డిమాండు పెరుగుతుంది. అలాకాక వినియోగదారులు పొదుపును ఎక్కువ చేస్తే వస్తువుల డిమాండు తగ్గుతుంది.

**9) ద్రవ్య పరిమాణంలో మార్పులు :** చలామణిలో ఉన్న ద్రవ్య పరిమాణం పెరిగితే ప్రజల ఆదాయాలు పెరిగి వస్తువులకు డిమాండు పెరుగుతుంది. ద్రవ్య పరిమాణం తగ్గితే వస్తువుల డిమాండు తగ్గుతుంది.

**10) సాంకేతికాభివృద్ధి :** సాంకేతిక విజ్ఞానం బాగా అభివృద్ధి చెందితే వస్తువుల ధరలు తగ్గుతాయి. అప్పుడు వస్తువులకు డిమాండు పెరుగుతుంది. అంతేకాక సాంకేతికాభివృద్ధి వలన కొత్త కొత్త వస్తువులు ఉత్పత్తి చేయబడతాయి. కొత్త వస్తువులకు డిమాండు పెరుగుతూ పాత వస్తువులకు డిమాండు తగ్గుతుంది. ఉదాహరణకు, టెర్లిన్ బట్టలకు డిమాండు పెరిగి కాటన్ బట్టలకు డిమాండు తగ్గింది. అదేవిధంగా బాల్ పెన్ను (ball pens) లకు డిమాండు పెరిగి మామూలు పెన్నులకు డిమాండు తగ్గింది.

పైన పేర్కొన్న అంశాలలో మార్పు వచ్చినచో డిమాండులో మార్పు వస్తుంది. ఈ కారణాల వలన డిమాండులో వచ్చే మార్పులను ఈ క్రింది రేఖా పటములో చూపినాము.



డిమాండు పరిమాణంలో మార్పులను "డిమాండు రేఖపై కదలిక" అంటారు. డిమాండులో మార్పులను "డిమాండు రేఖ కదలిక" అంటారు. డిమాండులో మార్పులు వచ్చినప్పుడు నూతన డిమాండు రేఖలు గీయవలెను. ధర స్థిరముగా యున్నప్పటికి, ఇతర కారణాల వలన డిమాండులో వచ్చే పెరుగుదలను $D_1D_1$ రేఖ తెలియ చేస్తుంది. డిమాండులోని తగ్గుదలను $D_2$ $D_2$ రేఖ తెలియ చేస్తుంది. ఇతర కారణాలలోని మార్పుల వల్ల డిమాండు పెరిగితే డిమాండు రేఖపైకి జరుగుతుంది. డిమాండు తగ్గితే డిమాండు రేఖ క్రిందకి జరుగుతుంది.

**ప్రశ్న 2) డిమాండు సూత్రమును వివరింపుము. ఆ సూత్రానికి గల మినహాయింపులు ఏవి ?**

**లేదా**

**డిమాండ్ సూత్రమును పేర్కొని, డిమాండు రేఖ ఎడమ నుండి కుడికి ఎందుకు వాలుతుందో వివరింపుము. ఈ సూత్రానికి ఏవైనా మినహాయింపులున్నాయా ?**

**లేదా**

**డిమాండ్ రేఖ నొకదానిని గీయుము. అది ఎలా క్రిందికి వాలి ఉంటుందో వివరింపుము. (Most Important)**

**జవాబు : డిమాండు :** అర్థశాస్త్రములో డిమాండు అనగా కేవలం ఒక వస్తువు కావలెననే కోరిక కాదు. కోరికతోపాటు వస్తువును కొనగలిగే శక్తి ఉండాలి. కొనుగోలు శక్తి ఉండి ఆ వస్తువును పొందాలనే కోరికను (Demand means a desire backed by willingness and ability to pay) "డిమాండ్" అంటారు. డిమాండు ఎప్పుడు ఒక ధరకు, సమయానికి సంబంధంతో ఉంటుంది.

ఒక నిర్ణీత సమయంలో ఒక ధర వద్ద ఒక వస్తువు ఎంత పరిమాణంలో కొనబడుతుందో ఆ పరిమాణాన్ని "ఆ వస్తువుయొక్క డిమాండు" అంటారు.

**డిమాండు పట్టిక (Demand Schedule)** : ఒక సమయంలో వివిధ ధరల వద్ద ఒక వస్తువు ఎంత పరిమాణంలో కొనబడుతుందో చూపించే పట్టికను 'డిమాండు పట్టిక' అంటారు. అంటే ధరకు, డిమాండుకు గల సంబంధాన్ని తెలిపే పట్టిక అన్నమాట. క్రింది పట్టిక ఒక మార్కెట్టులోని డిమాండును సూచిస్తుంది.

## డిమాండు పట్టిక

| డజను అరటి పండ్ల ధర | అరటి పండ్ల డిమాండు |
|---|---|
| రు. 5-00 | 10 |
| రు. 4-00 | 20 |
| రు. 3-00 | 30 |
| రు. 2-00 | 50 |

పై పట్టికలో ధర తగ్గిన కొద్దీ డిమాండు పెరుగుతున్నట్లు, ధర పెరిగినప్పుడు డిమాండు తగ్గినట్లు చూడవచ్చు.

**డిమాండు రేఖ (Demand curve) :** డిమాండు పట్టికలోని వివిధ ధరల వద్ద వస్తువుకున్న డిమాండును గ్రాఫ్ కాగితంపై గుర్తించి, ఆ బిందువులనన్నింటిని కలిపితే వచ్చే రేఖను 'డిమాండు రేఖ' అంటారు. ఈ రేఖ ఎల్లప్పుడు ఎడమ నుంచి కుడికి వాలుతూ ఉంటుంది. క్రింది పటంలో అరటిపండ్ల డిమాండు X – అక్షము మీదను, ధర Y – అక్షము మీదను చూపబడినాయి. D D డిమాండు రేఖ.




**డిమాండు సూత్రం :** ధరకు, డిమాండుకు ఉండే సంబంధాన్ని డిమాండు సూత్రం తెలియ చేస్తుంది. ***"ఇతర పరిస్థితులలో మార్పు లేనంతవరకు ఒక వస్తువు ధర తగ్గితే డిమాండు పెరుగుతుంది. ధర పెరిగితే డిమాండు తగ్గుతుంది"*** ఇదే డిమాండు సిద్ధాంతం. ఈ సిద్ధాంతమునే బెన్‌హామ్ (Benham) ఈ విధంగా చెప్పారు. "మామూలుగా *ధర ఎక్కువగా ఉన్నప్పటికంటే ధర తక్కువగా వున్నప్పుడు ఎక్కువ పరిమాణంలో వస్తువును డిమాండు చేస్తారు. (Usually a large quantity of a commodity will be demanded at a lower price that at a higher price).* ధరకు, డిమాండుకు విలోమ సంబంధమున్నదని డిమాండు సూత్రం తెలియచేస్తుంది.

**ప్రమేయాలు** : కాని డిమాండును నిర్ణయించేది ఒక్క ధరే కాదు ఎన్నో ఇతర అంశాలున్నాయి. అందుకే డిమాండు సూత్రం చెప్పేటప్పుడు "ఇతర పరిస్థితులలో మార్పు లేనంతవరకు" అని చెప్పడం జరిగింది. ఇతర పరిస్థితులు అంటే క్రింద చెప్పిన అంశాలు. వీటిలో మార్పు లేదనే ప్రమేయం మీదనే డిమాండు సూత్రం చెప్పబడింది

1) వినియోగదార్ల అదాయం.
2) వినియోగదార్ల అభిరుచులు, ఫాషన్లు.
3) ప్రత్యామ్నాయ వస్తువుల ధరలు.
4) జనాభా.

**డిమాండు రేఖ ఎడమ నుండి కుడికి వాలుటకు కారణము లేదా ధర తగ్గినపుడు డిమాండు పెరగటానికి గల కారణములు** : డిమాండు రేఖ ఎడమ నుండి కుడికి క్రిందికి వాలుతుంది. ఎందుకంటే, ధర తగ్గితే డిమాండు పెరుగుతుంది, ధర పెరిగితే డిమాండు తగ్గుతుంది. ధరకు, డిమాండుకు విలోమ సంబంధమున్నది. అందుకని డిమాండు రేఖ ఎడమ నుంచి కుడికి క్రిందికి వాలుతుంది. డిమాండు పట్టికలో అరటిపండ్ల ధర తగ్గినకొద్దీ ఎక్కువ పండ్లను, ధర పెరిగినకొద్ది తక్కువ పండ్లను కొనడం చూడవచ్చు. ఇలా ధర తగ్గినపుడు డిమాండు పెరగడానికి కొన్ని కారణాలున్నాయి. అవి

**1) క్షీణోపాంత ప్రయోజనము** : ఒక వస్తువు యొక్క పరిమాణము క్రమముగా పెరుగుచున్న యెడల తద్వారా పొందే ఉపాంత ప్రయోజనము తగ్గుచుండును. అందువలన వస్తు పరిమాణము పెరిగిన ధర తగ్గును. ధర తగ్గినచో వినియోగదారుడు పొందే ఉపాంత ప్రయోజనము పెరుగును. అందువలన వినియోగ్దారుడు అదనపు వస్తు యూనిట్లను కొనుటకు సిద్ధపడును.

**2) కొత్త వినియోగదార్లు** : వస్తువు ధర హెచ్చుగా ఉన్నప్పుడు కొంతమంది వినియోగదారులకు కొనగల స్థోమత లేకపోవచ్చు. ధర తగ్గినప్పుడు వారికి కొనగల స్థోమత ఉంటుంది. అప్పుడు వారా వస్తువును కొంటారు. దీనివల్ల ధర తగ్గినప్పుడు వస్తువుకు డిమాండు పెరుగుతుంది.

**3) పాత వినియోగదార్లు** : ధర హెచ్చుగా వచ్చినప్పుడు కొంతమంది వినియోగదార్లు వస్తువును తక్కువ పరిమాణాలలో కొంటూ ఉండవచ్చు. ధర తగ్గినప్పుడు వారు వస్తువును ఎక్కువ పరిమాణంలో కొంటారు. ఈ కారణంగా ధర తగ్గినప్పుడు వస్తువు డిమాండు పెరుగుతుంది.

**4) ప్రత్యామ్నాయ ప్రభావం** : వస్తువుకు ప్రత్యామ్నాయ వస్తువులుండవచ్చు. ఉదాహరణకు, టీ, కాఫీకి ప్రత్యామ్నాయ వస్తువు. ఒక వస్తువు ధర తగ్గినప్పుడు అది దాని ప్రత్యామ్నాయ వస్తువుల కన్న చౌకగా ఉంటుంది. అందువల్ల ప్రత్యామ్నాయ వస్తువులను కొంటున్నవారు కూడా ఈ వస్తువునే కొంటారు. దీనినే 'ప్రత్యామ్నాయ ప్రభావం' అంటారు. ఈ ప్రభావం వల్ల కూడా ధరలో మార్పుకు డిమాండులో మార్పు వస్తుంది.

5) **వస్తువులకున్న అనేక ఉపయోగములు** : కొన్ని వస్తువులకు అనేక ఉపయోగములు ఉంటాయి. ఉదాహరణకు గోధుమను ఆహార వస్తువుగాను, పశుగ్రాసముగాను, సారాయి తయారు చేయుటకు మొదలగు ఉపయోగాలకు వాడెదరు. అందుచేత డిమాండు పెరుగుతుంది.

**డిమాండు సూత్రానికి గల మినహాయింపులు** : డిమాండు సూత్రానికి కొన్ని మినహాయింపులు లేక పరిమితులు ఉన్నాయి. అవి :

1) **గౌరవసూచక వస్తువులు** : కొన్ని వస్తువులను ధనవంతులు మాత్రమే కొనగలిగేటంతటి హెచ్చు ధరలు ఉంటాయి. వాటిని ధనవంతులు ప్రతిష్ట కోసము, గౌరవము కోసం కొంటారు. వాటి ధర తగ్గితే వాటి వల్ల కలిగే ప్రతిష్ట తగ్గుతుంది. కనుక వాటి డిమాండు తగ్గుతుంది. ఉదాహరణకు, ఖరీదైన వజ్రములను ప్రతిష్ట కోసము ధనవంతులు కొంటారు. వాటి ధర తగ్గితే ప్రతిష్ట తగ్గుతుంది. కనుక ధనవంతులు వాటిని కొనటము మానేస్తారు.

2) **అంచనా లేదా స్పెక్యులేషన్ వ్యాపారం** : ఒక వస్తువు ధర క్రమేపీ తగ్గుతూ ఉన్నప్పుడు వినియోగదారులు ముమ్ముందు ఇంకా ధర తగ్గగలదని అంచనా వేసి వారి డిమాండును వాయిదా వేస్తారు. ఇలాంటప్పుడు ధర తగ్గినప్పుడు డిమాండు పెరగకపోగా తగ్గవచ్చు కూడా. ఇదే విధముగా ధర పెరుగుతున్నప్పుడు బాగా ఎక్కువగా పెరుగుతుందని భావిస్తే మానవుడు హెచ్చుగా కొనటము జరగవచ్చు.

3) **గిఫెన్ వైపరీత్యము** : పేదవారు సహజంగా వారి ఆదాయములో అధిక భాగాన్ని ఆహార పదార్థాల మీదను, అత్యల్ప భాగాన్ని ఇతర వస్తువుల మీదను ఖర్చు చేస్తారు. అలాంటప్పుడు ఆహారపదార్థముల ధరలు పెరిగితే, ఇతర వస్తువులపై చేసే ఆ కొద్ది ఖర్చును కూడా మాని ఆహార పదార్థములనే హెచ్చుగా కొంటారు. అంటే అత్యవసర వస్తువులకు ధర పెరిగినా డిమాండు కూడా పెరుగుతుంది. ఈ విషయాన్ని "సర్ రాబర్ట్ గిఫెన్" అన్న అర్థికవేత్త సూచించడం వల్ల దీనిని "గిఫెన్ వైపరీత్యము" *(Giffen's Paradox)* అందురు.

4) **వినియోగదారుల అజ్ఞానము** : కొంతమంది ఉత్పత్తిదారులు అధిక లాభార్జన ఉద్దేశంతో తమ వస్తువును పేరు మార్పుతోను, ఆకర్షణీయమైన ప్యాకింగ్‌తోను, ఎక్కువ ధరకు మార్కెట్‌లో ప్రవేశపెడతారు.ఆ వస్తువు నూతన వస్తువు అని భావించి కొంత మంది వినియోగదారులు ధర హెచ్చుగా ఉన్నప్పటికీ ఎక్కువ పరిమాణములో కొనవచ్చును.

5) **ముందు జాగ్రత్త చర్య** : కొన్ని వస్తువులకు కొరత ఏర్పడుతుందనే అనుమానం కలిగినప్పుడు వాటి ధర పెరిగినప్పటికి కొంతమంది వినియోగదారులు ఎక్కువ పరిమాణంలో కొని నిల్వలు ఉంచుకోవచ్చు.

6) హెచ్చు ధర నాణ్యతకు చిహ్నమనే దురభిప్రాయం : వస్తువుకు ధర హెచ్చు ఉంటే వస్తువు ఎక్కువ నాణ్యత కలిగి ఉన్నదనే భావన అనేకమంది వినియోగదారులలో ఉంటుంది. అలాంటివారు హెచ్చు ధర వస్తువును ఎక్కువ పరిమాణంలోనే కొంటూ ఉంటారు. దీన్నే **Price delusion** అంటారు.

7) ద్రవ్యోల్బణము : ద్రవ్యోల్బణ పరిస్థితులలో ధరలు పెరుగుతూ ఉంటాయి.అందుచే ధర పెరగవచ్చుననే భయంతో ఎక్కువ ధరకు ఎక్కువ కొనవచ్చు. ఈ మినహాయింపులు డిమాండు సూత్రానికి కొంతమేరకే వర్తిస్తాయి. అంతేగాని ధర ఎంత పెరిగినప్పటికీ డిమాండు పెరుగుతూనే ఉంటుందనేది వాస్తవం కాదు.

**ప్రశ్న 3) "డిమాండు వ్యాకోచత్వం" అనగా ఏమి ? దాన్ని కొలుచు విధములను తెలియపర్చుము.**

**లేదా**

**డిమాండు వ్యాకోచత్వాన్ని నిర్వచించి, దాన్ని కొలిచే పద్ధతులను వివరింపుము.**

**లేదా**

**ధర డిమాండు వ్యాకోచత అనగానేమి ? దానిని కొలుచు పద్ధతులేవి ?**

**(Very Important)**

**జవాబు : డిమాండు వ్యాకోచం :** ధరలో వచ్చే మార్పులు డిమాండులో మార్పులను తెస్తుంటాయి. వస్తువు ధర తగ్గితే డిమాండు పెరుగుతుందని, ధర పెరిగితే డిమాండు తగ్గుతుందని డిమాండు సూత్రం చెప్తుంది. కాని ధరలో వచ్చే మార్పు వలన డిమాండులో వచ్చే మార్పు అన్ని వస్తువులకు ఒకేరీతిగా ఉండదు. వివిధ రకములుగా ఉంటుంది. కొన్ని వస్తువుల విషయంలో ధర బాగా పెరిగినా డిమాండు కొద్దిగానే తగ్గవచ్చు. మరికొన్ని వస్తువుల విషయంలో ధర స్వల్పంగా పెరిగినా డిమాండు హెచ్చుగా తగ్గవచ్చు. **ఉదాహరణకు,** ఉప్పు ధర బాగా పెరిగినా డిమాండు పెద్దగా తగ్గదు. అదేవిధంగా స్నోలు, లిప్‌స్టిక్‌లు మొదలైనవాటి ధర స్వల్పంగా పెరిగినా డిమాండు హెచ్చుగా తగ్గుతుంది. ***ఒక వస్తువు ధరలో కలిగిన మార్పు ఫలితంగా ఆ వస్తువు డిమాండు రేటులో కలిగే మార్పును "డిమాండు వ్యాకోచం" అంటారు.***

ధరను బట్టే కాకుండా వ్యక్తుల ఆదాయం, ప్రత్యామ్నాయ వస్తువుల ధరలను బట్టికూడా వస్తువుకు గల డిమాండులో మార్పులు కలుగుతుంటాయి. ధర మారినప్పుడు ఎంత సులభంగా డిమాండు పరిమాణం మారుతుందో డిమాండు వ్యాకోచత్వం చెబుతుంది. వస్తువు ధరలో వచ్చే మార్పులకనుగుణంగా వస్తువు డిమాండులో వచ్చే

మార్పును "ధర డిమాండు వ్యాకోచత్వం" (Price Elasticity of demand) అని, ఆదాయంలో కలిగే హెచ్చు తగ్గులను బట్టి డిమాండులో వచ్చే మార్పును "ఆదాయ డిమాండు వ్యాకోచము" (Income Elasticity of demand) అని, ప్రత్యామ్నాయ వస్తువుల ధరలలో కలుగు హెచ్చు తగ్గులను బట్టి డిమాండులో కలుగు మార్పులను "జాత్యంతర డిమాండు వ్యాకోచం" (Cross Elasticity of demand) అని అంటారు. ధరలో వచ్చే మార్పులకు డిమాండులో వచ్చే మార్పులకు మధ్య ఉన్న సంఖ్యాత్మక సంబంధాన్ని సూచించునది "ధర - డిమాండు వ్యాకోచత్వము". "ధర మారినప్పుడు డిమాండు ఎంత బాగా స్పందిస్తుంది అనేది డిమాండు వ్యాకోచం వల్ల తెలుస్తుందని" స్టోనియర్, హెగ్ అంటారు.

**వ్యాకోచత్వాన్ని కొలిచే పద్ధతులు** : డిమాండు వ్యాకోచత్వాన్ని కొలవడానికి నాలుగు పద్ధతులున్నాయి. అవి :

1) శాతం పద్ధతి (Percentage method)
2) మొత్తం ఖర్చు పద్ధతి (Total outlay method)
3) బిందు పద్ధతి (Point method)
4) ఆర్క్ పద్ధతి (Arc method)

**1) శాతం పద్ధతి (Percentage method)** : ఈ పద్ధతిలో డిమాండు వ్యాకోచత్వాన్ని కొలవడానికి ఈ క్రింది సూత్రాన్ని ఉపయోగించాలి.

$$\text{డిమాండు వ్యాకోచం} = \frac{\text{వస్తువు డిమాండులో వచ్చిన మార్పు శాతం}}{\text{వస్తువు ధరలో వచ్చిన మార్పు శాతం}}$$

ఈ పద్ధతిలో ధరలో వచ్చిన మార్పు శాతాన్ని డిమాండులో వచ్చిన మార్పు శాతాన్ని తెలుసుకొని, డిమాండులో వచ్చిన మార్పు శాతాన్ని ధరలో వచ్చిన మార్పు శాతంతో భాగిస్తే డిమాండు వ్యాకోచత్వం తెలుస్తుంది. ఇలా భాగించగా వచ్చిన ఫలం ఒకటి అయితే దాన్ని "ఏకత్వ వ్యాకోచ డిమాండు" (Unitary Elastic demand) అని. ఒకటి కన్నా ఎక్కువ అయితే "సాపేక్ష వ్యాకోచ డిమాండ్" (Relatively elastic demand) అని. ఒకటి కన్న తక్కువ అయితే "సాపేక్ష అవ్యాకోచ డిమాండు" (Relatively Inelastic demand) అని చెప్పాలి.

**ఉదాహరణలు :**

**i) ఏకత్వ వ్యాకోచ డిమాండు** : ఒక వస్తువు ధర రు. 6 నుండి రు. 3కు తగ్గినందున దాని డిమాండు 100 నుంచి 150కి పెరిగింది. ధరలో వచ్చిన తగ్గుదల శాతం $50\left(\frac{3}{6}\times 100\right)$ డిమాండులో వచ్చిన పెరుగుదల శాతం $50\left(\frac{50}{500}\times 100\right)$

$$\text{డిమాండు వ్యాకోచత్వం} = \frac{50}{50} = 1$$

**ii) సాపేక్ష వ్యాకోచ డిమాండు** : ఒక వస్తువు ధర రు. 5 నుండి రు. 3కు తగ్గినందున దాని డిమాండు 100 నుంచి 150కి పెరిగింది. అంటే ధరలో వచ్చిన తగ్గుదల 40 $\left(\frac{2}{5} \times 100\right)$ డిమాండులో వచ్చిన పెరుగుదల శాతం 50.

$$\text{డిమాండు వ్యాకోచత్వం} = \frac{50}{40} = 1.25$$

**iii) సాపేక్ష అవ్యాకోచ డిమాండు** : ఒక వస్తువు ధర రు. 5 నుండి రు.3కు తగ్గినందున దాని డిమాండు 100 నుండి 130 కి పెరిగింది. అంటే ధరలో వచ్చిన తగ్గుదల శాతం 40 $\left(\frac{2}{5} \times 100\right)$ డిమాండులో వచ్చిన పెరుగుదల శాతం 30 $\left(\frac{130}{100} \times 100\right)$

$$\text{డిమాండు వ్యాకోచత్వం} = \frac{30}{40} = 0.75$$

**2) మొత్తం ఖర్చు పద్ధతి (Total outlay method)** : ఒక వస్తువు ధర మారడం వల్ల డిమాండు మారి ఆ వస్తువు మీద పెట్టే మొత్తం ఖర్చు కూడా మారుతుంది. ఆ మొత్తం ఖర్చులో వచ్చే మార్పులను బట్టి డిమాండు వ్యాకోచత్వాన్ని క్రింది విధంగా కొలవవచ్చు :

i) వస్తువు ధర మారడం వల్ల డిమాండు మారినప్పటికీ మొత్తం ఖర్చులో మార్పు లేకపోయినట్లయితే వ్యాకోచత్వము ఒకటికి సమానము లేక ఏకత్వ వ్యాకోచము (=1) అవుతుంది.

ii) వస్తువు ధర తగ్గడం వల్ల డిమాండు పెరిగి మొత్తం ఖర్చు పెరగడం లేక వస్తువు ధర పెరిగినప్పుడు డిమాండు తగ్గి మొత్తం ఖర్చు తగ్గినట్లయితే వ్యాకోచత్వం ఒకటి కంటే ఎక్కువ లేక సాపేక్ష వ్యాకోచము (> 1) అవుతుంది.

iii) వస్తువు ధర తగ్గడం వల్ల డిమాండు పెరిగినప్పటికి మొత్తం ఖర్చు తగ్గడము లేక వస్తువు ధర పెరగడం వల్ల డిమాండు తగ్గి మొత్తం ఖర్చు పెరిగినట్లయితే వ్యాకోచత్వం ఒకటి కంటే తక్కువ లేక సాపేక్ష అవ్యాకోచం (<1) అవుతుంది.

**ఉదాహరణ :**

పట్టిక

| వస్తువు ధర | డిమాండు | మొత్తం ఖర్చు |
|---|---|---|
| రు. 1-50 | 300 | రూ. 450 సా.వ్యా. |
| రు. 1-25 | 400 | రూ. 500 |
| రు. 1-00 | 500 | రూ. 500 ఏ. వ్యా. |
| రు. 0-75 | 600 | రూ. 450 సా.అ.వ్యా. |

దీనిని ఈ క్రింది రేఖా పటము ద్వారా చూపించవచ్చు.




పై పటంలో X అక్షముపై మొత్తం ఖర్చును, Y అక్షంపై ధరను చూపినాము. ABCD మొత్తం ఖర్చు రేఖ. రేఖలో ABల మధ్య వ్యాకోచపు విలువ ఒకటి కన్నా ఎక్కువగా ఉంటుంది. BC ల మధ్య వ్యాకోచపు విలువ ఒకటికి సమానంగా ఉంటుంది. CDల మధ్య వ్యాకోచపు విలువ ఒకటికి తక్కువగా ఉంటుంది.

**3) బిందు వ్యాకోచ పద్ధతి (Point Elasticity method) :** దీన్నే 'రేఖాగణిత పద్ధతి' అనికూడా అంటారు. ఇది సరియైన గణితశాస్త్ర పద్ధతికూడా. ఈ పద్ధతిద్వారా డిమాండు వ్యాకోచత్వాన్ని నిర్దిష్టంగా కొలవవచ్చు.

$$\text{డిమాండు వ్యాకోచత్వము} = \frac{\text{వస్తువు డిమాండులో వచ్చిన అనుపాతమార్పు}}{\text{వస్తువు ధరలో వచ్చిన అనుపాత మార్పు}}$$

రేఖాపటంలో డిమాండు రేఖ X- అక్షాన్ని B వద్ద, Y- అక్షాన్ని A వద్ద తాకేటట్లు పొడిగించబడింది. PM ధర వద్ద వస్తువుకు CM డిమాండు వున్నది.

ఇప్పుడు వస్తువు ధర PM నుంచి $PM_1$ కు తగ్గటంవలన డిమాండు OM నుంచి $OM_1$ కు పెరిగింది.

$$\text{డిమాండు వ్యాకోచత్వం } n = \frac{\text{డిమాండులో వచ్చిన అనుపాత మార్పు}}{\text{ధరలో వచ్చిన అనుపాత మార్పు}}$$




$$= \frac{\Delta Q}{Q} \frac{P}{\Delta P} = \frac{\Delta Q}{\Delta P} \frac{P}{Q}$$

$$= \frac{MM_1}{PQ} \frac{PM}{OM} = \frac{P_1Q}{PQ} \frac{PM}{OM}$$

పటంలో PQP, PMB లు స్వరూప త్రిభుజములు. అందువల్ల భుజాల నిష్పత్తి సమానంగా ఉంటుంది.

$$\frac{P_1Q}{PQ} = \frac{MB}{PM}$$

$$n = \frac{MB}{PM} \frac{PM}{OM} = \frac{MB}{OM} = \frac{MB}{RP}$$

తిరిగి PMB, ARP లు స్వరూప త్రిభుజము.

$$\therefore \frac{MB}{RP} = \frac{PB}{PA}$$

కాబట్టి డిమాండు వ్యాకోచత్వం $n = \frac{PB}{PA}$

డిమాండు రేఖ వక్రరేఖ అయితే 1 బిందువువద్ద పటములో చూపినట్లు స్పర్శరేఖ గీచి $\frac{PB}{PA}$ ద్వారా వ్యాకోచత్వమును కొలవవలెను.




**4) ఆర్క్ పద్ధతి (Arc method)**: ఈ పద్ధతి ద్వారా డిమాండు వ్యాకోచత్వాన్ని కొలవడానికి ఈ క్రింది సూత్రాన్ని ఉపయోగించాలి.

$$\text{డి. వ్యా.} = \frac{\text{వస్తువు డిమాండులో వచ్చిన మార్పు}}{\text{పూర్వపు డిమాండు + ప్రస్తుత డిమాండు}} \div \frac{\text{ధరలో వచ్చిన మార్పు}}{\text{పూర్వపు ధర + ప్రస్తుత ధర}}$$

ఈ సూత్రంద్వారా వచ్చిన ఫలితం ఒకటికి సమానం అయితే వ్యాకోచత్వం ఏకత్వ వ్యాకోచమని, ఒకటి కంటే ఎక్కువ అయితే సాపేక్ష వ్యాకోచమని, ఒకటికన్న తక్కువ అయితే సాపేక్ష అవ్యాకోచమని గ్రహించాలి.

ఆర్క్ వ్యాకోచ పద్ధతిని ఈ క్రింది రేఖా పటములో చూపినాము.



పై పటంలో ధర 5 రూ॥లుగా వున్నప్పుడు డిమాండ్ 100గా యున్నది. ధర 4 రూ॥కి తగ్గినప్పుడు డిమాండ్ 200కి పెరిగినది. కనుక పై సూత్రం ప్రకారంగా $PP_1$ మధ్య వ్యాకోచపు విలువను ఈ క్రింది విధంగా కనుగొనవచ్చును.

$$\text{ఆర్క్ వ్యాకోచము} = \frac{100-200}{100+200} \div \frac{5-4}{5+4}$$

$$\frac{-100}{300} \div \frac{1}{9} \qquad \frac{-100}{300} \times \frac{9}{1} = -3$$

వ్యాకోచపు విలువ −3 గా యున్నది కనుక డిమాండ్ రేఖమీద $PP_1$ మధ్య వ్యాకోచపు విలువ ఒకటికన్నా తక్కువగా వుంటుంది.

**ప్రశ్న 4) డిమాండు వ్యాకోచత్వములోని రకాలను వివరింపుము.**

**లేదా**

**ధర డిమాండు వ్యాకోచత అనగానేమి ? అవి ఎన్ని రకములు ? తగు రేఖాపటముల సహాయంతో వివరింపుము. (Important)**

**జవాబు :** ధరలో వచ్చే మార్పులు డిమాండులో మార్పులను తెస్తుంటాయి. ఒక వస్తువు ధర తగ్గితే డిమాండు పెరుగుతుందని, ధర పెరిగితే డిమాండు తగ్గుతుందని డిమాండ్ సూత్రం చెప్తుంది. కాని ధరలో వచ్చే మార్పు వలన డిమాండులో వచ్చే మార్పులు అన్ని వస్తువులకు ఒకే రీతిగా ఉండదు. కొన్ని వస్తువుల విషయంలో ధర బాగా పెరిగినా డిమాండు స్వల్పంగా తగ్గవచ్చు. మరికొన్ని వస్తువుల విషయంలో ధర స్వల్పంగా పెరిగినప్పటికి డిమాండు హెచ్చుగా తగ్గవచ్చు.

ధరలో హెచ్చుతగ్గులను బట్టి డిమాండులో కలుగు మార్పులను "డిమాండు వ్యాకోచం" అంటారు. అంటే ధరకు డిమాండులో వచ్చే మార్పుకు మధ్యవున్న సంబంధాన్ని "డిమాండు వ్యాకోచత్వము" అనాలి.

**డిమాండు వ్యాకోచత్వ వర్గీకరణ :** డిమాండు వ్యాకోచత్వాన్ని ఐదు రకాలుగా విభజించవచ్చు. అవి :

1. పూర్తి వ్యాకోచమైన డిమాండు (Perfectly Elastic Demand)
2. పూర్తి అవ్యాకోచమైన డిమాండు (Perfectly Inelastic Demand)
3. సాపేక్ష వ్యాకోచమైన డిమాండు (Relatively Elastic Demdnd)
4. సాపేక్ష అవ్యాకోచ డిమాండు (Relatively Inelastic Demand)
5. ఏకత్వ వ్యాకోచమైన డిమాండు (Unitary Elastic Demand)

**1) పూర్తి వ్యాకోచమైన డిమాండు** : వస్తువు ధరలో మార్పు లేకుండానే దాని డిమాండు పెరగడం, తగ్గడం జరిగితే ఆ డిమాండును "పూర్తి వ్యాకోచమైన డిమాండు" అంటారు. ఈ పరిస్థితిలో డిమాండు రేఖ క్రింది పటములో చూపినట్లు X అక్షానికి సమాంతరముగా ఉంటుంది. పూర్తి వ్యాకోచత్వ డిమాండు విలువ అనంతము (Infinite) — (∝).




**2) పూర్తి అవ్యాకోచ డిమాండు** : ధరలో ఎంత మార్పు వచ్చినప్పటికి డిమాండు ఏమాత్రం మారకుండా ఉంటే దాన్ని "పూర్తి అవ్యాకోచ డిమాండు" అంటారు. ఈ పరిస్థితిలో డిమాండు రేఖ క్రింది పటములో చూపినట్లు Y అక్షానికి సమాంతరంగా ఉంటుంది. పూర్తి అవ్యాకోచ డిమాండు విలువ శూన్యము (Zero).



**3) సాపేక్ష వ్యాకోచ డిమాండు :** ధరలో కలిగిన మార్పుకన్న వస్తువు డిమాండులో కలిగే మార్పు శాతము ఎక్కువగా వుంటే దాన్ని "సాపేక్ష వ్యాకోచ డిమాండు" అంటారు. ఇట్టి పరిస్థితిలో డిమాండు రేఖ క్రింది పటములో చూపినట్లు ఉంటుంది. సాపేక్ష వ్యాకోచ డిమాండు విలువ ఒకటికన్న ఎక్కువ (greater than one — >1).




**4) సాపేక్ష అవ్యాకోచ డిమాండు :** ధరలో కలిగిన మార్పుకన్న డిమాండులో వచ్చిన మార్పు శాతం తక్కువగా వుంటే దాన్ని సాపేక్ష "అవ్యాకోచ డిమాండు" అంటారు. ఇట్టి పరిస్థితిలో డిమాండు రేఖ క్రింది పటములో చూపినట్లు ఉంటుంది. సాపేక్ష అవ్యాకోచ డిమాండు విలువ ఒకటికన్న తక్కువ (less than one — <1).



**5) ఏకత్వ వ్యాకోచ డిమాండు :** వస్తువు ధర ఎంత మారుతుందో అంతే మార్పు డిమాండులో కూడా వస్తే దాన్ని "ఏకత్వ వ్యాకోచ డిమాండు" అంటారు. ఈ పరిస్థితిలో డిమాండు రేఖ దీర్ఘచతురస్ర అతి పరావలయ (Rectangular Hyper bola) రేఖగా పటములో చూపినట్లు వుంటుంది. ఏకత్వ వ్యాకోచ డిమాండు విలువ ఒకటికి సమానము. (Equal to one . .... = 1)




పై పటంలో ధరలో మార్పు ($PP_1$) డిమాండులో మార్పు ($MM_1$) సమానంగా వున్నాయి.

**ప్రశ్న 5) "డిమాండ్ వ్యాకోచత్వం అనే భావన, ఆర్థిక విశ్లేషణకు ఒక ముఖ్య సాధనము" - వివరింపుము.**

**లేదా**

**డిమాండు వ్యాకోచత్వ సూత్రము యొక్క ప్రాముఖ్యతను వివరింపుము.**

**జవాబు : 1) పన్నుల విధింపు :** ఆర్థికమంత్రి వస్తువులపై పన్నులు విధించేటప్పుడు వస్తువుల డిమాండు వ్యాకోచత్వాన్ని తెలుసుకొనవలె. పన్నులు విధించడం వలన వస్తువు ధర పెరుగుతుంది. కనుక ధర పెరిగినప్పటికి ఏ వస్తువులకు డిమాండు తగ్గదో అటువంటివాటిపైనే పన్నులు విధించవలె. అప్పుడే ప్రభుత్వానికి అనుకున్న ఆదాయం లభిస్తుంది. కనుక అవ్యాకోచ డిమాండున్న వస్తువులపైనే ప్రభుత్వం పన్నును విధిస్తుంది. ఇందుకై అన్ని వస్తువుల డిమాండు వ్యాకోచత్వాన్ని తెలుసుకొనవలె.

**2) ఏకస్వామ్య సంస్థ ధర :** ప్రతి ఉత్పత్తిదారునివలె ఏకస్వామ్య సంస్థ లక్ష్యం గూడా గరిష్ఠ లాభాలనార్జించటమే. అందుకు తగిన ధర నిర్ణయించాలి. ఏకస్వామ్య

సంస్థ తన వస్తువుకు డిమాండు వ్యాకోచత్వాన్ని బట్టి ధర నిర్ణయిస్తుంది. కాబట్టి అధిక లాభాల వార్జించవచ్చు వస్తువుకు వ్యాకోచ డిమాండు ఉంటే తక్కువ ధర నిర్ణయించడంవల్ల డిమాండు పెరిగి ఎక్కువ లాభాలను సంపాదించవచ్చు.

**3) వర్తక నిబంధనలు** : అంతర్జాతీయ వ్యాపారంలో ఒక దేశపు ఆదాయం దాని ఎగుమతులు వ్యాకోచత్వంపై ఆధారపడి వుంటుంది. ఎగుమతులకు వ్యాకోచ డిమాండు ఉంటే ధరను స్వల్పంగా తగ్గిస్తే ఎగుమతులు బాగా పెరుగుతాయి. అప్పుడు దేశానికి ఆదాయం ఎక్కువగా ఉంటుంది. అవ్యాకోచ డిమాండు గల వస్తువుల విషయంలో వర్తక నిబంధనలు ఎగుమతిచేసే దేశానికి అనుకూలంగా వుండవు.

**4) వేతనాల నిర్ణయం** : వేతనాల పెరుగుదల కార్మికులు ఉత్పత్తిచేసే వస్తువుకు ఉండే డిమాండు వ్యాకోచత్వంపై ఆధారపడి వుంటుంది. వేతనాలు పెంచితే ధర పెరుగుతుంది. కనుక యజమానులు ధర పెరిగినా డిమాండు తగ్గని అవ్యాకోచ డిమాండు వున్న వస్తువులను ఉత్పత్తిచేసే శ్రామికులకు వేతనాలను పెంచడానికి ఇష్టపడతారు. అలాకాక వస్తువుకు వ్యాకోచ డిమాండు ఉండే సంస్థలలో వేతనాలు పెంచడానికి యజమానులు ప్రతిఘటిస్తారు.

**5) ఉమ్మడి ఉత్పత్తి** : కొన్ని ఉత్పత్తి సంస్థలు ఒకటికంటే ఎక్కువ వస్తువులను ఉత్పత్తి చేస్తుంటాయి. అలాంటప్పుడు ఉత్పత్తి ఖర్చులు దేనికెంత అయినాయో తెలుసుకోవడం సాధ్యంకాదు. ఉదాహరణకు ఉషా కంపెనీ ఫ్యాన్లు, కుట్టుమిషన్లు రెంటినీ ఉత్పత్తి చేస్తుంది. దేనిపై ఎంత ఉత్పత్తి ఖర్చు అయినది, దేనికి ఎంత ధర నిర్ణయించాలి అనేది డిమాండు వ్యాకోచత్వం ఆధారంగా నిర్ణయించవలసి వుంటుంది.

**6) జాతీయకరణ** : ఏ పరిశ్రమలను ప్రభుత్వ యాజమాన్యంలోనికి తీసుకోవాలో నిర్ణయించడానికి డిమాండు వ్యాకోచత్వం తోడ్పడుతుంది. వస్తువులకు అవ్యాకోచ డిమాండువున్న పరిశ్రమలు ప్రైవేటు యాజమాన్యంలో ఉంటే వాటికి హెచ్చుధరలను నిర్ణయించి వినియోగదార్లను ప్రైవేట్ యజమానులు కొల్లగొట్టే అవకాశం వుంటుంది. కనుక ప్రభుత్వం ఇలాంటి పరిశ్రమలను జాతీయం చేసి వినియోగదార్లను ఆదుకోవలసి వుంటుంది.

**7) పన్నుల భారం** : వస్తువుపై పన్ను విధించినపుడు, ఈ పన్ను భారం అమ్మకందారు, కొనుగోలుదార్ల మధ్య పంపిణీ డిమాండు వ్యాకోచత్వంపై ఆధారపడి వుంటుంది. వస్తువుయొక్క డిమాండు వ్యాకోచత్వం ఎక్కువగా వుంటే పన్ను ఫలితంగా ధర పెరిగితే డిమాండు ఎక్కువగా తగ్గుతుంది. వస్తువు డిమాండు తగ్గకుండా చూసుకోవాలంటే ధరను ఎక్కువగా పెంచక పన్నుభారాన్ని అమ్మకందారుడే ఎక్కువగా భరిస్తాడు. అలాకాక డిమాండు వ్యాకోచత్వం తక్కువగా వుంటే పన్ను భారాన్ని ఎక్కువగా కొనుగోలుదారుడు భరించవలసి వస్తుంది.

**8) అధికపంట-అల్ప ఆదాయం :** వ్యవసాయరంగంలో ఉత్పత్తులు అధికంగా వున్నప్పటికి వ్యవసాయదారులు పేదరికంలోనే మ్రగ్గుతారు. ఇందుకు కారణం ఆహార వస్తువులకు డిమాండు అవ్యాకోచం కాబట్టి ఉత్పత్తి పెరిగినకొద్దీ ఆహార వస్తువుల ధరలు బాగా తగ్గి వ్యవసాయదారుల ఆదాయంకూడా తగ్గుతుంది.

**9) ప్రభుత్వ ఆర్థిక విధానం :** వ్యాపార చక్రా (Trade Cycles) లను నివారించుటకు ద్రవ్యోల్బణమును అరికట్టుటకు అవసరమైన ఆర్థిక విధానాలను రూపొందించుటకు డిమాండు వ్యాకోచత్వ ధోరణులను తెలుసుకోవాలి.

పైన వివరించినట్లు పన్నుల విధింపు, ధర నిర్ణయం, అంతర్జాతీయ వ్యాపారం, ప్రభుత్వ ఆర్థిక విధానం రూపకల్పన మొదలగు అనేక విషయాలలో డిమాండు వ్యాకోచత్వం భావన ఒక ముఖ్యమైన విశ్లేషణాత్మక సాధనము.

**ప్రశ్న 6) "డిమాండు వ్యాకోచత్వం" అనగానేమి? దానిని నిర్ణయించు అంశాలేవి?**

**లేదా**

**డిమాండు వ్యాకోచత్వాన్ని ప్రభావితంచేసే అంశాలేమిటి?**

**(Important)**

**జవాబు : డిమాండు వ్యాకోచం :** ఒక వస్తువు ధరలో కలిగిన మార్పు ఫలితంగా ఆ వస్తువు డిమాండు రేటులో కలిగే మార్పును డిమాండు వ్యాకోచం అంటారు. ధరలో వచ్చే మార్పుకన్న డిమాండులో వచ్చే మార్పు రేటు హెచ్చుగా వుంటే దాన్ని "వ్యాకోచ డిమాండు" (Elastic Demand) అంటారు. అలాకాక ధరలో వచ్చే మార్పుకన్న, డిమాండు రేటులో వచ్చే మార్పు తక్కువగా వుంటే దాన్ని "అవ్యాకోచ డిమాండు" (Inelastic Demand) అంటారు. డిమాండు వ్యాకోచం అన్ని వస్తువులకు ఒకే విధంగా వుండదు. కొన్ని వస్తువులకు డిమాండు వ్యాకోచంగాను, మరికొన్నిటికి అవ్యాకోచంగాను ఉంటుంది.

**డిమాండు వ్యాకోచానికి కారణాలు :** డిమాండు వ్యాకోచానికి ఈ క్రింది కారణాలను చెప్పవచ్చు :

**1) వస్తువు స్వభావం :** వస్తువు స్వభావాన్నిబట్టి డిమాండు వ్యాకోచత్వం ఉంటుంది. జీవితావసర వస్తువుల విషయంలో వాటి ధర పెరిగినా, తగ్గినా వాటి డిమాండులో పెద్ద మార్పు వుండదు. బియ్యం, మందులు, ఉప్పు మొదలైనవి జీవితావసర వస్తువులు. వీటి ధర పెరిగినా, తగ్గినా వాటిని యధాతథంగా వాడవలసిందే. అందువల్ల వాటి డిమాండులో మార్పు వుండదు. కనుక ఈ వస్తువులకు అవ్యాకోచ డిమాండు ఉంటుంది. అలాకాక సౌకర్యాలు, విలాస వస్తువుల ధరలు పెరిగితే వాటిని

తప్పనిసరిగా వాడవలసిన అవసరంలేదు. కనుక డిమాండు తగ్గుతుంది. వాటి ధరలు తగ్గినప్పుడు డిమాండు పెరుగుతుంది. కాబట్టి ఈ వస్తువులకు వ్యాకోచ డిమాండు వుంటుంది.

**2) ప్రత్యామ్నాయ వస్తువులున్నవి** : ఒక వస్తువుకు సరైన ప్రత్యామ్నాయ వస్తువులుంటే ఆ వస్తువునకు వ్యాకోచపు డిమాండు ఉంటుంది. సిమెంటు, సున్నం ప్రత్యామ్నాయ వస్తువులు. సిమెంటు ధర బాగా పెరిగితే, సిమెంటుకి బదులు సున్నాన్ని గృహ నిర్మాణంలో ఎక్కువగా వాడతారు. అందువల్ల సిమెంటు డిమాండు తగ్గుతుంది. అలాకాక ఏ వస్తువుకైనా ప్రత్యామ్నాయ వస్తువులంటూ ఏవీ లేకపోతే దానికి అవ్యాకోచ డిమాండు ఉంటుంది. అంటే ఆ వస్తువు ధర పెరిగినా దానికి బదులుగా ఉపయోగించడానికి వేరే వస్తువులు లేనందువల్ల ఆ వస్తువునే ఎంత ధరకైనా కొనవలసి వస్తుంది.

**3) బహుళ ప్రయోజనాలు గల వస్తువు** : ఒక వస్తువుకు అనేక ఉపయోగాలుంటే దాని డిమాండు వ్యాకోచంగా ఉంటుంది. విద్యుచ్ఛక్తి బహుళ ప్రయోజనాలుగల వస్తువు. దీన్ని దీపాలకు, ఫ్యాన్లకు, వంట చేయటానికి, నీళ్ళు తోడడానికి మొదలైనవాటికి వాడవచ్చు. దాని ధర తగ్గితే అన్ని ఉపయోగాల్లోనూ వాడటంవల్ల దాని డిమాండు పెరుగుతుంది. ధర పెరిగితే అతి ముఖ్యమైన ఉపయోగాలకే వాడటంవల్ల దాని డిమాండు తగ్గుతుంది. అలాకాక ఒక ఉపయోగానికి పనికివచ్చే వస్తువుకు డిమాండు అవ్యాకోచంగా వుంటుంది.

**4) ఆదాయంలో తక్కువ భాగాన్ని ఖర్చుపెట్టించే వస్తువులు** : వినియోగదారుడు తన ఆదాయంలో తక్కువ శాతాన్ని ఖర్చుచేసి పొందే వస్తువుల డిమాండు అవ్యాకోచంగా ఉంటుంది. ఇలాంటి వస్తువులకు ఉదాహరణగా అగ్గిపెట్టె, ఉప్పు, పోస్టుకార్డు మొదలైనవి చెప్పవచ్చు. వీటిపై చేసే ఖర్చు మొత్తం ఆదాయంతో పోలిస్తే చాలా స్వల్పంగా వుంటుంది. కనుక వీటి ధరలు కొంచెం పెరిగినా వాటిపై చేసే ఖర్చు తక్కువే కాబట్టి వాటి డిమాండు తగ్గదు. అలాకాక ఆదాయంలో ఎక్కువ భాగాన్ని ఖర్చు చేయించే వస్తువుల డిమాండు సహజంగా వ్యాకోచంగా వుంటుంది.

**5) కొనుబడి వాయిదా వేయడానికి వీలైన వస్తువులు** : వినియోగాన్ని వాయిదా వేయడానికి వీలుండే వస్తువులకు డిమాండు వ్యాకోచంగా ఉంటుంది. ఉదాహరణకు, బట్టల ధరలు బాగా పెరిగితే వినియోగదారులు ప్రస్తుతం వాడుతున్న వాటినే మరికొంతకాలం వాడవచ్చు. అలాంటప్పుడు వాటి డిమాండు తగ్గుతుంది. కొనుబడి వాయిదావేయడానికి వీలులేని వస్తువుల డిమాండు అవ్యాకోచంగా ఉంటుంది.

ఉదాహరణకు, అనారోగ్యంగా ఉన్నప్పుడు అందుకు వాడవలసిన మందును వాయిదా వేయడానికి వీలులేనందున, ఆ వస్తువు ధర పెరిగినప్పటికి డిమాండు ఏ మాత్రం తగ్గదు.

**6) ధరల స్థాయి :** డిమాండు వ్యాకోచం ధరల స్థాయిపై కూడా ఆధారపడుతుంది. బాగా హెచ్చు ధర గల వస్తువుల లేక మరీ స్వల్ప ధర గల వస్తువుల డిమాండు అవ్యాకోచంగా ఉంటుంది. ఉదాహరణకు రు. 60,000 ఖరీదుచేసే కారు ధర రు. 2,000 పెరిగినప్పటికి దాని డిమాండు తగ్గదు. అలాగే ఐదు పైసలు ఖరీదుచేసే ఒక గుండీ ధర రెండు పైసలు (40 శాతం) పెరిగినప్పటికి దాని డిమాండ్ తగ్గదు.

**7) ఉమ్మడి డిమాండు :** కొన్ని వస్తువులకు డిమాండు మరికొన్ని వస్తువుల డిమాండ్లతో ముడిపడి వుంటుంది. ఇలాంటి వస్తువులను "పూరక వస్తువులు" అంటారు. ఉదాహరణకు సిమెంటు, ఇసుక గృహనిర్మాణానికి ఈ రెంటిని కలిపి వాడాలి. అందువల్ల ఇసుక ధర తగ్గినంత మాత్రాన దాని డిమాండు పెరగదు. సిమెంటు ధరకూడా తగ్గాలి. కనుక ఉమ్మడి డిమాండుకన్న వస్తువులలో ఒకదాని ధర మాత్రమే తగ్గితే దానికి డిమాండు పెరగదు. అంటే దాని డిమాండు అవ్యాకోచమన్నమాట.

**వ్యాకోచత్వాన్ని నిర్ణయించే అంశాలను పరిశీలించేటప్పుడు క్రింది విషయాలను కూడా పరిగణనలోకి తీసుకోవాలి.**

**1) కాల వ్యవధి :** వ్యాకోచత్వం స్వభావం కాల వ్యవధిని బట్టి మారుతూంటుంది. ఒకప్పుడు వ్యాకోచత్వ డిమాండుకన్న వస్తువుకు కొంత కాలం తర్వాత డిమాండు అవ్యాకోచంగా మారవచ్చు. ఇలా మారడానికి క్రింది కారణాలు చెప్పవచ్చు....

ఎ) వినియోగం తీరులో మార్పు.

బి) ధరలలోని మార్పు అందరికి తెలియటానికి కొంతకాలం పడుతుంది.

సి) వినియోగదార్ల అభిరుచులు, ఫ్యాషన్లలో మార్పులు.

**2) ఆదాయ స్థాయి :** ఒకే వస్తువు ఎక్కువ ఆదాయం పొందే వారి విషయంలో వ్యాకోచ డిమాండ్‌ను కలిగి వుండవచ్చు.

**3) ఉపయోగం :** వివిధ ఉపయోగాలు గల వస్తువులు ఒక ఉపయోగంలో అవ్యాకోచ డిమాండ్, మరో ఉపయోగంలో వ్యాకోచ డిమాండ్‌ను కలిగివుండవచ్చు. ఉదాహరణకు, గోధుమ, ఆహార వస్తువుగా అవ్యాకోచ డిమాండు, పశుగ్రాసంగా వ్యాకోచ డిమాండు కలిగివుంటుంది.

**4) వ్యక్తికి మార్కెట్‌కు ఉండే తేడా :** వ్యక్తి డిమాండు వ్యాకోచానికి మార్కెట్ డిమాండ్ వ్యాకోచానికి తేడా ఉంటుంది. ఒక వస్తువుకు ధర పెరిగినప్పుడు ఒక వ్యక్తి తన డిమాండును తగ్గించుకున్నప్పటికి మొత్తంమీద మార్కెట్‌లో డిమాండ్ తగ్గకపోవచ్చు. ఇలాంటప్పుడు వ్యక్తి డిమాండ్ వ్యాకోచమైతే, మార్కెట్ డిమాండ్ అవ్యాకోచం అన్నమాట.

# SHORT QUESTIONS

**ప్రశ్న 1) "డిమాండు పట్టిక" అనగానేమి ?**

**లేదా**

**- డిమాండు పట్టికలో గల రకాలు ఏవి? డిమాండు పట్టిక నొకదానిని గీయుము.**

జవాబు : డిమాండు పట్టిక **(Demand Schedule) :** ఒక నిర్ణీత సమయంలో వివిధ ధరలవద్ద ఒక వస్తువు ఎంత పరిమాణంలో కొనబడుతుందో చూపించే పట్టికను "డిమాండ్ పట్టిక" అంటారు. అంటే డిమాండు పట్టిక ధరకు, డిమాండ్‌కు గల సంబంధాన్ని చూపుతుంది. ఈ డిమాండ్ పట్టికను రెండు విధాలుగా చెప్పవచ్చు :

**i) వ్యక్తిగత డిమాండ్ పట్టిక. ii) మార్కెట్ డిమాండ్ పట్టిక**

**i) వ్యక్తిగత డిమాండ్ పట్టిక (Individual Demand Schedule) :** ఒక వ్యక్తి ఒక వస్తువును నిర్ణీత సమయంలో వివిధ ధరలవద్ద ఎంత పరిమాణంలో కొనడానికి యిష్టపడతాడో చూపించే పట్టికను "వ్యక్తిగత డిమాండు పట్టిక" అంటారు. వ్యక్తిగత డిమాండ్ పట్టిక ఒకటి క్రింద యివ్వబడింది.

**'A' యొక్క వ్యక్తిగత డిమాండ్ పట్టిక**

| వస్తువు ధర రూ.లలో | వస్తువు యొక్క డిమాండు |
|---|---|
| 5-00 | 10 |
| 4-00 | 20 |
| 3-00 | 30 |
| 2-00 | 50 |

**ii) మార్కెట్ డిమాండ్ పట్టిక (Market Demand Schedule) :** ఒక మార్కెట్‌లో ఉండే వినియోగదార్లు అంతా కలసి ఒక వస్తువును ఒక నిర్ణీత సమయంలో వివిధ ధరలవద్ద ఎంత మొత్తంలో కొంటారో తెలిపే పట్టికను "మార్కెట్ డిమాండ్ పట్టిక" అంటారు.

**మార్కెట్ డిమాండ్ పట్టిక**

| వస్తువు ధర రూ.లలో | వస్తువు యొక్క డిమాండ్ |
|---|---|
| 5-00 | 10,000 |
| 4-00 | 20,000 |
| 3-00 | 30,000 |
| 2-00 | 50,000 |

పై పట్టికలు రెండు కేవలం ఊహాజనితమైనవే. మిగతా డిమాండు ప్రేరణలో మార్పులేదని భావిస్తే ధరకు, డిమాండుకు గల సంబంధాన్ని చూపటం జరిగింది.

**ప్రశ్న 2) డిమాండు రేఖ అంటే ఏమిటి ? డిమాండు రేఖ నొకదానిని గీయుము**

**లేదా**

**వ్యక్తిగత, మార్కెట్ డిమాండు వక్రరేఖల భేదములను తెల్పుము.**

**జవాబు : డిమాండు రేఖ (Demand Curve) :** ఒకానొక సమయంలో వివిధ ధరలవద్ద ఒక వస్తువు ఎంత పరిమాణంలో కొనబడుతుందో చూపించే పట్టికను "డిమాండు పట్టిక" అంటారు. డిమాండు పట్టికలోని వివిధ ధరలవద్ద వస్తువులకున్న డిమాండును గ్రాఫ్ కాగితంపై గుర్తించి, ఆ బిందువులన్నింటిని కలిపితే వచ్చే రేఖనే "డిమాండు రేఖ" అంటారు. ఇది వక్రంగా గాని, సరళరేఖగా గాని ఉండవచ్చు. ఈ రేఖ ఎల్లప్పుడు ఎడమనుంచి కుడికి క్రిందికి వాలుతూనే ఉంటుంది. X- అక్షం మీద డిమాండును, Y- అక్షం మీద ధరను చూపాలి.

**వ్యక్తిగత డిమాండు రేఖ (Individual Demand Curve) :** వ్యక్తిగత డిమాండు పట్టిక ఆధారంగా గీస్తే వచ్చే రేఖను "వ్యక్తిగత డిమాండు రేఖ" అంటారు.

**మార్కెట్ డిమాండు రేఖ (Market Demand Curve) :** మార్కెట్ డిమాండు పట్టిక ఆధారంగా గీస్తే వచ్చే రేఖను "మార్కెట్ డిమాండు రేఖ" అంటారు.




**ప్రశ్న 3) డిమాండు పట్టికను తయారుచేయుటలోగల ఇబ్బందులను పేర్కొనుము?**

**లేదా**

**డిమాండు పట్టికను ఖచ్చితమైనదానిని ఎందువల్ల తయారుచేయలేము?**

జవాబు : నిర్ణీత కాలములో ఒక ధరవద్ద ఒక వస్తువు ఎంత పరిమాణంలో కొనబడుతుందో ఆ పరిమాణాన్ని ఆ వస్తువుయొక్క "డిమాండు" అంటారు. వివిధ ధరలవద్ద ఆ వస్తువు ఎంత పరిమాణములో కొనబడుతుందో చూపించే పట్టికను "డిమాండు పట్టిక" అంటారు. ఒక మాదిరి డిమాండు పట్టిక క్రింద ఈయబడినది.

| మామిడి పండు ధర | మామిడి పండ్ల డిమాండు |
|---|---|
| రు. 0-50 | 400 |
| రు. 0-40 | 600 |
| రు. 0-30 | 900 |
| రు. 0-20 | 1400 |

ఈ డిమాండు పట్టిక కేవలము ఊహాజనితమైనది. నిజ జీవితములో మామిడి పండ్లకు డిమాండు ఇంత క్రమబద్ధంగా ఉండదు. వాస్తవిక ప్రపంచములో ఏ వస్తువుపైన ఖచ్చితమైన డిమాండు పట్టికను తయారుచేయలేము. దానికి ఈ క్రింది కారణాలున్నాయి.

1) పై పట్టిక తయారులో ధరలు మారినప్పుడు మిగతా పరిస్థితులు-అనగా అభిరుచులు, ఆదాయాలు, ప్రత్యామ్నాయ వస్తువుల ధరలు మారలేదని అనుకుంటున్నాము. కాని నిజ జీవితంలో ఈ పరిస్థితులన్నీ మారుతూ వుంటాయి. ఇవన్నీ మారితే అప్పుడు డిమాండు ఎలా ఉంటుందో ఊహించడము చాలా కష్టము. అందుకనే ధర మినహా మిగతా పరిస్థితులన్ని స్థిరంగా వున్నాయని ఊహించి డిమాండు పట్టికను తయారుచేస్తారు.

2) ఒక వ్యక్తి, వస్తువు ధర తగ్గినప్పుడు ఖచ్చితముగా ఎన్ని వస్తువులను కొనగలడో చెప్పడం చాలా కష్టము. ఒకప్పుడు ఆ ధరకు ఎక్కువ వస్తువులను కొనవచ్చు, లేదా చాలా తక్కువ వస్తువులను కొనవచ్చు. పైన ఇచ్చిన పట్టిక కేవలము ఆ ధరలవద్ద ఆ సంఖ్యలో వస్తువులను కొనడానికి అవకాశముందనే చెప్తుతుందేకాని తప్పనిసరిగా ఆ సంఖ్యలో వస్తువులు కొనబడతాయని చెప్పలేదు. కనుక ఖచ్చితమైన డిమాండు పట్టికను తయారుచేయడానికి సాధ్యపడదు.

3) మార్కెట్‌లో వస్తువు ధర ఇతర ప్రత్యామ్నాయ వస్తువుల ధరలకన్నా హెచ్చుగా తగ్గితే, వస్తువు డిమాండ్ హెచ్చుగా పెరుగుతుంది. ఇలా ప్రత్యామ్నాయ వస్తువుల ధరలను అన్నింటిని విచారించి, వాటి ధరలలో వచ్చే మార్పుల ప్రభావము వస్తువు డిమాండ్‌పై ఎట్లా ఉంటుందో తేల్చి ఖచ్చితముగా చెప్పడము సాధ్యపడదు. అందువల్ల ఖచ్చితమైన డిమాండు పట్టికను తయారుచేయలేము.

పై కారణములవల్ల వాస్తవమైన డిమాండు పట్టికను తయారుచేయడము చాలా కష్టము.

**ప్రశ్న 4) "డిమాండు ఫలం" అనగానేమి ?**

జవాబు : ఒక ధరవద్ద ఒక వస్తువును ఎంత పరిమాణంలో కొంటామో ఆ పరిమాణాన్ని ఆ వస్తువుయొక్క డిమాండు అందురు. డిమాండు ఈ క్రింది అంశాలపై ఆధారపడి వుంటుంది. అవి :

i) ఆ వస్తువు యొక్క ధర

ii) వివిధ వస్తువుల ధరలు

iii) వినియోగదార్ల ఆదాయం

iv) వినియోగదార్ల అభిరుచులు, అలవాట్లు

ఈ అంశాలలో వచ్చే మార్పులు డిమాండులో మార్పును తెస్తాయి. వీటినే క్రింది సమీకరణముద్వారా చూపవచ్చు.

$$D_n = f(P_n, P_1 \ldots P_{n-1}, Y, T)$$

ఇక్కడ

$D_n$ – n వస్తువు డిమాండు

$P_n$ – n వస్తువు ధర

$P_1 - P_{n-1}$ – మిగిలిన వస్తువుల ధరలు

Y – వినియోగదార్ల ఆదాయం

T – వినియోగదార్ల అభిరుచులు

అంటే n వస్తువుయొక్క డిమాండు దాని ధర. ఇతర వస్తువుల ధరలు వినియోగదార్ల ఆదాయం, అభిరుచులు మొదలగువాని యొక్క ఫలము (Function) అన్నమాట.

అయితే విశ్లేషణను సులభంగా ఉంచటానికి పాక్షిక విశ్లేషణా పద్ధతి ప్రకారం వస్తువు డిమాండుకు ధరకు మధ్యనున్న సంబంధాన్ని మాత్రమే చెప్పవచ్చు. అలా చెప్పేటప్పుడు మిగిలిన నిర్ధాయకాలను (Determinants) నిర్లక్ష్యం చేయటంకాదు. అసలు డిమాండు సూత్రం ఇతర విషయాలన్ని స్థిరంగా వున్నాయనే ప్రమేయం ఆధారంగా చెప్పబడింది. కనుక వస్తువు డిమాండు దాని ధరమీద ఆధారపడుతుందని చెప్పాలి. కనుక డిమాండు ఫలాన్ని క్రింది విధంగా చూపాలి.

$D_n = f(P_n)$

ఇక్కడ $D_n$–n వస్తువు డిమాండు

$P_n$ – n వస్తువు ధర

**ప్రశ్న 5) డిమాండు పరిమాణంలో మార్పులు. డిమాండులో మార్పులు ఈ రెండింటికి తేడా ఏమి ?**

జవాబు : ధరలో మార్పు వలన డిమాండులో కలిగే మార్పును "డిమాండు పరిమాణంలో మార్పు" అంటారు. ఈ పరిస్థితిలో డిమాండు రేఖ మారదు. అదే రేఖపై మార్పులు చూపబడతాయి. ఈ విషయాన్ని క్రింది పటంలో చూడవచ్చు.



ఒక ధర వలననే కాక ఇతర కారణాల వలన కూడా డిమాండులో మార్పు వస్తుంది. జనాభా, వినియోగదారుల ఆదాయం, అభిరుచులు, ప్రత్యామ్నాయ వస్తువుల ధరలు మొదలైనవాటిలో కలిగే మార్పుల వలన డిమాండులో కూడా మార్పులు వస్తాయి. ఇలాంటి మార్పును 'డిమాండు మార్పు' అంటారు. ఇలా డిమాండులో కలిగే మార్పును కొత్త డిమాండు రేఖ చూపిస్తుంది. డిమాండు పెరిగితే కొత్త డిమాండు రేఖ కుడివైపుకు, డిమాండు తగ్గితే కొత్త డిమాండు రేఖ ఎడమ వైపుకు జరుగుతుంది. మార్పు జరిగిన డిమాండు రేఖలు రేఖాపటంలో చూపబడినాయి.




పటంలో D D మొదట ఉన్న డిమాండు రేఖ, $D_1$ $D_1$ డిమాండు పెరుగుదల వల్ల ఏర్పడిన కొత్త డిమాండు రేఖ. $D_2$ $D_2$ డిమాండు తగ్గుదల వలన ఏర్పడిన రేఖ.

**ప్రశ్న 6) i) ఆదాయ డిమాండు (Income demand)**
**ii) జాత్యంతర డిమాండు (Cross demand) (Very Important)**

**జవాబు : ఆదాయ డిమాండు :** ఒక వస్తువు యొక్క డిమాండు వినియోగదార్ల ఆదాయాలపై కూడా ఆధారపడి ఉంటుంది. ఆదాయానికి, డిమాండుకు మధ్యగల సంబంధాన్నే "ఆదాయ డిమాండు" అంటారు. వినియోగదార్ల ఆదాయం పెరిగితే కొన్ని వస్తువుల యొక్క డిమాండు పెరుగుతుంది. అదేవిధంగా ఆదాయం తగ్గితే ఆ వస్తువుల యొక్క డిమాండు తగ్గుతుంది. ఇలాంటి వస్తువులను"మేలురకపు వస్తువులు" అంటారు. ఆదాయ డిమాండును చెప్పేటప్పుడు మిగతా పరిస్థితులలో అంటే వస్తువు ధర, ప్రత్యామ్నాయ, పరస్పరపూరక వస్తువుల ధరలలో మార్పులు లేవని భావించాలి.

**మేలురకం వస్తువుల డిమాండు రేఖ :** సాధారణంగా డిమాండు రేఖ ఎడమ నుంచి కుడికి కిందికి వాలుతూ ఉంటుంది. కాని మేలురకం వస్తువుల విషయంలో ఆదాయ డిమాండు రేఖ ఎడమ నుంచి కుడికి పైకి పోతూ ఉంటుంది. దీన్నే క్రింది పటంలో చూడవచ్చు.




పై పటంలో డిమాండు X అక్షం మీద, ఆదాయం Y అక్షం మీద చూపబడినాయి. DD ఆదాయ డిమాండు రేఖ, OY ఆదాయం ఉన్నప్పుడు డిమాండు OQ ఇప్పుడు ఆదాయం $OY^1$ కు పెరిగింది.

ఫలితంగా డిమాండు $OQ^1$కు పెరిగింది.

**తక్కువ రకం వస్తువుల - ఆదాయ డిమాండు రేఖ :** అయితే పైన చెప్పినట్లు ఆదాయం పెరిగితే అన్ని వస్తువులకు డిమాండు పెరగదు. కేవలం మేలురకం వస్తువులకే ఆ విధంగా ఉంటుంది. తక్కువ రకం వస్తువుల విషయంలో మటుకు ఆదాయం పెరిగితే వాటి డిమాండు తగ్గుతుంది. అదేవిధంగా ఆదాయం తగ్గితే వాటి డిమాండు పెరుగుతుంది. ఇలాంటి వస్తువులను "తక్కువ రకం వస్తువులు" అని అంటారు. వీటి ఆదాయ డిమాండు రేఖ సాధారణ డిమాండు రేఖ వలెనే ఎడమ నుంచి కుడికి క్రిందికి వాలుతుంది. దీన్నే పటములో చూడవచ్చు.




పటములో డిమాండు X– అక్షంమీద, ఆదాయం Y– అక్షంమీద చూపబడినాయి. ID ఆదాయ డిమాండురేఖ $Y_1$ – ఆదాయం ఉన్నప్పుడు వస్తువుకు $OM_1$ డిమాండు

ఉంది ఇప్పుడు ఆదాయం $OY_2$ కు పెరిగితే డిమాండు OM కు తగ్గింది. అదే విధంగా ఆదాయం OY కి తగ్గినప్పుడు డిమాండు $OM_2$ కు పెరిగింది.

**ii) జాత్యంతర డిమాండు** : ఇతర వస్తువుల ధరలలో వచ్చిన మార్పుల వల్ల ఒక వస్తువు డిమాండులో వచ్చే మార్పును "జాత్యంతర డిమాండు" అంటారు. ఈ జాత్యంతర డిమాండును పరిశీలించేటప్పుడు వస్తువు ధర, వినియోగదార్ల ఆదాయాలు నిలకడగావున్నట్లు భావించాలి. ఒక వస్తువుకు ఇతర వస్తువులతో గల సంబంధం రెండు విధాలుగా వుండవచ్చు.

a) ప్రతిస్థాపక సంబంధం

b) పూరక సంబంధం

a) **ప్రతిస్థాపక సంబంధం** : కాఫీ, టీ ప్రత్యామ్నాయ వస్తువులు (Substitutes). ఈ వస్తువుల విషయంలో ఒక వస్తువు ధర తగ్గితే, రెండవ వస్తువుకు డిమాండు తగ్గుతుంది. అలాగే ఒక వస్తువు ధర పెరిగితే రెండవ వస్తువుకు డిమాండు పెరుగుతుంది. ఉదాహరణకు, కాఫీ ధర తగ్గితే టీ త్రాగేవారు కూడ కాఫీనే కొనడంవలన టీ యొక్క డిమాండు తగ్గుతుంది. అదే విధంగా కాఫీ ధర పెరిగితే కాఫీ త్రాగేవారు కూడా టీ కొనడంతో టీ డిమాండు పెరుగుతుంది. ప్రత్యామ్నాయ వస్తువుల డిమాండు రేఖ పటములో చూపినట్లు ఎడమనుంచి కుడికి పైకి పోతుంది.




పటములో X – అక్షంమీద టీ డిమాండు, Y – అక్షం మిద కాఫీ ధర చూపబడినాయి. SD ప్రత్యామ్నాయ వస్తువుల డిమాండు రేఖ. కాఫీ ధర OP ఉన్నప్పుడు టీ డిమాండు OM ఉంది. ఇప్పుడు కాఫీ ధర $OP_1$ కు పెరిగినందున టీ డిమాండు కూడా $OM_1$కు పెరిగింది.

**b) పూరక సంబంధం** : బూట్లు, సాక్స్ పూరక వస్తువులు. ఈ వస్తువుల విషయంలో ఒక వస్తువు ధర తగ్గితే రెండవ వస్తువుకు డిమాండు పెరుగుతుంది. అలాగే ఒక వస్తువు ధర పెరిగితే రెండవ వస్తువుకు డిమాండు తగ్గుతుంది. **ఉదాహరణకు**, బూట్ల ధర తగ్గితే వాటిని ఎక్కువగా కొంటారు. వాటితోపాటు సాక్స్ కూడా అవసరం కనుక

సాక్స్‌కు డిమాండు పెరుగుతుంది. ఇదే విధంగా బూట్ల ధర పెరిగితే వాటి డిమాండు తగ్గటమే కాకుండా సాక్స్‌కు కూడా డిమాండు తగ్గుతుంది. ఈ రకమైన వస్తువుల డిమాండు రేఖాపటంలో చూపినట్లు ఎడమనుంచి కుడికి క్రిందికి వాలుతుంది.




పటములో సాక్స్ డిమాండు X– అక్షం మీద, బూట్ల ధర Y అక్షం మీద చూపబడినాయి. CD– పూరక వస్తువుల డిమాండు రేఖ. బూట్ల ధర $OP_1$ ఉన్నప్పుడు సాక్స్ డిమాండు $OM_1$ ఉంది. ఇప్పుడు బూట్ల ధర $OP_2$కు తగ్గడంతో సాక్స్ డిమాండు OM కు పెరిగింది. అదేవిధంగా బూట్ల ధర OPకి పెరిగినప్పుడు సాక్స్ డిమాండు OM కు తగ్గింది.

**ప్రశ్న 7) ఆదాయ డిమాండు వ్యాకోచత్వం (Income Elasticity of Demand) గురించి వ్రాయండి. (Very Important)**

**ఆదాయ డిమాండు వ్యాకోచత్వం :** ఒక వస్తువుకు గల డిమాండు దాని ధరపైనేకాక వినియోగదార్ల ఆదాయంపైన కూడా ఆధారపడి ఉంటుంది. వస్తువు ధర, ప్రత్యామ్నాయ పూరక వస్తువుల ధరలు స్థిరంగా ఉండి వినియోగదారుని ఆదాయంలో వచ్చే మార్పు వల్ల వస్తువు డిమాండులో వచ్చే మార్పును "ఆదాయ డిమాండు వ్యాకోచత్వం" అంటారు.

$$\text{ఆదాయ డిమాండు వ్యాకోచత్వం} = \frac{\text{వస్తువు డిమాండులో వచ్చిన అనుపాత మార్పు}}{\text{వినియోగదారుని ఆదాయంలో వచ్చిన అనుపాత మార్పు}}$$

ఆదాయ డిమాండు వ్యాకోచత్వంలో ఆరు రకాలు కలవు.

**1) సున్నా ఆదాయ డిమాండు వ్యాకోచత్వము :** వినియోగదారుని ఆదాయం పెరిగినప్పటికి, ఆ వస్తువు డిమాండులో ఏ విధమైన మార్పు రాకపోతే, దానిని "సున్నా ఆదాయ డిమాండు వ్యాకోచత్వం" అంటారు. దీనిని ఈ క్రింది రేఖా పటంలో చూపినాము.




పై పటంలో ఆదాయం OI నుంచి $OI_1$ కి పెరిగినప్పటికి డిమాండు (OM) స్థిరంగా యున్నది. కనుక ఆదాయ డిమాండు వ్యాకోచత్వం సున్నాగా ఉంటుంది.

**2) ఋణాత్మక ఆదాయ డిమాండు వ్యాకోచత్వం** : ఆదాయము పెరిగినందు వలన వస్తువు యొక్క డిమాండు తగ్గినట్లయితే దానిని "ఋణాత్మక ఆదాయ డిమాండు వ్యాకోచము" అంటారు. తక్కువ రకపు వస్తువుల విషయంలోఆదాయ డిమాండు వ్యాకోచత్వం ఋణాత్మకంగా ఉంటుంది. దీనిని ఈ క్రింది పటంలో చూపినాము.




పై పటంలో ఆదాయము OI నుంచి $OI_1$ కు పెరిగినప్పుడు డిమాండు OM నుంచి $OM_1$ కు తగ్గినది.

**3) ఏకత్వ ఆదాయ డిమాండు వ్యాకోచము** : ఆదాయములో వచ్చిన మార్పు డిమాండులో వచ్చిన మార్పు సమానంగా యుంటే దీనిని "ఏకత్వ ఆదాయ డిమాండు వ్యాకోచత్వం" అంటారు. దీని వ్యాకోచం ఒకటికి సమానంగా ఉంటుంది. దీనిని ఈ క్రింది పటంలో చూపినాము.




పై పటంలో ఆదాయంలో మార్పు ($II_1$) డిమాండులో మార్పు ($MM_1$) సమానంగా ఉన్నాయి.

**4) ఒకటి కన్నా ఎక్కువగా ఉండే ఆదాయ డిమాండు వ్యాకోచము :** ఆదాయంలో మార్పుకన్నా డిమాండులో మార్పు ఎక్కువగా వుంటే దానిని "ఒకటి కన్నా ఎక్కువగా ఉండే ఆదాయ డిమాండు వ్యాకోచము" అంటారు. దీని వ్యాకోచపు విలువ ఒకటి కన్నా ఎక్కువగా ఉంటుంది. దీనిని ఈ క్రింది పటంలో చూపినాము.




పై పటంలో ఆదాయంలో మార్పు ($II_1$) కన్నా డిమాండులో మార్పు ($MM_1$) ఎక్కువగా ఉన్నది.

**5) ఒకటి కన్నా తక్కువగా ఉండే ఆదాయ డిమాండు వ్యాకోచము :** ఆదాయంలో మార్పు కన్నా డిమాండులో మార్పు తక్కువగా ఉంటే దానిని "ఒకటి కన్నా తక్కువగా ఉండే ఆదాయ డిమాండు వ్యాకోచం" అంటారు. దీనిలో వ్యాకోచపు విలువ ఒకటి కన్నా తక్కువగా ఉంటుంది దీనిని ఈ క్రింది పటంలో చూపినాము.




పై పటంలో ఆదాయంలో మార్పు కన్నా డిమాండులో మార్పు తక్కువగా ఉన్నది.

**6) అనంతమైన ఆదాయ డిమాండు వ్యాకోచము :** ఆదాయంలోని కొద్ది మార్పు వల్ల డిమాండులో అనంతమైన మార్పు వచ్చినచో దానిని "అనంతమైన ఆదాయ డిమాండు వ్యాకోచము" అంటారు. దీనిలో వ్యాకోచపు విలువ అనంతంగా ఉంటుంది. దీనిని ఈ క్రింది పటంలో చూపినాము.




పై పటంలో డిమాండురేఖ X అక్షానికి సమాంతరంగా ఉన్నది.

## ప్రశ్న 8) జాత్యంతర డిమాండు వ్యాకోచత్వం (Cross Elasticity of demand)

లేదా

## ప్రత్యామ్నాయ వ్యాకోచత్వం (Elasticity of Substitution)

**జవాబు :** ఒక వస్తువుకున్న డిమాండు, దాని ధరపైనే కాక దానికున్న ప్రత్యామ్నాయ, పూరక వస్తువుల ధరలపై కూడా ఆధారపడి ఉంటుంది. వస్తువు ధర, వినియోగదారుల ఆదాయాలు స్థిరంగా ఉండి ప్రత్యామ్నాయ లేక పూరక వస్తువుల ధరలలో వచ్చిన మార్పు వల్ల ఆ వస్తువు యొక్క డిమాండులో వచ్చిన మార్పును "జాత్యంతర డిమాండు వ్యాకోచత్వం" అంటారు. ఉదాహరణకు, A,B లు రెండు ప్రత్యామ్నాయ లేక పూరక వస్తువులైనట్లయితే.

$$\text{జాత్యంతర డిమాండు వ్యాకోచత్వం} = \frac{\text{A వస్తువు డిమాండులో వచ్చిన అనుపాత మార్పు}}{\text{B వస్తువు ధరలో వచ్చిన అనుపాత మార్పు}}$$

A,Bలు ప్రత్యామ్నాయ వస్తువులైతే సామాన్యంగా జాత్యంతర డిమాండు వ్యాకోచత్వము విలువ సున్న, అనంతంల మధ్య ఉంటుంది. అలాకాక A,B లు పూరక వస్తువులైతే జాత్యంతర డిమాండు వ్యాకోచత్వం విలువ రు..త్మకంగా (-) ఉంటుంది. సమష్టి డిమాండు (Composite demand) ఉన్న వస్తువు...ం జాత్యంతర డిమాండు సున్న కాని, రుణాత్మకంగా కాని ఉంటుంది.

## ప్రశ్న 9) గిఫెన్ వైపరీత్యం అంటే ఏమిటి ?

**జవాబు :** పేదవారు ప్రధానముగా కొన్ని వస్తువులు కొంటూ ఉంటారు. ఉదాహరణకు, బియ్యం, రాగులు, జొన్నలు, సజ్జలు మొదలైనవి. వారి ఆదాయాలు తక్కువగా ఉండడం చేత వారు ఈ అత్యవసర వస్తువులను మాత్రమే కొనుక్కోగలుగుతారు. అంటే వారి ఆదాయంలో హెచ్చు భాగాన్ని ఈ అత్యవసర ఆహార పదార్థాల మీద వెచ్చిస్తారు. ఇంకా మిగిలిన కొద్ది ఆదాయాన్ని ఇతర వస్తువులపై వినియోగిస్తారు. అట్లాంటి ఆహార పదార్థముల ధరలు పెరిగితే, పేదవారు ఇతర వస్తువులపై చేసే ఆ తక్కువ ఖర్చును కూడా మానుకుని ఆ మేరకు ఆహార పదార్థములనే హెచ్చుగా కొంటారు. అందువల్ల అత్యవసర వస్తువులకు ధర పెరిగితే వాటి డిమాండు కూడా పెరుగుతుంది. అట్లాంటి వస్తువులను "నాసిరకము వస్తువులు" అంటారు. అంటే డిమాండు సిద్ధాంతం ఈ వస్తువుల విషయంలో వర్తించదన్నమాట. ఈ విషయాన్ని "సర్ రాబర్ట్ గిఫెన్" అన్న ఆర్థికవేత్త సూచించడం వల్ల దీనిని 'గిఫ్ఫెన్ వైపరీత్యం' అంటారు. ఈ వస్తువులను "గిఫెన్ వస్తువులు" అని కూడా అంటారు. గిఫెన్ వస్తువులకు డిమాండు రేఖ ఈ క్రింది పటంలో చూపినట్లుగా ఎడమ నుండి కుడికి పైకి వాలి ఉంటుంది.




పై పటంలో గిఫెన్ వస్తువులకు ధర OP నుంచి $OP_1$ కు పెరిగినందువలన వాటికి డిమాండు OM నుంచి $OM_1$ కు పెరిగింది. కనుక ఇది డిమాండు సిద్ధాంతానికి విరుద్ధము.

**ప్రశ్న 10) డిమాండు సూత్రం (Law of Demand)**

జవాబు : 2వ ప్రశ్నకిచ్చిన జవాబులో చూడండి.

**ప్రశ్న 11) బిందు వ్యాకోచ పద్ధతి (Point Elasticity of Demand)**

జవాబు : 3వ ప్రశ్నకిచ్చిన జవాబులో "బిందు వ్యాకోచ పద్ధతి" చూడండి.

**ప్రశ్న 12) "డిమాండు రేఖ వాలు, వ్యాకోచత్వం ఒకటిగా యుండదు" వివరించుము.**

జవాబు : డిమాండు వ్యాకోచపు విలువ డిమాండు రేఖ మీద ఒకే విధంగా యుండదు. వివిధ బిందువుల వద్ద వివిధ రకాలుగా ఉంటుంది. దీనిని ఈ క్రింది రేఖా పటంలో చూపినాము.



పై పటంలో AB డిమాండు రేఖ పొడవు 3 సెం.మీ. అనుకొందాము. P బిందువు AB డిమాండు రేఖపై మధ్యస్తంగా యున్నది. కనుక PB పొడవు PA పొడవు సమానంగా ఉంటాయి.

$$P \text{ బిందువు వద్ద వ్యాకోచం} = \frac{PB}{PA} = \frac{1\frac{1}{2}}{1\frac{1}{2}} = 1$$

$P_1$ బిందువు వద్ద దిగువ భాగము ($P_1B$) ఎగువ భాగం ($P_1A$) కన్నా తక్కువగా ఉన్నది. $P_1B$ సెం.మీ., $P_1A$ 2 సెం.మీ. అనుకుందాము. అప్పుడు:

$$P_1 \text{ బిందువుల వద్ద వ్యాకోచము} = \frac{P_1B}{P_1A} = \frac{1}{2} = .5$$

అంటే వ్యాకోచము ఒకటి కన్నా తక్కువ.

$P_2$ బిందువు వద్ద దిగువ భాగము ($P_2B$) ఎగువ భాగము ($P_2A$) కన్నా ఎక్కువగా ఉన్నది. అంటే $P_2B$ పొడవు 2 సెం.మీ., $P_2A$ పొడవు 1 సెం.మీ. అనుకుందాము. అప్పుడు $P_2$ వద్ద వ్యాకోచము $= \frac{P_2B}{P_2A} = \frac{2}{1} = 2$ అంటే వ్యాకోచము ఒకటి కన్నా ఎక్కువ.

$P_3$ వద్ద దిగువ భాగము ($P_3B$) సున్నాగా యున్నది. కనుక $P_3$ వద్ద వ్యాకోచము

$$= \frac{P_3B}{P_3A} = \frac{0}{3} = 0$$

$P_4$ వద్ద దిగువ భాగము ($P_4B$) పూర్తిగా యున్నది. ఎగువ భాగము లేదు. కనుక

$$P_4 \text{ వద్ద వ్యాకోచము} = \frac{P_4B}{P_4A} = \frac{3}{0} = \text{అనంతము.}$$

పై వివరణను బట్టి డిమాండు రేఖపైన వివిధ బిందువుల వద్ద డిమాండు వ్యాకోచత్వం వివిధ రకాలుగా ఉండునని తెలియుచున్నది. డిమాండు రేఖ X అక్షాన్ని కలిసే చోట వ్యాకోచత్వం సున్నాగా ఉంటుంది. Y అక్షాన్ని కలిసే చోట వ్యాకోచం అనంతంగా ఉంటుంది. అయితే డిమాండు రేఖ X అక్షానికి సమాంతరంగా యున్నప్పుడు, లంబ అతిపరావలయంగా యున్నప్పుడు వివిధ బిందువుల వద్ద వ్యాకోచము ఒకటిగానే యుంటుంది.



# అధ్యాయము 3

# ఉదాసీనతా వక్రరేఖా విశ్లేషణ

**ప్రశ్న 1) వినియోగదారుని సమతౌల్యాన్ని ఉదాసీన వక్రరేఖా విశ్లేషణ ద్వారా తెల్పుము. ప్రయోజన విశ్లేషణకన్న ఇది ఏ విధంగా మెరుగో వివరింపుము.**

**లేదా**

**ఉదాసీన వక్రరేఖా విశ్లేషణ ద్వారా వినియోగదారుని సమతౌల్యమును వివరింపుము.**

**లేదా**

**ఉదాసీనతా వక్రరేఖని నిర్వచించి, వినియోగదారుని సమతౌల్యమును ఉదాసీనతా వక్రరేఖల సహాయముతో వివరింపుము. (Important)**

జవాబు : 1881లో బ్రిటిష్ అర్థశాస్త్రవేత్త "ఎడ్జివర్త్" (Edgeworth) తన Mathematical Physics అనే గ్రంథంలో వస్తు వినిమయ సిద్ధాంతాన్ని రూపొందించడానికి ఉదాసీన వక్రరేఖా పద్ధతిని మొదటిసారిగా ప్రవేశపెట్టాడు. తర్వాత 1892లో "ఇర్వింగ్ ఫిషర్" (Irwing Fisher) ఈ పద్ధతికి ఒక స్పష్టమైన రూపాన్ని కల్పించటానికి కృషి చేశాడు. "పారెటో" (Pareto) 1906లో తన విలువ సిద్ధాంతాన్ని రూపొందించటానికి ఉదాసీన వక్రరేఖా పద్ధతినే ఆధారంగా తీసుకున్నాడు. ప్రొఫెసర్ "హిక్స్" (Hicks), "ఆర్.జి.డి. ఆలెన్" (R.G.D. Allan) ఉదాసీనతా వక్రరేఖా విశ్లేషణను శాస్త్రీయ పద్ధతిలో తీర్చిదిద్ది అభివృద్ధిపరిచాడు. అప్పటి నుండి అనేక ఆర్థిక సమస్యలకు ఈ పద్ధతిని విరివిగా ఉపయోగిస్తున్నారు.

**ప్రయోజన విశ్లేషణకు ప్రత్యామ్నాయ పద్ధతి :** ఒక వినియోగదారుడు తన పరిమిత ఆదాయాన్ని వివిధ కోర్కెలపై ఎలా కేటాయించి సమతౌల్య స్థితిని పొందుతాడో సమోపాంత ప్రయోజన సూత్రంద్వారా ప్రాచీన ఆర్థికవేత్తలు చెప్పారు. కాని ప్రయోజన విశ్లేషణలో అనేక లోపాలున్నాయి. అందులో ముఖ్యమైనవి :

**i) ప్రయోజనాన్ని కొలవవచ్చు :** ప్రయోజన విశ్లేషణ ప్రయోజనాన్ని కొలవవచ్చు అనే ప్రమేయంమీద ఆధారపడింది. ఇది సరికాదు. ప్రయోజనం తృప్తిని కల్గిస్తుంది. తృప్తి అనేది ఒక మానసిక భావన. కనుక దీన్ని కొలవటానికి వీలులేదు.

**ii) వస్తువు ప్రయోజనం దాని పరిమాణం మీదనే ఆధారపడి ఉంటుంది :** ప్రయోజన విశ్లేషణలో ఇది మరొక ప్రమేయం. ఇదికూడా సరికాదు. ప్రయోజనం ఇతర వస్తువులమీద ఆధారపడి ఉంటుంది.

పై లోపాలవల్ల ప్రయోజన విశ్లేషణకు ప్రత్యామ్నాయంగా ఉదాసీన వక్రరేఖా విశ్లేషణా పద్ధతి ప్రవేశపెట్టడం జరిగింది.

**ఉదాసీన వక్రరేఖా విశ్లేషణ (Indifference curve analysis) :** ఈ పద్ధతిలో వినియోగదారుడు ఒక సమయంలో ఒక వస్తువుపైగాక, వస్తు సముదాయంపై ఆసక్తి కలిగి ఉంటాడన్నది ముఖ్య ప్రమేయము. అందువల్ల ప్రతి వినియోగదారునికి రెండు లేదా అంతకన్న ఎక్కువ వస్తువులతో కూడిన అభిరుచి తరహా (Seals of preference) ఉంటుంది. కనుక వినియోగదారుడు ఈ అభిరుచి తరహా ననుసరించి వస్తువులను కొంటాడుకూడ. ఈ అభిరుచి తరహాను మార్కెట్ ధరలతో సంబంధం లేకుండానే వినియోగదారుడు ముందుగానే రూపొందించుకుంటాడు. మన విశ్లేషణను సూక్ష్మంగా ఉంచటానికై వినియోగదారుడు రెండు వస్తువులతో కూడిన అభిరుచి తరహాను కలిగి ఉన్నాడనుకుందాం. దీని ఆధారంగా వినియోగదారుడు వస్తువులను యిప్పుడు కొంటాడు.

**ఉదాసీనతా పట్టిక (Indifference Schedule) :** వినియోగదారుడు తన అభిరుచి తరహానుంచి సమాన సంతృప్తినిచ్చే వివిధ సముదాయాలను ఒక పట్టికలో చూడవచ్చు. ఈ పట్టికనే "ఉదాసీనతా పట్టిక" అంటారు. ఈ పట్టిక వినియోగదారు ఉదాసీనంగా ఉండే వివిధ వస్తు సముదాయాలను తెలియజేస్తుంది.

**ఉదాసీనతా పట్టిక**

| ఆపిల్స్ X | ఆరెంజీలు Y |
|---|---|
| 1 | 10 |
| 2 | 6 |
| 3 | 4 |
| 4 | 3 |

**ఉదాసీనతా వక్రరేఖ (Indifference curve) :** ఉదాసీనతా పట్టికలో చూపబడిన సముదాయాలన్ని వినియోగదారునికి సమాన సంతృప్తి నిచ్చేవే. ఈ సముదాయాలనే రేఖాపటంలో చూపితే ఉదాసీన వక్రరేఖ వస్తుంది.




**ఉదాసీనతా వక్రరేఖల పటం (Indifference Curve Map) :** ప్రతి వినియోగదారుని అభిరుచులు తెలియచేయడానికి అనేక ఉదాసీనతా వక్రరేఖలు ఉండవచ్చు. ఇలాంటి ఉదాసీనతా వక్రరేఖల సముదాయాన్ని "ఉదాసీనతా వక్రరేఖల పటం" అంటారు. ఒక మాదిరి ఉదాసీనతా వక్రరేఖల పటం క్రింద ఇవ్వబడింది.




పై పటములో ప్రతి ఉదాసీనతా వక్రరేఖకు కుడివైపు ఉండే ఉదాసీనతా వక్రరేఖ ఎక్కువ సంతృప్తి స్థాయిని తెలియచేస్తుంది. అయితే ఏ రేఖపైనైనా ఉండే వివిధ బిందువులు మాత్రం ఒకే సంతృప్తి స్థాయిని మాత్రం తెలియజేస్తాయి. పటంలో C2 కంటే 1C3 ఎక్కువ సంతృప్తి స్థాయిని, IC1 తక్కువ సంతృప్తి స్థాయిని తెలియచేస్తాయి.

**ప్రతిస్థాపనోపాంత రేటు (Marginal rate of Substitution) :** వినియోగదారుడు ఒక వస్తువు ఒక యూనిట్‌కు బదులు మరో వస్తువును ఏ రేటుతో వినియోగం

చేయటానికి ఇష్టపడతాడో తెలియచేసేది ప్రతిస్థాపనోపాంత రేటు. పై పట్టికలో మొదట 1 యూనిట్ Xకి బదులు 4 యూనిట్లు Y, తర్వాత Z యూనిట్ Xకు బదులు 2 యూనిట్లు Y, చివరకు 1 యూనిట్ X కు గాను 2 యూనిట్ Yతీసుకోవడానికి వినియోగదారుడు ఇష్టపడటం చూడవచ్చు. అంటే ప్రతిస్థాపనోపాంతరేటు క్షీణిస్తున్నదన్న మాట.

**వినియోగదారుని సమతౌల్యం (Consumers Equilibrium) :** ప్రయోజన విశ్లేషణ వలెనే, ఉదాసీనతా వక్రరేఖా విశ్లేషణ కూడ వినియోగదారుని సమతౌల్యస్థితి ఎలా నిర్ణయించబడేదీ తెలియచేస్తుంది. ఇందుకు ఈ క్రింది ప్రమేయాలు అవసరం.

**ప్రమేయాలు (Assumptions) :**

1. వినియోగదారుని అభిరుచులలోను, అలవాట్లలోను మార్పుండదు.
2. వినియోగదారుని ఆదాయంలో మార్పుండదు.
3. పరిశీలనలో ఉన్న వస్తువుల ధరలు మారకుండా ఉంటాయి.
4. పరిశీలనలో ఉన్న వస్తువులన్ని సజాతీయాలు, విభాజితాలు కూడ.
5. వినియోగదారు హేతుబద్ధంగా వ్యవహరిస్తాడు. అంటే గరిష్ట సంతృప్తిని పొందటానికి ప్రయత్నిస్తాడు

**ధరరేఖ లేక బడ్జెట్ రేఖ (Price Line or Budget Line) :** వినియోగదారుడు తన పరిమితమైన ఆదాయాన్ని ఖర్చుచేయడానికి తన అభిరుచి తరహా ననుసరించి ఉదాసీనతా వక్రరేఖల మ్యాపును తయారుచేస్తాడు. ఇందులో X వస్తువు X-అక్షంమీద, Y వస్తువు Y-అక్షంమీద చూపాలి. తన మొత్తం ఆదాయాన్ని పూర్తిగా X వస్తువు మీదనే ఖర్చుచేస్తే అతనికి X వస్తువు ఎంత పరిమాణం వస్తుందో తెలియచేసే బిందువును X అక్షంపై, మొత్తం ఆదాయాన్ని Y వస్తువుమీదనే ఖర్చుచేస్తే Y వస్తువు ఎంత పరిమాణంలో వస్తుందో తెలియచేసే బిందువును Y-అక్షంపైన గుర్తించి, ఆ రెండు బిందువులను కలిపితే ఒక సరళరేఖ (AB) వస్తుంది. దీన్ని "ధర రేఖ" (Price line) లేక "బడ్జెట్ రేఖ" (Budget line) అంటారు. ఈ బడ్జెట్ రేఖ అతడు పొందగలిగే వస్తువుల సముదాయములను తెలియచేస్తుంది. అందువల్ల దీన్ని "పెంచగలిగే సముదాయాల రేఖ" అని కూడ అంటారు. బడ్జెట్ రేఖ, ఉదాసీనతా వక్రరేఖల మ్యాప్ క్రింది పటంలో చూపబడినాయి.




ఈ బడ్జెట్ రేఖ ఏ ఉదాసీన వక్రరేఖకు స్పర్శరేఖ అవుతుందో, ఆ స్పర్శబిందువు వద్దనున్న వస్తు సముదాయాన్ని వినియోగదారుడు కొంటాడు. పటంలో బడ్జెట్ రేఖ 1C2 రేఖకు స్పర్శరేఖగా ఉంది. 1C3 ఎక్కువ సంతృప్తి స్థాయినిచ్చే ఉదాసీన రేఖ. కాని అది వినియోగదారుని ఆదాయంతో 1C2 స్థాయి సంతృప్తినే పొందగలడు. ఇదే అతని గరిష్ట స్థాయి సంతృప్తి. PM యూనిట్ల వస్తువు X, PN యూనిట్ల వస్తువు Y కొనుగోలు చేస్తే వినియోగదారుడు గరిష్ట సంతృప్తిని పొందగలడు. అంటే ఈ వస్తువు సముదాయం వద్దనే అతను సమతౌల్య స్థితిని చేరుతాడు.

స్పర్శ బిందువు P వద్ద బడ్జెట్ రేఖ వాలు, 1c2 ఉదాసీనతా వక్రరేఖ వాలు సమానము. ఉదాసీనతా వక్రరేఖ వాలు ప్రతిస్థాపనోపాంత రేటును, బడ్జెట్ రేఖ వాలు ధరల నిష్పత్తిని తెలియచేస్తాయి. కనుక ఈ రెండు పమానమన్నమాట.

అంటే $$MRSxy = \frac{Px}{py}$$

xyల ప్రతిస్థాపనోపాంత రేటు = x, y ల ధరల నిష్పత్తి.

ఇవి రెండూ సమానమైనప్పుడే వినియోగదారుడు సమతౌల్య స్థితిని చేరుతాడు. అంటే బడ్జెట్ రేఖ ఉదాసీన వక్రరేఖకు స్పర్శరేఖగా ఉండాలి. అవి రెండు స్పృశించిన బిందువు సూచించిన వస్తు సముదాయాన్ని కొనటం ద్వారా మాత్రమే వినియోగదారు సమతౌల్య స్థితిలో ఉండగలడు.

ప్రయోజన విశ్లేషణపై ఉదాసీనతా వక్రరేఖా విశ్లేషణ మెరుగైంది :

1. ఉదాసీనతా వక్రరేఖా విశ్లేషణలో ప్రయోజనం నెలకొల్పవచ్చు అనే ప్రమేయం లేదు. ఇందులో కార్డినల్ ప్రయోజనం అనే భావనకు బదులు ఆర్డినల్ ప్రయోజనం అనే భావన ఉపయోగించబడింది. అంటే వస్తువుల ప్రయోజనాన్ని నిర్దిష్టంగా కొలవలేకపోయినప్పటికి ఆ వస్తు సముదాయాల సంతృప్తి స్థాయిని మాత్రం పోల్చవచ్చు అనే భావనపై ఈ విశ్లేషణ రూపొందించబడింది.

2. కొలవడానికి వీలైన ప్రతిస్థాపనోపాంత రేటు, ధరల నిష్పత్తి సహాయంతో వినియోగదారుని సమతౌల్యాన్ని ఈ విశ్లేషణ వివరిస్తుంది.

3. ద్రవ్యం యొక్క ఉపాంత ప్రయోజనం స్థిరంగా ఉంటుందనే ప్రమేయం ఈ విశ్లేషణలో లేదు.

4. ప్రయోజన విశ్లేషణలో ఒక వస్తువు ప్రయోజనం దాని పరిమాణం మీదనే ఆధారపడి ఉంటుందనే ప్రమేయం ఉంది. ఇది నిజం కాదు. అందువల్ల ఈ విశ్లేషణలో అలాంటి ప్రమేయం లేదు. ఒక వస్తువు వలన వచ్చే సంతృప్తి మిగిలిన వస్తువుల పరిమాణంలో ముడిపడి ఉందని ఈ విశ్లేషణ చెబుతుంది.

5. వెనుక ఉదాసీనత వక్రరేఖా విశ్లేషణ వినియోగదారుని సమతౌల్యాన్ని అవాస్తవికమైన ప్రమేయాలతో నిమిత్తం లేకుండా, వాస్తవిక విషయాల నాధారంగా విశదీకరిస్తుంది.

విమర్శ : ఉదాసీనతా వక్రరేఖా విశ్లేషణ కూడా కొన్ని విమర్శలకు గురి అయింది. అవి :

1.వినియోగదారులందరికి వారికి కావలసిన ఉదాసీనతా పట్టికలన్నీ తెలిసి ఉంటాయనుకోవటం సరికాదు.

2.ఈ విశ్లేషణలో రెండు వస్తువులను కొనదలచినప్పుడే వినియోగదారుని ప్రవర్తనను అధ్యయనం చేయవచ్చు. రెంటికన్నా ఎక్కువ వస్తువులున్నప్పుడు ఇది చాలా కష్టం.

3.ఈ విశ్లేషణలో ప్రతిస్థాపనోపాంత రేటు క్షీణిస్తున్నది. ఇది ఎందుకు క్షీణిస్తుందో వివరించలేదు. వివరించటానికి క్షీణోపాంత ప్రయోజన సూత్రాన్నే చెప్పాల్సి వస్తుంది. అంటే ఉదాసీనతా వక్రరేఖా విశ్లేషణ కూడ మరో రకంగా చెప్పిన ప్రయోజన విశ్లేషణ అన్నమాట. అందుకే ఈ విశ్లేషణను 'కొత్త సీసాలో ఉంచిన పాత పానీయమే' (Old wine in new bottle) అన్నారు.

పైన చెప్పిన విమర్శలున్నప్పటికి ఉదాసీనతా వక్రరేఖా విశ్లేషణ ప్రయోజన విశ్లేషణకన్నా ఎంతో మెరుగైనదని అర్థికవేత్తలు అంగీకరించారు. దీనికి అర్థశాస్త్రంలో ప్రధాన స్థానం యిచ్చారు.

**ప్రశ్న 2) వినియోగదారుని ఉదాసీనతా వక్రరేఖా పటం నుండి అతని డిమాండ్ వక్రరేఖ ఎట్లు పొందగలమో వివరింపుము.**

**లేదా**

**ఉదాసీనతా వక్రరేఖల సహాయంతో డిమాండ్ రేఖను ఏ విధంగా పొందగలవు.**

**లేదా**

**వ్యక్తి డిమాండ్ వక్రరేఖ తన ఉదాసీనతా వక్రరేఖ మ్యాపు నుండి ఎట్లు పొందవచ్చునో రేఖా చిత్రం ద్వారా తెలుపుము.**

**(Very Important)**

జవాబు : డిమాండ్ విశ్లేషణకు అనేక సిద్ధాంతాలున్నాయి. అందులో ముఖ్యమైనవి రెండు. అవి :

1) ప్రయోజన విశ్లేషణ. 2) ఉదాసీన వక్రరేఖా విశ్లేషణ.

**1) ప్రయోజన విశ్లేషణ (Utility Analysis):** సంప్రదాయ ఆర్థికవేత్తలు (Classical economists) వినియోగదారుని ప్రవర్తనను, డిమాండును ప్రయోజన విశ్లేషణ ద్వారా తెలియజేశారు. ప్రతి వస్తువు వినియోగదారునికి కొలవగల ప్రయోజనాన్నిస్తుందని (measurable utility) ఈ విశ్లేషణలో ముఖ్యమైన ప్రమేయం. ఒక వస్తువు వినియోగం పెరిగినకొద్దీ దానినుండి లభించే ఉపాంత ప్రయోజనం క్షీణిస్తుందనే ప్రాథమిక సూత్రాన్ని (Law of Diminishing Marginal Utility) ప్రతిపాదించారు. దీని ఆధారంగా సమోపాంత ప్రయోజన సూత్రం అభివృద్ధి పరచబడింది.

క్షీణోపాంత ప్రయోజన సూత్రం, సమోపాంత ప్రయోజన సూత్రం వినియోగదారుని ప్రవర్తనను, డిమాండును విశదీకరిస్తాయి. ఒక వస్తువు ధర ఆ వస్తువు యిచ్చే ఉపాంత ప్రయోజనానికి అనుపాతంలో ఉంటుందని వీరు పేర్కొన్నారు. వస్తువు పరిమాణం పెరిగినకొద్దీ దానివలన వచ్చే ఉపాంత ప్రయోజనం తగ్గుతుంది గదా అందువల్ల వినియోగదారుడు వస్తువు ధరను తగ్గిస్తేకాని ఎక్కువ కొనటానికి యిష్టపడడు. ఈ విధంగా వస్తువు ధర తగ్గితే దాని డిమాండు పెరుగుతుందని, ధర పెరిగితే డిమాండు తగ్గుతుందని డిమాండు సూత్రాన్ని క్షీణోపాంత ప్రయోజన సూత్ర సహాయంతో విశదీకరించారు.

**ప్రయోజన విశ్లేషణ-లోపం :** ప్రయోజన విశ్లేషణ తీవ్రంగా విమర్శించబడింది. అందులో ఈ క్రింది లోపాలున్నట్లు పేర్కొనబడింది. అవి :

i) ప్రయోజనాన్ని కొలవవచ్చునే ప్రమేయం సరికాదు. ప్రయోజనాన్ని కొలవలేము.

ii) వస్తువు ప్రయోజనం దాని పరిమాణంమీదనే ఆధారపడి ఉంటుందనడం కూడ

సరికాదు. వస్తువు ప్రయోజనం ఇతర వస్తువుల పరిమాణాలపై కూడ ఆధారపడి ఉంటుంది.

iii) ధర మారినప్పుడు ఆదాయ, ప్రత్యామ్నాయ ప్రభావాలను పరిగణనలోనికి తీసుకోవటం లేదు. వాటిని కూడ పరిగణించవలె.

**ఉదాసీనతా వక్రరేఖా విశ్లేషణ (Indifference Curve Analysis) :** ప్రయోజన విశ్లేషణలో పై లోపాలున్న కారణంగా ప్రొఫెసర్ హిక్స్, అలెన్ మొదలైన ఆర్థికవేత్తలు ఉదాసీనతా వక్రరేఖా విశ్లేషణను ప్రవేశపెట్టారు. ఇది ప్రయోజన విశ్లేషణకు ప్రత్యామ్నాయము. ఈ పద్ధతిలో డిమాండు సూత్రాన్ని ధర-వినియోగరేఖ (price-consumption curve) తెలియచేస్తుంది.

**ధర - వినియోగ రేఖ :** క్రింది పటంలో X- అక్షంపైన వస్తువు Y- అక్షంపైన ద్రవ్యము చూపబడినాయి. AB ధరరేఖ.

పటంలో AB ఉదాసీన వక్రరేఖ IC ని P బిందువువద్ద స్పర్శిస్తున్నది. కనుక వినియోగదారుడు P వద్ద వస్తువు Xని OM యూనిట్లు కొంటూ సమతౌల్యస్థితిలో ఉంటాడు. ఇప్పుడు ఆదాయం స్థిరంగా ఉండి వస్తువు X ధర తగ్గితే కొత్త బడ్జెట్ రేఖ AB ఏర్పడుతుంది. ఈ రేఖ మునుపటికంటె ఎక్కువ సంతృప్తినిచ్చే IC1 ఉదాసీనత రేఖకు P వద్ద స్పర్శరేఖగా వుంది. అంటే వినియోగదారుడు ప్రస్తుతం OM1 యూనిట్లు Xను కొంటూ సమతౌల్య స్థితిలో ఉంటాడు. ఈ విధంగా X ధర తగ్గుతుంటే అనేక సమతౌల్య బిందువులు P P1 P2 - ఏర్పడతాయి. వీటన్నింటిని కలిపితే వచ్చే వక్రరేఖనే "ధర-వినియోగరేఖ" PCC (Price Consumption Curve) అంటారు. ఇది ఎడమ నుండి కుడికి క్రిందికి వాలుతుంది. ఇదే వినియోగదారుని డిమాండు రేఖకూడ. ఆయా ధరలవద్ద ఖర్చుచేసిన ద్రవ్యాన్ని, కొన్న వస్తు పరిమాణాన్ని ధర వినియోగరేఖ తెలియచేస్తుంది. పై వివరాల ఆధారంగా డిమాండ్ పట్టిక నొకదాన్ని తయారు చేయవచ్చు.



డిమాండు పట్టిక

| ధర | డిమాండు |
| --- | --- |
| $\frac{OA}{OB}$ | OM |
| $\frac{OA}{OB_1}$ | OM1 |
| $\frac{OA}{OB_2}$ | OM2 |

పై పట్టిక ఆధారంగా X-అక్షంమీద వస్తువు Xను, Y అక్షం మీద వస్తువు ధరను తీసికొని డిమాండు రేఖ నొకదాన్ని గీయవచ్చును. ఇది సాధారణ డిమాండు రేఖవలెనే ఎడమ నుండ కుడికి క్రిందికి వాలుతుంది.




వస్తువు ధర మారినప్పుడు ఆదాయ, ప్రత్యామ్నాయ ప్రభావాలు రెండూ కూడ ఉంటాయి. ధర తగ్గినప్పుడు నిజ ఆదాయం (Real Income) పెరిగినట్లు, అందువల్ల డిమాండు పెరుగుతుంది. దీన్ని "ఆదాయ ప్రభావం" (Income effect) అంటారు. అంతేగాక ధర ఎక్కువగా ఉన్న వస్తువు స్థానే ధర తగ్గిన వస్తువును కొంటాడు. దీన్ని "ప్రత్యామ్నాయ ప్రభావం" (Substitution effect) అంటారు. కనుక ఒక వస్తువు ధర మారినప్పుడు ఆదాయం, ప్రత్యామ్నాయ ప్రభావాల ఫలితంగా దాని డిమాండు మారుతుంది.

**ప్రయోజన విశ్లేషణపై ఉదాసీనతా వక్రరేఖా విశ్లేషణ యొక్క మెరుగుదల :** ఉదాసీనతా వక్రరేఖా విశ్లేషణ ప్రయోజన విశ్లేషణకన్న క్రింది విషయాలలో మెరుగు అని చెప్పవచ్చు. అవి :

1. ఉదాసీనతా వక్రరేఖా విశ్లేషణలో ప్రయోజనాన్ని కొలవవచ్చు అనే ప్రమేయం లేదు. వివిధ వస్తు సముదాయాల సంతృప్తి స్థాయిని పోల్చవచ్చనే భావన ఆధారంగా ఈ విశ్లేషణ రూపొందించబడింది.

2. ప్రయోజన విశ్లేషణలో ఒక వస్తువు ప్రయోజనం దాని పరిమాణం మీదనే ఆధారపడి ఉంటుందనే ప్రమేయం ఉంది. ఇది సరికాదు. ఒక వస్తువునుంచి పొందే తృప్తి ఇతర వస్తువుల పరిమాణంపై కూడా ఆధారపడుతుందని ఉదాసీనతా వక్రరేఖా విశ్లేషణ తెలియచేస్తుంది.

3. ఉదాసీనతా వక్రరేఖా విశ్లేషణ కొలవటానికి వీలైన ధరల నిష్పత్తి ప్రతి స్థాపనోపాంత రేటుల సహాయంతో వినియోగదారుని సమతౌల్యాన్ని వివరిస్తుంది.

4. వినియోగదారుని సమతౌల్యాన్ని ఉదాసీనతా వక్రరేఖా విశ్లేషణ అవాస్తవికమైన ప్రమేయాలు లేకుండా కొద్ది ప్రమేయాల ఆధారంగా విశదీకరిస్తుంది.

5. ప్రయోజన విశ్లేషణ గిఫ్ఫెన్ వైపరీత్యాన్ని డిమాండు సూత్రానికొక మినహాయింపుగా పేర్కొంది. కాని ఉదాసీనతా వక్రరేఖా విశ్లేషణ గిఫ్ఫెన్ వైపరీత్యానికి కారణాన్ని చెబుతున్నది. వస్తువు ధర తగ్గినప్పుడు ఆదాయ ప్రభావంకన్నా, ప్రత్యామ్నాయ ప్రభావం ఎక్కువగా ఉంటే ఆ వస్తువు డిమాండు పెరగదు.

**ఉదాసీనతా వక్రరేఖా విశ్లేషణపై విమర్శ :** ఉదాసీనతా వక్రరేఖా విశ్లేషణ ప్రయోజన విశ్లేషణకన్నా ఎంతో మెరుగైనదైనప్పటికి, ఇదికూడ క్రింది అంశాలపై విమర్శించబడింది. అవి :

1. వినియోగదారునికి తనకు కావలసిన ఉదాసీనతా పట్టికలన్నీ తెలిసి ఉంటాయనే భావన సరికాదు. ఈ భావన పూర్తిగ ఊహాజనితమైనది.

2. ఈ విశ్లేషణ ప్రతిస్థాపనోపాంత రేటు క్షీణిస్తుందని చెబుతుంది. అలా క్షీణించటానికి కారణమేమిటో చెప్పదు. ప్రతిస్థాపనోపాంత రేటు క్షీణించటానికి క్షీణోపాంత ప్రయోజన సూత్రమే కారణమని చెప్పవలసి వస్తుంది. అంటే ఈ విశ్లేషణకూడ మరో విధంగా ప్రయోజన విశ్లేషణే అవుతుంది.

**ఆధునిక సిద్ధాంతాలు :** వినియోగదారుని ప్రవర్తనను అధ్యయనం చేయటానికి ఉదాసీన వక్రరేఖా విశ్లేషణయే కాక మరి కొన్ని సిద్ధాంతాలు కూడ ప్రతిపాదించబడ్డాయి. అవి :

**1) శామ్యూల్‌సన్ రివీల్డ్ ప్రిఫరెన్స్ (Revealed Preference) సిద్ధాంతం:** వినియోగదారునికి సమాన సంతృప్తినిచ్చే వివిధ సముదాయాలు తెలిసి ఉంటాయనే ప్రమేయం మీద ఉదాసీనతా వక్రరేఖా విశ్లేషణ వినియోగదారుని ప్రవర్తనను అధ్యయనం చేస్తుంది. కాని ఇది అవాస్తవికం. అందువల్ల ఇలాంటి ప్రమేయం లేకుండానే

శామ్యూల్‌సన్ ఒక సిద్ధాంతాన్ని ప్రతిపాదించాడు. ఇతని అభిప్రాయంలో ఊహలని బట్టికాక మార్కెట్‌లో వినియోగదారుని వాస్తవిక ప్రవర్తననుబట్టి ఒక వ్యక్తి యొక్క కొనుగోలు విధానాన్ని నిర్ణయింపవలె.

2) అరమ్‌స్ట్రాంగ్ మార్జినల్ ప్రిఫరెన్స్ (Marginal Preference) సిద్ధాంతం: వివిధ వస్తు సముదాయాల మధ్య అభిరుచిలో తేడా ఉంటుందని, దాన్ని బట్టి వినియోగదారుడు కోరే వివిధ సముదాయాలను నిర్ణయించవచ్చని అరమ్‌స్ట్రాంగ్ అభిప్రాయం. అభిరుచిలో తేడావలన వివిధ సముదాయాలుంటాయి. కనుక ఉపాంత అభిరుచినిబట్టి వినియోగదారుని కొనుగోలు విధానాన్ని నిర్ణయించవలె.

**ప్రశ్న 3) ఉదాసీనతా వక్రరేఖల లక్షణాలను పేర్కొనుము.**

**లేదా**

**ఉదాసీన వక్రరేఖల లక్షణాలను రేఖా పటముల సహాయముతో వివరింపుము. (Important)**

**జవాబు : 1) ఎడమనుంచి కుడికి క్రిందికి వాలి ఉంటాయి (Slopes downwards from left to right):** ఉదాసీనతా వక్రరేఖలు ఎల్లప్పుడు ఎడమనుంచి కుడికి క్రిందికి వాలుతూనే ఉంటాయి. క్రిందికి వాలి ఉండని పక్షంలో అవి పైకిపోతూ అన్నా ఉండాలి లేదా నిలువుగా గాని, అడ్డంగా కాని ఉండాలి. ఎడమనుండి కుడికి పైకిపోతూ ఉన్నట్లయితే ఒక సముదాయంకన్నా రెండవ సముదాయంలో రెండు వస్తువులు ఎక్కువ పరిమాణంలో ఉంటాయి. అప్పుడు ఆ రెండు సముదాయాలు అతనికి సమాన సంతృప్తిని ఇవ్వవు. రెండవ సముదాయం కన్న ఎక్కువ సంతృప్తి నిస్తుంది. కాని ఉదాసీన వక్రరేఖపై ఉన్న ప్రతి బిందువు సూచించే సముదాయం సమాన సంతృప్తినే ఇవ్వాలి. కాబట్టి ఎడమనుండి కుడికి పైకి పోవు వక్రరేఖను "ఉదాసీన వక్రరేఖ" అని అనడానికి వీలులేదు. దీన్నే క్రింది పటం Aలో చూడవచ్చు.






ఉదాసీన వక్రరేఖ పై పటం Bలో చూపినట్లు అడ్డంగా అంటే X అక్షానికి సమాంతరంగా అంటే మొదటి సముదాయంలో కన్నా రెండవ సముదాయంలో X వస్తువు పరిమాణం పెరిగింది. అయితే Y వస్తువు పరిమాణం మాత్రం తగ్గలేదు. కనుక మొదటి సముదాయం కంటే రెండవ సముదాయమే ఎక్కువ సంతృప్తినిస్తుంది. కాని ఒకే ఉదాసీన వక్రరేఖ పైన వివిధ సంతృప్తి స్థాయిలుండవు. అంటే ఇదికూడ ఉదాసీన వక్రరేఖ కాదన్నమాటే. ఇదే విధంగా నిలువుగా ఉన్న రేఖ కూడ ఉదాసీన వక్రరేఖ అవదు. అందువల్ల ఉదాసీన వక్రరేఖలు ఎల్లప్పుడు ఎడమ నుండి కుడికి క్రిందికి వాలుతూనే ఉంటాయి. అంతేగాని మరేవిధంగాను ఉండవు.

**2) మూల బిందువుకు కుంభాకారంలో ఉంటాయి (Convex to the origin):** ఉదాసీన వక్రరేఖల మరో లక్షణం అవి ఎప్పుడు మూల బిందువుకు కుంభాకారంలో ఉంటాయి. ఉదాసీనతా. వక్రరేఖా విశ్లేషణ ప్రతిస్థాపనోపాంత రేటు క్షీణిస్తుందనే ప్రమేయంపై ఆధారపడింది. అంటే ఒక వస్తువు ప్రతి అదనపు యూనిట్‌ని పొందడంకోసం రెండవ వస్తువును కోల్పోయే పరిమాణం క్రమంగా క్షీణిస్తుంది. ఈ పరిస్థితిని తెలియచేయాలంటే ఉదాసీనతా వక్రరేఖ క్రింది పటములో చూపినట్లు మూల బిందువుకు కుంభాకారంలోనే వుండవలె.




అలాకాక క్రింది పటంలోచూపినట్లు, పుటాకారంలో ఉంటే ప్రతిస్థాపనోపాంత రేటు పెరుగుతుంది. అది ఉదాసీనతా వక్రరేఖ సిద్ధాంతానికే విరుద్ధం. కనుక పుటాకారంగా ఉండటానికి వీలులేదు.




**3) ఒకదాని నొకటి ఖండించుకోవు (No two indifference curves cut each other) :** ఒక ఉదాసీనతా వక్రరేఖ సమానస్థాయి సంతృప్తినిచ్చే వివిధ సముదాయాలను తెలియచేస్తుంది. ఇంతకంటె ఎక్కువ సంతృప్తి స్థాయిని తెలియచేసే ఉదాసీన వక్రరేఖ దీనికి కుడివైపున ఉంటుంది. అదే విధంగా తక్కువ స్థాయి సంతృప్తిని సూచించే ఉదాసీనతా రేఖ మొదటి రేఖకు ఎడమగా ఉంటుంది. దీన్నే క్రింది పటంలో చూడవచ్చు.




పటంలో IC2 కంటే IC3 ఎక్కువ సంతృప్తి స్థాయిని IC1 తక్కువ సంతృప్తి స్థాయిని తెలియచేస్తాయి. పైన చూపిన విధంగాకాక ఉదాసీనతా వక్రరేఖలు క్రింది

పటంలో చూపినట్లు ఒకదానికొకటి ఖండించుకొంటే, ఖండన బిందువు C వద్ద రెండూ సమాన సంతృప్తి స్థాయిని తెలియచేస్తాయి. కాని ఏ రెండు ఉదాసీనతా వక్రరేఖలు ఒకే స్థాయి సంతృప్తిని తెలియచేయవు. ఎందుకంటే కుడి ప్రక్కన ఏర్పడే ఉదాసీన వక్రరేఖలు రెండు వస్తువుల ఎక్కువ పరిమాణాన్ని సూచిస్తాయి. రెండు వస్తువుల పరిమాణం పెరిగినప్పుడు ఆ సముదాయంనుంచి వచ్చే సంతృప్తి కూడా పెరుగుతుంది. అదే విధంగా ఎడమ ప్రక్క ఉండే ఉదాసీనతా వక్రరేఖలు వస్తువుల తక్కువ పరిమాణాన్ని సూచిస్తాయి.




వస్తువుల పరిమాణం తగ్గినప్పుడు రెండు ఉదాసీనతా వక్రరేఖలు ఒకే స్థాయి సంతృప్తిని తెలియచేయటానికి వీలులేదు. అంటే అవి ఎట్టి పరిస్థితులలోను ఖండించుకోటానికి వీలులేదు.

**4) ఉదాసీనతా వక్రరేఖలు X- అక్షాన్ని గాని, Y- అక్షాన్ని గాని తాకవు :** ఉదాసీన వక్రరేఖ ఒక వినియోగదారుని రెండు వస్తువులపై గల అభిరుచి తరహాను సూచిస్తుంది. కనుక ఉదాసీన వక్రరేఖపై ఉండే ఏ బిందువైన రెండు వస్తువుల పరిమాణాన్ని సూచిస్తాయి. ఈ రేఖ X-అక్షాన్ని తాకిందంటే Y-వస్తువు పరిమాణం శూన్యం అన్నమాట. అదే విధంగా Y- అక్షాన్ని తాకినప్పుడు X-వస్తువు పరిమాణం శూన్యం అవుతుంది. ఉదాసీన వక్రరేఖా విశ్లేషణలో వినియోగదారుడు వస్తువులను కొంత పరిమాణంలో కొంటాడనే ప్రమేయం ఉంది. కనుక ఉదాసీనతా వక్రరేఖ X- అక్షాన్నిగాని, Y-అక్షాన్నిగాని తాకటం అసలు ఉదాసీనతా వక్రరేఖా విశ్లేషణకే విరుద్ధం. అందువల్ల అవి X-అక్షాన్నిగాని, Y- అక్షాన్నిగాని తాకవు. దీనిని ఈ క్రింది రేఖా పటంలో చూపినాము.




పై పటంలో ఉదాసీనత వక్రరేఖ X అక్షాన్ని B బిందువు వద్ద తాకుతుంది. అంటే వినియోగదారుడు పూర్తిగా X వస్తువును కొంటున్నాడని అర్థము. అలాగే ఉదాసీనత వక్రరేఖ Y అక్షాన్ని A బిందువువద్ద తాకుతుంది. అంటే వినియోగదారుడు Y వస్తువును పూర్తిగా కొంటున్నట్లు అర్థము. కనుక యిది సిద్ధాంతానికి పూర్తిగా విరుద్ధము.

**5) పూర్తి ప్రత్యామ్నాయాలకు ఉదాసీనతా వక్రరేఖ 45° కోణంలో సరళరేఖగా ఉంటుంది :** పరిమాణంలో ఉన్న రెండు వస్తువులు ఒకదానికొకటి పూర్తి ప్రత్యామ్నాయాలైతే వాటి ప్రతిస్థాపనోపాంత రేటు స్థిరంగా ఉంటుంది. అందువల్ల ఉదాసీనతా వక్రరేఖ 45o కోణంలో సరళరేఖగా ఉంటుంది.

**6) ఉదాసీనతా వక్రరేఖలు సమానాంతరంగా ఉండకపోవచ్చు :** ఉదాసీనతా వక్రరేఖల వాలు ప్రతిస్థాపనోపాంత రేటుపై ఆధారపడుతుంది. కనుక ఉదాసీనతా వక్రరేఖలు ఒకదానికొకటి సమానాంతరంగా ఉండనవసరం లేదు.

**7) కుడివైపు ఉదాసీనతా రేఖ ఎక్కువ సంతృప్తిని తెలియజేస్తాయి :** కుడివైపు యున్న ఉదాసీనత వక్రరేఖలు హెచ్చు సంతృప్తి స్థాయిని, ఎడమవైపుయున్న రేఖలు తక్కువ సంతృప్తి స్థాయిని తెలియజేస్తాయి. దీనిని ఈ క్రింది పటంలో చూపినాము.




పై పటంలో IC1కన్నా IC2 ఎక్కువ సంతృప్తిని, IC3 IC1, IC2 కన్నా యింకా ఎక్కువ సంతృప్తి స్థాయిని తెలియచేస్తాయి.

**ప్రశ్న 4) ఉదాసీనతా వక్రరేఖా విశ్లేషణయొక్క ఉపయోగమును చర్చింపుము**

**లేదా**

**ఉదాసీనతా వక్రరేఖా విశ్లేషణ సాధించిన విషయాలను విమర్శనాత్మకంగా మదింపు చేయుమని.**

**జవాబు :** ప్రయోజన విశ్లేషణలో లోపాలున్న కారణంగా దానికి ప్రత్యామ్నాయంగా ప్రొఫెసర్ "హిక్స్" (Prof. Hicks) "అలెన్" (R.G.D. Allen) లు ఉదాసీనతా వక్రరేఖా విశ్లేషణను అభివృద్ధిపరచారు. ఈ విశ్లేషణ వినియోగదారుని ప్రవర్తనను అధ్యయనం చేయటానికేగాక అనేక యితర రంగాలలో కూడ ఉపయోగపడుతున్నది.

**ఉదాసీనతా వక్రరేఖా విశ్లేషణ ఉపయోగాలు :**

**1) వినియోగం (Consumption) :** వినియోగంలో వినియోగదారుని ప్రవర్తనను అధ్యయనం చేయటానికి ఉదాసీనతా వక్రరేఖా విశ్లేషణ ఉపయోగపడుతున్నది.

i) వినియోగదారుని సమతౌల్యాన్ని విశ్లేషణ చేయటానికి ప్రయోజన విశ్లేషణకు బదులుగా ఉదాసీనతా వక్రరేఖా విశ్లేషణను ఆధునిక ఆర్థికవేత్తలు ఉపయోగిస్తున్నారు. ధరల నిష్పత్తి, ప్రతిస్థాపనోపాంతరేటు ఈ రెండూ సమానమైనప్పుడు వినియోగదారుడు సమతౌల్య స్థితిలో ఉంటాడని ఈ విశ్లేషణ చెబుతుంది.

ii) డిమాండు సూత్రాన్ని ఉదాసీనతా వక్రరేఖా విశ్లేషణ విశదీకరిస్తుంది. వస్తువు ధర తగ్గినప్పుడు ఆదాయ, ప్రత్యామ్నాయ ప్రభావాల ఫలితంగా డిమాండు పెరుగుతుందని ఈ విశ్లేషణ విశదీకరిస్తున్నది. ఉదాసీన వక్రరేఖల నుండి ధర-వినియోగరేఖను పొందవచ్చు. ఇదే డిమాండు రేఖ.

iii) వినియోగదారుని మిగులు కూడ ఉదాసీనతా వక్రరేఖల సహాయంతో కొలవవచ్చు.

**2) ఉత్పత్తి (Production) :** ఉత్పత్తిదారుని సమతౌల్యాన్ని విశ్లేషణ చేయటానికి ఉదాసీనతా వక్రరేఖా విశ్లేషణ ఉపయోగింపబడుతున్నది. ఉత్పత్తిలో దీన్ని "సమోత్పాదకరేఖ" (Isoquant curve) అంటారు. ఒకే ఉత్పత్తి నిచ్చే రెండు ఉత్పత్తికారకాల సముదాయాన్ని యిది తెలుపుతుంది. మార్కెట్‌లో ఉత్పత్తి కారకాల ధరలను బట్టి ఏ సముదాయాన్ని ఉపయోగిస్తే ఉత్పత్తి వ్యయం కనీసస్థాయిలో వుంటుందో ఆ సముదాయాన్ని ఉత్పత్తిదారుడు దీని ఆధారంగా ఎంపిక చేసుకోగలుగుతాడు. ఈ విధంగా ఉత్పత్తి రంగంలో కూడ ఉదాసీనతా వక్రరేఖా విశ్లేషణ ఉపయోగించబడుతున్నది.

**3) వినిమయం (Exchange) :** వినిమయ విశ్లేషణలో కూడ ఉదాసీనతా వక్రరేఖా విశ్లేషణ ఉపయోగపడుతుంది. ఇద్దరు వ్యక్తులు తమ వస్తువులను ఎలా వినిమయం చేసుకుంటారో ఎడ్జివర్త్ (Edgeworth) ఉదాసీనతా వక్రరేఖా విశ్లేషణ ద్వారా తెలియచేశాడు.

**4) పన్నులు (Taxes):** పన్నుల వల్ల కలిగే శ్రేయో ఫలితాలను ఉదాసీనతా వక్రరేఖా విశ్లేషణ ద్వారా చేయవచ్చు. ప్రత్యక్ష పన్నులకన్నా పరోక్ష పన్నులు వ్యక్తి శ్రేయస్సును ఎక్కువగా తగ్గించగలవని ఉదాసీనతా వక్రరేఖా విశ్లేషణ తెలియజేస్తుంది.

**5) ధరల-నియంత్రణ (Price control) :** ధరల నియంత్రణ కొరతగా ఉన్న వస్తువుల రేషనింగ్ మొదలైనవాటి విషయంలో కూడా ఉదాసీనతా వక్రరేఖా విశ్లేషణ నుపయోగించవచ్చు.

**6) పొదుపు (Savings) :** ప్రస్తుత వస్తువులకు, భవిష్యత్ వస్తువులకు మధ్య ఉండే అభిరుచి (Preference) ఉదాసీనతా వక్రరేఖల నుండి తెలుస్తుంది. దీన్నిబట్టి వ్యక్తి యొక్క పొదుపును అంచనా వేయవచ్చు.

**7) అంతర్జాతీయ వ్యాపారం (International Trade) :** అంతర్జాతీయ వ్యాపారంలో వచ్చే లాభాన్ని నిర్ణయించటానికి కూడ ఈ ఉదాసీనతా వక్రరేఖా విశ్లేషణ ఉపయోగపడుతుంది.

**8) సూచీ సంఖ్యలు (Index Numbers) :** వివిధ ధరల స్థాయిలలో వివిధ కాలాలలో వినియోగదారుని జీవన ప్రమాణాన్ని తెలుసుకోటానికి ఈ ఉదాసీనతా వక్రరేఖా విశ్లేషణను ఉపయోగించవచ్చు.

**9) సబ్సిడీ ఫలితం (Result of Subsidy) :** ప్రభుత్వం కొన్ని వస్తువులపై సబ్సిడి ఇచ్చినప్పుడు వినియోగదార్లు ఎంత లాభాన్ని పొందగలరో తెలుసుకోటానికి ఉదాసీనతా వక్రరేఖా విశ్లేషణ ఉపయోగపడుతుంది.

**10) శ్రామిక సప్లయ్ (Supply of Labour) :** శ్రామిక సప్లయ్ శ్రామికుల ఆదాయం, విశ్రాంతిల మధ్య వారికి ఉండే అభిరుచి మీద ఆధారపడి ఉంటుంది. కనుక ఉదాసీనతా వక్రరేఖా విశ్లేషణద్వారా వారి అభిరుచిని తెలుసుకొని శ్రామిక సప్లయ్‌ని నిర్ణయించవచ్చు.

ఈ విధంగా ఉదాసీనతా వక్రరేఖా విశ్లేషణ ఆర్థిక రంగంలో అనేక సమస్యల విశ్లేషణకు ఉపయోగపడుతున్నది.

**ప్రశ్న 5) "ఆదాయ వినియోగ రేఖ" అంటే ఏమిటో వివరించండి.**

**జవాబు : ఆదాయ వినియోగ రేఖ (Income-Consumption Curve) :** వినియోగదారుని సమతౌల్యాన్ని అధ్యయనం చేసేటప్పుడు అతని ఆదాయం వస్తువుల ధరలు స్థిరంగా ఉంటాయని ఊహించబడినాయి. కాని అవి అలా స్థిరంగా ఉండకపోవచ్చు. ధరలు స్థిరంగా ఉండి ఆదాయంలో మార్పువస్తే కలిగే ఫలితాలను "ఆదాయ ప్రభావం" (Income effect) అంటారు. వీటిని ఆదాయ-వినియోగ రేఖ తెలియచేస్తుంది.

ఇవ్వబడిన ఆదాయాన్నంతటిని X-Y వస్తువులలో పూర్తిగా ఏ ఒక్క వస్తువుపైన ఖర్చుచేస్తే ఆ వస్తువు పరిమాణంలో మార్పు వస్తుందో X-అక్షంపైన, Y-అక్షంపైన ఆ బిందువులను గుర్తించి వాటిని కలిపితే వచ్చే రేఖను "బడ్జెట్ రేఖ" అంటారు. దీన్ని "ధరరేఖ" (Price line) అని కూడా అంటారు.

ఆదాయం పెరిగినప్పుడు ఈ బడ్జెట్ రేఖ కుడివైపుకు జరుగుతుంది. అంటే యిప్పుడు రెండు వస్తువులను ఎక్కువ పరిమాణంలో కొనవచ్చన్నమాట. ఇదే విధంగా ఆదాయం తగ్గినప్పుడు బడ్జెట్ రేఖ ఎడమవైపుకు జరుగుతుంది. అప్పుడు రెండు వస్తువులను తక్కువ పరిమాణంలోనే కొనగలుగుతాము. ధరలు స్థిరంగా వున్నాయి గనుక కొత్త బడ్జెట్‌రేఖ వాలు, పాత బడ్జెట్‌రేఖ వాలు సమానంగానే ఉంటుంది. అయితే కుడివైపుకు జరిగిన కొత్త బడ్జెట్ రేఖ హెచ్చు సంతృప్తి స్థాయిని తెలియచేసే ఉదాసీనతా వక్రరేఖకు స్పర్శరేఖగా ఉంటుంది. అంటే ఆదాయం పెరిగినప్పుడు వినియోగదారుడు ఎక్కువ సంతృప్తిని పొందుతూ సమతౌల్యస్థితిలో ఉంటాడు. ఈ విధంగా ఆదాయం మారినప్పుడల్లా వినియోగదారుని సమతౌల్య స్థితి మారుతుంటుంది. దీన్నే క్రింది పటంలో చూడవచ్చు.

క్రింది పటంలో వినియోగదారుడు మొదట IC1 పై P బిందువువద్ద సమతౌల్య స్థితిలో ఉన్నాడు. ఆదాయం పెరగటంవల్ల నూతన బడ్జెట్ రేఖ ఏర్పడి, ఇది IC2 కు P1 వద్ద స్పర్శరేఖగా ఉంది. అంటే వినియోగదారుడు ఇప్పుడు P1 వద్ద సమతౌల్య స్థితిలో ఉంటాడు. ఇంకా ఆదాయం పెరిగితే P11 వద్ద సమతౌల్య స్థితిలో, ఈ విధంగా ఆదాయంలో వచ్చిన మార్పుల కనుగుణ్యంగా సమతౌల్య స్థితిలో మార్పులు వస్తాయి. వివిధ ఆదాయాలకు సంబంధించిన సమతౌల్య స్థితి బిందువులను కలుపగా వచ్చే రేఖలను "ఆదాయ-వినియోగ రేఖ" (Income Consumption Curve) ICC అంటారు. ఈ రేఖ వినియోగదారుని ఆదాయంలో వచ్చే మార్పుకు తదనుగుణ్యంగా వినియోగంలో వచ్చే మార్పులకు ఉన్న సంబంధాన్ని తెలియచేస్తుంది. అంటే ఆదాయ ప్రభావాన్ని ఈ రేఖ తెలియచేస్తుంది. సాధారణంగా ఆదాయ వినియోగ రేఖ ఎడమనుంచి కుడికి పైకి పోతుంది.




ఈ రేఖ ఆధారాన్ని బట్టి వస్తువుల స్వభావాన్ని తెలుసుకోవచ్చు. ఆదాయం పెరిగినకొద్దీ వస్తువులను ఎక్కువ పరిమాణములో కొంటే ఆ వస్తువులు మేలురకం వస్తువులనీ, (Superior goods) తక్కువ పరిమాణంలో కొంటే నాసిరకం వస్తువులనీ (Inferior goods) గ్రహించాలి. కనుక ఆదాయ-వినియోగ రేఖ ముఖ్యంగా రెండు విధాలా ఉపయోగపడుతుంది.

i) **ఆదాయ ప్రభావాన్ని తెలుసుకోవడానికి.**

ii) **వస్తువుల స్వభావాన్ని తెలుసుకోవడానికి.**

ఆదాయము పెరిగేకొద్దీ ఒక వస్తువును ఎక్కువ పరిమాణంలో కొంటే ఆ వస్తువు "మేలురకపు వస్తువు" అని, తక్కువ పరిమాణంలో కొంటే "తక్కువ రకపు వస్తువు" అని అంటాము. ఉదా॥ X వస్తువు తక్కువ రకపు వస్తువు అని, Y వస్తువు మేలురకపు వస్తువు అని అనుకున్నప్పుడు ఆదాయ వినియోగ రేఖ ఈ క్రింది విధంగా యుంటుంది.



పై పటంలో ఆదాయ వినియోగ రేఖ Y అక్షంవైపు వంగియున్నది. అంటే ఆదాయం పెరిగేకొద్దీ Y వస్తువును ఎక్కువ పరిమాణంలో కొంటున్నట్లు తెలుస్తుంది. X వస్తువును తక్కువగా కొంటున్నాడు. కనుక X వస్తువు తక్కువ రకపు వస్తువు, Y మేలురకపు వస్తువు అని తెలియుచున్నది.

X వస్తువు మేలురకపు వస్తువు, Y వస్తువు తక్కువరకపు వస్తువు అయినప్పుడు ఆదాయ వినియోగ రేఖ ఈ క్రింది విధంగా యుంటుంది.




పై పటంలో ఆదాయం పెరిగేకొద్దీ X వస్తువును ఎక్కువగా కొంటున్నట్లు తెలుస్తుంది. కనుక X వస్తువు మేలురకపు వస్తువు అని, Y వస్తువును తక్కువగా కొంటున్నాడు, కనుక Y వస్తువు తక్కువ రకపు వస్తువు అని తెలియుచున్నది.

**ప్రశ్న 6) ధర - వినియోగరేఖ (Price-Consumption Curve) అంటే ఏమిటో వివరించండి.**

**లేదా**

**వినియోగదారుని సమతౌల్యంపై ధర మార్పు ప్రభావాన్ని ఉదాసీన వక్రరేఖల సహాయంతో విశ్లేషించండి.**

**జవాబు :** వినియోగదారుని సమతౌల్యాన్ని అధ్యయనం చేసేటప్పుడు అతని ఆదాయం వస్తువుల ధరలు స్థిరంగా ఉంటాయని ఊహించబడ్డాయి. కాని యివి స్థిరంగా ఉండకపోవచ్చు. ఆదాయం స్థిరంగా వుండి ఒక వస్తువు ధర మాత్రమే మారితే కలిగే ఫలితాలను "ధర ప్రభావం" (Price effect) అంటారు. వీటిని ధర-వినియోగ రేఖ తెలియచేస్తుంది.

ఇవ్వబడిన ఆదాయాన్నంతటిని X, Y వస్తువులలో పూర్తిగా ఏ ఒక్క వస్తువుపైన ఖర్చు చేస్తే ఆ వస్తువు ఎంత పరిమాణంలో వస్తుందో X - అక్షము Y - అక్షంపై గుర్తించి ఆ బిందువులను కలిపితే వచ్చే రేఖను "బడ్జెట్ రేఖ" అంటారు. దీన్నే "ధర రేఖ" (Price line) అనికూడా అంటారు. వస్తువు ధర మారినప్పుడల్లా ఈ బడ్జెట్ రేఖ మారుతుంది. దీన్నే క్రింది పటంలో చూడవచ్చు.




బడ్జెట్ రేఖ ఉదాసీనతా వక్రరేఖ IC కి P వద్ద స్పర్శరేఖగా ఉంది. కనుక వినియోగదారుడు P వద్ద OM యూనిట్లు వస్తువు X ను కొంటూ సమతౌల్య స్థితిలో ఉన్నాడు. ఆదాయం, Y వస్తువు ధర స్థిరంగా ఉండి X వస్తువు ధర తగ్గటం వలన కొత్త బడ్జెట్ రేఖ ఏర్పడింది. ఈ రేఖ మునుపటి కంటె ఎక్కువ సంతృప్తినిచ్చే ఉదాసీనతా వక్రరేఖ IC1 కు P1 వద్ద స్పర్శరేఖగా ఉంది. అంటే వినియోగదారుడు ఇప్పుడు P1 వద్ద సమతౌల్య స్థితిలో ఉంటాడు. ధర తగ్గిన కారణంగా X వస్తువును ఎక్కువ పరిమాణంలో కొంటున్నాడు. ఆ మేరకు Y వస్తువును కొంత తగ్గిస్తున్నాడు. ఈ విధంగా X వస్తువు ధర యింకా తగ్గినకొద్దీ $P_2$ సమతౌల్య బిందువులు ఏర్పడతాయి. ఈ సమతౌల్య బిందువులన్నింటిని కలిపితే వచ్చే రేఖనే "ధర-వినియోగరేఖ" (Price Consumption curve - .PCC) అంటారు. ఇది ఎడమనుండి కుడికి క్రిందికి వాలుతుంది. దీని ఆధారంగా డిమాండ్ పట్టికను, తద్వారా డిమాండు రేఖ (Demand curve)ను నిర్మించవచ్చు. ఆయా ధరలవద్ద ఖర్చు చేసిన ద్రవ్యాన్ని, కొన్న వస్తువు పరిమాణాన్ని ధర-వినియోగరేఖ తెలియచేస్తుంది.

## ప్రశ్న 7) ప్రత్యామ్నాయ ప్రభావం అంటే ఏమిటి ?

జవాబు : వినియోగదారుని పరిస్థితిలో ఏ విధమైన మార్పు లేకుండా రెండు వస్తువుల సాపేక్ష ధరలు మారితే కలిగే ఫలితాన్ని "ప్రత్యామ్నాయ ప్రభావం" (Substitution effect) అంటారు. ఇట్టి స్థితిలో అతని పరిస్థితి మునుపటికంటె ఏ మాత్రం మెరుగుగా గాని, హీనంగా గాని ఉండదు. కాని వస్తువుల కొనుగోలు పరిమాణంలో మాత్రం కొద్ది మార్పు ఉంటుంది. క్రింది పటం ఈ విషయాన్నే విశదీకరిస్తుంది.




పటంలో వినియోగదారుడు మొదటి P బిందువు వద్ద సమతౌల్య స్థితిలో ఉన్నాడు. అప్పుడు X - వస్తువును OM పరిమాణంలోను, Y- వస్తువును ON పరిమాణంలోను కొంటున్నాడు. వీటి ధరల నిష్పత్తి AB రేఖ (బడ్జెట్ రేఖ లేక ధర రేఖ) వాలు సూచిస్తుంది. ఇప్పుడు Y వస్తువు ధర పెరిగితే ఆ మేరకు X వస్తువు రూపంలో అతని ఆదాయం పెరుగుతుంది. అంటే Y వస్తువు ధర పెరుగుదల, X రూపంలో అతని ఆదాయం పెరుగుదల సమానంగా ఉంటాయి. అయితే అతడి సంతృప్తి స్థాయిలో మటుకు మార్పు ఉండదు. ఆదాయంలో ఈ రకమైన మార్పును "పరిహార మార్పు" (Compensation Variation)' అంటారు. సంతృప్తి స్థాయిలో మార్పు ఉండదు కనుక వినియోగదారుడు అదే ఉదాసీనతా వక్రరేఖపైనే ఉంటాడు. కాని మరొక బిందువు వద్ద సమతౌల్య స్థితిలో ఉంటాడు. ఇప్పుడు వినియోగదారుడు P బిందువు వద్ద సమతౌల్య స్థితిలో ఉంటాడు. ప్రత్యామ్నాయ ప్రభావంవల్ల వినియోగదారుని సమతౌల్య స్థానం P బిందువు నుంచి P1 బిందువుకు మారింది. ఇక్కడ X వస్తువును OM1 పరిమాణం లోను, Y వస్తువును ON1 పరిమాణంలోను కొంటాడు. అంటే X వస్తువును ఎక్కువ పరిమాణంలోను, Y వస్తువును తక్కువ పరిమాణంలోను కొంటాడన్నమాట. ఇందుకు కారణం Y ధర పెరగటమే. సాపేక్షంగా చౌక అయిన X వస్తువును ధర పెరిగినటువంటి వస్తువు స్థానే ప్రతిస్థాపన (Substitute)

చేస్తున్నాడు. దీన్నే "ప్రత్యామ్నాయ ప్రభావం" (Substitution effect) అంటారు. వినియోగదారుని సంతృప్తి స్థాయిలో ఏ విధమైన మార్పు లేకపోయినప్పటికి, అతని కొనుగోలు సముదాయంల్లో మార్పులుండటాన్ని ప్రత్యామ్నాయ ప్రభావం తెలియచేస్తుంది.

**ప్రశ్న 8) ధర వినియోగ రేఖ - డిమాండ్ రేఖల మధ్య విచక్షణ చేయుము.**

జవాబు : ఒక వస్తువు (Y) ధర స్థిరంగా ఉండి (X, Y), మరో వస్తువు ధర (X)లో మార్పు వస్తే వినియోగదారు కొనే రెండు వస్తువుల (X, Y) వివిధ సముదాయాలను ధర వినియోగరేఖ తెలియచేస్తుంది. ఈ రేఖ స్వభావాన్ని బట్టి ధర మారిన వస్తువు (X) యొక్క స్వభావం ఎట్లాంటిదో తెలుసుకోవచ్చు. అంతేకాక వస్తువుల ధరలలో వచ్చే మార్పులవల్ల ఆ వస్తువు కొనుగోలులో వచ్చే మార్పులను కూడ ధర-వినియోగ రేఖ సూచిస్తుంది. డిమాండు రేఖ కూడ ఇదే సమాచారాన్ని తెలియచేస్తుంది. కాని ఈ రెండింటికి తేడాలున్నాయి. అవి :

1. ధర వినియోగ రేఖను గీసేటప్పుడు రెండు అక్షాలమీద రెండు వస్తువులను తీసుకోవాలి. కాని డిమాండురేఖ గీసేటప్పుడు Y- అక్షంమీద వస్తువు ధర, X- అక్షంమీద అదే వస్తువు పరిమాణం తీసుకోవలెను.

2. ధర-వినియోగ రేఖ వస్తువుల ధరలను సూచించదు. అయితే బడ్జెట్ రేఖ రెండు వస్తువుల ధరల నిష్పత్తిని మాత్రమే తెలియచేస్తుంది. అలాకాక డిమాండు రేఖ వస్తువు ధరను, పరిమాణాన్ని సూచించటంచేత, ఆ రేఖను చూస్తూనే వివిధ ధరలవద్ద వస్తువు ఏ పరిమాణంలో కొనబడేది వెంటనే తెలుసుకోవచ్చు. ధర-వినియోగ రేఖ ఈ సమాచారాన్ని అందించదు.

3. ధర-వినియోగ రేఖ ధర ప్రభావాన్ని తెలియచేస్తుంది. విడివిడిగా ఆదాయ ప్రభావాన్ని, ప్రత్యామ్నాయ ప్రభావాన్ని సూచిస్తుంది. కాని డిమాండురేఖ మొత్తం ఫలితాన్ని మాత్రమే సూచిస్తుంది. అంటే ధర మారినప్పుడు, వస్తువు పరిమాణంలో ఎంత మార్పుంటుందో దానిని మాత్రమే తెలియచేస్తుంది. ఈ తేడాలున్నప్పటికి, ధర వినియోగరేఖ నుంచి డిమాండు పట్టికను, తద్వారా డిమాండు రేఖను నిర్మించవచ్చు.

**ప్రశ్న 9) ఉదాసీనత వక్రరేఖా విశ్లేషణ ద్వారా వినియోగదారుని మిగులు భావనను వివరింపుము.**

జవాబు : మార్షల్ వినియోగదారుని మిగులు అనే భావనను ప్రవేశపెట్టి వివరించాడు. మార్షల్ వివరణననుసరించి వినియోగదారుని మిగులు కనుక్కోవటం సులభం కాదు. పైగా మార్షల్ వివరణ కొన్ని అవాస్తవిక ప్రమేయాలపై - i) ప్రయోజనాన్ని కొలవవచ్చని, ii) ద్రవ్యం ఉపాంత ప్రయోజనం స్థిరంగా ఉంటుందని ఆధారపడింది. ఈ రెండు ప్రమేయాలు లేకుండా ప్రొఫెసర్ "హిక్స్" (Prof. Hicks) ఉదాసీనతా వక్రరేఖల నుపయోగించి వినియోగదారుని మిగులు కనుక్కోవటాన్ని ప్రవేశపెట్టారు.




పై పటంలో X- అక్షంపైన వస్తువు X, Y- అక్షంపైన వినియోగదారుని ద్రవ్య ఆదాయం (Money Income) OA చూపబడినాయి. వినియోగదారునికి X వస్తువు ధర తెలియదని, కనుక IC1 ఉదాసీన వక్రరేఖపై ఉన్న P బిందువు సూచించే ఆదాయ వస్తు సముదాయాన్ని కోరుకుంటాడని ఊహిస్తే, అతడు OM పరిమాణంలో X వస్తువును, ON ఆదాయాన్ని పొందగలడు. అంటే అతను OM పరిమాణం గల X వస్తువును (OA-OX) AN ద్రవ్య ఆదాయంతో కొనడానికి సిద్ధపడ్డాడు.

ఇప్పుడు వినియోగదారునికి X వస్తువు ధర తెలిసింది కనుక ధరరేఖ ఏర్పడుతుంది. క్రింది పటంలో AB ధరరేఖ.

AB ధరరేఖ Ic2 ఉదాసీన వక్రరేఖ P1 బిందువువద్ద స్పర్శ రేఖగా వుంది. అంటే వినియోగదారుడు యిప్పుడు P1 బిందువువద్ద సమతౌల్య స్థితిలో ఉంటాడు. ఈ స్థితిలో వినియోగదారుడు OM పరిమాణంలో X వస్తువును, ON1 ఆదాయాన్ని పొందుతాడు. అదే పరిమాణంగల (OM) X వస్తువును యిప్పుడు AN1 ఆదాయంతోనే కొనగలుగుతున్నాడు.



దన్నే వస్తువు ధర తెలియకమునుపు AN ఆదాయంలో కొనటానికి సిద్ధపడ్డాడు. వినియోగదారుడు చెల్లించటానికి యిష్టపడిన ధరకు, వాస్తవంగా చెల్లించిన ధరకు వుండే తేడాయే వినియోగదారుని మిగులు.

వినియోగదారుని మిగులు = AN-AN1= NN1 OM పరిమాణంపై మొత్తం వినియోగదారుని మిగులు = NN1 p p

పైన వివరించినట్లు ఉదాసీనతా వక్రరేఖల సహాయంతో వినియోగదారుని మిగులును కనుక్కోవచ్చు. అంతేగాక వస్తువు ధర, వినియోగదారుని ఆదాయం-వీటిలో వచ్చే మార్పులవల్ల వినియోగదారుని మిగులు ఎలా మారేదీకూడ ఉదాసీన వక్రరేఖలద్వారా తెలుసుకోవచ్చు.

ప్రొఫెసర్ హిక్స్ మాటలలో వినియోగదారుని మిగులు- "ధర తగ్గినప్పుడు ద్రవ్య ఆదాయ రూపంలో వినియోగదారుడు పొందే లాభం".

**ప్రశ్న 10) ఆదాయ, ప్రత్యామ్నాయ ప్రభావాల సమిష్టి ఫలితంగా ధర ప్రభావము ఏ విధంగా ఏర్పడునో వివరింపుము.**

**జవాబు :** ఉదాసీనతా వక్రరేఖల విశ్లేషణలో ఆదాయ ప్రభావం, ప్రత్యామ్నాయ ప్రభావం మరియు ధర ప్రభావముల భావములు ప్రాముఖ్యాన్ని వహించుచున్నాయి. ఆదాయ, ప్రత్యామ్నాయ ప్రభావాల సమిష్టి ఫలితంగా ధర ప్రభావము ఏర్పడును. ఈ అంశాన్ని తెలుసుకునేముందు ఆ భావాల స్వభావములను ముందుగా పరిశీలించెదము.

**ఆదాయ ప్రభావము :** వినియోగదారుని ఆదాయంలో మార్పులు వచ్చినపుడు అతని కొనుగోలు శక్తిలో కూడా మార్పులు వచ్చును. అందువలన అతని సమతౌల్యస్థితి మారవచ్చును. ఆదాయము పెరిగినచో బడ్జెట్ రేఖ కుడివైపుగా జరిగి ఎక్కువ సంతృప్తినిచ్చు ఉదాసీనతా వక్రరేఖకు స్పర్శరేఖ అగును. అదే విధంగా ఆదాయము తగ్గినచో బడ్జెట్ రేఖ ఎడమవైపుగా జరిగి తక్కువ సంతృప్తినిచ్చు ఉదాసీనతా వక్రరేఖకు స్పర్శరేఖ అగును. ఆదాయ ప్రభావాన్ని ఈ క్రింది రేఖాపటము ద్వారా చూపవచ్చును.



మినహాయింపునే "పరిహారపు మార్పు" అని అందురు. కనుక వినియోగదారుని సమతౌల్యము అదే ఉదాసీనతా రేఖపై ఉండును. బడ్జెట్‌రేఖ పటములో AA1 నుండి BB1కు మారినది. రేఖా పటములో AB పరిహారపు మార్పు. ఈ పరిహారపు మార్పు వలన X వస్తువును ఎక్కువగా కొనుగోలు చేసి Y వస్తువు పరిమాణమును తగ్గించును. అందువలన వినియోగదారుని సంతృప్తి స్థాయి పెరుగుట గాని, తగ్గుట గాని జరుగలేదు. అందువలన IC ఉదాసీనతా వక్రరేఖపై P బిందువు వద్ద మరియు P1 బిందువు వద్ద సమాన సంతృప్తిని పొందును. సమతౌల్యము P నుండి P1 బిందువుకు మార్పు ప్రత్యామ్నాయ ప్రభావము వలన జరిగినది.

ధర ప్రభావము : ఒక వస్తువు ధరలో మార్పు వలన వినియోగదారుని సమతౌల్య స్థితిలో ఏ విధముగా మార్పు వచ్చునో ధర ప్రభావము తెలియచేయును. ధర ప్రభావాన్ని రేఖా పటము ద్వారా చూపవచ్చును.




రేఖా పటములో మొదటి బడ్జెట్ రేఖ AA1. సమతౌల్య బిందువు P1. వినియోగదారుని ఆదాయంలోగాని, Y వస్తువు ధరలోగాని ఏ మార్పు లేనపుడు X వస్తువు ధర తగ్గినపుడు బడ్జెట్ రేఖ AA1 నుంచి AB1కు మారును. కనుక సమతౌల్య బిందువు P1 నుంచి P2కు మారినది. X వస్తువు ధర ఇంకనూ తగ్గినచో బడ్జెట్ రేఖ AC1కు మారును. కనుక సమతౌల్యము P3కు మారును. P1, P2 మరియు P3లను కలుపగా ధర వినియోగపు రేఖ (PCC) వచ్చును.

ఆదాయ, ప్రత్యామ్నాయ ప్రభావాల సమిష్ఠి ఫలితమే ధర ప్రభావము :

జె. ఆర్. హిక్స్ (Hicks) మరియు స్లట్స్కీ (Slutsky) అను ఆర్థిక శాస్త్రవేత్తల ప్రకారము ఆదాయ ప్రభావము మరియు ప్రత్యామ్నాయ ప్రభావాల సమిష్ఠి ఫలితమే ధర ప్రభావము. ఈ విషయమును క్రింది రేఖా పటము ద్వారా నిరూపించవచ్చును.




రేఖా పటములో మొదటి బడ్జెట్ రేఖ AA1. IC1 ఉదాసీనతా వక్రరేఖ AA1 బడ్జెట్ రేఖకు P1 బిందువు వద్ద స్పర్శ రేఖ అయినది. కనుక P1 సమతౌల్య బిందువు. X వస్తువు ధర తగ్గినపుడు బడ్జెట్ రేఖ AB2 అగును. అందువలన సమతౌల్య బిందువు P3కు మారినది. P1 సమతౌల్య బిందువు వద్ద మొదటి OX1 పరిమాణంలో X వస్తువులను కొనుగోలు చేసెను. ప్రస్తుతము P3 సమతౌల్య బిందువు వద్ద OX3 పరిమాణంలో X వస్తువును కొనుగోలు చేసెను. కనుక ధర ప్రభావము వలన X1, X3 పరిమాణంలో (OX3–OX1) X వస్తువు కొనుగోలులో మార్పు వచ్చినది. ఈ ధర ప్రభావము ఆదాయ, ప్రత్యామ్నాయ ప్రభావముల వలన వచ్చినది. ఆదాయ ప్రభావము వలన బడ్జెట్ రేఖ AA1 నుంచి సమాంతరముగా BB1కు మారినది. BB1 బడ్జెట్ రేఖను IC2 ఉదాసీనతా వక్రరేఖ P2 దగ్గర స్పర్శ రేఖ అయినది. కనుక సమతౌల్య బిందువు P2కు మారినది. X వస్తువు కొనుగోలు OX1 నుంచి OX2 కు మారినది. కనుక X1, X2 ఆదాయ ప్రభావము ప్రత్యామ్నాయ ప్రభావము వలన అదే ఉదాసీనతా వక్రరేఖ IC2 పైన P3 బిందువు వద్ద వినియోగదారుడు సమతౌల్యము పొందెను. కనుక X2, X3 ప్రత్యామ్నాయ ప్రభావము కనుక ---

X1, X3 = ధర ప్రభావము

X1, X2 = ఆదాయ ప్రభావము

X2, X3 = ప్రత్యామ్నాయ ప్రభావము

X1. X3 = X1 X2 + X2 X3

ధర ప్రభావము = ఆదాయ ప్రభావము +ప్రత్యామ్నాయ ప్రభావము.

**ప్రశ్న 11) కార్డినల్ ప్రయోజనము, ఆర్డినల్ ప్రయోజనము అనగానేమి?**

జవాబు : ఒక వస్తువు నుంచి లభించే ప్రయోజనాన్ని సంఖ్యారూపంలో కొలవటానికి వీలు వుండదు అనే ప్రమేయాన్ని "కార్డినల్ ప్రయోజనము" అంటారు. కార్డినల్ ప్రయోజనముపై ఆధారపడి మార్షల్ తన డిమాండ్ సిద్ధాంతాన్ని ప్రతిపాదించినాడు. కార్డినల్ ప్రయోజన సిద్ధాంతం యొక్క ప్రమేయం ప్రకారంగా ఒక వస్తువు యొక్క ప్రయోజనాన్ని 20 యూనిట్లు 30 యూనిట్లు అని ఖచ్చితంగా చెప్పడానికి వీలు ఉంటుంది. ప్రయోజన విశ్లేషణ కార్డినల్ ప్రయోజనముపై ఆధారపడి ఉన్నది. కాని వాస్తవంగా ప్రయోజనాన్ని కొలవటానికి వీలులేదు. ప్రయోజనమనేది ఒక మానసిక భావన మాత్రమే. దీనివి సంఖ్య రూపంలో చెప్పటానికి సాధ్యం కాదు కాబట్టి పారిటో, హిక్స్ మొదలగువారు ప్రయోజనం కొలవటం అసంభవమని అన్నారు. పారిటో, ఎలెన్, హిక్స్ మొదలగువారు ఆర్డినల్ ప్రయోజనాన్ని ఉపయోగించినారు.

ఒక వస్తువు నుంచి లభించే ప్రయోజనాన్ని కొలవటానికి వీలులేదని, వివిధ వస్తువుల ప్రయోజనాన్ని పోల్చి చెప్పటానికి మాత్రమే వీలు ఉంటుందనే సిద్ధాంతాన్ని "ఆర్డినల్ ప్రయోజనము" అంటారు. ఆర్డినల్ ప్రయోజన సిద్ధాంతము ప్రకారంగా ఒక వస్తువుకన్నా ఇంకొక వస్తువు ఎక్కువ లేదా తక్కువ ప్రయోజనాన్ని ఇస్తుందని మాత్రం చెప్పగలము. ఉదాసీనతా వక్రరేఖ విశ్లేషణ ఈ ఆర్డినల్ ప్రయోజన భావముపై ఆధారపడి యున్నది.

# SHORT NOTES

**ప్ర. 1) ఉదాసీనతా వక్రరేఖా విశ్లేషణ**

1వ ప్రశ్నకిచ్చిన జవాబులో మొదటి పేరా "ప్రయోజన విశ్లేషణకు ప్రత్యామ్నాయ పద్ధతి", "ఉదాసీనతా వక్రరేఖా విశ్లేషణ" లను చూడండి.

**ప్ర. 2) ఉదాసీనతా పట్టిక**

1వ ప్రశ్నకిచ్చిన జవాబులో 'ఉదాసీన వక్రరేఖా విశ్లేషణ', 'ఉదాసీన పట్టిక'లను చూడండి.

**ప్ర. 3) ఉదాసీనతా వక్రరేఖ (Indifference Curve)**

1వ ప్రశ్నకిచ్చిన జవాబులో 'ఉదాసీన పట్టిక', 'ఉదాసీన వక్రరేఖ'లను చూడండి.

4) **ఉదాసీనతా వక్రరేఖల పటం** (Indifference Curve map)

1వ ప్రశ్నకిచ్చిన జవాబులో 'ఉదాసీన వక్రరేఖ', 'ఉదాసీన వక్రరేఖా పటం'లను చూడండి.

5) **ప్రతిస్థాపనోపాంత రేటు** (Marginal rate of Substitution)

1వ ప్రశ్నకిచ్చిన జవాబులో 'ఉదాసీనతా పట్టిక', 'ప్రతిస్థాపనోపాంత రేటు"లను చూడండి.

6) **బడ్జెట్ రేఖ లేక ధరరేఖ** (Budget Line or Price Line)

1వ ప్రశ్నకిచ్చిన జవాబులో 'బడ్జెట్ రేఖ'ను చూడండి.

7) **ధర ప్రభావం** (Price effect)

6వ ప్రశ్నకిచ్చిన జవాబు చూడండి.

8) **ఆదాయ ప్రభావం** (Income effect)

5వ ప్రశ్నకిచ్చిన జవాబు చూడండి.

9) **ప్రత్యామ్నాయ ప్రభావం**

7వ ప్రశ్నకిచ్చిన జవాబు చూడండి.

10) **ఉదాసీనతా వక్రరేఖల లక్షణాలు**

3వ ప్రశ్నకిచ్చిన జవాబు చూడండి.

11) **ఉదాసీనతా వక్రరేఖల ఉపయోగాలు**

4వ ప్రశ్నకిచ్చిన జవాబు చూడండి.



అధ్యాయము 4

# ఉత్పత్తి సిద్ధాంతం

ప్రశ్న 1) క్రమక్షీణ ప్రతిఫల సూత్రాన్ని వివరింపుము. ఈ సూత్రం భూమికి మాత్రమే వర్తించునా ?

లేదా

క్రమక్షీణ ఉపాంత ప్రతిఫలాల సూత్రమును వివరించుము. ఈ సూత్రానికున్న పరిమితులేవి ?

లేదా

క్రమక్షీణ ప్రతిఫల సిద్ధాంతము వ్యవసాయానికి, పరిశ్రమలకు కూడా వర్తిస్తుంది. కాబట్టి దానిని చరానుపాతాల సిద్ధాంతమనవచ్చు. నీవు అంగీకరించెదవా ?

లేదా

క్రమక్షీణ ప్రతిఫల సిద్ధాంతమును చర్చించుమది ?

లేదా

చరానుపాతాల సిద్ధాంతమును సోదాహరణ పూర్వకంగా వివరించుమది. (Very Important)

జవాబు : ఉత్పత్తి సాధనాలైన భూమి, శ్రమ, మూలధనం, వ్యవస్థాపనలను ఉపయోగించి వస్తువులు ఉత్పత్తి చేయబడతాయి. కనుక ఉత్పత్తి పరిమాణం ఉత్పత్తి సాధనాల పరిమాణంపైన, ఉత్పత్తిపైన ఆధారపడుతుంది. వస్తువుల ఉత్పత్తిని పెంచడానికి రెండు పద్ధతులున్నాయి. అవి :

i) కొన్ని ఉత్పత్తి సాధనాలను స్థిరంగా వుంచి మరికొన్నింటిని పెంచటం.

ii) అన్ని ఉత్పత్తి సాధనాలను పెంచటం.

ఇందులో మొదటి పద్ధతి చరానుపాతాల సూత్రం విశ్లేషణ చేస్తుంది. దీన్నే "క్షీణ ప్రతిఫల సిద్ధాంతము" (Law of Diminishing Returns) అని కూడా అంటారు.

**చరానుపాతాల సూత్రం :** ఉత్పత్తి పరిమాణాన్ని పెంచటానికిగాను ఉత్పత్తి పలు రకాల కలయిక నిష్పత్తి మారినప్పుడు ఉత్పత్తి ఏ అనుపాతంలో మారుతుందో చరానుపాతాల సూత్రం తెలియచేస్తుంది. అంటే మొత్తం ఉత్పత్తి ఉత్పత్తి కారకాలకు గల సంబంధాన్ని ఇది తెలియచేస్తుంది. ఈ సూత్రాన్ని క్రింది ఉదాహరణల ద్వారా విశదీకరించవచ్చు.

ఒక రైతు ఒక ఎకరం భూమి మీద కొన్ని పరికరాలు, విత్తనాలు, ఎరువులు ఉపయోగించి వ్యవసాయం చేస్తున్నాడనుకుందాం. ఈ భూమి మీద ఈ ఉత్పత్తి కారకాల ఆధారంతో పంట పండించేందుకు ఎంత మంది శ్రామికులు అవసరమో అతడు నిర్ణయించవలసి ఉంది. ఈ నిర్ణయం చేసేందుకు అతడు మిగతా ఉత్పత్తి కారకాలను స్థిరంగా ఉంచి, శ్రామికుల సంఖ్యను పెంచితే అదనంగా వచ్చే పంట ఎంత ఉంటుందో అంచనా వేస్తాడు. ఇలా కొన్ని ఉత్పత్తి సాధనాలను స్థిరంగ్గా ఉంచి ఒకటి మారుస్తూ ఉంటే వస్తూత్పత్తిలో కూడా మార్పు కలుగుతుంది. ఈ మార్పునే చరానుపాతాల సూత్రం విశదం చేస్తుంది. దీన్నే క్రింది పట్టికలో చూడవచ్చు.

పట్టిక

| శ్రామికుల సంఖ్య | మొత్తం ఉత్పత్తి | సగటు ఉత్పత్తి | ఉపాంత ఉత్పత్తి | దశ |
|---|---|---|---|---|
| 1 | 9 | 9 | 9 | మొదటి దశ |
| 2 | 20 | 10 | 11 | పెరుగుతున్న |
| 3 | 33 | 11 | 13 | ప్రతిఫలాల దశ |
| 4 | 44 | 11 | 11 | |
| 5 | 50 | 10 | 6 | రెండవ దశ |
| 6 | 54 | 9 | 4 | క్షీణప్రతిఫలాల |
| 7 | 56 | 8 | 2 | దశ |
| 8 | 58 | 7 | 0 | |
| | | | | మూడవ దశ |
| 9 | 54 | 6 | -2 | మొత్తం ఉత్పత్తి |
| 10 | 50 | 5 | -4 | తగ్గుదల దశ |

ఈ పట్టికను పరిశీలిస్తే ఒక విషయం స్పష్టమవుతుంది. శ్రామికుల సంఖ్యను పెంచుతూ పోతుంటే మొత్తం ఉత్పత్తి, సగటు ఉత్పత్తి, ఉపాంత ఉత్పత్తి మొదట్లో పెరుగుతూ తర్వాత తగ్గనారంభించాయి. మొదటి దశలో శ్రామికుల సంఖ్యతోపాటు మొత్తం, పగటు, ఉపాంత ఉత్పత్తులను పెంచాయి. అంటే ఈ దశలో ప్రతిఫలం వృద్ధి చెందుతున్నదన్నమాట. ఈ దశను పెరుగుతున్న ప్రతిఫలాల దశ (Increasing

returns stage) అంటారు. రెండవ దశలో శ్రామికుల సంఖ్య పెరిగినకొద్దీ మొత్తం పెరుగుతున్నప్పటికి, సగటు, ఉపాంత ఉత్పత్తులు క్షీణిస్తున్నాయి అంటే మొత్తం ఉత్పత్తిలో వచ్చే పెరుగుదల క్షీణిస్తున్నది. ఈ దశను "క్షీణ ప్రతిఫల దశ" అంటారు. మూడవ దశలో శ్రామికుల సంఖ్య పెరిగినకొద్ది మొత్తం ఉత్పత్తి కూడా క్షీణిస్తున్నది. అంతేకాక ఉపాంత ఉత్పత్తి ఏమీ లేని స్థితిని చేరి తర్వాత రుణాత్మకమైంది (negative) కూడా.

కనుక ఏ ఉత్పత్తిదారుడైన మూడవ దశ రానీయక, రెండవ దశలోనే ఉత్పత్తిని సాగిస్తాడు. ఈ దశలో మొదట్లోనే ఉంటాడా లేక చివర ఉంటాడా అనే విషయం ఉత్పత్తి సాధనాల ధరలపై ఆధారపడి ఉంటుంది. కనుక మిగతా ఉత్పత్తి కారకాలన్నింటిని స్థిరంగా ఉంచి ఒక్క ఉత్పత్తి కారకాన్ని మాత్రమే పెంచుతూపోతే వచ్చే ఉపాంత ఉత్పత్తి క్షీణిస్తుంది. ఇదే క్షీణోపాంత ప్రతిఫల సూత్రం చెప్పే విషయం.

**మార్షల్ నిర్వచనం :** క్షీణోపాంత ప్రతిఫల సూత్రాన్ని మార్షల్ ఈ విధంగా నిర్వచించాడు. "వ్యవసాయ పద్ధతులు మార్పు చెందకుండ ఉన్నప్పుడు భూమిపై నియమించిన మూలధనం, శ్రమలను పెంచినప్పుడు ప్రతిఫలం సాధారణంగా తక్కువ అనుపాతంలో పెరుగుతుంది".

**స్టిగ్లర్ నిర్వచనం :** "మిగతా ఉత్పత్తి సాధనాల పరిమాణాలన్నీ స్థిరంగా ఉండి ఒక ఉత్పత్తి పరిమాణాన్ని సమాన మొత్తాలలో పెంచిన ఫలితంగా ఒక ఉత్పత్తిలో వచ్చే పెరుగుదల ఒక స్థాయి దాటిన తర్వాత క్షీణిస్తుంది".

**చర అనుపాత సూత్రం - రేఖాపటం :** పైన చెప్పిన విషయాన్ని రేఖాపటం ద్వారా కూడా చూడవచ్చు. క్రింది పటంలో X- అక్షంపై మారుస్తున్న ఉత్పత్తి సాధనం అంటే శ్రామికుల సంఖ్య Y- అక్షంపై ఉత్పత్తి చూపబడినాయి. TP–మొత్తం ఉత్పత్తి రేఖ, AP – సగటు ఉత్పత్తి రేఖ, MP- ఉపాంత ఉత్పత్తి రేఖ.



**క్షీణ ప్రతిఫల సూత్రం - ప్రమేయాలు :** క్షీణ ప్రతిఫల సూత్రం కొన్ని ప్రమేయాలపై ఆధారపడి ఉంది. అవి .

1) ఉత్పత్తి పద్ధతులలో మార్పేమీ లేదు. అంటే సాంకేతిక విజ్ఞానం స్థిరంగా ఉంటుంది.
2) కొన్ని ఉత్పత్తి కారకాలను మాత్రమే స్థిరంగా ఉంచగలిగి, మరి కొన్నింటిని మాత్రమే మార్చడానికి వీలుంటుంది.
3) మారుస్తున్న ఉత్పత్తి కారకాల వివిధ యూనిట్లు ఒకే రకంగా (Identical) ఉంటాయి.
4) ఉత్పత్తి కారకాల అనుపాతం కూడా మార్చటానికి వీలుంటుంది.

పెరిగే ప్రతిఫలాలు, స్థిర ప్రతిఫలాలు, క్షీణప్రతిఫలాలు - ఈ మూడు చరానుపాతాల సిద్ధాంతంలోని మూడు దశలు. పెరిగే ప్రతిఫలాలు వస్తున్నప్పుడు ఉత్పత్తి వ్యయం తగ్గుతుంది. దీన్ని "తగ్గుతున్న వ్యయాలస్థితి" అని కూడా అంటారు. క్షీణ ప్రతిఫలాలు వస్తున్నప్పుడు ఉత్పత్తి వ్యయాలు పెరుగుతాయి. దీన్ని "పెరుగుతున్న వ్యయం" (Increasing costs) స్థితి అని కూడా అనవచ్చు.

**ఆధునిక - సాంప్రదాయ అభిప్రాయాలు - తేడాలు :** క్షీణ ప్రతిఫల సిద్ధాంతాన్ని సాంప్రదాయక ఆర్థికవేత్తలు రూపొందించారు. రాబర్ట్, మాల్థస్, డేవిడ్ రికార్డో' వంటి ఆర్థికవేత్తలు ఈ సిద్ధాంతానికి విశేష ప్రాముఖ్యాన్నిచ్చారు. మాల్థస్ జనాభా సిద్ధాంతానికి (Theory of Population) రికార్డో భాటక సిద్ధాంతానికి (Theory of Rent) ఇది ప్రాతిపదిక. వ్యవసాయ రంగానికి ఈ సూత్రం వర్తిస్తుందని వారి అభిప్రాయం.

క్షీణ ప్రతిఫల సూత్రం ఒక్క వ్యవసాయ రంగానికేకాక ఉత్పత్తి రంగాలన్నింటికి వర్తిస్తుంది కూడా. అసలు క్షీణ ప్రతిఫలాలు రావటానికి కారణం కొన్ని ఉత్పత్తి కారకాలు స్థిరంగా ఉండగా మిగతావి మారుతున్నప్పుడు ఒక స్థాయిలో ఉత్పత్తి కారకాల కలయిక ఉత్పత్తి తప్పు అవుతుంది. అంటే మారుతున్న కారకాలు స్థిరంగా ఉన్నవాటితో పోలిస్తే ఎక్కువవుతాయి. కనుక ప్రతిఫలాలు క్షీణిస్తాయి. ఇది ఒక్క వ్యవసాయ రంగంలోనేకాక అన్ని ఉత్పత్తి రంగాలలోను సంభవిస్తుంది. అందుచేతనే ఆధునిక ఆర్థికవేత్తలు ఈ సిద్ధాంతాన్ని ఈ విధంగా నిర్వచించారు. "మిగతా ఉత్పత్తి కారకాలన్నీ స్థిరంగా ఉండగా ఒక ఉత్పత్తి కారకాన్ని పెంచుతూ ఉంటే ఒక దశ తర్వాత ఉత్పత్తిలో వచ్చే పెరుగుదల క్షీణిస్తుంది".

ఒక ఉత్పత్తి కారకాన్ని స్థిరంగా ఉంచి మిగతావాటిని మార్పు చేస్తుంటే పెరుగుతున్న స్థిర, క్షీణ ప్రతిఫలాలు వస్తాయని, చరానుపాతాల సూత్రం విశదీకరించింది. అలాకాక అన్ని ఉత్పత్తి కారకాలను పెంచినా ఒక దశ దాటిన తర్వాత క్షీణ ప్రతిఫలాలు వస్తాయి.దీన్నే "తరహా ననుసరించి క్షీణ ప్రతిఫలాలు" (Diminishing Returns to Scale) అంటారు.

**ఉత్పత్తి ప్రతిఫలాలు, వ్యయాలు :** పెరిగే ప్రతిఫలాల దశలో ఉత్పత్తి వ్యయాలు తగ్గుతాయి. కనుక వ్యయ రేఖ ఎడమ నుండి కుడికి క్రిందకు వాలుతుంది. స్థిర

ప్రతిఫలాల దశలో ఉత్పత్తి వ్యయాలు స్థిరంగా ఉంటాయి. కనుక వ్యయరేఖ X-అక్షానికి సమాంతరంగా ఉంటుంది. క్షీణ ప్రతిఫలాల దశలో ఉత్పత్తి వ్యయాలు పెరుగుతాయి. కనుక వ్యయరేఖ ఎడమ నుండి కుడికి పైకి పోతుంది.

**క్షీణ ప్రతిఫల సిద్ధాంతానికి గల పరిమితులు (Limitations) :** ఈసిద్ధాంతం క్రింది పరిమితులకు లోబడి ఉంటుంది.

1) ఒక ఉత్పత్తి కారకాన్ని స్థిరంగా వుంచి మిగతావాటిని మారుస్తున్నప్పుడే ఇది వర్తిస్తుంది.
2) ఉత్పత్తి కారకాల కలయిక నిష్పత్తి మారినప్పుడు ఇది అమలులోకి వస్తుంది.
3) ఉత్పత్తి పద్ధతులలో మార్పులేనప్పుడే ఇది వర్తిస్తుంది.

**అర్థశాస్త్రములో ఈ సూత్రం యొక్క ప్రాముఖ్యత :** అర్థశాస్త్రంలో క్షీణ ప్రతిఫలం సూత్రానికి ఎంతో ప్రాముఖ్యముంది. ఈ సిద్ధాంతంపై చాలా సిద్ధాంతాలు ఆధారపడి ఉన్నాయి.

1) రాబర్ట్ మాల్థస్ తన జనాభా సిద్ధాంతం ఈ సిద్ధాంతం ఆధారంగా రూపొందించారు.
2) డేవిడ్ రికార్డో భాటక సిద్ధాంతం కూడా ఈ సూత్రంపైన ఆధారపడి ఉంది.
3) వస్తువుల ధర నిర్ణయంలో ఈ సూత్రం యొక్క పాత్ర ఎక్కువగా ఉంది.
4) జాతీయ ఆదాయ పంపిణీ, విలువ నిర్ణయ సిద్ధాంతాలు దీనిపైనే ఆధారపడి ఉన్నాయి.
5) అభివృద్ధి చెందుతున్న దేశాల సమస్యలను అవగాహన చేసుకొనుటకు ఈ సూత్రం ఉపకరిస్తుంది.

**ప్రశ్న 2) పెద్ద తరహా ఉత్పత్తి వల్ల కలిగే ఆదాలేమిటి ?**

**లేదా**

**అంతర్గతమైన, బహిర్గతమైన ఆదాలకు గల తేడాను తెల్పి, పెద్ద తరహా ఉత్పత్తి వలన వచ్చే వివిధ అంతర్గత ఆదాలను గురించి చర్చించుము.**

**లేదా**

**అంతర్గత మరియు బహిర్గత ఆదాలను విచక్షణ చేయుము.**

**లేదా**

**తరహాననుసరించి ఆదాలను వివరింపుము.** (Important)

**జవాబు:** శ్రమ విభజన యంత్ర నిర్మాణానికి తద్వారా పెద్ద తరహా ఉత్పత్తికి దారి తీసింది. ఉత్పత్తి తరహా పెరిగినప్పుడు కొన్ని ప్రయోజనాలు ఏర్పడతాయి. వీటిని "ఆదాలు" (Economies) అంటారు. మార్షల్ ఈ ఆదాలను రెండు రకాలుగా విభజించాడు. అవి:

i) అంతర్గత ఆదాలు, ii) బహిర్గత ఆదాలు.

**i) అంతర్గత ఆదాలు (Internal Economies)** : ఒక పారిశ్రామిక సంస్థ ఉత్పత్తి పరిమాణాన్ని పెంచడం వల్ల కొన్ని లాభాలను పొందుతుంది. ఈ లాభాలనే "అంతర్గత ఆదాలు" అంటారు. ఆ ఆదాలు రావటానికి పరిశ్రమాధిపతి అనుసరించే ఉత్సాహక విధానాలు, ఉత్పత్తి సాగించే ఉద్యమదారుని సామర్థ్యం, ముడిసరుకుల నాణ్యత మొదలైన అనేక కారణాలుంటాయి. ఈ అంతర్గత ఆదాలు ఏ సంస్థ కాసంస్థకు ప్రత్యేకించి ఉంటాయి. వీటిని "వ్యాపార రహస్యాలు" (Trade Secrets) అని కూడా అనవచ్చు. ఈ ఆదాలను ఆ సంస్థే అనుభవిస్తుంది. మరొక సంస్థ అనుభవించదు. అంతర్గత ఆదాలను ఈ క్రింది విధంగా విభజింప వచ్చును :

**1) సాంకేతికమైన ఆదాలు (Technical Economies)** : పారిశ్రామిక సంస్థ పరిమాణము పెరిగినకొద్దీ ఈ సాంకేతికమైన ఆదాలు ఏర్పడుతాయి. పెద్ద తరహా ఉత్పత్తి సాగించే సంస్థ ఆధునాతనమైన ఎక్కువ ఖరీదైన పెద్ద యంత్రాలను ఉపయోగించుకోగలుగుతుంది. అందువల్ల ఉత్పత్తి వ్యయాలను ఎంతగానో తగ్గించగలుగుతుంది. సక్రమమైన శ్రమవిభజనను ప్రవేశపెట్టి, శ్రమ విభజన వల్ల కలిగే ప్రయోజనాలను కూడా పొందుతుంది. అంతేగాక ఉత్పత్తిలో వచ్చే ఉప పదార్థములను అనుబంధ పరిశ్రమల ద్వారా పూర్తి వినియోగము చేయగలుగుతుంది. ఈ చర్యలన్నింటివల్ల ఉత్పత్తి వ్యయాలు తగ్గి పరిశ్రమ రాబడి పెరుగుతుంది.

**2) నిర్వహణపు ఆదాలు (Managerial Economies)** : పెద్ద తరహా ఉత్పత్తి సంస్థ శాస్త్రీయ పద్ధతులలో పనిని శాఖలుగా విభజించి ఒక్కొక్క శాఖకు సమర్థులైన వ్యక్తులను నియమిస్తుంది. ఫలితంగా యాజమాన్యం తేలికగా ఉంటుంది. పర్యవేక్షణ అవసరం గూడా తగ్గుతుంది. ముడిసరుకుల దుబారా ఉండదు. అందువల్ల ఉత్పత్తి వ్యయాలు తగ్గుతాయి. ఈ విధంగా పెద్ద పరిమాణంలో ఉత్పత్తి సాగించే సంస్థకు నిర్వహణపు ఆదాలు ఏర్పడుతాయి. అయితే ఈ ఆదాలు సంస్థ ఒక పరిమాణం వరకు పెరిగినంతవరకే వస్తాయి. సంస్థ పరిమాణం అంతకుమించితే ఈ ఆదాలు అదృశ్యమై నష్టాలు సంభవిస్తాయి.

**3) మార్కెట్ చేయటంలో ఆదాలు (Marketing Economies)** : పెద్ద తరహా పరిశ్రమకు ముడి సరుకులు కొనడంలోను, తయారైన సరుకులు అమ్మటంలోను కొన్ని ఆదాలు చేకూరుతాయి. ముడిసరుకులను పెద్ద మొత్తాలలో కొనటం వల్ల నాణ్యమైనవి, తక్కువ ధరకే లభిస్తాయి. ఇట్లా తయారైన సరుకులను అమ్మేటందుకు సమర్థవంతమైన విక్రయ వ్యవస్థను ఏర్పరచుకోగలదు. వస్తువులను ప్రజలు ఆకర్షించే నిమిత్తం ఎక్కువ వ్యయంతో కూడిన ప్రకటనలు ఇవ్వగలుగుతుంది. అంతేగాక వస్తువులను పెద్ద మొత్తాలలోరవాణా చేయటం వల్ల రవాణా ఖర్చులు కూడా తగ్గుతాయి. ఈ విధంగా పెద్ద పరిశ్రమ మార్కెట్ చేయడంలో అనేక ఆదాలను పొందగలుగుతుంది.

4) **ఆర్థికపరమైన అదాలు** (Financial Economies) : పెద్ద సంస్థలు తేలికగా మూలధనాన్ని సేకరించగలుగుతాయి. పెద్ద సంస్థల వాటాలను, డిబెంచర్లను కొనటానికి ప్రజలు ముందుకు వస్తారు. అంతేకాక బాంకులు మొదలైన ద్రవ్య సంస్థలు కూడా తక్కువ వడ్డీకి రుణాలను ఇస్తాయి.

5) **నష్టభయాన్ని తగ్గించుకునే అదాలు** (Risk - bearing Economies): పెద్దతరహా ఉత్పత్తి సంస్థ అనేక రకములైన వస్తువులను ఉత్పత్తి చేయడం ద్వారా నష్ట భయాన్ని తగ్గించుకోగలుగుతుంది. ఒక వస్తువులో నష్టం వచ్చినప్పటికి మిగిలిన వస్తువులలో లాభం ఉంటుంది గనుక ఆ సంస్థకు మొత్తంమీద నష్టం ఉండదు. అదేవిదంగా పెద్ద తరహా సంస్థ దేశంలోని అన్ని మూలల తన వస్తువులను అమ్మడంద్వారా కూడా నష్టభయాన్ని తగ్గించుకోగలుగుతుంది.

6) **సంక్షేమ అదాలు** : పెద్ద సంస్థ తన కార్మికులకు సంక్షేమ పథకాలను చేపట్టగలదు. అందువలన శ్రామిక సామర్థ్యం పెరుగుతుంది.

ii) **బహిర్గతమైన అదాలు** (External Economies ) : ఒక పరిశ్రమలోని సంస్థల సంఖ్య పెరిగినకొద్దీ పరిశ్రమ అంతటకు కొన్ని లాభాలు లభిస్తాయి. ఈ లాభాలను పరిశ్రమలోని ప్రతి సంస్థ అనుభవించవచ్చు. వీటినే "బహిర్గత అదాలు" అంటారు. **ఉదాహరణకు** : పంచదారను తయారుచేసే యంత్రాలను ఉత్పత్తి చేసే సంస్థ పరిమాణము పెరిగి ఉత్పత్తి పెరిగితే ఆ యంత్రాల ధర తగ్గుతుంది. అందువల్ల వచ్చే ఆదా ప్రతి పంచదార మిల్లుకు వస్తుంది. ఇట్లాగే ఒక ప్రదేశములో అనేక పారిశ్రామిక సంస్థలు కేంద్రీకృతమవడము వల్ల ఏర్పడే రవాణా, తంతి తపాల వంటి సౌకర్యాల వల్ల కలిగే అదాలను అన్ని సంస్థలు అనుభవిస్తాయి. ఇవే ప్రాంతీయ శ్రమవిభజన వల్ల కలిగే అదాలు కూడా. ఈ బహిర్గతమైన అదాలను మూడు రకాలుగా విభజించవచ్చు. అవి :

1. **కేంద్రీకృతము వల్ల వచ్చే అదాలు** (Economies of concentration): అనేక పారిశ్రామిక సంస్థలు ఒకే ప్రదేశములో నెలకొల్పటము వల్ల కొన్ని అదాలు ఏర్పడుతాయి. రవాణా సౌకర్యాలు ఏర్పడటము, తర్ఫీదైన శ్రామికులు అందుబాటులో ఉండటం, అనుబంధ సంస్థలు ఏర్పాటు కావటం ఇలాంటి ఎన్నో అదాలు అక్కడ నెలకొల్పబడిన సంస్థలన్నింటికి లభిస్తాయి.

2. **సమాచారపు అదాలు** (Economies of Information) : శ్రామిక సంస్థల సంఖ్య పెరిగినకొద్దీ సంస్థలన్నీ కలిసి సమష్టిగా పరిశోధనా కార్యక్రమాలు సాగించడానికి అవకాశమేర్పడుతుంది. అందువల్ల వచ్చే అదాలను పరిశ్రమలోని సంస్థలన్నీ పొందగలుగుతాయి. అంతేగాక సమష్టిగా సాంకేతిక విజ్ఞానానికి సంబంధించిన పత్రికలను నడుపుకోటానికి అవకాశమేర్పడుతుంది. వీటి ద్వారా సాంకేతిక విజ్ఞానానికి సంబంధించిన సమాచారాన్ని అన్ని సంస్థలు పొందగలుగుతాయి.

3. **ప్రత్యేకీకరణ ఆదాలు** (Economies of specialisation) : ఒక పరిశ్రమలో ఉత్పతి సంస్థల సంఖ్య పెరిగినకొద్దీ ఒక్కొక్క సంస్థ ఉత్పత్తిలో ఒక్కొక్క భాగాన్ని మాత్రమే ప్రత్యేకీకరణ చేయవచ్చు. **ఉదాహరణకు** : వస్త్ర పరిశ్రమలో కొన్ని మిల్లులు నూలుని ఉత్పత్తి చేయటం, కొన్ని బట్టలను నేయటం, మరికొన్ని రంగులను వేయటం ఇలా ప్రత్యేకీకరణ చేయవచ్చు. దీని వల్ల వచ్చే ఆదాలు - ఉత్పత్తి పెరుగుదల, వ్యయాల తగ్గుదల వంటివి మొత్తం పరిశ్రమకు లభిస్తాయి.

ఒక సంస్థకు వచ్చే బహిర్గత ఆదాలు మరియొక సంస్థకు అంతర్గత ఆదాలు కావచ్చు. **ఉదాహరణకు** : విద్యుచ్ఛక్తి అభివృద్ధి దానిని ఉపయోగించే వ్యవస్థలకు బహిర్గత ఆదా. కాని విద్యుచ్ఛక్తి ఉత్పత్తి చేసే సంస్థకు అది అంతర్గత ఆదా.

**ప్రశ్న3) "తరహా ననుసరించి ప్రతిఫలాలు" అనగానేమి ? అభివృద్ధి ప్రతిఫలాలు వచ్చుటకు కారణము లేవి ?**

**లేదా**

**తరహాననుసరించి ప్రతిఫలాలలో మార్పులు ఎట్లు వచ్చునో వివరించండి.**

**లేదా**

**తరహాననుసరించి ప్రతిఫలాలకు, క్షీణప్రతిఫల సిద్ధాంతానికి గల తేడాను తెల్పుము.** **(Important)**

**జవాబు** : ఉత్పత్తి పరిమాణం ఉత్పత్తి కారకాల నిష్పత్తిపై ఆధారపడి ఉంటుంది. ఉత్పత్తి పరిమాణాన్ని పెంచటానికి రెండు పద్ధతులున్నాయి. మొదటిది ఒక ఉత్పత్తి కారకాన్ని స్థిరంగా ఉంచి మిగిలినవాటిని పెంచటం. దీన్నే "చరానుపాతాల సూత్రం" విశదం చేస్తుంది. ఈ పద్ధతి ద్వారా ఉత్పత్తిని పెంచేటప్పుడు మొదట పెరిగే ప్రతిఫలాలు, తర్వాత స్థిర ప్రతిఫలాలు, చివరకు క్షీణ ప్రతిఫలాలు వస్తాయని చరానుపాతాల సూత్రం తెలియ చేస్తుంది.

ఉత్పత్తి పరిమాణాన్ని పెంచటానికి మరో పద్ధతి కూడా ఉంది. అది అన్ని ఉత్పత్తి కారకాలను ఒకే నిష్పత్తిలో పెంచటం, ఈ పద్ధతి ద్వారా ఉత్పత్తి పరిమాణాన్ని పెంచేటప్పుడు కూడా పెరిగే ప్రతిఫలాలు, స్థిర ప్రతిఫలాలు, క్షీణ ప్రతిఫలాలు వస్తాయి. వీటినే "తరహాననుసరించి ప్రతిఫలాలు" అంటారు.

**1) పెరిగే తరహా ననుసరించి ప్రతిఫలాలు (Increasing returns to scale)**: ఉత్పత్తి కారకాలను పెంచిన అనుపాతం కంటే, ఉత్పత్తి ఎక్కువ అనుపాతంలో పెరిగితే, పెరుగుతున్న ప్రతిఫలాలు వస్తున్నాయని చెప్పాలి. **ఉదాహరణకు**, ఉత్పత్తి

కారకాలను రెట్టింపు చేస్తే, ఉత్పత్తి పరిమాణం రెట్టింపు కన్నా ఎక్కువయితే, దీన్ని "పెరుగుతున్న ప్రతిఫలాల స్థితి" అంటారు. ప్రతిఫలాలు పెరుగుతున్నప్పుడు ఉత్పత్తి వ్యయాలు తగ్గుతాయి. ఇలా పెరుగుతున్న ప్రతిఫలాలు రావటానికి క్రింది కారణాలు చెప్పవచ్చు. అవి :

i) పరిమాణంలో మార్పు, ii) అవిభాజ్యత, iii ) ప్రత్యేకీకరణ.

i) **పరిమాణంలో మార్పు (Dimensional relations)** : ప్రతిఫలాలు పెరగడానికి పరిమాణ ప్రభావం ఒక ముఖ్య కారణం. యంత్రాలు, పరికరాల వంటి ఉత్పాదక వస్తువుల పరిమాణం పెంచితే, పరిమాణం పెంచిన అనుపాతంకన్నా వాటి ఉత్పాదక శక్తి ఎక్కువగా పెరుగుతుంది. ఉదాహరణకు, ఒక గొట్టం వ్యాసాన్ని రెట్టింపు చేస్తే దాని నుంచి ప్రవహించే నీరు రెట్టింపు కన్నా ఎక్కువగా ఉంటుంది. అదేవిధంగా ఒక అడుగు పొడవు, వెడల్పు, ఎత్తు గల ఒక కొయ్య పెట్టె ఘన పరిమాణం కన్నా (1 × 1 × 1 = 1 ఘ.అ.) రెట్టింపు కొలతలు గల కొయ్య పెట్టె ఘన పరిమాణం రెట్టింపు కన్నా ఎక్కువగా ఉంటుంది. (2 × 2 × 2 = 8 ఘ.అ.) ఈ విధంగా ఉత్పత్తి కారకాల పరిమాణాన్ని పెంచిన అనుపాతం కంటే ప్రతిఫలాలలో పెరుగుదల అనుపాతం ఎక్కువగా ఉంటుంది. అయితే ఇలా పరిమాణం పెరగటం వల్ల వచ్చే ప్రయోజనం కొంతవరకే ఉంటుంది. కొయ్య పెట్టె పరిమాణం పెరిగినకొద్దీ దాన్ని బలమైన దళసరి చెక్కతో చేయవలసి వస్తుంది. అప్పుడు దానికయ్యే ఖర్చు ఎక్కువ కావచ్చు.

ii) **అవిభాజ్యత (Indivisibility)** : కొన్ని ఉత్పత్తి సాధనాలు ఎక్కువ ఉత్పాదకశక్తి కలిగి ఉంటాయి. అవి అవిభాజ్యంగా ఉండి వాటితో తక్కువ పరిమాణంలో ఉత్పత్తి చేసినా దానికయ్యే ఖర్చులు తగ్గవు. ఉదాహరణకు, ఒక కలములు తయారు చేసే యంత్రం ఉత్పాదక శక్తి రోజుకి 1000 కలములు, దాన్ని ఉపయోగించి రోజుకు 200 కలములు మాత్రమే తయారుచేస్తే ఆ యంత్రంయొక్క స్థిరవ్యయం 200 కలములపైనే పడుతుంది. అలా కాక ఆ యంత్రంతో 1000 కలములు తయారు చేస్తే దాని స్థిర వ్యయం 1000 కలములపైన పడడం వల్ల కలం యొక్క ఉత్పత్తి వ్యయం తక్కువగా ఉంటుంది. అంటే అవిభాజ్య ఉత్పత్తి కారకాలను ఉపయోగించేటప్పుడు ఉత్పత్తి పెరిగినకొద్దీ ఉత్పత్తి వ్యయం తగ్గుతూ ఉంటుంది. అవిభాజ్యత అనేది ఒక్క యంత్రాలకేగాక శ్రామికులకు కూడా వర్తిస్తుంది.

iii) **ప్రత్యేకీకరణ (Specialisation)** : సంస్థ పరిమాణం పెరిగిన కొద్దీ శ్రామికులలో ప్రత్యేకీకరణ ప్రవేశపెట్టడానికి అవకాశం ఏర్పడుతుంది. అట్టి ప్రత్యేకీకరణ వల్ల అనేక లాభాలు చేకూరుతాయి. అలాగే ప్రత్యేక యంత్రాలను ఉపయోగించటానికి కూడా వీలు ఏర్పడుతుంది. దీనివల్ల కూడా ప్రతిఫలాలు పెరుగుతాయి.

ఈ మూడు కారణాల ఫలితంగా ఉత్పత్తి తరహా పెరిగిన కొద్దీ అధిక ప్రతిఫలాలను సంస్థ పొందగలుగుతుంది.

**2. తరహానుసరించి స్థిర ప్రతిఫలాలు (Constant Returns to Scale):** తరహానుసరించి పెరుగుతున్న ప్రతిఫలాలు కొంతవరకే చేకూరుతాయి. ఒకస్థాయికి సంస్థ చేరిన తర్వాత ప్రతిఫలాలు స్థిరంగా ఉంటాయి. అప్పుడు ఉత్పత్తి కారకాలను రెట్టింపు చేస్తే ఉత్పత్తి కూడా సరిగ్గా రెట్టింపే అవుతుంది. ఈ స్థాయిని "స్థిర ప్రతిఫలాల స్థాయి" అంటారు. స్థిర ప్రతిఫలాలు వస్తున్నప్పుడు వ్యయాలు కూడా స్థిరంగానే ఉంటాయి.

**3. తరహానుసరించి క్షీణ ప్రతిఫలాలు (Diminishing Returns to Scale):** ఉత్పత్తి సంస్థ ఒక స్థాయిని దాటిన తర్వాత ప్రతిఫలం క్రమంగా క్షీణిస్తుంది. పరిమాణం పెరుగుదల వల్ల కలిగే లాభాలు తగ్గుతాయి. దానికి కారణం సంస్థ ఒక దశను దాటిన తర్వాత ఉత్పత్తి సాధనాల సంవిధానం క్లిష్టతరమౌతుంది. నియంత్రణ కూడా కష్టమౌతుంది. అందువల్ల క్షీణ ప్రతిఫలాలు రావటం తప్పనిసరి అవుతుంది. ప్రతిఫలాలు క్షీణిస్తున్నప్పుడు ఉత్పత్తి వ్యయాలు పెరుగుతాయి.

**ప్రశ్న4) పెద్ద తరహా ఉత్పత్తి వల్ల కలిగే ప్రయోజనాలు, నష్టాలు ఏవి?**

**జవాబు :** ఎక్కువ మంది శ్రామికులతో భారీ యంత్రాలతో పెద్ద మొత్తాల పెట్టుబడులతో ఉత్పత్తి సాగించునది పెద్ద తరహా ఉత్పత్తి. పారిశ్రామిక విప్లవం తర్వాత భారీ యెత్తున ఉత్పత్తి చేయడం వాడుకలోకి వచ్చింది. ఆధునిక ప్రపంచంలో సంస్థ పరిమాణము అంతకంతకూ పెరుగుతూ వచ్చింది. దాని వలన ఈ క్రింది ప్రయోజనాలు కలుగుతాయి.

**1. క్రయ, విక్రయాలలో ఆదాలు :** ముడి పదార్థములను కొనటంలోను, తయారైన వస్తువులను అమ్మటంలోను కొంత ఆదా పెద్ద తరహా ఉత్పత్తి వలన కలుగుతుంది. అమ్మకాలు, కొనుగోలు పెద్ద మొత్తాలలో జరగటం వలన ఈ ప్రయోజనం కలుగుతుంది.

**2. నాణ్యమైన వస్తువుల ఉత్పత్తి :** పెద్ద తరహా ఉత్పత్తిలో శ్రమ విభజన జరిగి పనులన్నీ వేర్వేరు శాఖలకు కేటాయించబడతాయి. ఫలితంగా నాణ్యమైన వస్తువులు ఉత్పత్తి చేయబడతాయి.

**3. తక్కువ నిర్వహణ ఖర్చులు :** ఉత్పత్తి పెద్ద మొత్తాలలో ఉండడంచేత ఒక్కొక్క వస్తువుపై అయ్యే నిర్వహణపు ఖర్చులు తక్కువగా ఉంటాయి.

**4. వివిధ రకాలైన వస్తువుల లభ్యత :** వినియోగదార్ల కోర్కెలను తీర్చగల పెక్కు వస్తువులు పెద్ద తరహా ఉత్పత్తి వల్ల తయారవుతాయి.

**5. ఉప ఉత్పత్తులను సద్వినియోగం :** ఉప పదార్థములను (by -products) సద్వినియోగపరచవచ్చు. ఈ ఉప పదార్థాలను ఉప పరిశ్రమలలో ఉపయోగించి ఇతర వస్తువులను తయారు చేయవచ్చు. దీని వలన ఉత్పత్తి వ్యయాలు తగ్గుతాయి.

6. **వడ్డీలో ఆదాలు :** పెద్ద తరహా పరిశ్రమలకు తక్కువ వడ్డీకి బ్యాంకులు, ఇతర రుణ సంస్థలు రుణాన్ని అందిస్తాయి.

7. **ఎక్కువ లాభాలు :** పెద్ద తరహా సంస్థలలో ప్రకటనలు చేయుటకు, ప్రచారం చేయుటకు ఎక్కువ అవకాశం ఉంటుంది. దీనివలన అమ్మకాలు పెరిగి లాభాలు ఎక్కువ వస్తాయి.

8. **సాంకేతిక ఆదాలు :** పరిశోధనలు చేయుటకు, శిక్షణాలయాలను నెలకొల్పుకోవటానికి వీలుంటుంది. దీనివల్ల కొత్త ఉత్పత్తి పద్ధతులను ప్రవేశపెట్టి నాణ్యమైన వస్తువులను తక్కువ వ్యయానికి ఉత్పత్తి చేయటానికి అవకాశమేర్పడుతుంది.

9. **ప్రభుత్వ సహకారం :** పెద్ద తరహా ఉత్పత్తి సంస్థలకు ప్రభుత్వం ఎక్కువ సహకారాన్ని అందిస్తుంది.

10. **నష్టాలను భరించే శక్తి :** నష్టము వచ్చినా తట్టుకోగల శక్తి పెద్ద తరహా పరిశ్రమలకు ఉంటుంది. దేశమంతటా విదేశాలలోను మార్కెట్ ఉండడం వల్ల ఒక ప్రాంతంలో వస్తువుకు డిమాండు తగ్గినా మరో ప్రాంతంలో అమ్ముకోవచ్చు, ఫలితంగా నష్టాలకు అవకాశం ఉండదు.

11. **తక్కువ ఉత్పత్తి వ్యయాలు :** భారీ అధునాతన యంత్రాలను ఉపయోగించి తక్కువ ఉత్పత్తి చేసే అవకాశం పెద్దతరహా పరిశ్రమలకు ఉంటుంది.

**నష్టాలు :** పెద్ద తరహా ఉత్పత్తి వల్ల క్రింది నష్టాలు కలుగుతాయి.

1. పెద్ద తరహా ఉత్పత్తి వలన ఉత్పత్తి ఎక్కువ పెరిగి ధరలు పడిపోవచ్చు. దీనివల్ల ఉత్పత్తి సంస్థలు నష్టానికి గురి అయ్యే అవకాశం ఉంది.
2. పెద్ద తరహా ఉత్పత్తి సంస్థకు అనేకమంది డైరెక్టర్లు, వాటాదార్లు ఉంటారు. వీళ్ళందరిని సంప్రదించి నిర్ణయాలు గైకొనాలి. అందువల్ల నిర్ణయాలు తీసుకోవడంలో కాలయాపన ఎక్కువ జరుగుతుంది.
3. సంస్థ పెద్దదయిన కొద్దీ పర్యవేక్షణ చేయటం, అజమాయిషీ జరపటం కష్టమవుతుంది. ఇది లోపించినప్పుడు శ్రామికులు కాలాన్ని, ముడిపదార్థాలను, యంత్ర పరికరాలను దుర్వినియోగం చేయవచ్చు.
4. పెద్ద తరహా ఉత్పత్తిలో వైవిధ్యము గల వస్తువులు తయారవుతాయి.
5. కార్మికుల సంఖ్య పెరిగిపోయి వారంతా సంఘాలుగా ఏర్పడి కార్మిక పోరాటాలు, ఇతర సంబంధ వర్గ పోరాటాలు బయలుదేరి ఉత్పత్తి కుంటుపడే ప్రమాదం ఉంది.
6. తరచు సమ్మెలూ, లాకౌట్లు, ఘెరావ్‌లు జరుగుతుంటాయి. దీనివల్ల ఉత్పత్తి దెబ్బతింటుంది.
7. బాధ్యత ఎవరిపైన ఉంచటానికి వీలుండదు. దీనివల్ల శ్రామికులలో శ్రద్ధ లోపిస్తుంది. ఫలితంగా వస్తువు నాణ్యత తగ్గుతుంది.

**ప్రశ్న 5) ఉత్పత్తి రంగంలో "ప్రతిస్థాపన సూత్రం" ఎలా అన్వయించబడుతుందో వివరించండి.**

**లేదా**

**ఉత్పత్తి కారకాల కనీస వ్యయ సమన్వయాన్ని విశదీకరించుము.**

**లేదా**

**ఒక ఉత్పత్తి సంస్థ వివిధ ఉత్పత్తి కారకాల కనిష్ఠ వ్యయ సముదాయాన్ని ఎట్లా పొందుతుందో వివరించండి.**

**జవాబు :** భూమి, శ్రమ, మూలధనం, వ్యవస్థాపనము నాలుగు కారకాల ద్వారా ఉత్పత్తి జరుగుతుంది. వీటిలో ఒకదానికి బదులు మరొకదాన్ని కొంతవరకు ప్రతిస్థాపన (substitute) చేయవచ్చు. **ఉదాహరణకు,** నల్లకంకర చిప్స్‌ను శ్రామికులు చేతితో కొట్టి చేయవచ్చు **(లేదా)** యంత్రాలతో చేయవచ్చు. అదేవిధంగా మందులు, సిగరెట్లు లాంటి వాటిని శ్రామికులు చేతితో ప్యాకింగ్ చేయవచ్చు **(లేక)** యంత్రాల సహాయంతో చేయవచ్చు. కనుక శ్రమ, మూలధనాలను ఒకదానికి బదులు ఒకటి వాడవచ్చు. అంటే అవి ప్రత్యామ్నాయ సాధనాలన్నమాట.

**ప్రతిస్థాపన వ్యాకోచత్వం (Elasticity of Substitution)** · ఒక ఉత్పత్తి కారకానికి బదులు మరొక ఉత్పత్తి కారకాన్ని ప్రతిస్థాపన చేయవచ్చునని ప్రతిస్థాపన వ్యాకోచత్వం తెలియజేస్తుంది. A B అనే రెండు ఉత్పత్తి కారకాలు ఒకదానికొకటి పూర్తి ప్రత్యామ్నాయాలైతే ప్రతిస్థాపన వ్యాకోచత్వం అనంతంగా (OC) ఉంటుంది అప్పుడు ఉత్పత్తిదారుడు Aని గాని Bని గాని ఉత్పత్తి కార్యకలాపాల్లో వినియోగించుకోవచ్చు. అలాకాక Aని గాక Bని ఉపయోగించడానికి ఏ మాత్రం వీలు లేకపోతే ఆ రెంటి మధ్య ప్రతిస్థాపన వ్యాకోచత్వం సున్న (0) అవుతుంది. అయితే వాస్తవంలో ప్రతిస్థాపన వ్యాకోచత్వం ఇటు అనంతంగాని, లేక సున్నాగాని ఉండదు. ఈ రెండు విలువలకు మధ్య ఉంటుంది. అంటే ఉత్పత్తి కారకాలు ఒకదానికి బదులు మరొకదాన్ని పూర్తిగా వాడేటట్లుగా ఉండటమనేది అనుభవం కొంతమేరకు ప్రతిస్థాపన చేయవచ్చు. ఎంతమేరకు చేయవచ్చుననేది ముఖ్యంగా ఆ కారకాల ధరలపై ఆధారపడుతుంది.

**ఉత్పత్తి కారకాల కనిష్ఠ వ్యయ సముదాయము :** ఏ ఉత్పత్తిదారుని లక్ష్యమైనా గరిష్ఠ లాభాలను ఆర్జించడమే. అందుకు తగినట్లుగా ఉత్పత్తి కారకాల కలయిక అనుపాతాన్ని నిర్ణయిస్తాయి. అంటే వివిధ ఉత్పత్తి కారకాలకయ్యే వ్యయం కనీస స్థాయిలో ఉండేటట్లు వాటిని వినియోగిస్తాడు. సాధారణ వినియోగదారుడు గరిష్ఠ సంతృప్తిని పొందడానికి అనుసరించే ప్రతిస్థాపన సూత్రాన్నే ఇక్కడ ఉత్పత్తిదారుడు కూడ అనుసరిస్తాడు. ఏ ఉత్పత్తి కారకం యొక్క ఉపాంత ఉత్పత్తి ఎక్కువగా

ఉంటుందో దాన్ని తక్కువ ఉపాంత ఉత్పత్తినిచ్చే కారకం స్థానే ప్రతిస్థాపన చేస్తాడు. ఈ విధంగా ప్రతిస్థాపన చేస్తూ ఉత్పత్తిదారుడు ఉత్పత్తి కారకాల అభిలషణీయ కలయిక (Optimum Combination) ను నిర్ణయిస్తాడు. ఈ ఉత్పత్తి కారకాల అభిలషణీయ సముదాయం క్రింది సూత్రం ద్వారా నిర్ణయింపబడుతుంది.

$$\frac{\text{A ఉపాంత ఉత్పాదనం}}{\text{A ధర}} = \frac{\text{B ఉపాంత ఉత్పాదనం}}{\text{B ధర}} = \frac{\text{C ఉపాంత ఉత్పాదనం}}{\text{C ధర}}$$

ఈ నిష్పత్తులు సమానమయ్యేవరకు ప్రతిస్థాపన కొనసాగుతూనే ఉంటుంది. అంటే A ఉపాంత ఉత్పత్తి దాని ధర ఏ నిష్పత్తిలో ఉందో B ఉపాంత ఉత్పత్తి దాని ధర అదే నిష్పత్తిలో ఉండవలె. అలాగే C ఉపాంత ఉత్పత్తి దాని ధర కూడా వాటి నిష్పత్తిలోనే ఉండాలి. అలా ఉన్నప్పుడు ఉత్పత్తి కారకాల కనిష్ట వ్యయ సముదాయం ఏర్పడుతుంది.

**ప్రశ్న 6) కాబ్-డగ్లస్ ఉత్పత్తి ఫలము (CobbDouglas Production function).**

**లేదా**

**ఉత్పత్తి ఫలమనగానేమి ? కాబ్-డగ్లస్ ఉత్పత్తి ఫలమును వివరింపుము.**

**(Very Important)**

జవాబు : ఉత్పత్తి సాధనాలకు, ఉత్పత్తికి మధ్యగల సంబంధాన్ని "ఉత్పత్తి ఫలం" అంటారు. ఇది భౌతిక ఉత్పత్తి సాధనాలకు, భౌతిక ఉత్పత్తికి గల సంబంధాన్ని తెలియ చేస్తుంది. ఈ ఉత్పత్తి ఫలాన్ని క్రింది సమీకరణం ద్వారా చూపవచ్చు.

$P = f(a, b, c \ldots n)$

ఈ సమీకరణంలో P ఒక వస్తువు యొక్క ఉత్పత్తిని, a,b,c,....n వివిధ ఉత్పత్తి సాధనాలను సూచిస్తాయి.

గణాంక విశ్లేషణ ద్వారా భౌతిక ఉత్పత్తి సాధనాలకు, భౌతిక ఉత్పత్తికి గల సంబంధాన్ని చాలా మంది ఆర్థికవేత్తలు పరిశీలించారు. అలాంటి వారిలో అమెరికాకు చెందిన పాల్ డగ్లస్ (Paul Douglass) C.W. కాబ్ (C.W. Cobb)లు రూపొందించిన ఉత్పత్తి ఫలం ప్రసిద్ధమైంది. దీన్ని "కాబ్ డగ్లస్ ఉత్పత్తి ఫలం" అంటారు. కాబ్-డగ్లస్ ఉత్పత్తి ఫలం క్రింద చూపిన విధంగా ఉంటుంది.

$P = A L^q C^p$ ఇందులో P = ఉత్పత్తి

L = శ్రమ పరిమాణం C = మూలధన పరిమాణం

A = ఒక ధనాత్మక స్థిర రాశి (Positive Constant)

p, q లు శ్రమ మూలధనానికి సంబంధించిన ఉత్పత్తి వ్యాకోచాలు.

కాబ్ డగ్లస్‌లు 1900-1922 సంవత్సరాల వివరాలను బట్టి అమెరికన్ ఉత్పత్తి పరిశ్రమ (Manufacturing Industry) కు కనుక్కొన్న ఉత్పత్తి ఫలం క్రింది విధంగా ఉంటుంది.

P= 1.10 L= 0.75 C = 0.25

ఇక్కడ శ్రమ ఘాతాంకము (exponent) అంటే 0.75 శ్రమను 1 శాతం పెంచితే ఉత్పత్తి 0.75 పెరుగుతుందన్న మాట. అదే విధంగా మూలధనం యొక్క ఘాతాంకము 0.25 అంటే మూలధనాన్ని 1 శాతం పెంచితే ఉత్పత్తి 0.25 శాతం పెరుగుతుందన్నమాట. కనుక శ్రమ మూలధనాన్ని రెండింటిని 1 శాతం పెంచితే ఉత్పత్తి 1 శాతం పెరుగుతుంది. దీన్నిబట్టి అమెరికన్ ఉత్పత్తి పరిశ్రమలో తరహానుసరించి వచ్చే ప్రతిఫలాలు స్థిరంగా (Constant returns to scale) ఉన్నాయని తెలుస్తుంది. కనుక కాబ్-డగ్లస్ ఉత్పత్తి ఫలం తరహా ననుసరించి వచ్చే ప్రతిఫలాలను తెలుసుకోవడానికి ఉపయోగపడుతుంది. అందువల్లనే ఈ ఉత్పత్తి ఫలం బహుళ ప్రచారంలోకి వచ్చింది.

విమర్శ : కాబ్ డగ్లస్ ఉత్పత్తి ఫలం దిగువ అంశములపై విమర్శింపబడినది :

i) ఇది స్థిర ప్రతిఫలాలను సూచిస్తుంది. అయితే స్థిర ప్రతిఫలాలు వాస్తవం కాదు. పరిశ్రమలు సాధారణంగా పెరిగే ప్రతిఫలాలకుగానీ, క్షీణ ప్రతిఫలాలకు గాని గురి అవుతుంటాయి.

II) ఏ ఉద్యమదారుడు స్థిర ప్రతిఫలాలు పొందుటకు ఉత్పత్తిని పెంచడు. ఉద్యమదారుల ఉద్దేశం పెరిగే ప్రతిఫలాలు పొందుటకాని, స్థిర ప్రతిఫలాలు కాదు.

**ప్రశ్న 7) ఉత్పత్తి ఫలము (Production Function).**

**జవాబు :** ఉత్పాదక సంస్థలు ఉత్పత్తి సాధనాలను ఉపయోగించి వస్తువులను ఉత్పత్తి చేస్తాయి. ఒక ఉత్పాదక సంస్థ కొంత పరిమాణంలో ముడి పదార్థము, ఉత్పత్తి సాధనములు ఉపయోగించి ఎన్ని వస్తువులను ఉత్పత్తి చేస్తుందో తెలియచేసేదానిని "ఆ సంస్థ ఉత్పత్తి ఫలము" అంటారు. అంటే ఉత్పత్తి సాధనాలకు, ఉత్పత్తికి మధ్య ఉన్న సంబంధాన్ని సూచించేదే ఉత్పత్తి ఫలం.

ఈ ఉత్పత్తి సంబంధము ఒక్కొక సంస్థకు ఒక్కొక్క విధముగా ఉంటుంది. ఒక సంస్థ సాధించిన సాంకేతికపరమైన అభివృద్ధి మీద ఈ సంబంధం ఆధారపడి ఉంటుంది. సాంకేతికమైన అభివృద్ధి సాధించినప్పుడు కొత్త ఉత్పత్తి సంబంధము ఏర్పడుతుంది. అదే ఉత్పత్తి సాధనాలతో ఇప్పుడు ఎక్కువ సంఖ్యలో వస్తువుల ఉత్పత్తి సాధ్యమవుతుందని కొత్త ఉత్పత్తి ఫలము సూచిస్తుంది.

ఒక నిర్ణీత కాలంలో కొంత సాంకేతిక పరిజ్ఞానం, యాజమాన్య సామర్థ్యం ఉన్నప్పుడు ఉత్పత్తి సాధనాలను ఏ పరిమాణంలో ఉపయోగించినట్లయితే అధిక

వస్తూత్పత్తిని సాధించవచ్చో ఉత్పత్తి ఫలం ద్వారా తెలుసుకోవచ్చు. ఉదాహరణకు రెండు ఉత్పత్తి సాధనాలను - మూలధనం, శ్రమలను తీసుకుని రూపొందించబడిన ఒక ఉత్పత్తి ఫలాన్ని ఈ క్రింది పట్టిక చూపుతుంది.

**నిర్ణీత కాలంలో ఒక వస్తువు ఉత్పత్తి**

| మూలధనము | | | | | |
|---|---|---|---|---|---|
| 5 | 100 | 110 | 125 | 140 | 160 |
| 4 | 90 | 00 | 115 | 125 | 145 |
| 3 | 70 | 80 | 95 | 110 | 130 |
| 2 | 40 | 60 | 80 | 110 | 120 |
| 1 | 10 | 30 | 55 | 85 | 105 |
| | 1 | 2 | 3 | 4 | 5 |

శ్రామికుల సంఖ్య

ఈ పట్టికలో ఒక సంస్థ 1 యూనిట్టు మూలధనము 1 శ్రామికుని వినియోగించి ఒక వస్తువును 10 యూనిట్లు తయారుచేస్తుంది. 3 యూనిట్ల మూలధనము, నలుగురు శ్రామికులతో అదే వస్తువుని 110 యూనిట్లలో తయారుచేస్తుంది. ఈ విధంగా మూలధనము, శ్రామికులను ఏ యే పరిమాణములో ఉపయోగిస్తే వస్తువును ఎంత పరిమాణంలో ఉత్పత్తి చేయవచ్చో ఈ పట్టిక చూపుతుంది. అంతేగాక వస్తువును కొన్ని యూనిట్ల పరిమాణంలో ఉత్పత్తి చేయాలంటే ఎంత మూలధనాన్ని, ఎంతమంది శ్రామికులను వినియోగించాలో కూడా ఈ పట్టిక సూచిస్తుంది. దీన్నే "ఉత్పత్తి ఫలం" అంటారు.

**ప్రశ్న 8) అభిలషణీయ సంస్థను గురించి వివరింపుము.**

**జవాబు:** ఒక సంస్థ పరిమాణము పెరిగేకొద్దీ ఉత్పత్తిలో అనేక ఆదాలు వస్తాయి. ఒకస్థాయి తరువాత ఆదాలకు బదులు నష్టాలు వస్తాయి. కాబట్టి నష్టాలు లేకుండా లాభాలు వచ్చేంత వరకు మాత్రమే ఆ సంస్థ ఉత్పత్తిని పెంచుతుంది. సగటు వ్యయము ఎక్కడ తక్కువగా ఉంటే అచ్చట ఉత్పత్తిని ఆపు చేయవలెను. ఏ పరిమాణము వద్ద సగటు వ్యయము కనిష్టంగా ఉంటుందో ఆ పరిమాణమును "అభిలషణీయ పరిమాణము' ' అంటారు. ఈ పరిమాణములో ఉత్పత్తి చేయు సంస్థను "అభిలషణీయ సంస్థ" అంటారు.

అభిలషణీయ పరిమాణం స్థిరమైనది కాదు. ఇది సాంకేతిక విజ్ఞానము, నిర్వహణ సామర్థ్యముతోపాటు మారుతుంది. అన్ని సంస్థలు ఒకే విధమైన సాంకేతిక విజ్ఞానమును, ఉత్పత్తి విధానాలను కలిగి ఉండవు. అవి ఒక పరిశ్రమ నుండి మరొక

పరిశ్రమకు మారుతూ ఉంటాయి. కాబట్టి వివిధ పరిశ్రమలలో వివిధ అభిలషణీయ పరిమాణాలు గోచరిస్తాయి. అభిలషణీయ సంస్థను ఈ క్రింద పటములో చూపినాము.




ఉత్పత్తి పరిమాణము

పై పటంలో OX అక్షంపై ఉత్పత్తి పరిమాణమును, OY అక్షంపై సగటు వ్యయము చూపినాము. OM పరిమాణము వద్ద సగటు వ్యయము కనీస స్థాయిలో ఉన్నది కనుక OM ఉత్పత్తి పరిమాణమును "అభిలషణీయ పరిమాణము" అంటారు. అభిలషణీయ ఉత్పత్తి స్థాయిని కలిగియున్న సంస్థను "అభిలషణీయ సంస్థ" అంటారు.



# అధ్యాయము 5

# వ్యయ, రాబడి వక్రరేఖలు

**ప్రశ్న 1) ద్రవ్య వ్యయాలు, వాస్తవ వ్యయాలు, అవకాశ వ్యయాలు అనగానేమి ? వీటికిగల భేదాలను తెల్పుము ?**

**లేదా**

**అవకాశ వ్యయ భావనకున్న ప్రాముఖ్యతను తెల్పి, దాని అనువర్తిత విషయాలను తెల్పుము ?**

**లేదా**

**వాస్తవిక వ్యయాలు, అవకాశ వ్యయాలు - వాటి భావనలను వివరిస్తూ వాటి సాపేక్ష లాభాలను పేర్కొనుము ?**

జవాబు : వస్తుసేవల సప్లయ్ వాటి ఉత్పత్తి వ్యయాలపై ఆధారపడి ఉంటుంది. వస్తువుల సప్లయ్, డిమాండు రెండూ కలిసి వస్తువుల ధరలు నిర్ణయిస్తాయి. కనుక ధర నిర్ణయాన్ని, సప్లయ్‌ని అర్థం చేసుకోవటానికి ఉత్పత్తి వ్యయాలను గురించి సమగ్ర పరిశీలన అవసరం.

ఉత్పత్తి వ్యయాలు (Costs of Production) : వీటిని మూడు రకాలుగా చెప్పవచ్చు.

1) ద్రవ్య వ్యయాలు (Money Costs) : సర్వసాధారణంగా ఉపయోగించే భావన ద్రవ్య వ్యయం. ఉత్పత్తి కారకాలకు చెల్లించిన ద్రవ్యాన్ని "ద్రవ్య వ్యయం" అంటారు. ముడి పదార్థాలకు చెల్లించిన మొత్తాలు, శ్రామికుల వేతనాలు, రవాణా ఇంధనాదికయ్యే ఖర్చులు, మూలధనంపై వడ్డీ మొదలైనవన్నీ కలిసి ద్రవ్య ఉత్పత్తి వ్యయం అవుతుంది. ఉత్పత్తిదార్లు ఎక్కువగా ఈ ద్రవ్య వ్యయాన్నే పరిగణనలోకి తీసుకుంటారు. వస్తువు ధర దీర్ఘకాలంలోనైనా ద్రవ్య వ్యయానికి సరిపోవాలి. ద్రవ్య వ్యయం వస్తువు ధర కన్నా ఎక్కువగా ఉంటే ఉత్పత్తి సంస్థ నష్టాలకు గురై ఉత్పత్తి విలిపివేస్తుంది.

2) వాస్తవ వ్యయాలు (Real Costs): ఉత్పత్తి కారకాలను ఉపయోగించి ఒక వస్తువును ఉత్పత్తి చేయడంలో చేసిన ప్రయత్నాలు, (efforts) త్యాగాలను, (sacrifices)ను "వాస్తవిక వ్యయాలు" అంటారు. శ్రమలో ఇమిడి ఉన్న బాధ, పొదుపు చేయటానికై వినియోగాన్ని తగ్గించుకోవటంలో చేసిన త్యాగం, వ్యవస్థాపకుడు భరించే మానసిక వ్యధ, అనిశ్చిత పరిస్థితి - ఇవన్నీ కలిసి వాస్తవిక లేక నిజ వ్యయాలవుతాయి. అయితే వీటిని ద్రవ్యరూపంలోకాక త్యాగాలు, ప్రయత్నాల రూపంలో పరిశీలించవలె. అందువలన వాస్తవిక వ్యయాలను లెక్కకట్టడం సాధ్యం కాదు. ఇవి అనేక మానసిక పరిస్థితులపై ఆధారపడి ఉంటాయి.

ధర నిర్ణయంలో వాస్తవిక వ్యయాలు పరిగణలోకి తీసుకోబడవు. కాని సమాజ దృష్ట్యా వీటికి ప్రాముఖ్యం ఉంది.

3) అవకాశ వ్యయాలు (Opportunity Costs): ఆధునిక అర్థశాస్త్ర విశ్లేషణలో అవకాశ వ్యయాలు అనే భావన ప్రాముఖ్యాన్ని సంతరించుకుంది. వనరులు పరిమితం. అందులోను వాటికి ప్రత్యామ్నాయ ప్రయోజనాలుంటాయి. ఒక వనరుని ఒక ఉపయోగంలో వాడాలంటే, దాన్ని మరొక ఉపయోగం నుంచి మరల్చాలి. కనుక ఒక **ఉత్పత్తి సాధనం యొక్క అవకాశ వ్యయం దాని తర్వాత అత్యుత్తమ ప్రత్యామ్నాయ ఉపయోగంలో ఉండే ఆర్జన.** ఉదాహరణకు ఒక భూమిని చెరుకు పండించడానికి ఉపయోగిస్తే ఆ భూమి యొక్క అవకాశ వ్యయం దాన్ని మరొకరు పంట పండించడానికి ఉపయోగిస్తే కలిగే ఫలితం అదేవిధంగా ఒక శ్రామికుడు ఒక ఉత్పత్తి రంగంలో రు. 100 వేతనం పొందుతూంటే ఇంకొక ఉత్పత్తి రంగంలో ఈ రూ. 100 అవకాశ వ్యయం అవుతుంది. కనుక ఏ ఉత్పత్తి సంస్థ అయినా కొన్ని ఉత్పత్తి సాధనాలను వినియోగింపదలిస్తే ఆ సాధనాలకు కనీసం వాటి అవకాశ వ్యయాలను చెల్లించవలె. అలా చెల్లించని పక్షంలో ఆ సాధనాలు ఈ ఉపయోగంలోకి రావు. అయితే ఒక ఉత్పత్తి కారకము యొక్క అవకాశ వ్యయం నిర్ణయించడం అంత సులువైన పని కాదు.

ఆధునిక అర్థశాస్త్ర విశ్లేషణలో ఈ అవకాశ వ్యయాలే వాస్తవిక వ్యయాలుగా భావింపబడుతున్నాయి. ఈ భావన ఇప్పుడు విశేష ప్రచారంలో ఉంది. ఆదాయ పంపిణీ సిద్ధాంతం విలువ నిర్ణయ సిద్ధాంతాలలో అవకాశ వ్యయం అనే భావన విరివిగా వాడబడుచున్నది.

విమర్శ: అవకాశ వ్యయం అనే భావన అనేకమంది విమర్శలకు గురి అయింది.

1. ప్రత్యామ్నాయ ఉపయోగం లేని ఉత్పత్తి కారకాలకు అవకాశ వ్యయం భావన వర్తించదు. అలాంటి వాటికి అవకాశ వ్యయం కనుక్కోవటం సాధ్యం కాదు.

2. ఉత్పత్తి కారకాల యూనిట్లన్నీ ఏక జాతీయంగా ఉండవు. వాటి సామర్థ్యంలో తేడాలుంటాయి. ఉదాహరణకు శ్రామికులంతా ఒకే సామర్థ్యాన్ని కలిగి ఉండరు. అలాంటప్పుడు శ్రమ యొక్క అవకాశ వ్యయం కనుక్కోలేము.
3. అవకాశ వ్యయం అనే భావన ఉత్పత్తి కారకాల మార్కెట్‌లో పరిపూర్ణ పోటీ ఉన్నదనే ప్రమేయంపై ఆధారపడింది. కాని వాస్తవానికి పరిపూర్ణ పోటీ ఉండదు.

పై కారణాల వలన అవకాశ వ్యయాన్ని నిర్ణయించటం ఎంతో కష్టం. అయినప్పటికి ఒక వస్తువు ఉత్పత్తి వ్యయాన్ని, దాని ఉత్పత్తికి వినియోగించిన ఉత్పత్తి కారకం వలన కోల్పోయిన ఇతర వస్తువుల విలువగా లెక్కకట్టడం ఆర్థిక విశ్లేషణలో పరిపాటి అయింది.

**ప్రశ్న 2) స్థిర వ్యయాలు, చర వ్యయాలు అనగానేమి ? వాటి ప్రాధాన్యతను తెల్పుము.**

**లేదా**

**స్థిర వ్యయాలకు, చర వ్యయాలకు మధ్య విచక్షణ చేయుమది.**

**జవాబు : వ్యయాలు - రకాలు** : ఒక ఉత్పాదక సంస్థ వస్తూత్పత్తిలో చేసే వ్యయాలు రెండు రకాలుగా ఉంటాయి. అవి : 1) స్థిర వ్యయాలు, 2) చర వ్యయాలు.

**1) స్థిర వ్యయాలు (Fixed Costs)** : ఒక ఉత్పాదక సంస్థ ఉపయోగించే ఉత్పత్తి కారకాలు రెండు రకాలుగా ఉంటాయి. అవి : స్థిర ఉత్పత్తి కారకాలు, చర ఉత్పత్తి కారకాలు-ఈ రెండింటిని ఉపయోగించి సంస్థ ఉత్పత్తి సాగిస్తుంది. కర్మాగార భవనం, యంత్రాలు వంటివి స్థిర ఉత్పత్తి కారకాలు. వీటికి సంబంధించిన వ్యయాలను "స్థిర వ్యయాలంటారు". ఈ కారకాలను పూర్తిగా వినియోగించినా, కొంత వరకే వినియోగించినా, లేక అసలు వినియోగించకపోయినా వాటి వ్యయాలు స్థిరంగా ఉంటాయి. వీటిని సంస్థ భరించవలసి ఉంటుంది. అలాగే అప్పు తెచ్చిన మూలధనం మీద వడ్డీ, భీమా ఖర్చులు, ఆస్తి పన్నులు, యంత్రాల తరుగుదల వ్యయాలు, కొంత మంది సిబ్బంది యొక్క వేతనాలు మొదలైనవన్నీ స్థిర వ్యయాలే. ఈ వ్యయాలకు, ఉత్పత్తికి ఏ విధమైన సంబంధం ఉండదు. ఉత్పత్తి పరిమాణంతోపాటు పెరగటంగాని, తగ్గటంకాని ఉండదు. అందువల్లే వీటిని "స్థిర వ్యయాలు" అంటారు. మార్షల్ స్థిర వ్యయాలనే "వ్యవస్థా వ్యయాలని" (Overhead Costs) పేర్కొన్నాడు. స్థిర వ్యయ రేఖ క్రింది పటంలో చూపినట్లు TFC-X అక్షానికి సమాంతరంగా ఉంటుంది




**2) చరవ్యయాలు (Variable Costs) :** ప్రతి ఉత్పాదక సంస్థ స్థిర ఉత్పత్తి కారకాలతోపాటు కొన్ని చర ఉత్పత్తి కారకాలను కూడా ఉపయోగిస్తుంది శ్రమ, ఇంధనం, ముడి సరుకులు మొదలైనవి చర ఉత్పత్తి కారకాలు. వీటిపై చేసే వ్యయాలను "చర వ్యయాలు" అంటారు. చర వ్యయాలు ఉత్పత్తి పరిమాణంతో పరస్పర సంబంధం కలిగి ఉంటాయి. ఉత్పత్తి పరిమాణం పెరిగినకొద్దీ అవి కూడా పెరుగుతూ, ఉత్పత్తి పరిమాణం తగ్గినప్పుడు అవి కూడా తగ్గుతాయి. అసలు ఉత్పత్తి ఏమీ లేకపోతే చర వ్యయాలు ఏమీ ఉండవు. ఉత్పత్తితోపాటుగా మారుతుంటాయి. కనుక వీటిని "చర వ్యయాలు" అంటారు. ఈ వ్యయాలనే మార్షల్ "ప్రత్యక్ష వ్యయాలు' ' (Direct or Prime Costs) అని పేర్కొన్నాడు.

అయితే ఉత్పత్తి వ్యయాలను స్థిర వ్యయాలని, చర వ్యయాలని ఖచ్చితంగా విభజించటానికి వీలులేదు. **ఉదాహరణకు,** ఉత్పత్తిని నిలిపివేసినా ఒకరిద్దరు శ్రామికులను పనిలో కొనసాగనిస్తే వారి వేతనాలు స్థిర వ్యయం అవుతుంది. అంతేగాక ఈ రెండు రకాల వ్యయాలకున్న భేదము స్వల్పకాలికమైనదే. కారణం దీర్ఘకాలంలో అన్ని రకాల వ్యయాలు చర వ్యయాలే అవుతాయి. దీర్ఘకాలంలో ఉత్పత్తి పరిమాణాన్ని ఒక స్థాయి దాటి పెంచినప్పుడు యంత్ర భవనాలు, యంత్రాల లాంటి స్థిర ఉత్పత్తి కారకాలను కూడా పెంచవలసి వస్తుంది. అప్పుడు అవి కూడా చర ఉత్పత్తి కారకాలే అవుతాయి. వాటిపై చేసే వ్యయం చర వ్యయం అవుతుంది. చర వ్యయ రేఖ (TVC) సప్లయ్ రేఖ వలె ఎడమ నుండి కుడికి పైకి పోతుంది.

**మొత్తం వ్యయం (Total Cost) :** వస్తువును ఉత్పత్తి చేయటానికి గాను ఉత్పత్తిదారుడు చేసిన వ్యయాన్ని "మొత్తం వ్యయం" అంటారు. అంటే ఉత్పత్తిదారుడు చేసిన స్థిర వ్యయం, చర వ్యయం కలిసి మొత్తం ఉత్పత్తి వ్యయం అవుతుంది. ఉత్పత్తి పరిమాణంతోపాటు మొత్తం వ్యయం కూడ పెరుగుతుంది లేక తగ్గుతుంది. కనుక మొత్తం వ్యయరేఖ (T) పటంలో చూపినట్లు ఎడమ నుండి కుడికి పైకి పోతుంది.




**సగటు స్థిర వ్యయం (Average Fixed Cost) :** మొత్తం స్థిర వ్యయాన్ని ఉత్పత్తి పరిమాణంతో భాగిస్తే సగటు స్థిర వ్యయం వస్తుంది. స్థిర వ్యయం మారదు కాబట్టి ఉత్పత్తి పరిమాణం పెరిగిన కొద్దీ సగటు స్థిర వ్యయం తగ్గుతుంది. ఇందుకు కారణం అదే స్థిర వ్యయం వస్తువు యొక్క ఎక్కువ యూనిట్లపై పంచబడుతుంది. కనుక అందువల్ల సగటు స్థిర వ్యయ రేఖ (AFC) అతిపరావలయ లంబరేఖ (Rectangular hyperbola) గా ఉంటుంది.



సగటు చర వ్యయం (Average Variable Cost). మొత్తం చర వ్యయాన్ని ఉత్పత్తి పరిమాణంతో భాగిస్తే సగటు చర వ్యయం వస్తుంది. ఉత్పత్తి పరిమాణం పెరిగినకొద్దీ సగటు చర వ్యయం మొదట్లో తగ్గి, తర్వాత పెరుగుతుంది. ఇందుకు కారణం క్షీణ ప్రతిఫలాలు అమలులోకి రావటమే. అందువల్ల సగటు చర వ్యయ రేఖ (AVC) "U" ఆకారంలో ఉంటుంది.




స్వల్ప కాలంలోని వివిధ వ్యయరేఖలను ఈ క్రింది పటంలో చూపినాము.




పై పటంలో సగటు స్థిర వ్యయరేఖ ఎడమనుంచి కుడికి క్రిందకి వాలియుంటుంది. సగటు చర వ్యయరేఖ "U" ఆకారంలో యుంటుంది. సగటు వ్యయరేఖ, ఉపాంతముల రేఖ కూడా "U" ఆకారంలో యుంటాయి సగటు వ్యయం కనిష్ఠంగా యున్నప్పుడు ఉత్పత్తి అభిలషణీయంగా యుంటుంది.

**ప్రశ్న 3) స్థిర వ్యయాలకు - చర వ్యయాలకు గల తేడాలను తెల్పుము.**

జవాబు : స్వల్ప కాలంలో ఉత్పత్తి వ్యయాలను రెండు రకాలుగా వర్గీకరిస్తాము.

1) స్థిర వ్యయాలు 2) చర వ్యయాలు

1) స్థిర వ్యయాలు : ఉత్పత్తితోపాటు మారకుండా స్థిరంగా యుండే వ్యయాలను "స్థిర వ్యయాలు" అంటారు. ఉత్పత్తి పెరిగినా, తగ్గినా స్థిర వ్యయాలు మారవు. ఉదా॥ భవనాల అద్దె, మూలధనంపై వడ్డీ, శాశ్వత ఉద్యోగస్థులకు జీతాలు మొదలగునవి స్థిర వ్యయాలు క్రిందకు వస్తాయి.

2) చర వ్యయాలు : ఉత్పత్తితో పాటు మారే వ్యయాలను "చర వ్యయాలు" అంటారు. ఉత్పత్తి పెరిగితే చర వ్యయాలు పెరుగుతాయి. ఉత్పత్తి తగ్గితే చర వ్యయాలు తగ్గుతాయి. ఉత్పత్తి లేకపోతే చర వ్యయాలు యుండవు. ఉదా॥ వేతనాలు, ముడి సరుకులపై ఖర్చులు మొదలగునవి చర వ్యయాలు క్రిందకు వస్తాయి.

స్థిర వ్యయాలకు - చర వ్యయాలకు గల తేడాలను ఈ క్రింది పట్టికలో చూపినాము.

| స్థిరవ్యయాలు | చర వ్యయాలు |
|---|---|
| 1. ఉత్పత్తితో పాటు మారకుండా స్థిరంగా యుంటాయి. | 1. ఉత్పత్తితో పాటు మారతాయి. |
| 2. ఉత్పత్తి లేకపోయినా స్థిరవ్యయాలు యుంటాయి. | 2. ఉత్పత్తి లేకపోతే చర వ్యయాలు యుండవు. |
| 3. భవనాలపై అద్దె, మూలధనంపైవడ్డీ మొ॥వి స్థిర వ్యయాలకు ఉదాహరణలు. | 3. వేతనాలు, ముడిసరుకులపై ఖర్చు మొదలగునవి చర వ్యయాలకు ఉదాహరణలు. |
| 4. ఉత్పత్తి పెరిగే కొద్దీ సగటు స్థిర వ్యయం తగ్గుతుంది. | 4. ఉత్పత్తి పెరిగే కొద్దీ సగటు చర వ్యయం మొదట్లో తగ్గుతుంది. ఆ తరువాత పెరుగుతుంది. |
| 5. స్థిర వ్యయరేఖ "X" అక్షానికి సమాంతరంగా యుంటుంది. | 5. చర వ్యయరేఖ ఎడమ నుంచి కుడికి పైకి వాలి యుంటుంది. |
| 6. సగటుస్థిర వ్యయరేఖ ఎడమనుంచి కుడికి క్రిందకు వాలి యుంటుంది. | 6. సగటు చర వ్యయ రేఖ "U" ఆకారంలో యుంటుంది. |
| 7. స్థిర వ్యయాలు స్వల్ప కాలంలో మాత్రమే యుంటాయి. | 7. చర వ్యయాలు దీర్ఘ కాలంలో కూడా యుంటాయి. |

**ప్రశ్న 4) మొత్తం వ్యయం, సగటు వ్యయం, ఉపాంత వ్యయాలకుగల తేడా ఏమిటి?**

**లేదా**

**సగటు వ్యయ రేఖ, ఉపాంత వ్యయ రేఖ ఒకదానికొకటి ఖండించుకొను బిందువు యొక్క ప్రాముఖ్యతను వివరింపుము.**

**జవాబు : మొత్తం వ్యయం (Total Cost) :** ప్రతి ఉత్పాదక సంస్థ వస్తువు ఉత్పత్తి చేయటానికి స్థిర, చర అను రెండు రకాల ఉత్పత్తి కారకాలను వినియోగిస్తుంది. యంత్రాలు, కర్మాగార, భవనాలు వంటి స్థిర ఉత్పత్తి కారకాలపై చేసే వ్యయాన్ని "స్థిర వ్యయం" అని, ముడి పదార్థాలు, ఇంధనం, శ్రామికులు వంటి చర ఉత్పత్తి సాధనాలపై చేసే వ్యయాన్ని "చర వ్యయం" అని అంటారు. ఈ రెండు వ్యయాలను కలిపితే మొత్తం ఉత్పత్తి వ్యయం వస్తుంది. ఈ మొత్తం ఉత్పత్తి వ్యయం, ఉత్పత్తి పరిమాణం పెరిగితే పెరుగుతుంది. ఉత్పత్తి పరిమాణం తగ్గితే తగ్గుతుంది. అయితే ఉత్పత్తి ఏమీ లేకపోయినప్పటికి మొత్తం వ్యయం ఎంతో కొంత ఉంటుంది.

మొత్తం వ్యయం = స్థిర వ్యయం + చర వ్యయం

TC. = F .C. + V.C.

**సగటు వ్యయం (Average Cost) :** స్థిర, చర వ్యయాలను కలిపితే, వస్తూత్పత్తికి అయిన మొత్తం వ్యయం తెలుస్తుంది. ఈ మొత్తం వ్యయాన్ని ఉత్పత్తి చేసిన వస్తువుల సంఖ్యచే భాగిస్తే తలసరిన ఒక్కొక్క వస్తువుకు అయిన వ్యయం తెలుస్తుంది. దీన్నే "సగటు వ్యయం" అంటారు. **ఉదాహరణకు,** ఒక ఉత్పాదక సంస్థ రూ. 30 స్థిర వ్యయం, రూ. 24 చర వ్యయం చేసి ఒక వస్తువును 3 యూనిట్ల పరిమాణంలో ఉత్పత్తి చేస్తే, ఇప్పుడు.

మొత్తం వ్యయం = రూ. 30 + 24 = రూ. 54

$$\text{సగటు వ్యయం} = \frac{\text{మొత్తం వ్యయం}}{\text{ఉత్పత్తి పరిమాణం}}$$

$$= \frac{54}{3} \text{ రూ. 18.}$$

అలాకాక వస్తువు సగటు స్థిర వ్యయాన్ని, సగటు చర వ్యయాన్ని కలిపినా కూడా సగటు వ్యయం తెలుస్తుంది.

ఉత్పత్తి ఒక స్థాయి వరకూ పెరిగిన కొద్దీ సగటు స్థిర వ్యయం, సగటు చర వ్యయాలు రెండూ తగ్గుతాయి. కనుక ఆ స్థాయి వరకు సగటు వ్యయం కూడా తగ్గుతుంది. అయితే ఒక స్థాయి దాటిన తర్వాత ఉత్పత్తి పరిమాణంతోపాటు సగటు చర

వ్యయము క్రమంగా పెరుగుతుంది. కనుక సగటు వ్యయం కూడా పెరుగుతుంది. అందువల్లనే సగటు వ్యయ రేఖ (AC) U ఆకారంలో ఉంటుంది. పటంలో OM ఉత్పత్తి వద్ద సగటు వ్యయం కనిష్ట స్థాయిలో ఉంది.




**ఉపాంత వ్యయం** (Marginal Cost): ఒక వస్తువును ఒక యూనిట్ అదనంగా ఉత్పత్తి చేయటం వల్ల మొత్తం వ్యయంలో వచ్చే పెరుగుదలను "ఉపాంత వ్యయం" అంటారు. n యూనిట్లకు అయ్యే మొత్తం వ్యయంలోంచి (n-1) యూనిట్లకయ్యే మొత్తం వ్యయాన్ని తీసివేస్తే ఉపాంత వ్యయం వస్తుంది. **ఉదాహరణకు**, ఒక ఉత్పాదక సంస్థ 3 యూనిట్లను ఉత్పత్తి చేయటానికి రూ. 54 మొత్తం వ్యయం చేసిందనుకుందాం. అదే ఉత్పాదక సంస్థ 4వ యూనిట్ కూడా ఉత్పత్తి చేసినప్పుడు మొత్తం వ్యయం రూ. 54 నుంచి 64కి పెరుగుతుందని అనుకొందాము. ఇప్పుడు

ఉపాంత వ్యయం = 4 యూనిట్ల మొత్తం వ్యయం - 3 యూనిట్ల మొత్తం వ్యయం.

= రూ. 64-54 = రూ. 10.

ఒక అదనపు యూనిట్ ఉత్పత్తి చేసినప్పుడు కేవలం చర వ్యయాలు మాత్రమే పెరుగుతాయి. కాబట్టి ఇక్కడ అదనపు వ్యయం అంటే అదనపు చర వ్యయం అవుతుంది. అంటే స్వల్పకాలంలో ఉపాంత వ్యయం స్థిర వ్యయంపై ఏ విధంగాను ఆధారపడక చర వ్యయాలపైనే ఆధారపడుతుంది. ఉత్పత్తి పరిమాణం పెరిగినకొద్దీ సగటు చర వ్యయం ఒక స్థాయి వరకు తగ్గి ఆ తర్వాత క్రమంగా పెరుగుతుంది. కనుక ఉపాంత వ్యయం కూడా ఉత్పత్తి పరిమాణం పెరిగినప్పుడు మొదట్లో తగ్గి, తర్వాత క్రమంగా పెరుగుతుంది. అందువల్ల ఉపాంత వ్యయరేఖ పటంలో చూపినట్లు ఉంటుంది.

క్రింది పట్టిక మొత్తం, సగటు ఉపాంత వ్యయాలను చూపుతుంది.

పట్టిక

| వస్తురాశి | మొత్తం స్థిర వ్యయం TFC | మొత్తం చర వ్యయం TVC | మొత్తం వ్యయం TC | సగటు స్థిర వ్యయం AFC | సగటు చర వ్యయం AVC | సగటు వ్యయం AC | ఉపాంత వ్యయం MC |
|---|---|---|---|---|---|---|---|
| రూ. | రూ. | రూ. | రూ. | రూ. | రూ. | రూ. | రూ. |
| 1 | 30 | 10 | 40 | 30 | 10 | 40 | 10 |
| 2 | 30 | 18 | 48 | 15 | 9 | 24 | 8 |
| 3 | 30 | 24 | 54 | 10 | 8 | 18 | 6 |
| 4 | 30 | 34 | 64 | 7.50 | 8.50 | 16 | 10 |
| 5 | 30 | 50 | 80 | 6 | 10 | 16 | 16 |
| 6 | 30 | 72 | 102 | 5 | 12 | 17 | 22 |
| 7 | 30 | 95 | 125 | 4.50 | 13 50 | 18 | 23 |

ఈ పట్టికలో సగటు వ్యయం, ఉపాంత వ్యయాలు మొదట్లో తగ్గుతున్నాయి. దీనికి కారణం ఉత్పత్తి పెరగటంచేత పెద్దతరహా ఉత్పత్తివల్ల కలిగే ఆదాలను ఉత్పాదక సంస్థ పొందటమే. ఈ స్థితిలో ఉపాంత వ్యయం సగటు వ్యయంకంటే తక్కువగా వుంది. అయితే ఉత్పత్తి తరహా మరీ పెరిగినకొద్దీ ఆదాలు అదృశ్యమై నష్టాలు మొదలౌతాయి. అప్పుడు క్షీణ ప్రతిఫలాలు అమలులోకి వచ్చి ఈ రెండు వ్యయాలు పెరగటం మొదలుపెడతాయి. ఈ స్థితిలో ఉపాంత వ్యయం సగటు వ్యయంకంటే ఎక్కువగా వుంటుంది. క్షీణ ప్రతిఫలాలు అమలులోకి వచ్చేముందు తరహావల్ల కలిగే ఆదాలు, ఈ నష్టాలు సమంగా వుండే స్థితి ఒకటి ఏర్పడుతుంది. ఆ స్థితిలో సగటు వ్యయం, ఉపాంత వ్యయం సమంగా వుంటాయి. దీర్ఘకాలంలో సంస్థలన్నీ ఈ స్థితినే చేరుతాయి. సగటు, వుపాంత వ్యయాలకు గల సంబంధాన్ని క్రింది రేఖాపటంలో చూడవచ్చు.




పై పటంలో X–అక్షంపై ఉత్పత్తి, Y–అక్షంపై వ్యయం చూపబడినాయి. MC ఉపాంత వ్యయరేఖ, AC సగటు వ్యయరేఖ, సగటు వ్యయం, ఉపాంత వ్యయం OM పరిమాణం వద్ద సమానమైనాయి.

సగటు వ్యయం - ప్రాముఖ్యం : దీర్ఘకాలంలో వస్తువు ధర, సగటు వ్యయం సమానంగా వుండాలి. అలాకాక ధరకంటే సగటు వ్యయం హెచ్చుగావుంటే కొన్ని సంస్థలకు నష్టాలు వస్తాయి. దాంతో ఆ సంస్థలు ఉత్పత్తిని నిలిపివేస్తాయి. ఫలితంగా సప్లయ్ తగ్గి ధర పెరిగి సగటు వ్యయానికి సమానమౌతుంది. అలాకాక ధరకంటే సగటు వ్యయం తక్కువవుంటే సంస్థలకు అధిక లాభాలు వస్తాయి. దీంతోవున్న సంస్థలు ఉత్పత్తిని పెంచటమేకాక కొత్త సంస్థలు కూడా ఉత్పత్తిని మొదలుపెడతాయి. ఫలితంగా సప్లయ్ పెరిగి ధర తగ్గి సగటు వ్యయానికి సమానమౌతుంది.

**ఉపాంత వ్యయం - ప్రాముఖ్యం** : ధర నిర్ణయంలో ఉపాంత వ్యయ భావనకు ఎంతో ప్రాముఖ్యముంది. ఒక సంస్థయొక్క లాభదాయకమైన ఉత్పత్తిని నిర్ణయించటానికి ఇది ఉపయోగపడుతుంది. ఒక సంస్థ ఉపాంత వ్యయం, ఉపాంత రాబడి సమానమైనప్పుడు, MC=MR ఉండే ఉత్పత్తిని చేస్తూ గరిష్ట లాభాలను పొందుతూ సమతౌల్య స్థితిలో వుంటుంది.

**ప్రశ్న 5) సంస్థ సగటు వ్యయరేఖ 'U' ఆకారం కలిగి వుండుటకు గల కారణమేమి?**

జవాబు : 3వ ప్రశ్నకిచ్చిన జవాబు చూడండి.

**ప్రశ్న 6) స్వల్పకాలిక వ్యయాల, దీర్ఘకాలిక వ్యయాల మధ్యగల తేడాలను తెల్పండి. వాటి ప్రాముఖ్యాన్ని వివరించండి.**

**లేదా**

**దీర్ఘకాలిక సగటు వ్యయరేఖ స్వభావమును తెల్పుము. దీనినే "కప్పు రేఖ" లేక "ప్రణాళిక రేఖ" అని ఎందుకు అంటారు? స్వల్పకాలిక వ్యయరేఖకు దీనికి గల సంబంధాన్ని వివరింపుము.**

**లేదా**

**దీర్ఘకాలిక, స్వల్పకాలిక వ్యయరేఖల మధ్య వివరణాత్మక పరిశీలన చేయుము.**

**జవాబు :** కాల వ్యవధిని బట్టి ఉత్పత్తి వ్యయాల స్వభావం మారుతుంది. అందువల్ల స్వల్పకాలిక వ్యయాలకు, దీర్ఘకాలిక వ్యయాలకు క్రింద తెల్పిన తేడా వుంటుంది.

**1. స్వల్పకాలంలో వ్యయాలు :** వ్యయాలు స్థిర వ్యయాలని, చర వ్యయాలని రెండుగా విభజింపబడ్డాయి. యంత్రాలు, కర్మాగార భవనాలు మొదలైన స్థిర ఉత్పత్తి కారకాలపై చేసే వ్యయాలు స్థిరవ్యయాలు. ముడిపదార్థాలు, ఇంధనం, శ్రామికులు మొదలైన చర ఉత్పత్తికారకాలపై చేసే వ్యయాలను చర వ్యయాలు అంటారు. స్వల్పకాలంలో స్థిర ఉత్పత్తి కారకాలను మార్చకుండానే చర ఉత్పత్తి పరిమాణాన్ని కొంతమేరకు పెంచవచ్చు. అయితే దీర్ఘకాలంలో ఉత్పత్తిని బాగా పెంచాలంటే స్థిర ఉత్పత్తి కారకాలను కూడ మార్చవలసి వస్తుంది. అందువల్ల దీర్ఘకాలంలో అవి చర ఉత్పత్తి కారకాలే అవుతాయి. అంటే దీర్ఘకాలంలో అన్నీ చర వ్యయాలే. ఈ మేరకు స్వల్పకాల వ్యయరేఖలకు, దీర్ఘకాల వ్యయరేఖలకు తేడా వుంటుంది.

**2. దీర్ఘకాలంలో వ్యయాలు :** దీర్ఘకాలంలో ఉత్పత్తి పరిమాణాన్ని పెంచినప్పుడు పెద్దతరహా ఉత్పత్తిలోని ఆదాలన్నీ సమకూరుతాయి. ఇవి స్వల్పకాలంలో ఉత్పత్తి పరిమాణం తక్కువగా వున్నప్పుడు వుండవు. ఈ కారణంగా స్వల్పకాల వ్యయాలకు, దీర్ఘకాల వ్యయాలకు తేడా వుంటుంది.

**3. ఉత్పత్తి తరహాలో అవసరమైన మార్పులు :** స్వల్పకాలంలోకన్నా దీర్ఘకాలంలో ఉత్పత్తి వ్యయాన్ని తగ్గించవచ్చు. ఉత్పత్తి పరిమాణాన్ని పెంచినప్పుడు ఉత్పత్తి వ్యయాలను తగ్గించేందుకు అవసరమైన సర్దుబాట్లను స్వల్పకాలంలో చేయలేకపోవచ్చు. అయితే వీటిని దీర్ఘకాలంలో చేయటంవల్ల ఉత్పత్తి వ్యయాలు తగ్గుతాయి. కనిష్ట వ్యయంతో

ఉత్పత్తి చేయటానికి ఉత్పత్తి తరహాలో అవసరమైన మార్పులు దీర్ఘకాలంలో చేయవచ్చు కనుక ఉత్పత్తి వ్యయాలు స్వల్పకాలంలోకన్నా దీర్ఘకాలంలో తక్కువగా వుండే అవకాశం వుంది.

**దీర్ఘకాలిక సగటు వ్యయరేఖ** (Long Run Average Cost Curve): దీర్ఘకాలిక సగటు వ్యయరేఖ యొక్క ఆకారం తీసుకున్న ప్రమేయాలను బట్టి వుంటుంది. ఉత్పత్తి కారకాల ధరలు స్థిరంగా వున్నాయని అవి సంపూర్ణ విభాజనాలని ఊహిస్తే ఈ రేఖ X–అక్షానికి సమాంతరంగా వుంటుంది అంటే అప్పుడూ తరహానుసరించి ప్రతిఫలాలు స్థిరంగా వున్నాయన్నమాట.

అయితే పై ప్రమేయాలు వాస్తవికం కావు. ముఖ్యంగా ఉత్పత్తి కారకాలు అన్నీ సంపూర్ణ విభాజ్యాలు కావు. అందువల్ల కొన్ని ఉత్పత్తి కారకాల సముదాయాలు మరికొన్నింటి తరహాకన్నా తక్కువ వ్యయంతో వస్తూత్పత్తి చేయగలవు. కనుక స్వల్పకాలిక సగటు వ్యయరేఖల కనిష్ట బిందువులు వివిధ స్థాయిలలో ఉంటాయి. దీన్నే క్రింది రేఖాపటంలో చూడవచ్చు.




పై రేఖాపటంలో మూడు ఉత్పత్తి తరహాలు చూపబడినాయి. OM ఉత్పత్తి తరహాకు SRAC స్వల్పకాలిక సగటు వ్యయరేఖ. $OM_1$ ఉత్పత్తి తరహాకు $SRAC^1$ స్వల్పకాలిక సగటు వ్యయరేఖ. $OM_2$ ఉత్పత్తి తరహాకు $SRAC_2$ స్వల్పకాలిక సగటు వ్యయరేఖ. $SRAC^1$ రేఖకూ మిగతా రేఖలకన్న కనిష్ట బిందువు తక్కువస్థాయిలో ఉంది. ఈ వివిధ ఉత్పత్తి తరహాలకు దీర్ఘకాలంలో అవసరమైన సర్దుబాట్లు చేయగా వచ్చేది దీర్ఘకాలిక సగటు వ్యయరేఖ, LRAC దీర్ఘకాలిక సగటు వ్యయరేఖ. ఈ LRAC దీర్ఘకాలిక సగటు వ్యయరేఖ కూడా స్వల్పకాలిక సగటు వ్యయరేఖలవలెనే 'U' ఆకారంలో వుంటుంది. అయితే వాటికన్నా ఎక్కువ బల్లపరుపు (flat) గా వుంటుంది. స్వల్పకాలిక వ్యయరేఖలన్నింటినీ ఇది కప్పుతున్న కారణాన "కప్పేరేఖ" (Envelope Curve) అని అంటారు.

ప్రతి సంస్థ వివిధ ఉత్పత్తి తరహాలకు దీర్ఘకాలిక వ్యయాలు ఎలా వుంటాయో ముందుగా ప్లాన్ చేసుకొని దీర్ఘకాల సగటు వ్యయం కనీసంగావుండే ఉత్పత్తి పరిమాణాన్ని నిర్ణయించుకొంటుంది. ఈ విధంగా చేయటంవల్ల LRAC రేఖను "ప్లానింగ్ రేఖ" (Planning Curve) అని కూడా అంటారు.

**దీర్ఘకాల సగటు వ్యయరేఖలు తెలియచేసే విషయాలు :**

1. దీర్ఘకాల సగటు వ్యయం ఏ ఉత్పత్తి పరిమాణానికైనా, దాని స్వల్పకాల సగటు వ్యయంకన్నా ఎప్పుడూ తక్కువగానే వుంటుంది అందువల్ల దీర్ఘకాల సగటు వ్యయరేఖ స్వల్పకాల వ్యయరేఖలను ఏ పరిస్థితులలోను ఖండించదు. వాటికి క్రిందుగా వుంటుంది.
2. దీర్ఘకాల సగటు వ్యయరేఖ, స్వల్పకాల వ్యయరేఖలకు క్రిందుగా వుంటూ ఏదో ఒక బిందువువద్ద స్పర్శరేఖగా వుంటుంది అంతేకాని అన్ని రేఖలకు వాటి వాటి కనిష్ట బిందువులవద్దనే స్పర్శరేఖగా వుండదు. ఒక్క రేఖకు మాత్రమే దాని కనిష్ట బిందువువద్ద స్పర్శరేఖగా వుంటుంది.

ఏదో ఒక ఉత్పత్తి పరిమాణంవద్ద దీర్ఘకాలిక సగటు వ్యయం, స్వల్పకాలిక సగటు వ్యయం సమానంగా వుంటుంది అదే సంస్థయొక్క అభిలషణీయమైన ఉత్పత్తి స్థాయిని చేరటానికే ఉత్పత్తి సంస్థలన్నీ ప్రయత్నం చేస్తుంటాయి.

**ప్రశ్న 7) సగటు రాబడి, ఉపాంత రాబడి అనగానేమి? వీటికిగల తేడాలను రేఖాపట సహాయంతో వివరించుము.**

**లేదా**

**పరిపూర్ణ పోటీలో, అపరిపూర్ణ పోటీలో సగటు రాబడి, ఉపాంత రాబడులకుగల వ్యత్యాసాలకు రేఖాపటముల సహాయంతో వివరింపుము. వాటి ప్రాముఖ్యాన్ని తెల్పుము.**

**లేదా**

**ఉపాంత, సగటు రాబడులకు మొత్తం రాబడికి గల సంబంధము తెల్పుము.**

**జవాబు : రాబడి-రకాలు :** ఒక ఉత్పత్తి సంస్థ తన ఉత్పత్తిని విక్రయించగా వచ్చే దాన్ని "రాబడి" అంటారు. ఈ రాబడిని మూడు రకాలుగా చెప్పవచ్చు.

i) మొత్తం రాబడి, ii) సగటు రాబడి, iii) ఉపాంత రాబడి.

i) మొత్తం రాబడి (Total Revenue) : విక్రయించిన ఉత్పత్తి పరిమాణాన్ని దాని ధరతో హెచ్చిస్తే మొత్తం రాబడి వస్తుంది. మొత్తం రాబడి (TR) = వస్తువు ధర × విక్రయించిన పరిమాణం.

ii) సగటు రాబడి (Average Revenue) : ఉత్పత్తి పరిమాణాన్ని విక్రయించగా వచ్చిన మొత్తం రాబడిని, విక్రయించిన పరిమాణంతో భాగిస్తే తలసరిన ఒక్కొక్క యూనిట్‌యొక్క రాబడి తెలుస్తుంది. దీన్నే సగటు రాబడి అంటారు.

సగటు రాబడి (AR) మొత్తం రాబడి ÷ విక్రయించిన పరిమాణం.

దీన్నిబట్టి సగటు రాబడి, వస్తువు ధర రెండూ ఒకటే అని తెలుస్తుంది. అన్ని మార్కెట్ పరిస్థితులలోను ఈ రెండూ ఒకటిగానే వుంటాయి.

iii) ఉపాంత రాబడి (Marginal Revenue) : వస్తువు యొక్క ఒక అదనపు యూనిట్‌ను విక్రయించగా వచ్చే రాబడిని (అదనపు రాబడి) "ఉపాంత రాబడి" అంటారు. అంటే ఒక యూనిట్ వస్తువుని అదనంగా అమ్మగా మొత్తం రాబడిలో వచ్చే పెరుగుదల ఉపాంత రాబడి అవుతుంది.

ఉపాంత రాబడి (MR) = n యూనిట్ల మొత్తం రాబడి - (n–1) యూనిట్ల మొత్తం రాబడి

ఉదాహరణకు వస్తువు 4 యూనిట్లు అమ్మగా వచ్చిన రాబడి రూ. 50. 5వ యూనిట్‌ని అమ్మగా వచ్చిన మొత్తం రాబడి రూ. 60. అప్పుడు

ఉపాంత రాబడి = రూ. 60 - రూ. 50 = రూ. 10.

**సగటు రాబడి, ఉపాంత రాబడికి గల సంబంధం** : సగటు రాబడి, ఉపాంత రాబడులకు గల సంబంధం మార్కెట్‌లోని పోటీ పరిస్థితులపై ఆధారపడి వుంటుంది. పోటీనిబట్టి మార్కెట్‌లను పరిపూర్ణ పోటీ (Perfect Competition) వున్న మార్కెట్ అనీ, అపరిపూర్ణ పోటీ (Imperfect Competition) వున్న మార్కెట్ అనీ రెండు రకాలుగా వర్గీకరించవచ్చు.

**సంపూర్ణ పోటీ మార్కెట్‌లో సగటు రాబడి, ఉపాంత రాబడి** : పరిపూర్ణ పోటీ మార్కెట్‌లో వస్తువు అమ్మకందార్లు, కొనుగోలుదార్లు హెచ్చు సంఖ్యలో వుంటారు. వస్తువు ఏకజాతీయంగా (Homogeneous) వుంటుంది. అందువల్ల ఏ ఒక్క అమ్మకందారు తన సప్లయ్‌ని మార్చడంవల్ల వస్తువు ధరను మార్చలేడు. ఉన్న ధర వద్దనే ఎంత వస్తువునైనా అమ్మవలె అంటే పరిపూర్ణ పోటీలో వస్తువు ధర స్థిరంగా వుంటుంది. కనుక సగటు రాబడి, ఉపాంత రాబడి, ధర మూడు సమానంగా వుంటాయి. ధర

స్థిరంగా వుంటుంది. కనుక సగటు రాబడి (AR), ఉపాంత రాబడి (MR)లు కూడా స్థిరంగానే వుంటాయి.

AR = MR = ధర. ఈ విషయాన్నే క్రింది పట్టికలో చూడవచ్చు.

| వస్తువు పరిమాణం యూనిట్లలో | ధర రూ.లలో | మొత్తం రాబడి TR | సగటు రాబడి AR | ఉపాంత రాబడి MR |
|---|---|---|---|---|
| 1 | 4 | 4 | 4 | 4 |
| 2 | 4 | 8 | 4 | 4 |
| 3 | 4 | 12 | 4 | 4 |
| 4 | 4 | 16 | 4 | 4 |
| 5 | 4 | 20 | 4 | 4 |

సగటు రాబడి ఉపాంత రాబడి రేఖలు ఏకమై క్రింది రేఖాపటంలో చూపినట్లు X—అక్షానికి సమాంతర రేఖగా వుంటుంది.




**అపరిపూర్ణ పోటీ మార్కెట్‌లో సగటు రాబడి, ఉపాంత రాబడి :** అపరిపూర్ణ పోటీ మార్కెట్ లేక ఏకస్వామ్యంలో కొద్ది సంస్థలు లేక ఒకే ఒక సంస్థ వుంటుంది. ఈ సంస్థలు

లేక సంస్థ చేసే ఉత్పత్తి మొత్తం ఉత్పత్తిలో చెప్పుకోదగినదిగా వుంటుంది. అందువల్ల ఉత్పత్తి పరిమాణాన్ని మార్చితే ధర ప్రభావితం అవుతుంది. ఎక్కువ వస్తు పరిమాణాన్ని విక్రయించాలంటే ధరను తగ్గించవలసి వస్తుంది. అంటే సగటు రాబడి తగ్గుతుంది. పరిపూర్ణ పోటీలోవలే అన్ని యూనిట్లకు ఒకే స్థిరమైన ధర వుండదు. అట్టి స్థితిలో ధర, సగటు రాబడి సమానంగా వుంటాయేగాని, ఈ రెండు కలిసి ఉపాంత రాబడికి సమానంగా వుండవు. విక్రయించే పరిమాణం పెరిగినకొద్ది సగటు రాబడిలో తగ్గుదలకంటే ఉపాంత రాబడిలో తగ్గుదల ఎక్కువగా వుంటుంది R = ధర > MR.

ఈ విషయాన్ని క్రింది పట్టికలో చూడవచ్చు.

పట్టిక

| వస్తువు పరిమాణం యూనిట్లలో | ధర రూ.లలో | మొత్తం రాబడి TR | సగటు రాబడి AR | ఉపాంత రాబడి MR |
|---|---|---|---|---|
| 1 | 4 | 4 | 4 | 4 |
| 2 | 3-50 | 7 | 3-50 | 3 |
| 3 | 3-00 | 9 | 3-00 | 2 |
| 4 | 2-50 | 10 | 2-50 | 1 |

సగటు రాబడి, ఉపాంత రాబడి రేఖలు క్రింది రేఖాపటంలో చూపబడినాయి.




పటంలో AR–సగటు రాబడిరేఖ, MR–ఉపాంత రాబడి రేఖ. ఉత్పత్తి పరిమాణం పెరిగినకొద్దీ ధర దానితోపాటు సగటు, ఉపాంత రాబడులు తగ్గుతున్నాయి. అందువల్ల AR, MR రేఖలు ఎడమనుంచి కుడికి క్రిందికి వాలుతున్నాయి. అయితే సగటు

రాబడిలో వచ్చే తగ్గుదలకంటే ఉపాంత రాబడిలో తగ్గుదల ఎక్కువగా వుంటున్నది. అందువల్ల ఉపాంత రాబడి రేఖ MR సగటు రాబడి రేఖ ARకు దిగువలో వుంటుంది.

**సగటు రాబడి రేఖ - డిమాండ్ రేఖ :** పరిపూర్ణ పోటీలోగాని, అపరిపూర్ణ పోటీలో కాని ఏ ధరవద్ద ఎంత పరిమాణంలో వస్తువు అమ్మబడుతుంది. సగటు రాబడిరేఖ తెలియజేస్తుంది. కనుక ఇదే డిమాండ్ రేఖ కూడా, పటంలో AR రేఖే డిమాండ్ రేఖ.

**ఉపాంత రాబడి - డిమాండ్ వ్యాకోచత్వం :** ఉపాంత రాబడికి, డిమాండ్ వ్యాకోచత్వానికి క్రింద చూపిన విధంగా సంబంధం వుంది.

**1) వ్యాకోచ డిమాండ్ :** వస్తువుకు వ్యాకోచ డిమాండ్ ఉంటే దాని ఉపాంత రాబడి ధనాత్మకం (Positive) గా వుంటుంది. దీన్ని క్రింది వుదాహరణలో చూడవచ్చు.

| వస్తువు ధర రూ.లలో | వస్తువు డిమాండ్ | మొత్తం రాబడి | ఉపాంత రాబడి |
|---|---|---|---|
| 2-00 | 10 | 20 | 20 |
| 1-00 | 50 | 50 | 30 |
| 0-50 | 180 | 90 | 40 |

**అవ్యాకోచ డిమాండ్ :** వస్తువునకు అవ్యాకోచ డిమాండ్ వుంటేదాని ఉపాంత రాబడి రుణాత్మకం (Negative)గా వుంటుంది. దీన్ని క్రింది వుదాహరణలో చూడవచ్చు.

| వస్తువు ధర రూ.లలో | వస్తువు డిమాండ్ | మొత్తం రాబడి | ఉపాంత రాబడి |
|---|---|---|---|
| 2-00 | 10 | 20 | 20 |
| 1-00 | 12 | 12 | -8 |
| 0-50 | 14 | 7 | -5 |

**ఏకత్వ వ్యాకోచ డిమాండ్ :** వస్తువుకు ఏకత్వ వ్యాకోచ డిమాండ్ వుంటే ఉపాంత రాబడి సున్న'0'గా వుంటుంది. దీన్నే క్రింది వుదాహరణలో చూడవచ్చు.

| వస్తువు ధర రూ.లలో | వస్తువు డిమాండ్ | మొత్తం రాబడి | ఉపాంత రాబడి |
|---|---|---|---|
| 2-00 | 10 | 20 | 20 |
| 1-00 | 20 | 20 | 30 |

**సగటు రాబడి, ఉపాంత రాబడుల ప్రాముఖ్యత :** ఒక ఉత్పత్తి సంస్థ లాభాలను తెలుసుకోటానికి సగటు రాబడి (AR) ఉపయోగపడుతుంది. సగటు రాబడిలోంచి సగటు వ్యయాన్ని తీసివేస్తే (AR–AC) ఒక్కొక్క యూనిట్‌కు వచ్చే లాభాలు తెలుస్తాయి. దీన్ని మొత్తం వస్తు పరిమాణంతో హెచ్చిస్తే సంస్థ పొందుతున్న మొత్తం లాభాలు తెలుస్తాయి. సగటు రాబడి సగటు వ్యయంకంటె ఎక్కువగా వుంటే సంస్థ అధిక లాభాలను పొందుతున్నట్లు, సగటు రాబడి సగటు వ్యయంకంటే తక్కువగా వుంటే సంస్థ నష్టాలను పొందుతున్నట్లు సగటు రాబడి సగటు వ్యయానికి సమంగా వుంటే సంస్థ సామాన్య లాభాలను ఆర్జిస్తున్నట్లు గ్రహించాలి.

ప్రతి ఉత్పత్తి సంస్థ గరిష్ట లాభాలను ఆర్జించటానికే కృషి చేస్తుంది. అందుకు తగిన వస్తు పరిమాణాన్నే ఉత్పత్తి చేస్తుంది. ఈ ఉత్పత్తి స్థాయిని నిర్ణయించటానికి ఉపాంత రాబడి వుపయోగపడుతుంది. ఉపాంత రాబడి (MR) ఉపాంత వ్యయం (MC) కంటే ఎక్కువగా వున్నంతకాలం సంస్థకు లాభాలే వస్తుంటాయి. ఉపాంత రాబడి ఉపాంత వ్యయంకంటె తగ్గితే సంస్థకు అప్పటివరకు వస్తున్న లాభాలు తగ్గుతాయి. ఉపాంత రాబడి, వుపాంత వ్యయం సమానంగా వున్నప్పుడు (MC = MR) సంస్థ గరిష్ఠ లాభాలను పొందుతుంది. కనుక ఉత్పత్తి సంస్థ ఏ ఉత్పత్తి పరిమాణంవద్ద వుపాంత రాబడి, ఉపాంత వ్యయం సమానమౌతాయో అక్కడ ఉత్పత్తి నిలిపివేస్తుంది.

# SHORT NOTES

**ప్రశ్న 1) సంస్థయొక్క అభిలషణీయ పరిమాణము (Optimum size of a Firm).**

**లేదా**

**అభిలషణీయమైన సంస్థ (Optimum Firm).**

**జవాబు :** ఏ ఉత్పత్తి సంస్థ అయినా వుత్పత్తిని పెంచుతుంటే తరహానుసరించి ప్రతిఫలాలు వస్తాయి. మొదట్లో పెద్దతరహా వుత్పత్తిలోని ఆదాలు (Economies of large scale production) వస్తాయి. అప్పుడు ప్రతిఫలాలు పెరుగుతాయి. ఫలితంగా వుత్పత్తి వ్యయాలు తగ్గుతాయి. ఈ స్థితి కొంతవరకు కొనసాగి వుత్పత్తి వ్యయం ఒక కనిష్టస్థాయి (minimum average cost) ని చేరుతుంది. అయితే ఇంకా వుత్పత్తి

తరహాను పెంచుతూపోతే పెద్దతరహా వుత్పత్తిలోని ఆదాలు అదృశ్యమై లోపాలు మొదలవుతాయి. ఈ స్థితిలో క్షీణ ప్రతిఫలాలు (Diminishing returns) వస్తాయి. ఫలితంగా వుత్పత్తి వ్యయాలు పెరగనారంభిస్తాయి. కనుక ఏ వుత్పత్తి సంస్థ అయినా వుత్పత్తి వ్యయం గరిష్టస్థాయిని చేరగానే వుత్పత్తిని నిలిపివేస్తుంది. ఆ వుత్పత్తి స్థాయిని అభిలషణీయమైన వుత్పత్తి పరిమాణం (Optimum Output) అంటారు. ఇదే పెద్దతరహా వుత్పత్తిలోని ఆదాలను పొందుతూ, సంస్థ సమర్థవంతంగా చేసే వుత్పత్తిస్థాయి అన్నమాట. కనిష్ట ఉత్పత్తి వ్యయంతో అభిలషణీయమైన ఉత్పత్తిని చేసే సంస్థను 'అభిలషణీయమైన సంస్థ' అంటారు.

సంపూర్ణ పోటీలో అన్ని సంస్థలు అభిలషణీయ పరిమాణాన్నే ఉత్పత్తి చేస్తాయి. కనుక పరిపూర్ణ పోటీలో వస్తువు ధర అభిలషణీయమైన సంస్థ వ్యయానికి సమానంగా వుంటుంది. అంటే ధర కనిష్ట వ్యయానికి సమానంగా వుంటుంది. కనిష్ట వ్యయం అన్ని సంస్థలకీ ఒకేరకంగా వుండకపోవచ్చు. ఏ సంస్థలకైతే కనీస వ్యయం హెచ్చుగా వుంటుందో ఆ సంస్థలు ఉత్పత్తిని నిలిపివేసి పరిశ్రమనుంచి వైదొలగుతాయి. అందువల్ల పరిపూర్ణ పోటీలో అన్ని సంస్థలు అభిలషణీయమైన సంస్థలే.

అభిలషణీయ సంస్థ ఉపాంత వ్యయం, ఉపాంత రాబడి సమానం. (MC=MR). ఉపాంత రాబడి అంటే ధర కనుక ఉపాంత వ్యయం ధరకు సమానంగా వుంటుంది. MC = MR = Price .

**ప్రశ్న 2) ఉపాంత వ్యయం, ఉపాంత రాబడి (Marginal Cost and Marginal Revenue).**

ఉపాంత వ్యయం (Marginal cost) : ఒక వస్తువును ఒక యూనిట్ అదనంగా ఉత్పత్తి చేయటంవల్ల మొత్తం వ్యయంలోవచ్చే పెరుగుదలను "ఉపాంత వ్యయం" అంటారు. ఉదాహరణకు ఒక ఉత్పాదక సంస్థ ఒక వస్తువు 3 యూనిట్లను ఉత్పత్తి చేయటానికి రూ. 54 మొత్తం వ్యయం చేస్తుంది. అదే సంస్థ ఆ వస్తువుయొక్క 4వ యూనిట్ని ఉత్పత్తి చేస్తే మొత్తం వ్యయం రూ. 64 అవుతుంది.

ఇప్పుడు ఉపాంత వ్యయం = 4 యూనిట్ల మొత్తం వ్యయం - 3 యూనిట్ల మొత్తం వ్యయం = రూ. 64-54 = రూ. 10.

ఉత్పత్తి తరహా పెరిగినకొద్దీ తరహానుసరించి ప్రతిఫలాలు (Returns to scale) వస్తాయి. మొదట్లో పెరిగే ప్రతిఫలాలు (increasing returns) వస్తాయి. అప్పుడు ఉత్పత్తి వ్యయాలు తగ్గుతాయి. ఉపాంత వ్యయంకూడా తగ్గుతుంది. ఉత్పత్తి తరహా ఒక స్థాయి దాటిన తర్వాత ప్రతిఫలాలు క్షీణించటం మొదలౌతుంది. అప్పుడు ఉత్పత్తి వ్యయాలు పెరగనారంభిస్తాయి. ఉపాంత వ్యయం కూడా పెరుగుతుంది. అందువల్ల ఉపాంత వ్యయ (MC) రేఖ 'U' ఆకారంలో వుంటుంది.

**ఉపాంత రాబడి (Marginal Revenue) :** వస్తువుయొక్క ఒక అదనపు యూనిట్ను విక్రయించగా మొత్తం రాబడిలో వచ్చే పెరుగుదలను 'ఉపాంత రాబడి'

అంటారు. ఉదాహరణకు ఒక వస్తువును 4 యూనిట్లు అమ్మగావచ్చే రాబడి రూ. 50. 5 యూనిట్లు అమ్మితే వచ్చే రాబడి రూ. 60 అప్పుడు ఉపాంత రాబడి = 5 యూనిట్ల మొత్తం రాబడి - 4 యూనిట్ల మొత్తం రాబడి = రూ. 60-50 = రూ. 10.

ఒక సంస్థ వుత్పత్తి పరిమాణాన్ని నిర్ణయించటానికి వుపాంత వ్యయం (MC) వుపాంత రాబడి (MR) తోడ్పడతాయి. వుపాంత వ్యయం కంటే వుపాంత రాబడి ఎక్కువగా వున్నంతవరకూ సంస్థ వుత్పత్తిని కొనసాగిస్తుంది. వుపాంత వ్యయం, వుపాంత రాబడికి సమానమైనచోట సంస్థ సమతౌల్య స్థితి (Equilibrium)లో వుంటుంది.

పరిపూర్ణ పోటీలో వస్తువు అన్ని యూనిట్లు ఒకే ధరకు విక్రయించబడతాయి. కనుక ధర, వుపాంత రాబడి సమానంగా వుంటాయి. అంటే MC=MR=ధర.

పరిపూర్ణ పోటీలో వుపాంత రాబడ (MR) రేఖ X-అక్షానికి సమాంతరంగా వుంటుంది.

అపరిపూర్ణ పోటీలో వస్తువును ఎక్కువ పరిమాణంలో విక్రయించాలంటే ధరను తగ్గించవలసి వుంటుంది. కనుక ఉపాంత రాబడి ధరకన్నా తక్కువగా అంటే MC=MR కాని MR < ధర.

అపరిపూర్ణ పోటీలో ఉపాంత రాబడి (MR) రేఖ ఎడమనుంచి కుడికి కిందికి వాలుతూ వుంటుంది.

**ప్రశ్న 3) ద్రవ్య వ్యయాలు, నిజ వ్యయాలు (Money Costs and Real Costs).**

జవాబు : 1వ ప్రశ్నకిచ్చిన జవాబు చూడండి.

**ప్రశ్న 4) అవకాశ వ్యయాలు (Opportunity Costs).**

జవాబు : 1వ ప్రశ్నకిచ్చిన జవాబులో 'అవకాశ వ్యయాలు' చూడండి.

**ప్రశ్న 5) స్థిర వ్యయాలు చర వ్యయాలు (Fixed Costs and Variable Costs).**

జవాబు : 2వ ప్రశ్నకిచ్చిన జవాబు చూడండి.

**ప్రశ్న 6) చర వ్యయాలు (Variable Costs).**

జవాబు : 2వ ప్రశ్నకిచ్చిన జవాబులో చరవ్యయాలు చూడండి.



# అధ్యాయము 6

# సప్లయ్ రేఖలు - సప్లయ్ వ్యాకోచత్వం

**ప్రశ్న 1) "సప్లయ్ అనగానేమి ? సప్లయ్‌ని నిర్ణయించే అంశాలేవి.**

**లేదా**

**సప్లయ్ సూత్రాన్ని తెల్పి, సప్లయ్ నిర్ణాయకాలను వివరించండి.**

**జవాబు : సప్లయ్** : ఒక నిర్ణీతకాలంలో, ఒక ధరవద్ద ఉత్పత్తిదార్లు విక్రయించుటకు ఇష్టపడే వస్తు పరిమాణాన్ని "సప్లయ్" అంటారు. వస్తువు ధరకు, పరిమాణానికి గల సంబంధాన్ని సప్లయ్ సూత్రం తెలియజేస్తుంది.

**సప్లయ్ సూత్రం (Law of Supply)** : "ఇతర పరిస్థితులలో మార్పు లేనంతవరకూ ఒక వస్తువు ధర పెరిగితే దాని సప్లయ్ పెరుగుతుంది. ధర తగ్గితే సప్లయ్ తగ్గుతుంది". కాబట్టి ధరకు, సప్లయ్‌కి అనులోమ సంబంధం (Proportional relationship) వుంది.

**సప్లయ్ పట్టిక (Supply Schedule)** : వివిధ ధరలవద్ద వస్తువు ఎంతెంత పరిమాణంలో సప్లయ్ చేయబడుతుందో తెలియచేసే పట్టికను "సప్లయ్ పట్టిక" అంటారు. మాదిరి సప్లయ్ పట్టిక క్రింద చూపబడింది.

**సప్లయ్ పట్టిక**

| వస్తువు ధర రూ. లలో | సప్లయ్ పరిమాణం యూనిట్లలో |
|---|---|
| 2 | 500 |
| 3 | 750 |
| 4 | 1100 |
| 5 | 1500 |

**సప్లయ్ రేఖ (Supply Curve) :** సప్లయ్ పట్టికలో చూపిన విషయాన్ని రేఖాపటంలో గీస్తే సప్లయ్ రేఖ వస్తుంది. క్రింది పటంలో మాదిరి సప్లయ్ రేఖను చూడవచ్చు.




పటంలో X- అక్షంపైన పరిమాణం, Y- అక్షంపైన ధర చూపబడినాయి. SS సప్లయ్ రేఖ . ఈ రేఖ ఎల్లప్పుడు ఎడమనుంచి కుడికి పైకి పోతుంది. ధర OP వున్నప్పుడు సప్లయ్ OM వుంది. ఇప్పుడు ధర $OP_1$ పెరిగినందున సప్లయ్ కూడా OM1 పెరిగింది. ఇదే విధంగా ధర తగ్గినప్పుడు సప్లయ్ తగ్గుతుంది.

**ధర పెరిగినప్పుడు సప్లయ్ పెరగడానికి కారణాలు :** వస్తువు ధర పెరిగినప్పుడు క్రింది కారణాలవల్ల వస్తువు సప్లయ్ పెరుగుతుంది.

1. హెచ్చుధర ఉత్పత్తిదార్లకు ఉత్పత్తిని పెంచటానికి ప్రోత్సాహాన్నిస్తుంది. ధర ఎక్కువగా ఉన్నప్పుడు లాభాలు ఎక్కువగా వుంటాయి. కనుక ఉత్పత్తిదార్లు ఎక్కువగా ఉత్పత్తి చేసి సప్లయ్ చేస్తారు.

2. హెచ్చుధర, తత్ఫలితంగా అధిక లాభాలు కొత్త ఉత్పత్తిదార్లను ఉత్పత్తి రంగంలోకి ఆకర్షిస్తాయి. అందువల్ల కూడ వస్తువు ఉత్పత్తి పెరిగిన సప్లయి పెరుగుతుంది.

3. హెచ్చు ఉత్పత్తి వ్యయంతో ఉత్పత్తి చేసిన ఉత్పత్తిదార్లు, ధర తక్కువగా వున్నప్పుడు వారి వస్తువును అమ్మరు. ధర పెరిగినప్పుడు వస్తువును అమ్ముతారు. దీనితో మార్కెట్‌లో వస్తువు సప్లయి పెరుగుతుంది.

**సప్లయిని నిర్ణయించే అంశాలు (Determinants of Supply) :** సప్లయిని కొన్ని అంశాలు నిర్ణయిస్తాయి. అవి :

**1) సంస్థ యొక్క లక్ష్యం :** సప్లయ్ ఉత్పత్తి సంస్థల యొక్క లక్ష్యంపై ఆధారపడుతుంది. కొన్ని సంస్థలు మందులను (Medicines) తయారుచేస్తుంటాయి. అవి విషాన్ని (Poison) కూడ తయారు చేయగలవు. వాటి లక్ష్యం కేవలం మందులనే

తయారుచేయడమైతే విషం సప్లయ్ వుండదు. అలాకాక కేవలం లాభాలనార్జించడమే అయితే అవి విషాన్ని కూడ తయారుచేస్తాయి.

**2) నష్టభయం :** కొన్ని వస్తువుల ఉత్పత్తిలో నష్టభయం ఎక్కువగా వుంటుంది. నష్టభయం ఎక్కువగా వుండే వస్తువులను ఉత్పత్తిదార్లు తక్కువగా ఉత్పత్తి చేస్తారు. కనుక వాటి సప్లయ్ తక్కువగా వుంటుంది. నష్టభయం తక్కువగా వుండే వస్తువుల సప్లయ్ ఎక్కువగా వుంటుంది.

**3) వస్తువుకు గల డిమాండ్ :** డిమాండును బట్టి వస్తువుల సప్లయ్ మారుతుంటుంది. ఉత్పత్తిదార్లు డిమాండ్ పెరుగుతున్న వస్తువుల సప్లయ్‌ని పెంచటం, డిమాండ్ పడిపోతున్న వస్తువుల సప్లయ్‌ని తగ్గించటం చేస్తారు

**4) వస్తువు ధర :** ఏ వస్తువుయొక్క సప్లయ్ అయినా ముఖ్యంగా దాని ధరమీద ఆధారపడుతుంది. ధర హెచ్చుగా ఉన్నప్పుడు ఉత్పత్తిదార్లు వస్తువును ఎక్కువ పరిమాణంలో సప్లయ్ చేస్తారు. ధర తక్కువగా వున్నప్పుడు తక్కువ పరిమాణంలో సప్లయ్ చేస్తారు.

**5) సాంకేతిక పరిస్థితి :** సాంకేతిక పరిజ్ఞానం అభివృద్ధి చెందితే ఉత్పత్తి పెరుగుతుంది. ఫలితంగా వస్తువుల సప్లయ్ పెరుగుతుంది. నవకల్పన యున్న సాధనాలతో ఎక్కువ వస్తువులను చేయడం సాధ్యపడుతుంది.

**6) ఇతర వస్తువుల ధరలు :** ఒక వస్తువు సప్లయ్ ఇతర వస్తువుల ధరలపైన కూడ ఆధారపడుతుంది. ఇతర వస్తువు ధరలు తగ్గినప్పుడు ఈ వస్తువు సాపేక్ష ధర (Relative Price) హెచ్చుగా వుంటుంది. అప్పుడు ఉత్పత్తిదార్లు ఈ వస్తువును ఎక్కువగా సప్లయ్ చేస్తారు.

**7) ఉత్పత్తి సాధనాల వ్యయాలు :** ఉత్పత్తి సాధనాల వ్యయాలను బట్టికూడ ఒక వస్తువు సప్లయ్ మారుతుంది. ఉత్పత్తి సాధనాల ధరలు పెరిగితే వాటితో ఉత్పత్తి చేసే వస్తువుల ఉత్పత్తి తగ్గి, సప్లయ్ తగ్గుతుంది.

**8) రవాణా సౌకర్యాలు :** రవాణా సౌకర్యాలు అభివృద్ధి చెందినప్పుడు ఉత్పత్తి వ్యయాలు తగ్గుతాయి. లాభాలు పెరిగే అవకాశం వుంటుంది. అలాంటప్పుడు ఉత్పత్తిదార్లు ఉత్పత్తిని పెంచి ఎక్కువ సప్లయ్ చేస్తారు.

**9) కాలవ్యవధి :** ఒక వస్తువు సప్లయ్ కాలవ్యవధిపై కూడ ఆధారపడుతుంది. అతి స్వల్పకాల వ్యవధి (Very Short Period)లో సప్లయ్ ఏమాత్రం పెరగదు. స్వల్ప కాలవ్యవధి (Short Period)లో సప్లయ్ స్థిర ఉత్పత్తి కారకాల గరిష్ట ఉత్పాదక శక్తి (Maximum Productive Capacity) మేరకు పెంచవచ్చు. దీర్ఘకాలం (Long Period) లో కొత్త సంస్థలు పరిశ్రమలో ప్రవేశించి ఉత్పత్తిని ఎంతయినా పెంచటానికి వీలుంటుంది. కనుక సప్లయ్ పెరుగుతుంది.

సప్లయ్ సూత్రం-మినహాయింపులు : సప్లయ్ సూత్రానికి క్రింది మినహాయింపులు వున్నాయి. అవి :

1) ధర తగ్గుతుందని ఊహించినప్పుడు : భవిష్యత్తులో ధరలు ఇంకా తగ్గుతాయని భావించినప్పుడు, ప్రస్తుతం ధర తక్కువగా ఉన్నప్పటికి ఈ ధర వద్దనే వస్తువును ఎక్కువ పరిమాణంలో అమ్మటానికి ప్రయత్నిస్తారు. అందువల్ల వస్తువు సప్లయ్ పెరుగుతుంది.

2) శ్రామిక సప్లయి విషయంలో : శ్రామికులు తమ కనీస జీవన ప్రమాణస్థాయికి సరిపోయే వేతనాలు పొందటానికి కష్టపడి పనిచేస్తారు. అంతవరకు వేతనాలు పెరిగితే శ్రమ సప్లయి పెరుగుతుంది. కనీస జీవన ప్రమాణ స్థాయికి సరిపోవు వేతనాలు లభించిన తర్వాత పనికి బదులు విశ్రాంతిని అభిలషిస్తారు. అంటే తక్కువ రోజులు లేక తక్కువ గంటలు పనిచేయటానికి ఇష్టపడతారు. కనుక వేతనాలు పెరిగితే సప్లయి తగ్గుతుంది. అందువలననే శ్రమ సప్లయిరేఖ వెనుకకు వంగి వుంటుంది.

**ప్రశ్న 2) సప్లయి వ్యాకోచత్వమనగానేమి? దానిని కొలుచుట ఎట్లు ? దాని ప్రాముఖ్యమేమి ?**

**లేదా**

**"సప్లయి వ్యాకోచత్వమును" వివరింపుము. అది ఎన్ని రకాలుగా ఉంటుంది ? దాని ప్రాముఖ్యత ఏమి ?**

**జవాబు : సప్లయి వ్యాకోచత్వము :** ఒక వస్తువు ధరలోని మార్పు కనుగుణ్యంగా వస్తువు సప్లయి మారుతుందని సప్లయి సూత్రం చెబుతుంది. అంటే వస్తువు ధర పెరిగితే సప్లయి పెరుగుతుంది, వస్తువు ధర తగ్గితే సప్లయి తగ్గుతుంది. అయితే ధర మారినప్పుడు సప్లయిలో వచ్చే మార్పు అన్ని వస్తువులకు ఒకే రీతిలో వుండదు. కొన్ని వస్తువుల విషయంలో ఈ మార్పు ఎక్కువగాను, మరికొన్ని వస్తువులకు ఈ మార్పు తక్కువగాను వుండవచ్చు. వస్తువు ధరలో కలిగిన మార్పు ఫలితంగా ఆ వస్తువు సప్లయిలో కలిగే మార్పును "సప్లయి వ్యాకోచత్వం" అంటారు. అంటే ధర మార్పుకు, సప్లయి మార్పుకు గల సంఖ్యాత్మక సంబంధాన్ని తెలియచేసేది సప్లయి వ్యాకోచత్వం.

**వ్యాకోచ-అవ్యాకోచ సప్లయి :** ధరలో వచ్చిన స్వల్ప మార్పు వలన సప్లయిలో హెచ్చు మార్పు కలిగితే దానిని "వ్యాకోచ సప్లయి" (Elastic Supply) అంటారు. అలాకాక ధరలో హెచ్చు మార్పు వచ్చినప్పటికి సప్లయ్‌లో స్వల్ప మార్పు వస్తే దాన్ని "అవ్యాకోచ సప్లయ్" (Inelastic Supply) అంటారు.

సప్లయి వ్యాకోచత్వాన్ని క్రింది సూత్రంద్వారా కొలుస్తారు.

$$\text{సప్లయి వ్యాకోచత్వం ns} = \frac{\text{సప్లయి పరిమాణంలో వచ్చిన అనుపాత మార్పు}}{\text{వస్తువు ధరలో వచ్చిన అనుపాత మార్పు}}$$

$$\text{Elasticity of supply ns} = \frac{\text{Proportionate change in the quantity supplied}}{\text{Proportionate change in the Price}}$$

ధరలో వచ్చే మార్పులు, సప్లయిలో వచ్చే మార్పులు ఒకే దిశగా ఉంటాయి. కనుక సప్లయి వ్యాకోచత్వం గుణకం (Co-efficient of Elasticity of Supply) ఎప్పుడు ధనాత్మకంగానే వుంటుంది.

**సప్లయి వ్యాకోచత్వంలోని రకాలు :** సప్లయి వ్యాకోచత్వ గుణకం విలువను బట్టి సప్లయి వ్యాకోచత్వాన్ని ఐదు రకాలుగా చెప్పవచ్చును.

**1) పూర్తి వ్యాకోచమైన సప్లయి (Perfectly Elastic Supply) :** వస్తువు ధరలో వచ్చే అతి స్వల్ప మార్పువలన దాని సప్లయి పరిమాణములో అనంతమైన మార్పు వచ్చినచో, దాన్ని "పూర్తి వ్యాకోచమైన సప్లయి" అనాలి. అప్పుడు సప్లయి వ్యాకోచత్వం విలువ అనంతం (Infinite) గా యుంటుంది. అలాంటి పూర్తి వ్యాకోచ సప్లయిరేఖ X-అక్షానికి సమాంతరముగా యుంటుంది.

**2) పూర్తి అవ్యాకోచమైన సప్లయి(Perfectly Inelastic Supply):** వస్తువు ధరలో ఎంత మార్పు వచ్చినా దాని సప్లయి పరిమాణం మారకుండా స్థిరంగా యుంటే, దాన్ని పూర్తి అవ్యాకోచమైన సప్లయి అనాలి. అప్పుడు సప్లయి వ్యాకోచత్వ విలువ సున్నా (Zero) అవుతుంది. అలాంటి పూర్తి అవ్యాకోచ సప్లయిరేఖ Y- అక్షానికి సమానాంతరంగా ఉంటుంది.

**3) ఏకత్వ వ్యాకోచమైన సప్లయి (Unitary Elastic Supply) :** వస్తువు ధరలో వచ్చిన మార్పు, దాని సప్లయి పరిమాణంలో వచ్చి మార్పు ఒకే అనుపాతంలో ఉంటే, దాన్ని ఏకత్వ వ్యాకోచ సప్లయి అనాలి. అప్పుడు సప్లయి వ్యాకోచత్వ విలువ 1కి సమానము ( =1).

**4) సాపేక్ష వ్యాకోచ సప్లయి (Relatively Elastic Supply) :** వస్తువు ధరలో వచ్చిన అనుపాత మార్పుకంటే దాని సప్లయి పరిమాణంలో వచ్చిన అనుపాత మార్పు ఎక్కువయుంటే, దాన్ని సాపేక్ష వ్యాకోచ సప్లయి అనాలి. అప్పుడు సప్లయి వ్యాకోచత్వం విలువ 1 కన్న ఎక్కువగా (>1) ఉంటుంది.

**5) సాపేక్ష అవ్యాకోచమైన సప్లయి (Relatively Inelastic Supply) :** వస్తువు ధరలో వచ్చిన అనుపాత మార్పుకంటే దాని సప్లయి పరిమాణంలో వచ్చిన అనుపాత

మార్పు తక్కువగా ఉంటే, దాన్ని సాపేక్ష అవ్యాకోచ సప్లయి అనాలి. అప్పుడు సప్లయి వ్యాకోచత్వం విలువ 1కన్న తక్కువగా (<1) ఉంటుంది. అలాంటి సప్లయి రేఖ క్రింది రేఖాపటంలో చూపినట్లు ఉంటుంది.




**సప్లయి వ్యాకోచత్వాన్ని కొలిచే పద్ధతి (Measurement of Elasticity of Supply) :** సప్లయి వ్యాకోచత్వాన్ని రేఖాగణిత పద్ధతిద్వారా కొలవవచ్చు.




$$\text{సప్లయి వ్యాకోచత్వం } ns = \frac{\text{సప్లయి పరిమాణంలో వచ్చిన అనుపాత మార్పు}}{\text{వస్తువు ధరలో వచ్చిన అనుపాత మార్పు}}$$

**సప్లయి రేఖ సరళరేఖగా వున్నప్పుడు వ్యాకోచత్వాన్ని కొలిచే పద్ధతి :** పటంలో SA సప్లయిరేఖ. వస్తువు ధర PB ఉన్నప్పుడు సప్లయి పరిమాణం OB ఉంది. ఇప్పుడు వస్తువు ధర QCకి పెరిగింది. ఫలితంగా సప్లయి పరిమాణం OCకి పెరిగింది. కనుక.

సప్లయి వ్యాకోచత్వం $= \frac{PE}{OB} \div \frac{QE}{PB}$

PE, BCలు సమానం గనుక

$$ns = \frac{PE}{OB} \times \frac{PB}{QE} = \frac{PE}{QE} \times \frac{PB}{OB}$$

PBA, QEP లు స్వరూప త్రిభుజాలు (Similar Triangles)

అందువలన $= \frac{PE}{QE} = \frac{AB}{PB}$

కనుక $ns = \frac{AB}{PB} \; \frac{PB}{OB}$ లేక $\frac{AB}{OB}$

పటంలో OB కన్న AB తక్కువగా ఉంది. కనుక $\frac{AB}{OB}$ నిష్పత్తి 1 కన్నా తక్కువగా ఉంటుంది. ఉదాహరణలో సప్లయి వ్యాకోచత్వం విలువ 1 కన్నా తక్కువ అంటే సాపేక్ష అవ్యాకోచ సప్లయి అన్నమాట.

OB, ABకి సమానంగా ఉంటే, వాటి నిష్పత్తి 1 కంటే ఎక్కువగా ఉంటుంది. అంటే ఆ వస్తువుకు ఏకత్వ వ్యాకోచ సప్లయి ఉందన్నమాట.

OB కన్నా AB ఎక్కువగా వుంటే, వాటి నిష్పత్తి 1 కంటే ఎక్కువగా ఉంటుంది. అంటే ఆ వస్తువుకు సాపేక్ష వ్యాకోచ సప్లయి ఉందనాలి.

**సప్లయిరేఖ వక్రరేఖగా (Curve) ఉన్నప్పుడు వ్యాకోచత్వాన్ని కొలిచే పద్ధతి :** సప్లయి రేఖ వక్రరేఖగా ఉన్నప్పుడు ఏ బిందువు వద్దనైనా సప్లయి వ్యాకోచత్వాన్ని కొలవాలంటే, ఆ బిందువువద్ద సప్లయి రేఖకు ఒక స్పర్శ రేఖను గీయాలి.



పటంలో SS సప్లయి వక్రరేఖ. దానికి P బిందువువద్ద స్పర్శరేఖ గీయబడింది. ఈ స్పర్శరేఖ మూలబిందువు 'O' గుండా పోతున్నది. కనుక P బిందువు వద్ద సప్లయి వ్యాకోచత్వం ఒకటికి సమానం (=1) అని చెప్పాలి. అలాకాక ఈ స్పర్శరేఖ X- అక్షాన్ని ఖండిస్తే ఒకటికన్న తక్కువ (<1) అని, Y-అక్షాన్ని ఖండిస్తే ఒకటికన్న ఎక్కువ (>1) అని చెప్పాలి. ఈ విషయమే క్రింది పటంలో చూపబడింది.







సప్లయి వ్యాకోచత్వం - ప్రాముఖ్యం : డిమాండ్ వ్యాకోచత్వం వలెనే, సప్లయి వ్యాకోచత్వానికి కూడ అర్థశాస్త్రంలో ప్రాముఖ్యముంది. ముఖ్యంగా ధర నిర్ణయ సిద్ధాంతంలో ఈ భావనకు ప్రాముఖ్యముంది.

1) డిమాండ్‌లో మార్పు - ధర : వస్తువు డిమాండులో మార్పు వచ్చినప్పుడు దాని ధర ఏ మేరకు పెరుగుతుందనేది సప్లయి వ్యాకోచత్వాన్ని బట్టి ఉంటుంది. డిమాండ్ పెరిగినప్పుడు ఆ వస్తువు సప్లయి అవ్యాకోచమైతే దాని ధర స్వల్పంగా మాత్రమే పెరుగుతుంది.

2) పన్నుల భారం పంపిణీ : వస్తువులపై పన్నులు విధించినప్పుడు ఆ పన్నుల భారం వినియోగదార్ల ఉత్పత్తిదార్ల మధ్య ఏ విధంగా పంపిణీ అయ్యేది ఆ వస్తువుయొక్క డిమాండు, సప్లయిల వ్యాకోచత్వంపై ఆధారపడుతుంది. వస్తువుకు వ్యాకోచ సప్లయి ఉంటె అంటె దాని సప్లయిని బాగా తగ్గించగలిగితే పన్ను భారాన్ని ఎక్కువగా వినియోగదార్లపైకే నెట్టవచ్చు.

**ప్రశ్న 3) స్వల్పకాలిక, దీర్ఘకాలిక సప్లయి అనగానేమి ? స్వల్పకాలిక, దీర్ఘకాలిక సప్లయి రేఖల స్వభావమును తెలుపుము.**

**లేదా**

**కాలవ్యవధిని బట్టి సప్లయిలో మార్పులను వివరించండి.**

**లేదా**

**సప్లయిలో కాల వ్యవధి పాత్రను వివరించండి.**

**జవాబు :** కాల వ్యవధిని బట్టి సప్లయి మారుతుంది. అందువల్ల సప్లయిని రెండు విధాలుగా చెప్పవచ్చు. అవి :

1) స్వల్పకాల వ్యవధి సప్లయి, 2) దీర్ఘకాల వ్యవధి సప్లయి.

**1) స్వల్పకాల వ్యవధి సప్లయి (Short Period Supply) :** స్వల్పకాలంలో సంస్థలు కొత్త యంత్ర సముదాయాన్ని నెలకొల్పటానికి వీలుండదు. అంటే స్థిర ఉత్పత్తి కారకాలను మార్చే వీలుండదు. అయితే చర ఉత్పత్తి సాదనాలను పెంచటం ద్వారా ఉత్పత్తిని కొంత మేరకు పెంచవచ్చు. స్థిర ఉత్పత్తి కారకాలనే మార్చకుండా చర ఉత్పత్తి కారకాలనే పెంచటంవల్ల క్షీణ ప్రతిఫలాలు (Diminishing returns) వస్తాయి. అందువల్ల స్వల్పకాల వ్యవధిలో సగటు వ్యయం (AC), ఉపాంత వ్యయం (MC)లు పెరుగుతాయి.

ధర ఉపాంత వ్యయానికి సమానంగా వుండేటట్లు వస్తువును ఉత్పత్తి చేసి సంస్థ అమ్మజూపుతుంది. కాని స్వల్ప వ్యవధిలో ఉపాంత వ్యయం పెరుగుతుంది కదా ! కనుక ధరకూడా పెరుగుతుందన్నమాట. అంటే ధర పెరిగితే సప్లయి పెరుగుతుంది కనుక స్వల్పకాల వ్యవధిలో ఉపాంత వ్యయరేఖ (MC)ను సప్లయి రేఖగా పరిగణించవలె. ధర సగటు వ్యయానికన్నా తక్కువగా వుంటే సంస్థ ఉత్పత్తిని నిలిపివేస్తుంది కనీసం సగటు చర వ్యయానికన్నా ధర సమానంగా వుంటే ఉత్పత్తిని కొనసాగిస్తుంది. అంటే **ఉత్పత్తికి వాడిన ముడిపదార్థాలు,** ఇంధనం, వేతనాలు మొదలైనవాటిపై అయ్యేవ్యయాలకు ధర సమానంగా వుండవలె. కాబట్టి సగటు చర వ్యయరేఖ (AVC) కనిష్ఠ బిందువుకు పై భాగంలో వుండే ఉపాంత వ్యయరేఖ భాగమే సంస్థ స్వల్పకాలిక సప్లయిరేఖ.




పటంలో (AVC) సగటు చర వ్యయరేఖ. MC ఉపాంత వ్యయరేఖ. E బిందువు వద్ద సగటు చరవ్యయం కనిష్టస్థాయిలో వుంది. అప్పుడు ధర OP. ధర OP కంటె తక్కువగా వుంటే అది కనిష్ట సగటు చరవ్యయానికంటె తగ్గుతుంది. ఆ స్థితి సంస్థకు నష్టదాయకం కనుక సప్లయిని నిలిపివేస్తుంది. కనుక E బిందువుకు పై భాగంలో వుండే ఉపాంత వ్యయరేఖ, సంస్థయొక్క స్వల్పకాలిక సప్లయి రేఖ అవుతుంది. EMC స్వల్పకాలిక సప్లయిరేఖ.

పై విధంగా స్వల్పకాలంలో ప్రతి సంస్థయొక్క సప్లయిని తెలుసుకోవచ్చు. సంస్థలన్నింటి సప్లయి కలిపితే పరిశ్రమ యొక్క స్వల్పకాలిక సప్లయి తెలుస్తుంది. సంస్థల సప్లయి రేఖవలెనే పరిశ్రమయొక్క సప్లయి రేఖను కూడా గీయవచ్చు. ఈ రేఖకూడా ఎడమనుంచి కుడికి పైకి పోతుంది. అందువల్ల పరిశ్రమ విషయంలో కూడా స్వల్పకాలంలో ధర పెరిగితేనే సప్లయి పెరుగుతుంది.

**2) దీర్ఘకాలవ్యవధి సప్లయి [Long Period Supply] :** దీర్ఘకాలం అంటే ఉత్పాదక సంస్థలు చర ఉత్పత్తి సాధనాలనేగాక స్థిర ఉత్పత్తి సాధనాలను కూడా మార్చి ఉత్పాదక శక్తిని పెంచటానికి అవకాశం వుండేంత కాలం. దీర్ఘకాలంలో క్రొత్త సంస్థలు కూడా పరిశ్రమలో ప్రవేశించవచ్చు. ఈ కాలంలో స్థిర వ్యయాలంటూ ఉండవు, అన్ని చరవ్యయాలే. ఈ కాలంలో వస్తురాశి సగటు కనిష్ట వ్యయంతో ఉత్పత్తి అవుతూ ఉంటుంది. పరిశ్రమ విస్తృతమైనకొద్దీ కొన్ని ఆదాలు ఉత్పన్నమవుతాయి. ఒక స్థాయి దాటిన తర్వాత ఈ ఆదాలస్థానే తరుగులు కూడా రావచ్చు. కనుక ఒక సంస్థ వస్తురాశి ఉత్పత్తి సమవ్యయంతోగాని, పెరుగుతున్న వ్యయంతోగాని, తగ్గుతున్న వ్యయంతోగాని సాగుతూ ఉండవచ్చు. అందువల్ల దీర్ఘకాలంలో సప్లయి రేఖ ఉత్పత్తి వ్యయంలోని మార్పులపై ఆధారపడి క్రింది పటములలో చూపిన విధంగా ఉంటుంది.




i) **స్థిర వ్యయాలు (Constant Costs) :** ఉత్పత్తి తరహా పెరిగినకొద్దీ కొన్ని ఆదాలు (economies) ఉత్పన్నమవుతాయి. అయితే ఒక స్థాయి దాటిన తర్వాత ఆదాలస్థానే తరుగులు (diseconomies) సంభవించవచ్చు. ఈ ఆదాలు, తరుగులు రెండూ సమానమైతే అవి ఒకదానినొకటి రద్దు చేసుకొని ఉత్పత్తివ్యయం నిలకడగా వుంటుంది. దీనినే 'స్థిరవ్యయం" అంటారు. ఈ పరిస్థితి. దీర్ఘకాల సప్లయిరేఖ పటము A-లో చూపినట్లు X- అక్షానికి సమానాంతరంగా వుంటుంది. పటంలో LSC దీర్ఘకాలిక సప్లయిరేఖ. ఉత్పత్తి పెరిగినప్పటికి ఉత్పత్తి వ్యయం స్థిరంగానే వుండటాన్ని ఈ రేఖ చూపుతున్నది.

ii) **పెరుగుతున్న వ్యయాలు (Increasing Costs) :** ఉత్పత్తి తరహా మరీ పెరిగినకొద్దీ ఆదాలకన్నా తరుగుదలలే ఎక్కువగా వుంటాయి. అప్పుడు వస్తురాశి పెరిగినకొద్దీ సగటు ఉత్పత్తి వ్యయంకూడా పెరుగుతుంది. ఆ పరిస్థితిలో సప్లయిరేఖ పటం Bలో చూపినట్లు ఎడమనుండి కుడికి పైకిపోతుంది. పటంలో LSC దీర్ఘకాలిక సప్లయ్ రేఖ. ఉత్పత్తి పెరిగినప్పుడు ఉత్పత్తి వ్యయం కూడా పెరుగుతున్నట్లు ఈ రేఖ చూపుతుంది. పరిపూర్ణమైన పోటీవున్న పరిశ్రమలో సప్లయి రేఖ ఈ విధంగానే వుంటుంది.

iii) **తరుగుతున్న వ్యయాలు (Decreasing Costs) :** ఒకప్పుడు దీర్ఘకాలంలో సప్లయి తరహాలు పెంచటం వల్ల కలిగే ఆదాలు, తరుగుదలకన్న హెచ్చుగా వుంటాయి. అప్పుడు వస్తురాశి పెరిగినకొద్దీ సగటు సప్లయి వ్యయం తగ్గుతుంది. ఆ పరిస్థితిలో దీర్ఘకాలిక సప్లయి రేఖ పటం C-లో చూపినట్లు ఎడమ నుంచి కుడికి క్రిందికి వాలుతుంది. పటంలో LSC దీర్ఘకాలిక సప్లయిరేఖ. సప్లయి పెరిగినప్పుడు ఉత్పత్తి వ్యయం తగ్గుతున్నట్లు ఈ రేఖ చూపుతుంది.

సాధారణంగా దీర్ఘకాలంలో ఉత్పత్తి వ్యయాలు పెరుగుతుంటాయి. అందువల్ల దీర్ఘకాలిక సప్లయిరేఖ పటం Bలో చూపినట్లు ఎడమనుంచి కుడికి పైకి పోతుంది. పరిపూర్ణ పోటీలలో తగ్గుతున్న వ్యయాలతో వుండే పరిశ్రమ సహజంగా వుండదు. ఏకస్వామ్య పరిస్థితులలో వుంటే వుండవచ్చు.

**ప్రశ్న 4) వెనుకకు వంగిన సప్లయి రేఖ అనగానేమి? విశదీకరించుము.**

**(Important)**

**జవాబు :** ఒక ధర వద్ద ఉత్పత్తిదార్లు ఒక వస్తువును ఎంత పరిమాణంలో విక్రయించటానికి ఇష్టపడతారో ఆ పరిమాణాన్ని ఆ వస్తువు యొక్క సప్లయి అంటారు. వస్తువు యొక్క సప్లయి ధరపై ఆధారపడుతుంది. కనుక సప్లయి ఎప్పుడు ఒక ధర సంబంధంగా చెప్పాలి. ధరకు సప్లయ్ పరిమాణానికి గల సంబంధాన్ని సప్లయి సూత్రం తెలియచేస్తుంది. వస్తువు ధర పెరిగినప్పుడు దాని సప్లయి పెరుగుతుంది. ఇదే సప్లయ్ సూత్రం. అందువల్ల సప్లయ్‌రేఖ ఎడమనుంచి కుడికి పైకి పోతుంది. దీన్నే క్రింది పటంలో చూడవచ్చు :




పటంలో X- అక్షంపైన వస్తువు సప్లయి, Y- అక్షంపైన వస్తువు ధర చూపబడినాయి. SS సప్లయ్ రేఖ. ధర OP వున్నప్పుడు సప్లయి OM వుంది. ధర $OP_1$కి పెరిగినప్పుడు సప్లయి పరిమాణం కూడా $OM_1$కి పెరిగింది.

**వెనుకకు వంగు సప్లయి రేఖ (Backward bending supply curve) :** సప్లయి సూత్రానికి కొన్ని మినహాయింపులున్నాయి. ధర పెరిగినప్పుడు కొన్ని వస్తువుల విషయంలో సప్లయి తగ్గనుకూడా తగ్గవచ్చును. ఇది సప్లయి సూత్రానికి మినహాయింపు.

ముఖ్యంగా శ్రమ విషయంలో వేతనాలు పెరిగితే శ్రమ సప్లయి తగ్గుతుంది. శ్రామికులు కనీస జీవన ప్రమాణస్థాయికి సరిపోయే వేతనాలకోసం ఎక్కువ శ్రమ చేస్తారు. వేతనము కనీస జీవన ప్రమాణస్థాయికి సరిపోయిన తర్వాత శ్రమ చేయటానికి ముందుకు రారు. అప్పుడు శ్రమకు బదులు ఎక్కువ విశ్రాంతిని కోరుకుంటారు. ఇంకా వేతనాలు పెరిగితే శ్రమ సప్లయి తగ్గుతుంది కూడా. ఇలాంటి పరిస్థితిలో సప్లయి రేఖ వెనుకకు వంగి వుంటుంది. దీన్నే క్రింది పటంలో చూడవచ్చు.




పటంలో SS శ్రమ సప్లయ్ రేఖ. వేతనాలు OW వున్నప్పుడు శ్రామిక సప్లయ్ OM వుంది. ఇప్పుడు వేతనాలు $OW_1$కి పెరిగినాయి. ఫలితంగా శ్రమ సప్లయి $OM_2$ నుంచి $OM_1$కు తగ్గింది. ఇది సప్లయి సూత్రానికొక మినహాయింపు.

**ప్రశ్న 5) సప్లయి మార్పులను తెల్పుము.**

**జవాబు :** ధరలో మార్పుకు సప్లయిలో మార్పు వస్తుంది. ధర పెరిగితే సప్లయి పెరుగుతుంది. ధర తగ్గితే సప్లయి తగ్గుతుంది. ఈ విషయాన్నే సప్లయి సూత్రం చెబుతుంది. వివిధ ధరలవద్ద వస్తువు ఎంతెంత పరిమాణంలో సప్లయి చేయబడుతుందో రేఖాపటంలో చూపితే సప్లయి రేఖ వస్తుంది. సప్లయి రేఖ SSను క్రింది పటంలో చూడవచ్చు.



పటంలో ధర OP ఉన్నప్పుడు సప్లయి OM యిప్పుడు ధర $OP_1$కి పెరిగింది ఫలితంగా సప్లయి $OM_2$కి పెరిగింది.

అయితే సప్లయ్ వస్తువు ధరపైనేగాక అనేక ఇతర అంశాలపై కూడా ఆధారపడుతుంది. ముఖ్యంగా సాంకేతిక స్థితి ఉత్పత్తి సాధనాల ధరలు, ఇతర వస్తువుల ధరలు మొదలైనవాటి ప్రభావం సప్లయిపై వుంటుంది. వీటిని "సప్లయి ప్రేరణలు" అని అంటారు. వీటిలో మార్పులు సప్లయిలో మార్పు తెస్తాయి. ఇలాంటి మార్పులను సప్లయి 'పెరుగుదల' 'తగ్గుదల' అని చెప్పాలి. ఆ కారణంగా సప్లయి పెరిగినప్పుడు సప్లయిరేఖ కుడివైపుకు, సప్లయి తగ్గినప్పుడు సప్లయిరేఖ ఎడమ వైపుకు జరుగుతుంది. పై పటంలో $S_1S_1$ పెరిగిన సప్లయి రేఖ. అదే ధర ($OP_1$) వద్దనే యిప్పుడు ఎక్కువ ($OM_2$) సప్లయి చేయబడుతున్నది. అదే విధంగా ($S_2S_2$) తగ్గిన సప్లయి రేఖ, వున్న ధరవద్ద తక్కువ సప్లయి చేయబడుతున్నట్లు ఈ రేఖలో చూడవచ్చు.

పై విషయాన్ని బట్టి రెండు విషయాలు తెలుస్తున్నాయి. అవి :

1. ధరలో మార్పువల్ల సప్లయిలో వచ్చే మార్పులు ఒకే సప్లయిరేఖ (SS) తెలియచేస్తుంది.
2. ఉత్పత్తి ప్రేరణలో వచ్చే మార్పుల వల్ల సప్లయి పెరిగితే కొత్త సప్లయి రేఖ ($S_1S_1$) ఏర్పడుతుంది. ఇది పాత ఉత్పత్తి రేఖకు కుడివైపుగా వుంటుంది. అదే విధంగా సప్లయి తగ్గితే కొత్త సప్లయిరేఖ ($S_2S_2$) ఏర్పడుతుంది. ఇది పాత సప్లయ్‌రేఖకు ఎడమవైపుగా వుంటుంది.

# SHORT NOTES

## ప్రశ్న 1) సప్లయి ఫలం (Supply Function).

**జవాబు :** ఒక వస్తువు సప్లయి సంస్థ లక్ష్యాలు, సాంకేతిక స్థితి, మిగతా వస్తువుల ధరలు, ఉత్పత్తి సాధనాల ధరలు మొదలైన అనేక అంశాలమీద ఆధారపడుతుంది. వీటన్నిటి ఆధారంగా సప్లయి ఫలాన్ని ఒకదానిని క్రింది సమీకరణములద్వారా చూపించవచ్చు. సప్లయ్ ఫలాన్ని తెలియచేసేటప్పుడు సంస్థల ప్రధాన లక్ష్యం గరిష్ట లాభాలను ఆర్జించటమే అని భావించవలె.

$Sn = f(Pn, T.....P_1n\,Fp)$

ఈ సమీకరణంలో

Sn– n వస్తువు సప్లయ్ పరిమాణం

Pn–n వస్తువు ధర

T– సాంకేతిక స్థితి

$Pn_1$– ఇతర వస్తువుల ధరలు

Fp– ఉత్పత్తి సాధనాల ధరలు

పై సమీకరణములలో సప్లయిని నిర్ణయించే అంశాలు అనేకం ఉన్నాయి. అయితే విశ్లేషణ సులువుగా ఉండే నిమిత్తం ఆ వస్తువు ధర తప్ప మిగతా అన్ని అంశాలు స్థిరంగానే ఉన్నాయని భావించాలి. అప్పుడు వస్తువు సప్లయికి, దాని ధరకు గల సంబంధాన్ని సప్లయి ఫలం తెలియచేస్తుంది.

కనుక Sn = f (Pn)

ఇక్కడ Sn - n వస్తువుయొక్క సప్లయి పరిమాణం

Pn - n వస్తువుయొక్క ధర

**ప్రశ్న 2) సప్లయిని నిర్ణయించే అంశాలు (Determinants of Supply).**

జవాబు : 1వ ప్రశ్నకిచ్చిన జవాబులో "సప్లయిని నిర్ణయించే అంశాలు" చూడండి.

**ప్రశ్న 3) సప్లయి వ్యాకోచత్వం (Elasticity of Supply).**

జవాబు : 2వ ప్రశ్నకిచ్చిన జవాబు చూడండి.

**ప్రశ్న 4) సప్లయి వ్యాకోచత్వాన్ని కొలుచుట, దాని ప్రాముఖ్యత.**

జవాబు : 2వ ప్రశ్నకిచ్చిన జవాబు చూడండి.



# అధ్యాయము 7

# మార్కెట్లు

**ప్రశ్న 1) మార్కెట్ అనగానేమి? మార్కెట్‌లోని రకాలను వివరించండి.**

**లేదా**

**మార్కెట్‌ను నిర్వచించి దాని వర్గీకరణ తెల్పండి.**

**జవాబు : మార్కెట్ నిర్వచనము :** సాధారణ పరిభాషలో మార్కెట్ అంటే ఒక వస్తువును అమ్మే లేక కొనే ప్రదేశం అని అర్థం. కాని అర్థశాస్త్రంలో మార్కెట్ అంటే ఒక నిర్ణీత ప్రదేశం కాదు. ఒక వస్తువు యొక్క అమ్మకందార్లు, కొనుగోలుదార్లు కలిసి ఆ వస్తువునకు మార్కెట్ అవుతారు. అంటే అర్థశాస్త్రంలో మార్కెట్ వస్తువారీ (Commodity)గా ఉంటుందేకాని ప్రదేశంవారీగా ఉండదు. ఉదాహరణకు, గోధుమ మార్కెట్, ప్రత్తి మార్కెట్, తేయాకు మార్కెట్ మొదలైనవి. అంటే ప్రపంచంలో ఆ వస్తువును కొనేవారు, అమ్మేవారు కలసి ఆ వస్తువునకు మార్కెట్ అవుతారు. వీరు ఏ ఒక్క ప్రదేశంలోనో స్వయంగా కలుసుకోనవసరం లేదు. తంతి తపాలద్వారా గాని, ఏజంట్లద్వారా గాని, ధరల పట్టికలద్వారా గాని వారి మధ్య సంబంధం ఉంటే చాలు. అప్పుడు వారు ధరను నిర్ణయం చేసుకొని ఆ ప్రకారం వస్తువులను కొనటం గాని, అమ్మటం గాని చేయగలరు. 'కౌర్‌నట్' ప్రకారము "ఒక ప్రాంతంలో అమ్మేవారు మరియు కొనేవారు ఒకరితో నొకరు స్వేచ్ఛగా పోటీపడి, ఒక వస్తువు ధరను ఆ ప్రాంతంలో అన్నిచోట్ల సమానంగ ఉండేటట్లు చేయు ప్రక్రియ మార్కెట్."

**మార్కెట్‌లోని ముఖ్యాంశాలు :**

1) ఒక వస్తువు ఉండవలె.

2) అమ్మకందార్లు, కొనుగోలుదార్లు ఉండవలె.

3) వస్తు వినిమయానికి అవసరమగు యంత్రాంగం ఉండవలె.

4) కొనుగోలుదార్లు, అమ్మకందార్ల మధ్య పరస్పర సంబంధం ఉండవలె.

మార్కెట్‌లోని రకాలు లేక మార్కెట్ల వర్గీకరణ : మార్కెట్లను 1) పోటీనిబట్టి రెండుగాను, 2) కాల వ్యవధినిబట్టి మూడుగాను, 3) విస్తీర్ణాన్ని బట్టి మూడుగాను - వర్గీకరించవచ్చు.

**1) పోటీనిబట్టి మార్కెట్లు రెండు రకాలు - అవి :** i) పరిపూర్ణ పోటీగల మార్కెట్ (Perfect Competition), ii)అపరిపూర్ణ పోటీ గల మార్కెట్ (Imperfect Competition).

**i) పరిపూర్ణ పోటీగల మార్కెట్ :** ఇందులో అమ్మకందార్లు, కొనుగోలుదార్లు హెచ్చు సంఖ్యలో ఉంటారు. వీరందరికి మార్కెట్‌లో వివిధ ప్రాంతాలలో వస్తువుకున్న ధరలను గూర్చిన సమాచారం పూర్తిగా తెలిసి ఉంటుంది. మార్కెట్‌లో అమ్మజూపే వస్తువు ఏక జాతీయంగా ఉంటుంది. సంస్థలకు, పరిశ్రమలో ప్రవేశించటానికిగాని, పరిశ్రమను వదిలివెళ్ళటానికిగాని పూర్తి స్వేచ్ఛ ఉంటుంది. ఉత్పత్తి కారకాల మధ్య గమనశీలత ఉంటుంది. మారకం ధర ప్రాతిపదికగానే జరుగుతుంది. రవాణా ఛార్జీలు ధరలో చేర్చబడవు. వీటన్నింటి ఫలితంగా మార్కెట్ అంతటా ఒకే వస్తువుకు, ఒకే సమయంలో, ఒకే ధర ఉంటుంది.

**ii) అపరిపూర్ణమైన మార్కెట్ :** ఒకే సమయములో ఒకే వస్తువుకు వివిధ ధరలుండే మార్కెట్ "అపరిపూర్ణమైన మార్కెట్". ఇందులో వస్తు విభేదం ఉంటుంది. అమ్మకందార్లకు, కొనుగోలుదార్లకు వస్తువు ధరను గురించిన పూర్తి సమాచారం తెలియదు. సంస్థలు, పరిశ్రమలో చేరటానికి గాని, పరిశ్రమను వదిలివెళ్ళటానికి గాని స్వేచ్ఛ ఉండదు. ఉత్పత్తి కారకాల మధ్య గమనశీలత ఉండదు. రవాణా ఛార్జీలు ధరలో చేర్చబడి ఉంటాయి. వీటన్నింటి ఫలితంగా మార్కెట్‌లో వివిధ ప్రాంతాలలో వస్తువుకు వివిధ ధరలు ఉంటాయి.

**2) కాల వ్యవధినిబట్టి మార్కెట్‌లను మూడు రకాలుగా వర్గీకరించవచ్చు.** అవి: i) అతి స్వల్పకాలిక మార్కెట్, ii) స్వల్పకాలిక మార్కెట్, iii) దీర్ఘకాలిక మార్కెట్

**i) అతి స్వల్పకాలిక మార్కెటు (Very Short-Period Market) :** ఈ కాలవ్యవధిలో సప్లయిని ఏ మాత్రం పెంచటానికి వీలుండదు. అప్పటికే ఉత్పత్తి చేయబడి అమ్మటానికి సిద్ధంగా ఉన్నదే సప్లయి. అందువల్ల ధరపై డిమాండ్ ప్రభావం ఎక్కువగా ఉంటుంది. ఈ కాలవ్యవధిలో ఉండే ధరను "మార్కెట్ ధర" (Market Price) అంటారు.

**ii) స్వల్పకాలిక మార్కెటు (Short-Period Market) :** ఈ కాలవ్యవధిలో డిమాండ్ కనుగుణ్యంగా సప్లయిని కొంతవరకు మార్చవచ్చు. అంటే వస్తువుకు డిమాండ్ పెరిగితే, సప్లయిని కొంతమేరకు పెంచవచ్చు. స్థిర ఉత్పత్తి కారకాలను మార్చకుండా, చర ఉత్పత్తి కారకాలను మాత్రమే మార్చుతూ ఉత్పత్తిని కొంతవరకు పెంచవచ్చు. అందువల్ల ఈ కాల వ్యవధిలో ధరపై డిమాండ్ ప్రభావంతోపాటు కొంత సప్లయి ప్రభావం కూడ ఉంటుంది. ఈ ధరను "స్వల్పకాలిక సహజ ధర" (Short-run Normal Price) అంటారు.

**iii) దీర్ఘకాలిక మార్కెటు (Long-Period Market) :** డిమాండ్ కనుగుణ్యంగా సప్లయిని పూర్తిగా మార్చటానికి సరిపడే కాలాన్ని "దీర్ఘకాలం" అంటారు. ఈ కాలంలో

కొత్త సంస్థలు పరిశ్రమలో ప్రవేశించవచ్చు, ఉన్న సంస్థలు పరిశ్రమను వదిలి వెళ్ళవచ్చు. ఫలితంగా సప్లయి డిమాండ్‌కు సమానమౌతుంది. ఈ కాలంలో ధరపై సప్లయి ప్రభావం ఎక్కువగా ఉంటుంది. ఈ ధరను 'సహజ ధర' (Normal Price) అంటారు.

**3) విస్తీర్ణాన్ని బట్టి మార్కెట్లను మూడుగా వర్గీకరించవచ్చు.** అవి : i) స్థానిక మార్కెట్, ii) జాతీయ మార్కెట్ , iii) అంతర్జాతీయ మార్కెట్.

**i) స్థానిక మార్కెట్ (Local Market) :** ఒక వస్తువు యొక్క అమ్మకందార్లు, కొనుగోలుదార్లు ఒక ప్రాంతానికి మాత్రమే పరిమితమై ఉంటే ఆ వస్తువు మార్కెట్‌ని "స్థానిక మార్కెట్" అంటారు. ఉదాహరణకు పాలు, కూరలు, మాంసం, ఇటుకరాళ్ళు మొదలైనవాటికి స్థానిక మార్కెట్ ఉంటుంది.

**ii) జాతీయ మార్కెట్ (National Market) :** వస్తువు యొక్క అమ్మకం, కొనుగోలు ఒక జాతి లేక దేశానికి మాత్రమే పరిమితమయి ఉంటే ఆ వస్తువు యొక్క మార్కెట్‌ని "జాతీయ మార్కెట్" అంటారు. ఉదాహరణకు ధోవతులు, చీరలు, గాజులు, కుంకుమ మొదలైన వస్తువులకు భారతదేశంలోనే మార్కెట్ వుంటుంది. లేదా వాటిని ఎక్కువగా భారతీయులు మాత్రమే కొంటుంటారు. అలాంటి వస్తువుల మార్కెట్‌ని "జాతీయ మార్కెట్" అంటారు.

**iii) అంతర్జాతీయ మార్కెట్ (International or World Market) :** వస్తువు యొక్క అమ్మకం, కొనుగోలు ప్రపంచమంతా విస్తరించి వుంటే ఆ వస్తువు మార్కెట్‌ని "అంతర్జాతీయ మార్కెట్" అంటారు. ఉదాహరణకు, బంగారం, వెండి, తేయాకు, పొగాకు, ప్రత్తి మొదలైనవాటికి ప్రపంచవ్యాప్తమైన మార్కెట్ వుంది.

**ప్రశ్న 2) మార్కెట్ యొక్క పరిమాణం ఏ అంశాలమీద ఆధారపడుతుంది.**

**లేదా**

**మార్కెట్ విస్తీర్ణాన్ని నిర్ణయించే అంశాలు ఏవి ?**

**జవాబు :** మార్కెట్ పరిమాణము వివిధ వస్తువులకు వివిధ రకాలుగా వుంటుంది. బంగారం, వెండి, గోధుమలు వంటి కొన్ని వస్తువులకు ప్రపంచవ్యాప్తమయిన మార్కెట్ వుంటుంది. కాని పాలు, మాంసము, కూరగాయలు వంటి మరికొన్ని వస్తువులకు స్థానికమైన మార్కెట్ వుంటుంది. ఒక వస్తువు యొక్క మార్కెట్ పరిమాణమును ఈ క్రింది అంశాలు నిర్ణయిస్తాయి.

1) **విశాలమైన డిమాండు (Universal Demand) :** ప్రపంచమంతా డిమాండు వున్న వస్తువులకు ప్రపంచవ్యాప్తమైన మార్కెట్ వుంటుంది. బంగారం, వెండి, గోధుమలు మొదలయిన వస్తువులకు ప్రపంచమంతా డిమాండు వుండటము వల్ల ఆ వస్తువులకు ప్రపంచమంతా మార్కెట్ వుంటుంది. ఇలా ప్రపంచమంతా డిమాండు లేని వస్తువులకు స్థానిక లేక జాతీయమైన మార్కెట్ మాత్రమే వుంటుంది.

2) **మన్నిక (Durability) :** మన్నిక గల వస్తువులకే ప్రపంచవ్యాప్తమైన మార్కెట్ వుంటుంది. మన్నిక అంటే వస్తువు ఎక్కువ కాలము నిలువ వుండాలి. వెండి, బంగారం మొదలైన వస్తువులు ఎక్కువ కాలము నిలువ వుండగలవు. కనుక వాటికి ప్రపంచమంతా మార్కెట్ వుంటుంది. అలాకాక పాలు, మాంసము, కూరలు మొదలైన వస్తువులకు ప్రపంచమంతటా డిమాండు వున్నప్పటికి వాటికి ప్రపంచవ్యాప్తమైన మార్కెట్ లేదు. ఇందుకు కారణము అవి ఎక్కువ కాలము నిలువ వుండవు. కనుక వాటికి స్థానికమైన మార్కెట్ మాత్రమే వుంటుంది.

3) **రవాణాకు వీలు (Portability) :** వస్తువు ఒక ప్రదేశము నుంచి మరొక ప్రదేశమునకు సులభముగా తక్కువ ఖర్చుతో రవాణా చేయడానికి అనుకూలముగా వున్నప్పుడే ప్రపంచవ్యాప్తమైన మార్కెట్ వుంటుంది. బంగారం, వెండి మొదలైన వస్తువులను సులభముగా రవాణా చేయవచ్చు. అందువల్ల అలాంటి వస్తువులకు ప్రపంచమంతా మార్కెట్టు వుంటుంది. ఇటుకరాళ్ళకు ప్రపంచమంతా డిమాండు వుండి ఎక్కువ కాలము నిలువ వుండగలవైనప్పటికీ వాటికి ప్రపంచవ్యాప్తమైన మార్కెట్టు లేదు. ఇందుకు కారణము వాటికి అయ్యే రవాణా ఖర్చులు వాటి ధరతో పోలిస్తే హెచ్చుగా వుంటాయి. కనుక వాటికి స్థానికమైన మార్కెట్టు మాత్రమే వుంటుంది.

4) **శాంపిల్ తీయడానికి, గ్రేడు చేయడానికి అవకాశము (Possibility of Sampling and Grading) :** సహజముగా కొనుగోలుదారులు వస్తువులను ముందుగా చూడనిదే వాటిని కొనడానికి ఇష్టపడరు. దూరప్రాంతంలో నివసించే కొనుగోలుదారులు వస్తువును స్వయముగా చూడలేరు. కనుక వస్తువు యొక్క శాంపిల్‌ను అమ్మకందారుడు కొనుగోలుదారునకు పంపవలె. కాబట్టి ఏ వస్తువులకయితే శాంపుల్ తీసి పంపడానికి అవకాశముంటుందో ఆ వస్తువులకు ప్రపంచవ్యాప్తమైన మార్కెట్టు వుంటుంది. లేక వస్తువులను గ్రేడు చేసి కొనుగోలుదారులకు వస్తువులు ఏ గ్రేడుకు చెందినవో తెలియచేయవచ్చు ఏ వస్తువులు అలా గ్రేడు చేయడానికి అవకాశము కలిగివుంటాయో ఆ వస్తువులకు ప్రపంచము అంతా మార్కెట్టు ఉంటుంది. పొగాకు, తేయాకు, కాఫీ మొదలైన వస్తువులకు శాంపిలు తీసి పంపవచ్చు, లేక గ్రేడు చేసి తెలియచేయవచ్చు. అందువల్ల వాటికి ప్రపంచము అంతా మార్కెట్టు ఉంటుంది. అలాలేని వస్తువులకు స్థానికమైన మార్కెట్టు మాత్రమే ఉంటుంది.

5) **రవాణా, తంతి తపాలా సదుపాయాలు (Transport and Communication Facilities) :** వస్తువులకు ప్రపంచవ్యాప్తమైన మార్కెట్ ఉండవలెనంటే తంతి-తపాలా, రవాణా సౌకర్యములు బాగా అభివృద్ధి చెంది ఉండవలె. అప్పుడే వస్తువులను దూరప్రాంతములకు శీఘ్రగతిని తక్కువ ఖర్చుతో పంపడానికి వీలు ఏర్పడుతుంది. ఇలాంటి సదుపాయాలు లేనప్పుడు వస్తువులకు స్థానికమైన మార్కెట్ ఉంటుంది.

**6) శాంతి భద్రతలు (Peace and Security) :** వస్తువు యొక్క మార్కెట్టు పరిమాణము శాంతిభద్రతలపై కూడా ఆధారపడుతుంది. వస్తువులను దూర

ప్రాంతములకు పంపవలెనంటే శాంతి భద్రతలుండాలి. అందువల్ల యుద్ధ సమయాల్లో శాంతిభద్రతలకు ప్రమాదము ఉండటము చేత వస్తువుల యొక్క మార్కెట్టు పరిమాణము తగ్గుతుంది.

7) ద్రవ్యము, పరపతి పద్ధతి (Currency & Credit System) : ద్రవ్యము, పరపతి పద్ధతులు బాగా అభివృద్ధి చెంది ఉంటే దూరప్రాంతాలతో వస్తువుల వ్యాపారము చేయుటము అనుకూలంగాను, లాభసాటిగానూ ఉంటుంది. అప్పుడే వస్తువులకు విశాలమైన మార్కెట్టు వుంటుంది. అవి లేనప్పుడు వస్తువులకు స్థానికమైన మార్కెట్టు మాత్రమే వుంటుంది

8) ప్రభుత్వ విధానము (Policy of the State) : వస్తువుల మార్కెట్టు పరిమాణము ప్రభుత్వ విధానంపై ఆధారపడి వుంటుంది. ప్రభుత్వ విధానం ఇతర దేశాలతో వస్తువుల ఎగుమతులు, దిగుమతులకు అనుకూలంగా ఉంటే వస్తువులకు ప్రపంచవ్యాప్తమైన మార్కెట్టు వుంటుంది. లేకపోతే వస్తువులకు స్థానికమైన మార్కెట్టు మాత్రమే ఉంటుంది.

**ప్రశ్న 3) "పరిపూర్ణపోటీ" అనగానేమి? దాని ప్రాముఖ్యమేమి? పరిపూర్ణపోటీకి, అపరిపూర్ణపోటీకి గల భేదమేమి.**

జవాబు : పోటీని బట్టి మార్కెట్లను రెండుగా వర్గీకరించవచ్చు. అవి :

1) పరిపూర్ణ పోటీ వున్న మార్కెట్టు (Perfect Competition)

2) అపరిపూర్ణ పోటీ ఉన్న మార్కెట్టు (Imperfect Competition)

**1) పరిపూర్ణపోటీ ఉన్న మార్కెట్** : ఒకే వస్తువుకు, ఒకే సమయంలో మార్కెట్ అంతటా ఒకే ధర ఉన్నట్లయితే ఆ మార్కెట్‌లో పరిపూర్ణ పోటీ ఉందని చెప్పాలి. ఏ మార్కెట్‌లోనైనా పరిపూర్ణపోటీ ఉండాలంటే కొన్ని నిబంధనలు తృప్తిపరచవలె.

**పరిపూర్ణపోటీ నిబంధనలు (Conditions of Perfect Competition) :**

**1) హెచ్చు సంఖ్యలో అమ్మకందార్లు, కొనుగోలుదార్లు (Large Number of buyers and sellers)** : మార్కెట్‌లో వస్తువు యొక్క అమ్మకందార్లు హెచ్చు సంఖ్యలో ఉండవలె. అప్పుడు మొత్తం సప్లయిలో ప్రతి అమ్మకందారుని సప్లయి అతి స్వల్పభాగంగాను, అదే విధంగా మొత్తం డిమాండ్‌లో ప్రతి కొనుగోలుదారుని డిమాండ్ అతిస్వల్ప భాగంగాను వుంటుంది. అప్పుడే ఏ ఒక్క కొనుగోలుదారుడు తన కొనుగోలును పెంచటం, తగ్గించటం వలనగాని లేక ఏ ఒక్క అమ్మకందారు తన అమ్మకాన్ని పెంచటం, తగ్గించటం వలనగాని ధరను మార్చటానికి వీలుండదు. అట్టి స్థితిలో వస్తువు యొక్క ధరను మొత్తం డిమాండ్, మొత్తం సప్లయిలు కలిసి నిర్ణయిస్తాయి. అంటే అమ్మకందార్లు, కొనుగోలుదార్లు వున్న ధరవద్దనే వారి వస్తువును అమ్మటంగాని, కొనటంగాని చేయవలె.

**2) ఏక జాతీయమైన వస్తువు (Homogeneous Product) :** మార్కెట్‌లో అందరు అమ్మకందార్లు అమ్మజూపే వస్తువులన్నీ ఒకే విధంగా ఉండాలి వాటిమధ్య ఎట్టి వ్యత్యాసాలు ఉండకూడదు. అప్పుడే అమ్మకందార్ల మధ్య సరైన పోటీ ఉండటానికి, మార్కెట్ అంతటా వస్తువుకి ఒకే ధర ఉండటానికి వీలుపడుతుంది వస్తువులన్నీ ఏకజాతీయంగా ఉన్నాయా లేవా అనే విషయాన్ని వినియోగదార్లు నిర్ణయించవలె. వినియోగదారుల దృష్టిలో అవి ఏక జాతీయమైనవనే భావన ఉన్నప్పుడే అవి ఏక జాతీయాలవుతాయి. ఉదాహరణకు గోద్రేజ్ కంపెనీ తయారుచేసే ఇనుపబీరువా, మనవూళ్ళో తయారుచేసే ఇనుపబీరువా రేకుమందంలో, ఎత్తు, రంగులో అన్ని విధాల తయారీలో ఒకటిగానే ఉండవచ్చు. కాని వినియోగదార్ల దృష్టిలో రెండూ ఒకటికావు. గోద్రేజ్ కంపెనీ తయారుచేసేది నాణ్యమైనదనే అభిప్రాయం వుంది. దానివల్ల దానికి ఎక్కువ ధర చెల్లించటానికి వినియోగదారుడు ఇష్టపడతాడు.

**3) పరిశ్రమలోకి ప్రవేశించటానికి, పరిశ్రమనుంచి వైదొలగటానికి సంస్థలకు స్వేచ్ఛ (Freedom to enter in or exit from the Industry) :** పరిశ్రమలోనికి ప్రవేశించటానికిగాని, పరిశ్రమనుంచి వైదొలగటానికిగాని ఉత్పత్తి సంస్థకు పూర్తి స్వేచ్ఛ ఉండవలె. అప్పుడే పరిశ్రమలో అధిక లాభాలు వస్తుంటే క్రొత్త సంస్థలు ప్రవేశించి ఉత్పత్తిని పెంచడంవల్ల ధర తగ్గి అధిక లాభాలు సామాన్య లాభాలుగా మారుతాయి అదే విధంగా పరిశ్రమలో నష్టాలు వస్తుంటే కొన్ని సంస్థలు పరిశ్రమనుంచి వైదొలుగుతాయి ఫలితంగా ఉత్పత్తి తగ్గి, ధర పెరిగి నష్టాలకు బదులు సామాన్య లాభాలు (Normal Profits) పొందటానికి అవకాశ మేర్పడుతుంది

ఈ మూడు లక్షణాలున్న మార్కెట్‌ను పరిశుద్ధమైన పోటీ వున్న మార్కెట్ అనవలె. పరిపూర్ణపోటీ మార్కెట్ అంటే పై లక్షణాలతోపాటు ఈ క్రింది లక్షణాలు కూడా ఉండవలె

**4) సంపూర్ణ సమాచారం (Perfect Knowledge) :** కొనుగోలుదార్లకు, అమ్మకందార్లకు మార్కెట్‌లో వివిధ ప్రాంతాలలో వస్తువుకున్న ధరలకు సంబంధించిన సమాచారం పూర్తిగా తెలిసివుండవలె అంతేగాక కొనుగోలుదార్లకు వస్తువు నాణ్యత గురించికూడా సంపూర్ణంగా తెలిసి ఉండవలె. అలాంటి పూర్తి సమాచారం ఉన్నప్పుడు ఏ ఒక్క అమ్మకందారుడు వస్తువును ఎక్కువ ధరకు అమ్మడానికిగాని, ఏ ఒక్క కొనుగోలుదారుడు వస్తువును తక్కువ ధరకు కొనడానికి గాని వీలుండదు అప్పుడే మార్కెట్ అంతటా ఒకే వస్తువుకు ఒకే సమయంలో, ఒకే ధర ఉంటటానికి సాధ్యమవుతుంది

**5) అమ్మటం, కొనటం ధర ప్రాతిపదిక మీదనే (Exchange on the basis of price) జరగాలి :** మార్కెట్‌లో వస్తువుల అమ్మకం, కొనుగోలు ధర ప్రాతిపదికగా జరగాలి. అంతేగాని వస్తువు మార్పిడి విధానంగా (Barter Exchange) జరగకూడదు పైగా కొనుగోలుదార్లు అమ్మకందార్ల మీద ప్రత్యేక అభిమానంతోగాక, కేవలం ధర ప్రాతిపదికగా అంటే ఎవరు తక్కువ ధరకిస్తే వారివద్ద వస్తువును కొనాలి అప్పుడే మార్కెట్‌లో ఒక వస్తువుకు ఒకే ధర ఉండగలుగుతుంది.

6) రవాణా ఖర్చులుండరాదు (No Transport Costs) : మార్కెట్‌లో వస్తువును ఒక ప్రాంతం నుంచి మరొక ప్రాంతానికి తరలించినప్పుడు రవాణా ఖర్చులంటూ ఏమీ చేర్చరాదు. అప్పుడే ఆ వస్తువుకు మార్కెట్టు అంతటా ఒకే ధర ఉండటానికి వీలుపడుతుంది. అలాకాక రవాణా ఖర్చులు చేర్చితే ఆ మేరకు వస్తువు ధర పెరిగి మార్కెట్‌లోని వివిధ ప్రాంతాలలో వేరువేరు ధరలు ఉండవలసివస్తుంది.

7) ఉత్పత్తి కారకాలకు పూర్తి గమనశీలత (Perfect Mobility of Factors of Production) : ఉత్పత్తి కారకాలకు పూర్తి గమనశీలత అంటే ఒక పరిశ్రమ నుంచి మరొక పరిశ్రమకు తరలిపోయే పూర్తి స్వేచ్ఛ ఉన్నప్పుడే సంస్థలు వస్తువు యొక్క ఉత్పత్తిని డిమాండు కనుగుణంగా మార్చటానికి వీలవుతుంది. ఒకవేళ వస్తువు యొక్క డిమాండు పెరిగి ధర పెరిగితే వెంటనే కొత్త ఉత్పత్తి కారకాల నుపయోగించటం ద్వారా ఉత్పత్తి పెరిగి ధర మామూలు స్థాయికి చేరుతుంది. అప్పుడే వస్తువుకు మార్కెట్ అంతటా ఒకే ధర ఉంటుంది.

**పరిపూర్ణపోటీ విశ్లేషణ - ప్రాముఖ్యత :**

1. పరిపూర్ణపోటీ మార్కెట్‌లోని ప్రతి సంస్థ ఉత్పత్తికి డిమాండు పూర్తి వ్యాకోచత్వం (Perfectly Elastic) కలిగి వుంటుంది. కనుక సంస్థ యొక్క డిమాండు రేఖ X-అక్షానికి సమాంతరంగా వుంటుంది. అంటే సంస్థ తన ఉత్పత్తి పరిమాణాన్ని పెంచినా, తగ్గించినా ధర మాత్రం మారదు. వున్న ధర వద్దనే ఎంత వస్తురాశినయినా అమ్ముకోవలె.
2. పరిశ్రమలోని సంస్థలన్నీ కేవలం సామాన్య లాభాలను (Normal Profits) మాత్రమే ఆర్జిస్తుంటాయి. అధిక లాభాలను పొందటానికి అవకాశం లేదు. ఒకవేళ స్వల్పకాలంలో అధిక లాభాలు కన్పించినా దీర్ఘకాలంలో అవి సామాన్య లాభాలుగా మారుతాయి.
3. ప్రతి సంస్థ సగటు ఉత్పత్తి వ్యయం కనీస స్థాయిలో వుంటుంది. అంటే పరిపూర్ణ పోటీలో సంస్థలన్నీ అభిలషణీయమైన సంస్థలే (Optimum Firms). వస్తువు ధర ఈ కనిష్ట సగటు వ్యయానికి సమానంగా వుంటుంది (AR=AC).
4. డిమాండులోని మార్పులకు అనుగుణ్యంగా ఎప్పటికప్పుడు సప్లయి మారుతుంటుంది. ఏ సంస్థ సప్లయిని నియంత్రణ (Control) చేయలేదు.
5 పరిపూర్ణ పోటీలో ఒకే వస్తువుకు, ఒకే సమయంలో మార్కెటు అంతటా ఒకే ధర వుంటుంది (Same price for the same commodity at the same time throughout the market).
6. అన్ని సంస్థలు ఉత్పత్తిచేసే వస్తువు ఏక జాతీయం కనుక వస్తువును మార్కెటు చేయటానికి ఏ విధమైన ప్రచారంగాని, ప్రకటనలుగాని అవసరం లేదు.

అయితే వాస్తవంలో పరిపూర్ణపోటీ వుండటం చాలా అరుదు. దీన్ని ఒక ఆదర్శప్రాయమైన పరిస్థితిగా మాత్రమే భావించాలి. మనకు తటస్థపడే మార్కెట్లు అన్నీ అపరిపూర్ణమైన మార్కెట్లే.

**B) అపరిపూర్ణమైన పోటీ (Imperfect Competition) :** అపరిపూర్ణమైన పోటీ వున్న మార్కెటుకు ఈ క్రింది లక్షణాలుంటాయి.

1) **అమ్మకందార్లు హెచ్చు సంఖ్యలో ఉండకపోవటం :** ఉత్పత్తి చేసే సంస్థలు తక్కువ సంఖ్యలో ఉండటంవల్ల మొత్తం సప్లయిలో ఒక్కొక్క సంస్థ చేసే సప్లయి చెప్పుకోదగినదిగా వుంటుంది. సంస్థ తన ఉత్పత్తిని మార్చటం ద్వారా మొత్తం సప్లయిని తద్వారా ధరను ప్రభావితం చేయగలుగుతుంది

2) **వస్తు విభేదం (Product Differentiation) :** సంస్థలు ఉత్పత్తి చేసే వస్తువుల మధ్య విభేదం వుంటుంది. అన్నీ ఒకే రకంగా వుండవు. ఈ కారణంగా వివిధ సంస్థలు ఉత్పత్తి చేసే వస్తువుకు వివిధ ధరలుంటాయి.

3) **వస్తువును గురించిన సమాచారం తెలియకపోవటం :** వినియోగదార్లకు వివిధ ఉత్పత్తిదార్లు తయారుచేస్తున్న వస్తువుల నాణ్యత, ధరలకు సంబంధించిన సమాచారం తెలియక పోవటంవల్ల వస్తువులను వివిధ ధరలకు కొనుగోలు చేస్తుంటారు.

4) **సంస్థలు పరిశ్రమలో ప్రవేశించటం, వదలి వెళ్ళటంపై నిర్బంధాలు :** అపరిపూర్ణ పోటీలోకి రావటానికిగాని, ఉన్న సంస్థలు పరిశ్రమను వదలి వెళ్ళటానికిగాని పూర్తి స్వేచ్ఛ ఉండకపోవచ్చు. సహజంగా సంస్థల గమనశీలతపై కొన్ని ఆంక్షలుంటాయి. దానివల్ల ఉత్పత్తిలో సర్దుబాటు సాధ్యంకాదు కనుక ఒకే వస్తువుకు ఒకే ధర ఉండదు.

5) **ఉత్పత్తి కారకాల గమనశీలత లోపించటం :** ఉత్పత్తి కారకాలు ఒక పరిశ్రమ నుంచి మరొక పరిశ్రమకు శీఘ్రంగా, స్వేచ్ఛగా తరలే అవకాశం ఉండదు. దానివల్ల ఉత్పత్తిలో సర్దుబాట్లకు తావు లేదు. మార్కెట్‌లో వస్తువుకు ఒకే ధర ఉండే అవకాశముండదు.

6) **అమ్మకం, కొనుగోలు ధర ప్రాతిపదికపై జరగకపోవచ్చు :** కొందరు కొనుగోలుదార్లు కొన్ని వస్తువులపై మోజు, కొన్ని సంస్థలపై ప్రత్యేక అభిమానం కలిగి ఉంటారు ఆ వస్తువుల ధరలు ఎంతైనా వాటినే కొంటారు. దీని వల్ల ఒకే వస్తువుకు మార్కెటులో వివిధ ధరలు ఉంటాయి.

7) **రవాణా ఛార్జీలుంటాయి :** వస్తువుల రవాణాకయ్యే ఛార్జీలు ధరకు చేర్చబడతాయి అందువల్ల ఉత్పత్తి స్థానం నుండి దూరంగా ఉండే ప్రాంతాలలో వస్తువు ధర ఎక్కువగాను, దగ్గర ప్రాంతాలలో వస్తువు ధర తక్కువగాను ఉంటుంది

**అపరిపూర్ణ పోటీలో రకాలు :** అపరిపూర్ణ పోటీలో మార్కెట్‌ని ఉత్పత్తిదార్ల సంఖ్యనుబట్టి నాలుగు రకాలుగా వర్గీకరించవచ్చు. అవి

1) **ఏకస్వామ్యం లేక గుత్తాధిపత్యం (Monopoly) :** ఒకే ఒక ఉత్పత్తిదారు లేక సంస్థ ఉంటుంది.

2) **ద్విస్వామ్యము లేక ద్విదాధిపత్యం (Duopoly) :** రెండు ఉత్పత్తి సంస్థలు మాత్రమే వుంటాయి.

3) **పరిమితస్వామ్యము (Oligopoly) :** బహుకొద్ది (very few) ఉత్పత్తి సంస్థలుంటాయి.

4) **ఏకస్వామ్యపోటీ లేక గుత్తాధిపత్యపుపోటీ (Monopolistic Competition):** తక్కువ సంఖ్యలో సంస్థలు ఉత్పత్తి వస్తువుల మధ్య విభేదం ఉండి పోటీ పడుతుంటాయి.



# అధ్యాయము 8

# పరిపూర్ణ పోటీలో ధర నిర్ణయం

**ప్రశ్న 1) పరిపూర్ణ పోటీలో సంస్థ, పరిశ్రమలెలా సమతౌల్యాన్ని చేరతాయో వివరించండి.**

**లేదా**

**సంపూర్ణ పోటీ మార్కెట్‌లో సంస్థయొక్క స్వల్పకాలిక దీర్ఘకాలిక సమతౌల్యమును రేఖాపటము ద్వారా వివరించుము.**

**లేదా**

**సంస్థ, పరిశ్రమ సమతౌల్యమనగానేమి ? రేఖా చిత్రము ద్వారా తెలియజేయునది. (Very Important)**

జవాబు : పరిపూర్ణపోటీ నిబంధనలు : క్రింది పరిస్థితులున్న మార్కెట్‌లో పరిపూర్ణమైన పోటీ ఉంటుంది. అప్పుడు ఒకే వస్తువుకు ఒకే సమయంలో మార్కెట్ అంతటా ఒకే ధర ఉంటుంది.

1. అమ్మకందార్లు, కొనుగోలుదార్లు హెచ్చు సంఖ్యలో ఉండవలె.
2. అందరూ ఉత్పత్తిచేసి విక్రయించే వస్తువు ఏక జాతీయంగా (Homogeneous) ఉండాలి.
3. ఉత్పత్తి సంస్థలకు పరిశ్రమలో ప్రవేశించటానికి గాని, పరిశ్రమను వదలి వెళ్ళటానికిగాని పూర్తి స్వేచ్ఛ వుండాలి.
4. అమ్మకందార్లకు, ముఖ్యంగా కొనుగోలుదార్లకు వస్తువు నాణ్యత, ధరను గురించిన పూర్తి సమాచారం ఎప్పటికప్పుడు తెలియాలి.
5. మార్కెట్‌లో వస్తువు మారకం కేవలం ధర ప్రాతిపదిక మీదనే జరగాలి.
6. వస్తువుల రవాణాకయ్యే ఛార్జీలు ధరకు చేర్చరాదు.
7. ఉత్పత్తి కారకాలు వివిధ ఉత్పత్తి రంగాలమధ్య పూర్తి గమనశీలత (Mobility) ను కలిగివుండాలి.

**పరిపూర్ణ పోటీలో సంస్థ సమతౌల్యం (Equilibrium of the Firm) :** ఒక ఉత్పత్తి సంస్థకు తన ఉత్పత్తిని పెంచాలని గాని, తగ్గించాలని గాని తలంపు లేనప్పుడు ఆ సంస్థ సమతౌల్య స్థితిలో వుందని అంటారు. ఏ సంస్థ అయినా గరిష్ట లాభాలను అర్జిస్తున్నప్పుడే తన ఉత్పత్తి స్థాయిని మార్చడానికి ఇష్టపడదు. కనుక సంస్థ గరిష్ట **లాభాలను అర్జిస్తున్నప్పుడే సమతౌల్య స్థితిలో వుంటుంది.**

పరిపూర్ణమైన పోటీ స్థితిలో ప్రతి సంస్థ ఉత్పత్తి ఒకే ధరకు అమ్ముతుంది. కనుక వస్తువులను అమ్మగా వచ్చే సగటు రాబడి (AR), వుపాంత రాబడి (MR), ధర (Price) సమానంగా వుంటాయి. సగటు రాబడిరేఖ, వుపాంత రాబడిరేఖ రెండూ ఏకమై ఒకేరేఖగా X- అక్షానికి సమాంతరంగా వుంటుంది.

ఇప్పుడు సంస్థ వున్న ధరను స్వీకరించి వుత్పత్తి పరిమాణాన్ని (Output) నిర్ణయించవలె. సంస్థయొక్క వుపాంత వ్యయం (MC), వుపాంత రాబడి (MR), సమానమైనప్పుడు (MC=MR), సంస్థకు గరిష్ట లాభాలు చేకూరుతాయి. ఏ పరిమాణంలో వస్తూత్పత్తిని చేసి మార్కెట్‌లో వున్న ధరవద్ద అమ్మితే వుపాంత వ్యయం, వుపాంత రాబడి సమానమౌతాయో అంతవరకు సంస్థ వస్తూత్పత్తిని కొనసాగిస్తుంది. అంటే వుపాంత వ్యయం, వుపాంత రాబడి సమానమైనప్పుడు గరిష్ట లాభాలను పొందుతూ సంస్థ సమతౌల్య స్థితిలో వుంటుంది. దీన్నే క్రింది పట్టికలో చూడవచ్చు.

పట్టిక

| వస్తువు పరిమాణం | ధర=AR= ఉపాంతరాబడి MR | మొత్తం రాబడి TR | ఉపాంత వ్యయం MC | మొత్తం వ్యయం TC | మొత్తం లాభం |
|---|---|---|---|---|---|
| 1. | 3-00 | 3-00 | 3-25 | 3-25 | 0-25 |
| 2. | 3-00 | 6-00 | 3-00 | 6-25 | 0-25 |
| 3. | 3-00 | 9-00 | 2-75 | 9-00 | లేదు |
| 4. | 3-00 | 12-00 | 2-50 | 11-50 | 0-50 |
| 5. | 3-00 | 15-00 | 2-25 | 13-75 | 1-25 |
| 6. | 3-00 | 18-00 | 2-50 | 16-25 | 1-75 |
| 7. | 3-00 | 21-00 | 2-75 | 19-00 | 2-00 |
| 8. | 3-00 | 24-00 | 3-00 | 22-00 | 2-00 |
| 9. | 3-00 | 27-00 | 3-25 | 25-25 | 1-75 |

పై పట్టికలో ఉపాంత వ్యయంమొదట్లోతగ్గుతూ, ఒక కనీస స్థాయి చేరి తర్వాత పెరగటం గమనించవచ్చు. ఉపాంత వ్యయం తగ్గుతూ 2 యూనిట్ల ఉత్పత్తిస్థాయివద్ద ఉపాంత రాబడికి సమానంగా వుంది. అయితే అట్టి స్థితిలో సంస్థ నష్టాలను పొందుతున్నది తిరిగి ఉపాంత వ్యయం పెరుగుతూ 8వ యూనిట్ వద్ద ఉపాంత రాబడికి సమానంగా వుంది. ఇక్కడ మొత్తం లాభాలు అత్యధికంగా వున్నాయి. కనుక సంస్థ 8 యూనిట్ల వద్ద ఉత్పత్తిని నిలిపివేస్తుంది. ఇంతకు మించి ఉత్పత్తి చేస్తే మొత్తం లాభాలు తగ్గుతాయి. దీన్నే క్రింది రేఖాపటంలో కూడా చూడవచ్చు.




పై పటంలో ఉపాంత వ్యయం, ఉపాంత రాబడి ON పరిమాణం వద్ద, తిరిగి OM పరిమాణం వద్ద సమానంగా వున్నాయి. అయితే ON పరిమాణం వద్ద సంస్థ నష్టాలలో వుంది. కాని OM పరిమాణం వద్ద సంస్థ మొత్తం లాభాలు అత్యధికంగా ఉన్నాయి. కనుక ప్రతి సంస్థ ఉపాంత వ్యయం పెరుగుతూ ఉపాంత రాబడికి సమానమైన ఉత్పత్తి స్థాయి (OM) వద్ద ఉత్పత్తిని నిలిపివేస్తుంది. ఈ ఉత్పత్తిని మార్కెట్‌లో వున్న ధర వద్ద అమ్ముకుని అత్యధిక లాభాలను పొందుతూ సమతౌల్య స్థితిలో వుంటుంది. కనుక సంస్థ సమతౌల్య స్థితిలో వుండవలెనంటే క్రింది నిబంధనలు తృప్తిపరచబడవలె.

i) ఉపాంత వ్యయం, ఉపాంత రాబడి సమానంగా వుండవలె MC=MR.

ii) ఉపాంత వ్యయరేఖ, ఉపాంత రాబడి రేఖను క్రిందినుంచి ఖండించవలె

**సమతౌల్యం - రకాలు** : సమతౌల్యాన్ని స్వల్పకాలిక సమతౌల్యం (Short run Equilibrium) అని, దీర్ఘకాలిక సమతౌల్యం (Long run Equilibrium) అని రెండుగా వర్గీకరించవచ్చు.

**A) స్వల్పకాలిక సమతౌల్యం** : స్వల్పకాలంలో సంస్థ ఎంత లాభాలను ఆర్జిస్తున్నదీ దాని సగటు రాబడి (AR), సగటు వ్యయాల (AC)ను బట్టి తెలుస్తుంది. దాని సగటు రాబడి సగటు వ్యయానికంటే యెక్కువగా ఉంటే (AR>AC) అధిక

లాభాలు; సగటు రాబడి, సగటు వ్యయాలు సమానంగా ఉంటే (AR=AC) సామాన్య లాభాలు; సగటు రాబడి, సగటు వ్యయం కంటే తక్కువగా ఉంటే (AR<AC) నష్టాలు సంభవిస్తాయి.

మార్కెట్‌లో పరిపూర్ణపోటీ ఉన్నందున సంస్థలన్నీ ఉత్పత్తి కారకాలకు ఒకే ధరను చెల్లిస్తాయి. అందువలన పరిశ్రమలోని సంస్థలన్నింటి వ్యయరేఖలు ఒకే విధంగా ఉంటాయి. కనుక ఒక సంస్థ సమతౌల్యాన్ని పరిశీలిస్తే సరిపోతుంది.




సంస్థ ఉపాంత రాబడి, ఉపాంత వ్యయం సమానమయ్యే (MC=MR) చోటవుండే ఉత్పత్తిని చేస్తూ గరిష్ట లాభాలు పొందుతూ సమతౌల్య స్థితిలో ఉంటుంది. దీన్నే పై రేఖాపటంలో చూడవచ్చు.

పటంలో OM ఉత్పత్తి పరిమాణంవద్ద MC=MR కనుక సంస్థ OM ఉత్పత్తి చేసి మార్కెట్‌లో ఉన్న ధర - OP లేక QM కు విక్రయించి అత్యధిక లాభాలను ఆర్జిస్తూ సమతౌల్య స్థితిలో ఉంటుంది. సగటు రాబడి (AR) – సగటు వ్యయం (AC)

∴ ఒక యూనిట్‌కు లాభం QM – RM=QR

మొత్తం లాభాలు = QR × OM లేక SR

= QRSP దీర్ఘచతురస్రానికి సమానమైన లాభాలు:

కనుక స్వల్పకాల వ్యవధిలో సంస్థలు సాధారణంగా అధిక లాభాలను ఆర్జిస్తూ సమతౌల్య స్థితిలో ఉంటాయి.

**B) దీర్ఘకాలిక సమతౌల్యం :** స్వల్పకాలంలో సంస్థలు అధిక లాభాలను ఆర్జిస్తూంటే కొత్త సంస్థలు పరిశ్రమలో ప్రవేశించి ఉత్పత్తిని పెంచుతాయి. ఫలితంగా ధర తగ్గి అధిక లాభాలు అదృశ్యమైపోయి సామాన్య లాభాలు మాత్రమే లభిస్తాయి. కనుక దీర్ఘకాలంలో సంస్థలన్నీ సామాన్య లాభాలను ఆర్జిస్తూ సమతౌల్య స్థితిలో ఉంటాయి. దీన్నే క్రింది రేఖాపటంలో చూడవచ్చు.




పటంలో OM ఉత్పత్తి పరిమాణంవద్ద ఉపాంత రాబడి, ఉపాంత వ్యయం సమానంగా ఉన్నాయి. కనుక సంస్థ OMవస్తురాశిని ఉత్పత్తిచేసి మార్కెట్‌లో ఉండే ధర PO లేక QMకు విక్రయిస్తూ సమతౌల్య స్థితిలో ఉంటుంది.

ఈ ఉత్పత్తి వద్ద సగటు వ్యయం AC, సగటు రాబడులు AR కూడ సమానంగా (AC = AR) ఉన్నాయి. అంటే సంస్థకు కేవలం సామాన్య లాభాలు మాత్రమే వస్తాయన్నమాట.

**పరిశ్రమ సమతౌల్యం** : పరిశ్రమ సమతౌల్యమంటే పరిశ్రమలోకి క్రొత్త సంస్థలు రావటంగాని, ఉన్న సంస్థలు పరిశ్రమను వదిలి వెళ్ళటంగాని లేని స్థితి. ఆ స్థితిలోనే ఉత్పత్తి పరిమాణం పెరగక, తగ్గక స్థిరంగా ఉంటుంది. అయితే స్వల్పకాలంలో సంస్థలు గరిష్ఠ లాభాలను ఆర్జిస్తూ సమతౌల్య స్థితిలో ఉంటాయి. అప్పుడు క్రొత్త సంస్థలు పరిశ్రమలో ప్రవేశిస్తాయి. కనుక పరిశ్రమ స్వల్పకాలంలో సమతౌల్యస్థితిలో ఉండదు. దీర్ఘకాలంలో సంస్థలు సామాన్య లాభాలను ఆర్జిస్తుంటాయి. అప్పుడు కొత్త సంస్థలు పరిశ్రమలో ప్రవేశించటంగాని ఉన్నవి వెళ్ళటంగాని జరగదు. అందువల్ల పరిశ్రమ దీర్ఘకాలంలోనే సమతౌల్య స్థితిని చేరుతుంది. పరిశ్రమ సమతౌల్య స్థితిలో ఉండాలంటే క్రింది నిబంధనలు తృప్తిపరచవలె.

1. పరిశ్రమలోని అన్ని సంస్థలు సమతౌల్య స్థితిలో ఉండటం అంటే MC=MR.
2. సంస్థలన్నీ సామాన్య లాభాలను ఆర్జిస్తూండటం అంటే AC=AR

**ప్రశ్న 2) పరిపూర్ణపోటీ అనగానేమి ? పరిపూర్ణపోటీలో ధర నిర్ణయమెలా జరుగుతుందో వివరించండి**

**లేదా**

**పరిపూర్ణపోటీలో ధర, ఉత్పత్తి విధానమును వివరింపుము.**

**లేదా**

**పరిపూర్ణపోటీ పరిస్థితులలో ధర ఎలా నిర్ణయమవుతుందో రేఖాపట సహాయంతో తెలుపుము.**

**(Very Important)**

జవాబు : పరిపూర్ణపోటీ పరిస్థితులు : ఒకే వస్తువుకు, ఒకే సమయంలో మార్కెట్ అంతటా ఒకే ధర ఉన్నట్లయితే ఆ మార్కెట్‌లో పరిపూర్ణ పోటీ ఉందని అంటారు. పరిపూర్ణ పోటీ మార్కెట్ ఏర్పడటానికి ఈ క్రింది పరిస్థితులు ఉండవలెను.

1. అమ్మకందార్లు, కొనుగోలుదార్లు హెచ్చు సంఖ్యలో వుండవలెను.
2. అందరూ ఉత్పత్తిచేసి విక్రయించే వస్తువు ఏకజాతీయంగా (Homogeneous) వుండాలి. అనగా ఉత్పత్తి సంస్థలన్ని ఒక రకమైన వస్తువును ఉత్పత్తి చేసి అమ్మవలెను.
3. ఉత్పత్తి సంస్థలకు పరిశ్రమలో ప్రవేశించటానికిగాని, పరిశ్రమను వదిలి వెళ్ళటానికిగాని పూర్తి స్వేచ్ఛ వుండాలి. ఎలాంటి ఆటంకాలు ఉండరాదు.
4. అమ్మకందార్లకు, కొనుగోలుదార్లకు వస్తువు నాణ్యత, ధరను గురించిన పూర్తి సమాచారం ఎప్పటికప్పుడు తెలియాలి.
5. మార్కెట్‌లో వస్తువు మారకం కేవలం ధర ప్రాతిపదిక మీదనే జరగాలి
6. వస్తువు రవాణాకయ్యే ఛార్జీలు వస్తువు ధరకు చేర్చరాదు.
7. ఉత్పత్తి కారకాలు వివిధ ఉత్పత్తి రంగాల మధ్య పూర్తి గమనశీలతను (Perfect Mobility) కలిగి వుండాలి.

**పరిపూర్ణ పోటీ మార్కెట్‌లో ధర నిర్ణయం :** పరిపూర్ణ పోటీ గల మార్కెట్‌లో అమ్మకందార్లు, కొనుగోలుదార్లు హెచ్చు సంఖ్యలో వుంటారు. అప్పుడు ఒక కొనుగోలుదారుని డిమాండ్ మొత్తం డిమాండ్‌లో అతి స్వల్ప భాగంగాను, అట్లే ఒక అమ్మకందారుని సప్లయి మొత్తము సప్లయిలో అతి స్వల్ప భాగంగాను వుంటుంది. ఫలితంగా ఏ ఒక్క కొనుగోలుదారుడుగాని, అమ్మకందారుడుగాని తన కొనుగోలు లేక అమ్మకాన్ని మార్చి ధరను మార్చలేడు. అట్టి స్థితిలో వస్తువు యొక్క ధరను మొత్తం

డిమాండ్ (Total Demand), మొత్తం సప్లయి (Total Supply)లు కలిసి నిర్ణయిస్తాయి. "కత్తెరలోని రెండు కత్తులు కాగితాన్ని కత్తిరించడానికి ఏ విధంగా అవసరమో, అదే విధంగా ధరను నిర్ణయించడానికి సప్లయి, డిమాండ్‌లు రెండు కూడా అవసరం" అని మార్షల్ పేర్కొనినాడు.

ఈ రెండు శక్తుల పరస్పర ప్రచలనమే (Intersection) వస్తువు ధరను నిర్ణయిస్తుంది. ఏ ధరవద్ద ఏ వస్తువుకున్న డిమాండ్ సప్లయిలు సమానంగా వుంటాయో ఆ ధరను "సమతౌల్య ధర" (Equilibrium Price) అంటారు. మార్కెట్‌లో వస్తువు యొక్క సమతౌల్య ధర ఎలా నిర్ణయమవుతుందో క్రింది ఉదాహరణ వివరిస్తుంది. ఒకానొక సమయంలో మార్కెట్‌లో తేయాకుకున్న డిమాండు, సప్లయిలు ఎలా వున్నది ఈ క్రింది పట్టిక చూపుతుంది.

**డిమాండ్ - సప్లయి షెడ్యూలు**

| కిలో తేయాకు ధర రూ॥లలో | తేయాకు డిమాండ్ వేల కిలోలలో | తేయాకు, సప్లయి వేల కిలోలలో |
|---|---|---|
| 5 | 9 | 18 |
| 4 | 10 | 15 |
| 3 | 12 | 12 |
| 2 | 15 | 8 |
| 1 | 20 | 1 |

పై పట్టికలో తేయాకు ధర తగ్గినకొద్దీ డిమాండ్ పెరుగుతూ, సప్లయి తగ్గుతున్నట్లు. తేయాకు ధర పెరిగినకొద్దీ సప్లయి పెరుగుతూ, డిమాండ్ తగ్గుతున్నట్లు చూడవచ్చు.

మార్కెట్‌లో తేయాకు ధర కిలో రూ॥ 5 ఉన్నప్పుడు అమ్మకందార్లు 18 వేల కిలోల తేయాకును అమ్మటానికి సిద్ధపడగా, కొనుగోలుదార్లు మాత్రం ధర హెచ్చుగావున్నట్లు భావించటం వల్ల 9 వేల కిలోలనే కొనటానికి యిష్టపడుతున్నారు అంటే ఈ ధరవద్ద డిమాండ్ కన్న సప్లయి హెచ్చుగా వున్నది. కనుక కొందరు అమ్మకందార్లు తనవద్దనున్న సరుకును అమ్మలేకపోతారు. ఎవరికి వారు తమ సరుకును అమ్ముకోవాలనే ఉద్దేశ్యంతో ధరను తగ్గించి, అమ్మకం ప్రారంభిస్తారు. దాంతో అమ్మకందార్ల మధ్య పోటీ ఏర్పడి ధర రూ॥ 4కి తగ్గుతుంది. ధర తగ్గినందున కొనుగోలుదార్లు 10వేల కిలోలు కొనటానికి సిద్ధపడగా అమ్మకందార్లు మాత్రం ధర తగ్గటం వల్ల 15 వేల కిలోలను మాత్రమే అమ్మటానికి యిష్టపడుతున్నారు. ఇప్పటికి డిమాండ్‌కంటె సప్లయి హెచ్చుగా వుండటంచేత అమ్మకందార్ల మధ్య పోటీ కొనసాగి ధర రూ॥ 3కి తగ్గుతుంది. ఈ ధరవద్ద అమ్మకందార్లు

12 వేల కిలోల వస్తువును అమ్మటానికి సిద్ధపడగా కొనుగోలుదార్లు కూడ 12 వేల కిలోలు కొనటానికి యిష్టపడుతున్నారు. ఇప్పుడు మార్కెట్‌లో డిమాండ్, సప్లయిలు రెండూ సమానమయ్యాయి కనుక అమ్మకందార్ల మధ్య పోటీ వుండదు. ధర రూ. 3 వద్ద స్థిరపడుతుంది. ఈ ధరనే "సమతౌల్యపు ధర" (Equilibrium Price) అంటారు. అంటే డిమాండు సప్లయిల మధ్య సమతౌల్యమేర్పడిందన్న మాట. ఏ కారణంచేతనైనా ధర రూ. 3 కంటే తగ్గినట్లయితే డిమాండు హెచ్చి సప్లయి తగ్గుతుంది. అప్పుడు కొనుగోలుదార్లందరికి వస్తువు అందదు. పట్టికలో ధర రూ. 2 వద్ద 15 వేల కిలోల డిమాండు వుండగా 8 వేల కిలోలు మాత్రమే సప్లయి అవుతున్నది ఇట్టి స్థితిలో కొనుగోలుదార్లు ఎవరికి వారు వస్తువును పొందాలనే ఆత్రుతతో హెచ్చు ధరకైనా వస్తువును కొనటానికి సిద్ధపడతారు. ఈ విధంగా కొనుగోలుదార్ల మధ్య పోటీ ఏర్పడి ధర పెరుగుతుంది. ఫలితంగా ధర తిరిగి రూ. 3 సమతౌల్య స్థితి ఏర్పడుతుంది. కనుక అమ్మకందార్ల మధ్య పోటీ ధరను తగ్గించటానికి, కొనుగోలుదార్ల మధ్య పోటీ ధరను పెంచటానికి దోహదం చేస్తాయి. ఈ రెండు శక్తులు సమానమైనచోట ధర స్థిరపడి సమతౌల్యస్థితి ఏర్పడుతుంది. దీన్నే క్రింది రేఖాపటంలో కూడా చూడవచ్చు.




పటంలో X- అక్షంపైన వస్తువు యొక్క డిమాండు, సప్లయిలు, Y- అక్షంపైన ధర చూపబడినాయి. డిమాండు, సప్లయిలు రెండూ OM పరిమాణం వద్ద సమానమైనాయి. ఈ రెండు రేఖలు G బిందువు వద్ద ఖండించుకుంటున్నాయి. OP మార్కెట్‌లో సమతౌల్య ధర.

**డిమాండ్ సప్లయిలలో మార్పు - సమతౌల్య ధర :** పై వివరణను బట్టి డిమాండు, సప్లయిలు రెండూ కలిసి వస్తువు ధరను నిర్ణయిస్తాయని స్పష్టమౌతున్నది. అయితే డిమాండు సప్లయిలపై అనేక యితర శక్తుల ప్రభావం వుంటుంది. వినియోగదార్ల ఆదాయాలు, అభిరుచులు, జనాభాలో మార్పులు, ఉత్పత్తి వ్యయాలు ఇలాంటివి ఎన్నో శక్తులు డిమాండు, సప్లయిలను ప్రభావితం చేస్తుంటాయి. వీటిలో వచ్చే మార్పులవల్ల సమతౌల్య ధర కూడా మారుతుంది. దీన్నే క్రింది రేఖాపటంలో చూడవచ్చు.




మొదటి పటంలో డిమాండులోని మార్పులు చూపబడినాయి. సప్లయి స్థిరంగా వుండి డిమాండు $D_1D_1$కి పెరిగితే సమతౌల్య ధర $OP_1$కు పెరుగుతుంది. అలాకాక డిమాండు $D_2D_2$కు తగ్గితే సమతౌల్య ధర $OP_2$కు తగ్గుతుంది.

రెండవ పటంలో సప్లయిలోని మార్పులు చూపబడినాయి డిమాండు స్థిరంగా వుండి సప్లయి $S_1S_1$కి తగ్గితే $OP_1$ సమతౌల్య ధర అవుతుంది. అదే విధంగా సప్లయి $S_2S_2$కి తగ్గితే $OP_2$ సమతౌల్య ధర అవుతుంది.

పరిపూర్ణపోటీ మార్కెట్‌లో వస్తువుకు ఒకే సమయంలో ఒకే ధర వుంటుంది అంతేగాని వివిధ ధరలుండవు. ఒక వస్తువు యొక్క ధర డిమాండ్ సప్లయిలచేత నిర్ణయించబడుతుంది. అయితే ఈ రెండింటిలో ఏది ధరను ఎక్కువగా ప్రభావితం చేస్తుంది అనేది కాలాన్ని బట్టి ఉంటుందని 'మార్షల్' తెలిపినాడు. 'మార్షల్ 'ప్రకారం స్వల్పకాలంలో డిమాండు, దీర్ఘకాలంలో సప్లయి ధరమీద ఎక్కువ ప్రభావాన్ని కలిగి ఉంటాయి.

**ఉపాంత డిమాండ్, ఉపాంత సప్లయ్ (Marginal Demand and Marginal Supply) :** ధర నిర్ణయంలో ఉపాంత డిమాండు, ఉపాంత సప్లయిలు ప్రధానపాత్ర వహిస్తాయి. వస్తువు ధర తగ్గిన ఫలితంగా డిమాండులో వచ్చిన పెరుగుదలను "ఉపాంత డిమాండు" అంటారు. ఈ పెరిగిన ప్రమాణాన్ని కొనేవారిని "ఉపాంత కొనుగోలుదార్లు" (Marginal Buyers) అంటారు. ధర తగ్గిన ఫలితంగా తగ్గిన సప్లయిని "ఉపాంత సప్లయి" అంటారు. ఈ తగ్గుదలకు కారకులైన అమ్మకందార్లను "ఉపాంత అమ్మకందార్లు" [Marginal Sellers) అంటారు. ధర నిర్ణయంలో ఉపాంత కొనుగోలుదార్లు, ఉపాంత అమ్మకందార్ల పాత్ర ప్రధానంగా వుంటుంది.

**ప్రశ్న 3) ఒక వస్తువుకు మార్కెట్ ధర ఎలా నిర్ణయింపబడుతుందో వివరించండి.**

**లేదా**

**అతిస్వల్పకాల వ్యవధి (Very short- Period)లో ధర నిర్ణయమెలా జరుగుతుందో వివరించండి.**

**లేదా**

**"మార్కెటుకాలవ్యవధిలో (Market-Period) అంటేఏమిటి? మార్కెటు కాలవ్యవధిలో ధర ఎలా నిర్ణయించబడుతుందో వివరించండి.**

జవాబు : ఒక వస్తువు ధర ఆ వస్తువుకున్న డిమాండు, సప్లయ్‌లు రెండింటిచేత నిర్ణయింపబడినప్పటికి వీటి ప్రభావం ఎల్లవేళలా ఒకే రీతిగా ఉండదని "ఆల్‌ఫ్రెడ్ మార్షల్" (Alfred Marshall) అభిప్రాయపడ్డాడు. అందుచేత మార్షల్ ధర నిర్ణయ కాలాన్ని నాలుగుగా విభజించాడు. అవి :

1. అతిస్వల్ప కాలవ్యవధి లేక మార్కెట్ కాలవ్యవధి (Very Short-Period)
2. స్వల్పకాల వ్యవధి (Short-Period)
3. దీర్ఘకాల వ్యవధి (Long-Period)
4. అతిదీర్ఘ కాలవ్యవధి (Very Long- Period or Secular Period)

సప్లయ్ మార్పులు ఈ నాలుగు కాల వ్యవధులలోను ఒకే విధంగా ఉండవు. కనుక ధరకూడ ఒకే రకంగా ఉండదు.

**అతిస్వల్ప కాలవ్యవధి లేక మార్కెటు కాలవ్యవధిలో ధర లేక మార్కెట్ సమతౌల్య ధర (Market Price) :** ఈ కాలవ్యవధి అతి స్వల్పమవటం చేత సప్లయ్‌ని మార్చటానికి ఏ మాత్రం అవకాశం ఉండదు. కనుక ఈ కాలంలో అప్పటికి తయారయి అమ్మటానికి సిద్ధంగా ఉంచిన మేరకే సప్లయ్ పరిమితమవుతుంది. ఈ కాలవ్యవధిలో సప్లయ్ స్థిరంగా ఉండటంచేత వస్తువు యొక్క ధర నిర్ణయంలో డిమాండు ప్రభావమే ఎక్కువగా వుంటుంది. అంటే వస్తువుకు గల డిమాండు పెరిగితే ధర పెరుగుతుంది, డిమాండు తగ్గితే ధర తగ్గుతుంది. మార్కెట్‌లో వస్తువుయొక్క డిమాండు, సప్లయిలు సమానమైనప్పుడే ధర నిర్ణయించబడుతుంది. ఈ ధరనే "మార్కెట్ సమతౌల్య ధర" అంటారు. అయితే ఈ కాలవ్యవధిలో ధర నిర్ణయం వస్తువుయొక్క స్వభావంపైన ఆధారపడుతుంది. ఈ సందర్భంగా వస్తువులను రెండు రకాలుగా విభజించవచ్చు. అవి:

1. నిల్వ ఉంచటానికి వీలులేని వస్తువులు (Perishable Goods)

2. మన్నిక గల వస్తువులు (Durable Goods)

**1) నిల్వ ఉంచటానికి వీలులేని వస్తువుల ధర నిర్ణయం :** నిల్వ ఉంచటానికి వీలులేని పాలు, కూరగాయలు, మాంసం వంటి వస్తువుల విషయంలో సప్లయి స్థిరంగా ఉంటుంది. వాటి సప్లయి మార్కెట్‌కి వచ్చిన వస్తురాశికి పరిమితమౌతుంది. వాటిని నిల్వ ఉంచటానికి వీలులేదు. కనుక ఆ రోజుకారోజే వాటి సప్లయి అంతటినీ విక్రయించుకోవలసి ఉంటుంది మార్కెట్‌లో ధర తగ్గిందని సప్లయిని తగ్గించటానికిగాని, ధర పెరిగిందని సప్లయిని పెంచటానికి గాని వీలులేదు. అందుచేత ఈ కాలవ్యవధిలో సప్లయిరేఖ పటంలో చూపినట్లు Y- అక్షానికి సమాంతరంగా వుంటుంది. కనుక డిమాండు పెరిగితే ధర పెరుగుతుంది, డిమాండు తగ్గితే ధర తగ్గుతుంది. అంటే వస్తువు ధర నిర్ణయంలో డిమాండు ప్రధానపాత్ర నిర్వహిస్తుంది




పటంలో SM సప్లయ్ రేఖ, DD డిమాండు రేఖ. OP సమతౌల్య ధర. డిమాండు $D_1 D_1$కి పెరిగినప్పుడు ధర OP నుంచి $OP_1$ కి పెరగటం, డిమాండు $D_2 D_2$ కి తగ్గినప్పుడు ధర $OP_2$ తగ్గటం పటంలో చూడవచ్చు

**2) మన్నిక గల వస్తువుల ధర నిర్ణయం :** నిల్వ ఉండగల లేక మన్నికగల వస్తువుల విషయంలో ఈ కాలవ్యవధిలో సప్లయిని పెంచటానికి వీలులేనప్పటికిని తగ్గించటానికి అవకాశం వుంటుంది. వీట ధర ఎక్కువగా ఉంటే మొత్తం సప్లయిని

అమ్మటం, ధర మరీ తక్కువగా ఉంటే కొంత సప్లయిని నిలిపివేయటం జరుగుతుంది. వీటిని నిల్వ ఉంచవచ్చు గనుక ఏదో ఒక ధరకు అమ్ముకొని తీరవలసిన అవసరం లేదు. అందువల్ల అమ్మకందార్లు తాము అనుకున్న గిట్టుబాటు ధర లేక కనీసపు ధర (Reserve Price) వస్తేనే వస్తువులను అమ్మజూపటం, ధర అంతకన్నా తగ్గితే వస్తువుల అమ్మకాన్ని నిలిపివేయటం చేస్తారు. కనుక మార్కెట్‌లో ధర కనీసపు ధరకన్నా ఎక్కువగా ఉంటుందో దానిమీద సప్లయి ఆధారపడి ఉంటుంది. అందువల్ల ఈ కాలవ్యవధిలో సప్లయ్‌రేఖ పటంలో చూపినట్లు ఉత్పత్తి అయిన వస్తురాశి వరకు వాలుగా ఉండి అక్కడ నుంచి Y- అక్షానికి సమాంతరంగా ఉంటుంది.




పటంలో SFS అతి స్వల్పకాల వ్యవధిలో మన్నికగల వస్తువుల సప్లయి రేఖ, OS కనీసపు ధర వస్తువు ధర OS గాని, అంతకన్నా తక్కువగాగాని ఉంటే సప్లయి అసలుండదు. డిమాండు పెరిగిన, ధర పెరిగినకొద్దీ సప్లయి పెరుగుతూ OQ పరిమాణం వద్ద నిలిచిపోయింది. ఆ తర్వాత ధర యెంత పెరిగినా సప్లయి పెరిగే అవకాశం లేదు. కనుక OQ ఉత్పత్తి స్థాయినుంచి సప్లయిరేఖ నిటారుగా వుంది.

డిమాండు DD నుంచి $D_1D_1$ కి పెరిగినప్పుడు వస్తురాశి అంతా సప్లయి చేయబడింది. డిమాండు ఇంతకన్నా పెరిగితే సప్లయి పెరగదు. కనుక ధర పెరుగుతుంది. ఇట్లే డిమాండు $D_2D_2$ కి తగ్గితే ధర తగ్గుతుంది. కనుక ఈ కాల వ్యవధిలో సప్లయి యొక్క ప్రభావం అంతగా వుండదు.

అతి స్వల్ప కాలవ్యవధి ధరను ఉత్పత్తి వ్యయాలు ఎక్కువ ప్రభావితం చేయవు కనుక ఈ ధర ఉత్పత్తి వ్యయాలకు సమానంగా ఉండవచ్చు, లేకపోవచ్చు కూడా.

**ప్రశ్న 4) ధర నిర్ణయంలో మార్షల్ ప్రవేశపెట్టిన కాలవ్యవధి ప్రాముఖ్యాన్ని వివరించండి.**

**లేదా**

**స్వల్పకాలవ్యవధి, దీర్ఘకాలవ్యవధి అనగానేమి ? ధర నిర్ణయ సిద్ధాంతంలో వీటి ప్రాముఖ్యతను వివరింపుము.**

**లేదా**

**ధర నిర్ణయ సిద్ధాంతంలో కాలవ్యవధి యొక్క ప్రాముఖ్యతను విశదీకరించండి.**

**లేదా**

**"మార్కెట్ ధర", "సహజ ధర" అనగానేమి ? వాటి మధ్య విచక్షణ చేయండి.**

**(Very Important)**

**జవాబు :** ఒక వస్తువు ధర ఆ వస్తువుకున్న డిమాండు, సప్లయిలు రెండింటి చేత నిర్ణయింపబడుతుంది. అయితే డిమాండు, సప్లయిలు అన్నివేళలా ఒకే విధంగా ఉండవు. వీటిలో మార్పులు వస్తుంటాయి. ఈ మార్పుల ప్రభావం ధరపై ఉంటుంది. 'మార్షల్' ప్రకారంగా ఒక కాలంలో డిమాండుకు, మరియొక కాలంలో సప్లయికి ధరపై ఎక్కువ ప్రభావము ఉంటుంది కనుక ధర నిర్ణయం కాలాన్నిబట్టి మారుతూ వుంటుందని 'ఆల్‌ఫ్రెడ్ మార్షల్' అభిప్రాయపడినాడు. తదనుగుణ్యంగా ధర నిర్ణయ కాలాన్ని మార్షల్ నాలుగుగా విభజించాడు. అవి :

1. అతి స్వల్పకాలం లేక మార్కెట్ కాలవ్యవధి (Very Short Period or Market Period)
2. స్వల్పకాలం (Short Period)
3. దీర్ఘకాలం (Long Period)
4. అతి దీర్ఘకాలం (Very Long Period or Secular Period)

ఈ కాల వ్యవధులలో సప్లయి, డిమాండులు ఒకే విధంగా వుండవు గనుక ధర కూడ ఒకే రకంగా వుండదు.

**1) అతి స్వల్ప కాల వ్యవధి లేక మార్కెట్ కాల వ్యవధి ధర నిర్ణయం (Market Price)** : ఈ కాలవ్యవధి అతిస్వల్ప కాలమవటంచేత సప్లయిని మార్చడానికి ఏ మాత్రం అవకాశం ఉండదు. కనుక ఈ కాలంలో అప్పటికే తయారయి అమ్మకానికి సిద్ధంగా వున్న వస్తురాశి (Stock-on-Hand) మేరకే సప్లయ్ పరిమితమౌతుంది ఈ కాలంలో

సప్లయి స్థిరంగా ఉండటంచేత వస్తువు యొక్క ధర నిర్ణయంలో డిమాండు ప్రభావమే ఎక్కువగా వుంటుంది. అంటే వస్తువుకు గల డిమాండ్ పెరిగితే ధర పెరుగుతుంది. డిమాండ్ తగ్గితే ధర తగ్గుతుంది. డిమాండు. సప్లయిలు సమానమైన చోట ధర నిర్ణయమౌతుంది ఈ ధరనే "మార్కెట్ సమతౌల్య ధర" అంటారు దీన్నే క్రింది పటంలో చూడవచ్చు. పటంలో SM మార్కెట్ సప్లయి రేఖ - OP సమతౌల్య ధర.




ఈ మార్కెట్ సమతౌల్య ధరపై ఉత్పత్తి వ్యయాల ప్రభావం అంతగా ఉండదు. అందువలన మార్కెట్ ఉత్పత్తి వ్యయాలకు సమానంగా ఉండవచ్చు, లేక ఎక్కువగాగాని, తక్కువగాగాని ఉండవచ్చు. ఈ ధర నిర్ణయంలో డిమాండు ప్రబావమే ఎక్కువగా ఉంటుంది.

**2) స్వల్పకాలిక సమతౌల్య ధర :** వస్తువు యొక్క డిమాండు కనుగుణ్యంగా పరిశ్రమలో ఉన్న సంస్థలు సప్లయిని ఒక పరిమితి (గరిష్ట ఉత్పాదక శక్తి) కి లోబడి పెంచటానికి వీలున్న కాలం యిది. ఈ కాలంలో సంస్థలు ఉన్న స్థిర ఉత్పత్తి కారకాలను (యంత్రాలను) పూర్తిగా వినియోగిస్తూ, చర ఉత్పత్తి కారకాలను పెంచటం ద్వారా సప్లయిని పెంచగలవు. ఈ కాలం స్వల్పం అవటంచేత స్థిర ఉత్పత్తి కారకాలను పెంచటానికిగాని, కొత్త ఉత్పాదక సంస్థలు పరిశ్రమలో ప్రవేశించటానికిగాని సమయం చాలదు. అంటే ఈ కాలంలో ఉత్పత్తి సంస్థల సంఖ్య, యాంత్రిక సముదాయం స్థిరంగా ఉంటాయి.

మార్కెట్‌లో వస్తువుకు డిమాండు పెరిగితే, అతి స్వల్పకాలంలో సప్లయిని ఏ మాత్రం పెంచటానికి వీలులేదు గనుక, వస్తువు ధర బాగా పెరుగుతుంది. కాని

స్వల్పకాలంలో సంస్థలు గరిష్ట ఉత్పాదక శక్తి మేరకు సప్లయిని పెంచటంతో ధర కొంచెం తగ్గుతుంది. ఈ ధరను "స్వల్పకాల వ్యవధి సహజ ధర" (Short Period Normal Price) అంటారు. ఈ ధర ఎలా నిర్ణయింపబడేది క్రింది రేఖాపటం విశదీకరిస్తుంది.




పటంలో DD డిమాండు రేఖ, SM మార్కెట్ కాల వ్యవధి సప్లయిరేఖ. OP మార్కెట్ సమతౌల్య ధర. ఇప్పుడు డిమాండు $D_1D_1$ కి పెరిగితే సప్లయి ఏమాత్రం పెరగలేదు. కనుక ధర $OP_1$కి పెరుగుతుంది. ధర హెచ్చుగా ఉన్నందున వున్న సంస్థలు వున్న యంత్రాలతోనే, చర ఉత్పత్తి సాధనాలను పెంచి ఉత్పత్తిని పెంచుతాయి. SRS స్వల్పకాల వ్యవధి సప్లయి రేఖ. అయితే సప్లయి డిమాండ్‌కు సరిపోయేటంతగా పెరగలేదు. కనుక ధర $OP_2$ కి తగ్గినప్పటికీ మామూలు ధర OP కంటె హెచ్చుగానే ఉంటుంది. ఈ కాలవ్యవధిలో కూడ ధరమీద సప్లయి ప్రభావం చాల స్వల్పంగా వుండి, డిమాండు ప్రభావమే ఎక్కువగా ఉంటుంది.

**3) దీర్ఘకాల సహజ ధర (Long Period Normal Price) :** డిమాండు పరిస్థితులలోని మార్పులకు అనుగుణంగా సప్లయిని మార్చటానికి కావలసిన కాలాన్ని "దీర్ఘకాలం" అంటారు. ఈ కాలంలో ఉత్పాదక సంస్థలు యంత్రాలతో సహా అన్ని ఉత్పత్తి సాధనాలను మార్పు చేయటం ద్వారా ఉత్పత్తిని అవసరమైన మేరకు మార్చగలవు. ఈ కాలం దీర్ఘకాల మవటంచేత కొత్త సంస్థలు పరిశ్రమలో ప్రవేశించటానికి లేక వున్న సంస్థలు పరిశ్రమ వదలి వెళ్ళటానికి వీలుపడుతుంది. కనుక ఈ కాలవ్యవధిలో డిమాండును, సప్లయికి సరిపోయేటట్లు సర్దుబాటు చేయవచ్చు. **ఈ కాలంలో అన్ని ఉత్పత్తి కారకాలు చర ఉత్పత్తి కారకాలే. కనుక అన్ని వ్యయాలు చరవ్యయాలే.** అందువలన ధర కేవలం సగటు చర వ్యయానికి మాత్రమే సరిపోతే చాలదు. ధర కనీస సగటు మొత్తం వ్యయానికి సమంగా ఉండాలి. అప్పుడే మార్కెట్‌లో అవసరమైన వస్తురాశి

ఉత్పత్తి చేయబడుతుంది. కనుక దీర్ఘకాల సహజధర కనీస సగటు మొత్తం వ్యయానికి సమానంగా ఉంటుంది.

స్వల్పకాల ధర సగటు ఉత్పత్తి వ్యయంకన్నా ఎక్కువగా వుంటే సంస్థలన్నీ అధిక లాభాలను గడిస్తాయి. పరిశ్రమలో అధిక లాభాలు వస్తున్నప్పుడు కొత్త సంస్థలు పరిశ్రమలో ప్రవేశించటం, ఉన్న సంస్థలు ఉత్పత్తిని పెంచటం జరుగుతుంది ఫలితంగా ఉత్పత్తి పెరిగి, ధర తగ్గి సగటు రాబడి మొత్తం వ్యయానికి సమానమౌతుంది. ఒకవేళ స్వల్పకాల ధర సగటు ఉత్పత్తి వ్యయంకన్నా తక్కువగాయుంటే సంస్థలకు నష్టాలు సంభవిస్తాయి. దానివలన కొన్ని సంస్థలు ఉత్పత్తిని తగ్గించటం, మరికొన్ని పరిశ్రమను వదలివెళ్లటం జరుగుతుంది. ఫలితంగా ఉత్పత్తి తగ్గి, ధర పెరిగి సగటు ఉత్పత్తి వ్యయానికి సమానమౌతుంది. ఈ విధంగా దీర్ఘకాలంలో సహజమయిన ధర సగటు మొత్తం వ్యయానికి సమానంగా వుంటుంది.

అయితే దీర్ఘకాలంలో సహజ ధర మామూలు ధర కన్నా హెచ్చుగా వుంటుందా, తక్కువగా వుంటుందా లేక సమంగా వుంటుందా అనేది పరిశ్రమ యొక్క ఉత్పత్తి వ్యయాలలో కలిగే మార్పులను బట్టి వుంటుంది. పెరుగుతున్న వ్యయాలున్న పరిశ్రమలో దీర్ఘకాల సహజ ధర మామూలు ధరకన్నా హెచ్చుగాను, తగ్గుతున్న వ్యయాలున్న పరిశ్రమలో మామూలు ధరకన్నా తక్కువగాను, సమ వ్యయాలున్న పరిశ్రమలో మామూలు ధరకు సమానంగా ఉంటుంది

**తగ్గుతున్న వ్యయాలున్న పరిశ్రమ (Decreasing Costs Industry) :** పరిశ్రమ విస్తరిస్తున్న కొద్దీ కొన్ని ఆదాలను పొందుతుంది. ఈ ఆదాలను పొందటం వలన సగటు ఉత్పత్తి వ్యయం (Average Production Cost) తగ్గుతుంది. ఇలాంటి పరిశ్రమను "తగ్గుతున్న వ్యయాలున్న పరిశ్రమ" అంటారు. తగ్గుతున్న వ్యయాలున్న పరిశ్రమలో సప్లయిరేఖ ఎడమ నుండి కుడికి క్రిందికి వాలుతూ ఉంటుంది. ఈ పరిశ్రమలో దీర్ఘకాల సహజ ధర ఎలా నిర్ణయింపబడేది క్రింది రేఖాపటం విశదీకరిస్తుంది.



పటంలో LRS దీర్ఘకాలిక సప్లయిరేఖ. $D_1D_1$ పెరిగిన డిమాండు రేఖ. $OM_3$ దీర్ఘకాలంలో డిమాండుకి సరిపోయే సప్లయి. ఈ రెండూ సమానమైన చోట $OP_3$ సమతౌల్య ధర నిర్ణయింపబడుతుంది. ఈ ధర మామూలు ధర OP కన్నా తక్కువగా ఉంటుంది.

**సమ వ్యయాలున్న పరిశ్రమ (Constant Costs Industry) :** ఉత్పత్తి పెరిగినా సగటు ఉత్పత్తి వ్యయం స్థిరంగా ఉండే పరిశ్రమను "సమవ్యయాలున్న పరిశ్రమ" అంటారు. ఇలాంటి పరిశ్రమలో సప్లయి రేఖ X - అక్షానికి సమాంతరంగా ఉంటుంది. ధర ఎలా నిర్ణయింపబడేది క్రింది రేఖాపటం విశదీకరిస్తుంది.




పటంలో LRS దీర్ఘకాలిక సప్లయి రేఖ. $D_1D_1$ పెరిగిన డిమాండు రేఖ. $OM_3$ దీర్ఘకాలంలో డిమాండుకి సరిపోయే సప్లయి. ఇప్పుడు ఈ రెండూ సమానమైన చోట ధర నిర్ణయమవుతుంది. ఈ ధర మామూలు ధర OP కి సమానంగా ఉంటుంది.

**పెరుగుతున్న వ్యయాలున్న పరిశ్రమ (Increasing Costs Industry) :** పరిశ్రమ విస్తరిస్తున్న కొద్దీ వచ్చే ఆదాలు ఒక స్థాయి వరకే లభిస్తాయి. ఆ పైన పరిశ్రమ విస్తరిస్తే ఆదాల స్థానే తరుగులు సంభవిస్తాయి. అంతేగాక విస్తరిస్తున్న పరిశ్రమలో సంస్థల మధ్య పోటీ ఏర్పడి శ్రామికుల వేతనాలు, ముడిపదార్థాల ధరలు పెరుగుతాయి. ఫలితంగా సంస్థల సగటు ఉత్పత్తి వ్యయం పెరుగుతుంది. ఇలాంటి పరిశ్రమనే "పెరుగుతున్న వ్యయాలున్న పరిశ్రమ" అంటారు. ఈ పరిశ్రమలో సప్లయిరేఖ ఎడమనుంచి కుడికి పైకిపోతుంది. ధర ఎలా నిర్ణయింపబడేది క్రింది రేఖాపటం విశదీకరిస్తుంది.




పటంలో LRS దీర్ఘకాలిక సప్లయి రేఖ. $D_1D_1$ పెరిగిన డిమాండు రేఖ. $OM_3$ దీర్ఘకాలంలో డిమాండుకు సరిపోయే సప్లయి. ఈ రెండూ సమానమైనచోట ధర నిర్ణయింపబడుతుంది. $OP_3$ దీర్ఘకాల సహజ ధర. ఈ ధర మామూలు ధర OP కన్న హెచ్చుగా ఉంటుంది.

**4) అతి దీర్ఘకాలిక సమతౌల్య ధర :** ఉత్పత్తి కారకాల సప్లయి, సాంకేతిక పరిజ్ఞానస్థాయి మొదలైన ప్రధాన మార్పులు జరుగుటకు కావలసిన కాల వ్యవధిని "అతిదీర్ఘకాల వ్యవధి" లేక "సెక్యులర్ కాలవ్యవధి" అంటారు. అయితే ఈ కాలవ్యవధిలో సమతౌల్య ధర విశ్లేషణ సాధ్యంకాదు.

పై విధంగా 'ఆల్‌ఫ్రెడ్ మార్షల్' ధర నిర్ణయంలో కాలవ్యవధి ప్రాముఖ్యాన్ని కల్పించాడు. అర్థశాస్త్రంలో చలన విశ్లేషణకు పునాది వేశాడు. అంతేకాక డిమాండు సప్లయిలలో ఏ ఒక్కటీ ధరను నిర్ణయించదని, రెండింటి పరస్పర ప్రచలనమే (Inter Section) ధరను నిర్ణయిస్తుందని మార్షల్ విశ్లేషణ స్పష్టం చేస్తుంది. అయితే ధరపై అతి స్వల్పకాలంలో డిమాండు ప్రభావం ఎక్కువగా ఉండగా, దీర్ఘకాలంలో సప్లయి ప్రభావం ఎక్కువగా ఉంటుందని ఈ విశ్లేషణ తెలియచేస్తుంది.

## SHORT QUESTIONS

**ప్రశ్న 1) మార్కెట్ ధరకు, సహజ ధరకు మధ్య విచక్షణ చేయునది.**

**లేదా**

**మార్కెట్ ధరకు, సహజ ధరకు మధ్యగల భేదాన్ని వివరించండి.**

**జవాబు:** మార్కెట్ ధర - సహజ ధర : పరిపూర్ణ పోటీలో ఒక వస్తువు ధర ఆ వస్తువుకున్న మొత్తం డిమాండు, మొత్తము సప్లయిలు కలిసి నిర్ణయిస్తాయి. ఈ రెండు శక్తులు పరస్పర ప్రచలితమే (Inter Section) ధరను నిర్ణయిస్తుంది. అయితే డిమాండు, సప్లయిల ప్రభావము ఎల్లవేళల ఒకేరీతిగా ఉండదు. అతి స్వల్ప కాలములో సప్లయి మారడానికి ఏమాత్రం అవకాశము ఉండదు కనుక ధరమీద డిమాండు యొక్క ప్రభావము యెక్కువగా వుంటుంది. అంటే వస్తువునకు గల డిమాండు పెరిగితే ధర పెరుగుతుంది, డిమాండు తగ్గితే ధర తగ్గుతుంది. ఈ అతి స్వల్పకాలములోని ధరను "మార్కెట్ ధర" (MarketPrice) అంటారు. డిమాండులో మార్పులకు అనుగుణముగా సప్లయిని మార్చడానికి దీర్ఘకాల వ్యవధి అవసరము. ఈ కాలములో సప్లయిని, డిమాండునకు సరిపడునట్లుగా మార్చవచ్చు. కనుక ఈ కాలవ్యవధిలో ధరమీద సప్లయి యొక్క ప్రభావము ఎక్కువగా ఉంటుంది. ఈ దీర్ఘకాలములో ఉండే ధరను "సహజమైన ధర" (Normal Price) అంటారు.

**తేడాలు :** మార్కెట్ ధర, సహజ ధరకు ఈ క్రింది తేడాలుంటాయి :

1. మార్కెట్ ధర ఒక సమయంలో డిమాండు సప్లయిల మధ్య ఏర్పడే తాత్కాలిక సమతౌల్యం వల్ల ఏర్పడుతుంది. సహజమైన ధర అలాకాక దీర్ఘకాలములో మారిన డిమాండు పరిస్థితులకు సప్లయి పూర్తిగా సర్దుబాటు చేయబడినపుడు డిమాండు సప్లయిల మధ్య ఏర్పడే సమతౌల్యం వల్ల ఏర్పడుతుంది.

2. మార్కెట్ ధర వాస్తవానికి మార్కెట్‌లో ఒకే సమయంలో ఉంటుంది. గాని సహజమైన ధర వాస్తవానికి ఎప్పుడూ ఏర్పడకపోవచ్చు. డిమాండు సప్లయి పరిస్థితులు ఎప్పుడూ మారుతూ వుంటాయి. కనుక సహజమైన ధర అనేది ఏర్పడటం సంభవించకపోవచ్చు. క్లుప్తంగా మార్కెట్ ధర వాస్తవమైనదని, సహజ ధర ఊహాజనితమైనదని చెప్పవచ్చు.

3. మార్కెట్ ధర తాత్కాలిక పరిస్థితుల ప్రభావానికి లోనై వుంటుంది. అందువల్ల మార్కెట్ ధర రోజు రోజుకు లేక గంట గంటకు కూడా మారుతూ వుంటుంది. సహజమైన ధర అలాకాక దీర్ఘకాలములో ఉండే స్థిరమైన పరిస్థితుల ప్రభావానికి లోనై వుంటుంది. అందువల్ల సహజమైన ధర కొంతకాలముపాటు నిలకడగా వుంటుంది. మార్కెట్ ధర,

సహజమైన ధరకంటే పెరుగుతూ తగ్గుతూ సహజమైన ధరను చేరటానికి ప్రయత్నిస్తూ వుంటుంది.

4. మార్కెట్ ధర నిర్ణయములో డిమాండ్ యొక్క ప్రభావము యెక్కువగా వుంటుంది. సహజమైన ధర నిర్ణయములో సప్లయి యొక్క ప్రభావము ఎక్కువగా వుంటుంది.

5. మార్కెట్ వ్యవధిలో వస్తురాశి మార్చడానికి వీలులేదు గనుక మార్కెట్ ధరమీద ఉత్పత్తి వ్యయాల ప్రభావము ఏమీ వుండదు. అందువల్ల మార్కెట్ ధర ఉత్పత్తి వ్యయానికి సమానంగాకాని, అంతకంటే తక్కువ లేక ఎక్కువగాగాని ఉండవచ్చు కాని దీర్ఘకాలములో మారిన డిమాండుకు సరిపోయే వస్తురాశి ఉత్పత్తి చేయబడుతుంది కనుక సహజమైన ధర సగటు ఉత్పత్తి వ్యయానికి సమానంగా ఉంటుంది. -

6. అన్ని వస్తువులకు మార్కెట్ ధర ఉంటుంది. కాని తిరిగి ఉత్పత్తి చేయడానికి వీలైన వస్తువులకు మాత్రమే సహజమైన ధర ఉంటుంది. పురాతనమైన చిత్రాలు, వ్రాతప్రతులు, అపురూప వజ్రాలు మొదలైన వస్తువుల సప్లయిని దీర్ఘకాలములో కూడా పెంచడానికి వీలు లేనందున వాటికి సహజమైన ధర అంటూ ఉండదు. వాటికి మార్కెట్ ధర మాత్రమే ఉంటుంది

## ప్రశ్న 2) కాబ్‌వెబ్ సిద్ధాంతాన్ని గూర్చి వ్రాయండి.

**జవాబు** : సప్లయి డిమాండుల మధ్య సమతౌల్యము ఒకే కాలానికి చెందినదో కాదో తెలుసుకొనడం కోసం ఈ సిద్దాంతం పనికొస్తుంది. సమతౌల్యము స్థిరమైనదో, అస్థిరమైనదో కాబ్‌వెబ్ సిద్ధాంతము సహాయంతో తెలుసుకొనవచ్చు.

ఉత్పత్తిలో ఉత్పత్తి ప్రణాళికకు వాటి సాదనకు మధ్య కాలవ్యవధి వుంటుంది. అపుడు సమతౌల్యం తిరిగి చేరడమో, చేరకపోవడమో చలన సర్దుబాట్లు మీద ఆధారపడి వుంటుంది. వ్యవసాయోత్పత్తుల విషయంలో యిది సహజముగా గోచరిస్తుంది.

ఉత్పత్తి నిర్ణయాలు అప్పటికి అమలులో నున్న ధర మీద ఆధారపడి జరుగుతాయి. ఉత్పత్తి మార్కెట్‌లోకి (కాలవ్యవధివల్ల) వచ్చాక ఆ ధరకి అమ్మడం సాధ్యంకాక తగ్గించి అమ్మడం - ధర తగ్గిపోయిన కారణంగా సప్లయి పథకాలు మారడం మళ్ళీ మార్కెట్‌లోకి సప్లయి వచ్చేసరికి ధర అధికంగా ఉండటము- అకారణముగా ఉత్పత్తి పెంచడము జరుగుతుంది. వాటిని ఈ క్రింది రేఖాపటంలో చూపవచ్చు.

ఉదా॥ గత సంవత్సరములో ధర $OP_1$ స్థాయికి పెరిగినపుడు సప్లయి OQ లో తయారై ఈ సం॥లో విడుదల అవుతుంది. $OP_1$ ధరవద్ద డిమాండ్ $OQ_1$ కంటే తక్కువ $OQ_2$ మాత్రమే ఉండటం వల్ల దానిని $OP_2$ ధర వద్ద పూర్తిగా విక్రయించుకోగలరు. $OP_2$ధర తగ్గినందున మరుసటి సం॥రం సప్లయి $OQ_2$గా వుంటుంది. అపుడు డిమాండ్ $OQ_1$గా వుండి ధర $OP_3$ స్థాయికి పెరిగిపోతుంది. అపుడు మరుసటి సం॥రం సప్లయి

$OP_3$ వద్ద $OQ_3$ వుంటుంది ఈ విధముగా ఉత్పత్తి నిర్ణయాలు చేసినపుడు వున్న ధర ఉత్పత్తి మార్కెట్‌లోకి వచ్చు సమయానికి మారిపోతుంది. సప్లయిలో డిమాండ్‌లో మార్పులవల్ల మళ్ళీ ధర సమతల స్థితికి చేరుతుంది. సప్లయి పెంచటానికి తగ్గించడానికి కొంత సమయం అవసరం కావడమే ఇక్కడ ముఖ్యముగా గమనార్హము




ఈ రేఖా పటంలో డిమాండ్ ఒక సంవత్సరంలో ధరకు దానికి గల సంబంధము తెలియచేస్తుంది.

సప్లయిరేఖ మాత్రం ఒక సంవత్సరంలో సప్లయి గత సంవత్సరంలో ధరమీద ఆధారపడి ఉండటాన్ని సూచిస్తుంది.

St= f (pt-1) Dt = P (Pt)

t = ఒక కాలవ్యవధిని తెలియచేస్తుంది.

t-1 అంతకుముందు కాలవ్యవధిని తెలియచేస్తుంది.

సమతల ధర $OP_0$

గత సంవత్సరంలో ధర $OP_1$ ఉన్నప్పుడు వ్యవసాయదారులు తదుపరి సం॥రానికి $OQ_1$ సప్లయి చేసేటట్లు పండిస్తారు. $OQ_1$ పంటను $OP_2$ ధర దగ్గర మాత్రమే పూర్తిగా అమ్మగలరు.

$OP_2$ ధర వున్నప్పుడు $OQ_2$ మాత్రమే పంటను సప్లయి చేస్తారు. $OQ_2$ పంటను $OP_3$ ధరకు విక్రయించవచ్చు. $OP_3$ ధర ఎక్కువ కనుక మళ్ళీ సప్లయిదార్లు ఎక్కువ పండించి సప్లయి చేస్తారు. ఈ విధముగా ధర - వస్తు పరిమాణము సమతౌల్య విలువ $OP_0$ చుట్టూ పరిభ్రమిస్తుంటాయి. ఈ పరిభ్రమణ ఒక సాలెగూడు ఆకారములో వుండటం చేత దీనికి 'కాబ్‌వెబ్ సిద్ధాంతమని' పేరు వచ్చింది.

## ప్రశ్న 3) ప్రతినిధి సంస్థను గూర్చి సంగ్రహంగా వ్రాయండి.

జవాబు : "ప్రతినిధి సంస్థ" అనే భావనను అర్థశాస్త్రములో 'మార్షల్' ప్రవేశపెట్టినాడు. 'మార్షల్' ప్రతినిధి సంస్థను ఈ క్రింది విధముగా నిర్వచించాడు. "సామాన్య సామర్థ్యంతో నిర్వహించబడుతూ, అంతర్గత బహిర్గత ఆదాలను పొందుతూ దీర్ఘకాలముగా మార్కెట్‌లో ఉంటూ చెప్పుకోదగిన విజయాన్ని సాధించిన సంస్థను "ప్రతినిధి సంస్థ" అంటాము.

పరిశ్రమలోని ఒకే వస్తువును తయారు చేసే సంస్థలు ఎన్నో వుంటాయి. వాటి ఉత్పత్తి వ్యయము అనేక రకాలుగా వుంటుంది. కాబట్టి దీర్ఘకాలంలో ఏ సంస్థ ఉత్పత్తి వ్యయము ధరను నిర్ణయిస్తుంది అనేది ప్రధాన సమస్య. ఈ సమస్య పరిష్కారానికి 'మార్షల్' ప్రతినిధి సంస్థ అనే భావనను ప్రవేశ పెట్టినాడు. ఈ ప్రతినిధి సంస్థ ఉత్పత్తి వ్యయాన్ని బట్టి ధర నిర్ణయించబడుతుంది అని 'మార్షల్' అభిప్రాయం.

విమర్శ :

1. సంపూర్ణ పోటీలో పరిశ్రమలోని సంస్థలన్నీ ఒకే రకముగా వుంటాయి. కాబట్టి ప్రతినిధి సంస్థ అనే భావన అవసరము వుండదు.
2. ఈ భావన సంపూర్ణ పోటీ అనే ప్రమేయముపై ఆధారపడి వున్నది. కాని వాస్తవముగా సంపూర్ణ పోటీ వుండదు. అసంపూర్ణ పోటీ వుంటుంది. అసంపూర్ణ పోటీలో ఒక్కొక్క సంస్థ ఒక్కొక్క ధరను నిర్ణయించుకుంటుంది. కాబట్టి ప్రతినిధి సంస్థ అనే భావన అనవసరం.
3. మార్కెట్ ఒకే రకపు వస్తువును తయారు చేయు అనేక సంస్థలు వివిధ రకాల ఉత్పత్తి వ్యయాలు కల్గియుంటాయి. కొన్ని సంస్థలకు ఉపాంత వ్యయము ఎక్కువగా వుండవచ్చు. అటువంటప్పుడు ఆ సంస్థలు ప్రతినిధి సంస్థ ధర నిర్ణయాన్ని అనుసరించక పోవచ్చును.
4. రాబిన్స్, రాబర్ట్‌సన్ మొదలగు ఆర్థికవేత్తలు ప్రతినిధి సంస్థ కేవలం ఊహాజనితమైనదని, వాస్తవిక ప్రపంచములో ఉండేది కాదని, విలువ సిద్ధాంతానికి ఈ భావన అవసరమని విమర్శించినారు.

## ప్రశ్న 4) సమతౌల్య సంస్థను గురించి సంగ్రహంగా వ్రాయండి.

సమతౌల్య సంస్థ అనే భావనను "A.C పిగో" అనే ఆర్థికవేత్త అర్థశాస్త్రములో ప్రవేశపెట్టారు. మార్షల్ ప్రతినిధి సంస్థకన్నా సమతౌల్య సంస్థ అనే భావన మెరుగైనదని పిగో అభిప్రాయం. పరిశ్రమ సమతౌల్యంలో ఉన్నపుడు ఆ పరిశ్రమలోని సంస్థలలో ఒకటి సమతౌల్యంలోయుంటుంది కొన్ని సంస్థలు ఉత్పత్తిని పెంచుతూ వుంటాయి

కొన్ని సంస్థలు ఉత్పత్తిని తగ్గిస్తూ వుంటాయి. కాని ఏ సంస్థ యొక్క ఉత్పత్తి స్థిరంగా వుంటుందో దానిని 'సమతౌల్య సంస్థ' అంటారు ధర సమతౌల్య సంస్థ యొక్క సగటు, ఉపాంత వ్యయానికి సమానముగా వుంటుందని పిగో అభిప్రాయం

**విమర్శ :** పిగో సమతౌల్య సంస్థ కొన్ని విమర్శలకు గురి అయినది

1. దీర్ఘకాలంలో పరిశ్రమ సమతౌల్యంలో వున్నప్పుడు ఆ పరిశ్రమలోని అన్ని సంస్థలు కూడ సమతౌల్యములో వుంటాయి కాబట్టి సమతౌల్య సంస్థ అనే భావనను ప్రత్యేకంగా చెప్పనవసరంలేదు
2. ఈ భావన సంపూర్ణ పోటీ, సంపూర్ణ ఉద్యోగం అనే ప్రమేయాలపై ఆధారపడియున్నది కాని ఈ ప్రమేయాలు నిజంకావు.
3. వివిధ సంస్థలు వివిధ రకాలైన ఉత్పత్తి వ్యయాలను కల్గి వుంటాయి. కాబట్టి ఒక్కొక్క సంస్థకు ఒక్కొక్క ధర వుంటుంది

## ప్రశ్న 5) కృత్రిమ ధరలు లేదా షాడో ప్రైసింగ్ (Shadow Pricing).

**జవాబు .** 'షాడో ప్రైసింగ్' అనేది ధర నిర్ణయానికి సంబంధించిన భావన ఒక వస్తువు ధర దాని ఉత్పత్తి వ్యయానికి సమానంగా ఉంటుంది. ఈ ధరలో సామాన్య లాభాలు కూడా ఇమిడి ఉంటాయి. ఈ ధరను నిర్ణయించేటప్పుడు ఉత్పత్తి వలన సంభవించే సాంఘిక వ్యయాలు (Social Costs) పరిగణనలోకి తీసుకోబడవు. ఫ్యాక్టరీలో ఉత్పత్తి జరిగేటప్పుడు ఏర్పడే వాతావరణ కాలుష్యం, మురికివాడలు ఏర్పడి అనారోగ్యం లాంటి కొన్ని సాంఘిక వ్యయాలుంటాయి. పైన తెల్పిన ధరలో ఈ వ్యయాలు చేర్చబడలేదు. కనుక సాధారణ ఉత్పత్తి వ్యయాలకు ఇలాంటి సాంఘిక వ్యయాలను కలిపితే వచ్చే ధరలను "కృత్రిమ దరలు" (Shadow Prices) అంటారు ఇలా ధర నిర్ణయించే పద్ధతిని "షాడో ప్రైసింగ్" (Shadow Pricing) అంటారు

ఆధునిక ఉత్పత్తి విధానంలో సాంఘిక వ్యయాలు ఎక్కువగా ఉంటున్నాయి. కనుక వీటినికూడ పరిగణలోకి తీసుకోవలె. ఈ సాంఘిక వ్యయాలను సూచించుటకు షాడో ప్రైసింగ్ ఎంతైనా అవసరం. మార్కెటులో ప్రత్యక్ష వినిమయానికి కాక, ఇతరత్రా లాభనష్టాలను సూచించుటకు తయారుచేసినవి షాడో ధరలు. సంక్షేమ అర్థశాస్త్రంలో షాడో ప్రైసింగ్ ఒక ముఖ్యమైన విధానము.

## ప్రశ్న 6) శుద్ధమైన పోటీ, పరిపూర్ణమైన పోటీ.
## (Pure and Perfect Competition).

7వ అధ్యాయంలో 3వ ప్రశ్నకిచ్చిన జవాబులో "పరిపూర్ణపోటీ నిబంధనలు' చూడండి.

**ప్రశ్న 7) పరిపూర్ణపోటీ సంస్థ సమతౌల్యం - [Equilibrium of Firm].**

**లేదా**

**ఉత్పత్తి సమతౌల్యం**

8వ అధ్యాయంలో 1వ ప్రశ్నకిచ్చిన జవాబు చూడండి.

**ప్రశ్న 8) పరిపూర్ణపోటీ పరిశ్రమ సమతౌల్యం [Equilibrium of Industry].**

1వ ప్రశ్నకిచ్చిన జవాబు చూడండి.

**ప్రశ్న 9) సమతౌల్య ధర [Equilibrium Price].**

2వ ప్రశ్నకిచ్చిన జవాబులో 'సమతౌల్య ధర' వ్రాసి అందులో ఇచ్చిన రేఖాపటాన్ని వేయండి.

**ప్రశ్న 10) మార్కెటు ధర [Market Price]**

4వ ప్రశ్నకిచ్చిన జవాబులో "అతిస్వల్ప కాల వ్యవధిలో ధర నిర్ణయం" చూడండి.

**ప్రశ్న 11) మార్కెట్ ధర, సహజ ధర (Market Price-Normal Price)-**

**లేదా**

**దీర్ఘకాలిక ధర - మార్కెట్ ధర (Long run Price and Market Price).**

1వ ప్రశ్నకిచ్చిన జవాబు చూడండి.



అధ్యాయము 9

# ఏకస్వామ్య పరిస్థితిలో ధర నిర్ణయం

**ప్రశ్న 1) ఏకస్వామ్యంలో ధర నిర్ణయం జరిగే పద్ధతిని వివరించండి.**

**లేదా**

**గుత్తాధిపత్యంలో సమతౌల్య ధర నిర్ణయమెలా జరుగుతుందో వివరించండి.**

**లేదా**

**ఏకస్వామ్యంలో సంస్థ సమతౌల్యాన్ని వివరించండి.**

**లేదా**

**ఏకస్వామ్య పరిస్థితిలో ధర, ఉత్పత్తి ఏ విధంగా నిర్ణయమౌతాయో తెలుపుము. (Very Important)**

**జవాబు : ఏకస్వామ్యము :** అసంపూర్ణ పోటీ మార్కెట్‌లో ఏకస్వామ్యం ఒక రకం. ఏకస్వామ్యం సంపూర్ణ పోటీ మార్కెట్‌కు పూర్తిగా విరుద్ధమైనది. మార్కెట్‌లో ఒకే ఒక ఉత్పత్తిదారుడు ఉండి, పోటీదారులు లేకుండా, అతను తయారుచేసే వస్తువులకు సమీప ప్రత్యామ్నాయ వస్తువులు లేకుండా ఉండే మార్కెట్‌ను "ఏకస్వామ్యం" లేదా "గుత్తాధిపత్యం" అంటారు. ఏకస్వామ్యం రెండు రకాలుగా ఉండవచ్చు. అవి :

**పరిశుద్ధ ఏకస్వామ్యం :** ఒక వస్తువు యొక్క యావత్ ఉత్పత్తి ఒకే ఒక సంస్థ ఆధీనంలో వుండి, ఆ వస్తువుకు అసలు ప్రత్యామ్నాయాలేమీ లేకపోతే (no substitutes at all) ఆ వస్తువు మార్కెట్‌ను "పరిశుద్ధ ఏకస్వామ్యం" (Pure Monopoly) అంటారు. కాని ఇలాంటి పరిశుద్ధ ఏకస్వామ్యం వాస్తవంలో చాలా అరుదు.

**ఏకస్వామ్యం :** ఒక వస్తువుకు ఒకే ఒక ఉత్పత్తిదారుడు ఉంటూ, ఆ వస్తువుకు సన్నిహిత ప్రత్యామ్నాయాలు లేకపోవటం (No Close Substitutes) కనిపిస్తుంది. అలాంటిదాన్ని "ఏకస్వామ్యం" లేక "గుత్తాధిపత్యం" (Monopoly) అంటారు.

**ఏకస్వామ్య లక్షణాలు లేక ఏకస్వామ్య పరిస్థితులు :** ఏకస్వామ్యానికి కొన్ని లక్షణాలుంటాయి. అవి :

1. వస్తువు ఉత్పత్తి అంతా ఒకే వ్యక్తి లేక సంస్థ ఆధీనంలో ఉంటుంది.
2. ఆ వస్తువుకు సన్నిహిత ప్రత్యామ్నాయ వస్తువులుండవు.
3. ఒకే ఉత్పత్తిదారుడు ఉండడంతో పరిశ్రమ, సంస్థ రెండూ ఒకటే. తేడా వుండదు.
4. ధర నిర్ణయంలో స్వల్పకాలం, దీర్ఘకాలం అనే తేడా కూడా ఉండదు.

పై లక్షణాల వల్ల ఏకస్వామ్య సంస్థ తన వస్తువుకు ధర నిర్ణయించే అధికారం కలిగి యుంటుంది. అయితే ఏకస్వామ్య సంస్థ ధర, వస్తు పరిమాణాలలో ఏదో ఒకదానిని మాత్రమే నిర్ణయించగలదు. సంస్థ ధరను నిర్ణయిస్తే, ఉత్పత్తి పరిమాణాన్ని మార్కెటులోని కొనుగోలుదార్లకు విడిచివేయవలె. అలాగాక ఉత్పత్తి పరిమాణాన్నే సంస్థ నిర్ణయించటమనేది ఏకస్వామ్య సంస్థకు కూడా సాధ్యము కాదు.

**1. ఒకే ఉత్పత్తిదారుడు** : ఏకస్వామ్యము నందు ఒకే ఉత్పత్తిదారుడు లేదా అమ్మకందారుడు ఉంటాడు. ఇతడు సప్లయినంతటినీ అదుపు చేయును. ఏకస్వామ్యము ఒక వ్యక్తి కావచ్చు లేదా కంపెనీ కావచ్చు లేదా ప్రభుత్వము కావచ్చు. ఈ మార్కెట్ నందు పోటీ ఉండదు.

**2. దగ్గర ప్రత్యామ్నాయ వస్తువులు ఉండవు** : ఏకస్వామ్యమునందు వస్తువులకు సన్నిహిత ప్రత్యామ్నాయ వస్తువులు ఉండవు. ఇతర సంస్థలు ఏకస్వామ్యదారునిచే ఉత్పత్తి చేయబడిన వస్తువులకు దగ్గర ప్రత్యామ్నాయ వస్తువులను ఉత్పత్తి చేయవు.

**3. సంస్థ, పరిశ్రమ ఒకటే** : సంస్థకు, పరిశ్రమకు ఏకస్వామ్యమునందు తేడా ఉండదు. ఒకే ఉత్పత్తిదారుడు ఈ మార్కెట్‌నందు ఉండును. కనుక సంస్థ, పరిశ్రమ ఒకటే అవుతుంది.

**4. స్వేచ్ఛా ప్రవేశము లేదు** : ఏకస్వామ్యమునందు పరిపూర్ణపోటీ వలె స్వేచ్ఛా ప్రవేశము లేదు. ఇతర సంస్థలు మార్కెట్‌లోనికి ప్రవేశించి ఒకే రకమయిన వస్తువులను ఉత్పత్తి చేయుటకు స్వేచ్ఛ లేదు. అందువలన ఏకస్వామ్యమునందు సంస్థ స్వల్ప కాలములోను మరియు దీర్ఘ కాలములోను అధిక లాభములను పొందవచ్చును.

**5. ఉత్పత్తి లేదా ధర ఒకదానిపై మాత్రమే నియంత్రణ అధికారము ఉండును** : ఏకస్వామ్యదారుడు ఉత్పత్తిపై గాని లేదా ధరపై గాని ఈ రెండింటిలోను ఒకదానిపై మాత్రమే నియంత్రణ అధికారము కలిగిఉండును. ఏకస్వామ్యదారుడు ఈ రెండింటిని ఒకేసారి నియంత్రణ చేయలేడు.

**6. రాబడి రేఖలు క్రింది వైపుకు వాలి ఉండును** : ఉత్పత్తిని పెంచేకొలది ఏకస్వామ్యమునందు సగటు రాబడిరేఖ, ఉపాంత రాబడిరేఖ ఎడమ నుంచి కుడి వైపుకు క్రిందకు వాలిపోవును. ఏకస్వామ్యదారుడు అధికముగా వస్తువులను అమ్మదలచినా ధరను తగ్గించవలెను. ఇతడు తన వస్తువులకు అధికముగా ధరను నిర్ణయించదలచినా ఉత్పత్తిని తగ్గించవలెను.

**ఏకస్వామ్యంలో ధర నిర్ణయం లేక సమతౌల్యం :** ఏకస్వామ్య పరిస్థితిలో ఒకే ఒక ఉత్పాదక సంస్థ వస్తువు యొక్క ఉత్పత్తినంతా చేస్తుంది. కనుక పరిశ్రమ, సంస్థ రెండూ ఒకటే. అందువలన సంస్థ, పరిశ్రమలను వేరువేరుగా తెలుసుకోనవసరము లేదు. ఏకస్వామ్య ఉత్పత్తి సంస్థ ఎక్కువ పరిమాణంలో వస్తువును అమ్ముకోవాలంటే ధరను తగ్గించవలసి ఉంది. అందువల్ల ఏకస్వామ్య సంస్థ అమ్మే వస్తువుయొక్క డిమాండ్ రేఖ లేక సగటు రాబడి రేఖ (AR) ఎడమనుండి కుడికి క్రిందికి వాలుతుంది. అంటే ఏకస్వామ్యంలో సంస్థ ఎక్కువ పరిమాణంలో వస్తువును ఉత్పత్తి చేసి అమ్మినకొద్దీ సగటు రాబడి (AR) తగ్గుతుంది. అంతేగాక ఉపాంత రాబడి (MR), సగటు రాబడి (AR) కన్నా ఎల్లప్పుడు తక్కువగానే ఉంటుంది. ఈ కారణంగా ఏకస్వామ్య సంస్థ ఉపాంత రాబడి (MR) రేఖ, సగటు రాబడి (AR) రేఖకు దిగువలో ఎడమనుంచి కుడికి క్రిందికి వాలుతూ ఉంటుంది. దీన్నే క్రింది పట్టిక, రేఖాపటం విశదపరుస్తాయి.

**పట్టిక**

| వస్తు పరిమాణము | ధర | మొత్తం రాబడి | సగటు రాబడి AR | ఉపాంత రాబడి MR |
|---|---|---|---|---|
| 1 | 5-00 | 5 | 5-00 | 5 |
| 2 | 4-50 | 9 | 4-50 | 4 |
| 3 | 4-00 | 12 | 4-00 | 3 |
| 4 | 3-50 | 14 | 3-50 | 2 |




ఏకస్వామ్య సంస్థ సగటు వ్యయరేఖ (AC), పరిపూర్ణ పోటీలో వలెనే U-ఆకారంలోను, ఉపాంత వ్యయరేఖ (MC) హాకీ స్టిక్ (Hocky Stick) ఆకారంలోను ఉంటాయి.

ప్రతి ఉత్పాదక సంస్థవలెనే ఏకస్వామ్య సంస్థ కూడ ఎల్లప్పుడూ లాభాలను గరిష్టం చేసుకోటానికే ప్రయత్నిస్తుంది. ఏ ఉత్పత్తి పరిమాణం అట్టి గరిష్ట లాభాలను సమకూరుస్తుందో అంతవరకు ఉత్పత్తిని పెంచుతుంది. అంటే వస్తువు యొక్క అదనపు యూనిట్లకయ్యే వ్యయం (MC) కన్నా ఆ అదనపు యూనిట్లను అమ్మగా వచ్చే రాబడి (MR) అధికంగా ఉన్నంతవరకు ఉత్పత్తిని కొనసాగిస్తుంది. ఏ ఉత్పత్తి పరిమాణం దగ్గర ఉపాంతరాబడి, ఉపాంత వ్యయానికి సమానమవుతుందో (MC=MR) అక్కడ సంస్థ ఉత్పత్తిని నిలిపివేస్తుంది. అప్పుడు ఏకస్వామ్య ఉత్పత్తికి సంస్థకు గరిష్టలాభాలు (Maximum Profits) సమకూరుతాయి. ఈ విషయాన్నే క్రింది పట్టిక విశదీకరిస్తుంది.

**పట్టిక**

| ఉత్పత్తి పరిమాణం | ధర | మొత్తం రాబడి | ఉపాంత రాబడి MR | ఉపాంత వ్యయం MC | యూనిట్ లాభం | మొత్తం లాభం |
|---|---|---|---|---|---|---|
| 1 | 10 | 10 | 10 | 8 | 2 | 2 |
| 2 | 9 | 18 | 8 | 7 | 1 | 3 |
| 3 | 8 | 24 | 6 | 6 | -- | 3 |
| 4 | 7 | 28 | 4 | 6 | -2 | 1 |

పై పట్టికలో సంస్థ 3వ యూనిట్‌వద్ద గరిష్టలాభాలను పొందుతున్నది. కనుక 3వ యూనిట్‌వద్ద ఉత్పత్తిని నిలిపివేస్తుంది. అంటే ఏకస్వామ్య సంస్థయొక్క ఉపాంత వ్యయం, ఉపాంతరాబడి సమానమయినప్పుడు (MC=MR) ఉండే వస్తు పరిమాణాన్ని ఉత్పత్తిచేస్తూ గరిష్టలాభాలను పొందుతూ సమతౌల్యస్థితిలో వుంటుంది. దీన్నే క్రింది రేఖాపటంకూడా విశదీకరిస్తుంది :



పై పటంలో AR సగటు రాబడి లేక డిమాండ్, MR ఉపాంత రాబడి రేఖ AC సగటు వ్యయరేఖ, MC ఉపాంత వ్యయరేఖ.

సంస్థ OM పరిమాణంలో వస్తువును ఉత్పత్తిచేసి OM లేక OP ధరకు విక్రయించి గరిష్ట లాభాలను పొందుతుంది.

1. యూనిట్‌కు లాభం = సగటు రాబడి (AR)-సగటు వ్యయం (AC)

= AR-AC

= QM-RM = QR or PS

మొత్తం లాభం = యూనిట్ లాభం × ఉత్పత్తి పరిమాణం

= QR × CM లేక QR+RS

= PQRS దీర్ఘచతురస్రము

సంస్థ గడించే మొత్తము లాభాలను పటంలో గీతలు గీసిన PQRS దీర్ఘచతురస్రం సూచిస్తుంది. OM పరిమాణం కంటె ఉత్పత్తి పెంచినా, తగ్గించినా సంస్థ యొక్క లాభాలు గరిష్టంగా ఉండవు. కనుక ఏకస్వామ్య సంస్థ MC=MR వద్ద ఉండే ఉత్పత్తిని చేస్తూ సమతౌల్య స్థితిలో వుంటుంది. ఇప్పుడు వస్తువు ధర OP లేక QM నిర్ణయమవుతుంది.

ఏకస్వామ్యదారుడికి మార్కెట్‌లో పోటీ లేకపోయినను, అతడు తన యిష్టం వచ్చినట్లుగా దరను నిర్ణయించడానికి వీలులేదు. ఏకస్వామ్యదారుడు అధిక ధరను నిర్ణయిస్తే వినియోగదారులు ఆ వస్తువును కొనటాన్ని బహిష్కరించవచ్చు. ప్రభుత్వం జోక్యం కలిగించుకొని ధరలు పెరగకుండా చూస్తుంది. అదే వస్తువును విదేశాలనుంచి దిగుమతి చేసుకొనే ప్రమాదం కూడా ఉంది.

**ప్రశ్న 2) పరిపూర్ణపోటీ సంస్థ సమతౌల్యానికి, ఏకస్వామ్య సంస్థ సమతౌల్యానికి గల పోలికలు, భేదాలను వివరించండి.**

**లేదా**

**పరిపూర్ణమైన పోటీ, ఏకస్వామ్యాల సమతౌల్యాల మధ్య గల నిబంధనల విచక్షణ చేయుము.**

**లేదా**

**సంపూర్ణ పోటీలో సంస్థ సమతౌల్య పరిస్థితులకు, ఏకస్వామ్యములో సంస్థ సమతౌల్య పరిస్థితులకు గల పోలికలను, భేదములను తెలుపుము.**

**(Important)**

ఏకస్వామ్యం, పరిపూర్ణపోటీ రెండు పరిస్థితులలోను సంస్థ సమతౌల్యస్థితిలో ఉండటానికి ఉపాంతవ్యయం MC, ఉపాంత రాబడి MR సమానంగా వుండవలె.

MC=MR ఇది తప్ప మిగతా అన్ని విషయాలలో రెండు పరిస్థితులలో అనేక తేడాలున్నాయి. అవి

1) పరిపూర్ణమైన పోటీలో అమ్మకందార్లు, కొనుగోలుదార్లు హెచ్చుసంఖ్యలో వుండి ఒకేరకమైన (Homogeneous Product) వస్తువును అమ్ముతుంటారు. కనుక వస్తువు ధరను మొత్తం డిమాండు, మొత్తం సప్లయిలు కలిసి నిర్ణయిస్తాయి. ఇలా నిర్ణయింపబడిన ధరను ఏ ఒక్క అమ్మకందారుగాని, కొనుగోలుదారుగాని మార్చలేడు. అంటే పరిపూర్ణ పోటీలో ఒకే వస్తువుకు ఒకే సమయంలో మార్కెట్ అంతటా ఒకే ధర వుంటుంది. అమ్మకం పరిమాణం పెరిగినా, తగ్గినా ధర మాత్రం మారదు. కాబట్టి పరిపూర్ణ పోటీలో సగటు రాబడి (AR), ఉపాంత రాబడి (MR), ధర (Price) సమానంగా వుంటూ, స్థిరంగా కూడా వుంటాయి. కనుక AR, MR రేఖలు ఏకమై X- అక్షానికి సమాంతరంగా వుంటాయి. ధరలు AR=MR.

ఏకస్వామ్యంలో ఒకే సంస్థ వస్తురాశి ఉత్పత్తినంతా చేస్తుంది. కనుక ఏకస్వామ్య సంస్థ వస్తువు ధరను తగ్గిస్తే వస్తువును ఎక్కువ పరిమాణంలో అమ్ముకోగలుగుతుంది. అందువల్ల ఏకస్వామ్యంలో ఉత్పత్తి పరిమాణం పెరిగినకొద్దీ ధర లేక సగటు రాబడి తగ్గుతుంది. సగటు రాబడి (AR) కంటే ఉపాంత రాబడి (MR) మరీ తగ్గుతుంది. కనుక AR, MR రేఖలు ఎడమ నుంచి కుడికి క్రిందికి వాలుతూ వుంటాయి. MC రేఖ AR రేఖకు దిగువన ఉంటుంది

ధర =AR > MR

2) పరిపూర్ణమైన పోటీలో ఉపాంత వ్యయం MC, ఉపాంత రాబడి MRలు సమానంగా వున్నప్పుడే సంస్థ సమతౌల్యస్థితికి వస్తుంది. అంతేగాక ఉపాంత రాబడి MR, సగటు రాబడి AR లేక ధరకు సమానం గనుక ఉపాంతవ్యయం MC కూడా ధరకు సమానంగా వుంటుంది.

MC = MR మళ్ళీ MR = AR లేక ధర

కనుక MC = ధర

ఏకస్వామ్యంలో కూడా ఉపాంత వ్యయం MC, ఉపాంత రాబడి MRలు సమానంగా వున్నప్పుడే సంస్థ సమతౌల్య స్థితికి వస్తుంది. అయితే ఉపాంత రాబడి MR ఎప్పుడూ సగటు రాబడి AR కన్నా తక్కువగా వుంటుంది. కనుక ఉపాంతవ్యయం కూడ ఎప్పుడు ధరకన్నా తక్కువగానే ఉంటుంది. ఈ రెంటింటి మధ్య తేడాయే ఏకస్వామ్య సంస్థకు లాభం.

MC = MR కాని MR< AR లేక ధర

కనుక MC< ధర.

3) పరిపూర్ణపోటీలో సంస్థ దీర్ఘకాలంలో సగటు వ్యయం కనిష్టంగా ఉన్నప్పుడు సమతౌల్య స్థితికి వస్తుంది.




ఏకస్వామ్యంలో సంస్థ సగటు వ్యయం ఇంకా కనిష్ట స్థాయికి చేరకముందే సమతౌల్య స్థితికి వస్తుంది.

4) పరిపూర్ణ పోటీలో ఉపాంత వ్యయరేఖ MC, ఉపాంత రాబడిరేఖ MR ను క్రిందినుంచి ఖండించినప్పుడే (పెరుగుతూ ఖండించినప్పుడే) సంస్థ సమతౌల్య స్థితికి వస్తుంది. పరిపూర్ణపోటీలో సంస్థయొక్క ఉపాంత రాబడిరేఖ X-అక్షానికి సమాంతరంగా ఉంటుంది. కనుక దానిని క్రిందినుంచి ఖండించాలంటే ఉపాంతవ్యయం MC పెరుగుతున్నప్పుడే సాధ్యమౌతుంది. అంటే పరిపూర్ణమైన పోటీలో ఉపాంత వ్యయం పెరుగుతున్నప్పుడే సంస్థ సమతౌల్య స్థితికి వస్తుంది.




ఏకస్వామ్యంలో అలాకాక ఉపాంత రాబడిరేఖ ఎడమనుంచి కుడికి వాలుతూ ఉంటుంది. కనుక దానిని ఖండించవలెనంటే ఉపాంత వ్యయరేఖ తప్పనిసరిగా పెరుగుతూ వుండనక్కర్లేదు. ఉపాంత వ్యయరేఖ పెరుగుతూ ఉండిగాని, తగ్గుతూ వుండిగాని, సమంగా వుండిగాని ఉపాంత రాబడి రేఖ ఖండించగలదు. అంటే ఏకస్వామ్యంలో సంస్థ ఉపాంతవ్యయం తగ్గుతున్నా, పెరుగుతున్నా లేక సమంగా వున్నా కూడా సమతౌల్య స్థితికి రాగలవు.




పై పటంలో ఉపాంత వ్యయం పెరుగుతూ ఏకస్వామ్య సంస్థ సమతౌల్య స్థితిలో వుంది.




పై పటంలో ఉపాంత వ్యయం సమంగా వుంటూ ఏకస్వామ్య సంస్థ సమతౌల్య స్థితిలో వుంది.




పై పటంలో ఉపాంత వ్యయం తగ్గుతూ ఏకస్వామ్య సంస్థ సమతౌల్య స్థితిలో వుంది.

5) పరిపూర్ణపోటీలో స్వల్పకాలంలో సంస్థలు అధిక లాభాలను ఆర్జిస్తుంటే కొత్త సంస్థలు పరిశ్రమలో ప్రవేశించి ఉత్పత్తి పరిమాణాన్ని పెంచటం వలన దీర్ఘకాలంలో పరిపూర్ణ పోటీలోని సంస్థ సామాన్య లాభాలను మాత్రమే ఆర్జిస్తుంది.

అలాకాక ఏకస్వామ్య సంస్థ స్వల్పకాలంలో అధిక లాభాలను ఆర్జిస్తున్నా దీర్ఘకాలంలో కూడా అధిక లాభాలను ఆర్జిస్తూనే వుంటుంది. దీనికి కారణం కొత్త సంస్థలు పరిశ్రమలో ప్రవేశించే అవకాశం ఏకస్వామ్యంలో వుండదు

6) ఒకే వ్యయం-రాబడి పరిస్థితిలో పరిపూర్ణమైన పోటీలోకంటే ఏకస్వామ్యంలో వస్తువుధర హెచ్చుగాను, వస్తువు పరిమాణం తక్కువగాను వుంటుంది. దీనికి కారణం ఏకస్వామ్య సంస్థ ధరను పెంచడానికి వస్తువు పరిమాణాన్ని తగ్గించవలసి వుంటుంది.




పై పటంలో MC-సప్లయిరేఖ, AR డిమాండ్ రేఖ. ఈ రెండింటి పరస్పర ప్రచలిత బిందువు ధరను నిర్ణయిస్తుంది. అంటే పరిపూర్ణ పోటీలో OL వస్తురాశి ఉత్పత్తి చేయబడి PL లేక OS ధరకు విక్రయించబడుతుంది. అదే వ్యయ రాబడి పరిస్థితులలో ఏకస్వామ్య సంస్థ OM వస్తురాశిని ఉత్పత్తి చేసి NM లేక OP ధరకు విక్రయిస్తుంది. కనుక పరిపూర్ణపోటీలో కంటే ఏకస్వామ్యంలో ధర హెచ్చుగా వుంటుంది.

**ప్రశ్న 3) "ధర విచక్షణ" అనగానేమి ? అది ఏ పరిస్థితులలో సాధ్యపడును ? లాభదాయకముగా వుండును.**

**లేదా**

**ఏకస్వామ్య పరిస్థితిలో ధర విచక్షణను వివరించండి.**

**లేదా**

**ధర విచక్షణ ఎప్పుడు సాధ్యమవుతుంది? లాభసాటిగా వుంటుంది? ధర విచక్షణ పరిస్థితుల్లో ఉత్పత్తి, ధర నిర్ణయమును వివరింపుము.**

**లేదా**

**విచక్షణాత్మక ధరల విధానమనగా నేమి? సమతౌల్య ఉత్పత్తి మరియు ధరలను ఎలా నిర్ణయిస్తారు.**

**లేదా**

**విచక్షణాత్మక ఏకస్వామ్యం అనగానేమి? ఈ మార్కెట్‌లో ధర, ఉత్పత్తి ఏ విధంగా నిర్ణయించబడుతుందో తెల్పుము.**

**(Important)**

**జవాబు : ధర విచక్షణ :** ఏకస్వామ్యంలో వస్తువుకు మార్కెట్ అంతటా ఒకే ధర వుండవలెనని లేదు. వివిధ ధరలు లాభదాయకంగా వుంటే ఏకస్వామ్య సంస్థ వస్తువుకు వివిధ ధరలను నిర్ణయించవచ్చు. కొన్ని పరిస్థితులలో ఒకే వస్తువును వివిధ వినియోగదారులకు, వివిధ ధరలకు అమ్మవచ్చును. ఈ విధంగా ఒకే వస్తువును వివిధ ధరల వద్ద అమ్మటాన్ని "ధర విచక్షణ" (Price Discrimination) అంటారు. ఇలాంటి ఏకస్వామ్యాన్ని "విచక్షణాత్మక ఏకస్వామ్యం" (Discriminating Monopoly) అంటారు.

**"శ్రీమతి జోన్ రాబిన్‌సన్" ధర విచక్షణను కింది విధంగా నిర్వచించినది : "ఏకస్వామ్యదారుడు ఒకే యాజమాన్యము క్రింద ఉత్పత్తి అయినటువంటి ఒకే వస్తువును వివిధ కొనుగోలుదారులకు వివిధ ధరలకు అమ్మటాన్ని ధర విచక్షణ"** అంటారు.

**ధర విచక్షణ రకాలు (Kinds of Price Discrimination) :** ధర విచక్షణ అనేక రకాలుగా వుంటుంది. అవి :

1. వ్యక్తిగత ధర విచక్షణ (Personal Price Discrimination)
2. ప్రాంతీయ ధర విచక్షణ (Local Price Discrimination)
3. ఉపయోగరీత్యా ధర విచక్షణ (Trade of Discrimination)

**1) వ్యక్తిగత విచక్షణ :** ఒకే వస్తువును వివిధ వ్యక్తులకు వివిధ ధరల వద్ద అమ్మటాన్ని వ్యక్తిగత ధర విచక్షణ అంటారు. ఉదాహరణకు, తక్కువ ఆదాయ వర్గాలకు ఒక రేటుకు, ఎక్కువ ఆదాయ వర్గాలకు మరొక రేటుకు వస్తువును విక్రయించటం.

**2) ప్రాంతీయ ధర విచక్షణ :** ఒకే వస్తువుకు వివిధ ప్రాంతాలలో వివిధ ధరలను నిర్ణయించటాన్ని "ప్రాంతీయ ధర విచక్షణ" అంటారు. ఉదాహరణకు, ఒక వస్తువుకు ఆంధ్రప్రదేశ్‌లో ఒక ధర, మధ్యప్రదేశ్‌లో మరో ధర నిర్ణయించటం.

**3) ఉపయోగరీత్యా ధర విచక్షణ :** ఒకే వస్తువును వివిధ ఉపయోగాలకు వివిధ ధరల వద్ద అమ్మటాన్ని "ఉపయోగరీత్యా ధర విచక్షణ" అంటారు. ఉదాహరణకు, విద్యుచ్ఛక్తిని వ్యవసాయానికి ఒక రేటుకు, పరిశ్రమలకు ఒక రేటుకు, ఇళ్ళలో వాడకానికి మరొక రేటుకు విక్రయించటం.

**ధర విచక్షణకు అవసరమైన నిబంధనలు (Conditions for Price Discrimination) :** ఏకస్వామ్య సంస్థ ధర విచక్షణ చేయటానికి క్రింది పరిస్థితులుండ వలెను :

**1) ధరల గురించిన పూర్తి సమాచారం లేనప్పుడు :** వినియోగదార్లకు వస్తువును ఎవరికి ఏ ప్రాంతంలో ఎలా అమ్ముతున్నది తెలియనప్పుడు ధర విచక్షణ సాధ్యపడుతుంది. ముఖ్యంగా వస్తువులను పోస్టుద్వారా విక్రయించేటప్పుడు వినియోగదార్లకు ఎవరు ఎంత ధర చెల్లిస్తున్నది తెలియదు.

**2) వస్తువు రవాణా ఖర్చు ఎక్కువగా ఉన్నప్పుడు :** వస్తువును మార్కెట్‌లో ఒక ప్రాంతం నుంచి మరొక ప్రాంతానికి రవాణా చేయటానికయ్యే ఖర్చులు ఎక్కువగా వున్నప్పుడు ధర విచక్షణ సాధ్యపడుతుంది. ఒక ప్రాంతంలో వస్తువు ధర తక్కువగా వుండని తెలిసినప్పటికి మరొక ప్రాంతానికి తెప్పించుకుంటే రవాణా ఖర్చులు కూడా కలసి యిక్కడ మార్కెట్‌లో వున్న ధర కంటే ఎక్కువయ్యేటట్లయితే వస్తువు ఒక ప్రాంతంనుంచి మరొక ప్రాంతానికి రవాణా అవదు. అప్పుడు ధర విచక్షణ చేయవచ్చు.

**3) వస్తువు యొక్క డిమాండ్ వ్యాకోచత్వంలో తేడా వున్నప్పుడు :** వస్తువుకు ఒక ప్రాంతంలో డిమాండు వ్యాకోచంగాను, మరో ప్రాంతములో డిమాండు అవ్యాకోచంగాను ఉన్నప్పుడు ధర విచక్షణ సాధ్యపడుతుంది. వ్యాకోచ డిమాండు ఉన్నచోట తక్కువ ధరను, అవ్యాకోచ డిమాండు ఉన్నచోట హెచ్చు ధరను నిర్ణయించవచ్చు.

**4) వస్తువు స్వభావాన్ని బట్టి :** ముఖ్యంగా సేవల విషయంలో ధర విచక్షణ సాధ్యపడుతుంది. డాక్టరు కొందరు రోగులవద్ద తక్కువ ఫీజు, మరికొందరి వద్ద ఎక్కువ ఫీజు తీసుకోవచ్చు. ఇలాంటి సేవల విషయంలో తక్కువ ధరకు సేవను కొని ఎక్కువ ధరకు అమ్మడం సాధ్యపడదు.

**5) రెండు మార్కెట్లలో వస్తువును అమ్ముతున్నప్పుడు :** వస్తువును స్వదేశంలోను, విదేశాలలోను అమ్ముతున్నప్పుడు ధర విచక్షణ సాధ్యపడుతుంది. ఉదాహరణకు, చక్కెరకు మనదేశంలో ఎక్కువ ధర, దాన్నే విదేశాలకు ఎగుమతి చేసి తక్కువ ధరకు మనం అమ్ముతున్నాము. దీన్ని 'మూల్య విహీన విక్రయం' (Dumping) అంటారు.

**ధర విచక్షణ :** ధర విచక్షణ చేయటంలో ఏకస్వామ్య సంస్థ ఉద్దేశ్యం లాభాలను అత్యధికం చేసుకోవడమే. **వస్తువు యొక్క డిమాండు వ్యాకోచత్వంలోని తేడానుబట్టి ధర విచక్షణ చేయబడుతుంది.** వస్తువుకు డిమాండు వ్యాకోచత్వం ఎక్కువగా (>1) వున్న మార్కెట్టులో తక్కువ ధరను, డిమాండు వ్యాకోచత్వం తక్కువగా (<1) వున్న మార్కెట్‌లో ఎక్కువ ధరను నిర్ణయించటం వల్ల ఏకస్వామ్య సంస్థ అత్యధిక లాభాలను గడిస్తుంది. దీన్నే క్రింది ఉదాహరణ విశదీకరిస్తుంది.

ఒక ఏకస్వామ్య సంస్థ ఉత్పత్తి చేసే వస్తువుకు వివిధ మార్కెట్లలో డిమాండు వ్యాకోచత్వం వివిధ రకాలుగా వుందనుకొందాం. మార్కెట్ A లో డిమాండు వ్యాకోచత్వం తక్కువగాను, మార్కెట్లో B లో డిమాండు వ్యాకోచత్వం ఎక్కువగాను వుందని ఊహిద్దాము.

ఇప్పుడు మార్కెట్ A లో డిమాండు వ్యాకోచత్వం తక్కువగా వున్నందున ధరలో వచ్చే మార్పు వల్ల వస్తువు డిమాండులో చెప్పుకోదగిన మార్పురాదు. అంటే ధరను హెచ్చుగా నిర్ణయించినప్పటికి డిమాండు పెద్దగా తగ్గదు. కనుక ఏకస్వామ్య సంస్థ ఇలాంటి మార్కెట్లో హెచ్చు ధరను నిర్ణయిస్తుంది.

మార్కెట్ లో Bలో డిమాండు వ్యాకోచత్వం ఎక్కువగా వున్నందున, ధరలో వచ్చే స్వల్ప మార్పుకు కూడా డిమాండులో గణనీయమైన మార్పు వస్తుంది. అంటే ధరను స్వల్పంగా తగ్గిస్తే డిమాండు బాగా పెరుగుతుంది. కనుక ఏకస్వామ్య సంస్థ ఇలాంటి మార్కెట్లో తక్కువ ధరను నిర్ణయిస్తుంది.

ఏకస్వామ్య సంస్థ మొత్తంగా సమతౌల్య స్థితిలో వుండటానికి, రెండు మార్కెట్లలోను ఉపాంతవ్యయం MC, ఉపాంతరాబడి MRకి సమానంగా (MC = MR) వుండవలె. అయితే ఉపాంతవ్యయం MC సంస్థకు సంబంధించింది కనుక రెండు మార్కెట్లలోను ఒకటిగానే వుంటుంది. అంటే సంస్థ యొక్క ఉపాంతవ్యయమే మార్కెట్ A లో ఉపాంతవ్యయం, అదే మార్కెట్ B లో కూడా. కాని ఉపాంతరాబడి రెండు మార్కెట్లలోను ఒకటిగా వుండదు. ఇందుకు కారణం రెండు మార్కెట్లలోను ధరలలో తేడా వుండటమే. అందువల్ల తక్కువ ఉపాంత రాబడి వున్న మార్కెట్ నుంచి, ఎక్కువ ఉపాంతరాబడి వున్న మార్కెట్టుకు వస్తువు తరలించబడుతుంది. ఫలితంగా కొంతకాలానికి రెండు మార్కెట్లలోను ఉపాంత రాబడులు సమానమౌతాయి. ఏకస్వామ్య సంస్థ సమతౌల్య స్థితిని క్రింది రేఖాపటం విశదీకరిస్తుంది.



1) పటం A డిమాండ్ వ్యాకోచత్వం తక్కువగా వున్న మార్కెట్టును సూచిస్తున్నది పటం B డిమాండ్ వ్యాకోచత్వం ఎక్కువగా వున్న మార్కెట్టును సూచిస్తున్నది. పటం C మొత్తం మార్కెట్టు లేక సంస్థ యొక్క వ్యయ, రాబడి పరిస్థితులను తెలియజేస్తున్నది.

పటం C లో CMR ఉమ్మడి ఉపాంతరాబడి రేఖ. ఇది $MR^1$, $MR^{11}$ లను కలుపగా వచ్చింది. MC సంస్థ యొక్క ఉపాంత వ్యయరేఖ. ఉపాంతరాబడి, ఉపాంతవ్యయం సమానమైనచోట సంస్థ ఉత్పత్తిని నిలిపివేస్తుంది. ఇప్పుడు ఉత్పత్తి OM. ఈ ఉత్పత్తిని రెండు మార్కెట్లలోను ఉపాంతవ్యయం వాటి వాటి ఉపాంత రాబడులకు సమంగా వుండే విధంగా పంపిణీ చేయవలె. కనుక మార్కెట్టు A లో $OM^1$ ఉత్పత్తిని $OP^1$ ధరకు, మార్కెట్టు B లో $OM^{11}$ ఉత్పత్తిని $OP^{11}$ ధరకు విక్రయిస్తాడు. అప్పుడే అతడు గరిష్ట లాభాలను ఆర్జించగలుగుతాడు.

పై పటంనుంచి మరో విషయము కూడా గ్రహించవచ్చు. డిమాండ్ వ్యాకోచత్వం తక్కువగా వున్న మార్కెట్టు A లో ధర ఎక్కువగాను, డిమాండ్ వ్యాకోచత్వం ఎక్కువగా వున్న మార్కెట్టు B లో ధర తక్కువగాను వున్నట్లు చూడవచ్చు. కనుక విచక్షణాత్మక ఏకస్వామ్యదారు సమతౌల్య స్థితిలో వుండాలంటే క్రింది రెండు నిబంధనలు తృప్తిపరచబడవలె. అవి :

1) $MR^1 MR^{11}$ అంటే రెండు మార్కెట్లలోను ఉపాంతరాబడి సమానంగా వుండటము.
2) $MR^1 = MR^{11} = MC$ ఈ రెండు తిరిగి సంస్థ యొక్క ఉపాంత వ్యయానికి సమానంగా వుండటము.

పై రెండు నిబంధనలు తృప్తిపరచబడినప్పుడు విచక్షణ (Discrimination) ను పాటించే ఏకస్వామ్య సంస్థ గరిష్ట లాభాలను ఆర్జిస్తూ సమతౌల్య స్థితిలో వుండగలదు.

**ధర విచక్షణ ఫలితాలు (Effects of Price Discrimination) :** ధర విచక్షణ వలన క్రింది ఫలితాలు సంభవిస్తాయి :

1. సాధారణ ఏకస్వామ్యం (Simple Monopoly)లో కంటె విచక్షణాత్మక ఏకస్వామ్యం (Discrimination Monopoly) లో ఉత్పత్తి ఎక్కువగా వుంటుంది.
2. విచక్షణాత్మక ఏకస్వామ్యంలో సంస్థ లాభాలు సాధారణ ఏకస్వామ్యంలో కంటే ఎక్కువగా వుంటాయి.
3. ధర విచక్షణ వలన పేద, ధనిక వర్గాల ప్రజలందరికి వస్తువు లభిస్తుంది. ఉదాహరణకు, సినిమాలో రూ. 5, 4, 3, 2, 1 తరగతులుండటం వలన పేదవారు, ధనికులు ఇద్దరు కూడా సినిమాను చూడగలుగుతున్నారు.
4. ధర విచక్షణ వలన వస్తువుకు డిమాండు పెరిగిన ఫలితంగా ఉత్పత్తి పెరుగుతుంది. సంస్థ పెరుగుతున్న ప్రతిఫలాల (Increasing Returns Stage) దశలో వుంటే ఉత్పత్తి వ్యయం కూడా తగ్గుతుంది.
5. ధర విచక్షణ వలన వివిధ ఉపయోగాలమధ్య వనరుల పంపిణీ అనుచితంగా వుంటుంది.

6. ధర విచక్షణ లేకున్న యెడల కొన్ని ప్రజా ఉపయోగ సేవలు లభ్యముకావు. శ్రీమతి జోన్ రాబిన్‌సన్ చెప్పినట్లు "ధర విచక్షణ లేకుంటే రైల్వేలు నిర్మించబడేవి కావు, గ్రామాలలో వైద్యులు వైద్యశాలలను పెట్టేవారు కారు".

ధర విచక్షణ లాభదాయకమా ? అభిలషణీయమా ? అనే ప్రశ్న వస్తుంది. పైన తెల్పిన ఫలితాలను దృష్టిలో వుంచుకొని వాటి వల్ల కలిగే లాభనష్టాలను బేరీజు వేసుకొని అభిలషణీయమవునో కాదో నిర్ణయించుకోవలె.

**ప్రశ్న 4) "ద్విదాధిపత్యం" అనగానేమి ? ద్విదాధిపత్యంలో ధర నిర్ణయమెలా జరుగుతుంది.**

**లేదా**

**ద్విస్వామ్యమనగానేమి? ద్విస్వామ్య సంస్థలు సమతౌల్య దశను ఎట్లు సాధించును.**

**జవాబు:** ద్విదాధిపత్య లేక ద్విస్వామ్యం (Duopoly) సాధారణంగా వాస్తవిక మార్కెట్‌లో కనపడదు. కాని దీనిని విశ్లేషణ ద్వారా తెలుసుకున్న విషయాలను పరిమితస్వామ్యానికి కొద్ది మార్పులతో వర్తింపచేయవచ్చు. కనుక పరిమితస్వామ్య విశ్లేషణకు ఇది ఒక మెట్టుగా వుపయోగపడుతుంది.

ద్విదాధిపత్యంలో రెండు ఉత్పాదక సంస్థలుంటాయి. ఇవి ఉత్పత్తి చేసే వస్తువు ఒకటిగాగాని (Identical), కొద్ది తేడాతోగాని వుండవచ్చు. రెండు సంస్థల ఉత్పత్తి వ్యయాలు ఒకటే కావచ్చు లేక కొద్ది భేదం వుండవచ్చు. అదే విధంగా వ్యవస్థాపకుల సామర్థ్యంలో కూడా తేడా వుండవచ్చు. ఈ విధంగా ద్విదాధిపత్యంలో వైవిధ్యం గల ప్రమేయాలు చేయడానికి అవకాశం వుంది. ఈ చేసే ప్రమేయాలను బట్టి నిర్ణయాలు మారుతుంటాయి. కనుక పరిపూర్ణపోటీ, ఏకస్వామ్యాలలోలాగ ద్విదాధిపత్యంలో ఒకే నిర్ణయానికి రావడానికి వీలులేదు.

**ద్విదాధిపత్యంలో ధర నిర్ణయం :** ద్విదాధిపత్యంలో ఇద్దరు ఉత్పత్తిదారులు లేక అమ్మకందార్లు వుంటారు. కనుక ఒకరు చేసే నిర్ణయాల ప్రభావం రెండవవారి మీద వుంటుంది. ఉదాహరణకు, A సంస్థ చేసిన ఉత్పత్తి, ధర నిర్ణయంవల్ల B సంస్థ ప్రభావితమౌతుంది. ప్రతి చర్యగా B సంస్థ చేసే నిర్ణయాల ప్రభావం A సంస్థ మీద వుంటుంది. దీని వల్ల A సంస్థ తన నిర్ణయాలలో అవసరమైన మార్పులు చేసుకోవలసి వస్తుంది. ఈ మార్పుల ప్రభావం వల్ల తిరిగి B సంస్థ తన నిర్ణయాలలో సర్దుబాట్లు చేసుకోవలసి వస్తుంది. ఈ విధంగా రెండు నిర్ణయాలు పరస్పరం (Inter dependent) గా ఆధారపడి వుంటాయి.

ద్వైదాధిపత్యం రెండు విధాలుగా వుండవచ్చు. అవి :

i) రెండు సంస్థలు ఒకే వస్తువు (Identical product) ను తయారు చేస్తున్నప్పుడు.

ii) రెండు సంస్థలు తయారుచేసే వస్తువులలో భిన్నత్వం (Product differentiation) వున్నప్పుడు.

1) రెండు సంస్థలు ఒకే వస్తువుని తయారుచేస్తూ, సామర్ధ్యం, వ్యయాలు ఒకే మాదిరిగా వుంటే ఏ సంస్థ డిమాండు రేఖను రెండో సంస్థ నిర్ణయించిన ధర తెలియకుండా గీయటానికి వీలులేదు. రెండు సంస్థలు వస్తువును ఒకే ధరకు విక్రయిస్తుంటే మొత్తం డిమాండును రెండు సంస్థలు సమంగా పంచుకుంటాయని చెప్పవచ్చు. రెండు సంస్థలు తయారుచేసే వస్తువు ఒకటే (Identical) గనుక ఏ ఒక్క సంస్థ అయినా ఎక్కువ ధరను నిర్ణయిస్తే మార్కెటును కోల్పోతుంది. కనుక రెండూ ఒకే ధరను నిర్ణయించి తీరవలె. ఇలా ఒకే ధరను నిర్ణయించటానికి రెండు సంస్థలూ ఒక అంగీకారానికి రావచ్చు, లేక మార్కెటును విభజించుకొని ఎవరి మార్కెటులో వారు అమ్ముకోవచ్చు. ఇలాంటి పరిస్థితిలో ఒక్కొక్క సంస్థ ఏకస్వామ్య సంస్థ మాదిరిగానే వస్తువు ధరను నిర్ణయిస్తుంది. అప్పుడే రెండు సంస్థలు అత్యధిక లాభాలను పొందగలుగుతాయి.

ఇలాంటి అంగీకారం లేక రెండు సంస్థలూ పోటీపడుతుంటే ఒక సంస్థ కంటే రెండో సంస్థ ఎక్కువ అమ్ముకోవాలనే ఉద్దేశంతో ధరను తగ్గించుతాయి. ఇలాంటి పోటీల వల్ల ధర బాగా తగ్గి లాభాలు 'సామాన్య లాభాల' (normal profits) కంటే కూడా తగ్గిపోవచ్చు. ఈ పరిస్థితి కేవలం స్వల్పకాలం మాత్రమే కొనసాగుతుంది దీర్ఘకాలంలో రెండు సంస్థలు సామాన్య లాభాలనే ఆర్జిస్తాయి. అలా సామాన్య లాభాన్ని పొందలేని సంస్థ వుంటే పరిశ్రమను వదలివెళ్ళుతుంది. అంటే ఈ పరిస్థితిలో ద్వైదాధిపత్యం పరిపూర్ణపోటీకి ఇంచుమించు సమానంగా వుంటుంది. రెండు సంస్థల ఉత్పత్తి వ్యయాలలో తేడా వుంటే, ఈ పోటీ ఎక్కువ ఉత్పత్తి వ్యయాలున్న సంస్థను మార్కెట్‌నుంచి తరిమివేయటానికి దారితీస్తుంది ఫలితంగా ఒకే ఒక సంస్థ మార్కెట్‌లో మిగిలి అది ఏకస్వామ్య సంస్థగా రూపొందుతుంది.

2. రెండు సంస్థలు తయారుచేసే వస్తువులో భిన్నత్వమున్నప్పుడు ఒక సంస్థ ధర నిర్ణయ ప్రభావం రెండో సంస్థపై వుండదు. ఏ సంస్థ యొక్క మార్కెట్ ఆ సంస్థకే ఉంటుంది. ఒక సంస్థను చూసి రెండో సంస్థ భయపడనవసరంలేదు. అదే విధంగా ఒక సంస్థ ధరను తగ్గించినప్పటికి రెండో సంస్థ దాని వస్తువు యొక్క ధరను తగ్గించనవసరంలేదు. నాణ్యమైన వస్తువులను ఉత్పత్తి చేస్తున్న సంస్థ ఎక్కువ ధరను నిర్ణయించి అధిక లాభాలను ఆర్జించగలదు.

**ఆగస్టిన్ కోర్నాట్ - ద్వైదాధిపత్యం నమూనా :** ఆగస్టిన్ కోర్నాట్ (Augustin Cournot) అనే ఫ్రెంచి అర్థశాస్త్రవేత్త 1938లో ప్రచురించిన "Mathematical Principles of the Theory of Wealth" అనే గ్రంథములో ఒక ద్వైదాధిపత్యపు నమూనా రూపొందించాడు. అతని విశ్లేషణలో క్రింది ప్రమేయాలున్నాయి.

i) రెండు సంస్థలు ఒకే వస్తువు (Identical product) ను ఉత్పత్తి చేస్తుంటాయి.
ii) వాటి రెంటికి ఉత్పత్తి వ్యయాలు లేవు
iii) రెండూ అత్యధిక లాభాల నార్జించటానికి ప్రయత్నం చేస్తాయి.
iv) ఆ రెండు సంస్థల మధ్య అంగీకారం వుండదు.
v) ప్రతి సంస్థ రెండో సంస్థ యొక్క ఉత్పత్తి స్థిరంగా వుంటుందని ఊహించి, తన ఉత్పత్తిని నిర్ణయిస్తుంది.
vi) మార్కెట్ శక్తులవల్ల ధరలు మారుతుంటాయి.

కోర్నాట్ ఉదాహరణలో A, B అను రెండు ఖనిజపు నీటిని ఉత్పత్తి చేసే సంస్థలున్నాయి. వీటి డిమాండ్ రేఖ ఎడమనుంచి కుడికి క్రిందికి వాలుతుంది. వీటి మొత్తం ఉత్పత్తి వ్యయం సున్న కాబట్టి ఉపాంత వ్యయం కూడా సున్న. ఉపాంత వ్యయం, ఉపాంత రాబడి సమానమైన (MC = MR) చోట ఉండే ఉత్పత్తి దగ్గర సంస్థకు అత్యధిక లాభాలు సమకూరుతాయి. అయితే ఉపాంత వ్యయం సున్నా కాబట్టి ఉపాంత రాబడికూడ సున్నాగా వుండవలె. డిమాండ్ వ్యాకోచత్వం ఒకటికి సమానమైన బిందువువద్ద ఉపాంత రాబడి సున్నా అవుతుంది. క్రింది పటంలో డిమాండ్ రేఖ మధ్య బిందువు వద్ద వ్యాకోచత్వం ఒకటికి సమానంగా వుంటుంది. ఆ ఉత్పత్తి వద్ద ఉపాంత రాబడి రేఖ MR, X-అక్షాన్ని ఖండిస్తుంది. ఆ బిందువు వద్ద ఉత్పత్తి మొత్తం డిమాండ్‌లో సగం వుంటుంది.




పటంలో మొదటి సంస్థ OA ఉత్పత్తిని చేసి OP ధరకు విక్రయిస్తూ OAFP కి సమానమైన గరిష్ట లాభాలను పొందుతూ వుంటుంది. ఇక OB ఉత్పత్తిలో OA ఉత్పత్తి పోగా మిగిలింది (OB = OA = AB) B సంస్థ ఉత్పత్తి చేసి విక్రయించుకోవలె. ఇప్పుడు FB B సంస్థకు సగటు రాబడి రేఖ. దీనికి అత్యధిక లాభాలను ఇచ్చే ఉత్పత్తి AB లో సగం వుంటుంది. అంటే B సంస్థ AL పరిమాణం ఉత్పత్తి చేసి $OP_1$ ధరకు విక్రయించి $OLWP_1$కి సమానమైన లాభాలు పొందుతుంది.

ఇప్పుడు మార్కెట్‌లో ఉత్పత్తి పెరగటంతో ధర $OP_1$కు తగ్గుతుంది. A సంస్థ లాభాలు తగ్గుతాయి. A సంస్థ ఉత్పత్తిని తగ్గిస్తుంది. దీని కనుగుణ్యంగా B సంస్థ కూడా ఉత్పత్తి పరిమాణాన్ని మారుస్తుంది. ఈ విధంగా రెండు సంస్థలు సమానమైన ఉత్పత్తి చేసేవరకు కొనసాగుతుంది. అప్పుడు రెండు సంస్థలు సమతౌల్య స్థితిని చేరుకుంటాయి. కనుక మొత్తం OB ఉత్పత్తిలో 2/3 వంతు ఉత్పత్తిని (చెరి 1/3 వంతు చొప్పున) రెండు సంస్థలు కలిసి చేస్తాయి. అప్పుడు అవి రెండు సమతౌల్య స్థితిలో వుంటాయి.

రెండు సంస్థల మధ్య అంగీకారం వుంటే మొత్తం ఉత్పత్తిని చెరి సగం (1/2 వంతున) చేసి రెండు సంస్థలు సమతౌల్య స్థితిలో వుంటాయి.

# SHORT NOTES

## ప్రశ్న 1) ఏకస్వామ్యంలో రకాలు (Kinds of Monopoly).

**జవాబు** : ఏకస్వామ్యం నాలుగు రకాలుగా వుంటుంది. అవి :

1) చట్టబద్ధమైన ఏకస్వామ్యాలు

2) సహజమైన ఏకస్వామ్యాలు

3) సాంఘిక లేక ప్రభుత్వ ఏకస్వామ్యాలు

4) కృత్రిమ ఏకస్వామ్యాలు

**1) చట్టబద్ధమైన ఏకస్వామ్యాలు (Legal Monopolies) :** ప్రభుత్వ చట్టా (Acts) ల ద్వారా కొన్ని ఏకస్వామ్యాలు ఏర్పడతాయి. కాపీరైటు (Copy right), పేటెంట్ హక్కు (Patent right), ట్రేడ్ మార్కు (Trade mark) మొదలయినవి. ప్రభుత్వ చట్టాల ద్వారా కొన్ని సంస్థలకు ఏకస్వామ్యహక్కులను కలిగిస్తాయి. ఆ హక్కును పొందిన సంస్థలు తయారుచేసే వస్తువులను అదే మాదిరిగాగాని, అదే పేరుతోగాని మరి ఏ యితర సంస్థ ఉత్పత్తి చేయరాదు. ఎవరైనా చేస్తే ప్రభుత్వం వారిని శిక్షిస్తుంది. ఉదాహరణకు అమృతాంజనం, మూడు మామిడికాయల అగ్గిపెట్టెలు మొదలయినవి.

**2) సహజమైన ఏకస్వామ్యాలు (Natural Monopolies) :** ఏదైనా ఒక వస్తువు లభ్యత ఒక ప్రాంతానికో, ఒక దేశానికో పరిమితమైతే ఆ వస్తువు ఉత్పత్తిలో ఆ ప్రాంతం లేక దేశం ఏకస్వామ్యమౌతుంది. ఉదాహరణకు ఆఫ్రికా దేశం వజ్రాల ఉత్పత్తిలో ఏకస్వామ్యాన్ని కలిగి వుంది.

3) **సాంఘిక లేక ప్రభుత్వ ఏకస్వామ్యాలు (Social or Government Monopolies) :** కొన్ని వస్తువుల ఉత్పత్తి సంఘమంతటికీ ప్రాతినిధ్యం వహించే సంస్థల అధీనంలో వుండటం శ్రేయస్కరం. అలాంటి పరిశ్రమలు స్థానిక సంస్థలు లేక ప్రభుత్వ ఆధీనంలో వుంటాయి. ఇవి మినహా ఏ సంస్థలు ఈ వస్తువులను ఉత్పత్తి చేయటానికి వీలుండదు. ఉదాహరణకు పట్టణాలలో మంచినీటి సరఫరా, రేడియో ప్రసారం, తంతితపాల మొదలయిన పరిశ్రమలు సాంఘిక లేదా ప్రభుత్వ ఏకస్వామ్యాలు.

4) **కృత్రిమ ఏకస్వామ్యాలు (Artificial Monopolies) :** పరిశ్రమలోని ఉత్పత్తి సంస్థలు వాటంతట అవే పోటీని రద్దు చేసుకొని వస్తువు ధరపై అదుపును సంపాదించుకోవాలన్న వాంఛతో సంలీనమౌతాయి. వీటినే "పారిశ్రామిక సంలీనాలు" అంటారు. ఇవి కావాలని కోరి పోటీని రద్దు చేసుకొని ఏర్పడిన ఏకస్వామ్యాలు కనుక వీటిని "కృత్రిమ ఏకస్వామ్యాలు" అంటారు. మన దేశంలో సిమెంటు పరిశ్రమ ఇలాంటి ఏకస్వామ్యంగా ఇదివరలో యేర్పడినది.

**ప్రశ్న 2) ఏకస్వామ్యంపై గల పరిమితులు (Limitations on Monopoly):**

**జవాబు :** ఒకే ఒక సంస్థ సన్నిహిత ప్రత్యామ్నాయాలు లేని వస్తువును ఉత్పత్తి చేస్తుంటే దాన్ని ఏకస్వామ్య సంస్థ అంటారు. ఏకస్వామ్య సంస్థకు పోటీ అంటూ వుండదు. అవి ధరను విపరీతంగా పెంచితే దానికీ ప్రతిఘటన వుంటుంది. కనుక ఏకస్వామ్యాలు క్రింది పరిమితులకు లోబడి పనిచేస్తాయి. అవి :

1) **ప్రత్యామ్నాయ వస్తువులు :** మరీ హెచ్చు ధరను నిర్ణయిస్తే ప్రత్యామ్నాయ వస్తువులను తయారుచేసే సంస్థలు బయలుదేరవచ్చు.

2) **దిగుమతులు :** ఇతర దేశాల నుండి అలాంటి వస్తువును దిగుమతి చేసుకోవటానికి ప్రయత్నాలు జరుగవచ్చు.

3) **బహిష్కరణ :** కొనుగోలుదార్లు అందరూ కట్టుకట్టి ఆ వస్తువును కొనటం మానివేయవచ్చు.

4) **ప్రభుత్వ జోక్యము :** ప్రభుత్వం జోక్యం చేసుకొనే వస్తువు ధరను ప్రభుత్వమే నిర్ణయించటం గాని, లేక పరిశ్రమను జాతీయం చేయటంగాని చేయవచ్చు.

పై పరిమితులవల్ల ఏకస్వామ్య సంస్థ కూడా కొన్ని హద్దుల మధ్యనే తన అధికారాన్ని చెలాయిస్తుంది.

**ప్రశ్న 3) విచక్షణాపూర్వకమైన ఏకస్వామ్యము (Discriminating Monopoly).**

**లేదా**

**విచక్షణాత్మక ఏకస్వామ్యము (Discriminating Monopoly).**

3వ ప్రశ్నకిచ్చిన జవాబు చూడండి.

**ప్రశ్న 4) ధర విచక్షణకు కావలసిన పరిస్థితులు (Conditions of Price Discrimination).**

3వ ప్రశ్నకిచ్చిన జవాబులో ధర విచక్షణకు కావలసిన పరిస్థితులు చూడండి.

**ప్రశ్న 5) ద్విదాధిపత్యం (Duopoly).**

4వ ప్రశ్నకిచ్చిన జవాబు చూడండి.

**ప్రశ్న 6) ధర విచక్షణ (Price Discrimination).**

3వ ప్రశ్నకు ఇచ్చిన జవాబు చూడండి.

**ప్రశ్న 7) ఏకస్వామ్యం (Monopoly).**

1వ ప్రశ్నకిచ్చిన జవాబు చూడండి.



అధ్యాయము 10

# ఏకస్వామ్యపోటీ, పరిమితస్వామ్య పరిస్థితులలో ధర నిర్ణయం

**ప్రశ్న 1) "ఏకస్వామ్యపోటీ" అనగానేమి? ఏకస్వామ్య పోటీలో ధర నిర్ణయమెలా జరుగుతుందో నిర్ణయించండి**

**లేదా**

**ఏకస్వామ్యపోటీ స్వభావాన్ని విశ్లేషించి, స్వల్పకాలిక మరియు దీర్ఘకాలిక సమతౌల్యాలకు గల నిబంధనలను వివరింపుము.**

**లేదా**

**ఏకస్వామ్యపోటీలో ధర, ఉత్పత్తి ఎట్లు నిర్ణయించబడునో వివరింపుము.**

**లేదా**

**గుత్తాధిపత్య పోటీలోని ముఖ్య లక్షణములను పేర్కొనుము. ఒక సంస్థ యొక్క సంతులనమును (Equilibrium) వివరింపుము.**

**(Very Important)**

జవాబు : ఏకస్వామ్య పోటీ : సంపూర్ణ పోటీగాని, ఏకస్వామ్యంగాని వాస్తవంగా వుండటం చాలా అరుదు. వాస్తవ ప్రపంచంలో మార్కెట్ ఈ రెంటికి మధ్యస్తంగా వుంటుందని కొంతమంది అర్థికవేత్తల అభిప్రాయం. అందువల్ల వాస్తవ ప్రపంచంలో కనబడే మార్కెట్ పరిస్థితిని వర్ణించే సిద్ధాంతాన్ని "ఏకస్వామ్య పోటీ" (Monopolistic Competition) అనే పేరుతో E.H. ఛాంబర్లిన్ (E.H. Chamberlin)మొట్టమొదటగా ప్రతిపాదించాడు.

ఛాంబర్లిన్ ఏకస్వామ్య పోటీ సిద్ధాంతాన్ని ఈ క్రింది వాస్తవిక విషయాల ఆధారంగా ప్రతిపాదించాడు :

i) సాధారణంగా సన్నిహిత ప్రత్యామ్నాయాలు (Close Substitutes) లేని వస్తువులంటూ వుండవు. కనుక ఏకస్వామ్యాలుండటం వాస్తవంలో చాలా అరుదు.

ii) పూర్తిగా ఏకజాతీయాలైన వస్తువులుండటం కూడా చాలా అరుదే. కనుక పరిపూర్ణ పోటీ వుండటం కూడా వాస్తవంలో చాలా అరుదు.

**ఏకస్వామ్య పోటీ లక్షణాలు (Features of Monopolistic Competition) :**

**1. అధిక సంఖ్యలో ఉత్పత్తి సంస్థలు :** ఏకస్వామ్య పోటీ యొక్క ముఖ్య లక్షణము అధిక సంఖ్యలో ఉత్పత్తి సంస్థలు ఉండుట. ఇందు మొత్తం ఉత్పత్తిలో ఒక సంస్థ యొక్క ఉత్పత్తి చాలా స్వల్పముగా ఉండును. అనేక సంస్థలు ఉండుట వలన ప్రతి ఒక సంస్థ ఇతర సంస్థలతో సంబంధం లేకుండా స్వతంత్రముగా వ్యవహరించును.

**2. వస్తు భిన్నత్వము :** ఏకస్వామ్య మార్కెట్ యొక్క, మరియొక ముఖ్య లక్షణము వస్తు భిన్నత్వము ఉండుట. ఇందు వస్తువులు పరిపూర్ణపోటీ మార్కెట్ వలె ఏక జాతీయముగా ఉండవు. ఏకస్వామ్యములో వలె వస్తువులు పూర్తిగా వేరై ఉండవు. ఏకస్వామ్యపోటీ యందు వస్తువులు, దగ్గర ప్రత్యామ్నాయములుగా ఉండును గాని పరిపూర్ణపోటీ ప్రత్యామ్నాయములుగా ఉండవు. ఉదాహరణకు కాల్గేట్ టూత్‌పేస్ట్, ప్రామిస్ టూత్‌పేస్ట్ మొదలగునవి. ఏకస్వామ్యపోటీలో వస్తు భిన్నత్వము అనేక విధములుగా చూపవచ్చును. ఖాతాదార్లకు ప్రత్యేకమయిన సౌకర్యములను కల్పించుట ద్వారా, వస్తువుల నాణ్యతను మార్చుట ద్వారా, వ్యాపార ప్రకటనల ద్వారా వస్తు భిన్నత్వమును చూపవచ్చును.

**3. స్వేచ్ఛా ప్రవేశము మరియు నిష్క్రమణ :** ఏకస్వామ్యపోటీ మార్కెట్‌లో కొత్త సంస్థలు మార్కెట్‌లోనికి ప్రవేశించడానికి, ఉన్న సంస్థలు మార్కెట్ నుంచి నిష్క్రమించడానికి ఎటువంటి అటంకాలు ఉండవు. ఈ మార్కెట్‌లో అనేక సంస్థలు ఉండును. కనుక వస్తూత్పత్తిలో స్వేచ్ఛా ప్రవేశము మరియు స్వేచ్ఛా నిష్క్రమణ ఉండును.

**4. మిగులు శక్తి (Excess Capacity) :** ఏకస్వామ్యపోటీ యందు మిగులు శక్తి ఉండును. ఇందు సగటు వ్యయరేఖ తగ్గుతున్న దశలో ఉన్నపుడు ఉత్పత్తిని నిలుపు చేయును. దీర్ఘకాలిక సగటు వ్యయరేఖ కనిష్ఠ దశ చేరేవరకు ఉత్పత్తి చేయబడదు. కనుక ఏకస్వామ్యపోటీలో ఉత్పత్తి తక్కువగా ఉండును. ఏకస్వామ్యపోటీలో సగటు వ్యయము తగ్గుచున్నపుడు పొందే సమతౌల్య ఉత్పత్తికి, సగటు వ్యయము కనిష్ఠముగా ఉండే ఉత్పత్తికి మధ్య గల తేడాయే మిగులు శక్తిగా పరిగణింపవచ్చును.

**5. అమ్మకపు వ్యయాలు :** సాధారణంగా వ్యాపార ప్రకటనలపై చేసే వ్యయాన్ని అమ్మకపు వ్యయాలు అని అందురు. ఛాంబర్‌లిన్ ప్రకారము డిమాండ్‌రేఖను కుడివైపుకు జరిపే వ్యయాలే అమ్మకపు వ్యయాలు. అందువలన అమ్మకపు వ్యయాలు వస్తువులకు ఉండే డిమాండ్ రేఖను పెంచును. సాధారణంగా ఉత్పత్తిదారుడు అదనపు

రాబడి శూన్యము అయ్యేంతవరకు అమ్మకపు వ్యయాలపై ఖర్చు పెడతాడు. ప్రతి సంస్థ తమ వస్తువులకు డిమాండ్‌ను పెంచుటకు అమ్మకపు వ్యయాన్ని చేయును అమ్మకపు వ్యయాల ద్వారా వస్తువుల యొక్క నాణ్యతను ప్రచారము చేయవచ్చును. వ్యాపార ప్రకటనలు మరియు ఇతర ప్రచార సాధనాల ద్వారా వినియోగదారుల అభిరుచులను మార్చవచ్చును. వాస్తవముగా అమ్మకపు వ్యయాలు వినియోగదారుల శ్రేయస్సును పెంచవు.

**ఏకస్వామ్య పోటీలో సంస్థ సమతౌల్యం :** ఏకస్వామ్య పోటీలో ప్రతి సంస్థ ఏకస్వామ్య శక్తి (Monopoly Power) ని కలిగి వుంటుంది. అందువల్ల ప్రతి సంస్థ తనకు తానుగా వస్తూత్పత్తి, ధర నిర్ణయం చేస్తుంది. ప్రతి సంస్థ గరిష్ట లాభాలను పొందటానికే ప్రయత్నిస్తుంది. కనుక ఏకస్వామ్య పోటీలో సంస్థ సమతౌల్యం, ఏకస్వామ్యంలో సంస్థ సమతౌల్యం మాదిరిగానే వుంటుంది. అంటే ప్రతి సంస్థ ఉపాంత వ్యయం MC, ఉపాంత రాబడి MR లు సమానమయ్యే (MC = MR) స్థాయి వరకు ఉత్పత్తి చేస్తుంది. అప్పుడే సంస్థ గరిష్ట లాభాలను పొందుతూ సమతౌల్య స్థితిలో వుంటుంది.

ఏకస్వామ్యంలో వలెనే ఏకస్వామ్య పోటీలో సగటు రాబడి AR, ఉపాంత రాబడి MR రేఖలు, ఎడమనుంచి కుడికి క్రిందికి వాలుతాయి. MR రేఖ AR రేఖకు దిగువలో వుంటుంది. AR రేఖయే డిమాండ్ రేఖ కూడాను. ఏకస్వామ్య పోటీలో వ్యయ రేఖలు AC, MC కూడా ఏకస్వామ్యంలో వ్యయ రేఖల వలెనే వుంటాయి. ఏకస్వామ్య పోటీలో స్వల్పకాలం, దీర్ఘకాలం అనే వ్యత్యాసం వుంటుంది. కనుక సంస్థ సమతౌల్యాన్ని ఈ రెండు కాలవ్యవధులలో పరిశీలించవలసి వుంటుంది.

**స్వల్పకాలిక సమతౌల్యం :** ఏకస్వామ్య పోటీలో అన్ని సంస్థల ధరలు ఒకే స్థాయిలో వుండవు. ఒక్కొక్క సంస్థ ఉత్పత్తి చేసే వస్తువు యొక్క డిమాండ్ వ్యాకోచత్వం ఒక్కొక్క విధంగా వుంటుంది. అంతేగాక ఉత్పత్తి వ్యయాలు కూడా సంస్థ సంస్థకూ మార్పుగా వుంటాయి. పేరు గడించిన సంస్థలు (Reputed Firms) ఉత్పత్తి చేసే వస్తువుల ధరలు ఎక్కువగా వుంటాయి. ఇప్పుడిప్పుడే ఉత్పత్తి ప్రారంభించిన సంస్థలు బాగా తక్కువ ధరలు నిర్ణయిస్తాయి. ఈ కారణంగా స్వల్ప కాలవ్యవధిలో ఏకస్వామ్య పోటీలో కొన్ని సంస్థలు అధిక లాభాల (AR>AC) ను, కొన్ని సంస్థలు సామాన్య లాభాలను (AR=AC). మరికొన్ని నష్టాల (AR<AC) ను పొందుతూ వుండవచ్చు. క్రింది రేఖాపటములు ఏకస్వామ్య పోటీలో స్వల్పకాలిక సమతౌల్యాన్ని విశదీకరిస్తాయి.




పటము - A
అధిక నష్టాలు ఆర్జిస్తున్న సంస్థ




పటము - B
సామాన్య లాభాలను ఆర్జిస్తున్న సంస్థ




పటము - C, అధిక నష్టాలు ఆర్జిస్తున్న సంస్థ

పై పటములలో SMC - స్వల్పకాలిక ఉపాంత వ్యయరేఖ, SAC- స్వల్పకాలిక సగటు వ్యయరేఖ. OM ఉత్పత్తి పరిమాణం. OP ధర.

పటం Aలో ధర, సగటు వ్యయంకన్నా తక్కువగా వుంది. కనుక సంస్థ $PRNP^1$ కు సమానమైన నష్టాలను (Losses) ను పొందుతుంటుంది.

పటం B లో ధర, సగటు వ్యయం సమానంగా వున్నాయి. కనుక సంస్థ సామాన్య లాభాల (Normal Profits) ను మాత్రమే ఆర్జిస్తున్నది.

పటం C లో ధర సగటు వ్యయం కన్నా హెచ్చుగా వుంది అంటే సంస్థ $PRNP^1$ కు సమానమైన అధిక లాభాల (Abnormal Profits) ను ఆర్జిస్తుంది.

కనుక ఏకస్వామ్య పోటీలో స్వల్పకాలంలో సంస్థ అధిక లాభాలను గాని, సామాన్య లాభాలనుగాని, నష్టాలనుగాని పొందుతూ వుండవచ్చు. అయితే ఈ పరిస్థితి ఎల్లకాలం కొనసాగదు. దీర్ఘకాలంలో అన్ని సంస్థలు సామాన్య లాభాలను మాత్రమే ఆర్జిస్తాయి.

దీర్ఘకాలిక సమతౌల్యం : స్వల్పకాలంలో సంస్థలు అధిక లాభాలను ఆర్జిస్తుంటే కొత్త సంస్థలు ప్రారంభమై ఉత్పత్తిని పెంచుతాయి. దీనివల్ల సంస్థల డిమాండ్ పరిస్థితులలో మార్పులు వస్తాయి. ఫలితంగా అధిక లాభాలు అదృశ్యమై అన్ని సంస్థలకు సామాన్య లాభాలు మాత్రమే వస్తాయి. స్వల్పకాలంలో వ్యయ పరిస్థితులు అనుకూలంగాలేని సంస్థలు నష్టాలను పొందుతూ వుండవచ్చు. అవి వ్యయ పరిస్థితులను సరిచేసుకోలేకపోతే ఎక్కువకాలం నష్టాలతో కొనసాగవు. దీర్ఘకాలంలో అవి ఉత్పత్తిని నిలిపివేసి నిష్క్రమిస్తాయి. కనుక దీర్ఘకాలంలో అన్ని సంస్థలు కేవలం సామాన్య లాభాలను మాత్రమే ఆర్జిస్తూ సమతౌల్య స్థితిలో వుంటాయి. దీన్నే క్రింది రేఖాపటం విశదీకరిస్తుంది.

పటంలో LMC - దీర్ఘకాలిక ఉపాంత వ్యయరేఖ. LAC – దీర్ఘకాలిక సగటు వ్యయరేఖ. సంస్థ OMపరిమాణం ఉత్పత్తి చేసి OPధరకు విక్రయిస్తుంది. ధర, సగటు

ఉత్పత్తి వ్యయం సమానంగా వున్నందున, సంస్థ సామాన్య లాభాలను మాత్రమే ఆర్జిస్తూ సమతౌల్య స్థితిలో వుంటుంది.




కనుక దీర్ఘకాలంలో ఏకస్వామ్య పోటీలో అన్ని సంస్థలు సామాన్య లాభాలను మాత్రమే ఆర్జిస్తూ సమతౌల్య స్థితిలో వుంటాయి.

**ప్రశ్న 2) ఏకస్వామ్యపోటీలోపరిశ్రమ సమతౌల్యమును వివరింపుము.**

**లేదా**

**సామూహికసమతౌల్యమును (Group Equilibrium) అనగానేమి? అది యే విధంగా నిర్ణయింపబడుతుంది.**

**లేదా**

**పరిపూర్ణపోటీలో పరిశ్రమ సమతౌల్యానికి, ఏకస్వామ్యపోటీలో సామూహిక సమతౌల్యానికి గల తేడాను తెల్పుము.**

**జవాబు :** ఏకస్వామ్య పోటీలో అన్ని సంస్థలు ఉత్పత్తి చేసే వస్తువుల్లు ఏకజాతీయం (Homogeneous) కాదు. వాటి మధ్య వస్తు విభేదం (Product Differentiation) వుంటుంది. కనుక ఏకస్వామ్య పోటీలోని సంస్థలన్నింటిని చేర్చి పరిశ్రమ అనటానికి వీలులేదు. వాటిని సంస్థల సముదాయం (Group of Firms) అని మాత్రమే చెప్పాలి.

"అయితే అన్ని సంస్థలు ఉత్పత్తి చేసే వస్తువులు సన్నిహిత ప్రత్యామ్నాయాలు (Close Substitutes), అంటే అవి ఒకే కోర్కెను తీరుస్తాయి. ఉదాహరణకు ఫ్యాన్లు (Fans) అనేక రకాలున్నాయి. క్రాంప్టన్, రాలిస్, బజాజ్, ఉషా, ఓరియంట్

మొదలయినవాటిని ఒక్కొక్కదాన్ని ఒక్కొక్క సంస్థ ఉత్పత్తి చేస్తున్నది. ఇవన్నీ ఒకే కోర్కెను తీరుస్తాయి. కనుక వీటన్నింటి ఉత్పత్తిని కలిపితే ఫాన్ల మొత్తం సప్లయి తెలుస్తుంది. అదే విధంగా మార్కెట్‌లో వీటన్నింటి అమ్మకాలను కలిపితే ఫాన్ల మొత్తం డిమాండు తెలుస్తుంది. ఫాన్ల మొత్తం సప్లయి వాటి మొత్తం డిమాండుకన్నా ఎక్కువగా వుంటే మార్కెట్‌లో ఫాన్ల ధరలు తగ్గుతాయి. అప్పుడు ప్రతి సంస్థ తన ఉత్పత్తిని, ధరను మార్చుకోవలసి వస్తుంది. అలాకాక వాటి మొత్తం సప్లయి, మొత్తం డిమాండు కన్నా తక్కువగా వుంటే వాటి ధరలు పెరుగుతాయి. అప్పుడు కూడా ప్రతి సంస్థ తన ఉత్పత్తిని, ధరను మార్చుకోవలసి వస్తుంది. ఈ విధంగా ఫాన్ల మొత్తం డిమాండు, మొత్తం సప్లయిలు సమానమయ్యేవరకు ఉత్పత్తిని మార్చుకోవటం కొనసాగుతూ వుంటుంది.

**స్వల్పకాల సమతౌల్యం :** స్వల్పకాలంలో మొత్తం డిమాండు, మొత్తం సప్లయిలు సమానమైనప్పుడు ఏకస్వామ్య పోటీలో సంస్థల సమూహం సమతౌల్యంలో వుంటుంది. అయితే ఈ స్వల్పకాలంలో కొన్ని సంస్థలు అధిక లాభాలను ఆర్జిస్తుంటే మరికొన్ని కేవలం సామాన్య లాభాలను మాత్రమే ఆర్జిస్తుండవచ్చు. ఉత్పత్తి వ్యయాలు అనుకూలంగాలేని సంస్థలు కొన్ని నష్టాలను భరిస్తూ వుండవచ్చు కూడ. అయినప్పటికి మార్కెట్‌లో మొత్తం డిమాండు మొత్తం సప్లయిలు సమానంగా వుండవచ్చు.

**దీర్ఘకాల సమతౌల్యం :** అయితే దీర్ఘకాలంలో మటుకు పై పరిస్థితి కొనసాగదు. ఏకస్వామ్య పోటీలో కొత్త సంస్థలు ఉత్పత్తిని ప్రారంభించటానికి, నష్టాలొస్తున్న సంస్థలు ఉత్పత్తిని నిలిపివేయటానికి గాని అవకాశం వుంటుంది. కనుక సంస్థలు అధిక లాభాల నార్జిస్తుంటే కొత్త సంస్థలు ఏర్పడి మరొక సన్నిహిత ప్రత్యామ్నాయ వస్తువు నొకదాన్ని ఉత్పత్తి చేస్తుంది. ఫలితంగా మార్కెట్‌లో మొత్తం సప్లయి పెరుగుతుంది. సంస్థలు వాటి ఉత్పత్తుల ధరలను తగ్గించవలసి వస్తుంది. అధిక లాభాలు అదృశ్యమయ్యేంతవరకు ధరలు తగ్గుతాయి. అదే విధంగా నష్టాలు వస్తుంటే కొన్ని సంస్థలు ఉత్పత్తిని నిలిపివేస్తాయి. అప్పుడు మొత్తం సప్లయి తగ్గుతుంది. ఫలితంగా ధరలు పెరిగి నష్టాలు పోతాయి. ఈ విధంగా దీర్ఘకాలంలో ఏకస్వామ్య పోటీలోని సంస్థలన్ని సామాన్యలాభాల (Normal Profits) ను మాత్రమే ఆర్జించగలుగుతాయి. అంటే ప్రతి సంస్థకు అది ఉత్పత్తి చేసే వస్తువు ధర దాని సగటు వ్యయానికి సమానంగా వుంటుంది (AR = AC). ఆ స్థాయి వరకు ప్రతి సంస్థ ఉత్పత్తి చేస్తుంది. ఈ విధంగా అన్ని సంస్థలు చేసిన ఉత్పత్తి మొత్తం డిమాండుకు సమానమైనప్పుడు ఏకస్వామ్య పోటీలో సంస్థల సముదాయం సమతౌల్యస్థితిలో వుంటుంది. దీన్నే సామూహిక సమతౌల్యం (Group Equilibrium) అని కూడా అంటారు.

**పరిపూర్ణ పోటీలో పరిశ్రమ సముదాయానికి, ఏకస్వామ్య పోటీలో సంస్థల సముదాయానికి తేడా :** పరిపూర్ణ పోటీలో సంస్థలన్నీ కలసి పరిశ్రమ (Industry) అవుతుంది. కాని ఏకస్వామ్య పోటీలో సంస్థలన్నీ కలసి సముదాయం (Group of

Firms)గా ఏర్పడతాయి. ఈ రెండింటి సమతౌల్యంలో తేడా వుంది. పరిపూర్ణ పోటీలో పరిశ్రమ సమతౌల్యంలో వున్నప్పుడు ధర ప్రతి సంస్థ కనీస సగటు వ్యయానికి (Minimum Average Cost) సమానంగా వుంటుంది. కాని ఏకస్వామ్య పోటీలో సంస్థల సముదాయం సమతౌల్యంలో వున్నప్పుడు ప్రతి సంస్థ నిర్ణయించిన ధర ఆ సంస్థ యొక్క సగటు వ్యయానికి సమానంగానే వుంటుంది. అయితే సగటు వ్యయం కనీసస్థాయిలో వుండదు. సగటు వ్యయం యింకా కనీస స్థాయిని చేరకముందే ఏకస్వామ్య పోటీలో సంస్థలు ఉత్పత్తిని నిలిపివేస్తాయి. ఎందుకంటే సగటు వ్యయం కనీసస్థాయి చేరేవరకు ఉత్పత్తిని కొనసాగిస్తే లాభాలు తగ్గవచ్చు. కనుక పరిపూర్ణ పోటీలోను, ఏకస్వామ్య పోటీలోను ధర, సగటు వ్యయం సమానమైనప్పుడే సమతౌల్యస్థితి ఏర్పడుతుంది. కాని ఉత్పత్తి పరిమాణంలో మటుకు తేడాలుంటాయి. పరిపూర్ణ పోటీలో పరిశ్రమ సమతౌల్యంలో ఉన్నప్పుడు ఉత్పత్తి ఎక్కువగా వుంటుంది.

**ప్రశ్న 3) అమ్మకం వ్యయాలు (Selling Costs) అంటే ఏమిటి ? ఏకస్వామ్య పోటీలో సంస్థ సమతౌల్యాన్ని అవి ఏ విధంగా ప్రభావితం చేస్తాయి.**

**లేదా**

**అమ్మకపు వ్యయాలనగానేమి ? ఇవి సంస్థ సగటు ఆదాయ రేఖ వ్యాకోచత్వాన్ని దీర్ఘకాలంలో ఏ విధంగా ప్రభావితం చేస్తాయి.**

**లేదా**

**ఏకస్వామ్య పోటీలో ప్రకటన వ్యయాల ప్రాముఖ్యమును తెలుపుము.**

**(Very Important)**

**జవాబు: అమ్మకం వ్యయాలు (Selling Costs) :** ప్రకటనలు, ప్రచారాలపై (Advertisement and Publicity) చేసే వ్యయాలను అమ్మకం వ్యయాలంటారు ఒక సంస్థ వినియోగదార్లచేత ఇతర వస్తువులకు బదులుగా తన వస్తువునే కొనేటట్లు చేసేందుకై చేసే వ్యయాలు అమ్మకం వ్యయాలవుతాయి. అంటే ఒక సంస్థ తన వస్తువు యొక్క డిమాండును పెంచుకోడానికి చేసే వ్యయాలే అమ్మకపు వ్యయాలు. డిమాండు రేఖ స్వరూపాన్ని, ఉనికిని మార్చేందుకు చేసే వ్యయాలు అమ్మకం వ్యయాలని ఛాంబర్లిన్ నిర్వచించాడు.

పరిపూర్ణ పోటీ పరిస్థితులలో అమ్మకపు వ్యయాలుండవు, పరిపూర్ణ పోటీలో సంస్థలన్నీ ఒకే రకమైన వస్తువు (Identical Product) ను ఉత్పత్తి చేస్తుంటాయి. వినియోగదార్లకు వస్తువు నాణ్యతను గురించిన, ధరను గురించిన పూర్తి సమాచారం వుంటుంది. కనుక వస్తువును గురించిగాని, ధరను గురించిగాని ఏ సంస్థ ప్రత్యేకించి

వినియోగదార్లకు తెలియచేయనవసరంలేదు. అందువల్ల అమ్మకం వ్యయాలంటూ ఏమీ వుండవు. మార్కెట్టులో వున్న ధరను బట్టి ఉత్పత్తిని నిర్ణయించుకోవటమే సంస్థ చేయవలసిందల్లా.

అదే విధంగా ఏకస్వామ్యంలో కూడా అమ్మకం వ్యయాలంటూ ప్రత్యేకించి ఏమీ వుండవు, సన్నిహిత ప్రత్యామ్నాయాలుగాని, పోటీ సంస్థలు గాని వుండవు. కనుక తన వస్తువును గురించి ప్రచారం చేయవలసిన అవసరం లేదు. ఆ వస్తువు కావలసిన వారు తప్పనిసరిగా ఆ సంస్థ నుంచి కొనుక్కోవలసిందే. అందువల్ల ఏకస్వామ్యంలో కూడా అమ్మకం వ్యయాల ఆవశ్యకత లేదు.

కాని ఏకస్వామ్య పోటీలో అలాకాదు. ఇందులో వస్తు విభేదం (Product Differentiation) వుంటుంది. అంటే ప్రతి సంస్థ ఉత్పత్తి చేసే వస్తువు ఇతర సంస్థలు ఉత్పత్తి చేసే వాటికన్నా భిన్నంగా (differs) వుంటుంది. నాణ్యత, ప్యాకింగు, ధర మొదలయినవాటి విషయంలో ఒక సంస్థ ఉత్పత్తికి మరో సంస్థ ఉత్పత్తికి చెప్పుకోదగిన వ్యత్యాసం వుంటుంది. అందువల్ల ప్రతి సంస్థ తన వస్తువును గురించి వినియోగదార్లకు వివరించవలసిన అవసరం ఎంతైనా వుంది. ఇందుకోసం ప్రకటనలు ప్రచారం చేయవలె. అంతేగాక వినియోగదార్లను ఆకర్షించి తన అమ్మకాన్ని పెంచుకోవటానికి కూడా ప్రకటనలు, ప్రచారాలు అవసరమౌతాయి. కనుక ఏకస్వామ్యపోటీలో అమ్మకపు వ్యయాలు ఉండక తప్పదు. ఈ విధంగా అపరిపూర్ణ పోటీలో లేక ఏకస్వామ్యపోటీలో ఉత్పత్తి సంస్థలు తమ తమ అమ్మకాలను నిలబెట్టుకోవడానికి, పెంచుకోవడానికి అమ్మకపు వ్యయాలు చేస్తాయి.

**డిమాండ్‌పై అమ్మకం వ్యయాల ప్రభావం :**

i) కొన్ని సంస్థలు వాటి అమ్మకాన్ని పెంచుకోవడానికి ఒక్కొక్కప్పుడు ధరను తగ్గిస్తాయి. ఈ విషయాన్ని వినియోగదార్లకు ప్రచారం, ప్రకటనల ద్వారా తెలియజేస్తాయి. అలా ధర తగ్గించిన వస్తువుకు డిమాండు పెరుగుతుంది. అంటే వస్తువు యొక్క డిమాండ్ వ్యాకోచత్వం అమ్మకం వ్యయాలద్వారా పెరుగుతుంది.

ii) ప్రతి సంస్థ ఉత్పత్తి చేసే వస్తువు ఇతర సంస్థలు ఉత్పత్తి చేసే వస్తువు కన్నా భిన్నంగా వుంటుంది. కొన్ని సంస్థల వస్తువులు ఎక్కువ నాణ్యత కలిగి వుంటాయి. ఈ విషయాన్ని వినియోగదార్లకు తెలియజేయాలి. ప్రచారం ప్రకటనల ద్వారా ఈ విషయం వినియోగదార్లకు తెలియజేయబడుతుంది. దీని వల్ల వస్తువుకు డిమాండు పెరుగుతుంది. ఫలితంగా డిమాండు రేఖ కుడి ప్రక్కకు జరుగుతుంది. అంటే అదే ధర వద్ద ఎక్కువ అమ్మకం జరుగుతుందన్నమాట. దీన్నే "డిమాండ్ రేఖ ఉనికి మారటం" అంటారు.

iii) ప్రచారం, ప్రకటనలు, బహుమతులు మొదలయినవి కొనుగోలుదారుల అభిరుచులనే మార్చగలవు. పదేపదే ప్రచారం చేయటంద్వారాను, బహుమతుల

దీనివల్ల సుదీర్ఘ ప్రాంతంలో వుండే సంస్థ ఉత్పత్తి చేసిన వస్తువులకు డిమాండు ఏర్పడుతుంది. ఉదాహరణకు, కలకత్తాలో ఉత్పత్తి చేయబడిన చెప్పులకు విజయవాడలోను, విజయవాడలో ఉత్పత్తి చేయబడిన చెప్పులకు కలకత్తాలోను కొనుగోలుదార్లు ఏర్పడతారు. అంటే విజయవాడ సంస్థ కలకత్తాలోను, కలకత్తాలోని సంస్థ విజయవాడలోను మార్కెట్‌ను సృష్టించుకుంటుంది. ఫలితంగా అనవసరమైన రవాణా ఛార్జీలు అవుతాయి. ఈ ఛార్జీలు ధరలో కలపబడి వినియోగదారునిపైన పడతాయి.

**4) ప్రత్యేకీకరణ ఆదాలుండకపోవటం :** ఉత్పత్తిని పెంచితే, ధర తగ్గి లాభాలు తగ్గుతాయనే భయంతో ఏకస్వామ్య పోటీలో సంస్థలు ఉత్పత్తిని పరిమితం చేస్తాయి. దీనివల్ల ఉత్పత్తి పెద్ద తరహాలో వుండకపోవచ్చు. అందువల్ల పెద్ద తరహా ఉత్పత్తిలో ఉండే ఆదాలను సంస్థలు పొందలేవు.

**5) ప్రచార వ్యయాలు :** ఏకస్వామ్య పోటీలో సంస్థలు ప్రచారం మీద పెద్ద మొత్తాలు ఖర్చు చేస్తాయి. ప్రచారం చేయటంలో ఏ సంస్థ మరో సంస్థకు తీసిపోదు ఈ విధంగా అన్ని సంస్థలు పోటీపడి ప్రచార వ్యయాలన్ని పెంచుకుంటూ పోతాయి. ఈ వ్యయం అంతా ధరలో కలిసి వినియోగదారుడు భరించవలసి వస్తుంది.

**6) అసమర్థ సంస్థలు కొనసాగటం :** పరిపూర్ణ పోటీలో అసమర్థ సంస్థలకు తావు లేదు. అవి ఉత్పత్తిని నిలిపివేసి పరిశ్రమను వదలి వెళ్ళవలసిందే. కాని ఏకస్వామ్య పోటీ లేక అపరిపూర్ణ పోటీలో అసమర్థ సంస్థలు కూడా ఉత్పత్తిని చేస్తూ కొనసాగే అవకాశం ఉంది. వాటి వస్తువులను వినియోగదార్లు అభిమానించి కొంటూ వుండడమే దీనికి కారణం.

**7) ఉపాంత వ్యయంకన్న ధర ఎక్కువ :** పరిపూర్ణ పోటీలో ధర ఉపాంత వ్యయానికి సమానంగా ఉంటుంది (AR=MC). కాని ఏకస్వామ్య పోటీలో ధర లేక (AR) కంటే ఉపాంత రాబడి (MR) తక్కువగా ఉంటుంది. ఉపాంత వ్యయం (MC), ఉపాంత రాబడి (MR) సమానంగా వుంటాయి. అంటే ధర ఉపాంత వ్యయంకన్నా ఎక్కువగా వుంటుందన్నమాట. ఇలా వుండటం వల్ల వినియోగదార్లు నష్టపోతారు.

**8) ప్రమాణీకరణ వుండదు :** ఏకస్వామ్య పోటీలో సంస్థలు ఉత్పత్తి చేసే వస్తువుల మధ్య విభేదం ఉంటుంది. అంటే అన్ని సంస్థలు ఉత్పత్తి చేసే వస్తువులు ఒకే ప్రమాణంలో వుండవు. దీనివల్ల పెద్ద తరహా ఉత్పత్తిలో లభించే ఆదాలకు అవకాశం లేదు.

పై వృధాలవల్ల ఏకస్వామ్య పోటీలో వినియోగదార్లు ఎక్కువ ధరను చెల్లించవలసి వస్తుంది.

ద్వారాను వినియోగదార్లచేత తమ వస్తువులనే కొనేటట్లు సంస్థలు చేయగలుగుతాయి. ఉదాహరణకు ఒక కంపెనీ తయారుచేసిన "టూత్‌పేస్టు కొంటే ఒక టూత్‌బ్రష్ ఉచితం" అంటే కొత్తవాళ్ళు ఆ టూత్‌పేస్టు కొనటానికి రావచ్చు. ఈ విధంగా అమ్మకపు వ్యయాలు ఒక సంస్థ యొక్క వస్తువుకు డిమాండును పెంచుతాయి.

పైన చెప్పినట్లు అమ్మకపు వ్యయాలు డిమాండును ఎంతవరకు పెంచుతాయి అనేది ఖచ్చితంగా చెప్పలేము. ఇది వివాదాస్పదమైన విషయం. దీన్ని నిర్దుష్టంగా చెప్పే సిద్ధాంతమంటూ ఏదీలేదు. ఒక సంస్థ ధరను తగ్గించి ప్రచారం చేస్తున్నప్పుడు మిగిలిన సంస్థలుకూడ అదే పని చేయవచ్చు. అప్పుడు ఆ ప్రచార ఫలితం ఏమీ ఉండక ఆశించిన విధంగా వస్తువు డిమాండు పెరగకపోవచ్చు. అలాంటప్పుడు అమ్మకపు వ్యయాల ప్రయోజనం ఏమీ ఉండదు. అదే విధంగా బహుమతుల నిచ్చినప్పుడు కూడ మిగిలిన సంస్థలు ఆ పని చేయవచ్చు. అప్పుడు కూడ ఫలితం ఏమీ ఉండదు. కనుక అమ్మకపు వ్యయాలద్వారా వినియోగదార్లను ఆకర్షించి డిమాండును పెంచుకోవటం చెప్పినంత సులభమైన పని కాదు.

**ఏకస్వామ్య పోటీలో సంస్థ సమతౌల్యంపై అమ్మకపు వ్యయాల ప్రభావం :** ఏకస్వామ్య పోటీలో అమ్మకపు వ్యయాలు ఉండక తప్పదని తెలుసుకున్నాం. కనుక సంస్థ సమతౌల్యం పరిశీలించేటప్పుడు ఉత్పత్తి వ్యయాలతోపాటు అమ్మకం వ్యయాలనుకూడ లెక్కలోకి తీసుకోవలె. అమ్మకం వ్యయాలవలన డిమాండు కొద్దో గొప్పో పెరుగుతుంది. అంటే డిమాండురేఖ మారుతుంది. అమ్మకం వ్యయాలను కలిపినందువల్ల మొత్తం సగటు వ్యయం (ATC) కూడ పెరుగుతుంది. ఉపాంత వ్యయం, ఉపాంత రాబడి సమానమైనచోట ఉండే ఉత్పత్తి స్థాయి వద్ద సంస్థ గరిష్ట లాభాలను పొందుతూ సమతౌల్య స్థితిలో ఉంటుంది. దీన్నే క్రింది రేఖాపటం విశదీకరిస్తుంది.



పైన పటంలో AR- సగటు రాబడి లేక డిమాండు రేఖ. MR- ఉపాంత రాబడి రేఖ. AC- సగటు ఉత్పత్తి వ్యయరేఖ. ATC- మొత్తం సగటు వ్యయరేఖ. ATC, AC మధ్య దూరం అమ్మకపు వ్యయాలను తెలియచేస్తుంది. OM ఉత్పత్తి వద్ద ఉపాంత వ్యయం, ఉపాంత రాబడులు (MC=MR) సమానంగా ఉన్నాయి. OM ఉత్పత్తి వద్ద సగటు రాబడి, మొత్తం సగటు వ్యయం (అమ్మకపు వ్యయాలు కూడ కలసిన) లను పరిశీలిస్తే సంస్థ $PP_1RN$కు సమానమైన లాభాలను ఆర్జిస్తుంది. ఇది సంస్థ ఆర్జించే గరిష్ట లాభాలు. ఈ విధంగా అమ్మకపు వ్యయాలతో సంస్థ సమతౌల్య స్థితిని చేరుతుంది.

అయితే అమ్మకపు వ్యయాలు ఏకస్వామ్య పోటీలో ఉండే వృధా (Wastes)లు అని చెప్పవచ్చు. ఇవి వినియోగదారుని ఆర్థిక శ్రేయస్సును యేమాత్రం పెంచవు.

**ప్రశ్న 4) ఏకస్వామ్య పోటీలో వుండే వృధాలను (Wastes) వివరింపుము.**

**లేదా**

**అపరిపూర్ణ పోటీలో ఉండే వృధాలను వివరింపుము.(Important)**

జవాబు : అపరిపూర్ణ పోటీ లేక ఏకస్వామ్య పోటీలో అనేక దుష్ఫలితాలు లేక వృధాలు ఉన్నాయి. అవి :

**1) నిరుద్యోగిత :** ఏకస్వామ్య పోటీ లేక అపరిపూర్ణ పోటీలో సంస్థల గరిష్ట ఉత్పాదక శక్తి (Maximum Productive Capacity) మేరకు ఉత్పత్తిని చేయవు. అందువల్ల నిరుద్యోగిత ఉంటుంది. దీనికి తోడు ఏకస్వామ్య సంస్థలవల్ల జాతీయాదాయంలో లాభాల వాటా పెరుగుతుంది. ఈ లాభాలన్నీ ధనికవర్గాలకే పోతాయి. దీనివల్ల వినియోగ ప్రవృత్తి తగ్గి పొదుపు పెరుగుతుంది. పొదుపు, పెట్టుబడుల మధ్య అసమతౌల్యం ఏర్పడటంతో కూడ నిరుద్యోగం ఏర్పడుతుంది. ఈ రెండు కారణాలవల్ల ఏకస్వామ్య పోటీలో నిరుద్యోగిత ఏర్పడుతుంది.

**2) వినియోగింపబడని ఉత్పాదక శక్తి :** ఏకస్వామ్య పోటీలో సంస్థ స్థాపిత ఉత్పాదక శక్తి (Installed Capacity)ని పూర్తిగా ఉపయోగించదు. ఎందుకంటే ఉత్పత్తి పెరిగితే ధర తగ్గి, లాభాలు తగ్గే ప్రమాదం ఉంది. అందువల్ల ఉత్పత్తిని పెంచేందుకు అవకాశమున్నా, అలాగే సగటు ఉత్పత్తి వ్యయాన్ని తగ్గించుకోవటానికి అవకాశమున్నా, సగటు వ్యయం కనీస స్థాయిని చేరకమునుపే ఉత్పత్తిని నిలిపివేస్తుంది. అంటే కొంత వుత్పాదక శక్తి వృధా అవుతుంటుంది.

**3) అనవసరమైన రవాణా ఛార్జీలు :** ప్రచారాలు, ప్రకటనలవల్ల వినియోగదార్లు కొన్ని సంస్థలు చేసే వుత్పత్తులు నాణ్యతగలవిగా భావిస్తారు. వాటినే కొంటారు కూడ.

దీనివల్ల సుదీర్ఘ ప్రాంతంలో వుండే సంస్థ ఉత్పత్తి చేసిన వస్తువులకు డిమాండు ఏర్పడుతుంది. ఉదాహరణకు, కలకత్తాలో ఉత్పత్తి చేయబడిన చెప్పులకు విజయవాడలోను, విజయవాడలో ఉత్పత్తి చేయబడిన చెప్పులకు కలకత్తాలోను కొనుగోలుదార్లు ఏర్పడతారు. అంటే విజయవాడ సంస్థ కలకత్తాలోను, కలకత్తాలోని సంస్థ విజయవాడలోను మార్కెట్‌ను సృష్టించుకుంటుంది. ఫలితంగా అనవసరమైన రవాణా ఛార్జీలు అవుతాయి. ఈ ఛార్జీలు ధరలో కలపబడి వినియోగదారునిపైన పడతాయి.

**4) ప్రత్యేకీకరణ ఆదాలుండకపోవటం :** ఉత్పత్తిని పెంచితే, ధర తగ్గి లాభాలు తగ్గుతాయనే భయంతో ఏకస్వామ్య పోటీలో సంస్థలు ఉత్పత్తిని పరిమితం చేస్తాయి. దీనివల్ల ఉత్పత్తి పెద్ద తరహాలో వుండకపోవచ్చు. అందువల్ల పెద్ద తరహా ఉత్పత్తిలో ఉండే ఆదాలను సంస్థలు పొందలేవు.

**5) ప్రచార వ్యయాలు :** ఏకస్వామ్య పోటీలో సంస్థలు ప్రచారం మీద పెద్ద మొత్తాలు ఖర్చు చేస్తాయి. ప్రచారం చేయటంలో ఏ సంస్థ మరో సంస్థకు తీసిపోదు. ఈ విధంగా అన్ని సంస్థలు పోటీపడి ప్రచార వ్యయాలన్ని పెంచుకుంటూ పోతాయి. ఈ వ్యయం అంతా ధరలో కలిసి వినియోగదారుడు భరించవలసి వస్తుంది.

**6) అసమర్థ సంస్థలు కొనసాగటం :** పరిపూర్ణ పోటీలో అసమర్థ సంస్థలకు తావు లేదు. అవి ఉత్పత్తిని నిలిపివేసి పరిశ్రమను వదలి వెళ్ళవలసిందే. కాని ఏకస్వామ్య పోటీ లేక అపరిపూర్ణ పోటీలో అసమర్థ సంస్థలు కూడా ఉత్పత్తిని చేస్తూ కొనసాగే అవకాశం ఉంది. వాటి వస్తువులను వినియోగదార్లు అభిమానించి కొంటూ వుండడమే దీనికి కారణం.

**7) ఉపాంత వ్యయంకన్న ధర ఎక్కువ :** పరిపూర్ణ పోటీలో ధర ఉపాంత వ్యయానికి సమానంగా ఉంటుంది (AR=MC). కాని ఏకస్వామ్య పోటీలో ధర లేక (AR) కంటే ఉపాంత రాబడి (MR) తక్కువగా ఉంటుంది. ఉపాంత వ్యయం (MC), ఉపాంత రాబడి (MR) సమానంగా వుంటాయి. అంటే ధర ఉపాంత వ్యయంకన్నా ఎక్కువగా వుంటుందన్నమాట. ఇలా వుండటం వల్ల వినియోగదార్లు నష్టపోతారు.

**8) ప్రమాణీకరణ వుండదు :** ఏకస్వామ్య పోటీలో సంస్థలు ఉత్పత్తి చేసే వస్తువుల మధ్య విభేదం ఉంటుంది. అంటే అన్ని సంస్థలు ఉత్పత్తి చేసే వస్తువులు ఒకే ప్రమాణంలో వుండవు. దీనివల్ల పెద్ద తరహా ఉత్పత్తిలో లభించే ఆదాలకు అవకాశం లేదు.

పై వృథాలవల్ల ఏకస్వామ్య పోటీలో వినియోగదార్లు ఎక్కువ ధరను చెల్లించవలసి వస్తుంది.

**ప్రశ్న 5) పరిమితస్వామ్యంలో ధర నిర్ణయింపబడు విధానమును వివరింపుము.**

**లేదా**

**పరిమితస్వామ్య ధర నిర్ణయంలో కింకీ డిమాండ్ రేఖ (Kinky Demand Curve) ప్రాధాన్యతను తెల్పుము.**

**లేదా**

**పరిమితస్వామ్యంలో ఉత్పత్తి ధర ఎట్లు నిర్ణయింపబడును.**

**(Important)**

**జవాబు :** అసంపూర్ణమైన పోటీ నమూనాలో పరిమితస్వామ్యం ఒకటి. అమెరికావంటి దేశాలలో ఉండే పోటీ ఈ తరగతికి చెందింది. ఏకస్వామ్యంలో ఒకే ఉత్పత్తి సంస్థ వుంటుంది. సంపూర్ణమైన పోటీలోను, ఏకస్వామ్యపోటీలోను సంస్థలు హెచ్చు సంఖ్యలో వుంటాయి. రెండుకన్న ఎక్కువగా ఉంటూ బహు తక్కువ సంఖ్య (Very few)లో ఉత్పత్తి సంస్థలుంటే "పరిమితస్వామ్యం" (Oligopoly) అంటారు.

**పరిమితస్వామ్య లక్షణాలు :**

**1. పరస్పర ఆధారము :** పరిమితస్వామ్యము యొక్క ముఖ్య లక్షణము సంస్థలు పరస్పరముగా ఆధారపడుట. ఒక సంస్థ యొక్క దర మరియు ఉత్పత్తి నిర్ణయాలు ఇతర సంస్థలను ప్రభావితం చేయును.

**2. అనిశ్చితంగా ఉండే డిమాండ్ రేఖ :** పరిమితస్వామ్య మార్కెట్‌లో డిమాండు రేఖ యొక్క స్వభావమును తెలుసుకొనుట కష్టము. ఒక సంస్థ ధరను తగ్గించుట వలన ఆ సంస్థ యొక్క ఉత్పత్తి వస్తువుల అమ్మకము ఎంతవరకు పెరుగునో ఊహించుట కష్టము.

**3. అమ్మకపు వ్యయాల ప్రాముఖ్యము :** పరిమితస్వామ్యములో డిమాండ్ అనిశ్చితంగా ఉండును. కనుక అమ్మకపు వ్యయాల ప్రాముఖ్యము ఎక్కువగా ఉండును. సగటు రాబడి అనుకూలంగా ఉండేటట్లు చేయటానికి ప్రతి సంస్థ వ్యాపార ప్రకటనలు చేయును. అందువలన పరిమితస్వామ్యములో అమ్మకపు వ్యయాల ప్రాముఖ్యము ఎక్కువగా ఉండును.

**4. ఏకస్వామ్య స్వభావము కలిగి ఉండుట :** పరిమితస్వామ్య మార్కెట్లో ఏకస్వామ్య ప్రవృత్తి ఉండును. సంస్థలు వేరు వేరు వస్తువులను ఉత్పత్తి చేస్తూ, అధిక ఉత్పత్తిని ఒక్కొక్క సంస్థ చేసినప్పుడు ఏకస్వామ్య ప్రవృత్తి ఏర్పడును.

**5. ధర దృఢత్వము :** పరిమితస్వామ్యము యొక్క మరియొక ముఖ్య లక్షణము ధర దృఢత్వము కలిగి ఉండుట. పరిమితస్వామ్యములో ఇతర సంస్థల ప్రభావము

మరియు ప్రవర్తన వలన ధర స్థిరముగా ఉండును. ధర దృఢత్వము ఉండుటకు ఈ క్రింది కారణములు కలవు.

a) వస్తువు ధర తగ్గించుట వలన భవిష్యత్తులో ఏమి జరుగునో ప్రతి సంస్థకు తెలియును.

b) ధర మార్పు వలన వినియోగదారులు అసంతృప్తి చెందును.

c) క్రొత్త సంస్థలు మార్కెట్‌లోకి ప్రవేశించకుండా ఉండుటకు ధర దృఢత్వము ఏర్పడవచ్చును.

**ఈ పరిమితస్వామ్యం ఏర్పడటానికి క్రింది కారణాలు చెప్పవచ్చు :**

i) భారీ ఎత్తున మూలధనం పెట్టుబడి పెట్టవలసి వచ్చినప్పుడు బహుకొద్ది సంస్థలు మాత్రమే చొరవ తీసుకొంటాయి.

ii) అవసరమైన ముడిపదార్థాలు కొద్ది సంస్థల యాజమాన్యంలో కేంద్రీకృత మైనప్పుడు ఎక్కువ సంస్థలకు అవకాశం ఉండదు.

iii) కొన్ని సంస్థల సంలీనం (Amalgamation) వల్ల కాని, పెద్ద సంస్థల ధాటికి తట్టుకోలేక చిన్న సంస్థలు తప్పుకోవటంవల్ల గాని కొద్ది సంస్థలే మిగులుతాయి.

iv) ఒక వస్తువు ఉత్పత్తికి ప్రభుత్వం కొన్ని సంస్థలకు మాత్రమే అనుమతి (Licence) యిచ్చినప్పుడు, కొద్ది సంస్థలే ఉంటాయి.

v) భారీ ఉత్పత్తి ఎక్కువ లాభదాయకమైన పరిశ్రమలలో కొద్ది సంస్థలే ఉండి భారీ ఉత్పత్తి చేస్తుంటాయి.

**పరిమితస్వామ్యంలో ధర నిర్ణయం - కింకీ డిమాండ్ రేఖా సిద్ధాంతం :** పరిమితస్వామ్యంలో వస్తువు ధర, ఉత్పత్తి ఎలా నిర్ణయింపబడేది కింకీ డిమాండ్ రేఖ సహాయంతో చెప్పవచ్చు. పరిమితస్వామ్యంలో సంస్థల ప్రవర్తన గురించి వివరించే వాటిలో కింకీ డిమాండ్ రేఖా (Kinky Demand Curve) సిద్ధాంతం కూడా ఒకటి.

**ప్రమేయాలు :** ఈ సిద్ధాంతం క్రింది ప్రమేయాలపై ఆధారపడింది :

i) ఒక సంస్థ ధరను తగ్గించినపుడు, మిగతా సంస్థలు కూడా ధరను తగ్గిస్తాయి.

ii) ఒక సంస్థ ధరను పెంచినప్పుడు, మిగతా సంస్థలు ధరను పెంచవు. కనుక ఒక సంస్థ ధరను తగ్గించినప్పుడు, లేక పెంచినప్పుడు మిగతా సంస్థల ప్రవర్తన పై విధంగా ఉంటుందని ఊహించి, పరిమితస్వామ్యంలో ధరను కింకీ డిమాండ్ రేఖ సహాయంతో వివరించవచ్చు.

ఒక సంస్థ ధరను పెంచితే, మిగతా సంస్థలు పెంచవు గనుక ఆ సంస్థ అమ్మకాలు తగ్గుతాయి. ఇతర సంస్థలకేమీ నష్టం ఉండదు. అలాకాక ఆ సంస్థ ధరను తగ్గిస్తేమటుకు ఇతర సంస్థలుకూడ ధరను తగ్గిస్తాయి. కనుక ఆ పరిస్థితిలో ఇతర సంస్థల ప్రవర్తన ఎలా వుంటుందో, డిమాండ్ ఎలా మారుతుందో అనిశ్చిత పరిస్థితి ఏర్పడుతుంది. అంటే డిమాండ్ రేఖలో ఒక బిందువు తరువాత అనూహ్య పరిస్థితి

ఏర్పడుతుంది. ఫలితంగా డిమాండ్ రేఖలో విచ్ఛిత్తి (Discontinuity) ఏర్పడుతుంది. పరిమితస్వామ్యంలో ధరల స్థిరత్వం ఉంటుందని కింకీ డిమాండు రేఖా సిద్ధాంతం రుజువు చేస్తుంది.

కింకీ డిమాండ్ రేఖ సహాయంతో పరిమితస్వామ్యంలో వస్తువు ధర, ఉత్పత్తి ఎలా నిర్ణయింపబడేది క్రింది రేఖాపటం విశదీకరిస్తుంది.




సంస్థ వస్తువు ధరను OP కంటే పెంచితే సంస్థయొక్క అమ్మకాలు తగ్గిపోతాయి కాబట్టి P బిందువుపైన డిమాండ్ వ్యాకోచత్వంగా ఉంటుంది. OP కంటే ధరను తగ్గిస్తే ఇతర సంస్థలు కూడ ధరను తగ్గిస్తాయి. కనుక డిమాండు రేఖలో మార్పు వచ్చింది అయితే ఇతర సంస్థల ప్రవర్తన ఎలా ఉంటుందో, డిమాండు ఎలా మారుతుందో అనూహ్యమైన విషయం గనుక ఉపాంత రాబడి రేఖ (MR)లో విచ్ఛిన్నత (Discontinuity) ఏర్పడింది. దీనినే 'కింక్' (Kink) అంటారు.

పై రేఖాపటం ద్వారా రెండు విషయాలు స్పష్టమౌతాయి. అవి

i) సంస్థ ధరను OP కంటె మించితే, సంస్థ అమ్మకాలు తగ్గుతాయి కనుక ధరను OP దాటి పెంచదు ధరను తగ్గిస్తే యితర సంస్థలుకూడ దీన్ని అనుసరించటంతో డిమాండ్ ఎలా మారుతుందో అనూహ్యం గనుక ధరను తగ్గించను కూడ తగ్గించదు. అంటే ఉన్న ధరే స్థిరంగా ఉంటుంది అన్నమాట

ii) కింక్‌వద్ద ఉపాంత వ్యయం మారినా, ఉత్పత్తిగాని, ధరగాని మారదు

**పరిమితస్వామ్యం ఫలితాలు :** పరిమితస్వామ్యం వల్ల క్రింది ఫలితాలు కలుగుతాయి. అవి :

1. వస్తువుయొక్క ఉత్పత్తి తక్కువగాను, ధర ఎక్కువగాను ఉంటుంది
2. ధర సగటు వ్యయానికన్న ఎక్కువగానే ఉంటుంది. అంటే సంస్థకు అధిక లాభాలు వస్తుంటాయి.

3. పరిమితస్వామ్యంలో సంస్థలు అభిలషణీయ పరిమాణంలో ఉండవు.
4. ప్రచారం, ప్రకటనలు లాంటి అమ్మకం వ్యయాలుంటాయి.
5. డిమాండ్, ఉత్పత్తి వ్యయాలలో వచ్చే మార్పుల కనుగుణ్యంగా ధరలోగాని, ఉత్పత్తిలోగాని మార్పులు చేయబడవు.

పై ఫలితాలను బట్టి సమాజ శ్రేయస్సు దృష్ట్యా పరిమితస్వామ్యం వాంఛనీయమయినది కాదు.

# SHORT NOTES

**ప్రశ్న 1] వస్తు విభేదము లేక వస్తు భిన్నత్వము లేక వస్తువుల వి-శిష్టీకరణ (Product Differentiation).**

**జవాబు :** ఏకస్వామ్య పోటీయొక్క ముఖ్య లక్షణం ఉత్పాదక భిన్నత్వం. అంటే ఏకస్వామ్య పోటీలో ఉండే సంస్థలు ఉత్పత్తి చేసే వస్తువుల మధ్య విభేదం ఉంటుంది. అయితే అవి పూర్తిగా విభేదంవున్న వస్తువులు మాత్రం కాదు. అవి తీర్చే కోర్కె ఒకటే, అవి ప్రత్యామ్నాయాలుగా ఉంటాయి, కాని ఒక సంస్థ ఉత్పత్తిచేసే వస్తువుకు, మరొక సంస్థ ఉత్పత్తిచేసే వస్తువుకు స్వల్ప భేదం ఉంటుంది. ఉదాహరణకు టూత్‌పేస్ట్ (Toothpaste)ను ఐదు, ఆరు సంస్థలు ఉత్పత్తి చేస్తున్నాయి. ఒక్కొక్క సంస్థ ఒక్కొక్క పేరు (Brand Name)తో ఉత్పత్తి చేస్తున్నది. బినాకా, ఫోర్‌హెన్స్ , కాల్గేట్, మెక్లిన్స్, సిగ్నల్, ప్రామిస్ అనేవి అన్నీ ఒకే కోర్కెను తృప్తిపరుస్తాయి అయినప్పటికి వాటన్నింటిని ఒకే వస్తువు (Identical Product) లేక ఏకజాతీయమైన వస్తువులు (Homogeneous) అనటానికి వీలులేదు. ఎందుకంటే వాటిమధ్య స్వల్ప భేదాలున్నాయి. అంతేగాక వినియోగదారుని దృష్టిలో అవి వేరు వస్తువులు ఏ వస్తువును వాడుతున్నవారు దాన్ని తప్ప ఇంకోదాన్ని వాడటానికి సులభంగా ఇష్టపడరు. అందువల్ల ఏ వస్తువు కావస్తువుకు ప్రత్యేక మార్కెట్ ఉంటుంది. అంటే వాటిని ఉత్పత్తి చేసే సంస్థలు దేనికది ఏకస్వామ్య సంస్థ అన్నమాట.

అయితే ఆ వస్తువులు ఒకదానికొకటి ప్రత్యామ్నాయాలవటంతో వాటిని ఉత్పత్తిచేసే సంస్థలు ఏకస్వామ్య సంస్థలే అయినప్పటికి, ఈ సంస్థల మధ్య పోటీ ఉంటుంది. అందుకే ఈ తరహా మార్కెట్‌ను "ఏకస్వామ్య పోటీ" అంటారు.

అన్ని సంస్థలు ఉత్పత్తి చేసే వస్తువుల మధ్య వాస్తవికమైన భేదం ఉండకపోవచ్చు. వస్తువుల మధ్య విభేదం ఉన్నదా లేదా అనేది వినియోగదార్ల దృష్టి (from the point of view of Consumers) నుంచి చూడవలె. ఆకర్షణీయంగా ప్యాక్ చేయటంవల్ల, ట్రేడ్‌మార్కులను ఉపయోగించటంవల్ల, ప్రకటనలు, ప్రచారంవల్ల అవి వేరు వేరు

వస్తువులనే అభిప్రాయం వినియోగదార్లలో ఏర్పడవచ్చు. అలా ఏర్పడినప్పుడు యే వస్తువు కావస్తువుకు మార్కెట్ ప్రత్యేకంగా ఉంటుంది. ఈ వస్తు విభేదంవల్ల ఒక్కొక్క వస్తువు డిమాండ్ వ్యాకోచత్వం తక్కువగా ఉంటుంది. ఫలితంగా వస్తువు ధరను పెంచినా డిమాండ్ అంతగా తగ్గదు.

వస్తు భిన్నత్వం (Product Differentiation) ప్రకటనలు, ప్రచారాలకు అవకాశం కల్పిస్తుంది. వీటిపై సంస్థలు కొంత వ్యయం చేస్తాయి. ఈ వ్యయాలని అమ్మకం వ్యయాలు (Selling Costs) అంటారు. అంటే వస్తు విభేదం అమ్మకం వ్యయాలకు దారితీస్తుంది.

**ప్రశ్న 2) అమ్మకం వ్యయాలు (Selling Costs) (Important)**

2వ ప్రశ్న కిచ్చిన జవాబు చూడండి.

**ప్రశ్న 3) ఏకస్వామ్య పోటీలో వృధాలు (Wastes of Monopolistic Competition) (Important)**

3వ ప్రశ్న కిచ్చిన జవాబు చూడండి.

**ప్రశ్న 4) కింకీ డిమాండ్ రేఖ (Kinky Demand Curve)**

4వ ప్రశ్న కిచ్చిన జవాబు చూడండి.

**ప్రశ్న 5) పరిమితస్వామ్యం (Oligopoly)**

4వ ప్రశ్నకిచ్చిన జవాబు చూడండి.

**ప్రశ్న 6) ఏకస్వామ్య పోటీ**

1వ ప్రశ్న కిచ్చిన జవాబు చూడండి.



# అధ్యాయము 11

# ఉత్పత్తి కారకాల ధర నిర్ణయము

**ప్రశ్న 1) ఉపాంత ఉత్పాదకతా సిద్ధాంతమును విమర్శనాత్మకంగా పరిశీలింపుము.**

**లేదా**

**ఉపాంత ఉత్పాదకతా పంపిణీ సిద్ధాంతాన్ని విమర్శనాత్మకంగా పరిశీలించండి. దానికున్న ప్రమేయాలను తెల్పండి.**

**లేదా**

**"ఉత్పత్తి కారకాల ఫలం ఆ కారకం యొక్క ఉపాంత ఉత్పాదకతకు సమానంగా వుంటుంది" - చర్చించండి.**

జవాబు : జాతీయాదాయం ఉత్పత్తి సాధనాలైన భూమి, శ్రమ, మూలధనం, వ్యవస్థాపనల మధ్య పంపిణీ చేయబడుతుంది. భూమికి వచ్చే వాటాను భాటకము (Rent) అనీ, శ్రమకు చెల్లించే వాటాను వేతనం (Wages) అనీ, మూలధనానికి లభించే వాటాను వడ్డీ (Interest) అనీ, వ్యవస్థాపనకు మిగిలేది లాభం (Profit) అని అంటారు. ఇవే ఉత్పత్తి కారకాలకు చెల్లించే ధరలు. వీటినే ఉత్పత్తి కారకాలకు లభించే ప్రతిఫలాలు అని కూడ అనవచ్చు. జాతీయాదాయం ఉత్పత్తి కారకాల మధ్య ఎలా పంపిణీ జరుగుతుందో, లేక ఉత్పత్తి కారకాల ధర నిర్ణయమెలా జరుగుతుందో పంపిణీ సిద్ధాంతాలు వివరిస్తాయి. ఇలాంటి సిద్ధాంతాలలో ఉపాంత ఉత్పాదకతా పంపిణీ సిద్ధాంతం ముఖ్యమైనది. ఈ సిద్ధాంతం ఉత్పత్తి కారకాలకు చెల్లించే ప్రతిఫలనములు ఏ విధంగా నిర్ణయింపబడతాయో విశదీకరిస్తుంది.

**ఉపాంత ఉత్పాదకతా పంపిణీ సిద్ధాంతం (Marginal Productivity Theory of Distribution) :** ఉపాంత ఉత్పాదకతా పంపిణీ సిద్ధాంతాన్ని అర్థశాస్త్రంలో మొట్టమొదటగా ఎవరు ప్రవేశపెట్టినది స్పష్టంగా తెలియదు. అయితే జె. బి క్లార్క్ (J. B. Clark), జీవాన్స్ (Jeavons), విక్‌స్టీడ్ (Wick Stead), మార్షల్ (Marshall)

మొదలయిన అర్థశాస్త్రవేత్తలు ఉపాంత ఉత్పాదకతా (Marginal Productivity) భావనను ఉపయోగించారు.

ఈ సిద్ధాంతం ప్రకారం "ఒక ఉత్పత్తి కారకానికి చెల్లించవలసిన ధర లేక ప్రతిఫలం దాని ఉపాంత ఉత్పాదకతకు సమానంగా వుంటుంది". ఉత్పత్తి సాధనాలైన భూమి, శ్రమ, మూలధనం, వ్యవస్థాపన - ఇవన్నీ కలిసి కొంత సంపదను ఉత్పత్తి చేస్తాయి. ఈ సంపద యొక్క విలువే జాతీయాదాయం ఈ సంపద యావత్తూ ఆ నాలుగు ఉత్పత్తి కారకాలకు చెందుతుంది. ఏ ఉత్పత్తి కారకం ఎంత సంపదను ఉత్పత్తి చేస్తుందో అంత సంపద దానికి ప్రతిఫలంగా లభించవలె. అంటే ప్రతి ఉత్పత్తి కారకానికి చెల్లించే ధర దాని ఉపాంత ఉత్పాదకతపై ఆధారపడి ఉంటుంది.

ఉపాంత ఉత్పాదకత (Marginal Productivity) : ఒక ఉత్పత్తి కారకం యొక్క అదనపు యూనిట్‌నుపయోగిస్తే మొత్తం ఉత్పత్తిలో వచ్చే పెరుగుదలను "ఉపాంత ఉత్పాదకత" అని అంటారు. ఉదాహరణకు, 9 మంది శ్రామికులు 100 వస్తువులను తయారుచేస్తుంటే, 10వ శ్రామికుని అదనంగా నియమించినప్పుడు మొత్తం ఉత్పత్తి 110 వస్తువులైతే, ఉపాంత ఉత్పాదకత 10 వస్తువులవుతుంది. దీన్ని "ఉపాంత భౌతిక ఉత్పత్తి" (Marginal Physical Product) అంటారు. ఒక్కొక్క వస్తువు ధర 1 రూ. అయితే ఉపాంత ఉత్పాదకత రూ. 10 అవుతుంది. దీన్ని "ఉపాంత ద్రవ్య ఉత్పాదకత" (Marginal Value Product) అని అంటారు. ఈ అదనపు యూనిట్‌ని నియమించటంవల్ల మొత్తం రాబడిలో వచ్చిన పెరుగుదలను "ఉపాంతోత్పత్తి రాబడి" (Marginal Revenue Productivity) అంటారు.

ఈ ఉపాంత ఉత్పాదకతను బట్టి ఉత్పత్తిదారు ఉత్పత్తి కారకానికిచ్చే ప్రతిఫలం లేక ధరను నిర్ణయిస్తాడు. పై ఉదాహరణలో శ్రామికుని ఉపాంత ఉత్పాదకత రూ. 10 కనుక ఉత్పత్తిదారు శ్రామికులకు రూ. 10 లను వేతనంగా చెల్లించటానికి ఇష్టపడతాడు. అయితే ఒక ఉత్పత్తి కారకం యొక్క ఉపాంత ఉత్పాదకత ఒకస్థాయి నుంచి క్షీణిస్తుంది. ఇందుకు కారణం క్షీణోపాంత ప్రతిఫల సూత్రం (Law of Diminishing Returns) అమలులోకి రావటమే. కనుక ఉపాంత శ్రామికుని ఉత్పాదకతకు సమానమైన వేతనాన్నే అందరి శ్రామికులకు చెల్లిస్తాడు. ఒకవేళ అమలులో వున్న వేతనం ఉపాంత ఉత్పాదకతకన్నా తక్కువగా ఉంటే ఉత్పత్తిదారుడికి లాభదాయకంగా ఉంటుంది. అప్పుడు ఎక్కువమంది శ్రామికులను వినియోగించటం జరుగుతుంది. దీంతో ఉత్పత్తిదార్ల మధ్య పోటీ ఏర్పడి శ్రామికుల వేతనం పెరిగి ఉపాంత ఉత్పాదకతకు సమానమౌతుంది. ఒకవేళ మార్కెట్‌లో వేతనం ఉపాంత ఉత్పాదకత కంటె ఎక్కువగా వుంటే శ్రామికుల డిమాండ్ తగ్గి, ఫలితంగా వేతనం తగ్గి తిరిగి ఉపాంత ఉత్పాదకతకు సమానమౌతుంది. ఈ విధంగా మార్కెట్‌లో వేతనం శ్రమయొక్క ఉపాంత ఉత్పాదకతకు సమానంగా వుంటుంది. మిగతా అన్ని ఉత్పత్తి కారకాల విషయంలో కూడా ఇదే విధంగా జరుగుతుంది.

ఒక ఉత్పత్తికారకం అనేక ఉత్పత్తి రంగాలలో ఉపయోగించబడుతూ వుండవచ్చు. అప్పుడు కూడా ఉపాంత ఉత్పాదకత తక్కువగావున్న ఉత్పత్తి రంగంనుంచి ఉపాంత ఉత్పాదకత ఎక్కువగా వున్న రంగానికి తరలిపోతుంది. ఈ విధంగా ప్రతి ఉత్పత్తికారకం అన్ని రంగాలలోనూ దాని ఉపాంత ఉత్పాదకతకు సమానమయ్యేటట్లు పంపిణీ జరుగుతుంది. ఉత్పత్తి కారకం ధర దాని ఉపాంత ఉత్పాదకతకు సమానంగా వుంటుంది. కనుక అన్ని ఉత్పత్తి రంగాలలోనూ ఒక ఉత్పత్తి కారకం ధర ఒకటిగానే ఉంటుంది.

వివిధ ఉత్పత్తి కారకాల ఉపాంత ఉత్పాదకతకూడ సమానంగానే వుంటుంది. ప్రతి ఉత్పత్తిదారుడు ఉత్పత్తి సాధనాలను నియమించేటప్పుడు ప్రతిస్థాపన సూత్రాన్ని (Principle of Substitution) అనుసరిస్తాడు. అంటే తక్కువ ఉత్పాదకత ఉన్న ఉత్పత్తి కారకం బదులుగా ఎక్కువ ఉత్పాదకత ఉన్న కారకాన్ని ప్రతిస్థాపన చేస్తాడు. ఉదాహరణకు, శ్రమ ఉపాంత ఉత్పాదకత కన్న యంత్రం ఉపాంత ఉత్పాదకత ఎక్కువగావుంటే, శ్రమ (Labour) కు బదులు యంత్రాన్ని (Capital) ఉపయోగిస్తాడు అన్ని ఉత్పత్తి కారకాల ఉత్పాదకత సమానమయ్యేవరకు ఇలా ప్రతిస్థాపన జరుగుతుంది. కనుక అన్ని ఉత్పత్తి కారకాల ఉపాంత ఉత్పాదకత స్మమంగానే వుంటుంది.

**ఉపాంత నికర ఉత్పాదకత :** ఒక ఉత్పత్తి కారకం ఉపాంత ఉత్పాదకతను తెలుసుకోవడానికి మిగిలిన ఉత్పత్తి కారకాలను స్థిరంగా వుంచి, ఆ ఉత్పత్తి కారకాన్ని మాత్రమే పెంచుతూ పోవలె. అయితే మిగిలిన ఉత్పత్తి కారకాలను స్థిరంగా ఉంచి ఒక్క ఉత్పత్తి కారకాన్ని మాత్రమే పెంచటం అన్ని రంగాలలో సాధ్యం కాకపోవచ్చు. ఇతర కారకాలనుకూడా ఇదే విధంగా పెంచవలసి వస్తుంది. అలాంటప్పుడు ఉపాంత ఉత్పాదకత నుండి మిగిలిన ఉత్పత్తి కారకాలను పెంచినందున అయిన వ్యయాన్ని తీసివేస్తే ఉపాంత నికర ఉత్పాదకత (Marginal Net Productivity) తెలుస్తుంది. అప్పుడు ఉత్పత్తి కారకానికి చెల్లించే ధర లేక ప్రతిఫలం దాని ఉపాంత నికర ఉత్పత్తికి సమానంగా వుంటుంది.

**ఉపాంత ఉత్పాదకత సిద్ధాంతం - ప్రమేయాలు :** ఉపాంత ఉత్పాదకత సిద్ధాంతం క్రింది ప్రమేయాలమీద ఆధారపడి వుంది :

1. ప్రతి ఉత్పత్తి కారకం యూనిట్లన్నీ సజాతీయాలు (Homogeneous). అంటే ఒకదానికి, మరొకదానికి ఏ విధమైన తేడా వుండదు. అన్నీ సమాన సామర్థ్యం కలిగి వుంటాయి.
2. ఉత్పత్తి కారకాలు ఒకదానికి బదులు మరొకటి ప్రతిస్థాపన (Substitute) చేయడానికి తగి వుంటాయి.

3. ఏ ఉత్పత్తి కారకానైనా కొంచెంగా పెంచడానికిగాని, తగ్గించడానికిగాని వీలుంటుంది.
4. ఉత్పత్తి కారకాలు పూర్తి గమనశీలత (Perfect Mobility) కలిగి వుంటాయి. అంటే వాటిని ఒక ఉత్పత్తి రంగంనుంచి మరొక రంగానికి సులువుగా మార్చవచ్చు.
5. ఉత్పత్తి కారకాల యూనిట్లను పెంచుతున్నప్పుడు క్షీణ ప్రతిఫలాలు వస్తాయి.
6. మిగిలిన ఉత్పత్తి కారకాలను స్థిరంగా ఉంచి ఏదైనా ఒక ఉత్పత్తి కారకాన్ని పెంచటానికి వీలుండాలి.

ఈ ప్రమేయాలు వాస్తవాలైనప్పుడు ఉపాంత ఉత్పాదకత సిద్ధాంతము ఉత్పత్తి కారకాల ధర నిర్ణయానికి వర్తిస్తుంది. అంటే ఒక ఉత్పత్తి కారకం ధర దాని ఉపాంత ఉత్పాదకతకు సమానంగా ఉంటుందన్నమాట.

**సిద్ధాంత వివరణ :** ఈ సిద్ధాంతాన్ని ఈ క్రింది ఉదాహరణ ద్వారా తెలుసుకొనవచ్చును.

| ఉత్పత్తి కారకము యొక్క వివిధ యూనిట్లు | మొత్తం ఉత్పత్తి | స.భౌ.ఉ. | స.రా.ఉ. | ఉ.భౌ.ఉ. | ఉ.రా.ఉ. | ఉత్పత్తి కారకం ధర |
|---|---|---|---|---|---|---|
| 1 | 10 | 10 | 50 | 10 | 50 | 60 |
| 2 | 22 | 11 | 55 | 12 | 60 | 60 |
| 3 | 36 | 12 | 60 | 14 | 70 | 60 |
| 4 | 48 | 12 | 60 | 12 | 60 | 60 |
| 5 | 55 | 11 | 55 | 7 | 35 | 60 |
| 6 | 60 | 10 | 50 | 5 | 25 | 60 |

పై పట్టికలో వస్తువు యొక్క ధర 5 రూ॥ గ్రా, ఉత్పత్తి కారకం ధర 60 రూ॥ గా ఊహించబడినది. పై పట్టికలో ఉపాంత రాబడి ఉత్పాదకత 3వ యూనిట్ వరకు పెరిగి ఆ తరువాత తగ్గుతుంది. సగటు రాబడి ఉత్పాదకత 4వ యూనిట్ వరకు పెరిగి ఆ తరువాత తగ్గుతుంది. 4వ యూనిట్ వద్ద ఉపాంత రాబడి ఉత్పాదకత, సగటు రాబడి ఉత్పాదకత సమానంగా ఉన్నాయి. కాబట్టి ఉత్పత్తిదారుడు 4వ యూనిట్ వరకు ఉత్పత్తి కారకాన్ని ఉపయోగిస్తాడు. ఇచ్చట ఉత్పత్తి కారకానికి చెల్లించే ధర ఉత్పత్తి కారకము యొక్క ఉపాంత రాబడి ఉత్పాదకతకు సగటు రాబడి ఉత్పాదకతకు సమానంగా యుండును.

రేఖాపటం వివరణ : ఈ సిద్ధాంతాన్ని ఈ క్రింది పటంద్వారా చూపించవచ్చు:




పై పటంలో OM ఉత్పత్తి కారకము వద్ద ధర, ఉ.రా.ఉ., స.రా.ఉ. సమానంగా యున్నాయి. కనుక ఇచ్చట నష్టములు రాకుండా సమతౌల్యంతో యుండి గరిష్ట లాభాలు పొందుతాడు.

**ఉపాంత ఉత్పాదకతా సిద్ధాంతం - విమర్శ :** ఉపాంత ఉత్పాదకత పంపిణీ సిద్ధాంతం అనేక విమర్శలకు గురి అయింది. అవి :

**1) ఉత్పత్తి కారక యూనిట్లన్ని సజాతీయాలు కావు :** ఈ సిద్ధాంతం ఉత్పత్తి కారకం యూనిట్లన్నీ సజాతీయాలని ఊహిస్తుంది. ఇది వాస్తవ విరుద్ధం. ఉదాహరణకు, శ్రామికులందరూ సమాన సామర్థ్యం కలిగి ఉండరు. అదే విధంగా భూములన్ని సమాన సారవంతంగా నుండవు. కనుక ఒక ఉత్పత్తి కారకం యొక్క ఉపాంత ఉత్పాదకతను నిర్ణయించటం సాధ్యంకాదు.

**2) ఉత్పత్తి కారకాల ప్రతిస్థాపన వీలుకాకపోవచ్చు :** ఈ సిద్ధాంతం ఉత్పత్తి కారకాలను ఒకదానిస్థానే మరొకదాన్ని ప్రతిస్థాపన చేయవచ్చనే ప్రమేయంమీద ఆధారపడింది. ఇదికూడా సరికాదు. శ్రమకు బదులు మూలధనాన్ని, అలాగే మూలధనానికి బదులు శ్రమను ఎల్లవేళల ప్రతిస్థాపన చేయటం సాధ్యపడదు. ఎందుకంటే ఉత్పత్తి కారకాలన్నీ ఒకదాని కొకటి సన్నిహిత ప్రత్యామ్నాయాలు కావు.

**3) ఉత్పత్తి కారకాల మార్పు వీలు కాకపోవచ్చు :** ప్రతి ఉత్పత్తి కారకాన్ని కొద్ది కొద్దిగా పెంచడానికి లేదా తగ్గించటానికి వీలుంటుందనేది మరో ప్రమేయం. ఇది అన్ని సందర్భాలలోను వీలుండకపోవచ్చు. ఇలా వీలు లేనప్పుడు ఒక ఉత్పత్తి కారకం దాని ఉపాంత ఉత్పాదకత, దాని వ్యయానికి సమానమయ్యేంతవరకూ ఉపయోగించబడలేదు.

**4) ఉత్పత్తి కారకాలలో కొన్నింటికి గమనశీలత లేదు :** ఉత్పత్తి కారకాలు వివిధ ఉత్పత్తి రంగాల మధ్య స్వేచ్ఛగా మారుతూ వుంటాయని కూడ ఈ సిద్ధాంతం ఊహిస్తున్నది. ఇది నిజంకాదు. ముఖ్యంగా భూమి విషయంలో ఈ గమనశీలత లేదు

శ్రమ, మూలధనాలకు కూడ పూర్తి గమనశీలత లేదు. కనుక ఒక ఉత్పత్తి కారకం యొక్క ఉపాంత ఉత్పాదకత వివిధ ఉత్పత్తి రంగాలలో సమానం కాకపోవచ్చు.

**5) కీన్సు విమర్శ :** వేతనాలు తగ్గితే ఉపాధి (Employment) పెరుగుతుందని ఈ సిద్ధాంతం సూచిస్తున్నది. ఇది ఒక ఉత్పత్తిదారు విషయంలో లేక ఒక పరిశ్రమ విషయంలో నిజంకావచ్చు. కాని మొత్తం ఆర్థిక వ్యవస్థను పరిశీలించేటప్పుడు ఇది వర్తించదని కీన్సు (J. M. Keynes) అభిప్రాయపడ్డాడు. అతని దృష్టిలో ఉద్యోగిత సార్థక డిమాండు (Effective demand) పై ఆధారపడుతుంది. ఈ అంశంపై కీన్సు ఈ సిద్ధాంతాన్ని విమర్శించాడు

**6) ఉత్పాదక ప్రతిఫలం రెండు పరస్పర ఆధారాలు :** ఈ సిద్ధాంతం ప్రకారం ఉపాంత ఉత్పాదకత ఒక ఉత్పత్తి కారకం యొక్క ప్రతిఫలాన్ని నిర్ణయిస్తుంది. అంటే ఇవి స్వతంత్ర చలాంకాలన్నమాట. ఇది వాస్తవం కాదు. ఎందుకంటే ఒక ఉత్పత్తి కారకానికి చెల్లించిన ప్రతిఫలాన్ని బట్టి దాని ఉత్పాదకత వుంటుంది. ఉదాహరణకు, వేతనాలు శ్రామిక సామర్థ్యాన్ని నిర్ణయిస్తాయి. కనుక ఉత్పాదకత, ప్రతిఫలం రెండూ పరస్పర ఆధారాలు.

**7) ఉపాంత నికర ఉత్పాదకతను కొలవడానికి వీలుకాదు :** ఉపాంత నికర ఉత్పాదకత (Marginal Net Productivity)ని కొలవటానికి వీలులేదని ముఖ్యంగా హిక్స్ (Hicks), జోన్ రాబిన్‌సన్ (Joan Robinson), పిగో (Pigou) అనే ఆర్థికవేత్తలు విమర్శించారు. పెద్ద తరహా ఉత్పత్తివల్ల కలిగే ఆదాలను పొందుతున్నప్పుడు ఒక ఉత్పత్తి కారకం యొక్క ఉపాంత ఉత్పాదకత, ఒక సంస్థకన్న పరిశ్రమ విషయంలో ఎక్కువగా వుంటుంది. ఇందుకు కారణం ఉత్పత్తి కారకంయొక్క ఒక యూనిట్ పరిశ్రమకు అందుబాటులో వున్నప్పుడు శ్రమవిభజన ఎక్కువ అవుతుంది. ఈ నూతన సప్లయ్‌కి పరిశ్రమ సర్దుబాటు చేసుకున్నప్పుడు ఒక సంస్థలో ఆ ఉత్పత్తి కారకం ఉపాంత ఉత్పాదకత పరిశ్రమకన్నా తక్కువగా వుండవచ్చు. ఎందువల్లనంటే ఈ కారకాన్ని ఉపసంహరిస్తే సంస్థకన్న పరిశ్రమ ఎక్కువగా నష్టపోతుంది. అలాంటి పరిశ్రమల విషయంలో ఉపాంత ఉత్పాదకతను నిర్ణయించటానికి వీలుపడదు.

**8) హాబ్సన్ విమర్శ :** హాబ్సన్ (Hobson) అనే ఆర్థికవేత్త ఉత్పత్తి కారకాలను మన యిష్టం వచ్చినట్లు మార్చటానికి వీలులేదంటాడు. ఉత్పత్తి కారకాల సమ్మేళనాన్ని సాంకేతిక పరిస్థితులు నిర్ణయిస్తాయంటాడు. ఉదాహరణకు, ఒక యంత్రానికి ఒక శ్రామికుడు అవసరమైతే, ఇద్దరిని నియమించటానికి వీలుండదు. ఈ విధంగా మార్చలేనప్పుడు ఉపాంత ఉత్పాదకతను నిర్ణయించటం సాధ్యంకాదు.

**9) ఉత్పత్తి కారకం యొక్క ప్రభావాన్ని పరిగణించదు :** ఈ సిద్ధాంతం డిమాండు దృక్కోణం నుంచి మాత్రమే సమస్థితిని పరిశీలిస్తున్నది. అంటే ఉత్పత్తి కారకాల సప్లయి స్థిరంగా వుంటుందని ఊహిస్తుంది. వాస్తవానికి వాటి సప్లయి స్థిరంగా ఉండదు

ఉత్పత్తి కారకానికి చెల్లించే ప్రతిఫలాన్ని బట్టి వాటి సప్లయి మారుతూ ఉంటుంది. కనుక ఈ సిద్ధాంతం కేవలం పాక్షిక వివరణే అనే విమర్శకూడా ఉంది.

**10) అన్ని ఉత్పత్తి కారకాల ధరల నిర్ణయానికి ఈ సిద్ధాంతం వర్తించదు :** అన్ని ఉత్పత్తి కారకాల ధర నిర్ణయానికి ఈ సిద్ధాంతం వర్తించదు.

అసలు ఉత్పత్తి కారకాల ప్రతిఫలం ఎలా నిర్ణయమవుతుందో ఈ సిద్ధాంతం వివరించటంలేదు. ఉత్పత్తి కారకాల ప్రతిఫలం నిర్ణయమైన తర్వాత ఉత్పత్తిదారుడు వివిధ ఉత్పత్తి కారకాలను ఎంతెంత పరిమాణంలో నియమిస్తాడో మాత్రమే ఈ సిద్ధాంతం వివరిస్తున్నది. కనుక ఉత్పత్తి కారకాల ధరల నిర్ణయానికి ఈ సిద్ధాంతం పనికిరాదు.

**ప్రశ్న 2) డిమాండు - సప్లయి పంపిణీ సిద్ధాంతాన్ని వివరించండి. ఇది సంతృప్తికరమైన సిద్ధాంతమేనా ?**

**లేదా**

**ఆదాయ పంపిణీకి సంబంధించిన ఆధునిక సిద్ధాంతమును వివరించండి.**

**(Very Important)**

**జవాబు :** సాధారణ విలువ సిద్ధాంతాన్నే ఆదాయ పంపిణీకి కూడ వర్తింప చేయవచ్చని, దీనికి వేరే ప్రత్యేక సిద్ధాంతం అక్కర్లేదని ఆధునిక అర్థశాస్త్రవేత్తలు అభిప్రాయపడ్డారు. మామూలుగా వస్తువు ధర నిర్ణయించినట్లే డిమాండు - సప్లయి సిద్ధాంతం ద్వారా ఉత్పత్తి కారకం యొక్క ధరను కూడా నిర్ణయించవచ్చు. ఈ డిమాండు-సప్లయి సిద్ధాంతం ఉత్పత్తి కారకాల ధర నిర్ణయమెలా జరుగుతుందో సంతృప్తికరమయిన వివరణనిస్తుంది.

**ఉత్పత్తి కారకం యొక్క డిమాండుని నిర్ణయించే అంశాలు :** ఉత్పత్తి కారకాలకుండే డిమాండు ప్రత్యక్షమైనది కాదు. పరోక్షంగా వుంటుంది. దీన్నే "ఉత్పన్న డిమాండు" (Derived Demand) అని అంటారు. ఏ ఉత్పత్తి కారకానికయినా డిమాండు క్రింది అంశాలపై ఆధారపడుతుంది :

1. ఆ ఉత్పత్తి కారకం ఉత్పత్తి చేసే వస్తువులకుండే డిమాండు.
2. ఆ ఉత్పత్తి కారకంతో బాటు నియమింపబడే ఇతర ఉత్పత్తి కారకాలకు గల డిమాండు.
3. ఉత్పత్తి కారకం యొక్క ఉత్పాదకత.

ఏ ఉత్పత్తి సంస్థ అయినా, ఒక ఉత్పత్తి కారకాన్ని దాని ధర, ఉపాంత, సగటు ఉత్పాదకతలు సమానమయ్యేవరకు నియమిస్తుంది. ఈ విధంగా ఉత్పత్తి సంస్థలన్నీ నియమించిన ఉత్పత్తికారక పరిమాణాలను కలిపితే ఆ ఉత్పత్తి కారకపు పరిశ్రమ లేక

మార్కెట్ డిమాండు తెలుస్తుంది. ఒక సంస్థయొక్క ఒక ఉత్పత్తి కారకపు - శ్రమ డిమాండును క్రింది రేఖాపటం తెలియచేస్తుంది.




పై ఎడమప్రక్క పటంలో MRP - ఉపాంత వుత్పాదక రేఖ. OW వేతనం వద్ద శ్రమ డిమాండు ON వుంది. అదే విధంగా వేతనం $OW^1$కి పెరిగినప్పుడు ఉత్పత్తి కారకునికుండే డిమాండు $ON^1$, వేతనం $OW^{11}$ వున్నప్పుడు ఉత్పత్తి కారకం డిమాండు $ON^{11}$ వుంటుంది. కనుక MRP రేఖ సంస్థయొక్క ఒక ఉత్పత్తి కారకానికి గల డిమాండును తెలియచేస్తుంది. అంటే MRP రేఖ సంస్థయొక్క డిమాండు రేఖ కూడ.

కాని ఒక ఉత్పత్తి కారకం ధర కేవలం ఒక సంస్థ డిమాండునుబట్టి మాత్రమే నిర్ణయించబడదు. పరిశ్రమ లేక మార్కెట్ మొత్తం డిమాండుచేత నిర్ణయించబడుతుంది. కనుక అన్ని సంస్థల MRP రేఖలను పార్శ్వ సంకలనం (Lateral Summation) చేస్తే ఆ ఉత్పత్తి కారకపు మార్కెట్ లేక పరిశ్రమ డిమాండు రేఖ వస్తుంది.

పై కుడిప్రక్క పటంలో DD- సంస్థల డిమాండు రేఖలను కలుపగా వచ్చిన మార్కెట్ డిమాండు రేఖ. ఈ రేఖ ఒక ఉత్పత్తి కారకానికి మార్కెట్ డిమాండుని వివరిస్తుంది. వేతనం పెరిగితే ఉత్పత్తి కారకం డిమాండు తగ్గటాన్ని పై పటంలో చూడవచ్చు. ఇందుకు కారణం క్షీణ ప్రతిఫల సూత్రం వర్తించటమే.

**సప్లయిని నిర్ణయించే అంశాలు :** ఒక ఉత్పత్తి కారకం సప్లయి అనేక విషయాలపై ఆధారపడుతుంది. ముఖ్యంగా శ్రమ విషయంలో, శ్రమ సప్లయి, జనాభా పరిమాణంమీద, వయస్సువారీ విభజన, వృత్తులవారీ విభజన, సామర్థ్యం, గమనశీలత మొదలయిన అనేక అంశాలపై ఆధారపడి వుంటుంది. పైగా మిగిలిన ఉత్పత్తి కారకాలవలెగాక శ్రమ విషయంలో వేతనాలు పెరిగితే శ్రమ సప్లయి పెరగకపోవచ్చు. ఎందుకంటే వేతనాలు పెరిగినప్పుడు శ్రామికులు తక్కువ గంటలు పని చేయాలని

కోరుకుంటారు. అందువల్ల శ్రమ సప్లయి తగ్గను కూడా తగ్గవచ్చు. అయితే సాధారణంగా ఏ ఉత్పత్తి కారకం సప్లయి అయినా దాని ధర పెరిగితే సప్లయి పెరుగు తుంది. కనుక ఉత్పత్తి కారకం సప్లయి రేఖ ఎడమ నుండి కుడికి పైకి పోతుంది.




ఒక ఉత్పత్తి కారకం యొక్క డిమాండు, సప్లయిలు ఎక్కడ సమానమవుతాయో అక్కడ నుండే ధర నిర్ణయింపబడుతుంది. ఈ విషయాన్నే పై రేఖా పటంలో చూడవచ్చు.

పై పటంలో DD- శ్రామికులకున్న మార్కెట్ డిమాండు రేఖ. SS – శ్రామికుల మార్కెట్ సప్లయి రేఖ. ఈ రెండూ A వద్ద పరస్పరం ఖండించుకుంటున్నాయి. అంటే మార్కెట్‌లో శ్రామికుల డిమాండు, సప్లయిలు రెండూ సమానంగా వున్నాయి. అప్పుడు మార్కెట్‌లో వేతనం OW వుంది. OWని సమతౌల్య వేతనం (Equilibrium Wage) అంటారు.

ఒక వేళ మార్కెట్‌లో వేతనం $OW^1$ వుంటే శ్రామికుల డిమాండు $W^1B$కి తగ్గుతుంది. అయితే వేతనం హెచ్చుగా వున్నందున శ్రామిక సప్లయి $W^1C$ వుంటుంది. అట్టి స్థితిలో శ్రామికుల మధ్య పోటీ ఏర్పడి వేతనం తిరిగి OWకి చేరుతుంది. అలాకాక ఒకవేళ వేతనం $OW^{11}$ వుంటే శ్రామికుల డిమాండు OF, సప్లయి OE వుంటుంది. ఇట్టి స్థితిలో ఉత్పత్తిదారుల మధ్య పోటీ ఏర్పడి వేతనం తిరిగి OWకి చేరుతుంది. కనుక దీర్ఘకాలంలో ఉత్పత్తి కారకం ధర దాని డిమాండు, సప్లయిలు సమానమైనచోట నిర్ణయించబడుతుంది. అంటే ప్రతి ఉత్పత్తి కారకం ధర దాని డిమాండు, సప్లయిలు నిర్ణయిస్తాయని ఈ సిద్ధాంతం స్పష్టం చేస్తుంది.

ఆధునిక ఆర్థికవేత్తలు ఈ డిమాండు - సప్లయి సిద్ధాంతాన్ని తృప్తికరమయిన సిద్ధాంతంగా పరిగణించారు.

**ప్రశ్న 3) ఉత్పత్తి కారకాల మార్కెట్‌లో సంస్థ సమతౌల్యం అంటే ఏమిటి ? అది ఎలా ఏర్పడుతుందో వివరించండి.**

**లేదా**

**ఉత్పత్తి కారకాల ధర పరిపూర్ణపోటీ మార్కెట్‌లోను, అపరిపూర్ణ పోటీ మార్కెట్‌లోను ఎలా నిర్ణయింపబడుతుందో వివరించండి.**

**లేదా**

**ఉత్పత్తి కారకాల మార్కెట్‌లో పరిపూర్ణ పోటీ, అపరిపూర్ణ పోటీ పరిస్థితులలో సంస్థ సమతౌల్యమెలా యేర్పడుతుందో వివరించండి.**

జవాబు : ప్రతి ఉత్పత్తి సంస్థ ఉత్పత్తి కారకాలయిన భూమి, శ్రమ, మూలధనంలకు ధర చెల్లించుకొంటుంది. భూమికి చెల్లించేదాన్ని 'భాటకం' (Rent) అని, శ్రమకు చెల్లించేదాన్ని 'వేతనాలు' (Wages) అనీ, మూలధనంకి చెల్లించేదాన్ని 'వడ్డీ' (Interest) అని అంటారు. ప్రతి సంస్థ యొక్క లక్ష్యం గరిష్ట లాభాలను సంపాదించటమే. కనుక ఏ ఉత్పత్తి కారకాన్ని ఏ పరిమాణంలో ఉపయోగిస్తే సంస్థకు గరిష్ట లాభాలు సమకూరుతాయో అదే ఉత్పత్తి కారకాల మార్కెట్‌లో సంస్థ సమతౌల్యం. ఈ సమతౌల్యం పరిపూర్ణ పోటీలో ఒక రకంగాను, అసంపూర్ణ పోటీలో మరో రకంగాను వుంటుంది. అందువల్ల రెండు పరిస్థితులలోను విడివిడిగా తెలుసుకోవలెను.

**పరిపూర్ణ పోటీలో సంస్థ సమతౌల్యం (Equilibrium under Perfect Competition) :** పరిపూర్ణపోటీ పరిస్థితిలో, ఒక సంస్థ ఉత్పత్తి కారకం ధరను ప్రభావితం చేయలేదు. ఉన్న ధరను అంగీకరించి వాటిని ఏ పరిమాణంలో ఉపయోగిస్తే సంస్థ గరిష్ట లాభాలను పొందగలుగుతుందో సంస్థే నిర్ణయించుకోవలె. ఉదాహరణకు, శ్రమను తీసుకుంటే - మార్కెటులో శ్రామికుల వేతనం ఇప్పటికే నిర్ణయింపబడి ఉంటుంది. ఆ వేతనంవద్ద అవసరమైన శ్రామికులను సంస్థ నియమించుకోవచ్చు. సంస్థ డిమాండు వేతనాన్ని ప్రభావితం చేయలేవు.




కనుక ఉపాంత వేతనం (MW), సగటు వేతనం (AW) రెండూ ఒక్కటే. అందువల్ల ఉపాంత వేతన రేఖ, సగటు వేతన రేఖ రెండూ ఏకమై X- అక్షానికి సమాంతరంగా ఒకే రేఖగా వుంటుంది. శ్రామికులను అదనంగా నియమించినకొద్దీ ఉపాంత ఉత్పాదకత తగ్గుతుంది. ఇందుకు కారణం క్షీణ ప్రతిఫలాలు రావటమే. ఉపాంత ఉత్పత్తి రాబడి (Marginal Revenue Product), ఉపాంత వేతనానికి సమానమయ్యేంతవరకూ (MRP=MW) సంస్థ శ్రామికులను నియమిస్తుంది. అప్పుడే సంస్థ యొక్క లాభాలు అత్యధికంగా వుండి, సంస్థ సమతౌల్య స్థితిలో వుంటుంది. సంస్థ సమతౌల్యాన్ని పై రేఖాపటం విశదీకరిస్తుంది.

పై పటంలో ఉపాంత ఉత్పత్తి రాబడి (MRP), ఉపాంత వేతనం (MW) T మరియు E బిందువులవద్ద సమానంగా వున్నాయి. అయితే T బిందువు వద్ద శ్రామిక నియామకం ఆపితే సంస్థకు గరిష్ట లాభాలు రావు. ఎందుకంటే T బిందువు దాటి శ్రామికులను పెంచితే వారి ఉపాంత ఉత్పత్తి రాబడి పెరుగుతున్నది. వేతనం మారకుండా అదనంగా నియమించిన శ్రామికులవల్ల ఉత్పత్తి రాబడి పెరుగుతుంటే లాభాలు కూడా పెరుగుతాయి. ఇలాంటి అవకాశాన్ని ఏ సంస్థ వదులుకోదు. అందువల్ల E బిందువువద్దనే సంస్థ సమతౌల్య స్థితిలో వుంటుంది. అంటే OW వేతనం వద్ద ON శ్రామికులను నియమించి ఉత్పత్తి కొనసాగిస్తే సంస్థ గరిష్ట లాభాలను పొందుతూ సమతౌల్యస్థితిలో వుంటుంది. పరిపూర్ణమైన పోటీలో ఉపాంత వేతనం, సగటు వేతనం సమానం కాబట్టి ఉపాంతోత్పత్తి రాబడికూడ సగటు వేతనానికి సమానంగా వుంటుంది.

వేతనాలు దీర్ఘకాలంలో ఉపాంతోత్పత్తి రాబడికేగాక సగటు ఉత్పత్తి రాబడి (Average Revenue Product)కి సమానంగా వుంటాయి. ఒకవేళ వేతనం సగటు ఉత్పత్తి రాబడికన్నా ఎక్కువగా వుంటే సంస్థకు నష్టాలు వస్తాయి. దాంతో శ్రమకు డిమాండు తగ్గి, వేతనాలుకూడ తగ్గి సగటు ఉత్పత్తి రాబడికి సమానమవుతాయి. అలాకాక ఒకవేళ వేతనం సగటు ఉత్పత్తి రాబడికంటే తక్కువగా వుంటే సంస్థకు అధిక లాభాలు వస్తాయి. దీంతో శ్రమకు డిమాండు పెరిగి, వేతనంకూడ పెరిగి తిరిగి వేతనం సగటు ఉత్పత్తి రాబడికి సమానమౌతుంది.




నియమితులైన శ్రామికులు

కనుక దీర్ఘకాలంలో పరిపూర్ణపోటీ మార్కెట్‌లో ఒక ఉత్పత్తి కారకం ధర లేక ప్రతిఫలం దాని ఉపాంతోత్పత్తి రాబడికి, సగటు ఉత్పత్తి రాబడికి సమానంగా వుంటుంది. ధర = MRP = ARP. దీన్నే పై రేఖాపటం విశదం చేస్తుంది.

**అపరిపూర్ణ పోటీలో సంస్థ సమతౌల్యం (Equilibrium under Imperfect Competition) :** అసంపూర్ణ పోటీకి ఉదాహరణగా మార్కెట్‌లో మోనోప్సని (Monopsony) వుందనుకుంటే ఉత్పత్తి కారకాన్ని కొనేవాడు ఒక్కడే. అతనికి ఈ ఉత్పత్తి కారకం కొనటంలో పోటీ ఎవరూ వుండరు. అంటే ఈ ఉత్పత్తి కారకం ఇంకెవరికీ అవసరంలేదు. కనుక ఏ ఉత్పత్తి కారకానికయినా చెల్లించవలసిన ధరపై ఇతని నియంత్రణ (Control) వుంటుంది. శ్రమ ఉదాహరణలో ఇతడు తలుచుకుంటే వేతనాన్ని పెంచగలడు లేదా తగ్గించగలడు కూడ. అదనంగా శ్రామికులను నియమించదలిస్తే ఎక్కువ వేతనాన్ని చెల్లించవలసి ఉంటుంది. అందువల్ల యిలాంటి సంస్థ సగటు వేతనాల రేఖ (AW) ఎడమనుంచి కుడికి పైకి పోతుంది. ఉపాంత వేతన రేఖ (MW) సగటు వేతన రేఖకు ఎగువగా ఉంటుంది. దీన్నే క్రింది పటంలో చూడవచ్చు.




నియమితులైన శ్రామికులు

పటంలో MRP- ఉపాంతోత్పత్తి రాబడి రేఖ, ARP - సగటు ఉత్పత్తి రాబడి రేఖ. ఉపాంత వేతనం ఉపాంతోత్పత్తి రాబడికి సమానమైనప్పుడు [MW=MRP] సంస్థ సమతౌల్య స్థితిలో వుంటుంది. పటంలో T బిందువు వద్ద ఈ రెండు సమానంగా ఉన్నాయి. ఈ స్థాయిలో సగటు వేతనం [AW] సగటు ఉత్పత్తి రాబడి [ARP] కన్నా తక్కువగా వుంది. కనుక సంస్థ QTSR దీర్ఘచతురస్రానికి సమానమైన లాభాలను పొందుతుంది. ఈ పరిస్థితిలో శ్రామికునికి చెల్లించే వేతనంకన్నా, అతన్ని నియమించటంవల్ల సంస్థకు వచ్చే రాబడి ఎక్కువగా వుంటుంది. దీన్నే "దోపిడీ" (Exploitation) అంటారు. కనుక అపరిపూర్ణపోటీలో ఉత్పత్తి కారకాల మార్కెట్‌లో "శ్రామిక దోపిడి" (Exploitation of Labour) జరుగుతుంది.

పై విశ్లేషణలో శ్రమ (Labour) ను వుదాహరణగా తీసుకోవటం జరిగింది. ఇదే విశ్లేషణ ఏ ఉత్పత్తి కారకానికయినా వర్తిస్తుంది.



అధ్యాయము 12

# జాతీయ ఆదాయము

**ప్రశ్న 1) జాతీయ ఆదాయము అనగానేమి ?**

జవాబు : జాతీయ ఆదాయము అనే భావనకు ఆధునిక అర్థశాస్త్రములో అత్యంత ప్రాముఖ్యత కలదు. దేశ ఆర్థికాభివృద్ధి జీవన ప్రమాణస్థాయి మొదలగునవి జాతీయ ఆదాయంపై ఆధారపడి ఉంటాయి. జాతీయ ఆదాయము అనగా **"ఒక సంవత్సర కాలంలో ఒక దేశంలో ఉత్పత్తి అయిన వస్తుసేవల మొత్తం విలువ అని అర్థము"**. జాతీయ ఆదాయమును అనేక మంది ఆర్థికవేత్తలు అనేక రకాలుగా నిర్వచించినారు.

**మార్షల్ నిర్వచనము** : "సహజ వనరుల సహాయంతో దేశములోని శ్రమ, మూలధనము ప్రతి సంవత్సరము ఉత్పత్తి చేసిన నికర వస్తుసేవల మొత్తానికి జాతీయ ఆదాయముగా 'మార్షల్' పేర్కొనెను".

**పిగో నిర్వచనము** : పిగో నిర్వచనం ప్రకారం "ద్రవ్యరూపంలో కొలవటానికి విదేశాల నుండి వచ్చే ఆదాయంతో సహా సంఘానికి సంప్రాప్తించే ఆదాయమే జాతీయ ఆదాయము" అని అంటారు. పిగో ప్రకారంగా ద్రవ్య రూపములో చేసే వస్తుసేవ లన్నింటిని జాతీయ ఆదాయంలో చేర్చవలెను.

**ప్రశ్న 2) జాతీయాదాయమునకు సంబంధించిన వివిధ భావనలను తెల్పుము.**

జవాబు : జాతీయాదాయములో తరుచుగా ఈ క్రింది భావనలు ఉపయోగిస్తూ ఉంటారు.

**1) స్థూల జాతీయోత్పత్తి** : ఒక సంవత్సర కాలంలో దేశంలో ఉత్పత్తి అయిన వస్తుసేవల మొత్తము విలువలను "స్థూల జాతీయోత్పత్తి" అంటారు. దేశంలోని శ్రమ, మూలధనము, సహజ వనరుల సహాయంతో ఉత్పత్తి చేసిన వస్తు సేవల మొత్తము విలువలను స్థూల జాతీయోత్పత్తిగా మార్షల్ పేర్కొన్నాడు. స్థూల జాతీయోత్పత్తిని లెక్కించేటప్పుడు అంతిమ వస్తుసేవల విలువలను మాత్రమే లెక్కలోనికి తీసుకోవలెను.

**2) నికర జాతీయోత్పత్తి** : వస్తువులను ఉత్పత్తి చేయటానికి ఉత్పత్తి యంత్రాలను ఉపయోగిస్తాము. వీటిని నిరంతరము ఉపయోగించటము వలన అవి పాతవై కొంత

కాలము తరువాత నిరుపయోగమవుతాయి. ఇట్లు యంత్రాల విలువలో ప్రతి సంవత్సరము కొంత తరుగుదల ఉంటుంది. ఈ తరుగుదలను స్థూల జాతీయోత్పత్తిలో నుంచి తీసివేస్తే నికర జాతీయోత్పత్తి వస్తుంది.

నికర జాతీయోత్పత్తి = స్థూల జాతీయోత్పత్తి -తరుగుదల.

**3) ఉత్పత్తికారకాల ఖరీదు దృష్ట్యా జాతీయ ఆదాయము :** ఉత్పత్తి ప్రక్రియలో పాల్గొన్నందుకు ఉత్పత్తి కారకాలకు ప్రతిఫలముగా భాటకము, వేతనం, వడ్డీ, లాభము చెల్లిస్తారు. ఇట్లా ఉత్పత్తి కారకాలకు చెల్లించిన మొత్తము ఉత్పత్తి సంస్థలకు ఉత్పత్తి వ్యయమవుతుంది. దీనినే ఉత్పత్తి కారకాల ఖరీదు దృష్ట్యా "జాతీయాదాయము" అంటారు. జాతీయాదాయము అంతా ఉత్పత్తి కారకాల మధ్య పంపిణీ కాదు. అందులో కొంత భాగము పరోక్ష పన్నుల క్రింద ప్రభుత్వానికి చెందుతుంది. మిగిలినది ఉత్పత్తి కారకాల మధ్య పంపిణీ అవుతుంది. కొన్ని వస్తువుల ఉత్పత్తికి ప్రభుత్వము సబ్సిడీలు ఇస్తుంది. వీటిని ఆదాయానికి కలుపవలెను.

ఉత్పత్తికారకాల ఖరీదు దృష్ట్యా జాతీయ ఆదాయము =

నికర జాతీయ ఆదాయము - పరోక్ష పన్నులు + సబ్సిడీలు.

**4) వ్యష్టి ఆదాయము :** ఒక సం॥ర కాలంలో దేశంలోని వ్యక్తులకు, సంస్థలకు లభించిన ఆదాయ మొత్తాన్ని "వ్యష్టి ఆదాయము" అంటారు. జాతీయ ఆదాయము అంతా వ్యక్తులకు చెందదు. అందులో కొంత భాగము కార్పొరేట్ పన్నులు, పంచని లాభాలు, సాంఘిక సంక్షేమ విరాళాలుగా మినహాయించడం జరుగుతుంది. ఇవి పోగా మిగిలిన ఆదాయము మాత్రమే వ్యక్తులకు లభిస్తుంది. బదిలీ చెల్లింపుల ద్వారా వస్తువులకు ప్రభుత్వం కొంత ఆదాయము వస్తుంది కావున.

**వ్యష్టి ఆదాయము :** జాతీయ ఆదాయము - కార్పొరేట్ పన్నులు, పంచి పెట్టని లాభాలు, సాంఘిక సంక్షేమ విరాళాలు + బదిలీ చెల్లింపులు.

**5) వ్యయార్హ ఆదాయము :** వ్యక్తులు తమకు వచ్చిన ఆదాయములో కొంత పన్నుల రూపములో ప్రభుత్వానికి చెల్లిస్తారు. ఇట్లాంటి వ్యష్టి పన్నులు పోగా మిగిలిన ఆదాయాన్ని "వ్యయార్హ ఆదాయము" అంటారు.

**ప్రశ్న3] జాతీయ ఆదాయం అనగానేమి ? జాతీయాదాయపు మదింపు పద్ధతులను తెల్పి, వాటి సమస్యలను, ప్రాముఖ్యతలను పేర్కొనుము.**

**జవాబు :** జాతీయాదాయము అనే భావనకు ఆధునిక అర్థశాస్త్రములో అత్యంత ప్రాముఖ్యత కలదు. దేశ ఆర్థికాభివృద్ధి జీవన ప్రమాణస్థాయి మొదలగునవి జాతీయాదాయంపై ఆధారపడి ఉంటాయి. **జాతీయ ఆదాయము అనగా "ఒక దేశంలో ఒక సంవత్సర కాలంలో ఉత్పత్తి అయిన వస్తు సేవల మొత్తం విలువ అని అర్థం".** మార్షల్ నిర్వచనం ప్రకారం సహజ వనరుల సహాయంతో దేశంలోని శ్రమ, మూలధనం,

ప్రతి సంవత్సరం ఉత్పత్తి చేసిన నికర వస్తుసేవల మొత్తాన్ని "జాతీయ ఆదాయం" అంటాము.

**మదింపు పద్ధతులు** : జాతీయ ఆదాయంను 3 విధాలుగా లెక్కించవచ్చును.

**1) ఉత్పత్తి మదింపు పద్ధతి** : ఈ పద్ధతిలో సంవత్సరకాలంలో ఉత్పత్తి అయిన వస్తుసేవల విలువను లెక్కించడం ద్వారా జాతీయాదాయాన్ని తెలుసుకొనవచ్చు. ఈ పద్ధతిలో జాతీయాదాయాన్ని లెక్కించుట కొరకు ఆర్థిక వ్యవస్థను వ్యవసాయము, భారీ పరిశ్రమలు, చిన్న పరిశ్రమలు, గనులు, వ్యాపార, వాణిజ్య సేవలు, రవాణా మొదలగు రంగాలుగా విభజించినారు. ఒక సంవత్సర కాలంలో ఈ రంగాల నుండి ఉత్పత్తి అయిన వస్తుసేవల విలువలను తెలుసుకొని వాటి మొత్తాన్ని కలిపితే జాతీయ ఆదాయం తెలుస్తుంది. ఈ పద్ధతిలో జాతీయ ఆదాయాన్ని లెక్కించేటప్పుడు ఈ క్రింది జాగ్రత్తలు తీసుకోవలెను.

1) అంతిమ వస్తువుల విలువలను మాత్రమే లెక్కలోనికి తీసుకోవలెను.
2) మధ్య రకపు వస్తువుల విలువలను లెక్కలోకి తీసుకొనకూడదు.
3) అంతిమ వస్తువుల విలువలను పూర్తిగా లెక్కలోకి తీసుకొన్నప్పుడు మరల వాటిని తయారు చేయటానికి ఉపయోగించిన ముడి సరకుల విలువలను లెక్కలోకి తీసుకొనకూడదు.

**2) ఆదాయాల మదింపు పద్ధతి** : ఈ పద్ధతిలో జాతీయాదాయాన్ని పంపిణీ వైపు నుంచి లెక్కించటం జరుగుతుంది. ఒక సంవత్సరకాలంలో వ్యక్తులకు, వ్యాపార సంస్థలకు, ప్రభుత్వానికి వచ్చిన ఆదాయాన్ని తీసుకొని వాటిని కలిపితే "జాతీయ ఆదాయం" తెలుస్తుంది. ఉత్పత్తి కారకాలయిన భూమి, శ్రమ, మూలధనం, వ్యవస్థాపనల వలన ప్రజలకు ఆదాయం వస్తుంది. భూమి మీద 'భాటకము', 'శ్రమ' వలన 'వేతనము'' మూలధనంపై 'వడ్డీ', వ్యవస్థాపన వలన లాభాలు లభిస్తాయి. వీటన్నిటినీ కలిపినట్లయితే జాతీయాదాయం తెలుస్తుంది. ఈ పద్ధతి వలన జాతీయాదాయం దేశంలో ఏ ఏ వర్గ ప్రజలకు ఎంత నిష్పత్తిలో పంపిణీ అవుతుందో తెలుసుకొనవచ్చును. ఈ పద్ధతి ద్వారా జాతీయాదాయం లెక్కించేటప్పుడు కొన్ని జాగ్రత్తలు తీసుకోవలెను.

1) వ్యక్తుల, సంస్థల నికర ఆదాయాలు మాత్రమే లెక్కలోకి తీసుకొనవలెను.
2) బదిలీ చెల్లింపులను మినహాయించవలెను.
3) పంచి పెట్టని కంపెనీ లాభాలను జాతీయ ఆదాయమునకు కలుపవలెను.
4) ఇతరుల దగ్గర పనిచేయకుండా సొంతంగా సంపాదించుచున్న ఆదాయాలను కూడా కలుపవలెను.
5) ఎగుమతుల ద్వారా లభించిన ఆదాయాలను కలుపవలెను. ఎగుమతుల ద్వారా కోల్పోయిన ఆదాయాన్ని మినహాయించవలెను.

**3) వ్యయాల మదింపు పద్ధతి** : ఈ పద్ధతిలో జాతీయ ఆదాయాన్ని వ్యయాల వైపు నుంచి లెక్కిస్తారు. ఒక సంవత్సర కాలంలో వస్తుసేవలపై ఖర్చు పెట్టిన మొత్తాన్ని కలిపినచో జాతీయ ఆదాయం తెలుస్తుంది. సాధారణంగా వ్యక్తులు, సంస్థలు, ప్రభుత్వము రెండు రకాల వస్తువులపై ఖర్చు చేయును. 1) వినియోగ వస్తువులు 2) ఉత్పాదక వస్తువులు.

ఈ రెండు రకాల వస్తువులపై వ్యక్తులు, సంస్థలు, ప్రభుత్వం ఖర్చు పెట్టిన మొత్తాన్ని కలిపినట్లయితే జాతీయ ఆదాయం తెలుస్తుంది.

పైన వివరించిన మూడు మదింపు పద్ధతులను ఉపయోగించి జాతీయ ఆదాయాన్ని మదింపు చేయవచ్చును. మనదేశంలో జాతీయ ఆదాయాన్ని మదింపు చేయటానికి ఉత్పత్తి ఆదాయాల మదింపు పద్ధతులను ఉపయోగిస్తున్నారు.

సమస్యలు : జాతీయ ఆదాయాన్ని లెక్కించటంలో ఈ క్రింది సమస్యలు ఎదురవుతాయి.

1) వ్యక్తి తన కుటుంబానికి చేసిన సేవలను ద్రవ్యంతో విలువ కట్టటానికి వీలులేని సేవలను ఏ విధంగా జాతీయ ఆదాయంలోకి చేర్చవలెనో తెలియుటలేదు.
2) ఉత్పత్తి అయిన మొత్తం ఉత్పత్తిలో కొంత భాగాన్ని ఉత్పత్తిదారులే వినియోగిస్తారు. మార్కెట్‌లోకి రానటువంటి వస్తువుల విలువలను జాతీయ ఆదాయంలోకి తీసుకొనలేకపోతున్నాము. వెనుకబడిన దేశాలలో ఎక్కువగా వస్తు మార్పిడి పద్ధతి అమలులో ఉంటుంది. అటువంటి ఆర్థిక వ్యవస్థలో జాతీయాదాయంను లెక్కకట్టుట కష్టము.
3) ఉత్పత్తి మదింపు పద్ధతిలో అంతిమ వస్తు సేవల విలువలను మాత్రమే లెక్కలోనికి తీసుకొనవలెను. కానీ ఏది అంతిమ వస్తువు ఏది మధ్యరకపు వస్తువో తెలుసుకొనుట కష్టము. కాబట్టి జాతీయ ఆదాయపు లెక్కలో ఒకే వస్తువును రెండుసార్లు లెక్కించు ప్రమాదం కలదు.
4) జాతీయ ఆదాయం లెక్కించుటకు ఎంతో సమాచారం అవసరము. కానీ వెనుకబడిన దేశాలలో సరిఅయిన గణాంక సమాచారం లభించదు. ఈ దేశాల్లో వ్యవసాయ రంగంలో ఎక్కువమంది నిరక్షరాస్యులు. వారు లెక్కలను తయారు చేయరు.
5) వ్యయాలకు సంబంధించిన సమాచారమును తెలుసుకొనుట కష్టమవుతుంది. ప్రజలు కొన్ని కొన్ని ఖర్చులను లెక్కలోనికి చూపించరు.
6) ఒకే వ్యక్తి అనేక మార్గాల నుండి ఆదాయంను సంపాదించుకోవచ్చు. కానీ ఆ వ్యక్తి కొన్ని ఆదాయాలను మాత్రమే చూపుతాడు. మిగిలినవాటిని పన్నులు ఎగవేసే నిమిత్తములో చూపించకపోవచ్చును. అందువల్ల ఖచ్చితమయిన జాతీయాదాయం తెలుసుకొనుట కష్టమగును.

**ప్రాముఖ్యత :** జాతీయ ఆదాయ లెక్కల వలన ఈ క్రింది ఉపయోగాలు కలవు.

1) ఆర్థిక వ్యవస్థ స్వరూపాన్ని ఖచ్చితంగా తెలుసుకొనుటకు జాతీయాదాయం లెక్కలు తోడ్పడతాయి.
2) జాతీయ ఆదాయపు లెక్కల సహాయంతో ద్రవ్యోల్బణ, ప్రతిద్రవ్యోల్బణ ధోరణులను అంచనా వేయవచ్చును.
3) లెక్కల సహాయంతో ప్రపంచంలోని వివిధ దేశాలలోని ప్రజల జీవన ప్రమాణ స్థాయిలను తెలుసుకొనవచ్చును.

4) ఒక దేశం అభివృద్ధి చెందుతున్నదా లేదా తెలుసుకోవడానికి జాతీయ ఆదాయపు లెక్కలు తోడ్పడతాయి.

5) ఆర్థిక వ్యవస్థలో ఒక్కొక్క రంగం యొక్క ప్రాముఖ్యతను తెలుసుకొనుటకు జాతీయాదాయపు లెక్కలు సహాయపడతాయి.

6) ప్రణాళికా సంఘానికి ప్రణాళికలను తయారు చేయటానికి జాతీయ ఆదాయపు లెక్కలు సహాయపడతాయి. జాతీయ ఆదాయపు లెక్కలు ఆర్థిక మంత్రికి ఎంతో అవసరము. ఆర్థిక మంత్రి ఈ లెక్కలను ఆధారంగా చేసుకొని పారిశ్రామిక విధానాలను, బడ్జెట్‌ను తయారు చేయటం జరుగుతుంది.

**ప్రశ్న 4) జాతీయ ఆదాయపు లెక్కల ప్రాముఖ్యము తెల్పుము.**

**జవాబు : జాతీయాదాయపు లెక్కల ప్రయోజనాలు :**

**1) వివిధ రంగాల ప్రాధాన్యత తెలుస్తుంది :** జాతీయాదాయపు లెక్కలు ఆర్థిక వ్యవస్థలో అన్ని వస్తుసేవల ఉత్పత్తి వివరాలను తెలియచేస్తాయి. ఈ వివరాల ద్వారా ఏ రంగంలో ఉత్పత్తి ఏ తీరులో ఉందో తెలుసుకోవచ్చు. దీన్ని బట్టి ఆర్థిక వ్యవస్థలో ఆ యా రంగాలకున్న ప్రాధాన్యత తెలుస్తుంది. అంతేగాక వెనుకబడిన రంగాలను గుర్తించి, వాటిని అభివృద్ధిపరచటానికి అవకాశం ఏర్పడుతుంది.

**2) జీవనప్రమాణ స్థాయిని తెలుసుకోవచ్చు :** జాతీయాదాయాన్ని దేశంలోని జనాభాతో భాగిస్తే తలసరి ఆదాయం (Per capita Income) వస్తుంది. ఈ తలసరి ఆదాయాన్ని బట్టి ప్రజల జీవనప్రమాణ స్థాయిని తెలుసుకోవచ్చు. తరుచు జాతీయాదాయాన్ని తద్వారా తలసరి ఆదాయాన్ని తెలుసుకోవటం వల్ల ప్రజల జీవన ప్రమాణం పెరుగుతున్నది లేనిదీ తెలుసుకొనటానికి వీలవుతుంది.

**3) ఆర్థిక వ్యవస్థ పోకడ తెలుస్తుంది :** జాతీయాదాయపు వివరాలు దేశం యొక్క ఆర్థిక పురోభివృద్ధిని తెలియ చేస్తాయి. జాతీయాదాయం దానితోపాటు తలసరి ఆదాయం పెరుగుతుంటే దేశం ఆర్థికంగా పురోభివృద్ధి చెందుతున్నదని, తగ్గుతుంటే దేశంలో ఆర్థికాభివృద్ధి కుంటుపడిందని గ్రహించవలెను.

**4) అభివృద్ధి ప్రణాళికల తయారీకి తోడ్పడుతాయి :** జాతీయాదాయపు వివరాల వల్ల దేశంలో ఎంత ఆదాయం వినియోగింపబడుతున్నదీ, ఎంత పొదుపు చేయబడుతున్నదీ, ఎంత మూలధనంగా పెట్టుబడి పెట్టబడుతున్నదీ తెలుస్తుంది. ఈ వివరాలు అభివృద్ధి ప్రణాళికల తయారీకి ఎంతో అవసరం. వీటిని బట్టే ప్రణాళిక పెట్టుబడిని నిర్ణయిస్తారు. ఈ పెట్టుబడి స్థాయిని బట్టి దేశంలో అభివృద్ధి రేటును తెలుసుకోవచ్చు. వినియోగం, పొదుపు, పెట్టుబడి స్థాయి, వివరాలు, ఉద్యోగితాస్థాయి విశ్లేషణకు కూడా తోడ్పడుతాయి.

**5) ప్రభుత్వ విధానాలను రూపొందించటానికి తోడ్పడుతాయి :** జాతీయాదాయపు వివరాలు ప్రభుత్వ ఆర్థిక విధానాన్ని, పారిశ్రామిక విధానాన్ని, పన్నుల విధానాన్ని రూపొందించుకోవటానికి ఉపయోగపడతాయి. అంతేగాక ఆర్థిక రంగంలో ప్రభుత్వం చేపట్టవలసిన అనేక కార్యక్రమాల రూపకల్పనకు కూడా ఈ వివరాలు ఎంతో తోడ్పడతాయి.

**6) వివిధ వర్గాల మధ్య ఆదాయ పంపిణీ తెలుస్తుంది :** జాతీయాదాయపు వివరాలు వివిధ వర్గాల మధ్య ఆదాయం ఎలా పంపిణీ అయిందో తెలియచేశాయి. దీనివల్ల ఆదాయాల్లో అసమానతలున్నదీ లేనిదీ తెలుస్తుంది. అసమానతలుంటే వాటిని తగ్గించటానికి ప్రభుత్వం తగిన చర్యలు తీసుకోటానికి అవకాశ మేర్పడుతుంది.

**7) ప్రజల కొనుగోలు శక్తి తెలుస్తుంది :** వ్యయార్హ ఆదాయాన్ని (Disposable Income) బట్టి ప్రజల కొనుగోలు శక్తి (PurchasingPower) తెలుస్తుంది. దీన్ని బట్టి వస్తుసేవలకుండే డిమాండును అంచనా వేయవచ్చు.

**8) వివిధ దేశాల ఆర్థిక స్థితిని పోల్చటానికి అవసరం :** వివిధ దేశాల్లోని ప్రజల ప్రమాణస్థాయిలను తెలుసుకోటానికి జాతీయాదాయపు వివరాలు ఉపయోగపడతాయి. ఏ దేశంలో ప్రజలు ఉన్నత జీవన ప్రమాణాన్ని కలిగి ఉన్నారో, తలసరి ఆదాయ వివరాలను పోల్చి చూసి తెలుసుకోవచ్చు. ఈ జీవన ప్రమాణ స్థాయిని బట్టి వివిధ దేశాలను అభివృద్ధి చెందిన దేశాలని, చెందుతున్న దేశాలని, వెనుకబడిన దేశాలని విభజన చేయటానికి వీలు ఏర్పడుతుంది.

**ప్రశ్న 5) జాతీయ ఆదాయ మదింపులో గల సమస్యలను తెల్పుము.**

**జవాబు :** జాతీయ ఆదాయమును లెక్కించటములో ఎన్నో సమస్యలు, ఇబ్బందులు ఎదురౌతాయి. ముఖ్యముగా వెనుకబడిన దేశాలలో అనేక క్రొత్త సమస్యలు ఎదురౌతాయి. ఈ సమస్యలను ఈ క్రింది విధముగా పేర్కొనవచ్చును.

**1) సేవల విలువ :** వ్యక్తి తన కుటుంబానికి చేసిన సేవలను ద్రవ్యముతో విలువ కట్టడానికి వీలులేని సేవలను ఏ విధంగా జాతీయ ఆదాయంలో చేర్చవలెనో తెలియటం లేదు.

**2) సొంత వినియోగానికి ఉపయోగించిన ఉత్పత్తి :** ఉత్పత్తి అయిన మొత్తం ఉత్పత్తిలో కొంత భాగాన్ని ఉత్పత్తిదారులే వినియోగిస్తారు. ఉదా॥ వ్యవసాయదారుడు తను ఉత్పత్తి చేసిన మొత్తం ఉత్పత్తిని మార్కెట్‌లో అమ్మాడు. కొంతభాగాన్ని తన కుటుంబ అవసరాల కోసం ఉంచుకుంటాడు. కావున మార్కెటులోకి రానటువంటి వస్తువుల విలువలను జాతీయ ఆదాయములోనికి తీసుకొనలేకపోతున్నాము.

**3) వస్తు మార్పిడి పద్ధతి :** ఆర్థికంగా వెనుకబడిన దేశాలలో ఎక్కువగా వస్తు మార్పిడి పద్ధతి అమలులో యుంటుంది. అటువంటి ఆర్థిక వ్యవస్థలో జాతీయ ఆదాయమును లెక్కకట్టుట కష్టము.

**4) రెండుసార్లు లెక్కింపు :** ఉత్పత్తి మదింపు పద్ధతిలో అంతిమ వస్తుసేవల విలువలను మాత్రమే లెక్కలోకి తీసుకొనవలెను. కాని ఏది అంతిమ వస్తువో, మధ్యరకపు వస్తువో తెలుసుకొనటం కష్టము. కాబట్టి జాతీయాదాయపు లెక్కలో ఒకే వస్తువును రెండుసార్లు లెక్కించే ప్రమాదము కలదు.

**5) సమాచారం లభ్యం కాకపోవటం :** జాతీయ ఆదాయమును లెక్కించుటకు చాలా వివరణలు అవసరము. కాని వెనుకబడిన దేశాలలో సరిఅయిన గణాంక సమాచారం లభించదు. ఈ దేశాలలో వ్యవసాయదారులలో ఎక్కువమంది నిరక్షరాస్యులు. వారు ఉత్పత్తి వివరాలను తయారు చేయరు.

**6) వ్యయాలకు సంబంధించిన సమాచారము :** వ్యయాలకు సంబంధించిన సమాచారమును తెలుసుకోవటం కష్టమవుతుంది. ప్రజలు మద్యపానం, జూదం మొదలగు చెడు అలవాట్లపై పెట్టే ఖర్చును లెక్కలో చూపించరు. అందుచేత ఖచ్చితమైన జాతీయ ఆదాయమును తెలుసుకోవటం కష్టమవుతుంది.

**7) ఆదాయాల మదింపులో గల సమస్యలు :** ఆదాయాల మదింపులో కూడా కొన్ని సమస్యలు కలవు. ఒక వ్యక్తి అనేక మార్గాల నుండి ఆదాయాన్ని సంపాదించుకోవచ్చు. కాని, ఆ వ్యక్తి కొన్ని ఆదాయాలను మాత్రమే చూపిస్తాడు. మిగిలినవాటిని పన్నులు ఎగవేసే నిమిత్తముతో చూపించకపోవచ్చును. అందుచేత ఖచ్చితమైన జాతీయ ఆదాయమును తెలుసుకొనుట కష్టమవుతుంది.

**ప్రశ్న 6) ఉత్పాదక ఉత్పత్తి మాత్రిక అనగానేమి ?**

**జవాబు :** ఉత్పాదక ఉత్పత్తి మాత్రిక వివిధ పరిశ్రమల పరస్పర ఆధారాన్ని తెలియ చేస్తుంది. ఒక పరిశ్రమ తయారు చేసిన వస్తువు మరొక పరిశ్రమ ఉత్పాదక వస్తువు అవుతుంది. ఈ ఉత్పాదక వస్తువును ఉపయోగించి రెండవ పరిశ్రమ మరొక ఉత్పాదక వస్తువును తయారు చేస్తుంది.

**ఉదా :** ఉక్కు పరిశ్రమలో తయారైన ఉక్కు, యంత్ర నిర్మాణ పరిశ్రమకు ఉత్పాదక వస్తువు అవుతుంది. యంత్ర నిర్మాణ పరిశ్రమలో తయారైన యంత్రము వినియోగ వస్తువులను తయారుచేసే పరిశ్రమకు ఉత్పాదక వస్తువు అవుతుంది. ఈ విధముగా ఒక పరిశ్రమ మరొక పరిశ్రమ మీద ఆధారపడి ఉంటుంది.

"లియాంటిఫ్" అనే అర్థశాస్త్రవేత్త ఉత్పాదక సంస్థల పరస్పర ఆధారాన్ని చూపే ఒక పట్టికను తయారు చేసినాడు. దీనినే "ఉత్పాదక ఉత్పత్తి మాత్రిక" అంటారు. ఈ

మాత్రిక ఒక రంగము నుంచి మరొక రంగానికి వస్తుసేవల ప్రవాహాన్ని చూపుతుంది. దీనిని ఈ క్రింది పట్టికలో చూపినాము.

| ఉత్పాదక పరిశ్రమ | కొనుగోలు పరిశ్రమ బొగ్గు | ఉక్కు | కుటుంబం | మొత్తం ఉత్పత్తి |
|---|---|---|---|---|
| బొగ్గు | -- | 7 | 5 | 12 |
| ఉక్కు | 5 | -- | 5 | 10 |
| కుటుంబం | 4 | 4 | -- | 8 |

పై పట్టికలో బొగ్గు పరిశ్రమలో తయారైన బొగ్గు ఉక్కు పరిశ్రమకు ఉత్పాదక వస్తువు అవుతుంది. అలాగే ఉక్కు పరిశ్రమలో తయారైన ఉక్కు బొగ్గు పరిశ్రమకు ఉత్పాదక వస్తువు అవుతుంది. ఈ విధంగా పరిశ్రమల మధ్య పరస్పర సంబంధం ఉంటుంది.

**ప్రశ్న 7) సాంఘిక లెక్కలు అనగానేమి ? వాటి ప్రయోజనాలను తెల్పుము.**

**జవాబు :** ఒక నిర్ణీత కాలంలో ఆర్థిక వ్యవస్థ పనిచేసిన తీరుకు సంబంధించిన సంఖ్యా వివరాలను తెల్పుటయే జాతీయ ఆదాయపు అకౌంట్ల లక్ష్యం. ఇందుకుగాను ఆర్థిక వ్యవస్థను కొన్ని రంగాలుగా విభజించి, ఒక్కొక్క రంగంలో ఉత్పన్నమైన ఆదాయాన్ని, అది వ్యయం చేయబడిన విధానాన్ని తెల్పేందుకు కొన్ని ప్రత్యేకమైన అకౌంట్లు తయారు చేస్తారు. వాటినే "జాతీయ ఆదాయ అకౌంట్లు" లేక "సోషల్ అకౌంట్స్" అని అంటారు. వీటికి కొన్ని ప్రత్యేక ప్రయోజనాలు ఉన్నాయి. అవి :

1) ఆర్థిక వ్యవస్థలో ఉత్పత్తి వ్యయానికి సంబంధించిన కార్యకలాపాలను పరిమాణాత్మకంగా తెలుసుకోవచ్చు.
2) వివిధ రంగాలలో ఉత్పన్నమౌతున్న ఆదాయం, అది వ్యయమౌతున్న తీరు తెలుస్తుంది.
3) వస్తుసేవలకు డిమాండు ఏ ఏ రంగాల నుండి ఎంతెంత వస్తున్నదీ తెలుస్తుంది.
4) ప్రభుత్వ ఆదాయ, వ్యయ అకౌంట్ల ద్వారా ఆర్థిక వ్యవస్థలో ప్రభుత్వం నిర్వహించనున్న పాత్ర తెలుస్తుంది.
5) పొదుపు, పెట్టుబడి అకౌంట్ల ద్వారా ఆదాయ నిర్ణయంలో ప్రధాన పాత్ర నిర్వహించే పొదుపు, పెట్టుబడుల స్థాయి తెలుస్తుంది. అంటే ఆర్థిక విధానాలను రూపొందించటానికి ఈ అకౌంట్లు తోడ్పడతాయి.
6) విదేశీ వ్యాపార అకౌంట్ల ద్వారా వ్యాపారానికి సంబంధించిన వివరాలు తెలుస్తాయి.

7) ఇన్వెంటరీల పరిమాణంలో వచ్చే మార్పులను తెలుసుకోవచ్చు.
8) మూలధన తరుగుదల పరిమాణం తెలుస్తుంది.
9) నిధుల ప్రవాహ అకౌంటు ద్రవ్య మార్కెట్‌కు, వస్తుసేవల మార్కెట్‌కు ఉన్న సంబంధాన్ని తెల్పుతుంది.

**ప్రశ్న 8) జాతీయ ఆదాయములోని వివిధ భాగాలను తెల్పుము.**

జవాబు : ఆర్థిక వ్యవస్థలో ఒక సం॥ కాలంలో ఉత్పత్తి అయిన వస్తుసేవల మొత్తం విలువను "జాతీయ ఆదాయము" అంటాము. ఉత్పత్తి అయిన వస్తురాశిని మూడు రకాలైన వ్యయ సంస్థలు కొంటాయి. అవి :

**1) కుటుంబాలు లేక వినియోగదారులు :** వీరు వినియోగ వస్తువులను కొంటారు. వీరు వినియోగ వస్తువులపై చేసే వ్యయాన్ని "వినియోగ వ్యయము" అంటారు.

**2) వ్యాపార సంస్థలు :** వ్యాపార సంస్థలు యంత్రాల లాంటి ఉత్పాదక వస్తువులను కొంటాయి. వీటిపై చేసే వ్యయాన్ని "పెట్టుబడి వ్యయము" అంటాము.

3) ప్రభుత్వం : ప్రభుత్వం వినియోగ వస్తువులను, ఉత్పాదక వస్తువులను కొంటుంది. వీటిపై ప్రభుత్వం చేసే వ్యయాన్ని "ప్రభుత్వ వ్యయం" అంటాము.

వినియోగ వ్యయము (C), పెట్టుబడి వ్యయము (I), ప్రభుత్వ వ్యయము (G) మొత్తాన్ని కలిపి "జాతీయ ఆదాయము" అంటాము. కావున

జాతీయ ఆదాయము = వినియోగ వ్యయము + పెట్టుబడి వ్యయము + ప్రభుత్వ వ్యయం.

$Y = C + I + G$    Y = జాతీయాదాయము

C = వినియోగ వ్యయము    I = పెట్టుబడి వ్యయము

G = ప్రభుత్వ వ్యయము.

విదేశీ వ్యాపారాన్ని కూడా లెక్కలోకి తీసుకుంటే నికర ఎగుమతులు కూడా జాతీయ ఆదాయములో ఒక భాగము అవుతాయి. అప్పుడు

జాతీయ ఆదాయము = వినియోగ వ్యయము + పెట్టుబడి వ్యయము + ప్రభుత్వ వ్యయము + నికర ఎగుమతులు. కావున

$Y = C + I + G + X - m$    Y = జాతీయ ఆదాయము

C = వినియోగ వ్యయము    I = పెట్టుబడి వ్యయము

G = ప్రభుత్వ వ్యయము    X – M = నికర ఎగుమతులు



# అధ్యాయము 13

# ఉద్యోగితా సిద్ధాంతాలు

**ప్రశ్న 1) సాంప్రదాయక ఉద్యోగితా సిద్ధాంతమును తెల్పుము.**

జవాబు : సాంప్రదాయ అర్థికవేత్తలు ప్రత్యేకంగా ఉద్యోగితా సిద్ధాంతాన్ని ప్రతిపాదించలేదు. వారి అభిప్రాయాలను సమన్వయపరిచిన ఒక సిద్ధాంతమును పేర్కొనటం జరిగింది. రికార్డో, J. S. మిల్, A.C. పిగూ, J. B. సే మొదలగువారు సాంప్రదాయక అర్థికవేత్తలు. వీరి సిద్ధాంతాలు క్రింది ప్రమేయాల ఆధారంగా రూపొందించబడ్డాయి.

1) శ్రమ, ఇతర వనరులు ఎప్పుడూ సంపూర్ణ ఉద్యోగితా స్థితిలో ఉంటాయి.
2) అర్థిక వ్యవస్థలు సార్వత్రిక అధికోత్పత్తిగాని, సార్వత్రిక నిరుద్యోగిత గాని ఉండవు.
3) మార్కెట్ యంత్రాంగము స్వేచ్ఛగా పని చేసినప్పుడే, సాంప్రదాయ అర్థికవేత్తల ఉద్యోగితా సిద్ధాంతము మూలాధారము సంపూర్ణ ఉద్యోగిత ఉంటుంది.
4) J. B. సే ప్రతిపాదించిన మార్కెట్ సూత్రము, సాంప్రదాయ అర్థికవేత్తల ఉద్యోగితా సిద్ధాంతానికి మూలాధారము.

**'సే' మార్కెట్ సూత్రము :** "సప్లయి దానికి తగిన డిమాండ్‌ను సృష్టించుకొంటుంది' ' అనే సూత్రాన్ని సే ప్రతిపాదించాడు. దీన్ని "సే మార్కెట్ సూత్రము" అంటారు. ఇతని ఉద్దేశంలో మార్కెట్‌కి సప్లయి చేయబడే ఉత్పత్తికి సరిపడే డిమాండు వినియోగదార్ల నుండి ఎప్పుడూ ఉంటుంది. ఉదాహరణకు ఒక లక్ష రూపాయల విలువ గల ఉత్పత్తిని చేస్తే, ఆ లక్ష రూపాయల వ్యయం భాటకము, వేతనాలు, వడ్డీ, లాభాల రూపంలో ఉత్పత్తి కారకములకు చెల్లించబడుతుంది. అంటే ఉత్పత్తికి సమానమైన డిమాండు లేక కొనుగోలు శక్తి ప్రజలకు అందించబడుతుంది. అది ఆ ఉత్పత్తికి డిమాండు అవుతుంది. ఈ విధంగా సప్లయి తనకు సరిపడే డిమాండును సృష్టించుకోవడంలో అర్థిక వ్యవస్థలో సార్వత్రిక అధికోత్పత్తి అంటూ ఉండదు.

సాంప్రదాయ అర్థికవేత్తల ప్రకారంగా, ఉత్పత్తి ప్రక్రియ ద్వారా వచ్చిన ఆదాయము వినియోగ వస్తువులపై వ్యయంగా గాని, లేక పొదుపుగా గాని చేయబడుతుంది. ఈ పొదుపు అంతా తిరిగి పెట్టుబడిగా పెట్టబడుతుంది. అంటే సమాజంలో పొదుపు,

పెట్టుబడి ఎప్పుడు సమానంగానే ఉంటాయి. పొదుపు, పెట్టుబడిని సమానం చేయడంలో వడ్డీ రేటు ప్రధాన పాత్ర వహిస్తుంది. పొదుపు పెరిగినప్పుడు మూలధన సంచయనం ఎక్కువ అవుతుంది. మూలధనం పెరిగినప్పుడు వడ్డీరేటు తగ్గుతుంది. ఫలితంగా పెట్టుబడి పెరుగుతుంది. ఈ విధంగా పొదుపు అంతా పెట్టుబడిగా మారటం ఆ వరకు వడ్డీ రేటు తగ్గుతూనే ఉంటుంది. చివరకు పొదుపు పెట్టుబడి సమానమౌతాయి.

వేతనం రేటు శ్రామికుల సప్లయి డిమాండుల మధ్య సమతౌల్యాన్ని ఏర్పరుస్తుంది. వేతనం రేటులో ఉండే సరళత్వం ఫలితంగా పని కావాలని ముందు వచ్చే ప్రతివారికి ఉపాధి దొరుకుతుంది. ఏదైనా ఒక సమయంలో నిరుద్యోగిత ఉండే వేతనం రేటు తగ్గుతుంది. తక్కువ వేతనం రేటు ఎక్కువ లాభదాయకం అవటంతో యజమానులు ఎక్కువ మంది శ్రామికులను నియమిస్తారు. దీంతో ఉద్యోగిత పెరుగుతుంది. ఈ విధంగా సంపూర్ణ ఉద్యోగిత సాధించబడుతుంది.

పిగూ కూడా నిరుద్యోగితకు కారణం వేతనం రేటు ఎక్కువగా ఉండడమే అని అంటాడు. అతని అభిప్రాయంలో వేతనాలు తగ్గిస్తే ఉత్పత్తి వ్యయం తగ్గి ధరలు తగ్గుతాయి. ఫలితంగా డిమాండు పెరిగి, ఉత్పత్తిని పెంచవలసి వస్తుంది. దీనివల్ల ఉద్యోగిత పెరుగుతుంది.

దీనిని ఈ క్రింది రేఖాపటములో చూపినాము.




పై పటములో వేతనం రేటు OW నుంచి $OW_1$ కి తగ్గించడము వల్ల, ఉద్యోగిత ON నుంచి $ON_1$ కు పెరుగుతుంది.

**సాంప్రదాయ సిద్ధాంతంపై విమర్శ :** సాంప్రదాయ ఉద్యోగితా సిద్ధాంతాన్ని కీన్స్ ఈ క్రింది విధంగా విమర్శించెను.

1) సప్లయి దానికి సరిపడే డిమాండు సృష్టించుకుంటుంది. : కీన్స్ అభిప్రాయంలో ఇది అన్నివేళల నిజం కాదు. ఈ సూత్రం ప్రజలు వారి ఆదాయాన్నంతటిని వ్యయం చేస్తారనే ప్రమేయం మీద ఆధారపడి ఉన్నది. కాని ప్రజలు భవిష్యత్ అవసరాలకు కొంత పొదుపు చేయవచ్చు. ఆ మేరకు వస్తువులకు డిమాండు తగ్గి, కొంత విక్రయం కాకుండా నిల్చిపోయి అధికోత్పత్తికి దారితీస్తుంది. కనుక 'సే' మార్కెట్ సూత్రం అవాస్తవికమని విమర్శకుల అభిప్రాయము.

2) వేతనం రేటును తగ్గించటం ద్వారా ఉద్యోగిత పెరుగుతుంది : సాంప్రదాయ అర్థికవేత్తల అభిప్రాయం ప్రకారంగా వేతనం రేటును తగ్గించటం ద్వారా ఉద్యోగితను పెంచవచ్చును. కాని కీన్స్ ప్రకారం వేతనం రేటు తగ్గినప్పుడు శ్రామికుల ఆదాయాలు తగ్గి సమిష్టి డిమాండు తగ్గుతుంది. ఫలితంగా ఉత్పత్తి తగ్గి నిరుద్యోగిత ఏర్పడుతుంది.

3) సంపూర్ణ పోటీ : సాంప్రదాయ అర్థికవేత్తల సిద్ధాంతము సంపూర్ణ పోటీ అనే ప్రమేయంపై ఆధారపడి ఉన్నది. కాని సంపూర్ణ పోటీ వాస్తవంలో చాలా అరుదు.

4) వేతనాల సరళత్వం : వేతనాల రేటును నిర్ణయించటములో ప్రభుత్వ జోక్యం కాని, కార్మిక సంఘాలపాత్ర గాని యుండదని సాంప్రదాయ అర్థికవేత్తల భావన. కాని వాస్తవంలో వేతనాల తగ్గుదలను కార్మిక సంఘాలు ప్రతిఘటిస్తాయి.

5) సంపూర్ణ ఉద్యోగిత : సాంప్రదాయ అర్థికవేత్తల అభిప్రాయంలో, అర్థిక వ్యవస్థ ఎప్పుడూ సంపూర్ణ ఉద్యోగిత వద్ద స్థిరసమతౌల్యంలో ఉంటుంది. కాని కీన్స్ ప్రకారంగా, అల్ప ఉద్యోగిత అర్థిక వ్యవస్థ యొక్కసాధారణ లక్షణం.

పై విమర్శ దృష్ట్యా సాంప్రదాయ అర్థికవేత్తల ఉద్యోగితా సిద్ధాంతం ప్రస్తుత కాలానికి తగినట్లుగా లేదని చెప్పవచ్చు. 1930లో ఏర్పడిన అర్థిక మాంద్యం కూడా ఈ విషయాన్ని ఋజువు చేస్తుంది. ఆ సమయంలో ప్రపంచ దేశాలన్నింటిలో నిర్వుద్యోగిత తాండవించినది.

**ప్రశ్న 2) కీన్స్ ఉద్యోగితా సిద్ధాంతమును వివరింపుము.**

**జవాబు :** ఆదాయ ఉద్యోగితా సిద్ధాంతాన్ని క్రమబద్ధముగా శాస్త్రీయ పద్ధతిలో మొదటిసారిగా ప్రతిపాదించిన అర్థికవేత్త J.M. కీన్స్. కీన్స్ సిద్ధాంతాన్ని "సమిష్టి డిమాండు కొరత సిద్ధాంతమని" కూడా అంటారు. స్వల్పకాలములో జాతీయస్థాయిలో ఆదాయ ఉద్యోగితా స్థాయిలను నిర్ణయించు అంశాలను 'కీన్స్' తన గ్రంథమైన "The General Theory of Employment Interest and Money"లో విశ్లేషణ చేసినాడు.

ఆర్థిక వ్యవస్థలో ఉత్పాదక సంస్థలు నిర్ణయించిన ఉత్పత్తి పరిమాణాన్ని బట్టి ఉద్యోగితా స్థాయి ఉంటుంది. కాబట్టి ఉద్యోగితా స్థాయి ఉత్పత్తి స్థాయిపై ఆధారపడి ఉంటుంది. ఉత్పత్తి పెరిగినప్పుడు ఉద్యోగితా స్థాయి కూడా పెరుగుతుంది. ఉత్పత్తి తగ్గినప్పుడు ఉద్యోగితా స్థాయి కూడా తగ్గుతుంది. కీన్స్ ప్రకారం ఉద్యోగితా స్థాయి 2 అంశాలపై ఆధారపడి ఉంటుంది. 1. సమష్టి సప్లయ్ 2. సమష్టి డిమాండు.

**1. సమష్టి సప్లయ్ :** ఆర్థిక వ్యవస్థలో అన్ని వస్తువుల మొత్తం సప్లయ్‌ని "సమష్టి సప్లయి" అంటారు. సమష్టి సప్లయి పట్టిక ఒక వస్తువు యొక్క సాధారణ సప్లయ్ పట్టికను పోలి ఉంటుంది. ధర పెరిగే కొద్దీ వస్తువు యొక్క సప్లయి కూడా పెరుగుతుంది. కాబట్టి సప్లయి రేఖ ఎడమ నుండి కుడివైపుకు పైకి వాలి ఉంటుంది. మొత్తం ఉత్పత్తి పెరిగేకొద్దీ ఉత్పత్తి వ్యయం కూడా పెరుగుతుంది. అందువల్ల సమష్టి సప్లయి రేఖ కూడా ఎడమ నుంచి కుడికి పైకి పోతుంది. ఉత్పత్తి వ్యయానికి సమానమైన ఆదాయాన్ని ఉత్పత్తి సంస్థలు పొంది తీరవలెను. ఈ విధంగా ప్రతి వస్తురాశికి ఉత్పత్తి సంస్థలు పొంది తీరవలసిన కనీసపు ఆదాయాన్ని "సమష్టి సప్లయ్ ధర" అంటారు. ఈ క్రింది రేఖాపటంలో సమష్టి సప్లయ్ రేఖ చూపినాము.




పై పటములో x అక్షంపై ఉత్పత్తి విలువను Y అక్షముపై ఉత్పత్తి సంస్థలు పొంది తీరవలసిన కనీసపు ఆదాయాన్ని చూపినాము. ఉత్పత్తి సంస్థలు పొంది తీరవలసిన కనీసపు ఆదాయము ఉత్పత్తి వ్యయానికి సమానంగా ఉండవలెను. అందువల్ల సమష్టి సప్లయ్ రేఖ మూలబిందువు నుండి 45° కోణంలో సమద్విఖండన రేఖగా ఉంది. ఆర్థిక

వ్యవస్థ సంపూర్ణ ఉద్యోగితా స్థాయిని చేరిన తరువాత సమష్టి సప్లయ్ రేఖ Y అక్షానికి సమాంతర రేఖగా ఉంటుంది.

**2) సమష్టి డిమాండు :** కీన్స్ ఉద్యోగితా సిద్ధాంతములో సమష్టి డిమాండుకు ముఖ్యమైన స్థానం కలదు. సమష్టి డిమాండు తగిన స్థాయిలో ఉన్నప్పుడు మాత్రమే సంపూర్ణ ఉద్యోగిత ఏర్పడుతుంది. ఆర్థిక వ్యవస్థలో అన్ని వస్తువుల యొక్క డిమాండును "సమష్టి డిమాండు" అంటారు.ఆర్థిక వ్యవస్థలో వ్యక్తులు వ్యాపార సంస్థలు, ప్రభుత్వము వస్తువులపై చేసిన వ్యయము ఉత్పత్తి సంస్థలకు ఆదాయం అవుతుంది. కొంత వస్తురాశిని అమ్మడం వల్ల ఎంత ఆదాయము లభించగలదని ఉత్పత్తి సంస్థలు భావిస్తాయో దానిని "సమష్టి డిమాండు ధర" అంటారు. వస్తురాశి పెంచేకొద్దీ ఎక్కువ ఆదాయము లభించవలెను. అందువల్ల సమష్టి డిమాండు రేఖ ఎడమ నుండి కుడికి పైకి వాలి ఉంటుంది. దీనిని ఈ క్రింది పటములో చూపినాము.




పై పటములో X అక్షముపై ఉత్పత్తిని, Y అక్షముపై ఉత్పత్తి సంస్థలు పొందే ఆదాయాన్ని చూపినాము. ఉత్పత్తి పెరిగేకొద్దీ ఉత్పత్తి సంస్థలు పొందే ఆదాయం కూడా పెరుగుతుంది. అందువల్ల సమష్టి డిమాండు రేఖ ఎడమ నుండి కుడికి పైకి పోతుంది.

**సమతౌల్య ఆదాయ ఉద్యోగితా స్థాయి నిర్ణయము :** కీన్స్ ప్రకారంగా సమష్టి డిమాండు, సమష్టి సప్లయ్ సమానమైనప్పుడు సమతౌల్య ఉద్యోగితా స్థాయి ఏర్పడుతుంది. దీనిని ఈ క్రింది పట్టికలో చూపినాము.

| శ్రామికుల ఉద్యోగిత (లక్షలలో) | సమష్టి సప్లయ్ (లక్షలలో) | సమష్టి డిమాండ్ (లక్షలలో) | ఉద్యోగితా స్థాయిలో మార్పు |
|---|---|---|---|
| 20 | 30 | 40 | వృద్ధి |
| 30 | 40 | 50 | వృద్ధి |
| 40 | 55 | 60 | వృద్ధి |
| 50 | 70 | 70 | సమతౌల్యము |
| 60 | 90 | 80 | క్షీణత |

పై పట్టికలో 50 లక్షలు మంది శ్రామికులకు ఉద్యోగిత కల్పించినప్పుడు సమష్టి సప్లయ్, సమష్టి డిమాండ్ సమానంగా ఉన్నాయి. కనుక ఈ ఉద్యోగితా స్థాయిని "సమతౌల్య ఉద్యోగితా స్థాయి" అంటారు. దీనిని ఈ క్రింది రేఖాపటములో కూడా చూపవచ్చును.




పై పటములో M బిందువు వద్ద సమష్టి సప్లయ్, సమష్టి డిమాండ్ సమానముగా ఉన్నాయి. కనుక $ON_1$ ఉద్యోగితా స్థాయిని "సమతౌల్య ఉద్యోగితా స్థాయి" అంటారు. $ON_2$ ఉద్యోగితా స్థాయి వద్ద సమష్టి డిమాండు కన్నా సమష్టి సప్లయ్ ఎక్కువగా ఉంది. కనుక ఉత్పత్తి స్థాయి తద్వారా ఉద్యోగితా స్థాయి తగ్గించబడుతుంది. అలాగే ON ఉద్యోగితా స్థాయి వద్ద సమష్టి సప్లయ్ కన్నా సమష్టి డిమాండ్ ఎక్కువగా ఉన్నది. అందువల్ల ఉత్పత్తి స్థాయి తద్వారా ఉద్యోగితా స్థాయి పెంచబడుతుంది.

సమష్టి డిమాండ్, సమష్టి సప్లయ్ రేఖలు పరస్పరము ఖండించుకున్న బిందువు "సార్థక డిమాండ్" అంటాము. ఈ బిందువు వద్ద సమష్టి డిమాండ్ ధర సమష్టి సప్లయ్

ధరకు సమానము అవుతుంది. కాబట్టి సార్థక డిమాండ్ ఉన్నప్పుడు సమతౌల్య ఆదాయ ఉద్యోగితా స్థాయి ఏర్పడుతుంది.

**ప్రశ్న 3) కీన్స్ ఉద్యోగితా సిద్ధాంతం యొక్క ముఖ్య లక్షణాలను పేర్కొని, ఈ సిద్ధాంతం భారతదేశం లాంటి వెనుకబడిన దేశాలకు వర్తిస్తుందా తెల్పుము.**

జవాబు : స్వల్పకాలంలో ఉద్యోగితా - ఉత్పత్తి స్థాయిలను నిర్ణయించే అంశాలను Keynes విశ్లేషణ చేసినాడు. కీన్స్ ప్రకారంగా ఉద్యోగితా స్థాయిని నిర్ణయించడంలో సమష్టి డిమాండ్ ప్రముఖ పాత్ర వహిస్తుంది. కీన్స్ ప్రకారము సమష్టి డిమాండ్‌ను పెంచటం ద్వారా నిరుద్యోగ సమస్యను నిర్మూలించి సంపూర్ణ ఉద్యోగితను సాధించవచ్చు. సమష్టి డిమాండులోని కొరత వలనే నిరుద్యోగిత ఏర్పడుతుందని కీన్స్ అభిప్రాయం. కనుక సమష్టి డిమాండ్‌ని పెంచుట ద్వారా ఉద్యోగితా స్థాయిని పెంచవచ్చు. సమష్టి డిమాండులో 4 భాగాలు కలవు.

1) వినియోగ వ్యయము [C]
2) పెట్టుబడి వ్యయము [ I ]
3) ప్రభుత్వ వ్యయము [G]
4) నికర వ్యయము [X. A]

ఈ నాలుగు భాగాలలో దేనిలోనైనా మార్పు తీసుకు వచ్చినట్లయితే సమష్టి డిమాండ్‌లో మార్పు వస్తుంది. సమష్టి డిమాండ్‌ను పెంచటానికి వినియోగ వ్యయాన్ని కాని, పెట్టుబడి వ్యయాన్ని కాని, ప్రభుత్వ వ్యయాన్ని కాని, నికర వ్యయాన్ని కాని పెంచవలెను.

కీన్స్ ఉద్యోగితా సిద్ధాంతంలోని ముఖ్యాంశాలను ప్రక్క పేజీలోని Chartలో చూపినాము.


ఉద్యోగితా స్థాయి (N)
సమష్టి డిమాండ్ SP
1
2
3
4
C
I
G
X-M
ఆదాయం
ఉపాంత
వినియోగ
MPC ప్రవృత్తి
వడ్డీ రేటు
ఉపాంత
మూలధన
సామర్థ్యము MCC
ద్రవ్య సప్లయి
ద్రవ్య
డిమాండ్
ఉత్పాదక
వస్తువుల
సప్లయి ధర
సంభావిత
ఆదాయం

ముందు పట్టికలో చూపిన అంశాలలో దేనిలోనైనా మార్పు వస్తే సమష్టి డిమాండ్‌లో మార్పు ఏర్పడి ఉద్యోగితా స్థాయిలో మార్పు ఏర్పడుతుంది. సమష్టి సప్లయి పెంచటానికి వినియోగ వ్యయాన్ని లేక పెట్టుబడి వ్యయాన్ని పెంచవలెను.

I. **వినియోగ వ్యయము** : వినియోగ వ్యయము ఆదాయ స్థాయి పైన వినియోగ ప్రవృత్తిపైన ఆధారపడి వుంటుంది. ఆదాయం పెరిగినప్పుడు వినియోగ వ్యయం పెరుగుతుంది. కాని వినియోగ వ్యయంలోని పెరుగుదల ఆదాయ వ్యయంలోని పెరుగుదల కంటే ఎక్కువగా వుంటుంది. కనుక ఆ తేడా మేరకు పెట్టుబడి వ్యయం లేకపోయినట్లయితే ఉద్యోగ అవకాశాలు వృద్ధి చెందవు. సాధారణంగా స్వల్పకాలంలో వినియోగ ప్రవృత్తి స్థిరంగా వుంటుంది. అందువల్ల పెట్టుబడి వ్యయం పెరగనిదే ఉద్యోగితా స్థాయి వృద్ధి చెందదు.

II. **పెట్టుబడి వ్యయం** : పెట్టుబడి వ్యయం (MCC) ఉపాంత మూలధన సామర్థ్యంపైన, వడ్డీరేటుపైన ఆధారపడి వుంటుంది. వడ్డీ రేటు ద్రవ్యానికి గల డిమాండ్‌పై ద్రవ్య సప్లయిపై ఆధారపడి వుండును. ద్రవ్య సప్లయిని మార్పు చేయటంద్వారా ద్రవ్యాధికారులు వడ్డీరేటును మార్చగలరు. ఉపాంత మూలధన సామర్థ్యం వ్యాపారస్తుల ఊహలపై ఆధారపడి వుండును. పెట్టుబడి పెరిగేకొలది ఉపాంత మూలధన సామర్థ్యం క్షీణిస్తుంది. ఉపాంత మూలధన సామర్థ్యం యంత్రాల ధరలపై, యంత్రాలనుండి లభించగల ఆదాయంపై ఆధారపడి వుండును. స్వల్పకాలంలో యంత్రాలయొక్క ధరను మార్చలేము. అలాగే యంత్రాలనుండి లభించే ఆదాయంలో స్వల్పకాలంలో మార్పు ఉండదు.

పెట్టుబడిదారీ వ్యవస్థలో సంపూర్ణ ఉద్యోగితా స్థాయిని సాధించడానికి అవసరమైన పెట్టుబడి వ్యయం ప్రైవేటు రంగంలో ఉండదు. కనుక ఆ లోటును ప్రభుత్వం తన వ్యయంద్వారా భర్తీచేసి సంపూర్ణ ఉద్యోగితను సాధించవలెనని కీన్స్ అభిప్రాయపడినాడు కనుక సమష్టి డిమాండ్ పెంచడంద్వారా ఉద్యోగితా స్థాయిని పెంచవచ్చునని Keynes అభిప్రాయం.

**Keynes theory — వెనుకబడిన దేశాలు** : Keynes సిద్ధాంతము భారతదేశములాంటి వెనుకబడిన దేశాలకు వర్తించదు. Keynes తన సిద్ధాంతాన్ని రూపొందించేటప్పుడు England లాంటి అభివృద్ధి చెందిన దేశాలను దృష్టిలో ఉంచుకున్నాడు. అభివృద్ధి చెందిన దేశాల సమస్యలు వేరు, వెనుకబడిన దేశాల సమస్యలు వేరు. అభివృద్ధి చెందిన దేశాలలో సమష్టి డిమాండ్, కొరత వలన నిరుద్యోగ సమస్య ఏర్పడుతుంది. సమష్టి డిమాండ్ కొరతను నివారించగానే నిరుద్యోగిత తొలగిపోతుంది.

కాని వెనుకబడిన దేశాలలో నిరుద్యోగ సమస్య ప్రత్యేకమైనది. ఇది స్వల్పకాలిక సమస్యకాదు. సమష్టి డిమాండును పెంచడంద్వారా ఈ దేశాలలో నిరుద్యోగితను నివారించలేము. దానిని నివారించుటకు దీర్ఘకాలిక ప్రక్రియ అవసరము. మూలధనము,

ముందు పట్టికలో చూపిన అంశాలలో దేనిలోనైనా మార్పు వస్తే సమష్టి డిమాండ్‌లో మార్పు ఏర్పడి ఉద్యోగితా స్థాయిలో మార్పు ఏర్పడుతుంది. సమష్టి సప్లయి పెంచటానికి వినియోగ వ్యయాన్ని లేక పెట్టుబడి వ్యయాన్ని పెంచవలెను.

**I. వినియోగ వ్యయము :** వినియోగ వ్యయము ఆదాయ స్థాయి పైన వినియోగ ప్రవృత్తిపైన ఆధారపడి వుంటుంది. ఆదాయం పెరిగినప్పుడు వినియోగ వ్యయం పెరుగుతుంది. కాని వినియోగ వ్యయంలోని పెరుగుదల ఆదాయ వ్యయంలోని పెరుగుదల కంటే ఎక్కువగా వుంటుంది. కనుక ఆ తేడా మేరకు పెట్టుబడి వ్యయం లేకపోయినట్లయితే ఉద్యోగ అవకాశాలు వృద్ధి చెందవు. సాధారణంగా స్వల్పకాలంలో వినియోగ ప్రవృత్తి స్థిరంగా వుంటుంది. అందువల్ల పెట్టుబడి వ్యయం పెరగనిదె ఉద్యోగితా స్థాయి వృద్ధి చెందదు.

**II. పెట్టుబడి వ్యయం :** పెట్టుబడి వ్యయం (MCC) ఉపాంత మూలధన సామర్థ్యంపైన, వడ్డీరేటుపైన ఆధారపడి వుంటుంది. వడ్డీ రేటు ద్రవ్యానికి గల డిమాండ్‌పై ద్రవ్య సప్లయిపై ఆధారపడి వుండును. ద్రవ్య సప్లయిని మార్పు చేయటంద్వారా ద్రవ్యాధికారులు వడ్డీరేటును మార్చగలరు. ఉపాంత మూలధన సామర్థ్యం వ్యాపారస్తుల ఊహల్పై ఆధారపడి వుండును. పెట్టుబడి పెరిగేకొలది ఉపాంత మూలధన సామర్థ్యం క్షీణిస్తుంది. ఉపాంత మూలధన సామర్థ్యం యంత్రాల ధరలపై, యంత్రాలనుండి లభించగల ఆదాయంపై ఆధారపడి వుండును. స్వల్పకాలంలో యంత్రాలయొక్క ధరను మార్చలేము. అలాగే యంత్రాలనుండి లభించే ఆదాయంలో స్వల్పకాలంలో మార్పు ఉండదు.

పెట్టుబడిదారీ వ్యవస్థలో సంపూర్ణ ఉద్యోగితా స్థాయిని సాధించడానికి అవసరమైన పెట్టుబడి వ్యయం ప్రైవేటు రంగంలో ఉండదు. కనుక ఆ లోటును ప్రభుత్వం తన వ్యయంద్వారా భర్తీచేసి సంపూర్ణ ఉద్యోగితను సాధించవలెనని కీన్స్ అభిప్రాయపడినాడు. కనుక సమష్టి డిమాండ్ పెంచడంద్వారా ఉద్యోగితా స్థాయిని పెంచవచ్చునని Keynes అభిప్రాయం.

**Keynes theory – వెనుకబడిన దేశాలు :** Keynes సిద్ధాంతము భారతదేశములాంటి వెనుకబడిన దేశాలకు వర్తించదు. Keynes తన సిద్ధాంతాన్ని రూపొందించేటప్పుడు England లాంటి అభివృద్ధి చెందిన దేశాలను దృష్టిలో ఉంచుకున్నాడు. అభివృద్ధి చెందిన దేశాల సమస్యలు వేరు, వెనుకబడిన దేశాల సమస్యలు వేరు. అభివృద్ధి చెందిన దేశాలలో సమష్టి డిమాండ్, కొరత వలన నిరుద్యోగ సమస్య ఏర్పడుతుంది. సమష్టి డిమాండ్ కొరతను నివారించగానే నిరుద్యోగిత తొలగిపోతుంది.

కాని వెనుకబడిన దేశాలలో నిరుద్యోగ సమస్య ప్రత్యేకమైనది. ఇది స్వల్పకాలిక సమస్యకాదు. సమష్టి డిమాండును పెంచడంద్వారా ఈ దేశాలలో నిరుద్యోగితను నివారించలేము. దానిని నివారించుటకు దీర్ఘకాలిక ప్రక్రియ అవసరము. మూలధనము,

సాంకేతిక పరిజ్ఞానము మొదలగువాటిని పెంచి ఆర్థికాభివృద్ధిని సాధించడంద్వారానే ఈ దేశాలలో నిరుద్యోగితను నివారించగలము. అయితే వెనుకబడిన దేశాలలో మూలధనం, సాంకేతిక పరిజ్ఞానం కొరతగా ఉంటాయి. అందుచేత వ్యవసాయరంగములో, పారిశ్రామిక రంగంలో ఉత్పత్తి వ్యాకోచిత తక్కువగా వుంటుంది. సమష్టి డిమాండ్‌ను పెంచుటకు Keynes సూచించిన పబ్లిక్ నిర్మాణ కార్యక్రమాలు లోటు బడ్జెట్ విధానము మొదలగు చర్యల వలన డిమాండ్ పెరుగుతుందేకాని ఉత్పత్తి పెరగదు. అందువలన ధరలు పెరుగుతాయే కాని ఉద్యోగిత పెరగదు.

Keynes గుణకము కూడా వెనుకబడిన దేశాలలో పనిచేయదు. సప్లయి అవ్యాకోచత, ప్రచ్ఛన్న నిరుద్యోగిత మొదలగు కారణాల వలన గుణకము ఆశించిన విధంగా పని చేయదు. అందుచేత సమష్టి డిమాండ్‌ను పెంచడంవలన ధరలు పెరుగుతాయేకాని ఉత్పత్తి ఉద్యోగిత పెరగదు.

వెనుకబడిన దేశాలలో ఉద్యోగిత పెంచుటకు మూలధనరాశిని పెంచవలెను. మూలధనరాశి పొదుపుపై ఆధారపడి వుంటుంది. ఈ దేశాలలో ప్రజల ఉపాంత వినియోగ ప్రవృత్తి ఎక్కువగా వుండడంవలన పొదుపు స్థాయి తక్కువగా ఉన్నది. కనుక ఈ దేశాలలో నిరుద్యోగిత నిర్మూలించుటకు వినియోగ వ్యయాన్ని తగ్గించి పొదుపు పెంచవలెను. కాని Keynes ప్రకారముగా నిరుద్యోగితను నిర్మూలించుటకు వినియోగ వ్యయాన్ని పెంచవలెను. Keynes సూచనను పాటించినట్లయితే ఈ దేశాలలో ద్రవ్యోల్బణము ఏర్పడుతుంది. ఈ దేశాలలో ఉండే ప్రచ్ఛన్న నిరుద్యోగితను నిర్మూలించుటకు Keynes సూచించిన చర్యలు నిష్ఫలం కావచ్చు.

"Keynes సిద్ధాంతము అనే మొక్క England నేలలో వేస్తే మహావృక్షమై నీడను, ఫలాలను ప్రసాదిస్తుంది. ఆ నేల ఆ మొక్కకు అనువైనది. వెనుకబడిన దేశాలలో ఆ మొక్కను నాటితే అది చస్తుంది. చచ్చేముందు విషంగా మారుతుందని" Schumpeter పేర్కొన్నాడు.

**ప్రశ్న 4) సంపూర్ణ ఉద్యోగిత అనగానేమి?**

**జవాబు :** సంపూర్ణ ఉద్యోగిత అనే భావన నిరుద్యోగిత ఏ మాత్రమూ లేని స్థితిని తెలియజేస్తుంది. అయితే ఆర్థిక వ్యవస్థలో ఎప్పుడూ కొంతమంది స్వచ్ఛందంగా నిరుద్యోగులుగా వుంటారు. ఇట్లా స్వచ్ఛందంగా పని చేయనివారిని నిరుద్యోగులు అని అనడానికి వీలులేదు. ప్రస్తుతం అమలులోవున్న వేతనమువద్ద పని చేయడానికి సిద్ధపడినవారికి నిరుద్యోగిత లేని స్థితిని 'సంపూర్ణ ఉద్యోగిత' అంటారు. ఉద్యోగ అన్వేషణలో ఉన్న శ్రామికుల సంఖ్యను $N_1$గా, ఉద్యోగుల సంఖ్యను Nగా అనుకుంటే అప్పుడు $N_1$లో నుండి N ను తీసివేయగా వచ్చే ఫలితము 'O' కు సమీపములో ఉండే సంపూర్ణ ఉద్యోగిత వుందని చెప్పవచ్చును.

$N_1 - N = O$ కావలసిన అవసరం లేదు. అంటే స్వచ్ఛందముగా ఉండే నిరుద్యోగులే కాక ఇంకా కొన్ని రకాల నిరుద్యోగులు సంపూర్ణ ఉద్యోగితా స్థితిలోకూడా ఉండవచ్చు. డిమాండ్‌లోని మార్పుల వల్ల వనరుల కొరత వల్ల తాత్కాలికంగా కొంతమందికి నిరుద్యోగిత ఏర్పడవచ్చు. ఇట్లాంటి నిరుద్యోగితను "సమష్టి నిరుద్యోగిత" అంటారు. ఇటువంటి నిరుద్యోగుల శాతము సంపూర్ణ ఉద్యోగితాస్థాయివద్ద 3 నుండి 5 శాతం వరకూ ఉండవచ్చునని కీన్స్ అభిప్రాయం. ఆర్థిక వ్యవస్థ సంపూర్ణ ఉద్యోగితా స్థాయిని చేరుకున్నప్పుడు సమష్టి సప్లయ్ పూర్తి అవ్యాకోచంగా ఉంటుంది. సమష్టి సప్లయ్ రేఖ Y అక్షానికి సమాంతరముగా వుంటుంది.

సంపూర్ణ ఉద్యోగితా స్థాయివద్ద సమష్టి డిమాండ్ పెరిగితే సమష్టి సప్లయ్‌ని పెంచడానికి వీలుండదు. అందువల్ల ధరలు పెరిగి ద్రవ్యోల్బణము ఏర్పడుతుంది. కీన్స్ ప్రకారముగా ఇటువంటి ద్రవ్యోల్బణాన్ని 'వాస్తవిక ద్రవ్యోల్బణము' అంటాము.

**ప్రశ్న 5: అల్ప ఉద్యోగితా సమతౌల్యమును గురించి వివరింపుము.**

**జవాబు :** కీన్స్ పెట్టుబడిదారీ ఆర్థిక వ్యవస్థలో సంపూర్ణ ఉద్యోగిత ఎల్లప్పుడూ ఉంటుందని చెప్పే సాంప్రదాయిక ఆర్థికవేత్తల వాదాన్ని తిరస్కరించినాడు. స్వేచ్ఛా వ్యాపార వ్యవస్థలో సమతౌల్యం అయితే వస్తుందికాని అది సంపూర్ణ ఉద్యోగిత సమతౌల్యం కావలసిన అవసరం లేదన్నాడు.

వ్యాపార సంస్థలు ఉత్పత్తి చేస్తాయి. గరిష్ట లాభార్జనకు అనువైన ఉత్పత్తిస్థాయిని ఎన్నుకుంటాయి. ఉత్పత్తి చేయటంవలన సంస్థలకు వ్యయము అవుతుంది. ఆ వ్యయానికి సమానమైన కనీసపు ఆదాయాన్ని సంస్థలు పొందవలెను. దానినే "సమష్టి సప్లయి ధర" అంటాము. ప్రతి ఉత్పత్తి స్థాయికి ఉండే కనీసపు ధరను చూపించే పట్టికను" సమష్టి సప్లయి పట్టిక " అంటాము. దాని సహాయంతో గీసిన రేఖను "సమష్టి సప్లయి రేఖ" అంటాము. ఉత్పత్తి పెరిగేకొద్దీ వ్యయాలు పెరుగుతూ వుంటాయి. కాబట్టి సమష్టి సప్లయి రేఖ ఎడమనుంచి కుడికి పైకి వాలియుంటుంది.

ఒక నిర్ణీత ఉత్పత్తిస్థాయిని అమ్మటం వల్ల ఎంత ఆదాయాన్ని పొందగలమని వ్యాపార సంస్థలు భావిస్తాయో దానిని "సమష్టి డిమాండు ధర" అంటారు. సమాజం వస్తువులపై చేసే మొత్తం వ్యయాన్ని "సమష్టి డిమాండు" అంటారు. మొత్తం వ్యయంలో వినియోగ వ్యయము, పెట్టుబడి వ్యయము ఉంటాయి. ప్రతి ఉత్పత్తి స్థాయికి ఒక డిమాండు ధర వుంటుంది. ఇవి చూపించే పట్టికను "సమష్టి డిమాండ్ పట్టిక" అంటారు. దానినిబట్టి గీసిన రేఖను "సమష్టి డిమాండ్ రేఖ" అంటారు. ఉత్పత్తి పెరిగేకొద్దీ సాధారణంగా వ్యయస్థాయి పెరుగుతుంది. కాబట్టి సమష్టి డిమాండ్ రేఖ ఎడమనుండి కుడికి పైకి వాలియుంటుంది.

సమష్టి డిమాండు, సమష్టి సప్లయిలు కలసి సమతౌల్య ఉద్యోగితాస్థాయిని నిర్ణయిస్తాయి. దీనిని ఈ క్రింది పటంలో చూపినాము.




పై పటంలో E బిందువు వద్ద సమష్టి సప్లయి, సమష్టి డిమాండ్ సమానంగా వున్నాయి. ఇచ్చట ఉత్పత్తి విలువ 3000 కోట్లుగాయున్నది. కాని సంపూర్ణ ఉద్యోగితా స్థాయిని కల్పించే ఉత్పత్తి స్థాయి 4000 కోట్లు అనుకొందాము. ఇచ్చట సమష్టి సప్లయి రేఖ నిలువు రేఖగా యుంటుంది. అంటే సంపూర్ణ ఉద్యోగితా స్థాయిని చేరిన తరువాత ఉత్పత్తిని పెంచటానికి వీలుండదు. అంతకంటే తక్కువ ఉత్పత్తి స్థాయి అల్పఉద్యోగితా స్థాయి. ఇచ్చట సమతౌల్యాన్ని "అల్ప ఉద్యోగితా సమతౌల్యం" అంటాము. E బిందువు అల్ప ఉద్యోగితా సమతౌల్యాన్ని సూచిస్తుంది.

ఆదాయం పెరుగుతున్నప్పుడు వినియోగం పెరుగుతుంది. కాని ఆదాయం పెరిగినంతగా పెరగదు. అందువల్ల పొదుపు పెరుగుతుంది. పొదుపుకు సరిపోయేటంత పెట్టుబడి వ్యయం లేకపోతే, సమష్టి డిమాండ్ తక్కువ అవుతుంది. సమష్టి డిమాండ్ ఏ స్థాయిలో సమతౌల్యాన్ని తీసుకురాగల్గితే ఆ స్థాయిలోనే ఆదాయ, ఉద్యోగిత సమతౌల్యంతో యుంటుంది. ఇది సంపూర్ణ ఉద్యోగితా స్థాయికన్న తక్కువ స్థాయిలో ఉంటుంది. అందువల్ల అల్పఉద్యోగితా సమతౌల్యం ఏర్పడుతుంది.

సంపూర్ణ ఉద్యోగితా స్థాయిని చేరుకోవటానికి సమష్టి డిమాండు స్థాయిని పెంచాలి. సమష్టి డిమాండు స్థాయిని పెంచటానికి వినియోగ వ్యయం, పెట్టుబడి వ్యయం, ప్రభుత్వ వ్యయాన్ని పెంచవలెను. సమష్టి డిమాండు $AD_2$కు పెరిగినప్పుడు, ఈ రేఖ సమష్టి సప్లయి రేఖను $E_1$ బిందువువద్ద ఖండిస్తుంది. దీనిని "సంపూర్ణ ఉద్యోగితా సమతౌల్యంగా" చెప్పవచ్చు.

**ప్రశ్న 6) సమష్టి డిమాండ్‌లోని భాగాలను తెల్పుము.**

**జవాబు :** ఆర్థిక వ్యవస్థలో అన్ని వస్తువులకు ఉన్న డిమాండ్‌ను "సమష్టి డిమాండ్" అంటారు. ఉత్పత్తి అయిన వస్తురాశిని మూడు రకాలైన వ్యయ సంస్థలు కొంటాయి. అవి :

1) **కుటుంబాలు లేదా వినియోగదారులు** : వీరు వినియోగ వస్తువులను కొంటారు. వీరు వినియోగ వస్తువులపై చేసే వ్యయాన్ని "వినియోగ వ్యయము" అంటారు.

2) **వ్యాపార సంస్థలు** : ఇవి యంత్రాలు లాంటి ఉత్పాదక వస్తువులను కొంటాయి. వీటిపై చేసే వ్యయాన్ని "పెట్టుబడి వ్యయం" అంటాము.

3) **ప్రభుత్వము** : ప్రభుత్వము వినియోగ వస్తువులను, ఉత్పాదక వస్తువులను కొంటుంది. వీటిపై ప్రభుత్వం చేసే వ్యయాన్ని "ప్రభుత్వ వ్యయము" అంటారు.

వినియోగ వ్యయము, పెట్టుబడి వ్యయము, ప్రభుత్వ వ్యయము మొత్తాన్ని కలిపి " సమష్టి డిమాండు" అంటాము. కావున :

సమష్టి డిమాండు =

వినియోగ వ్యయము + పెట్టుబడి వ్యయము + ప్రభుత్వ వ్యయము

$AD = C + I + G$

AD = సమష్టి డిమాండు

C = వినియోగ వ్యయము

I = పెట్టుబడి వ్యయము

G = ప్రభుత్వ వ్యయము

విదేశ వ్యాపారాన్ని కూడా లెక్కలోకి తీసుకుంటే నికర ఎగుమతులుకూడా సమష్టి డిమాండులో ఒక భాగము అవుతాయి.

అప్పుడు సమష్టి డిమాండ్ =

వినియోగ వ్యయము + పెట్టుబడి వ్యయము + ప్రభుత్వ వ్యయము + నికర ఎగుమతులు.

$AD = C + I + G + X - M$

AD = సమిష్టి డిమాండ్

C = వినియోగ వ్యయము

I = పెట్టుబడి వ్యయము

G = ప్రభుత్వ వ్యయము

X – M = నికర ఎగుమతులు

**ప్రశ్న 7) వేతనాలకు, ఉద్యోగితా స్థాయికి ఉండే సంబంధంపై సాంప్రదాయ ఆర్థికవేత్తల అభిప్రాయాన్ని వివరింపుము. వారి అభిప్రాయాన్ని కీన్స్ ఏ విధంగా విమర్శించెను.**

జవాబు : వేతనాలు ఎక్కువగాయున్నందువలన నిరుద్యోగిత ఏర్పడుతుందని, వేతనాలు తగ్గించటంద్వారా సంపూర్ణ ఉద్యోగితను సాధించవచ్చునని సాంప్రదాయ ఆర్థికవేత్తల అభిప్రాయము. ముఖ్యంగా A.C. పిగూ ఈ అభిప్రాయాన్ని సమర్థించినాడు. వేతనాలు తగ్గిస్తే ఉత్పత్తి వ్యయం తగ్గుతుంది. అందువలన ధరలు తగ్గుతాయి. ధరలు తగ్గినందున డిమాండు పెరుగును. తత్ఫలితంగా ఉత్పత్తి పెరుగును. తద్వారా ఎక్కువమంది శ్రామికులకు ఉద్యోగిత కల్పించబడును. వేతనాలు తగ్గించినందువలన ఉద్యోగితాస్థాయి ఏ విధంగా పెరిగేది సాంప్రదాయ ఆర్థికవేత్తలు ఈ క్రింది పటంలో చూపినారు.




పై పటంలో X– అక్షంపై శ్రామికుల సంఖ్యను, Y– అక్షంపై వేతనాల రేటును చూపినాము. వేతనాల రేటు OWగా యున్నప్పుడు శ్రామికుల డిమాండు OM గా యున్నది. వేతనాల రేటు $OW_1$కు తగ్గించినప్పుడు శ్రామికుల డిమాండు $OM_1$కు పెరిగింది. కాబట్టి వేతనాల రేటును తగ్గించటంద్వారా ఉద్యోగితా స్థాయిని పెంచవచ్చునని సాంప్రదాయ ఆర్థికవేత్తల అభిప్రాయము.

**కీన్స్ యొక్క అభిప్రాయము :** కీన్స్ సాంప్రదాయ ఆర్థికవేత్తల అభిప్రాయాన్ని విమర్శించెను. ఒక పరిశ్రమలో వేతనాల తగ్గింపుద్వారా ఎక్కువమందికి ఉద్యోగ అవకాశాలు కల్పించవచ్చు. కాని ఒక పరిశ్రమలో నిజమైనది ఆర్థిక వ్యవస్థ మొత్తానికి నిజం కాకపోవచ్చు. సార్వత్రిక వేతనాల రేటు తగ్గింపు వలన శ్రామికుల ఆదాయం క్షీణించి సమష్టి డిమాండ్ తగ్గుతుంది. అందువలన నిరుద్యోగిత తగ్గటానికి బదులుగా పెరుగుతుంది. కీన్స్ ప్రకారంగా వేతనాల తగ్గింపుద్వారా ఉద్యోగితా స్థాయిని పెంచలేము.

ఉద్యోగితా స్థాయి సమష్టి డిమాండ్‌పై ఆధారపడియుంటుంది. వేతనాల తగ్గింపు ఈ క్రింది అంశాలపై ఎటువంటి ప్రభావాన్ని చూపేది తెల్పినాము.

1) వినియోగ వ్యయంపై వేతనాల ప్రభావము

2) ఉపాంత మూలధన సామర్థ్యంపై వేతనాల ప్రభావం.

3) వడ్డీరేటుపై వేతనాల ప్రభావము.

4) ఎగుమతులపై వేతనాల తగ్గింపు ప్రభావము.

**1) వినియోగ వ్యయంపై వేతనాల ప్రభావము :** వేతనాల రేటును తగ్గిస్తే ఆదాయం శ్రామికవర్గం నుండి ధనిక వర్గానికి బదిలీ అవుతుంది. అంటే ఆదాయం ఎక్కువ వినియోగ ప్రవృత్తి కల శ్రామికవర్గం నుండి తక్కువ వినియోగ ప్రవృత్తి గల ధనికవర్గానికి బదిలీ అవుతుంది. అందువలన వినియోగ వ్యయం తగ్గి సమష్టి డిమాండ్ పడిపోతుంది. తద్వారా నిరుద్యోగిత ఏర్పడుతుంది.

**2) ఉపాంత మూలధన సామర్థ్యంపై వేతనాల తగ్గింపు ప్రభావము :** ఉపాంత మూలధన సామర్థ్యంపై వేతనాల రేటు తగ్గింపు ఎట్టి ప్రభావాన్ని కల్గియుంటుంది అనేది వ్యాపారస్తుల ఊహలపై ఆధారపడియుంటుంది. భవిష్యత్తులో వేతనాలు ఇంకా తగ్గుతాయని ఊహిస్తే పెట్టుబడి పెట్టడం వాయిదా వేస్తారు. దానివలన పెట్టుబడి వ్యయం తగ్గి సమష్టి డిమాండ్ తగ్గుతుంది. తద్వారా ఉద్యోగితాస్థాయి తగ్గుతుంది. అంతేకాక వేతనాలు తగ్గినప్పుడు శ్రామికులు సమ్మెలు చేస్తారు. కార్మిక అశాంతి ఏర్పడుతుంది. అటువంటి వాతావరణంలో వ్యాపారస్తులు పెట్టుబడి పెట్టడానికి వెనుకాడతారు. కాబట్టి వేతనాల తగ్గింపు ఉపాంత మూలధన సామర్థ్యమును తగ్గించును.

**3) వడ్డీరేటుపై వేతనాల తగ్గింపు ప్రభావము :** వేతనాల రేటును తగ్గించటంవలన ధరల స్థాయి పడిపోయి వ్యాపార అవసరాలకోసం ద్రవ్యానికి గల డిమాండ్ క్షీణిస్తుంది. ద్రవ్యానికి గల డిమాండు తగ్గినప్పుడు వడ్డీరేటు తగ్గుతుంది. వడ్డీరేటు తగ్గటంవల్ల పెట్టుబడి పెరుగుతుంది. పెట్టుబడి పెరగటంవల్ల ఉద్యోగిత స్థాయి పెరుగుతుంది. అయితే వడ్డీరేటు తగ్గటం వల్ల పొదుపు స్థాయి తగ్గుతుంది. పొదుపు తగ్గటం వల్ల పెట్టుబడి తగ్గవచ్చును.

**4) ఎగుమతులపై వేతనాల తగ్గింపు ప్రభావము :** విదేశ వ్యాపారమున్న ఆర్థిక వ్యవస్థలో వేతనాల రేటు తగ్గించటం వలన ఉత్పత్తి వ్యయం తగ్గి ధరలు తగ్గుతాయి. ఎగుమతులు పెరుగుతాయి. అందుచే ఎగుమతుల పరిశ్రమలలో పెట్టుబడి పెరుగుతుందని కొందరి అభిప్రాయము. అయితే విదేశాలలో కూడా వేతనాలను తగ్గించినట్లు అయితే పై ఫలితం రాదు.

పై విశ్లేషణనుబట్టి వేతనాలు తగ్గించటం వలన వినియోగ వ్యయము, పెట్టుబడి వ్యయం తగ్గుతుంది. అందువలన వేతనాల రేటును తగ్గించటం వలన ఉద్యోగితా స్థాయి పెరుగుతుందనే నమ్మకంలేదు.

# SHORT NOTES

**ప్రశ్న 8) ఈ క్రిందివాటిని గురించి క్లుప్తంగా వ్రాయండి.**

**జవాబు : a) పొదుపు వైపరీత్యము :** పొదుపరితనం మంచిగా భావించి ప్రజలు పొదుపుచేయాలని కోరుకుంటారు. పొదుపు చేయాలంటే వ్యక్తులు వినియోగ వ్యయాన్ని తగ్గించుకోవాలి. వినియోగ వ్యయాన్ని తగ్గించుకుంటే పొదుపు పెరుగుతుంది. వ్యక్తి దృష్ట్యా పొదుపు చేయడం మంచిదే. అట్లాగని సమాజంలోని అందరూ ఆ యా వినియోగ వ్యయాన్ని తగ్గించుకొని పొదుపును పెంచితే వినియోగ వస్తువులకు డిమాండ్ క్షీణిస్తుంది. వినియోగ వస్తువుల అమ్మకాలు తగ్గుతాయి. ఉత్పత్తి సంస్థల రాబడి తగ్గుతుంది. ఉత్పత్తి సంస్థలు ఉత్పత్తిని తగ్గిస్తాయి. ఫలితంగా నిరుద్యోగం పెరిగి, జాతీయ ఆదాయం క్షీణిస్తుంది. ఆదాయం క్షీణించినప్పుడు పొదుపుకూడా తగ్గుతుంది. దీనినే "పొదుపులోని వైపరీత్యం" అంటారు.

**b) సమృద్ధిలో పేదరికము :** దేశం సంపన్నమయ్యేకొద్దీ వినియోగ ప్రవృత్తి క్షీణిస్తుంది. సంపన్నుల వినియోగ ప్రవృత్తి తక్కువగా వుంటుంది. అసలే ఆదాయం పెరుగుదల కన్న వినియోగం పెరుగుదల తక్కువ. దానికితోడు ఉన్న వినియోగ ప్రవృత్తికూడా తగ్గితే, వినియోగ వ్యయానికి, ఆదాయానికి తేడా ఎక్కువౌతుంది. అంటే పొదుపు ఎక్కువైపోతుంది. దీన్ని భర్తీ చేయాలంటే పెట్టుబడి పెరగాలి కాని పెట్టుబడి ఉపాంత మూలధన సామర్థ్యంమీద (అదనపు లాభరేటు మీద) ఆధారపడుతుంది. వినియోగ వ్యయం పెరగకపోతే, డిమాండ్ మందకొడిగా ఉండి, ఉపాంత మూలధన సామర్థ్యాన్ని కూడ తగ్గేలా చేస్తుంది. పైగా అది వ్యాపారస్తుల ఊహలు, అంచనాలు, వ్యాపార వృద్ధిలో విశ్వాసం మొదలైన మానసిక అంశాలమీద ఆధారపడుతుంది. ఇవి చంచలంగా ఉంటాయి. అందువల్ల అదికూడా చపలమై పెట్టుబడిని అస్థిరం చేస్తుంది. కాబట్టి వ్యయం, కొనుగోలు శక్తి, డిమాండ్ తగ్గిపోతుంది. అందువల్ల నిరుద్యోగిత పెరిగిపోయి, పేదరికం తాండవిస్తుంది. అంగట్లో అన్ని ఉన్నాయి, అల్లుడి నోట్లో శని అన్నట్లుగా, సమాజం సంపన్నమేకాని, ప్రజలు పేదరికంతో మగ్గుతారు. ఈ విషయాన్ని సార్థక డిమాండ్ సిద్ధాంతం తేటతెల్లం చేసింది.

**c) సార్థక డిమాండ్ :**

**జవాబు :** 2వ ప్రశ్నలోని 'సమతౌల్య ఆదాయ ఉద్యోగితా స్థాయి నిర్ణయము' అనే Heading దగ్గర నుంచి జవాబు వ్రాయుము.



# అధ్యాయము 14

# వినియోగ ఫలభావము

**ప్రశ్న 1) కీన్స్ వినియోగ ప్రవృత్తి సిద్ధాంతమును వివరింపుము.**

**లేదా**

**కీన్స్ వినియోగ ఫలభావ సిద్ధాంతమును వివరింపుము.**

జవాబు : వినియోగ వ్యయంలో మార్పు వచ్చినచో జాతీయ ఆదాయ స్థాయి ఏవిధంగా మారునో కీన్స్ వినియోగ ప్రవృత్తి అనే భావన ద్వారా విశ్లేషణ చేసినాడు. వస్తు సేవలపై చేసిన ఖర్చును "వినియోగ వ్యయం" అంటాము. వినియోగ వ్యయము ఆదాయంపై ఆధారపడి వుంటుందని "కీన్స్" పేర్కొన్నాడు. వినియోగ వ్యయానికి, ఆదాయానికి మధ్యగల సంబంధాన్ని "వినియోగ ఫలభావము" తెలియజేస్తుంది.

వినియోగ వ్యయానికి ఆదాయానికి గల సంబంధం తెలిపేటప్పుడు, రెండు ముఖ్య విషయాలను కీన్స్ పేర్కొన్నాడు.

1) వినియోగ వ్యయము ఆదాయంపై ఆధారపడి వుంటుంది. వినియోగ వ్యయమును Cగా ఆదాయాన్ని Yగా అనుకుంటే C= F [Y] అవుతుంది.

2) ఆదాయం పెరిగినప్పుడు వినియోగ వ్యయం కూడా పెరుగుతుంది. అయితే వినియోగ వ్యయంలోని పెరుగుదల [$\Delta$C] ఆదాయములోని పెరుగుదలకన్న [$\Delta$Y] తక్కువగా వుంటుంది.

**ఉదా :-** ఆదాయములోని పెరుగుదల వంద రూపాయలు అయితే వినియోగ వ్యయములోని పెరుగుదలయితే 100 రూ॥ కన్న తక్కువగా వుంటుంది. దీనిని "కీన్స్ యొక్క ప్రాథమిక మానసిక సూత్రము" అంటాము. స్వల్పకాలంలో ప్రజలు కొంత వినియోగ ప్రమాణానికి అలవాటు పడి వుంటారు. స్వల్పకాలంలో వినియోగ ప్రమాణములో మార్పులు జరగవు. కాబట్టి ప్రజల ఆదాయము పెరిగినంతగా వినియోగ వ్యయం పెరగదు. పెరిగిన ఆదాయములో వారు కొంత భాగాన్ని పొదుపు చేస్తారు.

వినియోగ ప్రవృత్తి పట్టిక : వివిధ ఆదాయ స్థాయిల వద్ద వినియోగ వ్యయాన్ని చూపే పట్టికను "వినియోగ ప్రవృత్తి పట్టిక" అంటాము. ఆదాయానికి వినియోగ వ్యయానికి గల సంబంధాన్ని ఈ క్రింది పట్టికలో చూపినాము.

| A<br>ఆదాయము | C<br>వినియోగ<br>వ్యయము | S<br>పొదుపు |
|---|---|---|
| 4000 | 4000 | 0 |
| 5000 | 4850 | 150 |
| 6000 | 5650 | 350 |
| 7000 | 6380 | 620 |
| 8000 | 7050 | 950 |
| 9000 | 7670 | 1330 |
| 10000 | 8180 | 1820 |

పై పట్టికలో ఆదాయము పెరిగినప్పుడు వినియోగ వ్యయము కూడా పెరుగుతుంది. కాని ఆదాయము పెరిగిన రేటులో వినియోగ వ్యయం పెరగటం లేదు.

**వినియోగ ప్రవృత్తి రేఖ :** ఆదాయానికి, వినియోగ వ్యయానికి గల సంబంధమును గ్రాఫ్‌లో చూపినట్లు అయితే వినియోగ ప్రవృత్తి రేఖ వస్తుంది. ఈ రేఖను క్రింది పటములో చూపినాము.




పై పటములో OX అక్షముపై ఆదాయాన్ని OY అక్షముపై వినియోగ వ్యయాన్ని చూపినాము. వినియోగ ప్రవృత్తి రేఖ ఎడమనుండి కుడికి పైకి వాలి వుంటుంది. ఈ రేఖ వివిధ ఆదాయాలవద్ద ఎంత వినియోగ వ్యయము వుండేది తెలియజేస్తుంది. ఈ రేఖనే "వినియోగ ప్రవృత్తి రేఖ" అంటాము.

**సగటు వినియోగ ప్రవృత్తి** (APC) : మొత్తం వినియోగ వ్యయాన్ని (C) ఆదాయముచే (Y) భాగించినట్లు అయితే సగటు వినియోగ ప్రవృత్తి తెలుస్తుంది.

$$APC = \frac{\text{వినియోగము}}{\text{ఆదాయము}} = \frac{C}{Y}$$

సగటు వినియోగ ప్రవృత్తి రేఖను ఈ క్రింది రేఖాపటములో చూపినాము.




పై పటంలో OX అక్షంపై ఆదాయాన్ని, OY అక్షంపై వినియోగ వ్యయాన్ని చూపినాము. APC రేఖ ఎడమ నుండి కుడికి పైకి వాలి వుంటుంది APC బట్టి ఒక వ్యక్తియొక్క సగటు వినియోగ వ్యయాన్ని తెలుసుకోవచ్చు.

**ఉపాంత వినియోగ ప్రవృత్తి** (MPC) : ఆదాయంలోని మార్పులకు తత్ఫలితంగా వినియోగ వ్యయంలో వచ్చు మార్పులకు మధ్య గల సంబంధాన్ని "ఉపాంత వినియోగ ప్రవృత్తి" అంటాము. ఆదాయంలోని పెరుగుదలవల్ల వినియోగ వ్యయంలో కలిగే పెరుగుదల శాతాన్ని ఉపాంత వినియోగ ప్రవృత్తిగా చెప్పవచ్చు. సాధారణంగా పెరిగిన ఆదాయాన్ని అంతటిని వ్యయము చేయటం జరగదు. అలాగే పొదుపు చేయటం జరగదు. కనుక $MPC_1$ కన్నా తక్కువగా 0 కన్నా ఎక్కువగా వుంటుంది. MPC రేఖను ఈ క్రింది రేఖాపటంలో చూపినాము.



ప్రక్క పటంలో X అక్షంపై ఆదాయాన్ని Y అక్షంపై వినియోగ వ్యయాన్ని చూపినాము. ఆదాయ స్థాయి OYగా ఉన్నప్పుడు వినియోగ వ్యయము OCగా వున్నది. ఆదాయము Y నుండి $Y_1$కి పెరిగినందువల్ల వినియోగ వ్యయము C నుండి $C_1$ కి పెరిగినది. వినియోగ వ్యయములోని పెరుగుదల $[CC_1]$ ఆదాయములో పెరుగుదలకన్న $[YY_1]$ తక్కువగా ఉన్నది.

**సగటు పొదుపు ప్రవృత్తి** : ఆదాయానికి పొదుపుకు మధ్య ఉండే సంబంధాన్ని సగటు పొదుపు ప్రవృత్తి తెలియజేస్తుంది.

సగటు పొదుపు ప్రవృత్తి $(APC) = \frac{S}{Y}\ 1 - APC$

**ఉపాంత పొదుపు ప్రవృత్తి** : ఆదాయములో మార్పుకు తత్ఫలితముగా పొదుపులోని మార్పుకు మధ్యగల నిష్పత్తిని "ఉపాంత పొదుపు ప్రవృత్తి" అంటారు. స్వల్పకాలంలో ఆదాయము పెరిగేకొద్ది ఉపాంత పొదుపు ప్రవృత్తి పెరుగుతుంది.

ఉపాంత పొదుపు ప్రవృత్తి $(MPC) = \frac{\Delta S}{\Delta Y}$ or 1-MPC

**ఉపాంత ప్రవృత్తి క్షీణించుటకు కారణాలు** : స్వల్పకాలంలో ఆదాయము పెరిగే కొద్దీ, ఉపాంత వినియోగ ప్రవృత్తి క్షీణిస్తుంది. దీనికి రెండు కారణాలు పేర్కొనవచ్చును.

1) స్వల్పకాలంలో వినియోగదారుల అభిరుచులలో, అలవాట్లలో, జీవన ప్రమాణంలో చెప్పుకోతగ్గ మార్పులు సంభవించవు. అందువల్ల స్వల్పకాలంలో పెరిగే ఆదాయాన్ని అంతటిని వ్యయము చేయరు.
2) ఆదాయ స్థాయి తక్కువగా వున్నప్పుడు వినియోగ వస్తువులపై ఆదాయములో వ్యయమయ్యే భాగము ఎక్కువగా వుంటుంది.

ఆదాయ స్థాయి ఎక్కువగా వున్నప్పుడు వినియోగ వ్యయము చేసే భాగము తక్కువగా ఉంటుంది. కనుక ఆదాయము పెరిగేకొద్ది వినియోగ వ్యయము తగ్గుతుంది.

పై రెండు కారణాలవల్ల స్వల్పకాలంలో ఉపాంత వినియోగ ప్రవృత్తి క్షీణిస్తుంది.

**ప్రశ్న 2) వినియోగ ఫలభావమును నిర్ణయించు అంశాలను తెలుపుము.**

**జవాబు** : వినియోగ వ్యయము ఆదాయంపై ఆధారపడి ఉంటుంది. ఆదాయము పెరిగితే వినియోగ వ్యయము తగ్గుతుంది. వినియోగ వ్యయము ఆదాయంపైననేకాక అనేక ఇతర అంశాలమీద కూడా ఆధారపడి వుంటుంది. ఈ అంశాలను Keynesరెండు రకాలుగా వర్గీకరించినాడు.

**1) ఆత్మాశ్రయ అంశాలు** **2) పరాశ్రయ అంశాలు**

**1) ఆత్మాశ్రయ అంశాలు** : మానవ స్వభావానికి సంబంధించిన మానసిక లక్షణాలను ఆత్మాశ్రయ అంశాలుగా చెప్పవచ్చును. కుటుంబ ప్రేమ, దూరదృష్టి,

సాంఘిక హోదా మొదలగునవి ప్రజలలో పొదుపు చేయాలనే కోర్కెను ప్రోత్సహిస్తాయి. ప్రజలలో పొదుపు ప్రవృత్తి పెరిగితే వినియోగ వ్యయము తగ్గుతుంది. పొదుపు ప్రవృత్తి పెరిగితే వినియోగ వ్యయం పెరుగుతుంది. కనుక పొదుపు ప్రవృత్తి కూడా వినియోగ ప్రవృత్తిని నిర్ణయిస్తుంది.

**2) పరాశ్రయ అంశాలు** : పరాశ్రయ అంశాలను కీన్స్ 6 రకాలుగా వర్గీకరించాడు.

**i) ఆదాయ పంపిణి** : వినియోగ వ్యయము ఆదాయ పంపిణీపై ఆధారపడి వుంటుంది పేదవారు వారి ఆదాయములో ఎక్కువ భాగము వినియోగ వస్తువులపై వ్యయము చేస్తారు ధనవంతులు తమ ఆదాయంలో తక్కువ భాగం ఖర్చు చేస్తారు ఆదాయ పంపిణీలో అసమానతలు ఎక్కువగా వుండే సగటు వినియోగ ప్రవృత్తి ఎక్కువగా ఉంటుంది. ఆదాయము ప్రజల మధ్య సమానముగా పంపిణీ అయితే సగటు వినియోగ ప్రవృత్తి ఎక్కువగా వుంటుంది.

**II) ధరలలో మార్పు** : వినియోగ ప్రవృత్తి ధరలలో సంభవించే మార్పులమీద కూడా ఆధారపడి ఉంటుంది. భవిష్యత్‌లో ధరలు పెరుగుతాయని భావిస్తే ప్రజలు భవిష్యత్ అవసరాలకు కూడా వస్తువులు కొంటారు. తద్వారా వినియోగ వ్యయం పెరుగుతుంది. అలాగే భవిష్యత్‌లో ధరలు తగ్గుతాయని ఊహిస్తే ప్రస్తుత అవసరాలను భవిష్యత్‌కు వాయిదా వేస్తారు. అందువలన వినియోగ వ్యయము తగ్గుతుంది కాబట్టి వినియోగ ప్రవృత్తి ధరలమీద కూడా ఆధారపడి వుంటుంది.

**III) పన్నుల విధానము** : పన్నుల విధానములోని మార్పులవలన వినియోగ ప్రవృత్తి మారుతుంది. పన్నుల రేటును పెంచినట్లయితే ఆదాయం తగ్గి ప్రజల కొనుగోలు శక్తి తగ్గుతుంది. తత్ఫలితముగా వినియోగ వ్యయము తగ్గుతుంది. కనుక పన్నులు ఎక్కువగా వుంటే వినియోగ ప్రవృత్తి తక్కువగాను, పన్నులు తక్కువగా ఉంటే వినియోగ ప్రవృత్తి ఎక్కువగాను ఉంటుంది.

**IV) గాలిపాటుగా వచ్చే లాభనష్టాలు** : గాలిపాటుగా వచ్చే లాభనష్టాలు కూడా వినియోగ ప్రవృత్తిని నిర్ణయిస్తాయి. అనుకోకుండా ఆదాయాలు పెరిగినట్లయితే వినియోగ వ్యయం పెరుగుతుంది. అలాగే నష్టాలు వస్తే వినియోగ వ్యయం తగ్గుతుంది.

**V) తరుగుదల నిధులు** : వ్యాపార సంస్థలు యంత్రాలు, యంత్ర పరికరములు మొదలగువాటికోసం తరుగుదల నిధులను ఏర్పాటు చేస్తాయి. ఈ నిధుల ఏర్పాటు వలన కంపెనీ వాటాదారుల మధ్య పంపిణీ అయ్యే లాభాలు తగ్గుతాయి. తద్వారా వినియోగ వ్యయం తగ్గవచ్చు.

**VI) వడ్డీ రేటు :** వినియోగ ప్రవృత్తి వడ్డీరేటు మీద కూడా ఆధారపడి వుంటుంది. వడ్డీరేటు పెరిగితే వినియోగ వ్యయాన్ని తగ్గించి ప్రజలు ఎక్కువగా పొదుపు చేస్తారు. తద్వారా వినియోగ ప్రవృత్తి తగ్గుతుంది. వడ్డీరేటు తగ్గితే ప్రజలు పొదుపును తగ్గిస్తారు. తద్వారా వినియోగ ప్రవృత్తి పెరుగుతుంది.

ఆదాయము స్థిరముగా ఉన్నప్పటికి పైన పేర్కొన్న అంశాలలో దేనిలోనైనా మార్పువస్తే వినియోగ ప్రవృత్తి కూడా మారుతుంది. ఉదా : ప్రజలలో పొదుపు ప్రవృత్తి తగ్గితే అదే ఆదాయ స్థాయి వద్ద వినియోగ వ్యయము పెరుగుతుంది. అపుడు వినియోగ ప్రవృత్తి రేఖ కుడివైపుకు జరుగుతుంది. అలాగే పొదుపు ప్రవృత్తి పెరిగి వినియోగ వ్యయము తగ్గితే వినియోగ ప్రవృత్తి రేఖ ఎడమవైపుకు జరుగుతుంది. దీనిని ఈ క్రింది రేఖాపటములో చూపినాము.




పై పటంలో ఆదాయం 1000 రూ॥ ఉన్నప్పుడు వినియోగ వ్యయం మొదట 800 రూ॥గా వున్నది. దీనిని CC వినియోగ ప్రవృత్తి రేఖ తెలియచేస్తుంది. అదే ఆదాయ స్థాయి వద్ద వినియోగ వ్యయము 900 రూ॥ పెరగటం వలన వినియోగ ప్రవృత్తి రేఖ కుడివైపుకు జరిగినది. దీనిని $C_1C_1$ రేఖ తెలియజేస్తుంది. వినియోగ వ్యయము 700 రూ॥ తగ్గినపుడు వినియోగ ప్రవృత్తి రేఖ ఎడమవైపుకు జరుగుతుంది. దీనిని $C_2C_2$ రేఖ తెలియజేస్తుంది.

**ప్రశ్న 3) చిరకాల వినియోగ ఫలభావము గురించి వివరింపుము. దీర్ఘకాల వినియోగ ప్రవృత్తిని తెలుపుము.**

జవాబు : స్వల్పకాలములో ఆదాయము పెరిగేకొద్ది సగటు వినియోగ ప్రవృత్తి ఉపాంత వినియోగ ప్రవృత్తి క్షీణిస్తాయి. స్వల్పకాలములో ఆదాయ వినియోగ వ్యయాల నిష్పత్తి స్థిరంగా వుండదు. ఆదాయము పెరిగేకొద్ది నిష్పత్తి మారుతుంది.

దీర్ఘకాలంలో ఆదాయ వినియోగ వ్యయాల నిష్పత్తి స్థిరంగా వుంటుంది. అందువల్ల APC, MPC స్థిరంగా వుండటమే కాకుండా రెండు సమానంగా కూడా వుంటాయి. దీర్ఘకాలంలోని ఆదాయ వినియోగ వ్యయాల నిష్పత్తిని ఈ క్రింది పట్టికలో చూపినాము.

| ఆదాయము | వినియోగ వ్యయము | APC C/Y | MPC ΔC/ΔY |
|---|---|---|---|
| 1000 | 800 | 8 | 8 |
| 2000 | 1600 | 8 | 8 |
| 3000 | 2400 | 8 | 8 |
| 4000 | 3200 | 8 | 8 |
| 5000 | 4000 | 8 | 8 |

పై పట్టికనుబట్టి దీర్ఘకాలంలో ఆదాయ వినియోగ నిష్పత్తి స్థిరంగా వుంటుందని తెలుస్తుంది. దీర్ఘకాలంలో ఆదాయ వినియోగ వ్యయాల నిష్పత్తి స్థిరంగా వుండటానికి "ట్యూషన్ బెర్రి", 'మిల్టన్ ఫ్రీడ్‌మాన్" అనే ఆర్థికవేత్తలు రెండు కారణాలు పేర్కొన్నారు."ట్యూషన్ బెర్రి" ప్రకారముగా ఒక వ్యక్తి యొక్క వినియోగ వ్యయస్థాయి అతని ఆదాయము పైననేకాక ఇతరులపై కూడ ఆధారపడి వుంటుంది. సాధారణముగా వ్యక్తులు ఇతరుల యొక్క అభిరుచులను జీవన ప్రమాణాన్ని అనుసరిస్తారు. ఆదాయము పెరిగినప్పుడు సమాజములో తన హోదాను పెంచుకోవటం కోసం అదే నిష్పత్తిలో వ్యయం చేస్తాడు. అందువల్ల ఆదాయ వినియోగ వ్యయం చేస్తాడు. అందువల్ల ఆదాయ వినియోగ వ్యయానికి గల నిష్పత్తి స్థిరంగా వుంటుంది.

"మిల్టన్ ఫ్రీడ్‌మాన్" ప్రతి వ్యక్తి ఆదాయాన్ని శాశ్వత ఆదాయము, పరివర్తనాత్మక ఆదాయము అని రెండు రకాలుగా విభజించినాడు. దీర్ఘకాలంలో సాధారణంగా లభించగల ఆదాయాన్ని శాశ్వత ఆదాయం అని, అనుకోకుండా లభించే ఆదాయాన్ని పరివర్తనాత్మక ఆదాయంగా పేర్కొన్నారు. ఇతని ప్రకారంగా నిత్యము చేసే వినియోగ

వ్యయం శాశ్వత ఆదాయంపై ఆధారపడి వుంటుంది. పరివర్తనాత్మక ఆదాయం పెరిగితే పొదుపు మాత్రమే పెరుగుతుందని ఈయన తెల్పినాడు. దీర్ఘకాలంలో శాశ్వత ఆదాయం పెరిగితే వినియోగ వ్యయము కూడా అదే నిష్పత్తిలో పెరుగుతుంది. దీర్ఘకాల వినియోగ ప్రవృత్తిరేఖ మూలబిందువు నుంచి సరళరేఖగా ఉంటుంది. దీనిని ఈ క్రింది రేఖాపటము ద్వారా చూపినాము.




పై పటంలో వినియోగ ప్రవృత్తి రేఖ దీర్ఘకాలములోని వినియోగ వ్యయ ప్రవర్తనను తెలియజేస్తుంది. దీర్ఘకాలంలో వినియోగ ప్రవృత్తి విలువ 1 కంటే తక్కువగా వుంటుంది.



# అధ్యాయము 15

# పెట్టుబడి - వడ్డీ

**ప్రశ్న 1) స్వయంప్రేరిత పెట్టుబడి, ప్రేరిత పెట్టుబడి అనగానేమి ?**

జవాబు : ప్రొఫెసర్ "Hicks" పెట్టుబడిని రెండు రకాలుగా వర్గీకరించినారు.

1) స్వయంప్రేరిత పెట్టుబడి, 2) ప్రేరిత పెట్టుబడి.

1) స్వయంప్రేరిత పెట్టుబడి : ప్రస్తుత ఆదాయ స్థాయి, డిమాండ్ స్థాయితో సంబంధం లేకుండా నిర్ణయం అయిన పెట్టుబడిని "స్వయంప్రేరిత పెట్టుబడి" అంటారు. స్వయంప్రేరిత పెట్టుబడి ప్రస్తుత లాభార్జన అవకాశాలమీద ఆధారపడకుండా దీర్ఘకాలిక అంశాలు అయిన జనాభా వృద్ధి సాంకేతిక ప్రగతి మొదలగువాటిమీద ఆధారపడి ఉంటుంది.

2) ప్రేరిత పెట్టుబడి : డిమాండ్‌లోని మార్పులకు అనుగుణంగా చేసే పెట్టుబడిని 'ప్రేరిత పెట్టుబడి' అంటారు. వినియోగ వస్తువులకు డిమాండ్ పెరిగినప్పుడు వాటి ఉత్పత్తిని పెంచవలెను. అందుకుగాను నూతనంగా యంత్రాలు నిర్మించవలెను. అట్టి యంత్రాల నిర్మాణానికి అయిన వ్యయాన్ని "ప్రేరిత పెట్టుబడి" అంటారు.

**ప్రశ్న 2) స్థూల పెట్టుబడి అనగా నేమి ?**

జవాబు : ఒక సంవత్సర కాలంలో నూతన యంత్రాల నిర్మాణం కోసం చేసిన పెట్టుబడి వ్యయాన్ని "స్థూల పెట్టుబడి" అంటారు.

**ప్రశ్న 3) పునఃస్థాపిత పెట్టుబడి అనగానేమి ?**

జవాబు : పాత యంత్రాల స్థానంలో కొత్త యంత్రాలను పునఃస్థాపితం చేయటంకోసం నూతనముగా నిర్మించిన యంత్రాలపై చేసిన పెట్టుబడి వ్యయాన్ని "పునఃస్థాపిత పెట్టుబడి" అంటారు.

**ప్రశ్న 4) నికర పెట్టుబడి అనగానేమి ?**

జవాబు : డిమాండులోని పెరుగుదలను బట్టి ఉత్పత్తిని పెంచటం కోసం అదనంగా చేసిన పెట్టుబడి వ్యయాన్ని "నికర పెట్టుబడి" అంటాము.

నికర పెట్టుబడి = స్థూల పెట్టుబడి - పునఃస్థాపిత పెట్టుబడి.

**ప్రశ్న 5) ఉపాంత మూలధన సామర్థ్యం అనగానేమి ? దానిని నిర్ణయించే అంశాలు తెలుపుము.**

జవాబు : ఒక ఉత్పాదక వస్తువుపై దాని ఉపయోగిత కాలంలో రాగల నికర ఆదాయాన్ని "ఉపాంత మూలధన సామర్థ్యం" అంటారు. ఉత్పాదక వస్తువు నుంచి లభించగల నికర ఆదాయం ఆ వస్తువు సప్లయి ధరకన్నా ఎక్కువగా ఉంటే సంస్థకు లాభం వస్తుంది. ఉత్పాదక వస్తువు యొక్క సప్లయి ధరతో పోల్చి దానిని శాతంగా చెప్పినట్లయితే దానిని ఉపాంత మూలధన సామర్థ్యంగా పేర్కొంటాము.

ఉదా : ఒక యంత్రం యొక్క సప్లయి ధర 10,000 అనుకొందాము. ఒక సం॥ కాలంలో 10,000 రూ॥ ఆ యంత్రం నుంచి ఆదాయమును యంత్రం నుంచి లభించిన ఆదాయమును యంత్రం యొక్క సప్లయ్ ధరతో పోల్చి నికర ఆదాయమును 107గా చెప్పవచ్చు. ఇట్లా లభించగల ఆదాయపు లోటును "ఉపాంత మూలధన సామర్థ్యము' ' అంటాము. ఉపాంత మూలధన సామర్థ్యాన్ని కనుగొనుటకు ఈ క్రింది సూత్రాన్ని ఉపయోగిస్తారు.

$$K = \frac{R_1}{(1 + r)} + \frac{R_2}{(1 + r)^2} + \frac{K_3}{(1 + r)^3}$$

K = యంత్రం యొక్క సప్లయ్ ధర

$R_1, R_2, R_3$ = యంత్రం యొక్క జీవిత కాలం

r = వడ్డీ రేటు

నూతన యంత్రంపై పెట్టుబడి పెట్టే ముందు వ్యాపార సంస్థ ఆ పెట్టుబడి నుంచి రాగల ఉపాంత మూలధన సామర్థ్యాన్ని పెట్టుబడిపై అయ్యే వడ్డీతో పోల్చి చూసుకొంటుంది. ఉపాంత మూలధన సామర్థ్యం వడ్డీరేటు కన్నా హెచ్చుగా వుంటే నూతన యంత్రాన్ని స్థాపించటం లాభసాటిగా ఉంటుంది.

**ఉపాంత మూలధన సామర్థ్యం పట్టిక :** నూతన పెట్టుబడి నుంచి లభించగల ఆదాయపు రేటును "ఉపాంత మూలధన సామర్థ్యం" అంటాము. ఇట్లా నూతన పెట్టుబడి నుంచి లభించగల మూలధన సామర్థ్యాన్ని చూపుతూ ఒక పట్టికను తయారు

చేయవచ్చు. పెట్టుబడికి ఉపాంత మూలధన సామర్థ్యానికి గల సంబంధమును తెలిపే పట్టికను తయారుచేయవచ్చు. దీనినే "ఉపాంత మూలధన సామర్థ్య పట్టిక" అంటారు.

| పెట్టుబడి | M.E.C. |
|---|---|
| 10,000 | 10% |
| 20,000 | 8% |
| 30,000 | 6% |
| 40,000 | 4% |
| 50,000 | 2% |

పై పట్టికను బట్టి పెట్టుబడి పెరిగేకొద్ది ఉపాంత మూలధన సామర్థ్యం క్షీణిస్తున్నట్లు తెలియుచున్నది. ఈ పట్టికను ఆధారం చేసుకొని ఉపాంత మూలధన సామర్థ్యంను తెలుసుకొనవచ్చు. ఉపాంత మూలధన సామర్థ్య రేఖను ఈ క్రింది రేఖా పటంలో చూపిన విధముగా ఎడమ నుంచి క్రింది కుడికి వాలి ఉంటుంది.




పై పటంలో $\overrightarrow{OX}$ అక్షంపై 'పెట్టుబడి' $\overrightarrow{OY}$ అక్షముపై "MEC" ని చూపించాము. పెట్టుబడి పెరిగేకొద్ది ఉపాంత మూలధన సామర్థ్యం క్షీణిస్తుంది. కాబట్టి ఉపాంత మూలధన సామర్థ్య రేఖ ఎడమ నుండి కుడికి క్రిందికి వాలి ఉంటుంది.

**ఉపాంత మూలధన సామర్థ్యాన్ని ప్రభావితం చేసే అంశాలు :** ఉపాంత మూలధన సామర్థ్యం ఈ క్రింది అంశములపై ఆధారపడి ఉంటుంది.

1. భవిష్యత్‌లో వస్తువులకు డిమాండ్ ఎక్కువగా ఉంటుందని ఊహించబడితే ఉపాంత మూలధన సామర్థ్యం తక్కువగా ఉంటుంది.

2. భవిష్యత్‌లో ఉత్పత్తి వ్యయాలు తగ్గుతాయని ధరలు పెరుగుతాయని ఊహిస్తే ఉపాంత మూలధన సామర్థ్యం పెరుగుతుంది.

3. ఉపాంత వినియోగ ప్రవృత్తి పెరిగితే వినియోగ వస్తువుకు డిమాండు పెరిగి తద్వారా ఉపాంత మూలధన సామర్థ్యం పెరుగుతుంది.

4. పెరిగే జనాభా ఉపాంత మూలధన సామర్థ్యాన్ని పెంచుతుంది. ఎందుచేతనంటే పెరిగే జనాభా వినియోగ వస్తువులకు తద్వారా ఉత్పాదక వస్తువులకు డిమాండ్‌ను పెంచుతుంది.

5. సాంకేతిక అభివృద్ధి వల్ల ఉత్పత్తి వ్యయాలకి తద్వారా ఉపాంత మూలధన సామర్థ్యం పెరుగుతుంది.

6. ఉపాంత మూలధన సామర్థ్యం వ్యాపారస్తుల ఊహలపై కూడా ఆధారపడి ఉంటుంది. వారి ఊహలు ఆశాజనకంగా ఉంటే ఉపాంత మూలధన సామర్థ్యం పెరుగుతుంది.

**ప్రశ్న 6) పెట్టుబడి నిర్ణయించటంలో వ్యాపారస్తుల ఊహల పాత్రను తెల్పుము.**

**జవాబు :** పెట్టుబడి ఉపాంత మూలధన సామర్థ్యం, వడ్డీ రేటు మీదనే కాకుండా వ్యాపారస్తుల ఊహల మీద కూడా ఆధారపడి ఉంటుంది. ఉపాంత మూల ధన సామర్థ్యం భవిష్యత్‌లో సంభవించగల ఆర్థిక పరిణామాలకు సంభవించిన ఊహలపై ఆధారపడి ఉంటుంది. వ్యాపారస్తుల ఊహలను కీన్స్ 2 రకాలుగా విభజించినాడు.

**A) స్వల్పకాలిక ఊహలు** **B) దీర్ఘకాలిక ఊహలు**

**A) స్వల్పకాలిక ఊహలు :** ప్రస్తుత పెట్టుబడి నుంచి లభించగల ఆదాయానికి సంబంధించిన వ్యాపారస్తుల ఊహలను " స్వల్పకాలిక ఊహ" లంటారు.

స్వల్పకాలిక ఊహలు నిన్న మొన్నటి ఫలితాల మీద ఆధారపడి ఉంటాయి. గడిచిన కొద్ది రోజుల అనుభవాన్ని బట్టి మరుసటి రోజున ఏమి జరుగుతుందో ఊహించగలగటం సులభం. అందువల్ల స్వల్పకాలిక ఊహలు స్థిరముగా ఉంటాయని చెప్పవచ్చును.

**B) దీర్ఘకాలిక ఊహలు :** భవిష్యత్‌లో లభించగల ఆదాయపు అంచనాలకు సంబంధించిన ఊహలను "దీర్ఘకాలిక ఊహలు" అంటారు. పెట్టుబడి వ్యయానికి సంబంధించిన ఊహలలో దీర్ఘకాలిక ఊహలకు ఎక్కువ ప్రాముఖ్యత ఉంటుంది. దీర్ఘకాలిక ఊహలు భవిష్యత్‌లో జరిగే సంఘటనలపై ఆధారపడి ఉంటాయి. భవిష్యత్‌లో వినియోగదారుల అభిరుచులలో వచ్చే మార్పులు, డిమాండులో వచ్చే మార్పులు దీర్ఘకాలిక ఊహలను ప్రభావితం చేస్తాయి. ఈ క్రింది పేర్కొనిన అంశాలు దీర్ఘకాలిక ఊహలను నిర్ణయిస్తాయి.

**1) యంత్రాల ఉపయోగిత కాలము :** దీర్ఘకాలములో యంత్రాల నుండి రాగల ఆదాయపు అంచనాలు వాటి యొక్క ఉపయోగిత కాలంపై ఆధారపడి ఉంటుంది. అయితే యంత్రాల యొక్క ఉపయోగిత కాలాన్ని ఖచ్చితంగా నిర్ణయించలేము.

**2) తరుగుదల ఖర్చు :** భవిష్యత్‌లో యంత్రాల నుండి రాగల ఆదాయపు అంచనాలు వాటి మీద అయ్యే తరుగుదల ఖర్చు మీద కూడా ఆధారపడి ఉంటుంది. అయితే తరుగుదల ఖర్చును అంచనా వేయుట కష్టము.

**3) సాంకేతిక పరిజ్ఞానములో మార్పు :** అదనపు పెట్టుబడి నుండి లభించగల ఆదాయము సాంకేతిక పరిజ్ఞానము మీద కూడా ఆధారపడి ఉంటుంది. అయితే సాంకేతిక పరిజ్ఞానము అభివృద్ధి వల్ల భవిష్యత్‌లో ఉత్పత్తి పద్ధతులలో వచ్చే మార్పులను ఊహించటం కష్టము.

**4) పన్నులలో మార్పు :** పన్నుల విధానము భవిష్యత్‌లో వచ్చే మార్పులు కూడా పెట్టుబడి నుండి లభించు ఆదాయాన్ని ప్రభావితం చేస్తాయి. పన్నుల భారం పెరిగితే రాగల ఆదాయం తగ్గుతుంది. అయితే పన్నులలో వచ్చే మార్పులను ఊహించటం కష్టము.

**5) జనాభా :** జనాభా పెరుగుదలలో వచ్చే మార్పులు డిమాండును మారుస్తాయి. డిమాండ్‌లోని మార్పులు ఆదాయపు అంచనాలను ప్రభావితం చేస్తాయి.

**6) వేతనాలు :** భవిష్యత్‌లో వేతనాలలో వచ్చే మార్పులు కూడా రాగల ఆదాయాన్ని ప్రభావితం చేస్తాయి. వేతనాలు పెరిగితే ఆదాయం తగ్గుతుంది. అయితే దీర్ఘకాలములో వేతనాలలో వచ్చే మార్పులను ఊహించటం కష్టము.

**7) ఆర్థికేతర అంశాలు :** పైన పేర్కొనిన ఆర్థికాంశాలే కాకుండా ఆర్థికేతర, రాజకీయ అంశాలు కూడా దీర్ఘకాలిక ఊహలను ప్రభావితం చేస్తాయి.

దీర్ఘకాలములో రాగల ఆదాయపు అంచనాల మీద వ్యాపారస్థుల ఊహల ప్రభావం అనుచితమైనది. స్వల్పకాలిక ఊహలు స్థిరముగా వున్నా దీర్ఘకాలిక ఊహలలో తరుచూ మార్పులు సంభవిస్తాయి. కాబట్టి ఉపాంత మూలధన సామర్థ్యములలో అనిశ్చిత ఎక్కువగా ఉంటుంది.

**ప్రశ్న 7) పొదుపుకి, పెట్టుబడికి వున్న సంబంధాన్ని తెలుపుము.**

**జవాబు :** సాంప్రదాయ ఆర్థికవేత్తలు పొదుపు పెట్టుబడులను సమానపరిచేది వడ్డీరేటు అని భావించినారు. వడ్డీరేటు పెరిగితే పొదుపు పెరుగుతుందని, వడ్డీ రేటు తగ్గితే పొదుపు తగ్గుతుందని భావించినారు. ఉత్పాదక సంస్థలు ఎక్కువ పెట్టుబడి ధనాన్ని కొంత వడ్డీ రేటు పెరుగుతుంది. కాని వడ్డీ రేటుతో సంబంధం లేకుండా ఆదాయ స్థాయిలో వచ్చే మార్పుల వల్లనే పొదుపు, పెట్టుబడులు సమానమవుతాయని 'కీన్స్' అభిప్రాయం.

జాతీయ ఆదాయములో కొంత భాగము వినియోగ వస్తువులపై వ్యయము చేయటము మిగిలినదానిని పొదుపు చేయటం జరుగుతుంది. పొదుపుగా చేసిన మొత్తం తిరిగి పెట్టుబడి వ్యయముగా చేయటం జరుగుతుంది. కనుక పొదుపు పెట్టుబడి సమానముగా ఉంటాయి. కాబట్టి S=I పొదుపు, పెట్టుబడి సమానమైనప్పుడు జాతీయ ఆదాయము సమతౌల్య స్థితిలో ఉంటుంది.

పొదుపు, పెట్టుబడికి గల సంబంధాన్ని ఈ క్రింది ఉదాహరణ ద్వారా వివరించవచ్చును.

| ఆదాయము (కోట్లలో) | వినియోగ వ్యయము | పొదుపు | పెట్టుబడి |
|---|---|---|---|
| 400 | 380 | 20 | 80 |
| 450 | 410 | 40 | 80 |
| 500 | 440 | 60 | 80 |
| 550 | 470 | 80 | 80 |
| 600 | 500 | 100 | 80 |

పై పట్టికలో 550 కోట్ల రూ॥ల ఆదాయ స్థాయి వద్ద పొదుపు, పెట్టుబడులు సమానముగా ఉంటాయి. కనుక 550 కోట్ల రూ॥ల ఆదాయ స్థాయిని సమతౌల్య స్థాయిగా పరిగణిస్తాము. అయితే పెట్టుబడి పొదుపు కన్నా ఎక్కువైనప్పుడు జాతీయ ఆదాయ స్థాయి పెరగటం ఆ కారణంగా పొదుపు పెరిగి పెట్టుబడికి సమానం కావటం జరుగుతుంది. అట్లాగే పొదుపు పెట్టుబడి కన్నా హెచ్చుగా వుండే జాతీయ ఆదాయస్థాయి క్షీణించటం జరుగుతుంది. అట్లాగే పొదుపు పెట్టుబడికి సమానముగా లేనప్పుడు ఆదాయ స్థాయిలో మార్పులు కారణంగా పొదుపు, పెట్టుబడులు సమానమవుతాయి.

**పొదుపు పెట్టుబడికి ఉన్న సంబంధాన్ని ఈ క్రింది రేఖా పటములో చూపినాము.**



పై పటములో OX అక్షముపై ఆదాయము, OY అక్షముపై పొదుపు, పెట్టుబడులను చూపినాము. స్వల్పకాలంలో స్వయంప్రేరిత పెట్టుబడి స్థిరముగా ఉండటం వలన పెట్టుబడి రేఖ OX అక్షమునకు సమాంతరముగా ఉన్నది. ఆదాయం పెరిగేకొద్ది పొదుపు పెరుగుతుంది. కనుక పొదుపు రేఖ ఎడమ నుంచి కుడికి పైకి పోతుంది. పై పటములో 550 కోట్ల రూ॥లు ఆదాయ స్థాయి వద్ద పొదుపు పెట్టుబడికి సమానమైనాయి. కాబట్టి S=I పొదుపు పెట్టుబడి సమానమైనప్పుడు జాతీయ ఆదాయము సమతౌల్య స్థితిలో ఉంటుంది.

**ప్రశ్న 8) ద్రవ్యత్వాభిరుచి వడ్డీరేటు సిద్ధాంతమును వివరింపుము.**

**లేదా**

**కీన్స్ వడ్డీరేటు సిద్ధాంతమును తెల్పుము.**

**లేదా**

**కీన్స్ ప్రకారంగా "వడ్డీ కేవలం ద్రవ్య సంబంధమైన విషయం" చర్చించుము.**

జవాబు : కీన్స్ తాను వ్రాసిన "The General Theory of Employment Interest and Money" అనే గ్రంథములో ఈ సిద్ధాంతమును ప్రతిపాదించాడు. "కీన్స్" ఉద్దేశ్యములో వడ్డీరేటు కేవలము ద్రవ్య సంబంధమైన విషయం. "కీన్స్" ప్రకారంగా ద్రవ్య సప్లయి ద్రవ్యమునకు గల డిమాండ్ వడ్డీరేటును నిర్ణయిస్తాయి. ద్రవ్యమునకు గల డిమాండ్‌ను "ద్రవ్యత్వాభిరుచి"గా పేర్కొన్నాడు. సాధారణంగా వ్యక్తులు సంస్థలు తమ పొదుపులో కొంత భాగమును ద్రవ్యరూపంలో ఉంచటానికి ఆసక్తి చూపుతారు. ఎందుకంటే ద్రవ్యమును ఎప్పుడైన ఏ వస్తురూపంలోనికైనా మార్చుకొనుటకు వీలు ఉంటుంది. ఈ రకమైన ఆసక్తిని "ద్రవ్యత్వాభిరుచి" అంటారు. ద్రవ్యత్వాభిరుచిని వదులుకొనటానికి ఇచ్చే ప్రతిఫలమును "వడ్డీ" అంటారు. "కీన్స్" ప్రకారం వడ్డీరేటు ద్రవ్యము యొక్క సప్లయి డిమాండ్‌ల మీద ఆధారపడి వుంటుంది.

**ద్రవ్యమునకు గల డిమాండ్ :** - "కీన్స్" ప్రకారం ద్రవ్యానికి డిమాండ్ మూడు కారణాల వలన ఏర్పడుతుంది.

1) వ్యాపార వ్యవహారాలు నడిపే ఉద్దేశ్యం
2) ముందు జాగ్రత్త ఉండవలెననే ఉద్దేశ్యం
3) స్పెక్యులేషన్ కొనసాగించాలనే ఉద్దేశ్యం

**1) వ్యాపార వ్యవహారాలు నడిపే ఉద్దేశ్యము :** దైనందిన వ్యవహారాలు నడుపుకోవటానికి ప్రతి వ్యక్తి కొంత ద్రవ్యాన్ని చేతిలో ఉంచుకుంటాడు. వ్యక్తులు ఎంత ద్రవ్యాన్ని ఉంచుకుంటారు అనేది వారి ఆదాయంపై వారి వినియోగ అలవాట్లపై ఆధారపడి వుంటుంది. వ్యక్తుల వలే సంస్థలు కూడా నిత్యము చేసే ఖర్చు కోసం కొంత

ద్రవ్యాన్ని నిల్వ చేస్తాయి. సంస్థలు కూడా ఎంత మొత్తంను ద్రవ్యరూపంలో ఉంచుకుంటాయి అనేది ఆ సంస్థ ఉత్పత్తిమీద వ్యాపార స్థాయిమీద ఆధారపడి వుంటుంది.

**2) ముందు జాగ్రత్త ఉండవలెననే ఉద్దేశ్యము :** వ్యక్తులు, సంస్థలు ముందు జాగ్రత్త కోసం ద్రవ్యమును నగదుగా ఉంచుకుంటాయి. భవిష్యత్‌లో మనం ఊహించలేని అనేక ఖర్చులు రావచ్చు. అనారోగ్యం, రోడ్డు ప్రమాదము, దొంగతనాలు, నిరుద్యోగిత, అగ్నిప్రమాదాలు మొదలయినవి. అనుకోని సంఘటనలు ఎన్నో జరుగుతూ వుంటాయి. వీటిని ఎదుర్కొనుటకు కొంత ద్రవ్యమును ఉంచుకుంటారు. అయితే ఎంత ద్రవ్యమును ఉంచుకుంటారు అనేది వారి మనస్తత్వముపై వారికి ఋణాలు లభించే సౌకర్యముపై ఆధారపడి వుంటుంది.

**3) స్పెక్యులేషన్ కొనసాగించాలనే ఉద్దేశ్యము :** మూలధనపు మార్కెట్లో బాండ్లు, వాటాలు, ధరలు తరచూ మారుతూ ఉంటాయి. తరచూ మారే ధరలను ముందుగా ఊహించి లాభాలను పొందే ఉద్దేశ్యంతో బాండ్లు, వాటాలను కొనుగోలు చేస్తారు. దీనినే "స్పెక్యులేషన్ వ్యాపారం" అంటారు. ఈ వ్యాపారం కోసం కొంత ద్రవ్యాన్ని నిల్వ చేయటం జరుగుతుంది.

పైన వివరించిన మూడు ఉద్దేశ్యాలలో మొదటి రెండింటి కోసం నిల్వ చేసే ద్రవ్యము ఆదాయస్థాయి మీద ఆధారపడి వుంటుంది. వడ్డీరేటు ప్రభావముమీద ఉందని కీన్స్ అభిప్రాయం. స్పెక్యులేషన్ కోసం నిల్వ చేసే ద్రవ్యం మాత్రము వడ్డీరేటును బట్టి మారుతుందని కీన్స్ అభిప్రాయం. వడ్డీరేటు ఎక్కువగా ఉంటే స్పెక్యులేషన్ కోసం తమ దగ్గర ఉంచుకొనే ద్రవ్యము తక్కువగా వుంటుంది. వడ్డీరేటు తక్కువగా వుంటే ద్రవ్యమునక్కుగల డిమాండ్ ఎక్కువగా వుంటుంది. స్పెక్యులేషన్ కోసం డిమాండ్ చేసే ద్రవ్యరాశికి వడ్డీరేటుకు గల సంబంధమును ఈ క్రింది రేఖాపటంలో చూపినాము.



ఈ పై పటంలో L. P. C. అనేది ద్రవ్యత్వాభిరుచిరేఖ. ఈ రేఖ ఎడమనుంచి కుడికి క్రిందికి వాలి వుంటుంది.

ద్రవ్య సప్లయి : ఏదైన ఒక నిర్ణీత కాలములో మొత్తం ద్రవ్య సప్లయి ప్రభుత్వ విధానాలు కేంద్ర బ్యాంకు విధానాలపై ఆధారపడి వుంటుంది. సాధారణంగా స్వల్పకాలంలో మొత్తము సప్లయి స్థిరంగా వుంటుంది. దీనిని ఈ క్రింది పటంలో చూపినాము.




పై పటంలో MS రేఖ ద్రవ్య సప్లయిని తెల్పును. ఈ రేఖను X అక్షమునకు లంబంగా వుంటుంది.

**వడ్డీరేటు నిర్ణయము :** డిమాండ్ రేఖ ఒకదానినొకటి ఖండించుకున్న బిందువువద్ద వడ్డీరేటు నిర్ణయమవుతుంది. దీనిని ఈక్రింది పటంలో చూపినాము.




పై పటంలో LPC రేఖ SM రేఖ R బిందువువద్ద ఖండించుకున్నాయి. కాబట్టి OI సమతౌల్య వడ్డీరేటు ద్రవ్యమునకు గల డిమాండ్ రేఖ LPC నుండి $LPC_1$కు పెరిగినందువల్ల వడ్డీరేటు $OI_1$కు పెరిగినది.

విమర్శ : కీన్స్ సిద్ధాంతము ఈ క్రింది విమర్శలకు గురిఅయినది.

**1) ఈ సిద్ధాంతము అనిశ్చితము :** "కీన్స్" ఆదాయ స్థాయిని పరిగణనలోనికి తీసుకోలేదు. వడ్డీరేటు ద్రవ్య సప్లయికి, ద్రవ్యమునకు గల డిమాండ్ పైననేగాక ఆదాయ స్థాయిపై ఆధారపడి వుంటుంది. కానీ ఈ విషయమును "కీన్స్" తన సిద్ధాంతంలో పేర్కొనలేదు. కనుక "కీన్స్" సిద్ధాంతం అనిశ్చితము.

**2) ద్రవ్యత్వాభిరుచికి కారణాలు :** "కీన్స్" తన సిద్ధాంతంలో ద్రవ్యత్వాభిరుచికి మూడు కారణాలు పేర్కొన్నాడు. కాని ద్రవ్యత్వాభిరుచికి ఈ మూడు కారణాలే కాకుండా చాలా ఉన్నాయని విమర్శకుల అభిప్రాయం.

**3) అసంపూర్ణమైనది :** కీన్స్ సిద్ధాంతం కేవలం ద్రవ్య సిద్ధాంతము, పొదుపు చేయాలనే కోరిక ఉపాంత మూలధన సామర్థ్యం మొదలగు వాస్తవిక విషయాలను ఈ సిద్ధాంతం పరిగణనలోనికి తీసుకోలేదు. అందువల్ల ఇది అసంపూర్ణమైనది.

**4) వడ్డీరేటులో తేడాలు :** కీన్స్ ఈ సిద్ధాంతం ఒకే కాలంలో ఒకే మార్కెట్లో విభిన్నమైన వడ్డీరేట్లు ఎందుకుంటాయో వివరించలేదు.

**5) ద్రవ్య యూనిట్ నిర్వచనము :** ద్రవ్యం అంటే ఏమిటో "కీన్స్" వివరించలేదు. ద్రవ్యమంటే కేవలం నగదు బాంకు నగదు అనే విషయమును పేర్కొనలేదు. బాంకు డిపాజిట్ కూడా ద్రవ్యంగా చెలామణి అవుతుంది అన్న విషయాన్ని "కీన్స్" వివరించలేదు.

**6) దీర్ఘకాలంలో వడ్డీరేటు నిర్ణయము :** "కీన్స్" సిద్ధాంతం స్వల్పకాలంలో వడ్డీరేటు నిర్ణయము గురించి మాత్రమే తెలుపుతుంది. దీర్ఘకాలంలో జరిగే వడ్డీరేటు నిర్ణయము గురించి ఆలోచించలేదు.

**7) ద్రవ్యత్వాభిరుచి అనే భావన :** ఈ సిద్ధాంతం ద్రవ్యత్వాభిరుచి అనే భావనపై ఆధారపడి వుంటుంది. వ్యక్తులుగాని, సంస్థలుగానీ ద్రవ్యత్వాభిరుచి ఉన్నప్పుడే ఈ సిద్ధాంతం వర్తిస్తుంది. ద్రవ్యత్వాభిరుచి లేనప్పుడు ఈ సిద్ధాంతము వర్తించదు.

**8) పొదుపులేనిదే ద్రవ్య నిల్వలుండవు :** వ్యక్తులు పొదుపు చేయనిదే వారివద్ద ద్రవ్యనిల్వలు సాధ్యంకావు. వినియోగ వ్యయం కొంతవరకు త్యాగం చేయటంవలన పొదుపు ఏర్పడుతుంది. ఆ పొదుపు వలనే ద్రవ్యనిల్వలు ఏర్పడుతున్నాయి. కనుక విమర్శకుల అభిప్రాయం ప్రకారంగా పొదుపు చేయటానికిచ్చే ప్రతిఫలమును "వడ్డీరేటు" అంటారు. "కీన్స్" ఈ విషయమును విమర్శించినాడు.

### ప్రశ్న 9. ద్రవ్యత్వాభిరుచి వలయమును తెల్పుము.

జవాబు : స్పెక్యులేషన్ కోసం ద్రవ్యానికి గల డిమాండ్ వడ్డీరేటుపై ఆధారపడి వుంటుంది. వడ్డీరేటు తగ్గితే ద్రవ్యానికి గల డిమాండ్ అంటే ద్రవ్యత్వాభిరుచి పెరుగుతుంది. ఈ విధంగా ద్రవ్యత్వాభిరుచి ఒక స్థాయివరకే పెరుగుతుంది. వడ్డీరేటు ఒక స్థాయిని చేరిన తర్వాత ద్రవ్యత్వాభిరుచిలో మార్పుండదు. వడ్డీరేటు వద్ద ద్రవ్యంయొక్క డిమాండ్ పూర్తి వ్యాకోచంగా మారుతుంది. ఏ వడ్డీరేటువద్ద ద్రవ్యంయొక్క స్పెక్యులేటివ్ డిమాండ్ పూర్తి వ్యాకోచంగా ఉంటుందో దాన్ని "ద్రవ్యత్వ స్థంభన లేక ద్రవ్యత్వ వలయం" అని అంటారు. దీనిని క్రింది రేఖాపటంలో చూపినాము.




పై పటంలో $R_2$ వడ్డీరేటువద్ద ద్రవ్యత్వ వలయం ఏర్పడినది.



# అధ్యాయము 16

# గుణకము - వేగత్వరణం

**ప్రశ్న 1) గుణకము పనిచేయు విధానమును తెలుపుము.**

జవాబు : పెట్టుబడి వ్యయంలోని మార్పులవల్ల ఆదాయ స్థాయిలో ఎంత మార్పు కలుగుతుంది, అన్న విషయాన్ని "పెట్టుబడి గుణకము", లేక "ఆదాయ గుణకము" వివరిస్తుంది. పెట్టుబడి వ్యయంలోని పెరుగుదల ఫలితంగా ఆదాయంలోని పెరుగుదల పెట్టుబడి పెరుగుదలకన్నా కొన్ని రెట్లు అధికంగా వుంటుందని "గుణక సిద్ధాంతం" తెలియజేస్తుంది. పెట్టుబడి వ్యయంలో ఒక రూ॥ పెరుగుదల ఏర్పడినందు వల్ల, జాతీయాదాయంలోని పెరుగుదల 3 రూ॥ అయినట్లు అయితే గుణకము విలువను 3గా చెప్పవలెను. 'కీన్స్' తన సిద్ధాంతంలో గుణకానికి K అన్న సంకేతాన్ని ఉపయోగించినాడు. పెట్టుబడి వ్యయంలోని మార్పును ΔI, ఆదాయంలోని మార్పును ΔY గా అనుకొంటే

$$K = \frac{\Delta Y}{\Delta I}$$

పెట్టుబడి వ్యయం పెరిగినప్పుడు ఉత్పత్తి సంస్థలో పనిచేసేవారి ఆదాయం పెరుగుతుంది. దీనిని "పెట్టుబడి వ్యయంలోని పెరుగుదల ప్రాథమిక ఫలితం" అంటారు. పెరిగిన ఆదాయంలో కొంత భాగాన్ని వినియోగ వస్తువులకై ఖర్చు చేస్తారు. దీనివల్ల వినియోగ వ్యయం పెరుగుతుంది. దీనిని పెట్టుబడి వ్యయంలోని పెరుగుదల "ద్వితీయ ఫలితం" అంటారు. ఒకరి వ్యయము మరొకరికి ఆదాయం అవుతుంది. ఈ విధంగా వ్యయ పునర్వ్యయం జరిగి ఆదాయం కొన్నిరెట్లుగా వృద్ధి చెందుతుంది. ఇట్లా పెట్టుబడి వ్యయంలోని పెరుగుదల ఫలితంగా ఆదాయం ఎన్నిరెట్లు పెరుగుతుందో తెలియజేసే దానిని "ఆదాయ గుణకము" లేదా "పెట్టుబడి గుణకము" అంటారు.

గుణక ప్రభావము : గుణక ప్రభావాన్ని ఈ క్రింది ఉదాహరణద్వారా పేర్కొనవచ్చును.

| పెట్టుబడి వ్యయం | ఆదాయంలో మార్పు | వినియోగ వ్యయంలో మార్పు | పొదుపు |
|---|---|---|---|
| 25 కోట్లు | 25.00 | | |
| | | 18.75 | 6.25 |
| | 18.75 | | |
| | | 14.00 | 4.75 |
| | 14.00 | | |
| | | 10.50 | 3.50 |
| | 10.50 | | |
| | | 7.87 | 2.63 |
| | 7.87 | | |
| | | 5.91 | 1.96 |
| | 5.91 | | |
| | | 4.43 | 1.48 |
| | 4.43 | | |
| | 100 కోట్లు | 75 కోట్లు | 25 కోట్లు |

పై ఉదాహరణలో ఉపాంత వినియోగ ప్రవృత్తిని 3/4గా భావించినాము. పెట్టుబడి వ్యయంలోని 25 రెట్లు పెరుగుదల వలన ఆదాయము 100 కోట్లు వరకు పెరిగినది. కాబట్టి —

గుణకం ప్రభావాన్ని ఈ క్రింది రేఖాపటము రూపేణా చూపించవచ్చు.



పై పటంలో OX అక్షంపై ఆదాయాన్ని OY అక్షంపై పొదుపు పెట్టుబడిని చూపినాము. II రేఖ ప్రథమ పెట్టుబడి స్థాయి రేఖ, SS రేఖ, పొదుపు రేఖ, పెట్టుబడి OI గా ఉన్నప్పుడు ఆదాయం OYగా ఉన్నది. పెట్టుబడి I నుండి $I_1$కు పెరిగినందువల్ల ఆదాయము Y నుండి $Y_1$కి పెరిగింది. ఆదాయంలో వచ్చిన పెరుగుదల [$YY_1$] పెట్టుబడి వ్యయంలో వచ్చిన పెరుగుదలకన్న [$II_1$] ఎక్కువగా వున్నది.

**గుణకము అంచనా :** గుణకము విలువను ఉపాంత వినియోగ ప్రవృత్తి నిర్ణయిస్తుంది. గుణకము విలువను ఈ క్రింది సూత్రముద్వారా కనుగొనవచ్చును.

$$K = \frac{1}{1 - M.P.C}$$

ఉపాంత వినియోగ ప్రవృత్తి ఎక్కువగా వుంటే గుణకము విలువ ఎక్కువగా వుంటుంది. ఉపాంత వినియోగ ప్రవృత్తి తక్కువగా ఉంటే గుణకము విలువ తక్కువగా వుంటుంది.

**గుణక ప్రభావానికి పరిమితులు లేదా ఛిద్రాలు :**

**1. పొదుపు :** పొదుపు ఎక్కువగా వుంటే వినియోగ ప్రవృత్తి తగ్గుతుంది. తద్వారా ఆదాయస్థాయి తగ్గుతుంది. కనుక పొదుపు ఆదాయ ప్రవాహానికి ఛిద్రమవుతుంది.

**2. ఋణాలు :** ప్రజలు తమకు వచ్చిన ఆదాయాన్ని ఋణాలు తీర్చటానికి ఉపయోగించినట్లు అయితే వినియోగ వస్తువులపై చేసే వ్యయము తగ్గుతుంది. అందువల్ల గుణకము విలువ తగ్గుతుంది.

**3. దిగుమతులు :** ఎగుమతులుకన్న దిగుమతులు తక్కువగా వుంటే అంతమేరకు ఆదాయము విదేశాలకు ప్రవహిస్తుంది. ఆ మేరకు దేశములో వినియోగ వ్యయము తగ్గి గుణకము తగ్గుతుంది.

**4. పాత సెక్యూరిటీల కొనుగోలు :** పెరిగిన ఆదాయాన్ని పాత షేర్‌లు, సెక్యూరిటీలను కొనుటకు ఉపయోగిస్తే వినియోగ ప్రవృత్తి తగ్గి గుణకము విలువ క్షీణిస్తుంది.

**5. ధరల పెరుగుదల :** వినియోగ వస్తువుల ధరలు పెరిగితే పెరిగిన ఆదాయములో ఎక్కువ భాగము ధరలు చెల్లించటానికి సరిపోతుంది. అందువల్ల వినియోగ స్థాయిలోను ఉత్పత్తి ఉద్యోగస్థాయిలోను పెరుగుదల ఏర్పడును.

**6. పన్నులు ఎక్కువ :** పన్నులు ఎక్కువ ఉన్నట్లు అయితే ఆదాయములో ఎక్కువ భాగం పన్నులు చెల్లించటానికి సరిపోతుంది. తద్వారా వినియోగస్థాయి తగ్గి గుణకము విలువ తగ్గుతుంది.

**గుణకము-ప్రాముఖ్యము :**

1. వివిధ ఉత్పత్తి కార్యకలాపములలో పెట్టుబడి పెరుగుట వలన ఉద్యోగితాస్థాయి, ఆదాయ స్థాయిలు ఏ విధముగా పెరుగునో గుణకము వివరించును.

అందువలన ఆదాయ, ఉద్యోగితా స్థాయిలను తెలుసుకొనుటలో పెట్టుబడి ప్రధాన పాత్ర వహించును.

2. దేశంలో ఆర్థిక మాంద్య పరిస్థితులు ఏర్పడినపుడు ప్రభుత్వము పెట్టుబడిని పెంచినట్లయితే ఆదాయ స్థాయి కొన్ని రెట్లు పెరిగి తద్వారా వినియోగ స్థాయి పెరిగి ఆర్థిక వ్యవస్థ ఆర్థిక మాంద్యము నుండి బయటపడును.

3. గుణకము వ్యాపార చక్రాల విశ్లేషణకు, వాటి నివారణ చర్యలను సూచించును.

4. ఏ రంగాలలోనైతే ఉపాంత వినియోగ ప్రవృత్తి ఎక్కువగా ఉండునో ఆ యా రంగాలలో పెట్టుబడిని అధికం చేస్తే ఆదాయ, వ్యయ స్థాయిలు పెరిగి ఆర్థిక వ్యవస్థ అభివృద్ధి చెందటానికి వీలగునని గుణకము తెలియజేయును.

5. ఆర్థికాభివృద్ధికి కావలసిన ఆర్థిక విధానాలను రూపొందించుటకు గుణక భావము చాల ఉపయోగపడును.

**ప్రశ్న 2) - చలన గుణకము అనగానేమి ?**

**జవాబు** : పెట్టుబడి వ్యయములో పెరుగుదల ఏర్పడినప్పుడు ఆదాయస్థాయిలో మార్పులు ఏర్పడి నూతన సమతౌల్యము ఏర్పడటానికి కొంతకాలం పడుతుంది. కాలవ్యవధి లెక్కలోనికి తీసుకొని ఆదాయములోని మార్పులను వివరించే గుణకమును "చలక గుణకము" అంటారు. చలన గుణకము కాలానికి ప్రాముఖ్యతనిస్తుంది. చలన గుణకాన్ని 'Handson', 'Samuelson', 'Hicks' మొదలగువారు రూపొందించినారు.

**ప్రశ్న 3) నిశ్చల గుణకము అనగానేమి ?**

**జవాబు** : పెట్టుబడి పెరిగినపుడు గుణక ప్రభావము వలన ఏర్పడే నూతన సమతౌల్య ఆదాయస్థాయిని కీన్స్ గుణకము తెలియజేస్తుంది. పెట్టుబడి వ్యయం పెరిగినప్పటినుండి జాతీయాదాయము నూతన సమతౌల్యస్థాయికి చేరుకోవడానికి మధ్య జరిగే మార్పులను కీన్స్ సిద్ధాంతము వివరించదు. నూతన సమతౌల్యస్థితిని ఆదాయము చేరుకోవడానికి కావలసిన కాలవ్యవధిని గురించి కీన్స్ గుణకము పేర్కొనలేదు. జాతీయ ఆదాయములో పెరుగుదల ఏమాత్రం కాలవ్యవధిలేకుండా అవిచ్ఛిన్నంగా సాగుతుందనే ప్రమేయంపై కీన్స్ గుణకము ఆధారపడి వుండడంవలన దీనిని "నిశ్చల గుణకము" అంటారు.

**ప్రశ్న 4) ఉద్యోగితా గుణకము అనగానేమి?**

**జవాబు** : పెట్టుబడి వ్యయములోని వృద్ధివల్ల ప్రాథమికంగా పెరిగిన ఉద్యోగాల సంఖ్యకు తత్ఫలితంగా ఉద్యోగాల సంఖ్యలో ఏర్పడిన మొత్తం పెరుగుదలకు మధ్యవున్న

నిష్పత్తిని "ఉద్యోగితా గుణకము" అని అంటారు. 'ప్రొఫెసర్ కాంగ్' అనే ఆర్థికవేత్త ఉద్యోగితా గుణకంను ప్రవేశపెట్టినాడు. ఉదాహరణకు ప్రభుత్వము ఒక ఉక్కు కర్మాగారాన్ని నిర్మించడంకోసం కొంత పెట్టుబడి వ్యయాన్ని చేసిందనుకొందాం. ఈ కర్మాగార నిర్మాణంలో 4 లక్షల మంది శ్రామికులకు ఉద్యోగిత లభించిందని భావిద్దాము. వీరికి ఉద్యోగిత లభించడంవల్ల వారి ఆదాయాలు పెరుగుతాయి. తద్వారా వినియోగ వస్తువులకు డిమాండ్ పెరుగుతుంది. ఫలితముగా వినియోగ వస్తువుల ఉత్పత్తిని పెంచడానికి 8 లక్షల మంది శ్రామికులను ఉత్పత్తి సంస్థలు పనిలోకి తీసుకొన్నట్లయితే ఉద్యోగాల సంఖ్యలో ఏర్పడిన మొత్తం పెరుగుదల 12 లక్షలు అవుతుంది. మొత్తం ఉద్యోగాల సంఖ్యను ప్రాథమికంగా ఏర్పడిన ఉద్యోగాల సంఖ్యతో భాగిస్తే ఉద్యోగితా గుణకం తెలుస్తుంది.

$$\text{కాబట్టి ఉద్యోగితా గుణకము} = \frac{\text{మొత్తం ఉద్యోగాల సంఖ్య}}{\text{ప్రాథమిక ఉద్యోగాల సంఖ్య}}$$

పై ఉదాహరణలో ఉద్యోగితా గుణకము 3 అవుతుంది. $\left(\frac{12}{4}\right)$

### ప్రశ్న 5) - పన్ను గుణకము అనగానేమి ?

జవాబు : ప్రజల ఆదాయాలు స్థిరంగా ఉండి ప్రభుత్వము వారి ఆదాయాలమీద విధించే పన్నులను పెంచినట్లయితే వినియోగదారుల వ్యవర: ఆదాయము తగ్గుతుంది. వ్యవర: ఆదాయము తగ్గినట్లయితే సమష్టి డిమాండ్ తగ్గుతుంది. పన్నుల రేటును తగ్గించినట్లయితే వ్యవర: ఆదాయము పెరిగి సమష్టి డిమాండ్ పెరుగుతుంది. పన్నులస్థాయిలోని మార్పుకు తత్ఫలితంగా జాతీయ ఆదాయస్థాయిలో వచ్చే మార్పుకు మధ్యగల నిష్పత్తిని "పన్ను గుణకం" అంటారు.

పన్నుల స్థాయిలోని మార్పును $\Delta T \times$ గాను ఆదాయస్థాయిలోని మార్పును $\Delta Y$గా అనుకుంటే పన్ను గుణకము = $\frac{\Delta Y}{\Delta Tx}$

పన్ను గుణకము విలువ ఋణరాశిగా ఉంటుంది. దీనికి కారణము సహజముగా పన్నులస్థాయి పెరిగినప్పుడు జాతీయ ఆదాయము క్షీణిస్తుంది.

### ప్రశ్న 6) ప్రభుత్వ వ్యయ గుణకము అనగానేమి ?

జవాబు : పెట్టుబడి వ్యయంలో వచ్చిన పెరుగుదలకు తద్వారా ఆదాయంలోని పెరుగుదలకు మధ్యగల సంబంధాన్ని తెలిపేదానిని "ఆదాయ గుణకం" అంటారు లేక "పెట్టుబడి గుణకం" అంటారు. అట్లాగే ప్రభుత్వ వ్యయంలో మార్పు వచ్చినప్పుడు

ఆదాయంలో కూడా మార్పు వస్తుంది. కాబట్టి ప్రభుత్వ వ్యయంలో వచ్చిన మార్పుకు తద్వారా ఆదాయంలో వచ్చిన మార్పుకు మధ్యగల నిష్పత్తిని "ప్రభుత్వ వ్యయ గుణకము" అంటారు. **ఉదాహరణకు** ప్రభుత్వ వ్యయం 15 కోట్లనుండి 25 కోట్లకు పెరిగిందని భావిద్దాము అంటే అదనంగా ప్రభుత్వ వ్యయంలో వచ్చిన పెరుగుదల 10 కోట్లు అవుతుంది అదనంగా ప్రభుత్వ వ్యయంలో వచ్చిన పెరుగుదల ఫలితంగా వ్యయ పునర్వ్యయం జరిగి ఆదాయం అనేక రెట్లు పెరుగుతుంది. ఆదాయంలో పెరుగుదల 30 కోట్లు అయినట్లయితే ప్రభుత్వ వ్యయ గుణకం విలువ 3 అవుతుంది. ప్రభుత్వ వ్యయ గుణకాన్ని KGగా భావించినట్లయితే $KG=\frac{\Delta Y}{\Delta G}$ పై ఉదాహరణలో KG 3 అవుతుంది.

$$\left(\frac{30}{10}=3\right)$$

## ప్రశ్న 7) విదేశీ వ్యాపార గుణకము అనగానేమి ?

**జవాబు :** విదేశీ వ్యాపారంలోకూడా సమష్టి డిమాండ్ ఒక భాగంగా ఉంటుంది. ఎగుమతుల వలన దేశంలో ఆదాయ స్థాయి పెరుగుతుంది. ఎగుమతి వస్తువులను తయారుచేయడం వలన ఆ పరిశ్రమలో పనిచేసే ఉత్పత్తి కారకాలకు ఆదాయం పెరుగుతుంది. ఎగుమతులు పెరిగితే జాతీయ ఆదాయం పెరిగి ప్రజల ఆదాయాలు పెరుగుతాయి. వినియోగ వ్యయం పెరుగుతుంది. గుణక ప్రభావం వలన జాతీయ ఆదాయంలోని పెరుగుదల ఎగుమతులలోని పెరుగుదలకన్నా అనేకరెట్లు అధికంగా వుంటుంది. ఎగుమతుల పెరుగుదలకు జాతీయ ఆదాయం పెరుగుదలకు మధ్యవున్న నిష్పత్తిని తెలిపేదానిని "విదేశీ వ్యాపార గుణకము" అంటారు.

$$\text{విదేశీ వ్యాపార గుణకము} = \frac{\text{ఆదాయంలో మార్పు}}{\text{ఎగుమతులలో మార్పు}} = \frac{\Delta y}{\Delta x}$$

**విదేశీ వ్యాపార గుణకముపై ఎగుమతుల ప్రభావం :** ఎగుమతులమీద వెచ్చించిన ఆదాయం ఇతర దేశాలకు వెళ్ళిపోతుంది. తత్ఫలితంగా జాతీయ ఆదాయస్థాయి వినియోగ వ్యయస్థాయి తగ్గుతుంది. కనుక దిగుమతులు ఆదాయ ప్రవాహానికి ఛిద్రములాంటివి. దిగుమతులు విదేశీ వ్యాపార గుణకముయొక్క విలువను తగ్గిస్తాయి. దిగుమతులు పెరిగితే గుణకము విలువ తగ్గుతుంది.

**ప్రశ్న 8) బదిలీ చెల్లింపుల గుణకము అనగానేమి?**

**జవాబు :** బదిలీ చెల్లింపులమీద ప్రభుత్వ వ్యయంలో వచ్చిన మార్పుకు తద్వారా ఆదాయంలో వచ్చే మార్పుకు మధ్యగల నిష్పత్తిని "బదిలీ చెల్లింపుల గుణకం" అంటారు. బదిలీ చెల్లింపులలో పెరుగుదలవల్ల ఆ చెల్లింపులు పొందినవారి ఆదాయం పెరుగుతుంది. పెరిగిన ఆదాయంలో ఎంత వ్యయం చేస్తారనేది ఉపాంత వినియోగ ప్రవృత్తిపై ఆధారపడి వుంటుంది. ఉపాంత వినియోగ ప్రవృత్తి 3/4 అనుకుందాం. బదిలీ చెల్లింపులలోని పెరుగుదల 10 కోట్లు అయినట్లయితే అప్పుడు ఆదాయంలోని పెరుగుదల 7.5 కోట్లు మాత్రమే అవుతుంది.

$$\text{బదిలీ చెల్లింపుల గుణకము} = \frac{\text{ఆదాయంలోని మార్పు}}{\text{బదిలీ చెల్లింపులలోని మార్పు}} \left(\frac{\Delta Y}{\Delta TP}\right)$$

**ప్రశ్న 9) సంతులిత బడ్జెట్ గుణకము అనగానేమి?**

**లేదా**

**"హవెల్మో" ప్రభావాన్ని తెల్పుము.**

**జవాబు :** ప్రభుత్వము ఉద్యోగితా స్థాయిని పెంచుటకు వ్యయాన్ని పెంచవలెను. ప్రభుత్వం వ్యయాన్ని పెంచడానికి కావలసిన ఆదాయాన్ని పన్నులను పెంచడంద్వారా సమకూర్చుకుంటుంది. పన్నులను పెంచితే ప్రజల వ్యయరః ఆదాయం తగ్గుతుంది. వినియోగస్థాయి తగ్గుతుంది. ఫలితంగా జాతీయ ఆదాయ స్థాయి తగ్గుతుంది. కాబట్టి పన్నులను పెంచి ప్రభుత్వ వ్యయాన్ని పెంచడంద్వారా జాతీయ ఆదాయ స్థాయిని పెంచలేమని చాలామంది ఆర్థికవేత్తల అభిప్రాయం. కానీ 'హనిల్‌యా' అను ఆర్థికవేత్త అభిప్రాయం ప్రకారంగా పన్నులను పెంచినప్పటికి ఆదాయం క్షీణించకపోవచ్చును. పన్నుల వలన ఆదాయంలో వచ్చే క్షీణింపుకన్న ప్రభుత్వ వ్యయం వలన జాతీయ ఆదాయంలో వచ్చే పెరుగుదల ఎక్కువగా వుంటుందని ఈయన అభిప్రాయము. పన్నులద్వారా సేకరించిన ఆదాయాన్ని ప్రభుత్వ వస్తుసేవలపై ఖర్చుచేయడం వలన ఉద్యోగితా స్థాయి పెరుగుతుంది. పన్నులను చెల్లించినవారినుండి ఆదాయం ప్రభుత్వానికి మరల ఆదాయం ప్రభుత్వం నుండి ప్రజలకు పంపిణీ అవుతుంది. కాబట్టి పన్నులను ఆదాయం పునఃపంపిణీ జరుగుతుందిగానీ వ్యయరః ఆదాయం తగ్గదని 'హవిల్‌యా' అభిప్రాయం. దీనినే 'హెవెల్మో ప్రభావం' అంటారు.

**ప్రశ్న10) వేగత్వరణ సూత్రము పనిచేయు విధానమును తెలుపుము.**

**జవాబు :** వేగత్వరణము స్థూల ఆర్థిక విశ్లేషణకు ఒక ముఖ్య సాధనం. వేగత్వరణ సూత్రము గుణక సూత్రం కంటె పురాతనమైనది. అమెరికా దేశ ఆర్థికవేత్త 'J.M. క్లార్క్' ఈ సూత్రాన్ని ప్రతిపాదించాడు. 'కీన్స్' అనుచరులైన 'హేన్‌సన్', 'హేరిట్', 'శామ్యేల్సన్' మొదలగువారు గుణక వేగత్వరణ సూత్రాలను సమన్వయం చేశారు.

గుణక సిద్ధాంతము పెట్టుబడిలోని పెరుగుదలకు తత్ఫలితంగా ఆదాయస్థాయిలోని పెరుగుదలకు మధ్యవున్న సంబంధాన్ని వివరిస్తుంది. ఆదాయస్థాయి వృద్ధిచెందటంవల్ల వినియోగ వ్యయం పెరిగి పెట్టుబడి వ్యయం పెరుగుతుంది. వినియోగ వ్యయంలోని మార్పులపై పెట్టుబడి వ్యయం ఎట్లు ఆధారపడివుంటుందో వేగత్వరణ సూత్రం తెలియజేస్తుంది. వినియోగ వ్యయంలోని మార్పుకు, పెట్టుబడిలోని మార్పుకు మధ్యగల నిష్పత్తిని "వేగత్వరణము" అంటారు. వినియోగ వస్తువులకు డిమాండ్ పెరిగినట్లయితే తద్వారా ఉత్పాదక వస్తువుయొక్క డిమాండ్ ఏవిధంగా ఉండేదీ వేగత్వరణ సూత్రం తెలియజేస్తుంది. వినియోగ వస్తువులయొక్క డిమాండ్ పెరిగినప్పుడు ఉత్పాదక వస్తువులకు డిమాండ్ పెరిగి పెట్టుబడి వ్యయం పెరుగుతుంది. వినియోగ వ్యయంలోని మార్పును $\Delta C$ గాను, పెట్టుబడిలోని మార్పును $\Delta I$ గాను భావించినట్లయితే

$$\text{వేగత్వరణం} = \frac{\Delta I}{\Delta C}$$

**ఉదాహరణ :** వినియోగ వ్యయంలోని పెరుగుదల 4 కోట్లు అయినప్పుడు పెట్టుబడి వ్యయంలోని పెరుగుదల 16 కోట్లు అయినట్లయితే

$$\text{వేగ త్వరణం} = \frac{16}{4} = 4 \text{ అవుతుంది.}$$

**వేగత్వరణ సూత్రానికి పరిమితులు :** కొన్ని పరిస్థితులలో వేగత్వరణ సూత్రం పనిచేయదు. ఆ పరిస్థితులలో వినియోగ వస్తువులకు డిమాండ్ పెరిగినప్పటికీ పెట్టుబడి వ్యయంమీద దాని ప్రభావం ఏమాత్రం ఉండదు.

1. ఉపయోగించని యంత్రాలు ఉత్పాదక వస్తువుల పరిశ్రమలలో వుంటే, వినియోగ వస్తువుల ఉత్పత్తిని పెంచటానికి నూతన యంత్రాలను తయారుచేయాల్సిన అవసరంలేదు.

2. వినియోగ వస్తువుల డిమాండ్‌లోని పెరుగుదల తాత్కాలికమని ఉత్పాదక సంస్థలు భావించినట్లయితే అవి పెట్టుబడి వ్యయాన్ని పెంచవు. అప్పుడు వేగత్వరణం పనిచేయదు.

3. కొన్నిరకాల పెట్టుబడి వినియోగ వ్యయముల మార్పులపై ఆధారపడి ఉండదు. దీర్ఘకాలిక అంశాలు అయిన జనాభా, సాంకేతిక పరిజ్ఞానం మొదలగునవి దృష్టిలో పెట్టుకొని పెట్టుబడి వ్యయాన్ని పెంచటం జరుగుతుంది. అందుచేత పెట్టుబడి వినియోగ వ్యయాన్ని అనుసరించదు.

4. ద్రవ్య వస్తువులు కాని, ఆర్థిక వనరులు కాని లోపించినట్లయితే వినియోగ వ్యయ స్థాయి పెరిగినప్పటికీ పెట్టుబడిని పెంచటం కష్టం అవుతుంది.

5. నూతన పద్ధతులు కనుగొంటే అదే పెట్టుబడితో ఎక్కువ ఉత్పత్తిని చేయటానికి వీలు అవుతుంది. కనుక వినియోగ వ్యయము పెరిగినప్పటికి ఉత్పాదక వస్తువు పరిశ్రమలో పెట్టుబడి పెరగకపోవచ్చును.

వేగత్వరణ సూత్రానికి కొన్ని పరిమితులు ఉన్నా మొత్తంమీద వినియోగ వ్యయంలోని పెరుగుదల ఉత్పాదక రంగంలోని పెట్టుబడిని కొన్ని రెట్లు అధికంగా పెంచుతుంది.

**గుణకము - వేగత్వరణానికి తేడా :**

1. పెట్టుబడిలోని పెరుగుదలకు, తద్వారా ఆదాయస్థాయిలో వచ్చే పెరుగుదలకు మధ్యగల సంబంధాన్ని 'గుణకసూత్రం' తెలియజేస్తుంది. వినియోగ వ్యయంలోని పెరుగుదలకు, తద్వారా పెట్టుబడిలో వచ్చు పెరుగుదలకు మధ్యగల సంబంధాన్ని 'వేగత్వరణం' తెలియజేస్తుంది.

2. గుణక సిద్ధాంతంలో పెట్టుబడిమీద వినియోగ వ్యయం ఆధారపడి వుంటుంది. వేగత్వరణ సిద్ధాంతంలో వినియోగ వ్యయంమీద పెట్టుబడి ఆధారపడి వుంటుంది.

3. గుణకము విలువ ఉపాంత వినియోగ ప్రవృత్తిమీద ఆధారపడి వుంటుంది. వేగత్వరణ విలువ యంత్రాల జీవిత కాలంమీద ఆధారపడి వుంటుంది.

4. గుణకం మానసిక అంశాలపై ఆధారపడి వుంటుంది. వేగత్వరణ సాంకేతిక అంశాలపై ఆధారపడి వుంటుంది.

**వేగత్వరణ ప్రాముఖ్యత :**

1. వినియోగ వ్యయం మార్పుల వలన పెట్టుబడిస్థాయి ఎట్లా మారుతుంది, తత్ఫలితంగా ఉద్యోగిత ఉత్పత్తి స్థాయిలో మార్పులు ఎలా వస్తాయి అనేదానిని వేగత్వరణ సూత్రం వివరిస్తుంది.

2. ఆదాయ ఉద్యోగిత స్థాయిలో వ్యాపార చక్రాలు ఎట్లా ఏర్పాటవుతాయో ఈ సూత్రం తెలియజేస్తుంది.

3. వినియోగ వస్తువుల పరిశ్రమలోని కొద్ది మార్పుల వలన ఉత్పాదక వస్తువుల పరిశ్రమలో అత్యధిక మార్పులు ఎందుకు వస్తాయో ఈ సూత్రం తెలియజేస్తుంది.

**ప్రశ్న11) గుణక, వేగత్వరణాలను సమన్వయపరచి, జాతీయ ఆదాయంపై వాటి ప్రభావాన్ని తెల్పుము.**

జవాబు : గుణకము, వేగత్వరణము ఒకేసారి పనిచేయడంవల్ల జాతీయ ఆదాయము ఎన్నో రెట్లు పెరుగుతుంది. ప్రాథమికంగా జరిగిన పెట్టుబడి ఫలితంగా మొత్తం జాతీయ ఆదాయ స్థాయిలో ఎంత మార్పు వస్తుందో కనుగొనుటకు గుణక, వేగత్వరణ ప్రభావాలను సమన్వయపరచవలెను. ఆధునిక ఆర్థికవేత్తలు గుణక, వేగత్వరణ ప్రభావాలను సమన్వయపరచి, జాతీయ ఆదాయంపై వాటి ప్రభావాన్ని విశ్లేషణ చేసినారు. పెట్టుబడి స్థాయి పెరిగినప్పుడు తద్వారా ఆదాయ స్థాయిలో వచ్చే పెరుగుదలకు, పెట్టుబడిలోని పెరుగుదలకు మధ్యగల సంబంధాన్ని గుణక సిద్ధాంతము వివరిస్తుంది.

గుణకము విలువ $= K = \frac{1}{1-MPC}$

$$K = \frac{\Delta Y}{\Delta I}$$

K = గుణకము

MPC = ఉపాంత వినియోగ ప్రవృత్తి

$\Delta Y$ = ఆదాయంలోని మార్పు

$\Delta I$ = పెట్టుబడిలోని మార్పు

ఉపాంత వినియోగ ప్రవృత్తి 3/4 అయితే, గుణకము విలువ 4 అవుతుంది. పెట్టుబడిలోని పెరుగుదల 25 కోట్లు అయితే, ఆదాయంలోని పెరుగుదల 100 కోట్లు అవుతుంది. వినియోగవ్యయంలోని పెరుగుదలకు తద్వారా ప్రేరిత పెట్టుబడిలో వచ్చే పెరుగుదలకు మధ్యగల సంబంధాన్ని "వేగత్వరణం" అంటారు.

వేగత్వరణం $(V) = \frac{\Delta I}{\Delta C}$

V = వేగత్వరణం

$\Delta I$ = పెట్టుబడిలోని మార్పు

$\Delta C$ = వినియోగ వ్యయంలోని మార్పు

గుణకం విలువను ఉపాంత వినియోగ ప్రవృత్తి నిర్ణయిస్తుంది. వేగత్వరణం విలువను ఉత్పాదక వస్తువుల జీవితకాలం నిర్ణయిస్తుంది గుణకం పనిచేసినప్పుడు వేగత్వరణం కూడా పనిచేస్తుంది. పెట్టుబడి వ్యయం పెరిగినప్పుడు ఆదాయ స్థాయి, వినియోగ వ్యయస్థాయి రెండూ పెరుగుతాయి. వినియోగ వ్యయ స్థాయి పెరిగినప్పుడు పెట్టుబడి మరల పెరుగుతుంది. ఇలా ఒకదాని వెనుక ఒకటి ఈ చలాంకాలన్ని

మారుతూ ఉంటాయి. అందువలన మొత్తంమీద జాతీయ ఆదాయస్థాయి అనేక రెట్లు పెరుగుతుంది.

గుణక, వేగత్వరణ సమష్టి ప్రభావాన్ని ఈ క్రింది ఉదాహరణద్వారా తెలియచేయవచ్చును.

| ఆదాయ కాలము | ప్రాథమిక పెట్టుబడి | వినియోగ వ్యయం | ప్రేరిత పెట్టుబడి | జాతీయ ఆదాయంలోని పెరుగుదల |
|---|---|---|---|---|
| 1 | 20 కోట్లు | 0 | 0 | 20 కోట్లు |
| 2 | 20 కోట్లు | 10 | 20 | 50 కోట్లు |
| 3 | 20 కోట్లు | 25 | 30 | 75 కోట్లు |
| 4 | 20 కోట్లు | 37.5 | 25 | 82.50 కోట్లు |
| 5 | 20 కోట్లు | 41.25 | 7.50 | 68.75 కోట్లు |

పై పట్టికలో ఉపాంత వినియోగ ప్రవృత్తి 1/2గాను, వేగత్వరణం విలువ 2 గాను భావించినాము. పట్టికలోని 1వ ఆదాయ కాలంలో గుణకంకాని, వేగత్వరణంకాని పనిచేయడం ప్రారంభించవు. అందువలన జాతీయ ఆదాయంలోని పెరుగుదల పెట్టుబడి వ్యయానికి (20) సమానంగా యున్నది. 2వ ఆదాయ కాలంలో జాతీయ ఆదాయంలో 1/2వ వంతు వినియోగ వస్తువులపై వ్యయం చేయటంవల్ల వినియోగ వ్యయము 10 కోట్లు అవుతుంది (20 × 1/2) వినియోగ వ్యయంలోని 10 కోట్లు పెరుగుదలవల్ల ప్రేరిత పెట్టుబడిలోని పెరుగుదల 20 కోట్లు అవుతుంది (10 × 2). జాతీయ ఆదాయంలోని మొత్తం పెరుగుదల 50 కోట్లు అవుతుంది (20 + 10 + 20). 3వ ఆదాయ కాలంలో గడచిన కాలంలోని 50 కోట్లు జాతీయ ఆదాయంలో 1/2వ వంతు అంటే 25 కోట్లు వినియోగ వస్తువులపై వ్యయం అవుతుంది (50 × 1/2). గడచిన కాలంలోని వినియోగ వ్యయంతో పోల్చిచూస్తే వినియోగ వ్యయంలోని పెరుగుదల 15 కోట్లు అవుతుంది (25-10). వేగత్వరణం విలువ 2 కాబట్టి ప్రేరిత పెట్టుబడి 30 కోట్లు అవుతుంది (15 × 2). 3వ ఆదాయ కాలం ముగిసేటప్పటికి జాతీయ ఆదాయంలో మొత్తం పెరుగుదల 75 కోట్లు అవుతుంది (20 + 25 + 30). ఈ విధంగా జాతీయ ఆదాయంలో గుణక, వేగత్వరణ సమష్టి ప్రభావం వలన 4వ కాలం ముగిసేటప్పటికి 82.50 కోట్లు అవుతుంది. 5వ కాలంలో వినియోగ వ్యయంలోని పెరుగుదల రేటు తద్వారా ప్రేరిత పెట్టుబడిస్థాయి క్షీణించడం వలన ఆదాయస్థాయి క్షీణిస్తుంది (68.75). దీనినిబట్టి ఆదాయ, ఉద్యోగితలో వ్యాపార చక్రాలు ఏర్పడటానికి గల కోణాలను

గుణకం, వేగత్వరణంలను సమన్వయం చేసినప్పుడు తెలుస్తుంది. దీనిని ఈ క్రింది పటంలో చూపినాము.




పై పటంలో పెట్టుబడిస్థాయి OI గా యున్నప్పుడు ఆదాయం OYగా యున్నది. పెట్టుబడి $OI_1$ కు పెరిగినప్పుడు గుణక ప్రభావము వలన ఆదాయము OY నుంచి $OY_1$కు పెరిగింది. ప్రేరిత పెట్టుబడి $OI_1$ నుంచి $OI_2$కు పెరగటంవల్ల ఆదాయము $OY_1$ నుంచి $OY_2$ కు పెరిగింది. కనుక గుణక, వేగత్వరణాలవల్ల ఆదాయము $OY_1$ నుంచి $OY_2$కు పెరిగింది.

గుణక, వేగత్వరణం కలసి పనిచేయడంవల్ల వ్యాపార చక్రాలు ఏర్పడతాయి. ఈ రెండింటిని సమన్వయపరచి వ్యాపార చక్ర సిద్ధాంతాన్ని J. R. హిక్స్ రూపొందించాడు.



# అధ్యాయము 17

# ద్రవ్యము - బ్యాంకింగ్

**ప్రశ్న 1) "వస్తు వినిమయ పద్ధతి" అనగానేమి ? అందులోని లోపాలను తెలుపుము?**

**లేదా**

**"వస్తు మార్పిడి పద్ధతి" అంటే ఏమిటి ? ఈ పద్ధతిలోని ఇబ్బందులేవి? ఆ ఇబ్బందులను ద్రవ్యము ఎట్లా తొలగించినది ?**

**జవాబు :** **వస్తు వినిమయ పద్ధతి :** ప్రాచీన కాలంలో వస్తువుల సంఖ్య మిక్కిలి పరిమితంగా వుండేది. మానవుని కోర్కెలు కూడా చాలా పరిమితంగా వుండేవి. అందువల్ల ప్రతి వ్యక్తి తనకు అవసరమైన వస్తుసేవలను తానే చేసుకొనేవాడు. కాని కాలక్రమేణా నాగరికత అభివృద్ధితోపాటు మానవుని కోర్కెలు పెరుగుతూ వచ్చాయి. ఈ పెరిగిన కోర్కెలను సంతృప్తిపరచడానికి కావలసిన వస్తుసేవలు కూడా పెరిగాయి. వీటన్నింటిని వ్యక్తి తనకు తాను వుత్పత్తి చేసుకోలేని స్థితికి వచ్చాడు. తనకు కావలసిన కొన్ని వస్తుసేవలను మాత్రమే తాను ఉత్పత్తి చేసుకుంటూ, మిగతా వస్తుసేవలకై ఇతరులమీద ఆధారపడడం మొదలుపెట్టాడు. రాను రాను ఈ ఆధారం ఎక్కువైంది. అందువల్ల ప్రతి వ్యక్తి తాను ఏ వస్తువులను సులభంగా, లాభదాయకంగా ఉత్పత్తి చేయగలడో వాటిని మాత్రమే ఉత్పత్తి చేస్తూ, వాని వినిమయము లేదా మారకంద్వారా ఇతర వస్తువులను పొందనారంభించాడు. అనగా, వస్తువులకు బదులుగా వస్తువులను మార్పిడి చేసుకోవడం మొదలుపెట్టినాడు. నేత పనివాడు తనకు కావలసిన దానికంటే ఎక్కువ వస్త్రమును తయారుచేసి, దానిని రైతుకు ఇచ్చి అతనివద్దనుండి తనకు కావలసిన ధాన్యమును తీసికొనుట దీనికి ఉదాహరణ. ఈ విధంగా వస్తుసేవలను మార్పిడిచేసే పద్ధతిని 'వస్తు వినిమయ పద్ధతి' అంటారు. అనగా ఇద్దరు వ్యక్తులు తమకు కావలసిన వస్తువులను పరస్పరం మార్చుకొనే పద్ధతిని 'వస్తు వినిమయ పద్ధతి' అనవచ్చు. దీనినే 'వస్తు మార్పిడి పద్ధతి' అని లేదా 'బార్టరు పద్ధతి' అని కూడా అంటారు. ద్రవ్యం చెలామణిలోకి రాకపూర్వం వస్తుమార్పిడి పద్ధతి విరివిగా అమలులోవుండేది. కాని ఆధునిక ఆర్థిక వ్యవస్థలో ఈ పద్ధతికి స్థానంలేదు.

**వస్తు వినిమయ పద్ధతిలోని లోపాలు** : వస్తు వినిమయ పద్ధతిలో పెక్కు సమస్యలు, చిక్కులు, లోపాలు వున్నాయి. అవి :

**1) కోర్కెల సమన్వయం లేకపోవటం** : ఈ పద్ధతిలో ఇద్దరు వ్యక్తులమధ్య వినిమయం జరగాలంటే వారి కోర్కెల మధ్య సమన్వయం ఉండాలి. లేకపోతే వినిమయం సాధ్యం కాదు. **ఉదాహరణకు**, ఒక వ్యక్తి వరి ధాన్యాన్నిచ్చి వంటనూనెను పొందాలనుకుంటే, అతనికి వంట నూనె ఇచ్చి ధాన్యాన్ని కోరుకునే వ్యక్తి తటస్థపడాలి. అప్పుడే వారిద్దరిమధ్య వినిమయం జరుగుతుంది. ఇలా కోర్కెల సమన్వయం రాను రాను కష్టమైంది. ఇలాంటి వ్యక్తులు తటస్థపడటానికి ఎంతో కాలవ్యవధి అవసరమవుతుంది.

ద్రవ్యం ఈ లోపాన్ని సరిదిద్దింది. ద్రవ్యం వినిమయాన్ని రెండు భాగాలుగా విభజించింది. అమ్మటం- కొనటం ఫలితంగా వ్యక్తి ముందుగా తన వస్తువుని ద్రవ్యానికి అమ్ముకొని, ఆ ద్రవ్యంతో తనకి కావలసిన వస్తువును కొనుక్కోవచ్చు కనుక కోర్కెల సమన్వయంతో ఇప్పుడు పని లేదు. ఆధునిక వినిమయమంతా ఈ విధంగానే జరుగుతున్నది.

**2) కాల సమన్వయం లేకపోవడం (Lack of Co-incidence of Point of Time)** : వినిమయం జరగటానికి కోర్కెల సమన్వయంతోపాటు కాల సమన్వయంకూడా ఉండాలి. అప్పుడే వినిమయం జరుగుతుంది. అంటే ఇద్దరు వ్యక్తులు తమ తమ వస్తువులను ఒకే సమయంలో ఇచ్చిపుచ్చుకునేందుకు సిద్ధపడవలె. అంతేగాని ఒకరు సిద్ధపడిన సమయంలో రెండవవారు సిద్ధపడకపోతే వినిమయం జరగదు.

ద్రవ్యం వాడుకలోకి రావటంతో ఈ యిబ్బంది తొలగిపోయింది. ఇప్పుడు కాల సమన్వయంతో పనిలేదు. ముందుగా వ్యక్తి తన వస్తువును ద్రవ్యానికి విక్రయించి, ఆ ద్రవ్యంతో తనకు అవసరమొచ్చినపుడు అవసరమైన వస్తువు కొనుక్కోవచ్చు.

**3) స్థిరమైన కొలమానం లేకపోవటం (Lack of Fixed Measure of Value)**: వస్తు వినిమయ పద్ధతిలో వస్తువుల విలువలను కొలవటానికి స్థిరమైన కొలబద్ద అంటూ ఏదీ లేదు. అందువల్ల ప్రతి వస్తువు విలువను అనేక యితర వస్తువులలో చెప్పవలసి వస్తుంది. అంటే ప్రతి రెండు వస్తువుల వినిమయ నిష్పత్తి వేర్వేరుగా నిర్ణయించవలె. **ఉదాహరణకు**, ఒక మీటరు బట్ట విలువ ఒకసారి వరిధాన్యంలోను, మరోసారి వంటనూనెలోను, ఇంకొకసారి పొగాకులోను చెప్పవలసి వుంటుంది. ఈ విధంగా ప్రతి వస్తువుకు అనేక విలువలుంటాయి. దేశంలో అనేక రకాల వస్తుసేవలు ఉత్పత్తి అవుతున్నాయికదా ! మరి వీటన్నింటి విలువలను (మార్పిడి రేటును) గుర్తుంచుకోవటం అసాధ్యమవుతుంది. అంతేగాక వస్తువుల విలువలను సరిపోల్చటం (compare) కూడా కష్టమైన పనే.

ద్రవ్యం ఈ ఇబ్బందిని తొలగించింది. ఇప్పుడు ఏ వస్తువుకైన ఒకే ఒక విలువ, అది ద్రవ్యరూపంలో ఉంటుంది. **ఉదాహరణకు**, ఒక మీటరు బట్ట విలువ రూ. 15.

దీనివల్ల వస్తువుల విలువలను సులభంగా గుర్తుంచుకోవటమేకాక పోల్చుకోవచ్చుకూడా. ద్రవ్యం ఉండబట్టి ఈనాడు అసంఖ్యాకమైన వినిమయాలు సులభంగాను, సునాయాసంగాను కాలయాపన లేకుండాను జరుగుతున్నాయి.

**4) విభజించటానికి వీలులేకపోవటం (Lack of Divisibility) :** కొన్ని వస్తువులను చిన్న చిన్న భాగాలుగా విభజించటానికి వీలుపడదు. **ఉదాహరణకు,** పశువులు, గృహాలు, గృహోపకరణాలు, వ్యవసాయ పనిముట్లు మొదలైనవి అవిభాజ్య వస్తువులు. వాటిని మార్పిడి చేయటం సులభంకాదు. అట్టి సందర్భాలలో హెచ్చు విలువ గల వస్తువును తక్కువ విలువ గల వస్తువుతో వినిమయం చేయటంలో పెద్ద చిక్కు ఏర్పడుతుంది. **ఉదాహరణకు,** ఒక వడ్రంగి తాను తయారుచేసిన ఒక కుర్చీతో అతనికి కావలసిన ధాన్యం, నూనె, పొగాకు, బట్ట మొదలైన వస్తువులను అన్నింటిని పొందటం సాధ్యంకాదు. ఎందుకంటే కుర్చీని చిన్నభాగాలుగా చేయటానికి వీలులేదు. అలా చేస్తే దాని విలువ నశిస్తుంది. కనుక ఇలాంటి సందర్భాలలో వినిమయం జరగదు.

**5) విలువను నిల్వ చేసుకోవటానికి వీలు లేకపోవటం - (Lack of Store of Value) :** ప్రతి వ్యక్తి తన ఆదాయంలో కొంత భాగం భవిష్యత్తు కోసం పొదుపుచేసి కూడబెడతాడు. ద్రవ్యం విలువ నిధిగా పనిచేస్తుంది. కాని వస్తు వినిమయ పద్ధతిలో భవిష్యత్‌లో ఉపయోగించుకునే నిమిత్తం ఆదాయాన్ని పొదుపుచేసి నిల్వ ఉంచుకోవటం కష్టమవుతుంది. కొనుగోలు శక్తిని వస్తురూపంలో నిల్వ చేయటంలో అనేక ఇబ్బందులున్నాయి. కొన్ని వస్తువులను నిల్వ ఉంచితే వాటి విలువ తగ్గటం కాని లేక పూర్తిగా నశించటంకాని జరగవచ్చు. **ఉదాహరణకు,** కూరగాయలను పండించేరైతు తన ఉత్పత్తిని నిల్వ వుంచుకోవడానికి వీలులేదు. ఒకవేళ నిల్వ ఉంచితే వాటి విలువ నశించిపోతుంది. అదేవిధంగా కొన్ని వస్తువుల విలువ తగ్గవచ్చు. అసలు వస్తువులను నిల్వ ఉంచటం, భద్రపరచటం చాలా కష్టము. ద్రవ్యం లేకపోతే పొదుపు చేయటం కష్టం అవుతుంది. ఋణాలు ఇవ్వటం, తీసుకోవటం కూడా కష్టమే.

ద్రవ్యం అమలులోకి రావటంతో ఈ ఇబ్బంది తొలగిపోయింది. ఇప్పుడు వస్తువులను ద్రవ్యంలోకి మార్చుకొని, ఆ ద్రవ్యాన్ని ఎంతకాలమైనా నిల్వ ఉంచుకోవచ్చు. అది ఎంతకాలం నిల్వ ఉంచినా నశించదు, విలువ పోగొట్టుకోదు.

**6) సేవల మారకంలో ఇబ్బంది :** డాక్టరు, న్యాయవాది, అధ్యాపకుడు, గాయకుడు, నటుడు మొదలైనవారి సేవల విలువను వస్తురూపంలో లెక్కకట్టడం చాలా కష్టం. ఈ సందర్భంలో అర్థికవేత్తలు ఫ్రెంచి గాయని కష్టాలను ఉదహరించినారు. ద్రవ్యంలేని ద్వీపకల్పంలో ఆమె గానకచేరీలు చేసేది. ప్రేక్షకులు ఆమెకు పందులు, కోళ్ళు, పళ్ళు, తినుబండారాలు ఇచ్చేవారు. పందులు, కోళ్ళు ఆ తినుబండారాలను తినేసేవి. వాటిని పోషించడానికి ఆమె మరికొన్ని కచేరీలు చేయాల్సివచ్చేది. ఆమె సంపన్నురాలు అవలేకపోవటం అట్లా ఉంచి, తనకు వచ్చిన జంతువులను పోషించలేక

బాధపడేది. అట్లాగే కళాశాలలో చెల్లించవలసిన ఫీజులు విద్యార్థులు ధాన్యం, పళ్ళరూపంలో చెల్లిస్తే ఎట్లా ఉంటుంది. కాబట్టి సేవల మార్పిడి ఈ పద్ధతి ద్వారా చాలా కష్టమవుతుంది.

వస్తు వినిమయ పద్ధతిలోని పై లోపాలను తొలగించుటకు ద్రవ్యమనేది సాక్షాత్కరించింది. ఈ ద్రవ్యము అమూల్యమైన విధులను నిర్వహిస్తూ వస్తు వినిమయ పద్ధతిలోని లోపాలకు పరిష్కర్తగా పరిణామం చెందింది. వస్తు వినిమయ పద్ధతిలోని లోపాలను తొలగించుటకు ద్రవ్యమొక "సాధనం" అని నిస్సందేహంగా చెప్పవచ్చు.

**ప్రశ్న 2) ద్రవ్యము అనగానేమి? ద్రవ్యం విధులను తెలుపుము.**

**జవాబు :** వస్తు మార్పిడి విధానములో లోపాలను నివారించటానికిగాను ద్రవ్యం ప్రవేశపెట్టబడింది. ద్రవ్యాన్ని అనేకమంది అర్థికవేత్తలు అనేక రకాలుగా నిర్వచించినారు. ప్రొఫెసర్ 'వాకర్' ప్రకారంగా "ద్రవ్యం ఏ పని చేస్తుందో ఆ పని చేసే వస్తువునే ద్రవ్యం" అంటారు. రాబర్ట్‌సన్ ప్రకారంగా **"వస్తువులు కొన్నప్పుడు చెల్లించటానికి, ఇతర రకాల వ్యాపార బాకీలను తీర్చటానికి అందరూ అంగీకరించే వస్తువే** ద్రవ్యము.' 'సెలిగ్ మెన్' ప్రకారంగా **"సర్వాంగీకారం పొందిన వస్తువే ద్రవ్యం".**

**ద్రవ్యం విధులు :** ద్రవ్యం ఈ క్రింది విధులను నిర్వహిస్తుంది :

**1) విలువ కొలమానము :** అన్ని వస్తుసేవల విలువలను కొలిచే సాధనం ద్రవ్యం. దూరాన్ని మీటర్లలోను, బరువును కిలోగ్రాములలోను, పరిమాణాన్ని లీటర్లలోను కొలిచినట్లే, వస్తువుల విలువలను ద్రవ్యంతో కొలుస్తారు. అంటే ద్రవ్యం కొలబద్ద అన్నమాట. ఒక వస్తువుయొక్క విలువను ద్రవ్య రూపంలో చెపితే దానిని "ఆ వస్తువుయొక్క ధర" అంటారు. ధరలు తెలిసినప్పుడు వివిధ వస్తువులను పోల్చవచ్చు. ధరల మూలంగా మార్కెట్‌లు విస్తరించబడి ఉత్పత్తి అమ్మకం భారీ ఎత్తున జరుగుతుంది.

**2) వినిమయ మాధ్యమము :** ద్రవ్యం వినిమయ మాధ్యమంగా పనిచేస్తుంది. వస్తువును ముందు ద్రవ్యానికి అమ్మటం, ఆ ద్రవ్యంతో మనకు కావలసిన వస్తువులను కొనుక్కోవటం జరుగుతుంది. ద్రవ్యంవల్ల వస్తుమార్పిడి విధానంలోని ఇబ్బందులు తొలగిపోయినాయి.

**3) విలువ నిధి :** ప్రతివారు భవిష్యత్ అవసరాలకు కొంత పొదుపు చేసి కూడబెట్టుకోవలెను. ఇందుకై వస్తుమార్పిడి విధానంలో వస్తువులను నిల్వ చేసుకోవలసి వచ్చేది. వస్తువులను నిల్వ చేయటంలో అనేక ఇబ్బందులు ఉండేవి. ద్రవ్యం వచ్చిన తరువాత పొదుపు చేయటానికి, కూడబెట్టటానికి అవకాశం కల్గినది. ద్రవ్యాన్ని భవిష్యత్తు అవసరాలకు నిల్వచేసినందువల్ల దాని ప్రయోజనం నశించదు. కాబట్టి ద్రవ్యాన్ని నిలువ నిధిగా ఉపయోగించవచ్చు.

**4) వాయిదా చెల్లింపుల ప్రమాణం :** భవిష్యత్తులో చెల్లించవలసిన రుణాలకు ద్రవ్యం కొలమానంగా పనిచేస్తుంది. వస్తువులను అరువుమీద కొన్నప్పుడు రుణాలు

తీసుకొన్నప్పుడు వాటిని నిర్ణీత కాలవ్యవధి తరువాత తిరిగి చెల్లించవలెను. ఇట్లాంటి చెల్లింపులు ద్రవ్యంలో వ్యవహరించటం సులభంగాను, అనువుగాను ఉంటుంది. ఆధునిక ఆర్థిక వ్యవస్థలో వ్యాపార కార్యకలాపాల నిర్వహణకు ద్రవ్యం ఒక మంచి సాధనంగా ఉపయోగపడుతుంది.

**5) విలువల బదలాయింపులు :** వస్తువుల విలువను ఒక ప్రాంతమునుండి మరో ప్రాంతానికి ఒక వ్యక్తినుండి మరొక వ్యక్తికి బదలాయించటానికి ద్రవ్యం ఒక సాధనంగా ఉపయోగపడుతుంది. **ఉదా॥** ఒక గ్రామంలో ఉండే పొలాన్ని అమ్మి మరో గ్రామంలో పొలమో, ఇల్లో కొనుక్కోవచ్చు.

**ప్రశ్న 3) వాణిజ్య బాంకుల విధులను, సేవలను వ్రాయుము.**

**జవాబు :** బాంకింగ్ వ్యాపారము చేసే సంస్థను స్థూలంగా బాంకు అంటారు. ఆ బాంకింగ్ వ్యాపారము అంటే ప్రజలనుండి డిపాజిట్ల రూపంలో డబ్బును తీసుకోవడం, ఆ డబ్బును డిపాజిట్‌దారులు అడిగినపుడు చెల్లించడం.

**వాణిజ్య బాంకుల యొక్క విధులు :**

వాణిజ్య బాంకుల విధులను రెండు విధాలుగా వర్గీకరింపవచ్చును.

**I) ప్రాథమిక విధులు** **II) అనుషంగిక సేవలు**

**I) ప్రాథమిక విధులు :**

**1. డిపాజిట్లు స్వీకరించుట :** ప్రజలు తమ యొక్క పొదుపును భద్రంగా దాచుకోవాలనే ఉద్దేశ్యంతో వడ్డీని సంపాదించాలనే ఉద్దేశ్యంతో బాంకులలో డిపాజిట్ చేస్తారు. బాంకులు ప్రజలనుండి సేకరించే డిపాజిట్లను 4 విధాలుగా వర్గీకరించవచ్చును.

**A) ఫిక్స్‌డ్ డిపాజిట్లు :** ఈ డిపాజిట్లను నిర్ణీతకాలం మేరకు బాంకులో ఉంచటం జరుగుతుంది. ఈ డిపాజిట్లమీద బాంకు హెచ్చు వడ్డీరేటును చెల్లిస్తుంది. నిర్ణీత కాలం పూర్తి అయిన తరువాతనే ఈ డిపాజిట్లను బాంకు నుంచి తిరిగి తీసుకోవడం జరుగుతుంది.

**B) సేవింగ్స్ డిపాజిట్లు :** సహజంగా ఉద్యోగులు, చిన్న చిన్న వ్యాపారస్థులు ఈ డిపాజిట్లు చేస్తారు. వీటిమీద కొంతవరకూ వడ్డీరేటు లభిస్తుంది. ప్రజలలో పొదుపు అలవాటును పెంపొందించడమే ఈ డిపాజిట్ల ముఖ్య ఉద్దేశ్యము.

**C) కరెంటు డిపాజిట్లు :** ఈ డిపాజిట్లను సహజంగా వ్యాపారస్థులు చేస్తారు. దీనిమీద వడ్డీరేటు వుండదు. డిపాజిట్‌దారులు కోరిన వెంటనే డబ్బు చెల్లించబడుతుంది.

**D) రికరింగ్ డిపాజిట్లు :** ఈ డిపాజిట్లను ప్రతి నెల ఒక నిర్ణీత కాలంవరకు బాంకులో డిపాజిట్ చేయడం జరుగుతుంది. నిర్ణీతకాలం పూర్తి అయిన తరువాతనే డబ్బును తీసుకోవడం జరుగుతుంది. ఈ డిపాజిట్లమీద కొంత వడ్డీరేటు చెల్లించబడుతుంది. ఈ డిపాజిట్లను సహజంగా ఉద్యోగులు చిన్న చిన్న వ్యాపారస్థులు చేయడం జరుగుతుంది.

**2) ఋణాల మంజూరు :** బ్యాంకులయొక్క రెండవ విధి ఋణాలను, అడ్వాన్సులను మంజూరు చేయడం. డబ్బు అవసరమైన వ్యక్తులకు బ్యాంకులు అప్పులద్వారా, ఓవర్‌డ్రాఫ్టులద్వారా, క్యాష్‌క్రెడిట్లద్వారా బిల్లులను డిస్కౌంటు చేయడంద్వారా డబ్బును అందజేస్తాయి. సెక్యూరిటీమీద, బంగారం, వెండి, భూములు మొదలగు చర, స్థిర ఆస్తులను తాకట్టుగా పెట్టుకొని బ్యాంకులు అప్పు ఇస్తాయి. అదేవిధంగా బ్యాంకులు అప్పు ఇచ్చేవారికి, పుచ్చుకొనేవారికి మధ్యవర్తులుగా బ్యాంకులు వ్యవహరిస్తాయి. దేశంలో నిద్రాణంగా పడివున్న వనరులను సమీకరించి వాణిజ్య, వర్తక, వ్యాపార కార్యకలాపాలకు అప్పులుగా ఇచ్చి తద్వారా దేశ ఆర్థికాభివృద్ధికి బ్యాంకులు తోడ్పడతాయి.

**3) చెక్కుల పద్ధతి :** బ్యాంకులు చెక్కుల పద్ధతిని అభివృద్ధిపరచడంద్వారా వ్యాపార వ్యవహారాలకు ఎంతో సౌకర్యాన్ని చేకూర్చినాయి. చెక్కు అనేది అందరి అంగీకారం పొందిన పరపతి సాధనము. చెక్కులద్వారా వ్యాపార వ్యవహారాలను అతిసులభంగా నిర్వహించవచ్చును.

**4) నిధుల బదిలీ :** దేశంలో ఒక ప్రదేశంనుండి మరియొక ప్రదేశానికి లేదా ఒక దేశం నుండి మరియొక దేశానికి డబ్బును బదిలీ చేసుకొనే సౌకర్యాలను బ్యాంకులు ప్రవేశపెట్టినాయి. ఈ బదిలీని చెక్కులద్వారా లేదా డ్రాఫ్టులద్వారా చౌకగా చేసుకోవచ్చును.

**II) అనుషంగిక సేవలు :** బ్యాంకులు ప్రాథమిక విధులతోపాటు కొన్ని అనుషంగిక సేవలను కూడా నిర్వహిస్తాయి. **అనుషంగిక సేవలను రెండు రకాలుగా విభజించవచ్చును.**

**1) ఏజన్సీ సేవలు :** ఈ సేవల నిర్వహణలో బ్యాంకు ఏజంట్‌గా వ్యవహరిస్తుంది. కాబట్టి వీటిని "ఏజన్సీ సేవలు" అంటాము.

a) బ్యాంకులు ఖాతాదారులకు ఏజంట్‌లుగా, కరస్పాండెంట్లుగా, ప్రతినిధులుగా వ్యవహరిస్తాయి.

b) ఖాతాదారుల తరపున ఇన్సూరెన్స్ ప్రీమియంలు, క్లబ్‌ల చందాలు మొదలగువాటిని చెల్లిస్తాయి.

c) ఖాతాదారుల తరపున బ్యాంకులు ఒక ప్రదేశం నుండి మరియొక ప్రదేశానికి డబ్బును పంపుతాయి.

d) ఖాతాదారుల తరపున బ్యాంకులు సెక్యూరిటీలను కొంటాయి, అమ్ముతాయి.

e) ఖాతాదారులు తమ షేర్లను, బాండ్లను భద్రంగా దాచుకోవడానికి బ్యాంకులు సౌకర్యాలు కల్పిస్తాయి.

**2) సాధారణ ప్రజా ఉపయోగ సేవలు :** ఖాతాదారుని సౌకర్యం కోసం బ్యాంకులు ఎన్నో ప్రజా ఉపయోగ సేవలు చేస్తాయి. **వాటిలో ముఖ్యమైనవి.**

a) నగదు, ఇతర విలువైన వస్తువులు దాచుకోవడానికి ప్రత్యేక సౌకర్యాలను బ్యాంకులు కల్పిస్తాయి. దీనికోసం బ్యాంకులు లాకర్సును ఏర్పాటుచేసినాయి.

b) ఇతర ప్రాంతాలలో ఉన్న వ్యాపారస్తులకు సంబంధించిన సమాచారాన్ని సేకరించి తమ ఖాతాదారులకు అందచేస్తాయి.

c) విదేశీ వ్యాపారంలో ఖాతాదారులకు బాంకులు తోడ్పడతాయి. ఖాతాదారులకు కావలసిన విదేశీ మారక ద్రవ్యాన్ని సంపాదించి పెడతాయి.

d) ఇతర వ్యాపారస్తులకు, పారిశ్రామికవేత్తలకు సంబంధించిన ఆర్థికస్థోమత, వ్యాపార అనుభవము, నిజాయితీ మొదలగువాటికి సంబంధించిన సమాచారాన్ని సేకరించి బాంకులు తమ ఖాతాదారులకు అందచేస్తాయి.

**ప్రశ్న 4) బాంకులు పరపతిని ఎట్లా సృష్టిస్తాయో వివరించండి ? దీనిపైగల పరిమితులను పేర్కొనుము.**

జవాబు : బాంకులు ప్రజలనుండి డిపాజిట్ల రూపంలో ద్రవ్యాన్ని సేకరించి ఉత్పాదక కార్యకలాపాల నిమిత్తం వ్యాపారస్తులకు, ఉత్పత్తిదారులకు ఋణాలు ఇస్తాయి. బాంకులు ద్రవ్యంతో వ్యాపారం చేస్తాయి. ద్రవ్యంతో వ్యాపారం చేయడమేకాక, బాంకులు ద్రవ్యాన్ని కూడా సృష్టిస్తాయి. **దేశంలో చలామణిలోవున్న ద్రవ్యాన్ని 2 రకాలుగా పేర్కొనవచ్చును.**

**1) కేంద్ర బాంకు జారీచేసిన కరెన్సీ నోట్లు**

**2) బాంకులు సృష్టించే పరపతి**

బాంకులు సృష్టించే పరపతిని "బాంకు ద్రవ్యం" అంటారు. చలామణిలో ఉన్న ద్రవ్యరాశిలో బాంకు ద్రవ్యం ప్రధానపాత్ర వహిస్తుంది. బాంకులు ఎక్కువగా ద్రవ్యాన్ని సృష్టిస్తే ద్రవ్యోల్బణం ఏర్పడి ధరలు పెరుగుతాయి. కనుక దేశ ఆర్థికాభివృద్ధిని నిర్ణయించటంలో బాంకుల పాత్ర ఎక్కువగా వుంటుందని చెప్పవచ్చు.

**బాంకు డిపాజిట్లు 2 రకాలు అవి :**

**1) ప్రాథమిక డిపాజిట్లు 2) ఉత్పన్న డిపాజిట్లు**

**1) ప్రాథమిక డిపాజిట్లు :** ఖాతాదారులు బాంకులో నగదును జమ కట్టడం వలన ఏర్పడిన డిపాజిట్లను "ప్రాథమిక డిపాజిట్లు" అంటారు.

ఉదా : X అను వ్యక్తి A బాంకులో 1,000 రూ. నగదు **డిపాజిట్** చేశాడనుకుందాము. బాంకు X-ఖాతాకు ఈ 1,000 రూ॥లు జమ చేస్తుంది. దీనిని "ప్రాథమిక డిపాజిట్" అంటాము.

**2) ఉత్పన్న డిపాజిట్లు :** బాంకులు అప్పులిచ్చినప్పుడు, ఖాతాదార్ల తరపున సొమ్ము వసూలు చేసినపుడు 'ఉత్పన్న డిపాజిట్లు' ఏర్పడతాయి. బాంకు అప్పు ఇచ్చి ఆ సొమ్మును ఖాతాదారుని పేరిట జమకట్టుట వలన ఏర్పడే డిపాజిట్‌ను "ఉత్పన్న డిపాజిట్" అంటారు.

**ఉదా :** బాంకు 'X' అనే వ్యక్తికి 1,000 రూ॥లు ఋణాన్ని మంజూరుచేసి, అతని ఖాతాలో జమ చేసిందనుకుందాము. ఈ విధంగా జమ చేసిన సొమ్మును ఆ వ్యక్తి తన

అవసరాల కోసం అవసరమైనపుడు ఉపయోగించుకోవచ్చును. ఈ విధంగా ఏర్పడిన డిపాజిట్‌ను "ఉత్పన్న డిపాజిట్" అంటారు. బాంకులు ఉత్పన్న డిపాజిట్లను ఇంకో విధంగా కూడా సృష్టిస్తాయి. ఒక వ్యక్తి ఆస్తిని అతని తరపున బాంకు అమ్మి, ఆ సొమ్మును అతని ఖాతాలో జమ చేసినట్లయితే ఆ విధంగా ఏర్పడే డిపాజిట్‌ను కూడా "ఉత్పన్న డిపాజిట్" అంటారు.

పరపతి సృష్టి : ఒక బాంకులో డిపాజిట్ ఏర్పడగానే అది అంతటితో ఆగిపోదు. ఆ డిపాజిట్ ఎన్నో డిపాజిట్‌లను సృష్టిస్తుంది. ఆ డిపాజిట్ ఆధారముగా బాంకింగ్ వ్యవస్థలో ఎంతో పరపతి విస్తరణ జరుగుతుంది. బాంకులు పరపతి విస్తరణను ఎట్లా చేయగలుగుతాయో ఒక ఉదాహరణ ద్వారా తెలుసుకొనవచ్చును. ఈ ఉదాహరణలో బాంకులు తమ డిపాజిట్లలో 10% నగదు నిల్వగా ఉంచుకొని, మిగతా డబ్బును ఋణంగా ఇస్తున్నాయనుకుందాము.

| బాంకు | డిపాజిట్ | నగదునిల్వల శాతము | పరపతి |
|---|---|---|---|
| A | 5,000 | 500 | 4,500 |
| B | 4,500 | 450 | 4,050 |
| C | 4,050 | 405 | 3,645 |
| D | 3,645 | 364.50 | 3,280.50 |

A బాంకులో మొదటిసారిగా 5,000 రూ. డిపాజిట్ వచ్చిందనుకుందాము. అందులో 10% నగదు నిల్వగా ఉంచుకుని 4,500 X అనే వ్యక్తికి ఋణంగా ఇచ్చింది అనుకుందాము. ఆ వ్యక్తి ఆ సొమ్ము(ను) 'B' బాంకులో డిపాజిట్ చేశాడనుకుందాము. 'B' బాంకు అందులో 10% నగదు నిల్వగా ఉంచుకొని మిగిలిన 4,050 రూ. మరొక వ్యక్తికి ఋణంగా ఇచ్చిందనుకుందాము. అలాగే ఆ సొమ్మును ఆ వ్యక్తి 'C' బాంకులో డిపాజిట్ చేశాడనుకుందాము. ఈ బాంకులో దానిలో 10% నగదు నిల్వగా ఉంచుకొని మరొక వ్యక్తికి 3,645 రూ ఋణంగా ఇచ్చిందనుకుందాము. C బాంకు ఇచ్చిన ఋణము D బాంకులో డిపాజిట్ అయిందనుకుందాము. అందులో 10% నగదు నిల్వగా ఉంచుకొని ఆ బాంకు 3,280.50 ఋణంగా ఇచ్చిందనుకుందాము. ఈ విధముగా A బాంకులో ఏర్పడిన 5,000 రూ. ప్రాథమిక డిపాజిట్ 17,195 రూ. పరపతి విస్తరణను సృష్టిస్తుంది. ఈ విధంగా డిపాజిట్లు వేస్తూపోతే బాంకు లన్నింటి వద్ద ఏర్పడిన డిపాజిట్లు దాదాపు 50,000 అవుతాయి. అంటే బాంకులో మొదటిసారిగా ఏర్పడిన 5,000 డిపాజిట్ బ్యాంకింగ్ వ్యవస్థలో దాదాపు 50,000 వరకు పరపతి విస్తరణకు దారితీస్తుంది. కనుక బాంకులు సృష్టించిన పరపతి ప్రాథమిక డిపాజిట్‌కన్న కొన్ని రెట్లు అధికంగా ఉంటుంది.

బాంకు పరపతి కూడా ద్రవ్యములాగ వస్తువుల యొక్క క్రయవిక్రయాలకు తోడ్పడుతుంది. కనుక ద్రవ్యము ఏ పనిచేస్తుందో, బాంకు చెక్కులు కూడా అదే పని చేస్తాయి. కాబట్టి బాంకు డిపాజిట్లు ద్రవ్యముతో సమానము, అందుచేతనే "సేయర్" అనే ఆర్థికవేత్త ప్రకారంగా "బాంకులు ద్రవ్య వ్యాపారము చేసేవి మాత్రమే కావు, అవి ద్రవ్యాన్ని సృష్టించే ఫాక్టరీలు".

**పరిమితులు** : బాంకుల పరపతి విస్తరణకు కొన్ని పరిమితులు కలవు. అవి :

1. **నగదు నిల్వ శాతము** :- బాంకులు సృష్టించే పరపతి అవి తమ దగ్గర ఉంచుకునే నగదు నిల్వ శాతము మీద ఆధారపడి ఉంటుంది. నగదు నిల్వ శాతము తక్కువగా ఉంటే బాంకుల పరపతి విస్తరణ ఎక్కువగా ఉంటుంది. కేంద్ర బాంకు ఈ నగదు నిల్వ శాతాన్ని నియంత్రణ చేస్తుంది.

2. **ద్రవ్యరాశి** :- బాంకుల పరపతి విస్తరణ దేశములో చెలామణిలో ఉన్న ద్రవ్యరాశి మీద ఆధారపడి ఉంటుంది. ద్రవ్యరాశి ఎక్కువగా ఉంటే, బాంకు డిపాజిట్లు పెరిగి పరపతి విస్తరణ పెరుగుతుంది. ద్రవ్యరాశి తక్కువగా ఉన్నట్లయితే, బాంకు డిపాజిట్‌లు తగ్గి పరపతి విస్తరణ తగ్గుతుంది.

3. **ఆమోదయోగ్యమైన సెక్యూరిటీలు** : బాంకులు ఋణాలు మంజూరు చేసేటప్పుడు ఋణగ్రస్థుల నుంచి కొన్ని సెక్యూరిటీలను హామీగా పెట్టుకుంటాయి. బాంకులకు ఆమోదయోగ్యమైన సెక్యూరిటీల లభ్యత ఎక్కువగా ఉంటే బాంకుల పరపతి విస్తరణ పెరుగుతుంది. బాంకులకు ఆమోదయోగ్యమైన సెక్యూరిటీలు లభ్యము కాకపోతే బాంకులు ఇచ్చే పరపతి తక్కువగా ఉంటుంది.

4. **ఆర్థిక పరిస్థితులు** : దేశంలో ఆర్థిక పరిస్థితులు అనుకూలంగా ఉన్నట్లయితే ఋణాలను పెంచటానికి వీలు అవుతుంది. ఆర్థిక మాంద్యపు రోజులలో ఋణాలు తీసుకోటానికి వ్యాపారస్థులు ముందుకురారు. కనుక బాంకులు పరపతిని పెంచలేవు. దేశంలో వ్యాపారము చురుకుగా సాగుతున్నప్పుడు బాంకుల నుండి ఋణాలను హెచ్చుగా తీసుకోవటము జరుగుతుంది. కనుక పరపతి విస్తరణ పెరుగుతుంది.

5. **బాంకింగ్ అలవాటు** : బాంకుల పరపతి విస్తరణ బాంకింగ్ అలవాటుమీద కూడా ఆధారపడి ఉంటుంది. ప్రజలలో బాంకింగ్ అలవాటు ఎక్కువగా ఉన్నట్లయితే బాంకులలో డిపాజిట్లు పెరుగుతాయి. తత్ఫలితంగా బాంకుల పరపతి విస్తరణ పెరుగుతుంది. ప్రజలలో బాంకింగ్ అలవాటు తక్కువగా ఉన్నట్లయితే, వారు తమ పొదుపులను బాంకులలో డిపాజిట్ చేయరు. అందువల్ల బాంకుల పరపతి విస్తరణ బాంకింగ్ అలవాటుమీద కూడా ఆధారపడి ఉంటుంది.

**ప్రశ్న 5) కేంద్ర బ్యాంకు విధులను పేర్కొనుము.**

**జవాబు :** ప్రపంచంలో దాదాపు అన్ని దేశాలలోను కేంద్ర బ్యాంకులు ఉన్నాయి. మనదేశంలోని కేంద్ర బ్యాంకును "రిజర్వ్ బ్యాంకు" అంటాము. ద్రవ్య స్థిరత్వాన్ని సాధించుటకు బ్యాంకుల కార్యకలాపాలను నియంత్రణ చేసి, బ్యాంకింగ్ వ్యవస్థను పటిష్టము చేయుటకు కేంద్ర బ్యాంకులు ముఖ్యంగా స్థాపించబడ్డాయి. వాణిజ్య బ్యాంకులవలె కేంద్ర బ్యాంక్ లాభాపేక్షతో పనిచేయదు. లాభార్జన కేంద్ర బ్యాంకు ధ్యేయము కాదు. దేశానికి ద్రవ్య ఆర్థిక స్థిరత్వాన్ని కలుగచేసి దేశసౌభాగ్యాన్ని పెంపొందించుటయే కేంద్ర బ్యాంకుల లక్ష్యము.

**కేంద్ర బ్యాంకులు నిర్వహించే ముఖ్య విధులు :**

**1. కరెన్సీ నోట్ల జారీ:** నోట్లను జారీ చేయటంలో కేంద్ర బ్యాంకుకు గుత్తాధిపత్యము ఉన్నది. కరెన్సీ పరపతిని క్రమబద్ధం చేయటం ద్వారా దేశంలో ద్రవ్య స్థిరత్వాన్ని కేంద్ర బ్యాంక్ కాపాడుతుంది. కేంద్ర బ్యాంకు నోట్లను జారీ చేయటంవల్ల కొన్ని ప్రయోజనాలు ఉన్నాయి.

A) నోట్ల జారీలో ఏకరూపకత ఏర్పడుతుంది.

B) కరెన్సీ పద్ధతికి వ్యాకోచత లభిస్తుంది.

C) నోట్లను జారీచేసే అధికారము ఉన్నందువలన కేంద్ర బ్యాంకు పరపతిని కంట్రోల్ చేయగలదు.

D) దేశంలో అమలులో ఉన్న కరెన్సీ సూత్రాలను అనుసరించి కేంద్ర బ్యాంకు నోట్లను జారీ చేస్తుంది. మనదేశంలోకి రిజర్వ్ బ్యాంకు కనిష్ట రిజర్వ్ పద్ధతి నోట్లను జారీ చేస్తుంది.

**2. పరపతి నియంత్రణ :** బ్యాంకులు ఇచ్చే పరపతిని నియంత్రణ చేయటం కేంద్ర బ్యాంక్ విధులలో ముఖ్యమైనది. బ్యాంకులు ఇచ్చే పరపతి అధికముగా ఉంటే ద్రవ్యోల్బణము వస్తుంది. తక్కువగా ఉంటే ఆర్థిక మాంద్యము ఏర్పడుతుంది. ద్రవ్యోల్బణము ఉన్నప్పుడు బ్యాంకు పరపతిని తగ్గించవలెను. ఆర్థిక మాంద్యము ఉన్నప్పుడు పరపతిని పెంచవలెను. పరపతి నియంత్రణకు కేంద్ర బ్యాంకు అనేక సాధనాలను ఉపయోగిస్తుంది. వాటిలో బ్యాంకు రేటు, ఓపెన్ మార్కెట్ వ్యవహారాలు, నగదు నిష్పత్తుల మార్పులు, గుణాత్మక పరపతి నియంత్రణ పద్ధతులు ముఖ్యమైనవి. కేంద్ర బ్యాంకు నిర్వహించే విధులలో ఇది అత్యంత ముఖ్యమైనది. బ్యాంకులు ఇచ్చే పరపతి పరిమాణాన్ని అదుపులో పెట్టి, ద్రవ్యస్థిరత్వాన్ని తద్వారా క్రమబద్ధమైన ఆర్థికాభివృద్ధికి దోహదము చేస్తుంది.

**3. బాంకులకు బాంకుగా పనిచేస్తుంది :** దేశంలో ఉన్న వాణిజ్య బాంకులన్నింటికి కేంద్ర బాంకు నాయకత్వము వహిస్తుంది. వాణిజ్య బాంకుల కార్యకలాపాలను క్రమబద్ధం చేస్తుంది. కేంద్ర బాంకు బాంకులకు బాంకుగా ఈ క్రింది విధులు నిర్వహిస్తుంది.

**A) వాణిజ్య బాంకుల నగదు రిజర్వుల కస్టోడియన్ :** వాణిజ్య బాంకులు తమ డిపాజిట్‌లలో కొంత భాగాన్ని కేంద్ర బాంకు వద్ద ఉంచుతాయి. ఇట్లా ఉంచిన డిపాజిట్‌లను "నగదు రిజర్వులు" అంటారు. నగదు రిజర్వులు కేంద్రీకరణవల్ల ఈ క్రింది ప్రయోజనాలు కలవు :

1) బాంకింగ్ వ్యవస్థను పటిష్టం చేస్తాయి.
2) ప్రజలకు బాంకులలో విశ్వాసాన్ని కలుగజేస్తాయి.
3) నగదు నిల్వలు అన్నీ కేంద్ర బాంకు వద్ద ఉన్నందువలన వాటిని గరిష్ట ప్రయోజనానికి వాడవచ్చును. అత్యవసర పరిస్థితులలో వాటికి గరిష్ట ప్రయోజనము వచ్చేటట్లుగా ఉపయోగించవచ్చు. అవసరమైన సమయాలలో అవసరమైన స్థలాలకు తరలించవచ్చు.
4) కేంద్ర బాంకు వద్ద నగదు నిల్వలు ఉంచటం వలన, వాణిజ్య బాంకులు కేంద్ర బాంకు నుండి ఋణ సహాయం పొందే అవకాశం ఉంటుంది.
5) కేంద్ర బాంకు దగ్గర నగదు నిల్వలు ఉంచటం వలన బాంకు పరపతి నియంత్రణ సాధ్యమవుతుంది.

**4. బాంకింగ్ క్లియరెన్సుగా పనిచేస్తుంది :** వాణిజ్య బాంకులు ఒక బాంకుకు మరియొకటి బాకీ పడుతుంటాయి. వాణిజ్య బాంకులన్నింటికీ కేంద్ర బాంకు దగ్గర అకౌంట్లు ఉన్నాయి. కాబట్టి కేంద్ర బాంకు ఈ బాకీలను పరిష్కరిస్తుంది. బాకీ పడిన బాంకు ఖాతాకు ఖర్చు వ్రాసి ఇవ్వవలసిన బాంకు ఖాతాలో జమ వ్రాస్తుంది. ఈ విధంగా క్లియరింగ్ సౌకర్యాలు కేంద్ర బాంకు కల్పిస్తుంది.

**5. అంతిమ ఋణదాత :** కేంద్ర బాంకు అంతిమ ఋణదాతగా వ్యవహరిస్తుంది. వాణిజ్య బాంకులు తమ దగ్గర ఉన్న హుండీలను తిరిగి కేంద్ర బాంకు దగ్గర రీడిస్కౌంట్ చేసుకొని సొమ్ము తీసుకోవచ్చు. తమ వద్ద ఉన్న సెక్యూరిటీలను హామీగా ఉంచి ఓవర్‌డ్రాఫ్టులు తీసుకోవచ్చు. వాణిజ్య బాంకులకు సహాయం చేసేందుకు కేంద్ర బాంకు ఎప్పుడూ సిద్ధంగానే ఉంటుంది. అత్యవసర పరిస్థితులలో బాంకులకు సహాయం చేయటం కేంద్ర బాంక్ విధులలో ఒకటి. ఈ విధంగా వాణిజ్య బాంకులకు కేంద్ర బాంకు అంతిమ ఋణదాతగా వ్యవహరిస్తుంది.

**6. కేంద్ర బాంకు ప్రభుత్వ బాంకుగా వ్యవహరించుట :** కేంద్ర బాంకు ప్రభుత్వానికి బాంకులాగా, ఏజెంట్‌గా, ఆర్థిక సలహాదారుడిగా వ్యవహరిస్తుంది. ప్రభుత్వానికి బాంకులాగా కేంద్ర బాంకు ఈ క్రింది విధులను నిర్వహిస్తుంది.

a) ప్రభుత్వ నగదు నిల్వలు కేంద్ర బాంకు దగ్గర ఉంటాయి. ప్రభుత్వ ఆదాయ వ్యయాలకు సంబంధించిన చెల్లింపులు కేంద్ర బాంకు ద్వారా జరుగుతాయి.

**ప్రశ్న 5) కేంద్ర బ్యాంకు విధులను పేర్కొనుము.**

**జవాబు :** ప్రపంచంలో దాదాపు అన్ని దేశాలలోను కేంద్ర బ్యాంకులు ఉన్నాయి. మనదేశంలోని కేంద్ర బ్యాంకును "రిజర్వ్ బ్యాంకు" అంటాము. ద్రవ్య స్థిరత్వాన్ని సాధించుటకు బ్యాంకుల కార్యకలాపాలను నియంత్రణ చేసి, బ్యాంకింగ్ వ్యవస్థను పటిష్టము చేయుటకు కేంద్ర బ్యాంకులు ముఖ్యంగా స్థాపించబడ్డాయి. వాణిజ్య బ్యాంకులవలె కేంద్ర బ్యాంక్ లాభాపేక్షతో పనిచేయదు. లాభార్జన కేంద్ర బ్యాంకు ధ్యేయము కాదు. దేశానికి ద్రవ్య ఆర్థిక స్థిరత్వాన్ని కలుగచేసి దేశసౌభాగ్యాన్ని పెంపొందించుటయే కేంద్ర బ్యాంకుల లక్ష్యము.

**కేంద్ర బ్యాంకులు నిర్వహించే ముఖ్య విధులు :**

**1. కరెన్సీ నోట్ల జారీ:** నోట్లను జారీ చేయటంలో కేంద్ర బ్యాంకుకు గుత్తాధిపత్యము ఉన్నది. కరెన్సీ పరపతిని క్రమబద్ధం చేయటం ద్వారా దేశంలో ద్రవ్య స్థిరత్వాన్ని కేంద్ర బ్యాంక్ కాపాడుతుంది. కేంద్ర బ్యాంకు నోట్లను జారీ చేయటంవల్ల కొన్ని ప్రయోజనాలు ఉన్నాయి.

A) నోట్ల జారీలో ఏకరూపకత ఏర్పడుతుంది.

B) కరెన్సీ పద్ధతికి వ్యాకోచత లభిస్తుంది.

C) నోట్లను జారీచేసే అధికారము ఉన్నందువలన కేంద్ర బ్యాంకు పరపతిని కంట్రోల్ చేయగలదు.

D) దేశంలో అమలులో ఉన్న కరెన్సీ సూత్రాలను అనుసరించి కేంద్ర బ్యాంకు నోట్లను జారీ చేస్తుంది. మనదేశంలోకి రిజర్వ్ బ్యాంకు కనిష్ట రిజర్వ్ పద్ధతి నోట్లను జారీ చేస్తుంది.

**2. పరపతి నియంత్రణ :** బ్యాంకులు ఇచ్చే పరపతిని నియంత్రణ చేయటం కేంద్ర బ్యాంక్ విధులలో ముఖ్యమైనది. బ్యాంకులు ఇచ్చే పరపతి అధికముగా ఉంటే ద్రవ్యోల్బణము వస్తుంది. తక్కువగా ఉంటే ఆర్థిక మాంద్యము ఏర్పడుతుంది. ద్రవ్యోల్బణము ఉన్నప్పుడు బ్యాంకు పరపతిని తగ్గించవలెను. ఆర్థిక మాంద్యము ఉన్నప్పుడు పరపతిని పెంచవలెను. పరపతి నియంత్రణకు కేంద్ర బ్యాంకు అనేక సాధనాలను ఉపయోగిస్తుంది. వాటిలో బ్యాంకు రేటు, ఓపెన్ మార్కెట్ వ్యవహారాలు, నగదు నిష్పత్తుల మార్పులు, గుణాత్మక పరపతి నియంత్రణ పద్ధతులు ముఖ్యమైనవి. కేంద్ర బ్యాంకు నిర్వహించే విధులలో ఇది అత్యంత ముఖ్యమైనది. బ్యాంకులు ఇచ్చే పరపతి పరిమాణాన్ని అదుపులో పెట్టి, ద్రవ్యస్థిరత్వాన్ని తద్వారా క్రమబద్ధమైన ఆర్థికాభివృద్ధికి దోహదము చేస్తుంది.

**3. బ్యాంకులకు బ్యాంకుగా పనిచేస్తుంది :** దేశంలో ఉన్న వాణిజ్య బ్యాంకులన్నింటికి కేంద్ర బ్యాంకు నాయకత్వము వహిస్తుంది. వాణిజ్య బ్యాంకుల కార్యకలాపాలను క్రమబద్ధం చేస్తుంది. కేంద్ర బ్యాంకు బ్యాంకులకు బ్యాంకుగా ఈ క్రింది విధులు నిర్వహిస్తుంది.

**A) వాణిజ్య బ్యాంకుల నగదు రిజర్వుల కస్టోడియన్ :** వాణిజ్య బ్యాంకులు తమ డిపాజిట్‌లలో కొంత భాగాన్ని కేంద్ర బ్యాంకు వద్ద ఉంచుతాయి. ఇట్లా ఉంచిన డిపాజిట్‌లను "నగదు రిజర్వులు" అంటారు. నగదు రిజర్వులు కేంద్రీకరణవల్ల ఈ క్రింది ప్రయోజనాలు కలవు :

1) బ్యాంకింగ్ వ్యవస్థను పటిష్టం చేస్తాయి.
2) ప్రజలకు బ్యాంకులలో విశ్వాసాన్ని కలుగజేస్తాయి.
3) నగదు నిల్వలు అన్నీ కేంద్ర బ్యాంకు వద్ద ఉన్నందువలన వాటిని గరిష్ట ప్రయోజనానికి వాడవచ్చును. అత్యవసర పరిస్థితులలో వాటికి గరిష్ట ప్రయోజనము వచ్చేటట్లుగా ఉపయోగించవచ్చు. అవసరమైన సమయాలలో అవసరమైన స్థలాలకు తరలించవచ్చు.
4) కేంద్ర బ్యాంకు వద్ద నగదు నిల్వలు ఉంచటం వలన, వాణిజ్య బ్యాంకులు కేంద్ర బ్యాంకు నుండి ఋణ సహాయం పొందే అవకాశం ఉంటుంది.
5) కేంద్ర బ్యాంకు దగ్గర నగదు నిల్వలు ఉంచటం వలన బ్యాంకు పరపతి నియంత్రణ సాధ్యమవుతుంది.

**4. బ్యాంకింగ్ క్లియరెన్సుగా పనిచేస్తుంది :** వాణిజ్య బ్యాంకులు ఒక బ్యాంకుకు మరియొకటి బాకీ పడుతుంటాయి. వాణిజ్య బ్యాంకులన్నింటికీ కేంద్ర బ్యాంకు దగ్గర అకౌంట్లు ఉన్నాయి. కాబట్టి కేంద్ర బ్యాంకు ఈ బాకీలను పరిష్కరిస్తుంది. బాకీ పడిన బ్యాంకు ఖాతాకు ఖర్చు వ్రాసి ఇవ్వవలసిన బ్యాంకు ఖాతాలో జమ వ్రాస్తుంది. ఈ విధంగా క్లియరింగ్ సౌకర్యాలు కేంద్ర బ్యాంకు కల్పిస్తుంది.

**5. అంతిమ ఋణదాత :** కేంద్ర బ్యాంకు అంతిమ ఋణదాతగా వ్యవహరిస్తుంది. వాణిజ్య బ్యాంకులు తమ దగ్గర ఉన్న హుండీలన్ను తిరిగి కేంద్ర బ్యాంకు దగ్గర రీడిస్కౌంట్ చేసుకొని సొమ్ము తీసుకోవచ్చు. తమ వద్ద ఉన్న సెక్యూరిటీలను హామీగా ఉంచి ఓవర్‌డ్రాఫ్టులు తీసుకోవచ్చు. వాణిజ్య బ్యాంకులకు సహాయం చేసేందుకు కేంద్ర బ్యాంకు ఎప్పుడూ సిద్ధంగానే ఉంటుంది. అత్యవసర పరిస్థితులలో బ్యాంకులకు సహాయం చేయటం కేంద్ర బ్యాంక్ విధులలో ఒకటి. ఈ విధంగా వాణిజ్య బ్యాంకులకు కేంద్ర బ్యాంకు అంతిమ ఋణదాతగా వ్యవహరిస్తుంది.

**6. కేంద్ర బ్యాంకు ప్రభుత్వ బ్యాంకుగా వ్యవహరించుట :** కేంద్ర బ్యాంకు ప్రభుత్వానికి బ్యాంకులాగా, ఏజెంట్‌గా, అర్థిక సలహాదారుడిగా వ్యవహరిస్తుంది. ప్రభుత్వానికి బ్యాంకులాగా కేంద్ర బ్యాంకు ఈ క్రింది విధులను నిర్వహిస్తుంది.

a) ప్రభుత్వ నగదు నిల్వలు కేంద్ర బ్యాంకు దగ్గర ఉంటాయి. ప్రభుత్వ ఆదాయ వ్యయాలకు సంబంధించిన చెల్లింపులు కేంద్ర బ్యాంకు ద్వారా జరుగుతాయి.

b) ప్రభుత్వ ఋణఖాతాను కేంద్ర బాంకు నిర్వహిస్తుంది. ప్రభుత్వ ఋణాలకు చందాలు వసూలు చేయటం, ఋణం మీద వడ్డీ, అసలు చెల్లించటం ఇవన్నీ కేంద్ర బాంకు చేస్తుంది.

c) అవసరమైన సమయాలలో కేంద్ర బాంకు ప్రభుత్వానికి తాత్కాలిక ఋణ సహాయం చేస్తుంది.

d) ప్రభుత్వానికి కావలసిన విదేశీమారక ద్రవ్యంను సప్లయి చేస్తుంది.

కేంద్ర బాంకుకు ప్రభుత్వానికి సన్నిహితమైన సహకార సంబంధాలు ఉండవలెను. ద్రవ్య విధానాలను రూపొందించేటప్పుడు ప్రభుత్వము కేంద్ర బాంకు సలహాను తీసుకొంటుంది. ద్రవ్య విధానాలను అమలులో పెట్టేటప్పుడు కేంద్ర బాంకుకు ప్రభుత్వము పూర్తి సహకారాన్ని అందించవలెను. ప్రభుత్వము రూపొందించిన ద్రవ్య విధానాన్ని కేంద్ర బాంకు అమలు పరచవలసి ఉంటుంది. అత్యవసర పరిస్థితులలో కేంద్ర బాంకు ప్రభుత్వానికి అవసరమైన ద్రవ్యాన్ని సప్లయ్ చేస్తుంది. దేశం యొక్క ఆర్థిక స్థితిని, ద్రవ్యం పరిస్థితిని కేంద్ర బాంకు ఎప్పటికప్పుడు సమీక్ష చేస్తూ తగిన చర్యల నిమిత్తం కేంద్ర బాంకు ప్రభుత్వానికి సలహానిస్తుంది.

7. **అంతర్జాతీయ ద్రవ్య నిధుల పరిరక్షణ** : దేశానికున్న బంగారు నిల్వలు, అంతర్జాతీయ ద్రవ్య నిధులను కేంద్ర బాంకు పరిరక్షణ చేస్తుంది. అంతర్జాతీయ చెల్లింపులు కేంద్ర బాంకు ద్వారా జరుగుతాయి. అంతర్జాతీయ చెల్లింపులపై ప్రభుత్వము విధించిన కంట్రోల్స్‌ను కేంద్ర బాంకు అమలు పరుస్తుంది. మారకపు రేటు స్థిరంగా ఉండేటట్లు చూడటం కూడా కేంద్ర బాంకు విధులలో ఒకటి.

పైన వివరించిన విధులన్నింటిని కేంద్ర బాంకు నిర్వహిస్తుంది. ప్రభుత్వపు ఆర్థిక విధానాలను తీర్చిదిద్దటంలోను వాటిని ఆచరణలో పెట్టటానికి అనువైన యంత్రాంగాన్ని సమకూర్చటంలోను కేంద్ర బాంకు విశేషమైన కృషి సల్పి దేశ ఆర్థిక వ్యవస్థను పటిష్టం చేయటంలో అత్యంత కీలకమైన పాత్ర వహిస్తుంది. పైన వివరించిన విధులనే కాకుండా మారుచున్న ఆర్థిక పరిస్థితులకు అనుగుణంగా కేంద్ర బాంకు కూడా నూతన విధులను నిర్వహించవలసి ఉన్నది. ముఖ్యముగా అభివృద్ధి చెందుతూ ఉన్న దేశాలలో ఇది ఎంతైనా అవసరము.

**ప్రశ్న 6) పరపతి నియంత్రణకు కేంద్ర బాంకు అనుసరించే పద్ధతులను విమర్శనాత్మకంగా పరిశీలించండి.**

**జవాబు** : దేశంలోని కరెన్సీ, పరపతి పరిమాణాన్ని నియంత్రణ చేసి, సుస్థిరతను సాధించటం కేంద్ర బాంకు యొక్క ముఖ్య లక్ష్యం. పరపతి నియంత్రణ కేంద్ర బాంకు విధులలో ముఖ్యమైనది. పరపతి నియంత్రణకు కేంద్ర బాంకు 2 సాధనాలు ఉపయోగిస్తుంది.

I. పరిమాణాత్మక పరపతి నియంత్రణ సాధనాలు.

II. గుణాత్మక పరపతి నియంత్రణ సాధనాలు.

I. **పరిమాణాత్మక పరపతి నియంత్రణ సాధనాలు :** పరిమాణాత్మక పరపతి నియంత్రణ సాధనాలు 3 రకాలు.

1) బాంకు రేటు, 2) ఓపెన్ మార్కెట్ వ్యవహారాలు, 3) నగదు నిల్వల నిష్పత్తి మార్పు.

**1. బాంకు రేటు :** వాణిజ్య బాంకు తమ దగ్గర ఉన్న హుండీలను, సెక్యూరిటీలను హామీగా పెట్టి కేంద్ర బాంకు నుండి ఋణాలు తీసుకొంటాయి. ఈ ఋణాల మీద కేంద్ర బాంకు వసూలు చేసే వడ్డీరేటును "బాంకు రేటు" అంటారు. ద్రవ్యోల్బణం, ఆర్థిక మాంద్య పరిస్థితులను అరికట్టుటకు కేంద్ర బాంకు బాంకు రేటును ఒక సాధనంగా ఉపయోగిస్తుంది. ద్రవ్యోల్బణం ఉన్నప్పుడు వాణిజ్య బాంకుల పరపతి తగ్గించటానికి కేంద్ర బాంకు, బాంకు రేటును పెంచుతుంది. అప్పుడు ద్రవ్యమార్కెట్‌లో వడ్డీ రేట్లు పెరుగుతాయి. వడ్డీరేట్లు పెరిగినపుడు ఋణాలు తీసుకునేవారు తగ్గిపోతారు. పరపతి తగ్గిపోతుంది. అంటే బాంకులు కల్పించే ద్రవ్య సప్లయ్ తగ్గుతుంది. తత్ఫలితంగా ధరలు తగ్గుతాయి. ఆర్థిక వ్యవస్థలో ఆర్థిక మాంద్యము ఉన్నప్పుడు కేంద్ర బాంకు బాంకురేటును తగ్గిస్తుంది. తత్ఫలితంగా వడ్డీ రేట్లు తగ్గుతాయి. పరపతి తగ్గుతుంది. మార్కెట్‌లో ద్రవ్య సప్లయ్ పెరుగుతుంది. ఫలితంగా ధరలు పెరుగుతాయి. వడ్డీ రేటు తగ్గినపుడు ఉత్పత్తిదారుల యొక్క పెట్టుబడిని పెంచి ఉత్పత్తిని అధికం చేస్తారు. తద్వారా ఉద్యోగిత పెరుగుతుంది. ప్రజల ఆదాయాలు పెరుగుతాయి. వస్తువులకు డిమాండ్ పెరుగుతుంది. ధరలు పెరుగుతాయి. ఈ విధంగా ద్రవ్యోల్బణ ఆర్థిక మాంద్య పరిస్థితులను తొలగించవచ్చును.

**పరిమితులు :**

1) బాంకు రేటు మారినపుడు ద్రవ్య మార్కెట్‌లో వడ్డీ రేట్లు మారకపోవచ్చును.
2) బాంకు రేటు మారినపుడు ఉత్పత్తి వ్యయాలు, ధరలు మారకపోవచ్చు.
3) వడ్డీ రేటు కొద్దిగా మారినంత మాత్రాన పెట్టుబడి స్థాయి మారకపోవచ్చును.
4) ఆర్థిక మాంద్యములో వడ్డీ రేటు తగ్గినపుడు, పెట్టుబడి పెరగదు. కనుక వడ్డీ రేటు తగ్గించిన ఆర్థిక మాంద్యాన్ని నివారించలేము.
5) ద్రవ్యోల్బణం కాలంలో వడ్డీ రేటు పెరిగిన పెట్టుబడి తగ్గకపోవచ్చు. వడ్డీ రేటును పెంచిన ద్రవ్యోల్బణాన్ని నివారించలేము.
6) వడ్డీరేటు పెరిగితే ప్రభుత్వ ఋణభారం పెరుగుతుంది. కాబట్టి ప్రభుత్వము ఈ పద్ధతిని అవలంబించకపోవచ్చును.

**2. ఓపెన్ మార్కెట్ వ్యవహారాలు :** కేంద్ర బాంకు కొనే, అమ్మే సెక్యూరిటీల వ్యవహారాలను "ఓపెన్ మార్కెట్ వ్యవహారాలు" అంటాము. వీటికి ద్రవ్య సప్లయి మీద

ప్రత్యక్ష ప్రభావం ఉంటుంది. ద్రవ్య మార్కెట్‌లో ద్రవ్య సప్లయి ఎక్కువగా వుండి, ధరలు పెరుగుతూ వుంటే కేంద్ర బాంకు సెక్యూరిటీలను మార్కెట్‌లో అమ్ముతుంది. సెక్యూరిటీలను కొన్నవారు కేంద్ర బాంకుకు సొమ్మును చెల్లిస్తారు. కాబట్టి ద్రవ్య మార్కెట్‌లో ద్రవ్య సప్లయి తగ్గుతుంది. తత్ఫలితంగా ధరలు తగ్గుతాయి.

ప్రతిద్రవ్యోల్బణ పరిస్థితులు వున్నప్పుడు కేంద్ర బాంకు సెక్యూరిటీలను కొంటుంది. అప్పుడు కేంద్ర బాంకు నుండి ద్రవ్య మార్కెట్‌లోకి ద్రవ్యము వస్తుంది. ధరలు పెరుగుతాయి.

**పరిమితులు :**

1) కేంద్ర బాంకు దగ్గర అమ్మటానికి భారీ ఎత్తున సెక్యూరిటీలు వుండవలెను. కాని వెనుకబడిన దేశాలలో ఇవి ఉండవు.
2) దేశములో సెక్యూరిటీలను కొనే, అమ్మే సౌకర్యాలు ఎక్కువగా వుండవలెను.
3) కేంద్ర బాంకుకు, వాణిజ్య బాంకులకు సన్నిహిత సంబంధం వుండవలెను.
4) ఆర్థిక మాంద్యమున్నపుడు ఈ సాధనము శక్తివంతంగా పనిచేయదు.
5) వెనుకబడిన దేశాలలో ప్రజలకు సెక్యూరిటీలను కొనే, అమ్మే అలవాటు తక్కువగా ఉంటుంది.

3. నగదు నిల్వల నిష్పత్తి మార్పు : నగదు నిల్వల నిష్పత్తిని మార్చటం ద్వారా కూడా కేంద్ర బాంకు పరపతిని నియంత్రణ చేయవచ్చును. పరపతిని తగ్గించవలసి వచ్చినపుడు వాణిజ్య బాంకులు వుంచవలసిన నగదు నిల్వలను కేంద్ర బాంకు పెంచుతుంది. దానివల్ల వాణిజ్య బాంకులు ఇచ్చే పరపతి తగ్గిపోతుంది. వాణిజ్య బాంకుల పరపతిని పెంచవలసి వచ్చినపుడు, నగదు నిల్వ నిష్పత్తిని కేంద్రబాంకు తగ్గిస్తుంది. అందువల్ల బాంకులకు ఋణాలు ఇచ్చే శక్తి పెరుగుతుంది.

**పరిమితులు :**

1) నగదు నిల్వలు పెంచినపుడు అన్ని బాంకుల మీద దాని ప్రభావము ఒకటిగా వుండదు. పెద్ద బాంకుల కన్న, చిన్న బాంకులు ఎక్కువగా నష్టపోతాయి.
2) నగదు నిల్వలను మార్చటం వలన పరపతి విధానంలో అనిశ్చితత ఏర్పడుతుంది.
3) నగదు నిల్వల మీద బాంకులకు వడ్డీ రాదు. ఆ నష్టాన్ని పూడ్చుకొనుటకు ఋణాలపై ఎక్కువ వడ్డీని వసూలు చేస్తాయి. ఋణభారం పెరుగుతుంది.

**II. గుణాత్మక పరపతి నియంత్రణ సాధనాలు :** కొన్ని రకాలైన ఋణాలను లేక పరపతిని నియంత్రణ చేయుటకు ప్రత్యేకముగా ఉపయోగించే సాధనాలను "గుణాత్మక పరపతి నియంత్రణ సాధనాలు" లేక "ఎంపిక చేసిన పరపతి నియంత్రణ సాధనాలు" అంటారు.

**వీటిలో ముఖ్యమైనవి :**

**1. మార్జిన్‌లు మార్చటం :** వస్తువులను హామీగా పెట్టుకొని ఋణాలు ఇచ్చేటప్పుడు బాంకులు కొంత మార్జిన్ వుంచుకుంటాయి.

ఉదా : 20% మార్జిన్‌గా నిర్ణయిస్తే 100 రూ॥లు విలువగల సెక్యూరిటీకి రూ॥ 80 లు ఋణాన్ని మంజూరు చేస్తుంది. ఈ మార్జిన్ శాతాన్ని మారుస్తూ కేంద్ర బాంకు పరపతిని నియంత్రణ చేస్తుంది. కొన్ని రకాల ఋణాలకు ఎక్కువ మార్జిన్‌ను, మరికొన్ని రకాల ఋణాలకు తక్కువ మార్జిన్‌ను నిర్ణయించవచ్చును.

**2. పరపతి రేషనింగ్** : కేంద్ర బాంకు వాణిజ్య బాంకులకు ఇచ్చే పరపతికి ఒక గరిష్ట పరిమితిని నిర్ణయిస్తుంది. దీని వలన గుణాత్మక పరిమాణాత్మక పరపతి నియంత్రణ కూడా సాధ్యమవుతుంది. ఆర్థిక ప్రణాళికలు అమలులో వున్న దేశాలలో దీని ఆవశ్యకత ఎక్కువగా ఉంటుంది.

**3. బాంకు ఋణాల నియంత్రణ** : ఋణాలు ఇచ్చేటపుడు బాంకులు అవలంబించవలసిన విధానాలపై కంట్రోల్స్ పెట్టటానికి కేంద్ర బాంకుకు చట్టబద్ధముగా అధికారము ఉన్నది. ఏ యే ఉపయోగాలకు ఋణాలు ఇవ్వాలి, ఇవ్వకూడదు అనే దానిని కేంద్ర బాంకు నిర్ణయిస్తుంది.

**4. వినియోగదారుల పరపతి నిబంధనలు** : వినియోగదారులు కొన్ని వస్తువులు కొనటం కోసం బాంకులు ఋణాలు ఇస్తూ ఉంటాయి. ఈ ఋణాలను కేంద్ర బాంకు క్రమబద్ధము చేయవచ్చును. ద్రవ్యోల్బణ పరిస్థితులలో బాంకులకు మొదట చెల్లించవలసిన మొత్తాన్ని పెంచి, వాయిదాల సంఖ్యను తగ్గించవచ్చును. అప్పుడు వినియోగదారుడు తీసుకొనే ఋణాలు తగ్గుతాయి. వస్తువులకు డిమాండ్ తగ్గి, ధరలు తగ్గుతాయి. అలాగే అవసరము అనుకుంటే వాయిదాల సంఖ్యను పెంచి మొదటిగా చెల్లించవలసిన మొత్తాన్ని తగ్గించి పరపతిని పెంచవచ్చు.

**5. నైతిక ఉద్బోధ** : కేంద్ర బాంకు తాను కోరినట్లుగా ఋణాలు ఇవ్వటానికి బాంకులకు సలహాలు ఇవ్వవచ్చును. ఈ సలహాలను "నైతిక ఉద్బోధ" అంటారు. కేంద్ర బాంకు పట్ల వాణిజ్య బాంకులకు గౌరవం ఉన్నపుడే ఈ విధానము విజయవంతము అవుతుంది.

**6. ప్రత్యక్ష చర్య** : కేంద్ర బాంకు ఆదేశాలను వాణిజ్య బాంకులు పాటించకపోతే కేంద్ర బాంకు ప్రత్యక్ష చర్యకు పూనుకోవచ్చు. ఈ ప్రత్యక్ష చర్య అనేక రకములుగా ఉండవచ్చును. నిర్ణీతమైన పరిస్థితిని మించి తీసుకున్న ఋణాల మీద ఎక్కువ వడ్డీని వసూలు చేయవచ్చు. అత్యవసర పరిస్థితులలో అదనముగా ఋణాన్ని మంజూరు చేయకపోవచ్చును. అయితే ప్రత్యక్ష చర్య అంత విజయవంతము కాదు.

పరపతి నియంత్రణకు కేంద్ర బాంకు ఇన్ని సాధనాలు ఉపయోగిస్తున్నప్పటికి, ద్రవ్యోల్బణ పరిస్థితులు వస్తూనే వున్నాయి. దీనికి కారణము కేంద్ర బాంకు వాణిజ్య బాంకుల పరపతిని నియంత్రణ చేయగలుగుతుంది. కాని మిగతా ద్రవ్యసంస్థల పరపతిని నియంత్రణ చేయలేకపోతుంది. పైగా కేంద్ర బాంకు విధానాలలో ప్రభుత్వాలు జోక్యం చేసుకొంటున్నాయి. వాటి స్వేచ్ఛ అరికట్టబడుతుంది.

**ప్రశ్న 7) రిజర్వు బ్యాంకు నిర్వహించే విధులను వివరించండి. బ్యాంకింగ్ వ్యవస్థలో భారతదేశంలో రిజర్వు బ్యాంకు ఎట్టి పాత్రను కల్గివుంది ?**

**(Important)**

**జవాబు :** భారతదేశంలో రిజర్వు బాంకు కేంద్ర బాంకుగా వుండి ఎన్నో ముఖ్యమైన విధులను నిర్వహిస్తూ ద్రవ్య వ్యవస్థ, ఆర్థిక విధానాల అమలుకు అనుగుణంగా వుండేలా కృషిచేస్తుంది.

భారతీయ రిజర్వు బాంకు స్థాపన 1935 సంవత్సరం ఏప్రిల్‌లో జరిగింది. 1949వ సంవత్సరములో ఇది జాతీయం చేయబడింది. ఇది కేంద్ర బాంకు నిర్వహించే విధులన్నింటినీ నిర్వహిస్తూ భారతదేశంలో ఆర్థికాభివృద్ధిని వేగిరపరచే అనేక కార్యకలాపాలు అమలుకు దోహదం చేస్తుంది. భారతీయ రిజర్వు బాంకు పాత్ర ఎంతో గణనీయమైనది. అది నిర్వహించే ముఖ్య విధులను ఈ క్రింద వివరించాము.

**నోట్లు జారీచేయుట :** భారతదేశంలో కరెన్సీని ముద్రించి విడుదల చేసే మొదలు గుత్తాధికారం రిజర్వు బాంకుకే గలదు. మన దేశంలో రెండవ పంచవర్ష ప్రణాళిక అమలు పెట్టే వరకు నైష్పత్తిక రిజర్వు పద్ధతిని పాటించి నోట్లు ముద్రించేది. రెండవ ప్రణాళిక పారిశ్రామిక ప్రాతిపదిక ప్రాధాన్యంతో భారీ పెట్టుబడి వ్యూహంతో నిర్మించడము వల్ల ప్రణాళికా వ్యయానికి కావల్సిన ద్రవ్య వనరులను సమకూర్చవలసిన బాధ్యత కేంద్ర బాంకుమీద పడింది. అందువల్ల కనిష్ట రిజర్వు పద్ధతిననుసరించి కావల్సినంత కరెన్సీని ముద్రించి అవసరమైన ద్రవ్య వనరులను సమకూర్చుకొనుటకు పూనుకొంది. ఈ పద్ధతిలో రిజర్వు బాంకు తన ఆధీనంలో రు. 200 కోట్ల విలువైన బంగారాన్ని విదేశీమారక నిల్వలను ఎల్లప్పుడూ కనిష్ఠ నిల్వలుగా తనవద్ద వుంచుకొని అవసరాలకు కావల్సినంత కరెన్సీని ముద్రించి విడుదల చేయవచ్చు. ఈ రు. 200 కోట్లలోను బంగారం విలువ రు. 115 కోట్లుకు తగ్గకుండా వుండాలి. రిజర్వు బాంకు దేశంయొక్క ఆర్థిక అవసరాలకు ఎంత కరెన్సీ కావల్సివస్తే అంత ముద్రించవచ్చు.

**పరపతి నియంత్రణ :** దేశంలో వాణిజ్య బాంకులు సృష్టించే పరపతిని నియంత్రితం చేయవల్సిన బాధ్యతకూడా రిజర్వు బాంకుపై వుంది. అందుకు నగదు నిష్పత్తి, ఓపెన్‌మార్కెట్ వ్యవహారాలు, బాంకు రేటు వంటి పరిమాణాత్మక పరపతి నియంత్రణా సాధనాలను ఇతర గుణాత్మక పరపతి నియంత్రణా సాధనాలను వుపయోగిస్తుంది. పరిమాణాత్మక పరపతి నియంత్రణా సాధనాల్లో నగదు నిష్పత్తి మరియు గుణాత్మక పరపతి నియంత్రణలో పరపతి రేషనింగ్, మార్జిన్లు మార్చుట ప్రాముఖ్యత వహిస్తాయి.

పరపతి నియంత్రణ విషయంలో రిజర్వు బాంకు అనేక ఇబ్బందులను ఎదుర్కోవల్సి వస్తుంది. మన దేశంలో ద్రవ్య మార్కెట్ బాగా అభివృద్ధి చెందకపోవడము,

ద్రవ్య మార్కెట్‌లో వివిధ భాగాల మధ్య సమన్వయం లేకపోవడంవల్ల రిజర్వ్ బ్యాంకు పరపతి నియంత్రణలో మంచి ప్రగతిని సాధించలేకపోతుంది. బిల్లు మార్కెట్ బాగా అభివృద్ధి చెందకపోవడంవల్ల ఓపెన్ మార్కెట్ వ్యవహారాలు బ్యాంకు రేటు విధానాలు సమర్థవంతంగా అమలుజరుపుట సాధ్యం కావటం లేదు.

అసంఘటిత విభాగాలుండుట వలన స్థానిక వడ్డీ వ్యాపారస్తుల మీద, చిట్ ఫండ్స్ మీద తగినంత అదుపు లభించక పరపతి నియంత్రణలలో రిజర్వ్ బ్యాంకు ప్రయత్నాలు విఫలమవుతున్నాయి.

**బ్యాంకులకు బ్యాంకు :** బ్యాంకింగ్ వ్యవస్థలోవున్న వాణిజ్య బ్యాంకులు, సహకార బ్యాంకులు, విదేశీ మారక పారిశ్రామిక బ్యాంకులన్నింటికి రిజర్వ్ బ్యాంకు అధినేత. రిజర్వ్ బ్యాంకు అధీనంలో దాని ఆదేశాలు పాటిస్తూ మిగిలిన బ్యాంకులన్నీ పనిచేస్తాయి.

1. రిజర్వ్ బ్యాంకు ఆదేశాలమేరకు అన్ని వాణిజ్య బ్యాంకులు 3 శాతం నుంచి 15 శాతం వరకు రిజర్వ్ బ్యాంకు నిర్దేశించిన శాతం నగదును రిజర్వ్ బ్యాంకు అధీనంలో వుంచాలి.
2. వాణిజ్య బ్యాంకులు అర్హత గల సెక్యూరిటీలు, తాము డిస్కౌంట్ చేసిన హుండీలు, రిజర్వ్ బ్యాంకు వద్ద హామీగా వుంచి అవసరమైన సందర్భాలలో వాటిమీద ఋణాలు, అడ్వాన్సులు పొందవచ్చు.
3. బ్యాంకులన్నీ రిజర్వ్ బ్యాంకుకు కోరిన సమాచారాన్ని అందించుట, వ్యాపార అంచనాలను, లెక్కలను కాలక్రమవారీగా రిజర్వ్ బ్యాంకుకు సమర్పించుట చేయాలి.
4. అన్ని బ్యాంకులు రిజర్వ్ బ్యాంకు యొక్క ఆదేశాలను పాటించి తీరాలి.
5. రిజర్వ్ బ్యాంకు క్లియరింగ్ హౌస్‌లు ఏర్పాటుచేసి, బ్యాంకుల మధ్య వ్యాపార వ్యవహారాల సర్దుబాటుకు తోడ్పడుతుంది.
6. బ్యాంకింగ్‌రెగ్యులేషన్ చట్టప్రకారం రిజర్వ్ బ్యాంకు ఇతర బ్యాంకుల కార్యకలాపాలను నియంత్రితం చేయుటకు విస్తృత అధికారాలున్నాయి.

**ప్రభుత్వ బ్యాంకు :** రిజర్వ్ బ్యాంకు రాష్ట్ర కేంద్ర ప్రభుత్వాలకు బ్యాంకరుగా పనిచేస్తుంది. ప్రభుత్వానికి బ్యాంకరుగా రిజర్వ్ బ్యాంకు అనేక విధులను నిర్వహిస్తుంది.

1. ప్రభుత్వానికి రావల్సిన రాబడులన్నింటినీ వసూలు చేస్తూ ప్రభుత్వం చెల్లించమని కోరినవారికి ప్రభుత్వం తరపున చెల్లింపులను చేస్తూ వుంటుంది.
2. అక్కౌంట్ విభాగం ఈ పనులు చేస్తుంది. ప్రభుత్వ ఋణాల్ని సేకరిస్తుంది. ప్రజలు చెల్లించే ఋణ చందాలను వసూలు చేసి ప్రభుత్వానికి జమచేయడం ప్రభుత్వ ఋణాలమీద వడ్డీల చెల్లింపు, అసలు చెల్లింపు కూడా రిజర్వ్ బ్యాంకుయొక్క పబ్లిక్ ఋణవిభాగం చూసుకుంటుంది.
3. ప్రభుత్వానికి 90 రోజులు గడువు మించని వేస్ అండ్ మీన్స్ ఋణాలను అందచేస్తుంది.

4. విదేశీయులకు ప్రభుత్వం తరపున చెల్లింపులు చేస్తుంది.
5. ప్రపంచ బాంకుకి, అంతర్జాతీయ ద్రవ్యనిధికి ప్రభుత్వం తరపున ప్రతినిధిగా పనిచేస్తుంది.
6. ప్రభుత్వానికి, ఋణాల విడుదల సేకరణ ఆర్థిక ప్రణాళికలు పారిశ్రామిక వ్యవసాయాభివృద్ధి వ్యూహము, ద్రవ్యవనరుల సమీకరణ మొదలగు అంశాలకి సంబంధించి సలహాల నిస్తుంది.
7. ప్రభుత్వ సౌకర్యం కోసం ఛెస్టులను నిర్వహిస్తుంది.

**విదేశీ మారక నిల్వలు ఇతర నిధుల పరిరక్షణ** : దేశము యొక్క బంగారపు నిల్వలను, విదేశీ మారకపు నిల్వలను ఇతర నిధులను పరిరక్షించే బాధ్యత రిజర్వు బాంకుదే. విదేశీ మారకానికి సంబంధించిన చట్టాల అమలు, విదేశీ మారకపు రేటు సుస్థిరత సాధించే బాధ్యత కూడా రిజర్వు బాంకుదే.

**అంతిమ ఋణదాత** : దేశంలోని ద్రవ్య మార్కెట్‌లోని అన్ని ద్రవ్య సంస్థలకు అంతిమ ఋణదాతగా వ్యవహరించే అధికారం రిజర్వు బాంకుకే వుంది. ద్రవ్య మార్కెట్ అభివృద్ధి చెందనందున, కేవలం వాణిజ్య బాంకులకు, సహకార బాంకులకు మాత్రమే ఋణాలను పరిమితం చేసింది. అంతేకాక పరపతి నియంత్రణా సామర్థ్యం కోసము, ద్రవ్యోల్బణా నివారణ కోసము అంతిమ ఋణదాత ధర్మాన్ని కొంత పరిమితం చేయడం కూడా సమంజసమేనని చెప్పాలి.

**క్లియరింగ్ హౌసెస్** : రిజర్వు బాంకు దేశం మొత్తానికి బాంకింగ్ వ్యవస్థలో క్లియరింగ్ హస్‌గా పనిచేస్తుంది. బాంకుల మధ్య ఋణాల నిర్ణయాలను సర్దుబాటు చేస్తుంది. అందుకవసరమైన క్లియరింగ్ హౌస్‌లను నిర్వహిస్తుంది.

రిజర్వు బాంకు సాంప్రదాయకమైన విధులనే కాకుండా ఆర్థికాభివృద్ధికవసరమైన అనేక ఇతర విధులను కూడా చేబట్టుచున్నది.

**1. పారిశ్రామిక పరపతి** : ఆర్థికాభివృద్ధికి పారిశ్రామికాభివృద్ధి చాలా ముఖ్యము. పారిశ్రామికాభివృద్ధికి మూలధనం చాలా ప్రధానము. పారిశ్రామికాభివృద్ధి కవసరమైన మూలధనం సమకూర్చుటకు అవసరమైన అనేక ద్రవ్య సంస్థలను, పారిశ్రామిక విత్త సహాయ సంస్థలను సంస్థాపించుటలో రిజర్వు బాంకు కీలకపాత్ర వహించింది. పారిశ్రామిక విత్త సహాయ సంస్థ, పారిశ్రామిక పరపతి పెట్టుబడి సంస్థ, పారిశ్రామికాభివృద్ధి బాంకు మున్నగునవి స్థాపించుటకు కృషి చేసింది. వాటికి తాత్కాలిక ఋణసహాయం కూడా చేస్తుంది.

**2. వ్యవసాయాభివృద్ధికి పరపతి** : వ్యవసాయ పరపతి విస్తరణకు రిజర్వు బాంకు ఎంతో కృషి చేసింది. రాష్ట్ర స్థాయి సహకార బాంకు అతి స్వల్ప వడ్డీ అనగా బాంకు రేటు కంటే రెండు శాతము తక్కువ వడ్డీకి ఋణసహాయం కల్పించింది. వ్యవసాయాభివృద్ధి కోసం తన లాభాల నుంచి వేరే నిధులను యేర్పరచింది. వ్యవసాయాభివృద్ధికి వేరే

విభాగాన్ని యేర్పరచింది. వ్యవసాయ సమస్యలను పరిశీలించి కేంద్ర ప్రభుత్వాలకు సలహాల నిచ్చుటకు ప్రత్యేక సిబ్బందిని, నిపుణులను ఏర్పాటు చేసింది.

**చిన్న పరిశ్రమలకి పరపతి :** చిన్నతరహా పరిశ్రమలకి ఆర్థిక సహాయం అందచేస్తుంది. చిన్నతరహా పరిశ్రమలకి వాణిజ్య బాంకులిచ్చే ఋణాలకు పూచీకత్తు వుంటుంది.

**గణాంక పరిశోధన :** ప్రత్యేకముగా గణాంక సమాచారము, పరిశోధనకు సంబంధించి రిజర్వు బాంకు ఒక విభాగాన్ని నెలకొల్పింది. దేశంలోని ఆర్థిక సమస్యలకి సంబంధించిన గణాంక సమాచారము సేకరించి, పరిశోధనలు జరిపి పరిష్కార మార్గాలను సూచిస్తుంది.

**వాణిజ్య బాంకులమీద పరిచాలన :** అన్ని వాణిజ్య బాంకుల కార్యకలాపాలను రిజర్వు బాంకు అదుపుచేస్తుంది. వాటి కార్యకలాపాలపై పరిచాలన జరుపుతుంది. రిజర్వు బాంకుకు కొన్ని ప్రత్యేకాధికారాలవల్ల ఇది సాధ్యమవుతుంది. ఆర్థికాభివృద్ధిలో వాణిజ్య బాంకుల పాత్ర, వాటి నడవడిక తీరు గురించి తరచు సభలు, సమావేశాలు, చర్చలు, చర్చాగోష్టులు నిర్వహిస్తుంది. వాటిద్వారా వాణిజ్య బాంకులు కాలగతి ననుసరించి అనుసరణీయ మార్గాలు చేపట్టేలా చేస్తుంది.

**డిపాజిట్ భీమా పథకం :** డిపాజిట్‌దారుల క్షేమాన్ని పరిరక్షించుటకు రిజర్వు బాంకు బాధ్యత వహించింది. బాంకులు పతనమైన సందర్భంలో కానీ లేదా విశృంఖలంగా విచక్షణారహితమైన ఋణ విధానాలను గాని, పాటించుట వలన డిపాజిటుదార్లు నష్టపోతారు. అట్టి నష్టాలు సంభవించకుండాను, బాంకులు అర్థరహితంగా ప్రవర్తించకుండాను, డిపాజిట్ భీమా పథకాన్ని ప్రవేశపెట్టి డిపాజిట్లలో కొంత శాతం సొమ్మును రిజర్వు బాంకువద్ద భీమా రుసుముగా ఉంచాలని ఆదేశించింది. దీనివల్ల డిపాజిట్‌దార్ల శ్రేయస్సు కాపాడబడుతుంది.

ఈ విధముగా భారతీయ రిజర్వు బాంకు అభివృద్ధికి దోహదకరమైన అనేక కార్యక్రమాలను చేపట్టినదని కేంద్ర బాంకుగా తన విధులను నిర్వహిస్తూనే ఈ అదనపు విధులను అత్యంత చాకచక్యంగా నిగ్రహించినదని మనం భావింపవచ్చును.

**ప్రశ్న 8) ఫిషర్ ద్రవ్యరాశి సిద్ధాంతాన్ని విమర్శనాత్మకంగా పరిశీలించండి.**

**జవాబు :** ద్రవ్యరాశికి ధరల స్థాయికి ఉండే ప్రత్యక్ష సంబంధాన్ని ద్రవ్యరాశి సిద్ధాంతం వివరిస్తుంది. ఈ సిద్ధాంతాన్ని మొట్టమొదటిసారిగా 16వ శతాబ్దంలో ప్రతిపాదించినారు. 'ఇర్వింగ్ ఫిషర్' ద్రవ్యరాశి సిద్ధాంతాన్ని ప్రచారంలోకి తెచ్చినాడు. అందువల్ల ఈ సిద్ధాంతముతో ఆయన పేరు ముడిపడి వున్నది.

ద్రవ్యం విలువను ద్రవ్యానికుండే డిమాండు, సప్లయి నిర్ణయిస్తాయి. ద్రవ్య సప్లయి డిమాండ్‌కన్నా హెచ్చుగా వుంటే ద్రవ్యం విలువ పడిపోతుంది. ధరల స్థాయి పెరుగుతుంది. ధరల స్థాయి ద్రవ్యరాశిపై ఆధారపడి ఉంటుందని, ద్రవ్యరాశిని రెట్టింపు

చేసినట్లయితే ధరలస్థాయి రెట్టింపు అవుతుందని 'ఫిషర్' పేర్కొనినాడు. తన సిద్ధాంతాన్ని 'ఫిషర్ ' ఈ క్రింది సమీకరణంద్వారా వివరించినాడు.

$$P = \frac{MV}{T}$$

P = ధరల స్థాయి

M = ద్రవ్యరాశి

V = ద్రవ్య ప్రసార వేగం

T = వ్యాపార వ్యవహారాల కోసం ద్రవ్యానికి గల డిమాండు

ద్రవ్యం వినిమయ సాధనంగా పనిచేయుటవల్ల దానికి డిమాండ్ ఏర్పడుతుందని 'ఫిషర్' అభిప్రాయము. వ్యాపార వ్యవహారాలను నడపటానికి ద్రవ్యం అవసరమవుతుంది కాబట్టి ద్రవ్యానికుండే డిమాండ్ వ్యాపార వ్యవహారాల సంఖ్య (T) పైన ఆధారపడి వుంటుంది. వ్యాపార వ్యవహారాల సంఖ్య ఉత్పత్తి రాశిపై ఆధారపడి వుంటుంది. ఉత్పత్తి రాశి ఉత్పత్తి కారకాల పరిమాణంపై సాంకేతిక విజ్ఞానముపై, ప్రజల అభిరుచులు అలవాట్లపై ఆధారపడి వుంటుంది. అయితే ఈ అంశాలన్ని ఒకే కాలములో స్థిరముగా ఉంటాయని 'ఫిషర్' భావించాడు. అందువల్ల ఉత్పత్తి అయిన వస్తురాశి స్థిరముగా ఉంటుంది. అందువల్ల వ్యాపార వ్యవహారాల కోసం ద్రవ్యాని కుండే డిమాండ్ స్థిరముగా ఉంటుంది.

ద్రవ్యానికుండే డిమాండ్ స్థిరముగా ఉంటే ద్రవ్యం విలువ లేక ధరల స్థాయి ద్రవ్య సప్లయిని బట్టి మారుతుంది. కేంద్ర బ్యాంక్ సరఫరా చేసిన ద్రవ్యము ద్రవ్య సప్లయ్ అవుతుంది. దానిని Mగా పరిగణించవచ్చును. అయితే ద్రవ్య యూనిట్ ఒకే ఒకసారికాక అనేకసార్లు వస్తువులను కొనటానికి కొంత కాలములో ఉపయోగపడుతుంది. ప్రతి ద్రవ్య యూనిట్ సగటున ఎన్నిసార్లు కొంత కాలములో చేతులు మారుతుందో దానిని "ద్రవ్య ప్రసార వేగం" (V) అంటారు. కొంతకాలములో ద్రవ్య యూనిట్ 10 సార్లు సగటున చేతులు మారినట్లయితే ప్రసార వేగం 10 అవుతుంది. అప్పుడు ద్రవ్య సప్లయ్ = ద్రవ్యరాశి (M) × ద్రవ్య ప్రసారవేగము (V) అవుతుంది.

$(M \times V = MV)$

**పై సమీకరణను బట్టి ధరల స్థాయి ఈ క్రింది అంశాలపై ఆధారపడి వుంటుందని తెలుస్తుంది.**

1. ద్రవ్యరాశి (M)
2. ద్రవ్య ప్రసారవేగము (V)
3. ద్రవ్యంతో కొన్న వస్తురాశి (T)

స్వల్పకాలంలో V, T లు స్థిరంగా ఉంటాయని భావించి ధరలస్థాయి ప్రత్యక్షముగా ద్రవ్యరాశితో మారుతుందని 'ఫిషర్' వివరించినాడు. ద్రవ్యరాశిని రెట్టింపు చేసినట్లయితే ధరల స్థాయి రెట్టింపు అవుతుందని 'ఫిషర్' పేర్కొన్నాడు.

విమర్శ : 'ఫిషర్' సిద్ధాంతముఈ క్రింది,విమర్శలకు గురియైనది.

1. V, Tలు స్థిరంగా ఉండవు. ద్రవ్యరాశి మారినపుడు V,Tలు మారవని 'ఫిషర్' అభిప్రాయము. కాని వాస్తవంగా అవి స్థిరముగా ఉండవు. అందుచేత ద్రవ్యరాశి మార్పులు ధరల స్థాయిపై ఎటువంటి ప్రభావము కలుగచేస్తాయో చెప్పలేము.
2. ఈ సిద్ధాంతము వ్యాపార చక్రాలు ఎట్లా ఏర్పడతాయో వివరించలేదు. ద్రవ్యరాశి స్థిరంగావున్న వ్యాపార చక్రాలు వస్తున్నాయి. కొంతకాలము ధరలు పెరుగుట కొంతకాలం తగ్గుట జరుగుతుంది. కాబట్టి ఈ సిద్ధాంతము తప్పు అని తెలియుచున్నది.
3. సంపూర్ణ ఉద్యోగితాస్థాయి ఉన్నప్పుడే ఈ సిద్ధాంతము నిజము అవుతుంది: సంపూర్ణ ఉద్యోగితాస్థాయి చేరిన తరువాత ఉత్పత్తిని పెంచటానికి వీలుండదు. కాబట్టి ద్రవ్యరాశి పెరిగితే ధరల స్థాయి పెరుగుతుంది. ఉత్పత్తిని పెంచుటకు వీలున్న అల్ప ఉద్యోగిత ఆర్థిక వ్యవస్థలో ద్రవ్యరాశి పెరిగినా ధరలస్థాయి పెరగకపోవచ్చు.
4. ద్రవ్యరాశి ధరలను నిర్ణయించే బదులు ధరలు ద్రవ్యరాశిని నిర్ణయిస్తాయి. ద్రవ్యేతర కారణాల వలన ధరలు పెరిగిన ఫలితంగా ద్రవ్య సప్లయిని పెంచవలసి వస్తుంది. అప్పుడు P కారణము M ఫలితమవుతుంది.
5. ధరలను నిర్ణయించే ద్రవ్యేతర కారణాలను ఈ సిద్ధాంతము విస్మరిస్తుంది. ధరల ద్రవ్యరాశి మార్పుల వల్లనేకాక ఇతర కారణాలవల్ల కూడా మారతాయి. ఉదా : ద్రవ్యరాశి స్థిరంగావున్న ఉత్పత్తి వ్యయాలు పెరిగితే ధరలు పెరుగుతాయి.
6. ఫిషర్ సిద్ధాంతము నిశ్చల పరిస్థితులకు సంబంధించిన సిద్ధాంతము. ఫిషర్ సమీకరణము కొన్ని మార్పులు జరగవనే ప్రమేయంపై రూపొందించబడినది. అయితే వాస్తవిక ప్రపంచము నిశ్చలంగా ఉండదు. మార్పులు జరుగుతూ వుంటాయి. కాబట్టి ఇది వాస్తవిక విషయాలకు దూరమైన సిద్ధాంతము.
7. ఫిషర్ సమీకరణములో T, Vలు స్థిరంగా ఉంటాయని P, M పైన ఆధారపడి వుంటుందని 'ఫిషర్' భావించినాడు. కాని ఈ సమీకరణములోని అన్ని అంశాలు ఒకదానిపై ఒకటి ఆధారపడి వుంటాయి. ధరల స్థాయి పెరుగుతున్నప్పుడు ద్రవ్యము విలువ క్షీణిస్తుంది. ద్రవ్య విలువ క్షీణించేటప్పుడు ప్రజలు ద్రవ్యాన్ని నిలువ చేయరు. అప్పుడు ద్రవ్య ప్రసార వేగము పెరిగినట్లయితే ధరల స్థాయి పెరుగుతుంది. P,Vలు ఒకదానిపై ఒకటి ఆధారపడి వుంటాయి.
8. ఆదాయ వ్యయాలలో మార్పులవల్ల ధరలస్థాయి మారుతుంది. కాని ద్రవ్యరాశి మార్పులవల్ల కాదు. కీన్స్ సిద్ధాంతము ప్రకారము ఆదాయ వ్యయాలలో మార్పుల వల్ల ధరల స్థాయి మారుతుంది. ద్రవ్యరాశి వలన కాదు.

**ప్రశ్న 9) కేంబ్రిడ్జి సమీకరణాన్ని తెలుపుము.**

**లేదా**

**ద్రవ్యనిల్వల సిద్ధాంతాన్ని తెలిపి, ఇది వ్యాపార వ్యవహారాల సిద్ధాంతము కంటే ఏ విధంగా మెరుగు అయినదో వివరించండి.**

జవాబు : కేంబ్రిడ్జి ఆర్థికవేత్తలు ఫిషర్ సిద్ధాంతాన్ని విమర్శించి ఒక నూతన సిద్ధాంతాన్ని లేక సమీకరణాన్ని ప్రతిపాదించినాడు. ఫిషర్ ప్రకారంగా ద్రవ్యాన్ని వ్యాపార వ్యవహారాల కోసం డిమాండ్ చేయటం జరుగుతుంది. కాబట్టి ఫిషర్ సిద్ధాంతాన్ని "వ్యాపార వ్యవహారాల సిద్ధాంతం" అంటారు. కేంబ్రిడ్జి ఆర్థికవేత్తలకు మార్షల్, రాబర్ట్ సన్, పిగో, కీన్స్ మొదలగు ఆర్థికవేత్తలు ప్రకారంగా "ద్రవ్యాన్ని ద్రవ్య రూపంలోనే తమ దగ్గరే ఉంచుకోవటం కోసం డిమాండ్ చేస్తారు". అందుచేత కేంబ్రిడ్జి ఆర్థికవేత్తల సిద్ధాంతాన్ని "ద్రవ్యనిల్వల సిద్ధాంతము" అంటారు.

**కేంబ్రిడ్జి సిద్ధాంతము** : కేంబ్రిడ్జి ఆర్థికవేత్తల ప్రకారంగా ధరలస్థాయి ద్రవ్యసప్లయి పై డిమాండ్‌పై ఆధారపడి వుంటుంది. కనుక దీని ప్రకారంగా ద్రవ్య సప్లయిలో కాని లేదా డిమాండ్‌లోకాని లేదా డిమాండ్‌లో కాని కలిగే మార్పుల వల్ల ధరలస్థాయి మారుతుంది.

ద్రవ్య సప్లయి : కేంబ్రిడ్జి ఆర్థికవేత్తల ప్రకారంగా కేంద్ర బాంకు జారీచేసిన ద్రవ్యము మరియు బాంకులు సృష్టించిన పరపతి కలిపి ద్రవ్య సప్లయి అవుతుంది. ద్రవ్య సప్లయిని కేంబ్రిడ్జి ఆర్థికవేత్తలు 'M' అనే సాంకేతికము ద్వారా సూచించినారు. కనుక M = ద్రవ్య సప్లయి.

ద్రవ్య **డిమాండ్** : ప్రజలు ద్రవ్యాన్ని ద్రవ్యరూపంలో ఉంచుకోవటంవల్ల ద్రవ్యానికి డిమాండ్ ఏర్పడుతుంది. ప్రతివారు ఆదాయములో కొంత భాగాన్ని ద్రవ్య రూపంలో నిల్వ ఉంచుకుంటారు ద్రవ్యానికి ద్రవ్యత ఉన్నది. అందువల్ల ద్రవ్యాన్ని చేతిలో ఉంచుకుంటే కొంత సౌకర్యం ఉంటుంది. కేంబ్రిడ్జి ఆర్థికవేత్తలు ద్రవ్యానికి గల డిమాండ్‌ను K.T గా సూచించినారు. కనుక K.T = ద్రవ్యానికి గల డిమాండ్.

**ధరల స్థాయి** : కేంబ్రిడ్జి ఆర్థికవేత్తల ప్రకారంగా ధరలస్థాయి ద్రవ్య సప్లయిపై ద్రవ్యడిమాండ్‌పై ఆధారపడి వుంటుంది. ద్రవ్య సప్లయిని ద్రవ్య డిమాండ్‌చేత భాగిస్తే ధరల స్థాయి తెలుస్తుంది. దీనినే కేంబ్రిడ్జి ఆర్థికవేత్తలు ఈ క్రింది సమీకరణముద్వారా తెలియజేసినారు.

$$P = \frac{M}{KT}$$

P : ధరలస్థాయి; M : ద్రవ్య సప్లయి.

KT = ద్రవ్యానికి గల డిమాండ్

**ఉదాహరణకు** ద్రవ్య సప్లయి 200 కోట్ల రూ॥లు ఉండి, ద్రవ్యానికి గల డిమాండ్ 1000 కోట్లు అయినట్లు అయితే ధరల స్థాయి 2 అవుతుంది.

$$\left(\frac{2000}{1000} : 2\right)$$

**ఫిషర్ సమీకరణము, కేంబ్రిడ్జి సమీకరణమునకు గల తేడాలు :**

1) కేంబ్రిడ్జి సమీకరణంలోని ధరలస్థాయి, ఫిషర్ సమీకరణంలోని ధరల స్థాయి ఒకటికాదు. ఫిషర్ సమీకరణంలోని ధరలస్థాయి, సాధారణ ధరలస్థాయికి సంబంధించినది. కేంబ్రిడ్జి సమీకరణంలోని ధరలస్థాయి వినియోగ వస్తువులకు సంబంధించినది.
2) ఫిషర్ సమీకరణము ద్రవ్య సప్లయికి ప్రధాన స్థానమిస్తే, కేంబ్రిడ్జి సమీకరణము ద్రవ్యం డిమాండ్‌కు ప్రధాన స్థానమిస్తుంది. ద్రవ్యంయొక్క డిమాండ్‌లో మార్పువస్తే, ధరలస్థాయి మారుతుందని కేంబ్రిడ్జి సమీకరణము తెలియజేస్తుంది.
3) కేంబ్రిడ్జి సమీకరణము ద్రవ్యరాశి సిద్ధాంతములో మానసిక అంశాలను, ఊహలను ప్రవేశపెట్టినది. నగదు నిల్వల పరిమాణము మానసిక అంశాలు, అంచనాలపై ఆధారపడి వుంటుంది. ఫిషర్ సమీకరణంలో మానసిక అంశాలకు ప్రమేయం లేదు.
4) ఫిషర్ సమీకరణంలోని ద్రవ్యానికి గల డిమాండ్‌ను తెలుసుకోవటంకన్నా కేంబ్రిడ్జి సమీకరణములోని ద్రవ్యానికి గల డిమాండ్‌ను తెలుసుకోవటం సులభం కాబట్టి $P = \frac{MV}{T}$ కన్నా $P = \frac{M}{KT}$ మెరుగైనది.
5) ఫిషర్ సిద్ధాంతముకన్నా, కేంబ్రిడ్జి సిద్ధాంతము వ్యాపార చక్రాలకు గల కారణాలను తెలుసుకోవటానికి ఎక్కువగా ఉపయోగపడుతుంది. ద్రవ్యానికి గల డిమాండ్‌లో మార్పుల వలన తరచు ధరల స్థాయి మారి తద్వారా వ్యాపార చక్రాలు ఏర్పడతాయని ఈ సిద్ధాంతము తెలియజేస్తుంది.
6) ద్రవ్యత్వాభిరుచి సిద్ధాంతాన్ని రూపొందించుటకు కేంబ్రిడ్జి సమీకరణము తోడ్పడినది. ప్రజలు నగదు నిల్వలను ఉంచుకుంటారు అనే అంశమే ద్రవ్యత్వాభిరుచి సిద్ధాంతానికి పునాది.
7) ద్రవ్యప్రసార వేగాన్ని నిర్ణయించే అంశాలను ఫిషర్ విశ్లేషణ చేయలేదు. ప్రజలు ద్రవ్యాన్ని ఎందుకు డిమాండ్ చేస్తారు, ద్రవ్య ప్రసార వేగంలో మార్పులు ఎందుకు వస్తాయి అన్నేవాటిని కేంబ్రిడ్జి ఆర్థికవేత్తలు విశ్లేషణ చేసినారు.

పై కారణాల వలన ఫిషర్ ద్రవ్యరాశి సిద్ధాంతముకన్నా కేంబ్రిడ్జి సమీకరణము మెరుగు అయినది అని చెప్పవచ్చును.

**ప్రశ్న 10) "ధరలస్థాయిలోని మార్పు, ఆదాయ మార్పులవల్ల వస్తుంది కాని ద్రవ్యరాశి మార్పులవల్ల కాదు". చర్చించండి.**

**లేదా**

**పొదుపు పెట్టుబడులకు సంబంధించిన ధరల సిద్ధాంతాన్ని వివరించండి.**

**జవాబు :** 'J.M. కీన్స్' ధరలస్థాయిలోని మార్పులకు కారణాలు తెలిపే ఒక నూతన సిద్ధాంతాన్ని ప్రతిపాదించినాడు. ఈ సిద్ధాంతాన్ని "ఆదాయ వ్యయ సిద్ధాంతమని" లేదా "పొదుపు పెట్టుబడుల సిద్ధాంతము" అని అంటారు. ఈ సిద్ధాంతము ప్రకారం ధరల స్థాయిలోని మార్పులకు కారణం పొదుపు పెట్టుబడుల మధ్య సమానత్వం లేకపోవటమే.

**ఆధునిక - ఆదాయ సిద్ధాంతము :** ఉత్పత్తి కారకాలకు ఆదాయాలు భాటకము, వడ్డీ, వేతనాలు, లాభాల రూపంలో వస్తాయి. ఉత్పత్తి కారకాలకు ఆదాయాలను ఉత్పత్తిదార్లు చెల్లిస్తారు. కనుక ఉత్పత్తి కారకాలకు చెల్లించిన ఆదాయం ఉత్పత్తిదారులకు వ్యయం అవుతుంది. ఒకరి వ్యయం మరొకరికి ఆదాయం అవుతుంది కనుక ఆదాయం, వ్యయానికి సమానంగా వుంటుంది.

ప్రజలు తమకొచ్చిన ఆదాయంలో కొంత పొదుపుచేసి మిగతాది వినియోగ వస్తువులపై వ్యయం చేస్తారు. వినియోగ వస్తువుల మీద చేసిన వ్యయం ఉత్పత్తిదారులకు ఆదాయం అవుతుంది. అయితే పొదుపు చేయబడిన మేరకు ఉత్పత్తిదారుల ఆదాయం తగ్గుతుంది. ఉత్పత్తిదారులకు ఉత్పత్తి వ్యయాలుగా ఖర్చుపెట్టినదంతా తిరిగి రావాలంటే పొదుపు చేసిన మొత్తము పెట్టుబడి వ్యయంగా జరగవలెను. పెట్టుబడి వ్యయము పొదుపుకు సమానంగా ఉంటే ఉత్పత్తిదారులకు వచ్చిన ఆదాయము వారు చేసిన ఉత్పత్తి వ్యయాలకు సమానంగా వుంటుంది. పొదుపు పెట్టుబడి సమానంగా వున్నప్పుడు సమష్టి డిమాండు, సమష్టి సప్లయిలు సమానంగా వుంటాయి. సమష్టి డిమాండు, సమష్టి సప్లయిలు సమానంగా వున్నప్పుడు ఆర్థిక వ్యవస్థ సమతౌల్యస్థితిలో వుంటుంది. తత్ఫలితంగా ధరల స్థాయి కూడా స్థిరంగా వుంటుంది.

వాస్తవములో పొదుపు పెట్టుబడి సమానం కాకపోవచ్చును. ఎందుకంటే సమాజంలో పొదుపు చేసేవారు వేరు, పెట్టుబడి పెట్టేవారు వేరు. పొదుపు చేసేవారు ముఖ్యంగా పిల్లల భవిష్యత్ కోసం ఉపయోగపడుతుందని పొదుపు చేస్తారు. పెట్టుబడి పెట్టువారు లాభార్జన కోసం పెట్టుబడి పెడతారు. పొదుపు చేసేవారి ఆలోచనలు వేరువేరుగా వుంటాయి. అందువలన పొదుపు పెట్టుబడి వాస్తవములో సమానముగా వుండవు. పెట్టుబడి పొదుపు కన్నా ఎక్కువగా వున్నా లేదా తక్కువగా వున్నా ఆదాయ స్థాయిలో, సమష్టి డిమాండు స్థాయిలో మార్పులు కలిగి ధరలస్థాయి మారుతుంది.

**పెట్టుబడి పొదుపుకన్నా ఎక్కువ అయితే ధరలస్థాయి పెరుగుతుంది :** పెట్టుబడి పొదుపును మించి ఉన్నపుడు సమష్టి డిమాండ్ సమష్టి సప్లయ్‌లకన్నా ఎక్కువగా వుంటుంది. ఫలితంగా ఉత్పత్తిదారులకు లాభాలు వస్తాయి. ఉత్పత్తి పెరుగుతుంది. ఆదాయ ఉద్యోగితాస్థాయి పెరుగుతుంది. ధరలస్థాయి పెరుగుతుంది. ఉత్పత్తి పెరిగేకొలది క్షీణ ప్రతిఫలాలు వస్తాయి. ఉత్పత్తి వ్యయాలు పెరుగుతాయి. ఉత్పత్తి పెరిగేకొద్ది ఉత్పత్తి కారకాలకు డిమాండ్ పెరిగి వాటి ధరలు పెరుగుతాయి. ఫలితంగా ఉత్పత్తి వ్యయం పెరుగుతుంది. తద్వారా ధరలు పెరుగుతాయి. సంపూర్ణ ఉద్యోగితాస్థాయిని చేరుకున్న తరువాత సమష్టి డిమాండ్ పెరిగితే ఉత్పత్తిని పెంచుటకు వీలు వుండదు. కాబట్టి ధరలు పెరుగుతాయి.

**పెట్టుబడి పొదుపుకన్నా తక్కువగా ఉన్నప్పుడు ధరలు తగ్గుతాయి :** పెట్టుబడి పొదుపుకన్నా తక్కువగా ఉన్నప్పుడు ఉత్పాదక సంస్థలకు ఉత్పత్తి వ్యయం అంతా తిరిగిరాదు. అందువల్ల ఉత్పత్తిదారుల ఆదాయం తగ్గుతుంది. ఫలితంగా నష్టాలు వస్తాయి. అప్పుడు సంస్థలు ఉత్పత్తిని తగ్గిస్తాయి. ఉత్పత్తిని తగ్గించటంవలన శ్రామికులకు ఉద్యోగిత పడిపోతుంది. ఫలితంగా ఆదాయ స్థాయి తగ్గుతుంది. డిమాండ్ తగ్గుతుంది. ధరల స్థాయి తగ్గుతుంది.

పై విశ్లేషణను బట్టి పొదుపు, పెట్టుబడులు అసమతౌల్యంవల్ల ధరలస్థాయి మారుతుందని తెలుస్తుంది. ధరలస్థాయి పొదుపు, పెట్టుబడుల సంబంధంపై ఆధారపడి ఉండడంవల్ల ఈ సిద్ధాంతాన్ని "పొదుపు పెట్టుబడి సిద్ధాంతము" అని అంటారు. ఈ సిద్ధాంతము ఆదాయ వ్యయాలకు, ధరలస్థాయికి ఉండే సంబంధాన్ని వివరించటమువల్ల దీనిని "ఆదాయ వ్యయ ధరల సిద్ధాంతమని" అంటారు.

**ద్రవ్యరాశికి, ధరలస్థాయికి గల సంబంధముపై 'కీన్స్' అభిప్రాయం :** ద్రవ్యరాశి సిద్ధాంతము చెప్పినట్లుగా ద్రవ్యరాశికి, ధరలస్థాయికి మధ్య ప్రత్యక్ష సంబంధము ఉండదని 'కీన్స్' అభిప్రాయం. ద్రవ్యరాశిలో మార్పులు,, ధరలస్థాయిలో మార్పులను పరోక్షంగా తెస్తాయి. ద్రవ్యరాశి పెరిగినపుడు వడ్డీరేటు తగ్గుతుంది. వడ్డీరేటు తగ్గినపుడు పెట్టుబడి రేటు పెరుగుతుంది. పెట్టుబడి పెరిగినందువలన ఆదాయం ఉద్యోగితాస్థాయి పెరుగుతుంది. ఆదాయ ఉద్యోగితాస్థాయి పెరిగేకొద్దీ ధరలు పెరుగుతాయి. కాబట్టి ద్రవ్యరాశికి, ధరలస్థాయికి మధ్య ప్రత్యక్ష సంబంధం లేదని తెలుస్తుంది. ద్రవ్యరాశిలోని మార్పులు అనేక యితర మార్పులకు దారితీస్తాయి. ఈ మార్పుల వల్ల ధరలు మారతాయి.

**కీన్స్ సిద్ధాంతానికి, ద్రవ్యరాశి సిద్ధాంతానికి గల తేడాలు :** కీన్స్ సిద్ధాంతం ద్రవ్యరాశి సిద్ధాంతము కన్నా ఈ క్రింది కారణాల వలన మెరుగయినది అని చెప్పవచ్చును.

1) సంపూర్ణ ఉద్యోగిత స్థితిలో ఆర్థిక వ్యవస్థ ఉన్నప్పుడే ద్రవ్యరాశి సిద్ధాంతము వర్తిస్తుంది. సంపూర్ణ ఉద్యోగిత వద్ద సమష్టి సప్లయి పూర్తి అవ్యాకోచంగా

ఉంటుంది. కనుక సమష్టి డిమాండ్ పెరిగినచో ధరలు పెరుగుతాయి. నిరుద్యోగితాస్థితిలో ఆర్థిక వ్యవస్థ ఉన్నప్పుడు ద్రవ్యరాశి సిద్ధాంతము పేర్కొన్న పరిణామాలు ఏవి ఏర్పడవు. కాని కీన్స్ సిద్ధాంతము నిరుద్యోగిత వద్ద, సంపూర్ణ ఉద్యోగిత వద్ద ధరల స్థాయి ఎట్లా మారుతుందో విశ్లేషణ చేస్తుంది.

2) ద్రవ్యరాశి సిద్ధాంతము వివరించలేని అనేక విషయములను ఈ సిద్ధాంతం వివరిస్తుంది. **ఉదా** : ద్రవ్యరాశి స్థిరంగా ఉన్నప్పటికీ వ్యాపార చక్రాలు ఎందుకు ఏర్పడతాయి. ద్రవ్య ప్రసార వేగంలో మార్పులు ఎందుకు వస్తాయి, ద్రవ్యరాశిని పెంచి ఆర్థికమాంద్యాన్ని ఎందుకు అరికట్టలేము మొదలగు విషయాలన్నింటిని ఈ సిద్ధాంతము వివరిస్తుంది.

3) కీన్స్ సిద్ధాంతము ద్రవ్యరాశి సిద్ధాంతాన్ని, ఉత్పత్తి సిద్ధాంతాన్ని సమన్వయం చేస్తుంది. ద్రవ్యరాశి పెరిగినపుడు వడ్డీరేటు తగ్గి పెట్టుబడి పెరిగిపోతుంది. తత్ఫలితంగా ఉత్పత్తి పెరిగి వ్యయాలు పెరుగుతాయి. అందువలన ధరలు పెరుగుతాయి అని ఈ సిద్ధాంతం తెలియజేస్తుంది.

4) కీన్స్ సిద్ధాంతము ద్రవ్యరాశి సిద్ధాంతాన్ని, విలువ సిద్ధాంతాన్ని సమన్వయం చేస్తుంది. ధరల స్థాయిని, సమష్టి డిమాండ్, సమష్టి సప్లయిలు నిర్ణయిస్తాయని 'కీన్స్' పేర్కొన్నాడు.

5) కీన్స్ సిద్ధాంతము ధరల స్థాయి ప్రధానంగా ఉత్పత్తి వ్యయాలచే నిర్ణయించబడుతుందని తెలియజేస్తుంది.

6) కీన్స్ సిద్ధాంతము ద్రవ్య ప్రసార వేగాన్ని సరిగ్గా విశ్లేషణ చేస్తుంది. పొదుపుకన్నా పెట్టుబడి ఎక్కువగా ఉన్నప్పుడు ధరలస్థాయి పెరిగి ద్రవ్యం విలువ తగ్గుతుంది. ద్రవ్య విలువ తగ్గుతున్నప్పుడే ద్రవ్యాన్ని వస్తురూపంలోకి మార్చటం వలన ద్రవ్య ప్రసార వేగం పెరుగుతుంది అని 'కీన్స్' తెలియజేసినాడు: పొదుపు-పెట్టుబడికన్నా హెచ్చుగా వున్నప్పుడు ధరల స్థాయి తగ్గి ద్రవ్యం విలువ పెరుగుతుంది. అప్పుడు ద్రవ్య రూపంలోని నిల్వలు పెరగటం వలన ద్రవ్య ప్రసార వేగం తగ్గుతుందని 'కీన్స్' అభిప్రాయపడెను.

పై కారణాల వలన ద్రవ్యరాశి సిద్ధాంతముకన్నా కీన్స్ సిద్ధాంతము మెరుగయినది అని చెప్పవచ్చును.

**విమర్శ** : కీన్స్ సిద్ధాంతము కూడా ఈ క్రింది విమర్శలకు గురి అయినది.

1) ద్రవ్యరాశి సిద్ధాంతము వలన ఇదికూడా ధరల స్థాయి మార్పులకు గల కారణాలన్నింటిని వివరించటము లేదు.

2) ఈ సిద్ధాంతము కూడా కొన్ని ప్రమేయాలమీద ఆధారపడివున్నది. కనుక ఇది నిశ్చల విశ్లేషణ అవుతుంది కాని చలన విశ్లేషణ కాదు.

3) పొదుపు-పెట్టుబడుల మధ్య సమానత్వం ఉన్నంత మాత్రాన ఆర్థిక వ్యవస్థలో సమతౌల్యం ఉంటుందని గట్టిగా చెప్పలేము.

4) అదేవిధంగా పొదుపు-పెట్టుబడుల మధ్య అసమతౌల్యం వల్లనే ఉత్పత్తిదారులకు లాభ నష్టాలు వస్తాయని కూడా చెప్పలేము.

**ప్రశ్న 11) ద్రవ్య విధాన లక్ష్యాలేవి? అభివృద్ధి చెందుతున్న దేశాల్లో ఈ లక్ష్యాల మధ్య పరస్పర వైరుధ్యం ఏదైనా ఉందా?**

**లేదా**

**ద్రవ్య విధానాన్ని నిర్వచించి, మారుతున్న దాని ఉద్దేశాలను వివరింపుము.**

**లేదా**

**కేంద్ర బ్యాంకు పరపతి నియంత్రణ చేయుటంలో ఉండే లక్ష్యాలెవ్వి?**

**లేదా**

**ద్రవ్య విధానం ఉద్దేశాలలో పరస్పర ఘర్షణ కలదా?**

**లేదా**

**ద్రవ్య విధానం యొక్క ఉద్దేశ్యములు ఏవి? ఆ ఉద్దేశ్యములు ఒకదానితో మరొకటి సరిపడునా? విశదీకరించుమది.**

**లేదా**

**ద్రవ్య విధానమును వివిధ లక్ష్యములను తెలియజేయుము.**

**(Very Important)**

**జవాబు :** ఆర్థిక వ్యవస్థలో ద్రవ్యాన్ని ప్రవేశపెట్టినందువల్ల కలిగే నష్టాలను కనీసంగా ఉంచుతూ ప్రయోజనాలను గరిష్ఠంగా ఉండేట్లు చేసేందుకు ద్రవ్య అధికారులు తీసుకునే చర్యలన్నింటిని 'ద్రవ్య విధానంగా' (Monetary Policy) పరిగణించవలె. ఆర్థిక వ్యవస్థనే మార్చగల శక్తి ద్రవ్యానికి ఉంది. ద్రవ్యం ధరల స్థాయినే కాక ఉత్పత్తి, ఉద్యోగితా స్థాయిని కూడా ప్రభావితం చేయగలదు. ద్రవ్యం సప్లయ్, ప్రసార వేగం వస్తువుల కన్న డిమాండ్‌ను మార్చటం ద్వారా ధరల స్థాయినే మార్చగలవు. కనుక ద్రవ్యం ఉన్న ఆర్థిక వ్యవస్థలోనే ద్రవ్యోల్బణం వ్యాపార చక్రాలు ఏర్పడతాయి. అందుకే ద్రవ్యాన్ని మంచి సేవకుడు కాని, చెడ్డ యజమాని (Money is a good servant but

a bad master) అని వర్ణించటం కద్దు. ద్రవ్యాన్ని అదుపులో ఉంచకపోతే అది దాన్ని సృష్టించిన మానవుడిని హతమార్చగలదు. కనుక ద్రవ్య వ్యవస్థ సక్రమంగా పనిచేసేట్టు చూడటం ఎంతైనా అవసరం. ద్రవ్య వ్యవస్థను సక్రమంగా పని చేయించటంలో ద్రవ్య విధానం విశిష్టమైన పాత్ర నిర్వహిస్తుంది.

**ద్రవ్య విధాన లక్ష్యాలు (Objectives of Monetary Policy) :** మారకపు రేట్లను, ధరల స్థాయిని స్థిరంగా ఉండేట్లు చూడటం, ద్రవ్యోల్బణం ప్రతి ద్రవ్యోల్బణాలను నివారించే సంపూర్ణోద్యోగితను పరిరక్షించటం విదేశ చెల్లింపుల శేషంలో అనుకూలత ఉండేటట్లు చూడటం మొదలైనవి. ఆర్థికాభివృద్ధి సాధించటం ద్రవ్య విధానం లక్ష్యాలలో ప్రధానమైనవి. ఈ లక్ష్యాల సాధనకు తగిన ద్రవ్య విధానాన్ని రూపొందించి అమలు జరిపే బాధ్యత కేంద్ర బాంకుపై ఉంది.

**1. మారకపు రేట్ల సుస్థిరత (Stability of Exchange rates) :** చాలాకాలం వరకు మారకపు రేట్ల సుస్థిరతను సాధించటమే ద్రవ్య విధానం యొక్క ప్రధాన లక్ష్యంగా భావించబడేది. ఈ సుస్థిరతను సాధించే సాధనంగా స్వర్ణ ప్రమాణాన్ని (Gold standard) అంగీకరించటం జరిగింది. వ్యాపార వాణిజ్యాలకు ప్రాముఖ్యం వుండే ఆ రోజులలో అంతర్జాతీయ వ్యాపారం సాఫీగా సాగాలంటే మారకపు రేట్లు స్థిరంగా ఉండవలె.

విదేశ వ్యాపార చెల్లింపులలో లోటు ఉన్నప్పుడు ఆ లోటును బంగారంలో చెల్లించవలె. దానివల్ల బంగారం విదేశాలకు వెళ్లుతుంది. దేశంలో బంగారం నిల్వలు తగ్గి ద్రవ్యం సప్లయ్ కూడా తగ్గుతుంది. ద్రవ్యరాశితో పాటు పరపతి ద్రవ్యం కూడా తగ్గుతుంది. ఫలితంగా ధరలు స్థాయి తగ్గి ఎగుమతులు పెరుగుతాయి. దీంతో విదేశ వ్యాపార చెల్లింపులలో ఏర్పడిన ప్రాతికూల్యం (లోటు) పోయి అనుకూలత ఏర్పడి దేశం నుంచి బయటకు పోయిన బంగారం తిరిగి వస్తుంది. అలాగే విదేశ చెల్లింపుల్లో మిగులు ఉన్నప్పుడు విదేశాల నుంచి బంగారం దేశంలోకి వస్తుంది. దీనివల్ల ద్రవ్యం సప్లయ్ పెరుగుతుంది. ఫలితంగా ధరల స్థాయి కూడా పెరిగి ఎగుమతులు తగ్గుతాయి. దీంతో విదేశ వ్యాపార చెల్లింపులలో ఉన్న అనుకూలత (మిగులు) పోతుంది. ఈ విధంగా విదేశ వ్యాపార చెల్లింపుల్లో ఏర్పడే అసమతౌల్య విదేశ మారకపు రేటును మార్చకుండానే ద్రవ్య సప్లయ్ తద్వారా ధరల స్థాయిలో కలిగే మార్పుల వల్ల సరిదిద్దబడుతుంది.

మారకపు రేటు సుస్థిరతకు ప్రాధాన్యమిస్తే ఆర్థిక వ్యవస్థ ఒడుదుడుకులకు గురి అవుతుంది. దేశంలోకి బంగారం వచ్చినప్పుడు ద్రవ్యోల్బణం, దేశం నుంచి బంగారం పోయినప్పుడు ప్రతి ద్రవ్యోల్బణం ఏర్పడతాయి. ఈ ద్రవ్యోల్బణ ప్రతి ద్రవ్యోల్బణ

పరిస్థితులు ఒక దేశం నుంచి మరో దేశానికి వ్యాపిస్తాయి. ఈ విధంగా మారకం రేట్ల స్థిరీకరణ దేశంలో ధరలు, ఉత్పత్తి, ఉద్యోగితా స్థాయిల్లో అనూహ్యామైన పరిణామాలను తెస్తుంది. ఫలితంగా ఆర్థిక వ్యవస్థ స్థిరత్వాన్ని కోల్పోతుంది.

మారకపు రేటు సుస్థిరతను కాపాడే ద్రవ్య విధానం విదేశ వ్యాపారంచేసే వారికి రక్షణనిస్తూ దేశంలోని ఉత్పత్తిదార్లను కష్టనష్టాలకు గురి చేసింది. ఈ అనుభవం దృష్ట్యా మారకపు రేట్ల స్థిరత్వం కన్నా దేశంలోని ధరల స్థాయి సుస్థిరతే ముఖ్యమని అనేక దేశాలు గ్రహించాయి.

**2. ధరల స్థిరత్వం (Price Stability) :** 1931 నుంచి ఇంగ్లండ్, అమెరికా, స్వీడెన్ మొదలైన దేశాలు ధరల స్థిరీకరణను ప్రధాన లక్ష్యంగా ఎన్నుకున్నాయి. ఈ లక్ష్యం వల్ల ఏ దేశం కాదేశం ఇతర దేశాల ప్రమేయం లేకుండా స్వతంత్రంగా తన ఆర్థిక విధానాన్ని రూపొందించుకునే అవకాశం ఏర్పడింది. అయితే ధరల స్థిరీకరణ విధానంలో మూడు విభిన్న అభిప్రాయాలున్నాయి.

అవి : i) నెమ్మదిగా పెరుగుతుండే ధరలు

ii) క్రమేణా తగ్గుతుండే ధరలు.

iii) స్థిరంగా ఉండే ధరలు.

**i) నెమ్మదిగా పెరుగుతుండే ధరలు (Gently rising Price level) :** నెమ్మదిగా పెరుగుతూ ఉండే ధరల స్థాయి ఉండాలని కొందరి అభిప్రాయం. ఎందుకంటే పెరుగుతున్న ధరలవల్ల లాభాలు ఎక్కువగా ఉండి ఉత్పత్తి కార్యకలాపాలకు ప్రోత్సాహం లభిస్తుంది. ఉత్పత్తిదార్లు ఉత్పత్తిని పెంచుతారు. ఉత్పాదకాలకు పని ఏర్పడి ఆర్థిక వ్యవస్థ సంపూర్ణోద్యోగితా స్థాయిని చేరుకుంటుంది. కనుక పెరుగుతున్న ధరలద్వారానే ఆర్థిక పురోభివృద్ధిని సాధించవచ్చని వారి అభిప్రాయం. కాని ధరలు పెరుగుతుంటే కొన్ని దుష్ఫలితాలు కలుగుతాయి. పెరిగే ధరల వలన ఉత్పత్తికి వచ్చే ప్రోత్సాహం దీర్ఘకాలికంగా ఉండదు. మొదట్లో నెమ్మదిగా పెరుగుతున్న ధరలు క్రమేణ వేగం పుంజుకుని అతి ద్రవ్యోల్బణంగా మారే ప్రమాదం ఉంది. అతి ద్రవ్యోల్బణ మేర్పడినప్పుడు, ఉత్పత్తి దెబ్బతింటుంది. ఆదాయ పంపిణీలో మార్పు వస్తుంది. జాతీయాదాయంలో ఎక్కువ భాగం ధనిక వర్గాలకు చేరుతుంది. శ్రామికులు, స్థిర ఆదాయం తెచ్చుకునేవారు అనేక కష్టనష్టాలకు గురి అవుతారు.

**ii) క్రమేణా తగ్గుతుండే ధరలు (Gently Falling Price level) :** అభివృద్ధి చెందుతున్న ఆర్థిక వ్యవస్థలో ధరలు తగ్గుతుండాలని కొందరి అభిప్రాయం. ఆర్థిక పురోభివృద్ధి వల్ల కలిగే ప్రయోజనాలు సామాన్య ప్రజలు పొందాలంటే ధరలు తగ్గాలి.

సాంకేతిక ప్రగతి వలన ఉత్పత్తి వ్యయాలు తగ్గినప్పుడు ధరలు తగ్గకపోతే ఉత్పత్తిదార్ల లాభాలు పెరుగుతాయి. అయితే ధరలు తగ్గటంకూడ సమాజానికి శ్రేయస్కరం కాదు. ఎందుకంటే ధరలు తగ్గినప్పుడు ఉత్పత్తి, ఉద్యోగితా స్థాయి తగ్గే ప్రమాదం వుంది.

**iii) స్థిరంగా ఉండే ధరలు (Stable Price level) :** పెరుగుతూ వుండే ధరలు, తగ్గుతూ వుండే ధరలు రెండు కూడా హానికరం కావటం వల్ల ధరల స్థాయి స్థిరంగా ఉండేటట్లు చూడాలనే మూడో అభిప్రాయం వుంది. ధరలు స్థిరంగా వుంటే యజమానులు - శ్రామికులు, ఋణం ఇచ్చేవారు (creditors), పుచ్చుకునేవారు (debtors) వీరిమధ్య న్యాయం చేకూరి ఏ ఆర్థిక వర్గానికి నష్టం కలుగదు. అందువల్ల ధరలను స్థిరంగా ఉంచటమే ద్రవ్య విధానం యొక్క లక్ష్యంగా ఉండాలని వీరి అభిప్రాయం.

అయితే ధరల స్థిరీకరణలో కొన్ని సమస్యలున్నాయి. 1) ఏ ధరల - అంటే చిల్లర ధరలూ, టోకు ధరలూ, జీవన వ్యయమా, స్థిరీకరణ అనేది సమస్య. 2) అన్ని రకాల ధరల మార్పులు ఆర్థిక వ్యవస్థలో అస్థిరతను కలుగచేయవు. ఉదాహరణకు ఉత్పత్తి కారకాల ఉత్పాదన పెరిగిన ఫలితంగా ఉత్పత్తి వ్యయం తద్వారా ధరలు తగ్గుతాయి. ఈ తగ్గుదలను నివారిస్తే వేతనాన్ని పొందేవారు నష్టపోతారు. కనుక అన్ని రకాల ధరల స్థిరీకరణ అభిలషణీయం కాదు. పోతే ద్రవ్యరాశి, ఉత్పత్తి స్థాయిల్లోని మార్పుల వల్ల కలిగే ధరల మార్పులు మాత్రమే ప్రమాదంగా పరిణమిస్తాయి. వాటిని మాత్రమే అదుపు చేయవలసి ఉంటుంది.

ధరల స్థిరీకరణను సాధించటం కూడ సమస్యే. చలామణిలో వున్న పరపతిని స్థిరంగా ఉంచితే ధరలు అవే స్థిరంగా వుంటాయని కొందరి అభిప్రాయం. అయితే ద్రవ్యరాశిని స్థిరంగా వుంచినంతమాత్రాన ద్రవ్యానికుండే డిమాండ్ స్థిరంగా వుంటుందని చెప్పలేము. ద్రవ్య ప్రసారవేగం, ఉత్పత్తి వీటిలోని మార్పుల వల్ల ధరల స్థాయి మారుతుంది. కొందరు ఉత్పత్తి వ్యయం స్థిరంగా ఉండేటట్లు చేస్తే ధరల స్థాయి కూడ స్థిరంగా ఉండగలదని అంటారు. మొత్తంమీద దరల స్థాయిని స్థిరంగా ఉంచటం ఒక పెద్ద సమస్య.

**3. తటస్థ ద్రవ్య విధానం (Neutral Money Policy) :** స్థిరమైన ధరల స్థాయిలో ఉండే సమస్యల దృష్ట్యా వాన్‌హేయక్ (Von Hayek) తటస్థ ద్రవ్య విధానాన్ని ప్రతిపాదించాడు. ద్రవ్యం తటస్థంగా ఉండాలని, దాన్ని ప్రవేశపెట్టినందువల్ల కొత్త పరిణామాలేవీ ఉండకూడదని అతడు అంటాడు. వస్తుమార్పిడి విధానం (Barter System) ఉంటే, ఉండే మార్పిడి రేట్లు ద్రవ్యంలో కూడ ఉండేట్లుగా ద్రవ్య విధానాన్ని రూపొందించాలి. అప్పుడే ద్రవ్యం తటస్థంగా ఉంటుందని హేయక్ అభిప్రాయం. కాని

ఆధునిక ఆర్థిక వ్యవస్థలో ఇది అసాధ్యం. అంతేగాక సంపూర్ణోద్యోగితను, ఆర్థిక వృద్ధిని సాధించటానికి ఇది తోడ్పడదు.

**4. వ్యాపార చక్రాలను అదుపులో ఉంచటం :** వ్యాపార చక్రాలు సంభవించటమనేది పెట్టుబడిదారీ ఆర్థిక వ్యవస్థయొక్క లక్షణాలలో ఒకటి. వీటిని నివారించటం ద్రవ్య విధానంయొక్క లక్ష్యంగా ఉండాలి. బాంకు రేటు, ఓపెన్ మార్కెట్ వ్యవహారాలద్వారా వ్యాపార చక్రాలను నివారించవచ్చు. అయితే ఈ సాధనాలద్వారా ద్రవ్యోల్బణాన్ని అదుపు చేయవచ్చేమో గాని, ఆర్థిక మంద్యం నుంచి పునరుజ్జీవనాన్ని ప్రేరేపించటం అంత సులువైన పని కాదు. అందుకే కీన్సు ఆర్థిక మాంద్యాన్ని నివారించటానికి కోశ విధానానికి ప్రాముఖ్యాన్నిస్తాడు అసలు ద్రవ్య విధానం, కోశ విధానాలు రెండు పరస్పర పూరకాలు. అవి ఒకదానికొకటి మద్దతుగా ఉండాలి.

**5. సంపూర్ణోద్యోగిత (Full Employment) :** 1929 - 34 సంవత్సరాల మధ్య ఏర్పడిన ఆర్థిక మాంద్య కాలంలో ధరల స్థాయి ఎంతగానో పడిపోయి నిరుద్యోగం భయంకర రూపం దాల్చింది. అన్ని దేశాల్లోను దారిద్ర్యం విలయతాండవం చేసింది. ఈ ఆర్థిక మాంద్యం - సంపూర్ణోద్యోగిత ఆర్థిక వ్యవస్థయొక్క సర్వసాధారణ స్థితి అని భావించే ఆర్థికవేత్తలను కలవరపరచింది. జె. యం. కీన్సు కృషి ఫలితంగా ఆర్థిక విశ్లేషణలో విప్లవాత్మకమైన మార్పులు వచ్చాయి. జాతీయోత్పత్తిని గరిష్టం చేసి సంపూర్ణోద్యోగితను సాధించటమే ద్రవ్య విధానంయొక్క ప్రధాన లక్ష్యం అయింది. ఆర్థిక వ్యవస్థ ద్రవ్యోల్బణానికి, ఆర్థిక మాంద్యానికి గాని గురి కాకూడదనే దృఢ నిశ్చయ మేర్పడింది. వ్యాపార చక్రాలవల్ల కలిగే ఆటుపోట్లను నివారించి ఆర్థిక వ్యవస్థయొక్క సంపూర్ణోద్యోగిత స్థితిని పరిరక్షించటానికి అన్ని దేశాలు సంసిద్ధమయ్యాయి.

సమష్టి డిమాండ్ ఉద్యోగితా స్థాయిని నిర్ణయించే శక్తిగా కీన్సు పేర్కొన్నాడు. కాగా సమష్టి డిమాండ్‌ను నిర్ణయించేది వినియోగ వ్యయం, పెట్టుబడి వ్యయం. వినియోగ వ్యయాన్ని మార్చటం కష్టం. కనుక సమష్టి డిమాండ్‌ను పెట్టుబడి వ్యయమే ప్రభావితం చేయవలె. ద్రవ్యం సప్లయ్‌ని పెంచటంద్వారా వడ్డీ రేట్లు తగ్గించేస్తే పెట్టుబడి వ్యయం పెరిగి సమష్టి డిమాండ్ తద్వారా ఆదాయ, ఉద్యోగితా స్థాయిలు పెరుగుతాయి. ఈ విధంగా ద్రవ్య విధానం సంపూర్ణోద్యోగితను సాధించేదిగా ఉండవలెను.

అయితే సంపూర్ణోద్యోగిత ఒక్క ద్రవ్య విధానంద్వారా మాత్రమే సాధించబడదు. ముఖ్యంగా ఆర్థిక మాంద్య పరిస్థితుల్లో కోశ విధానం (Fiscal Policy) పై కూడా ఆధారపడవలసి వస్తుంది.

**6. విదేశ వ్యాపార చెల్లింపుల్లో లోటును నివారించటం :** విదేశ వ్యాపార చెల్లింపుల్లో లోటును నివారించటం అన్ని ఆర్థిక వ్యవస్థల లక్ష్యం. ఈ లక్ష్యాన్ని సాధించటానికి ద్రవ్య విధానాన్ని ఉపయోగించవలెను.

విదేశ వ్యాపార చెల్లింపుల్లో లోటు ఏర్పడినప్పుడు బాంకు రేటును పెంచితే దేశంలో వడ్డీ రేట్లు పెరిగి విదేశీ మూలధనం దేశంలోకి ఆకర్షింపబడుతుంది. ఫలితంగా విదేశీ చెల్లింపుల్లోని ప్రాతికూల్యం తొలగిపోతుంది. అయితే దేశంలో ఆర్థిక సుస్థిరత ఉండి విదేశీ మూలధనాన్ని ఆకర్షించగలిగినప్పుడే యిది సాధ్యమౌతుంది.

**7. ఆర్థికాభివృద్ధి (Economic Development) :** వెనుకబడిన దేశాల్లో ఆర్థికాభివృద్ధిని సాధించటం ద్రవ్య విధానంయొక్క ప్రధాన లక్ష్యం. ఈ దేశాల్లో మూలధనం కొరత ఆర్థికాభివృద్ధికి ఒక అడ్డంకి (obstacle). కనుక ఈ దేశంలో పొదుపును ప్రోత్సహించేది గాను, విదేశీ మూలధనాన్ని ఆకర్షించేదిగాను ద్రవ్య విధానం ఉండవలెను. అంటే అభివృద్ధి కార్యకలాపాలకు అవసరమైన ద్రవ్య వనరులను సమకూర్చుకోవటానికి ప్రభుత్వం చేసే కృషికి ద్రవ్య విధానం తోడ్పడవలెనన్న మాట. ఇందుకుగాను ద్రవ్య విధానంలో క్రింది అంశాలు చేరి ఉండవలెను.

i) ప్రభుత్వ ఋణ సేకరణ విజయవంతమయేందుకుగాను ద్రవ్య సప్లయ్‌లోను వడ్డీరేట్లలోను మార్పులను తేవటం.

ii) ప్రణాళికా కార్యక్రమాలేవి నిధుల కొరత కారణంగా నిలిచిపోకుండా చూడటం.

iii) అన్ని రంగాలకు నిధులను సప్లయ్ చేసేందుకు అవసరమైన ద్రవ్య సంస్థలను నెలకొల్పి, వాటికి తగిన నిధులు సమకూరేట్లు చేయడం.

iv) ద్రవ్యోల్బణ పరిస్థితులేర్పడకుండా చూడటం.

v) స్పెక్యులేషన్ కార్యకలాపాలకు బాంకు పరపతిని మరల్చకుండా చూడటం.

vi) దేశ శ్రేయస్సు దృష్ట్యా ప్రాధాన్యం గల రంగాలకు బాంకు పరపతి ఉపయోగపడేట్లు చూడటం.

పైన చర్చించినవే కాక విదేశ వ్యాపార చెల్లింపుల శేషం అనుకూలంగా ఉండేటట్లు చూడటం. అంతర్జాతీయ ద్రవ్య సహకారాన్ని పెంపొందించటం మొదలైనవి కూడా ద్రవ్య విధానం లక్ష్యాలే. అభివృద్ధి చెందిన దేశాల్లో ద్రవ్య విధానం ఈ లక్ష్యాలన్నింటిని సాధించటానికి కృషి చేస్తుంది. అయితే ఈ లక్ష్యాలన్నింటి మధ్య సమతూకాన్ని సాధించటంలోనే ద్రవ్య విధానం యొక్క విజయం వుంటుంది.

ద్రవ్య విధానంపై పరిమితులు :

1. ఆర్థిక కార్యకలాపాల స్థాయిని నిర్ణయించే అంశాలలో ద్రవ్యేతరమైనవి అనేకం వున్నాయి. వాటిని ద్రవ్య విధానం ప్రభావితం చేయలేదు.

2. ఆర్థిక మాంద్యంలో ద్రవ్య విధానం పెట్టుబడి పెరిగేట్లుగా చేయలేదు. కేంద్ర బాంకు వడ్డీరేటు తగ్గించినప్పటికి వ్యాపార పరిస్థితులు నిరాశాజనకంగా ఉంటాయి. కనుక పెట్టుబడి ప్రోత్సహింపబడదు.

3. ద్రవ్యోల్బణ కాలంలో వ్యాపార పరిస్థితులు ఆశాజనకంగా ఉండటంతో కేంద్ర బాంకు ఎన్ని పరపతి నియంత్రణ చర్యలను తీసుకున్నప్పటికి ఫలించక పోవచ్చు.

4. ద్రవ్య విధానంద్వారా ద్రవ్యం, పరపతి సప్లయ్‌లలో మార్పులను తలపెట్టినప్పటికి ద్రవ్య ప్రసారవేగంలో వచ్చే మార్పులవల్ల అవి ఫలించకపోవచ్చు.

5. పరపతి నియంత్రణ సాధనాలన్నీ కొన్ని పరిమితులకు లోబడి వున్నాయి. అందువల్ల వాటి అమలు ద్వారా ఆశించిన ఫలితాలు రాకపోవచ్చు.

6. ఆర్థిక వ్యవస్థలో సరళత్వం (Flexibility) లోపిస్తే ద్రవ్య విధానం విజయవంతంకాదు.

1921-24 సంవత్సరాల మధ్య జర్మనీలో ఏర్పడిన అతి ద్రవ్యోల్బణాన్ని (Hyper Inflation), 1930 తర్వాతి కాలంలో ప్రపంచవ్యాప్తంగా ఏర్పడిన ఆర్థిక మాంద్యాన్ని ఏ ద్రవ్య విధానం నివారించలేకపోయింది. ఈ అనుభవం దృష్ట్యా ద్రవ్య విధానం ఒక్కటే ఆర్థిక స్థిరత్వాన్ని సాధించలేదని తేలింది. దాంతో ద్రవ్య విధానంలో నమ్మకం తగ్గింది. ఆ పరిస్థితులలో కీన్సు కోశ విధానాన్ని సమర్థించాడు. అయితే 1950 తర్వాత తిరిగి ద్రవ్య విధానం ప్రాముఖ్యంలోకి వచ్చింది. ద్రవ్యోల్బణాన్ని కాని, ఆర్థిక మాంద్యాన్ని కాని నివారించే ప్రయత్నంలో ద్రవ్య విధానంతో కోశ విధానాన్ని జోడించవలసిన ఆవశ్యకత గుర్తించబడింది.



# అధ్యాయము 18

# ద్రవ్యోల్బణము - పన్నులు

**ప్రశ్న 1) ద్రవ్యోల్బణము అనగానేమి? ద్రవ్యోల్బణ రకాలను తెలపండి.**

జవాబు : ద్రవ్యోల్బణము అంటే పెరుగుతున్న ధరలు కాని, హెచ్చు ధరలు కాదు. ధరలు పెరుగుతూ వుండే ప్రక్రియను"ద్రవ్యోల్బణము" అంటారు. 'ఇర్వింగ్ ఫిషర్' ప్రకారంగా "వస్తు సేవలు కొనుటకు ఉపయోగించబడే ద్రవ్యరాశి లభ్యమయ్యే వస్తువులకన్నా ఎక్కువగా పెరగడాన్ని "ద్రవ్యోల్బణము" అంటాము. 'పిగూ' అనే ఆర్థికశాస్త్రవేత్త ప్రకారముగా "వాస్తవిక ఆదాయము పెరుగుదల కన్నా, ద్రవ్య ఆదాయాలు ఎక్కువగా పెరగడాన్ని "ద్రవ్యోల్బణము" అంటాము.

హాట్రే (Hawtrey) అను ఆర్థిక శాస్త్రవేత్త ప్రకారము "కరెన్సీ నోట్లను అధికంగా జారీ చేయటాన్నే ద్రవ్యోల్బణమందురు".

కాల్ బోర్న్ (Coulborn) ప్రకారము "ద్రవ్యోల్బణమనగా తక్కువ వస్తురాశిని ఎక్కువ ద్రవ్యరాశి తరమటము".

కిమ్మరర్ (Kemmerer) అను ఆర్థిక శాస్త్రవేత్తప్రకారము "వ్యాపార అవసరాలకు మించి కరెన్సీ ఉండటాన్నే ద్రవ్యోల్బణమందురు".

క్రౌథర్ (Crowther) అను ఆర్థిక శాస్త్రవేత్త ప్రకారము "ద్రవ్య విలువ పడిపోవడం అనగా ధరలు పెరగడాన్ని ద్రవ్యోల్బణమని చెప్పవచ్చును".

పై నిర్వచనాలను బట్టి వస్తువులకు డిమాండు సప్లయిలలో అసమతౌల్యము ఏర్పడటము వలన ధరల స్థాయి పెరుగుతుందని తెలుస్తుంది.

ద్రవ్యోల్బణము - రకాలు :

1) **Semi Inflation** : ఆర్థిక వ్యవస్థలో ఉత్పత్తి ఒక స్థాయి దాటిన తరువాత కొన్ని వనరుల సప్లయి పూర్తి అవ్యాకోచముగా మారటము వల్ల ఉత్పత్తి పెంచటానికి ప్రతిబంధకాలు ఏర్పడి ఉత్పత్తి వ్యయము పెరుగుతుంది. ఉత్పత్తి వ్యయము పెరిగిన కారణముగా ఏర్పడే ధరల పెరుగుదలను "Semi Inflation" గా 'కీన్స్' పేర్కొన్నాడు.

2) **వాస్తవిక ద్రవ్యోల్బణము** : సంపూర్ణ ఉద్యోగితా స్థాయి వచ్చిన తరువాత ఉత్పత్తిని పెంచుటకు వీలుకాదు. సంపూర్ణ ఉద్యోగితా స్థితి వద్ద సప్లయి రేఖ పూర్తి అవ్యాకోచముగా ఉంటుంది. అప్పుడు సమష్టి డిమాండు పెరిగినట్లు అయితే ధరలు పెరుగుతాయి. దీనిని కీన్స్ వాస్తవిక ద్రవ్యోల్బణముగా వర్ణించినాడు.

**3) మరుగునపడిన ద్రవ్యోల్బణము :** ధరలు పెరగకుండా ప్రభుత్వము వాటిపై కంట్రోల్స్, రేషనింగ్ మొదలగు చర్యలను విధించి ధరలను అణచి పెట్టినట్లు అయితే దీనిని "మరుగునపడిన ద్రవ్యోల్బణము" అంటారు.

**4) అతి ద్రవ్యోల్బణము :** ధరల పెరుగుదల నిరాటంకముగా కొనసాగుతూ ధరలు ఆకాశాన్ని అంటుతుంటే దీనిని "అతి ద్రవ్యోల్బణము" అంటారు. అటువంటి పరిస్థితులలో ద్రవ్యము విలువ పూర్తిగా తగ్గిపోతుంది. ద్రవ్యాన్ని వస్తు రూపంలోకి మార్చటానికి ప్రయత్నిస్తుంటారు. అప్పుడు ద్రవ్య ప్రసారవేగం పెరుగుతుంది. వేతన, ధరలు వర్తకము ఏర్పడిన ధరలు అతిగా పెరుగుతాయి. దీనినే "అతి ద్రవ్యోల్బణము" అంటారు.

**5) Creeping Inflation :** ధరలు నిదానముగా పెరుగుతుంటే దానిని "క్రీపింగ్ ఇన్‌ఫ్లేషన్" అంటారు. అటువంటి ద్రవ్యోల్బణము హానికరము కాదని కొందరు ఆర్థికవేత్తల అభిప్రాయము.

**ప్రశ్న 2) స్టాగ్ ఫ్లేషన్ అనగానేమి ?**

జవాబు : సాధారణంగా ధర పెరుగుదల ఉత్పత్తిని, ఉద్యోగితను పెంచుతుంది. కాని ఒకవైపు ధరలు పెరుగుతూ ఉండి, మరియొక వైపు ఉత్పత్తి తగ్గుదల, పారిశ్రామికాభివృద్ధి లేకపోవడము- ఉన్నట్లు అయితే ఈ పరిస్థితిని "స్టాగ్ ఫ్లేషన్" అంటారు. ఇటువంటి పరిస్థితి ఇప్పుడు మనదేశములో ఉన్నదని చెప్పవచ్చు. ఇటువంటి పరిస్థితి వ్యయప్రేరిత ద్రవ్యోల్బణము వలన ఏర్పడవచ్చు. వేతనాలు ఉత్పాదకతను మించి పెరగడము, ముడి పదార్థాల ధరలు పెరగడము, ఏకస్వామ్యాలు పెరగడము మొదలగు కారణాల వలన ఉత్పత్తి వ్యయాలు పెరిగి ధరలు పెరుగుతాయి. ఇటువంటి ధరల పెరుగుదల ఉత్పత్తిని ప్రోత్సహించదు.

**ప్రశ్న 3) ద్రవ్యోల్బణ సిద్ధాంతాలను తెల్పుము.**

**జవాబు :** ద్రవ్యోల్బణము ఏర్పడటానికి మూడు కారణాలను ఆర్థికవేత్తలు పేర్కొన్నారు.

1) సమష్టి డిమాండ్ సమష్టి సప్లయ్‌ని మించి ఉన్నప్పుడు ద్రవ్యోల్బణం ఏర్పడుతుంది. దీనిని "డిమాండు ప్రేరిత ద్రవ్యోల్బణము" అంటారు.
2) వేతనాలు పెరగటం వల్లగానీ, మరి ఏ ఇతర కారణం వల్లకాని ఉత్పత్తి వ్యయం పెరిగి ధరలు పెరుగవచ్చును. ఈవిధంగా ఏర్పడే ద్రవ్యోల్బణాన్ని "వ్యయప్రేరిత ద్రవ్యోల్బణము" అని అంటారు.

3) సమష్టి డిమాండులోని పెరుగుదల, ఉత్పత్తి వ్యయంలోని పెరుగుదల వల్ల ద్రవ్యోల్బణము ఏర్పడుతుంది. దానిని "మిశ్రమ ద్రవ్యోల్బణము" అంటారు.

**1) డిమాండ్ ప్రేరిత ద్రవ్యోల్బణము :** సమష్టి డిమాండు సమష్టి సప్లయి కన్నా ఎక్కువగా ఉన్నందువల్ల ఏర్పడే ద్రవ్యోల్బణాన్ని "డిమాండు ప్రేరిత ద్రవ్యోల్బణము" అంటారు. సమష్టి డిమాండు సప్లయి కన్నా ఎందువలన ఎక్కువ అవుతుంది అనే విషయంపై రెండు అభిప్రాయాలు ఉన్నాయి.

**A)** ద్రవ్యరాశి ఎక్కువగా పెరిగినప్పుడు సమష్టి సప్లయి కన్నా సమిష్టి డిమాండు ఎక్కువగా ఉంటుంది.

**B)** పెట్టుబడి పొదుపు కన్నా ఎక్కువగా ఉన్నప్పుడు సమష్టి డిమాండు సమష్టి సప్లయి కన్నా ఎక్కువగా ఉంటుంది.

కీన్స్ ఆదాయ వ్యయ ధరల సిద్ధాంతము డిమాండు ప్రేరిత ద్రవ్యోల్బణాన్ని విశ్లేషణ చేసి వివరిస్తుంది. పెట్టుబడి వ్యయం పొదుపును మించి ఉన్నప్పుడు సమష్టి డిమాండు స్థాయి పెరుగుతుంది. ఆర్థిక వ్యవస్థ సంపూర్ణ ఉద్యోగితా స్థాయిని చేరుకొన్న తరువాత సమష్టి డిమాండు పెరిగినట్లయితే ఉత్పత్తిని పెంచటానికి వీలుండదు. కనుక ధరల స్థాయి పెరుగుతుంది. ఆర్థిక వ్యవస్థ సంపూర్ణ ఉద్యోగితా స్థాయి చేరుకోగానే సప్లయి రేఖ పూర్తి అవ్యాకోచంగా మారుతుంది. అప్పుడు సమష్టి డిమాండు పెరిగిన అనుపాతంలోనే ధరలు పెరుగుతాయి. దీనిని వాస్తవమైన ద్రవ్యోల్బణముగా 'కీన్స్' వర్ణించాడు.

**డిమాండు ప్రేరిత ద్రవ్యోల్బణము :** డిమాండు ప్రేరిత ద్రవ్యోల్బణాన్ని ఈ క్రింది పటంలో చూపినాము.




పై పటంలో ఉత్పత్తి స్థిరంగా యుండి డిమాండు పెరిగే కొద్దీ ధరల స్థాయి పెరుగుతుంది. కనుక దీనిని "డిమాండు ప్రేరిత ద్రవ్యోల్బణము" అంటారు.

3) సమష్టి డిమాండులోని పెరుగుదల, ఉత్పత్తి వ్యయంలోని పెరుగుదల వల్ల ద్రవ్యోల్బణము ఏర్పడుతుంది. దానిని "మిశ్రమ ద్రవ్యోల్బణము" అంటారు.

**1) డిమాండ్ ప్రేరిత ద్రవ్యోల్బణము :** సమష్టి డిమాండు సమష్టి సప్లయి కన్నా ఎక్కువగా ఉన్నందువల్ల ఏర్పడే ద్రవ్యోల్బణాన్ని "డిమాండు ప్రేరిత ద్రవ్యోల్బణము" అంటారు. సమష్టి డిమాండు సప్లయి కన్నా ఎందువలన ఎక్కువ అవుతుంది అనే విషయంపై రెండు అభిప్రాయాలు ఉన్నాయి.

**A)** ద్రవ్యరాశి ఎక్కువగా పెరిగినప్పుడు సమష్టి సప్లయి కన్నా సమిష్టి డిమాండు ఎక్కువగా ఉంటుంది.

**B)** పెట్టుబడి పొదుపు కన్నా ఎక్కువగా ఉన్నప్పుడు సమష్టి డిమాండు సమష్టి సప్లయి కన్నా ఎక్కువగా ఉంటుంది.

కీన్స్ ఆదాయ వ్యయ ధరల సిద్ధాంతము డిమాండు ప్రేరిత ద్రవ్యోల్బణాన్ని విశ్లేషణ చేసి వివరిస్తుంది. పెట్టుబడి వ్యయం పొదుపును మించి ఉన్నప్పుడు సమష్టి డిమాండు స్థాయి పెరుగుతుంది. ఆర్థిక వ్యవస్థ సంపూర్ణ ఉద్యోగితా స్థాయిని చేరుకొన్న తరువాత సమష్టి డిమాండు పెరిగినట్లయితే ఉత్పత్తిని పెంచటానికి వీలుండదు. కనుక ధరల స్థాయి పెరుగుతుంది. ఆర్థిక వ్యవస్థ సంపూర్ణ ఉద్యోగితా స్థాయి చేరుకోగానే సప్లయి రేఖ పూర్తి అవ్యాకోచంగా మారుతుంది. అప్పుడు సమష్టి డిమాండు పెరిగిన అనుపాతంలోనే ధరలు పెరుగుతాయి. దీనిని వాస్తవమైన ద్రవ్యోల్బణముగా 'కీన్స్' వర్ణించాడు.

**డిమాండు ప్రేరిత ద్రవ్యోల్బణము :** డిమాండు ప్రేరిత ద్రవ్యోల్బణాన్ని ఈ క్రింది పటంలో చూపినాము.




పై పటంలో ఉత్పత్తి స్థిరంగా యుండి డిమాండు పెరిగే కొద్దీ ధరల స్థాయి పెరుగుతుంది. కనుక దీనిని "డిమాండు ప్రేరిత ద్రవ్యోల్బణము" అంటారు.

డిమాండు ప్రేరిత ద్రవ్యోల్బణాన్ని నివారించటానికి సమష్టి డిమాండ్‌ను తగ్గించవలెను. ద్రవ్య విధానము, బడ్జెట్ విధానం ద్వారా ప్రభుత్వము సమష్టి డిమాండ్‌ను తగ్గించి తద్వారా ధరల పెరుగుదలను అదుపులో ఉంచటానికి ప్రయత్నిస్తుంది.

**2) వ్యయప్రేరిత ద్రవ్యోల్బణము :** 1950కి పూర్వం సమష్టిడిమాండు ఏర్పడుతుందనే అభిప్రాయం ఉండేది. 1950 సం॥ము నుండి వ్యయ ప్రేరిత ద్రవ్యోల్బణ సిద్ధాంతము అర్థికవేత్తల దృష్టిని ఆకర్షించింది. దీనినే "ఆధునిక ద్రవ్యోల్బణ సిద్ధాంతం" అని అంటారు. సమష్టి డిమాండు స్థిరంగా ఉన్నప్పటికి ఉత్పత్తి వ్యయం వల్లనే ద్రవ్యోల్బణము పెరగడం వలన ధరల స్థాయి పెరుగుతుందని వారి అభిప్రాయం. వారు ఉత్పత్తి వ్యయాలు పెరగటానికి రెండు కారణాలను పేర్కొన్నారు.

1. కార్మిక వేతనాలు వారి ఉత్పాదకత కన్నా ఎక్కువగా పెరుగుట.
2. ఏకస్వామ్యాలు ప్రబలుట.

మొదటి కారణం వలన ఏర్పడే ద్రవ్యోల్బణాన్ని "వేతన ప్రేరిత ద్రవ్యోల్బణం" అంటారు. రెండవ కారణం వలన ఏర్పడే ద్రవ్యోల్బణాన్ని "లాభ ప్రేరిత ద్రవ్యోల్బణం" అని అంటారు.

**వ్యయ ప్రేరిత ద్రవ్యోల్బణము :** వ్యయప్రేరిత ద్రవ్యోల్బణమును ఈ క్రింది పటలో చూపినాము.




ఉత్పత్తి వ్యయం పెరిగే కొద్దీ ఉత్పత్తిదారుడు ఉత్పత్తిని తగ్గిస్తాడు. అందువలన మార్కెట్‌లో సప్లయి తగ్గి ధరల స్థాయి పెరుగుతుంది. కనుక ఉత్పత్తి వ్యయం పెరగటం వల్ల ధరల స్థాయిలో వచ్చే పెరుగుదలను "వ్యయప్రేరిత ద్రవ్యోల్బణము" అంటారు. దీనిని పై పటంలో చూపినాము. సప్లయి తగ్గే కొద్దీ ధరల స్థాయి P నుంచి $P_1$ కు అలాగే $P_2$కు పెరిగింది.

వ్యయప్రేరిత ద్రవ్యోల్బణ సిద్ధాంతాన్ని ప్రతిపాదించిన ఆర్థికవేత్తలలో "మాల్థస్, సిడ్జివిక్" ముఖ్యులు. ద్రవ్యోల్బణం ఎప్పుడు ఏర్పడిన అది వ్యయ ప్రేరితమైనవేనని వారి అభిప్రాయము. ఆధునిక ఆర్థిక వ్యవస్థలో ఆర్థికశక్తి కేంద్రీకరణ హెచ్చుగా ఉంటున్నది. ఒకవైపు ఏకస్వామ్యాలు అధిక లాభాల కోసం అధిక ధరలను నిర్ణయిస్తూ ఉంటాయి. ఉత్పత్తి వ్యయం పెరగగానే ఉత్పత్తిదారులు వస్తువుల ధరలను పెంచుతారు. సమష్టి డిమాండ్‌ను తగ్గించే విధానాలు వ్యయ ప్రేరిత ద్రవ్యోల్బణాన్ని నివారించలేవు.

**3)మిశ్రమ ద్రవ్యోల్బణం :** "చార్లెస్ షుల్జ్" అనే ఆర్థికవేత్త మిశ్రమ ద్రవ్యోల్బణమును ప్రతిపాదించినారు. సమష్టి డిమాండు అధికంగా లేకపోయినప్పటికి డిమాండ్ నిర్మాణంలోని మార్పుల వల్ల ద్రవ్యోల్బణం ఏర్పడుతుందని ఆయన అభిప్రాయము. ఆయన సిద్ధాంతము రెండు ప్రమేయాలపై ఆధారపడియున్నది.

1. డిమాండు పెరిగిన ధరలు, వేతనాలు పెరుగుతాయి. డిమాండు తగ్గినప్పుడు అవి తగ్గే లక్షణాలు కల్గియుండవు.
2. ఆర్థిక వనరులు క్షీణిస్తున్న పరిశ్రమల నుంచి అభివృద్ధి చెందుతున్న పరిశ్రమలలోనికి త్వరితగతిన మారవు.

వినియోగదారుల అభిరుచులు మారుతూ ఉంటాయి. కొన్ని వస్తువులకు డిమాండు పెరుగుతుంది. మరికొన్ని వస్తువులకు డిమాండు తగ్గుతుంది. డిమాండు పెరిగిన వస్తువులకు ధరలు పెరుగుతాయి. ఇది డిమాండు ప్రేరిత ద్రవ్యోల్బణము. అభివృద్ధి చెందుతున్న పరిశ్రమలలో శ్రామికులకు డిమాండు పెరుగుతుంది. అందువలన ఆ పరిశ్రమలలో వేతనాలు పెరుగుతాయి. అందువల్ల ఉత్పత్తి వ్యయం పెరిగి ధరలు పెరుగుతాయి. దీనిని "వ్యయప్రేరిత ద్రవ్యోల్బణం" అంటారు. ముందుగా డిమాండు ప్రేరిత ద్రవ్యోల్బణము ఏర్పడి తత్ఫలితంగా వ్యయప్రేరిత ద్రవ్యోల్బణము ఏర్పడుతుంది. అందుచేత ఈ రెండింటిని కలిపి మిశ్రమ ద్రవ్యోల్బణముగా పేర్కొన్నారు.

**ప్రశ్న 4) ద్రవ్యోల్బణ కారణాలను, ఫలితాలను తెలిపి, నివారణ చర్యలను పేర్కొనుము.**

**లేదా**

**ద్రవ్యోల్బణ ఆర్థిక ప్రభావములు వివరింపుము, దానిని నివారించు పద్ధతులేవి?**

**జవాబు :** 'ద్రవ్యోల్బణం' అంటే ధరలు పెరుగుతూ ఉండే ప్రక్రియ కాని, హెచ్చు ధరలు ఉన్న స్థితి కాదు. అదే విధంగా ప్రతి ద్రవ్యోల్బణం అంటే ధరలు తగ్గుతూ ఉండే ప్రక్రియ అని చెప్పవచ్చు. ధరలు పెరుగుతూ ఉంటే ద్రవ్యం విలువ క్షీణిస్తుంది. అంటే

ద్రవ్యోల్బణ కాలంలో ద్రవ్యం విలువ క్షీణిస్తుంది. అదే విధంగా ప్రతి ద్రవ్యోల్బణ కాలంలో ద్రవ్యం విలువ పెరుగుతుంది.

నిర్వచనాలు : ద్రవ్యోల్బణాన్ని అనేకమంది ఆర్థికవేత్తలు అనేక రకాలుగా నిర్వచించినారు. 'హాట్రే' ప్రకారము **'కరెన్సీ నోట్లను అధికంగా జారీ చేయటమే ద్రవ్యోల్బణం', 'తక్కువ వస్తురాశిని హెచ్చు ద్రవ్యరాశి తరమటమే ద్రవ్యోల్బణం'** అని కాల్ బోర్న్ నిర్వచించినాడు. **'వస్తుసేవలను కొనడానికి ఉపయోగింపబడే ద్రవ్యరాశి పరిమాణం అందుబాటులో ఉన్న వస్తురాశి కంటే త్వరితగతిని పెరగడం వల్ల ద్రవ్యోల్బణం ఏర్పడుతుంది'** అని 'ఇర్వింగ్ ఫిషర్' అన్నాడు.

పై నిర్వచనాలన్నీ మొత్తంమీద ఆదాయ ప్రవాహానికి, వస్తుసేవల ప్రవాహానికి మధ్య అసమతౌల్యం ఏర్పడితే ద్రవ్యోల్బణం ఏర్పడుతుందని చెబుతున్నాయి. అంటే ద్రవ్యరాశిలోని పెరుగుదల వల్ల ద్రవ్యోల్బణం ఏర్పడుతుందన్న మాట.

**ద్రవ్యోల్బణానికి కారణములు :**

**1. జనాభా పెరుగుదల :** సాధారణంగా ద్రవ్యోల్బణము వస్తువులకు డిమాండు పెరుగుట వలన గాని సప్లయి తక్కువగా ఉండుట వలన గాని ఏర్పడును. దేశంలో జనాభా పెరుగుదల ఎక్కువగా ఉండుట వలన వస్తువులకు డిమాండ్ పెరిగి ధరలు పెరుగును. ఉదాహరణకు భారతదేశంలో 1901 సం॥లో 23.6 కోట్ల జనాభా ఉండగా ఈ జనాభా 1991 నాటికి 84.4 కోట్లకు పెరిగినది. ఈ విధంగా జనాభా పెరుగుదల అధికంగా ఉండుట వలన వస్తువులకు డిమాండ్ పెరిగి ద్రవ్యోల్బణము ఏర్పడును.

**2. పెట్టుబడి పెరుగుదల :** వివిధ ఉత్పత్తి కార్యకలాపాలలో పెట్టుబడులు విపరీతంగా పెరుగుట వలన కూడా ధరలు పెరుగును. పెట్టుబడి వలన వస్తు సప్లయ్ త్వరితగతిన జరుగును. గాని వస్తువులకు డిమాండ్ త్వరితగతిన పెరుగును. ఉత్పత్తి కార్యకలాపాలలో ఫలనకాలం ఉండును కనుక వస్తూత్పత్తి వెంటనే జరుగదు. కాని పెట్టుబడి ప్రభావం డిమాండు పైన వెంటనే ఉండును. పెట్టుబడి పెరుగుట వలన ప్రజల ఆదాయం పెరిగి వస్తువులకు డిమాండు పెరుగును. కనుక స్వల్పకాలంలో ద్రవ్యోల్బణము ఏర్పడును.

**3. ద్రవ్య సప్లయి పెరుగుదల :** ద్రవ్యోల్బణము ఏర్పడుటకు మరియొక ముఖ్య కారణము ద్రవ్య సప్లయి పెరుగుట. ద్రవ్య సప్లయి పెరుగుట వలన ప్రజల కొనుగోలు శక్తి పెరిగి తద్వారా వస్తువులకు డిమాండ్ పెరిగి ధరల పెరుగుదలకు దారితీయును. ఉదా॥ 1970-71 సంవత్సరములో ప్రజల దగ్గరుండే ద్రవ్య సప్లయి 4,371 కోట్ల రూ॥లు. ఈ ద్రవ్య సప్లయి 1993-94 సంవత్సరానికి 82,198 కోట్ల రూపాయలకు పెరిగినది. ఈ విధంగా ద్రవ్య సప్లయి పెరుగుట వలన వస్తువులకు డిమాండు పెరిగి ద్రవ్యోల్బణమేర్పడును.

**4. లోటు బడ్జెట్ :** ప్రభుత్వ ఆదాయం కంటే ప్రభుత్వ వ్యయం ఎక్కువగా ఉన్న దానిని పూరించుటకు ప్రభుత్వము అనేక విధానములను అనుసరించి ద్రవ్య సప్లయిని

పెంచుదురు. కనుక లోటు బడ్జెట్‌ను ప్రవేశపెట్టుట వలన ద్రవ్య సప్లయిపెరిగి తద్వారా ప్రభుత్వ వ్యయము పెరిగి ధరలు పెరుగుదలకు దారి తీయును. ఉదా॥ మన దేశంలో మొదటి ప్రణాళికా కాలంలో లోటు బడ్జెట్ విలువ 333 కోట్ల రూ॥ కాగా ఏడవ ప్రణాళిక నాటికి ఈ మొత్తం 34,669 కోట్ల రూపాయలకు పెరిగినది. కనుక లోటు బడ్జెట్ ద్రవ్య సప్లయిని మరియు డిమాండును పెంచి ధరల పెరుగుదలకు దారి తీయును.

**5. నల్ల ధనము :** నల్ల ధనము ఎక్కువగా చలామణి లోనికి వచ్చుట వలన కూడా ద్రవ్యోల్బణము వచ్చును. నల్ల ధనము సాధారణంగా పన్నులను ఎగవేసే వారి చేతులలో మరియు చీకటి వ్యాపారస్థుల చేతులలో ఎక్కువగా కేంద్రీకరించబడి ఉండును. వీరు నల్ల ద్రవ్యమును నిత్యావసర వస్తువుల వ్యాపారానికై ఉపయోగించి ఆ వస్తువుల సప్లయిలో కృత్రిమ కొరతను ఏర్పాటు చేయుదురు. కనుక వస్తువుల ధరలు పెరుగును.

**6. తక్కువ ఉత్పత్తి :** వస్తూత్పత్తి తక్కువగా ఉండుట వలన ధరల పెరుగుదల ఏర్పడును. భూకమతాల పరిమాణము స్వల్పముగా ఉండుట, కౌలుదారీ విధానంలో లోపములుండుట, పురాతన ఉత్పత్తి పద్ధతులను ఉపయోగించుట, నీటి పారుదల సౌకర్యములు తగినంతగా లేకపోవుట మొదలగు కారణముల వలన వ్యవసాయ రంగంలో ఉత్పత్తి తక్కువగా ఉన్నది. పారిశ్రామిక రంగంలో కూడా వస్తూత్పత్తి పెరుగుట లేదు. విద్యుచ్ఛక్తి కొరత, సమ్మెలు, లాకౌట్లు, సాంకేతిక పరిజ్ఞానం కొరత, పురాతన ఉత్పత్తి పద్ధతులు ఉపయోగించుట మొదలగు కారణముల వలన పారిశ్రామిక రంగంలో ఉత్పత్తి స్వల్పముగా ఉండుట వలన ధరలు పెరుగుచున్నవి.

**7. ప్రభుత్వ విధానాలు :** ప్రభుత్వము అనుసరించే కొన్ని విధానాలు కూడా ధరల పెరుగుదలకు దారి తీయును. ప్రభుత్వము అనుసరించే బడ్జెట్ విధానము, పన్నుల విధానము మొ॥నవి ధరలు పెరుగుదలకు దారి తీయును. ప్రభుత్వం తరచుగా బడ్జెట్‌లో ధరలను పెంచుచున్నది. ఈ అవకాశాన్ని తీసుకొని వ్యాపారస్తులు ధరలను అధికంగా పెంచుచున్నారు.

**8. పన్నుల విధానము :** పన్నుల భారము ఎక్కువగా ఉండుట వలన కూడా ధరలు పెరుగుచున్నవి. సాధారణంగా పన్నులు ధరలో కలిసి ఉండును. కనుక పన్నులు పెరిగిన ధరలు కూడా పెరుగును. స్థానిక పన్నులు మరియు అనేక ఇతర పరోక్ష పన్నులు పెరుగుట వలన వస్తువుల ధరలు పెరుగుచున్నవి.

**ద్రవ్యోల్బణ ఫలితాలు :** ధరల స్థాయిలోని మార్పు ఫలితంగా ద్రవ్యం విలువ మారుతుంది. ద్రవ్యం విలువ మార్పు ప్రభావం అన్ని ఆర్థిక కార్యకలాపాలపైన ఉంటుంది. ఈ ప్రభావం వల్ల ముఖ్యంగా ఆదాయ పంపిణీ, ఉత్పత్తి, ఉద్యోగితా స్థాయిలు మార్పులు చెందుతాయి. ద్రవ్యం విలువలలో కలిగే మార్పుల ఫలితాలు మిశ్రమంగా ఉంటాయి. ధరలు మారినప్పుడు కొందరికి నష్టం కలుగుతుంది, మరికొందరికి లాభం కలుగుతుంది. ద్రవ్యోల్బణం వల్ల కలిగే ఫలితాలు క్రింద వివరించడమైనది.

**1) ఆదాయ పంపిణీపై ప్రభావం :** ధరల స్థాయిలోని మార్పు ఫలితంగా ఆదాయ పంపిణీ ఏ విధంగా మారుతుందో తెలుసుకోటానికి కీన్స్ సమాజాన్ని మూడు వర్గాలుగా విభజించాడు. అవి :

ఎ) నిశ్చితమైన ఆదాయాన్ని పొందుతుండేవారు (Fixed Income group)

బి) వ్యాపారస్తులు (Business Class)

సి) రుణాల నిచ్చేవారు, పుచ్చుకునేవారు (Creditors and Debtors)

**ఎ) నిశ్చిత ఆదాయాన్ని పొందే వర్గంపై ప్రభావం :** ద్రవ్యోల్బణ కాలంలో వస్తుసేవల ధరలు పెరుగుతాయి. కాని ఈ వర్గ ప్రజల ఆదాయాలు ధరల పెరుగుదలతో పాటుగా పెరగవు. ఒకవేళ పెరిగినా ఆ పెరుగుదల ధరల పెరుగుదలతో పోలిస్తే చాలా స్వల్పంగా ఉంటుంది. కనుక వీరి ఆదాయంతో పొందే వస్తుసేవల పరిమాణం తగ్గుతుంది. అందువల్ల ద్రవ్యోల్బణ కాలంలో ఈ వర్గం నష్టపోతుంది. అయితే ప్రతి ద్రవ్యోల్బణ కాలంలో ధరలు తగ్గుతాయి. కాని వీరి ఆదాయాలు తగ్గవు, కనుక వీరు పొందే వస్తుసేవల పరిమాణం పెరిగి వీరు ప్రయోజనం పొందుతారు. సాధారణంగా వేతనాలు, జీతాలు పుచ్చుకొనేవారు, పెట్టుబడిదారులు నిశ్చిత ఆదాయ వర్గంలోకి వస్తారు.

**బి) వ్యాపారస్తులపై ప్రభావం :** ద్రవ్యోల్బణ కాలంలో వ్యాపారస్తుల లాభాలు పెరుగుతాయి. వ్యాపారంలో వ్యయాలు, వేతనాలు ముందుగా కుదుర్చుకున్న ఒప్పందం ప్రకారం ఉంటాయి. ధరలతోపాటు వెనువెంటనే అవి మారవు. కనుక ధరలు పెరిగినా వ్యాపారస్తుల వ్యయాలు పెరగవు. అందువల్ల వారు అధికలాభాలను పొందగలుగుతారు. ధరలు ఎంత త్వరగా పెరిగితే వారికి అంత ఎక్కువ లాభాలు సమకూరుతాయి. అయితే ప్రతి ద్రవ్యోల్బణ కాలంలో వారి వ్యయాలు స్థిరంగా ఉండి ధరలు తగ్గటంతో వారు నష్టపడతారు.

**సి) రుణాలనిచ్చేవారు, పుచ్చుకునేవారిపై ప్రభావం :** రుణం ఇచ్చినప్పటి ద్రవ్యం విలువ కంటే ద్రవ్యోల్బణ కాలంలో ద్రవ్యం విలువ తక్కువగా ఉంటుంది. అందువల్ల ద్రవ్యోల్బణ కాలంలో రుణం ఇచ్చినవారు నష్టపోగా, రుణం పుచ్చుకున్నవారు ప్రయోజనం పొందుతారు. ఉదాహరణకు, ఒక వ్యక్తి బస్తా ధాన్యం రూ. 100 చొప్పున 5 బస్తాల ధాన్యాన్ని అమ్మి రూ. 500 లను రుణంగా ఇచ్చాడనుకోండి. ద్రవ్యోల్బణ కాలంలో బస్తా ధర రూ. 125కు పెరిగినప్పుడు ఈ రుణం తిరిగి చెల్లించబడితే రూ. 500 లతో అతనికి 4 బస్తాల ధాన్యమే తిరిగి వస్తుంది. అయితే ప్రతి ద్రవ్యోల్బణ కాలంలో ద్రవ్యం విలువ రుణం ఇచ్చినప్పటి కంటే ఎక్కువగా ఉంటుంది. అందువల్ల రుణం చెల్లించేవారు నష్టపడగా రుణం ఇచ్చినవారు లాభం పొందుతారు.

పై వివరణ దృష్ట్యా ద్రవ్యోల్బణం వల్ల నిశ్చిత ఆదాయ వర్గం నుండి వ్యాపారస్తులకు, రుణం ఇచ్చినవారి నుండి రుణం పుచ్చుకున్నవారికి ఆదాయం పునః పంపిణీ అవుతుందని తెలుస్తుంది.

**2) ఉత్పత్తిపై ప్రభావం :** అతి తక్కువ మోతాదులో ద్రవ్యోల్బణం ఉంటే అది ఆర్థిక వ్యవస్థకు మేలు చేస్తుందంటాడు 'కీన్స్'. ఎలాగంటే ధరలు పెరుగుతుంటే ఉత్పత్తిదార్లకు లాభాలు పెరుగుతాయి. అందువల్ల వారు ఉత్పత్తిని పెంచుతారు. అంతేకాక ద్రవ్యోల్బణం వల్ల ఆదాయం వినియోగదార్ల నుంచి పెట్టుబడి వర్గాలకు బదిలీ అవుతుంది. ఫలితంగా పెట్టుబడి పెరిగి ఉత్పత్తి పెరుగుతుంది. అంటే ద్రవ్యోల్బణం ఆర్థిక వ్యవస్థలో ఉత్పత్తిని ప్రోత్సహిస్తుందన్నమాట.

అయితే ధరల పెరుగుదల విచ్చలవిడిగా సాగిపోతూంటే "అతి ద్రవ్యోల్బణం" (Hyper - Inflation) ఏర్పడుతుంది. ఈ స్థితిలో ఆర్థిక వ్యవస్థలో విపత్కర పరిస్థితులు ఏర్పడతాయి. లాభాల ఆశతో ఉత్పత్తి పెరిగి పెరిగి డిమాండును దాటుతుంది. దాంతో ఉత్పత్తిదార్లు నష్టాలకు గురి అవుతారు. పరిశ్రమలు మూతపడటం, శ్రామికులు నిరుద్యోగులవటం జరుగుతుంది. దేశంలో ఆర్థిక సంక్షోభం ఏర్పడుతుంది. కనుక ధరల పెరుగుదల ఒక స్థాయి వరకు మాత్రమే ఉత్పత్తికి ప్రోత్సాహకరంగా ఉంటుంది. ఆ స్థాయి దాటిన తర్వాత హానికరంగా పరిణమిస్తుంది.

**3) ఉద్యోగితా స్థాయిపై ప్రభావం :** ధరలు పెరుగుతున్నప్పుడు అంటే ద్రవ్యోల్బణ కాలంలో, ఉత్పత్తిదార్లకు అధిక లాభాలు వస్తాయి. వారు ఉత్పత్తిని పెంచుతారు. ఫలితంగా ఉద్యోగిత కూడా పెరుగుతుంది.

**4) అంతర్జాతీయ వ్యాపారంపై ప్రభావం :** ద్రవ్యోల్బణం ఉన్న దేశంలో ధరలు పెరుగుతుంటాయి. కనుక అంతర్జాతీయ మార్కెట్‌లో ఈ దేశపు ఉత్పత్తుల ధరలు కూడా పెరుగుతుంటాయి. వాటికి డిమాండు తగ్గుతుంది. దాంతో దేశం యొక్క ఎగుమతులు తగ్గి విదేశ వ్యాపారంలో లోటు ఏర్పడవచ్చు. అంతేకాక దేశీయ ఉత్పత్తుల కంటే విదేశీ ఉత్పత్తులు చౌకగా ఉండటంతో దిగుమతులు పెరుగుతాయి. దీంతో ఆ లోటు ఎక్కువ కావచ్చు.

**5) ప్రభుత్వ బడ్జెట్‌పై ప్రభావం :** ద్రవ్యోల్బణమప్పుడు ప్రభుత్వ ఆదాయం పెరుగుతుంది. ప్రజల ఆదాయాలు పెరుగుతాయి. కాబట్టి పన్నుల వల్ల వచ్చే ఆదాయం పెరుగుతుంది. బడ్జెట్‌లో మిగులు ఉంటుంది.

**6) రాజకీయాలపై ప్రభావము :** ద్రవ్యోల్బణాన్ని ప్రభుత్వం అదుపు చేయలేకపోతే అది నిరాటంకంగా కొనసాగి అతి ద్రవ్యోల్బణమవుతుంది. అతి ద్రవ్యోల్బణం వల్ల ఆర్థిక వ్యవస్థలో విపత్కర పరిస్థితులేర్పడుతాయి. ఆ పరిస్థితిలో ద్రవ్యం విలువ పూర్తిగా నశించిపోతుంది. ధరలు ఆకాశాన్నంటుతాయి. ప్రజలు అష్టకష్టాలకు గురి అవుతారు. వారికి ప్రభుత్వంపై విశ్వాసం పోతుంది. ప్రభుత్వంపై తిరుగుబాటుకు అవకాశం ఏర్పడుతుంది.

ద్రవ్యోల్బణం సాంఘిక న్యాయమును చేకూర్చదు. ఆదాయం ధనిక వర్గాలకు అనుకూలంగా పునఃపంపిణీ అవుతుంది. ఉద్యోగులలో, కార్మికులలో అశాంతిని

ప్రవేశపెడుతుంది. వ్యాపారస్తులలో నైతిక విలువలు తగ్గిపోతాయి. స్పెక్యులేషన్, సరుకులు దాచుట, లంచగొండితనం మొదలగు సాంఘిక వ్యతిరేక చర్యలకు దారి తీస్తుంది.

**నివారణ చర్యలు :** ధరల మార్పులు ఆర్థిక, సామాజిక సంక్షోభాలకు దారితీస్తాయి. ధరల మార్పుల వల్ల లాభాలకంటే నష్టాలే ఎక్కువ. ఆర్థిక సంక్షోభమును కలుగచేసే విత్తనాలు ద్రవ్యోల్బణంలోనే ఇమిడి ఉంటాయి. ద్రవ్యోల్బణం కనిపించని పన్ను. **అర్థశాస్త్రరీత్యా అభిలషణీయం కాదు. రాజకీయరీత్యా ప్రమాదకరమైనది. సాంఘికరీత్యా అసత్కరమైనది. నైతికరీత్యా సమర్థించతగినది కాదు.** అందువల్ల ద్రవ్యోల్బణాన్ని, సాధ్యమైన అన్ని పద్ధతుల ద్వారా అదుపులో ఉంచాల్సిన అవసరం ఉంది. ద్రవ్యోల్బణాన్ని, **అరికట్టే లేదా నివారించే చర్యలు మూడు రకాలు. అవి :**

a) ద్రవ్య సంబంధమైన చర్యలు (Monetary Measures)

b) కోశ సంబంధమైన చర్యలు (Fiscal Measures)

c) ఇతర చర్యలు (Other Measures)

**a) ద్రవ్య సంబంధమైన చర్యలు :** ద్రవ్యోల్బణాన్ని అదుపు చేయటానికి ఈ క్రింది ద్రవ్య సంబంధమైన చర్యలు తీసుకోవలె :

**1) ద్రవ్యరాశిని తగ్గించుట :** ప్రభుత్వం ద్రవ్యరాశిని తగ్గించవలె. ఇందుకుగాను ప్రభుత్వ సెక్యూరిటీలను విక్రయించాలి. ప్రజలు సెక్యూరిటీలను కొన్నప్పుడు, చెలామణిలో ఉండే ద్రవ్యం పరిమాణం తగ్గుతుంది. అదనంగా ద్రవ్యం జారీ చేస్తే ధరలు పెరిగి ద్రవ్యం విలువ మరింత పడిపోతుంది. అందువల్ల ద్రవ్యాన్ని అధికంగా జారీ చేయటం నిలిపివేయాలి.

**2) బాంకు పరపతిని నియంత్రణ చేయుట :** బాంకు పరపతిని తగ్గించాలి. ఇందుకు కేంద్ర బాంకు రీ డిస్కౌంట్ రేటును పెంచటం, వాణిజ్య బాంకులు కేంద్ర బాంకు వద్ద ఉంచవలసిన నగదు నిల్వల నిష్పత్తిని పెంచటం, వాణిజ్య బాంకులు ఋణాలనిచ్చేటప్పుడు హామీగా ఉండే సెక్యూరిటీ విలువకు, ఇచ్చే ఋణానికి మధ్య ఉండవలసిన తేడాను (margin) పెంచటం, వినియోగదార్ల పరపతిని నియంత్రణ చేయటం మొదలయిన చర్యలు తీసుకోవాలి. వీటన్నింటి ఫలితంగా బాంకు పరపతి తగ్గుతుంది. అనగా దేశంలోని కేంద్ర బాంకు వివిధ పరిమాణాత్మక, గుణాత్మక పరపతి సాధనాల ద్వారా ద్రవ్యోల్బణాన్ని కొంతవరకు తగ్గించవచ్చు.

పై చర్యల ద్వారా ప్రజల ఆదాయం, పెట్టుబడి తగ్గి సమష్టి డిమాండు తగ్గుతుంది. ద్రవ్యోల్బణం అదుపులోకి వస్తుంది.

**b) కోశ సంబంధమైన చర్యలు :** ద్రవ్యోల్బణాన్ని అదుపు చేయటానికి ఈ క్రింది కోశ సంబంధమైన చర్యలు తోడ్పడుతాయి

**I) ప్రభుత్వ వ్యయాన్ని తగ్గించటం :** ప్రభుత్వ వ్యయాన్ని తగ్గించటం. ప్రభుత్వ వ్యయాన్ని తగ్గిస్తే ఆదాయాలు తగ్గి సమష్టి డిమాండు తగ్గుతుంది.

**II) ప్రజల వ్యయార్హ ఆదాయాన్ని తగ్గించటం :** పన్నులను పెంచటం ద్వారాన్నూ, ప్రజల నుంచి రుణాలను తీసుకోవటం ద్వారాను, ప్రభుత్వం ప్రజల వ్యయార్హ ఆదాయాన్ని తగ్గిస్తే సమష్టి డిమాండు కూడా తగ్గుతుంది. అదేవిధంగా నిర్బంధ పొదుపు విధానం వల్ల ప్రజల వద్ద ఉండే ద్రవ్యాన్ని తగ్గించవచ్చు.

**III) ద్రవ్యం బాహ్య విలువను పెంచటం (Over-Valuation of Currency):** ద్రవ్య యూనిట్ యొక్క బాహ్య విలువను విదేశీ కరెన్సీలో పెంచితే ఎగుమతులు తగ్గి దిగుమతులు పెరుగుతాయి. దేశంలో వస్తువులు పుష్కలంగా లభించి ధరలు తగ్గుతాయి.

**IV) ధరలను నిరోధించటం :** ప్రభుత్వం ధరలను వివిధ పద్ధతుల ద్వారా అదుపులో పెట్టి ద్రవ్యోల్బణాన్ని అదుపు చేయవచ్చు. రెండవ ప్రపంచ యుద్ధకాలంలో ఇంగ్లాండు మొదలైన దేశాలు కొన్ని అత్యవసర వస్తుసేవలను నిర్ణీత ధరలకు సప్లయి చేసి, రేషనింగ్ కూపన్లు జారీ చేసి ధరలను నిరోధించాయి. ఈ మధ్యకాలంలో భారతదేశంలో ధరల నియంత్రణ, జాతీయ పంపిణీ విధానము ద్వారా ద్రవ్యోల్బణాన్ని అరికట్టడానికి కృషి జరుగుతోంది.

పై చర్యలద్వారా ద్రవ్యోల్బణాన్ని అదుపులో ఉంచవచ్చు.

**c) ఇతర చర్యలు :** ద్రవ్యోల్బణాన్ని అదుపు చేయటానికి పైన తెల్పిన ద్రవ్య, కోశ సంబంధమైన చర్యలేగాక కొన్ని ఇతర చర్యలను కూడా తీసుకోవలె. అలాంటి వాటిలో ఈ క్రిందివి ముఖ్యమైనవి :

1) వస్తుసేవల ఉత్పత్తిని పెంచటం, ద్రవ్యోల్బణం వ్యాప్తి నిరోధానికి అన్నిటికంటే బలమైన ఆయుధం, వస్తుసేవల ఉత్పత్తిని అధికం చేయటం. దీని ద్వారా ద్రవ్యోల్బణాన్ని శాశ్వతంగా దూరం చేయవచ్చు.
2) కొరతగా ఉన్న వస్తువుల ధరలను అదుపులో ఉంచి రేషనింగ్ ప్రవేశపెట్టడం ద్వారా అందరికీ అందేటట్లు చేయటం.
3) వేతనాలనుపెంచకుండా ఉండే విధానాన్ని అవలంబించటం.
4) అనవసరమైన ప్రైవేటు పెట్టుబడిని తగ్గించేందుకు వాటాలను జారీ చేయటాన్ని అదుపు చేయటం.
5) స్పెక్యులేషన్ కార్యకలాపాలను పూర్తిగా నిషేధించటం.

**ప్రశ్న 5) ప్రత్యక్ష పన్నులు, పరోక్ష పన్నులు అనగానేమి ? వీటి సుగుణాలను, లోపములను వివరింపుము.**

**జవాబు :** పన్నులను ప్రత్యక్ష పన్నులని, పరోక్ష పన్నులని రెండు రకాలుగా విభజిస్తారు. ఏవి ప్రత్యక్ష పన్నులు, ఏవి పరోక్ష పన్నులు అనే విషయంలో వివిధ అభిప్రాయాలున్నాయి.

**1) ప్రభుత్వ ఉద్దేశాన్ని బట్టి :** ఎవరిమీద పన్ను విధించబడిందో వారే దానిని చెల్లించవలెనని ప్రభుత్వ ఉద్దేశ్యమయితే అది ప్రత్యక్ష పన్ను. పన్ను విధింపబడిన వారు దానిని మరల ఇతరులకు బదిలీ చేయవలెనని ప్రభుత్వ ఉద్దేశ్యమయితే అది పరోక్ష పన్ను.

**2) బదలాయింపును లేక అంతిమ ప్రభావాన్ని బట్టి (on the basis of shifting) :** పన్ను చెల్లించినవారే దాని భారాన్ని పూర్తిగా భరిస్తే అది ప్రత్యక్ష పన్ను. అలాకాక పన్ను ప్రభుత్వానికి చెల్లించేవారు ఒకరు, దాని భారం వాస్తవంగ భరించేవారు మరియొకరు అయితే అది పరోక్ష పన్ను. అంటే ప్రత్యక్ష పన్నులలో ఇతరులకు బదలాయింపు (shifting) ఉండదు. పరోక్ష పన్నులలో ఇతరులకు బదలాయింపు ఉంటుంది. ప్రత్యక్ష పన్నులో తొలి ప్రభావం (impact), అంతిమ ప్రభావం (incidence) పన్ను చెల్లించిన వారిపైననే ఉంటుంది. పరోక్ష పన్నులో తొలి ప్రభావం ఒకరిమీద, అంతిమ ప్రభావం మరియొకరి మీద ఉంటుంది. **ఉదాహరణకు** ఆదాయంపై పన్ను ప్రత్యక్ష పన్ను. వస్తువుల అమ్మకంపై పన్ను (sales tax) పరోక్ష పన్ను. అమ్మకం పన్నును టోకు వ్యాపారస్తుడు చిల్లర వర్తకునకు, చిల్లర వర్తకుడు అతని దగ్గర కొనేవారికి బదిలీ చేస్తారు.

**3. ఆదాయమా, వ్యయమా అనే విధింపు ప్రాతిపదికను బట్టి :** ఆదాయం ఆధారంగా విధించేవి 'ప్రత్యక్ష పన్నులని', వ్యయంమీద విధించేవి పరోక్ష పన్నులని అంటారు. ఎక్సైజ్ పన్నులు, అమ్మకం పన్నులు ఈ వర్గీకరణను బట్టి పరోక్ష పన్నులు. ఎందుచేతనంటే అవి ఖర్చు జరిగేటప్పుడు కట్టవలసిన పన్నులు. ఆదాయం పన్ను ప్రత్యక్ష పన్ను.

4) పన్ను చెల్లించేవారికి ప్రభుత్వానికి ప్రత్యక్ష సంబంధముంటే అది ప్రత్యక్ష పన్ను. **ఉదాహరణకు** ఆదాయం పన్ను. వ్యక్తి ఆదాయాన్ని బట్టి విడివిడిగా ప్రభుత్వం పన్ను విధించి వసూలు చేస్తుంది. పన్ను చెల్లించేవారికి ప్రభుత్వానికి ప్రత్యక్ష సంబంధం లేకుంటే అది పరోక్ష పన్ను.

5) వ్యక్తులపైన, ఆస్తులపైన విధింపబడేవి "ప్రత్యక్ష పన్నులని", వినియోగం క్రయ విక్రయాదులు మొదలగువాటిపై (acts) విధింపబడేవి "పరోక్ష పన్నులని" ఐరోపా దేశాలలో అంటారు.

ఈ విధంగా ఏవి ప్రత్యక్ష పన్నులు, ఏవి పరోక్ష పన్నులు అనే విషయంపై వివిధ అభిప్రాయాలున్నాయి. అయినా ఈ వర్గీకరణ ఇప్పటికీ వాడుకలోనే ఉన్నది. వ్యక్తులపైన, ఆదాయ సంపదలపైన విధింపబడేవి "ప్రత్యక్ష పన్నులని", వినియోగం, క్రయ విక్రయాల మీద విధింపబడునవి "పరోక్ష పన్నులని" భావించవచ్చు.

**ప్రత్యక్ష పన్నులు - సుగుణాలు :** ప్రత్యక్ష పన్నుల వలన కొన్ని లాభాలున్నాయి :

**1) చెల్లింపు సామర్థ్యాన్ని బట్టి విధింపబడతాయి (Ability to pay) :** పన్నులు విధించటంలో న్యాయం ఉండవలె. చెల్లించే సామర్థ్యాన్ని బట్టి విధిస్తే న్యాయం

ఉంటుంది. ప్రత్యక్ష పన్నులను ఈ విధంగా విధించవచ్చు. **ఉదాహరణకు** : ఆదాయం పన్నును ఆదాయం పెరిగేకొలదీ ఎక్కువరేటులో విధించవచ్చు. అనగా పురోగామి సూత్రాన్ని అనుసరించవచ్చు.

**2) వ్యాకోచత్వం కల్గి ఉంటాయి (Elasticity)** : పన్ను రేటులో కొద్ది మార్పు చేసినా ఆదాయంలో పెరుగుదల గణనీయంగా ఉంటుంది. **ఉదాహరణకు** ఆదాయం పన్ను రేటు కొద్దిగా పెంచినా ప్రభుత్వ ఆదాయం కొన్ని రెట్లు అధికంగా పెరుగుతుంది. కాబట్టి ప్రభుత్వ అవసరాలను బట్టి ఆదాయాన్ని మార్చుటకు ప్రత్యక్ష పన్నులు సులువుగా ఉంటాయి.

**3) రాబడి ఎక్కువగా ఉంటుంది (Productive)** : ప్రత్యక్ష పన్నుల వలన ఆదాయం ఎక్కువగా ఉంటుంది.

**4) నిశ్చయత (Certainity)** : ప్రత్యక్ష పన్నుల నుండి ఆదాయమెంత వస్తుందో ప్రభుత్వం అంచనాలను చేసుకొనటం సులభం. అలాగే పన్ను చెలించేవారు కూడా ఎంత చెల్లించవలసి ఉంటుందో ముందుగా నిర్ణయించుకోవచ్చు. **ఉదా॥** ఒక వ్యక్తికి వచ్చిన ఆదాయం తెలిస్తే అతను పన్ను చెల్లించవలసింది ఖచ్చితంగా లెక్కవేసుకోవచ్చు.

**5) మిత వసూలు వ్యయం (Economy)** : ప్రత్యక్ష పన్నులను వసూలు చేయుటకయ్యే వ్యయం తక్కువగా ఉంటుంది. పన్ను నిర్ణయించుటకు కావలసిన విషయాలు, ఎంత పన్ను చెల్లించవలసినది మొదలగు సమాచారమంతా పన్ను చెల్లించవలసినవారే ప్రభుత్వానికి అందజేయవలె. కాబట్టి పన్ను వసూలుకు పెద్ద అధికార యంత్రాంగం అవసరం లేదు.

**6) పౌర జాగృతి పెంచుతాయి (Civic consciousness)** : ప్రత్యక్ష పన్నులు చెల్లించేవారు ఎక్కువ మొత్తాలలో చెల్లిస్తుంటారు. కాబట్టి ప్రభుత్వ వ్యయ విధానాన్ని జాగ్రత్తగా పరిశీలిస్తుంటారు. అప్రమత్తతతో ఉండవలసి ఉంటుంది. దుబారాకు అవకాశం ఉండదు. అందుచేతనే 'గ్లాడ్‌స్టన్' అనే ఆయన ప్రత్యక్ష పన్నులు మాత్రమే ఉంటే మితవ్యయమైన ప్రభుత్వముంటుంది అన్నాడు (If you had only direct taxes, you would have economical government).

7) ప్రత్యక్ష పన్నులను విధించుట సులభం. వసూలు చేయుట కూడా సులభం.

**ప్రత్యక్ష పన్నుల లోపాలు** : ప్రత్యక్ష పన్నుల వలన కొన్ని నష్టాలు కూడా ఉన్నాయి.

**1) ప్రాతికూల్యత లేక అయిష్టత (Unpopular)** : తాము కష్టించిన ఆదాయం నుండి ఎక్కువ పరిమాణంలో పన్నులు చెల్లించవలసి ఉంటుంది. కష్టంగా కనిపిస్తుంది కాబట్టి వీటికి ప్రాతికూల్యత ఎక్కువ.

2) లంచగొండితనం, అవినీతి, అధికార దుర్వినియోగానికి తావుంటుంది.

**3) పన్నుల ఎగవేతకు అవకాశం (Evasion)** : ప్రత్యక్ష పన్నులు పురోగామి రేటుతో విధించబడతాయి. కాబట్టి తక్కువ ఆదాయం చూపిస్తే తక్కువ రేటుతో కట్టవచ్చు. అందుచేత దొంగలెక్కలు చూపించి పన్ను ఎగవేతకు ప్రయత్నిస్తుంటారు. "ప్రత్యక్ష పన్నులు అవినీతినీ, మోసాన్ని ప్రోత్సహిస్తాయి. నీతి, నిజాయితీలను శిక్షిస్తాయి" అంటారు కొందరు.

అయితే సంఘములో నైతిక విలువలు పెరిగినకొలదీ పన్ను ఎగవేత తగ్గవచ్చు.

4) ఇవి అందరిమీద విధించలేదు. బీదవారిమీద ప్రత్యక్ష పన్నులు విధించ వీలుండదు.

5) పన్ను భారాన్ని ఇతరులకు బదిలీ చేయ వీలులేని పన్ను ప్రాతిపదికను నిర్ణయించటం కష్టం (suitable tax base).

పన్ను భారాన్ని ఇతరులకు మార్చ వీలులేనిది "ప్రత్యక్ష పన్ను" అంటారు. అయితే దీనిపై ఎలా విధిస్తే మార్చను వీలుకాదో నిర్ణయించటం కష్టం. పైగా ఇవి చెల్లింపు సామర్థ్యాన్ని బట్టి విధించబడేవి. చెల్లింపు సామర్థ్యం దేనిని బట్టి తెలుసుకోవాలనేది పెద్ద సమస్య.

**6) పరిమిత పరిధి** : ప్రత్యక్ష పన్నులకు విధింపు పరిధి (scope) చాల తక్కువ. ఆస్తి, సంపద, అధికాదాయం ఉన్నవారిపైననే విధించవలసి ఉంటుంది. ముఖ్యంగా వెనుకబడిన దేశాలలో వీటి నుండి ఆదాయం చాల తక్కువగ ఉంటుంది.

**7) మూలధన కల్పనపై వ్యతిరేక ప్రభావం** : పనిచేయవలెననే కోరిక, పొదుపు చేయవలెననే కోరికపై ప్రత్యక్ష పన్నులు వ్యతిరేక ప్రభావాన్ని కల్గజేయవచ్చు. ఎందుచేతననగా ఆదాయము, ఆస్తులు పెరిగేకొలదీ ఎక్కువ పన్నురేటును చెల్లించవలె. అందుచేత మూలధన కల్పనపై వ్యతిరేక ప్రభావం కల్గజేయవచ్చు.

**8) శాస్త్రీయమయిన పురోగామి పన్ను రేటును నిర్ణయించటం కష్టం** : సాధారణంగా ప్రత్యక్ష పన్నులు పురోగామిగా ఉంటాయి. అయితే పురోగామి రేటును నిర్ణయించుటలో చాల జాగ్రత్తలు కావాలి. పురోగామిత్వం అధికంగా ఉంటే మూలధనం ఇతర దేశాలకు తరలిపోవచ్చు.

పైన వివరించిన విధంగ ప్రత్యక్ష పన్నులకు గుణదోషములున్నవి.

**పరోక్ష పన్నులు - సుగుణాలు** : పరోక్ష పన్నులకు దిగువ పేర్కొనిన సుగుణములున్నవి.

**1) వ్యతిరేకత తక్కువ (Not unpopular)** : వీటిని చిన్న చిన్న మొత్తాలలో చెల్లిస్తారు. అందుచేత వీటికి ప్రజల నుంచి వ్యతిరేకత ఎక్కువగా ఉండదు.

**2) పేద వర్గాలపై విధింపు అవకాశం** : పేద వర్గాలపై పన్ను విధించుటకు పరోక్ష పన్నులే మార్గం.

**3) పొదుపును, పెట్టుబడిని తగ్గించవు** : సాధారణంగ పరోక్ష పన్నులు ఖర్చు పెట్టే సమయంలో చెల్లింపబడేవి. అందుచేత పొదుపు, పెట్టుబడులపై దుష్ఫలితాలను కల్గించవు.

**4) చెల్లింపు సౌకర్యం (Convenience)** : వస్తువులను కొనేటప్పుడు చిన్న మొత్తంలో చెల్లించవలసినవి కాబట్టి వీటిలో చెల్లింపు సౌకర్యముంది. డబ్బున్నప్పుడే కొంటాం. కాబట్టి డబ్బున్నప్పుడే చెల్లిస్తాము. అది ధరలో కలిసి కన్పించకుండ ఉంటుంది.

**5) రాబడి, వ్యాకోచత్వం కలిగి ఉంటాయి** : దేశంలో సౌభాగ్య పరిస్థితులున్నప్పుడు పరోక్ష పన్నుల వలన వచ్చే ఆదాయం పెరుగుతుంది. అవ్యాకోచం గల వస్తువులపై విధిస్తే రాబడి కూడ ఎక్కువగా ఉంటుంది.

**6) హానికర వస్తువుల వినియోగాన్ని తగ్గించటం** : హానికరమైన వస్తువుల వినియోగాన్ని తగ్గించుటకు పరోక్ష పన్నులను ఉపయోగించవచ్చు. **ఉదాహరణకు** నల్లమందు వాడకం తగ్గించుటకు దానిపై అధిక పన్ను విధించవచ్చు.

**7) ఎగవేత సాధ్యం కాదు** : పరోక్ష పన్నులను సాధారణంగా ఎగవేయటం సాధ్యం కాదు. అయినా దిగుమతి పన్నులు దొంగ రవాణా ద్వారా (Smuggling) ఎగవేయటం జరుగవచ్చు.

**8) వీటిని కూడ పురోగామి పద్ధతిలో విధించవచ్చు** : భాగ్యవంతులుపయోగించే వస్తువులపై ఎక్కువ పన్ను విధించటం ద్వారా పరోక్ష పన్నులలో కూడ పురోగామి పద్ధతి ప్రవేశపెట్టవచ్చు.

**9) విస్తృత పరిధి** : పరోక్ష పన్నులకు విధింపు పరిధి (scope) ఎక్కువ. అన్ని వర్గాల ప్రజలపై విధించవచ్చు. ప్రభుత్వానికి వివిధ మూలముల ద్వారా ఆదాయాన్ని తెచ్చిపెడతాయి.

**10) వెనుకబడిన దేశాలలో పాత్ర** : వెనుకబడిన దేశాలలో వినియోగ వ్యయమును తగ్గించి, పొదుపును, మూలధన కల్పనను పెంచుట చాల అవసరం. పరోక్ష పన్నులు వస్తువుల ధరలు పెంచుట ద్వారా వినియోగ వ్యయాన్ని నిరుత్సాహపరిచి పొదుపును పెంచుటకు దోహదం చేస్తాయి.

**పరోక్ష పన్నుల లోపాలు :**

**1) ఇవి తిరోగామి స్వభావం కలవి (Regressive)** : ఇవి చెల్లింపు సామర్థ్యాన్ని బట్టి విధించబడేవికావు. భాగ్యవంతులు, పేదవారు అనే విచక్షణ లేకుండ అందరిపై ఒకే

రేటులో విధించబడతాయి. అందుచేత ఈ పన్నులు పేద వర్గం మీద అధిక భారాన్ని మోపుతాయి.

**2) అనిశ్చియత** : వీని నుండి వచ్చే ఆదాయాన్ని అంచనాలు వేయటం కష్టం. ఏదైనా వస్తువుపై పన్ను పెంచితే డిమాండు తగ్గిపోవచ్చు. ఆర్థిక మాంద్యముతో వీటి రాబడి చాల తగ్గుతుంది.

**3) పన్నుల వసూలుకు అధిక వ్యయం** : వీటి వసూలుకు అధికార యంత్రాంగం ఎక్కువ కావలసి ఉంటుంది. ముఖ్యంగా దిగుమతి, ఎగుమతి సుంకాలకు చాలా సిబ్బంది కావలెను.

**4) పారిశ్రామికాభివృద్ధికి ఆటంకాలు** : ఎగుమతి దిగుమతి పన్నులు, ఎక్సైజ్ సుంకాలు పరిశ్రమల సహజ అభివృద్ధిని ఛిన్నపరుస్తాయి.

**5) 'వినియోగదారుని మిగులు' నష్టం** : పరోక్ష పన్నుల వలన ధరలు పెరుగుతాయి. వినియోగదారుని మిగులు తగ్గుతుంది.

**6) ద్రవ్యోల్బణం** : పన్ను విధించిన వస్తువుల ధరలు పెరిగి ద్రవ్యోల్బణ మేర్పడవచ్చు.

**7) ఎగవేతకు కూడ ఆస్కారముంది** : పరోక్ష పన్నుల ఎగవేత సాధారణంగా సాధ్యం కాకపోయినా దిగుమతి సుంకాల ఎగవేత జరుగుతుంది.

**8) పౌర జాగృతిని పెంపొందించవు** : పన్ను చెల్లించేవారికి తెలియనంత చిన్న మోతాదులో ఉన్నందువలన ప్రభుత్వ కార్యకలాపాలను పరిశీలించవలెననే ఆసక్తిని కలుగజేయవు.

పై వివరణను బట్టి ప్రత్యక్ష పరోక్ష పన్నులకు లాభాలు, నష్టాలు రెండూ ఉన్నాయి. రెండు రకాల పన్నులు అవసరమే. ఏదో ఒక రకమైన పన్నుల మీదనే ప్రభుత్వం ఆధారపడుటకు వీలుండదు. ఈ రెండు సమాన అందంగల అక్కచెల్లెండ్ర లాంటివి. ఈ రెంటి మధ్య సమతూకముండవలె. అయితే వీటి ప్రాముఖ్యత ఆ దేశ ఆర్థికాభివృద్ధి దశపై ఆధారపడి ఉంటుంది. అభివృద్ధి చెందిన దేశాలలో ప్రత్యక్ష పన్నులు ప్రధానపాత్ర వహిస్తాయి. అభివృద్ధి చెందుతున్న దేశాలలో పరోక్ష పన్నులు ప్రధానపాత్ర వహిస్తాయి.



# OBJECTIVE TYPE QUESTIONS

## ఒకటి లేదా రెండు వాక్యములలో జవాబులు

1. **నిగమన పద్ధతి (Deductive Method) :** కొన్ని సాధారణ విషయాలను గ్రహించి, వాటిని అంగీకరించి, తర్కించి వచ్చే ఫలితాల ఆధారంగా కార్యకారణ సంబంధాన్ని నిర్ధారించి సిద్ధాంతాలను రూపొందించే పద్ధతి.

2. **ఆగమన పద్ధతి (Inductive Method) :** ముందుగా ఒక విషయానికి సంబంధించిన సమాచారాన్ని సేకరించి, వాటిని ఒక క్రమపద్ధతిలో అమర్చి, తర్కించి కారణానికి - ఫలితానికి మధ్య వుండే సంబంధాన్ని తెలుసుకుని, ఈ సంబంధాన్నే సాధారణ ధర్మంగా ఏర్పరచి ఆర్థిక సిద్ధాంతాలను ప్రతిపాదించే పద్ధతి.

3. **సూక్ష్మ ఆర్థిక విశ్లేషణ (Micro Economic Analysis) :** వైయక్తిక యూనిట్‌లను పరిశీలించటం సూక్ష్మ ఆర్థిక విశ్లేషణ. అంటే సూక్ష్మ ఆర్థిక విశ్లేషణలో ఒక వినియోగదారుడు, ఒక సంస్థ, ఒక పరిశ్రమ, ఒక ఉత్పత్తి కారకం మొదలైన వైయక్తిక యూనిట్‌ల ప్రవర్తన పరిశీలించబడుతుంది.

4. **స్థూల ఆర్థిక విశ్లేషణ (Macro Economic Analysis) :** ఆర్థిక వ్యవస్థ మొత్తాన్ని పరిశీలించేది స్థూల ఆర్థిక విశ్లేషణ. అంటే మొత్తం జాతీయాదాయం, మొత్తం ఉద్యోగిత, సమష్టి డిమాండ్, సమష్టి సప్లయ్, ధరల సగటు స్థాయి, మొత్తం వినియోగం, పొదుపు, పెట్టుబడి, అంతర్జాతీయ వ్యాపారం, నిరుద్యోగిత, ఆర్థికాభివృద్ధి మొదలైనవాటిని పరిశీలిస్తుంది.

5. **నిశ్చల ఆర్థిక విశ్లేషణ (Static Economic Analysis) :** కాలంతో సంబంధంలేని ఆర్థిక విశ్లేషణ. అంటే ఆర్థిక వ్యవస్థలోని వివిధ అంశాలు - ధరలు, వస్తువు పరిమాణం మొదలైనవి ఒకే కాలానికి చెందినవిగా భావించి, వాటి మధ్య వుండే సంబంధాన్ని పరిశీలించటాన్నే "నిశ్చల ఆర్థిక విశ్లేషణ" అంటారు.

6. **చలన ఆర్థిక విశ్లేషణ (Dynamic Economic Analysis) :** ఆర్థిక వ్యవస్థ గమనం, మార్పుల అధ్యయనమే చలన ఆర్థిక విశ్లేషణ. అంటే చలన ఆర్థిక విశ్లేషణ ఉత్పత్తి కారకాల, ఉత్పత్తి పరిమాణాల మధ్య వుండే సంబంధాలను కొలిచి కాలంలో వచ్చే మార్పుల వల్ల అవి ఏ విధంగా మార్పు చెందేది పరిశీలిస్తుంది.

7. **సమతౌల్య స్థితి (State of Equilibrium) :** సమతౌల్య స్థితి అంటే కదలికలేని స్థితి. దీన్నే 'విరామ స్థితి' (State of rest) అని కూడా చెప్పవచ్చు. ఈ స్థితిలో మార్పు కోరుకోబడదు. ఆర్థిక శక్తుల కదలిక లేకుండా ఒక విరామ స్థితిలో ఉన్నప్పుడు "సమతౌల్యం" అంటారు.

**8. స్థిర సమతౌల్యం (Stable Equilibrium) :** ఏ కారణం చేతనైనా వున్న పరిస్థితి నుండి మార్పు చెంది తిరిగి అదే స్థితిని చేరుకుంటే ఆ స్థితిని "స్థిర సమ తౌల్యం" అంటారు.

**9. అస్థిర సమతౌల్యం (Unstable Equilibrium) :** ఒక స్థితి నుంచి మార్పు చెంది, తిరిగి ఆ స్థితిని చేరుకోక దూరంగా జరిగితే ఆ స్థితిని "అస్థిర సమతౌల్య స్థితి' అంటారు.

**10. తటస్థ సమతౌల్యం (Neutral Equilibrium) :** ఉన్న స్థితి నుంచి మార్పు చెంది, తిరిగి ఆ స్థితిని చేరుకోక మరో స్థితిలో సమతౌల్యాన్ని పొందితే దాన్ని "తటస్థ సమతౌల్యం" అంటారు.

**11. సమగ్ర సమతౌల్యం (General Equilibrium) :** ఆర్థిక వ్యవస్థను మొత్తంగా పరిగణించి ఆర్థిక చలన విషయాల పరస్పర సంబంధాలను పరిశీలించేదే సమగ్ర సమతౌల్యం. 'వాల్రాస్' ఈ విశ్లేషణకు ప్రాధాన్యమిచ్చాడు.

**12. పాక్షిక సమతౌల్యం (Partial Equilibrium) :** ఆర్థిక వ్యవస్థలో ఒక్కొక్క భాగాన్ని విడివిడిగా పరిశీలించేది పాక్షిక సమతౌల్యం. అంటే ఒక వినియోగదారుని సమతౌల్యం, ఒక సంస్థ సమతౌల్యం, ఒక పరిశ్రమ సమతౌల్యం మొదలైనవాటిని పరిశీలిస్తుందన్నమాట. ఇలా పరిశీలించేటప్పుడు ఆర్థిక వ్యవస్థలోని మిగతా భాగాల్లో మార్పు లేదని భావించబడుతుంది.

**13. ప్రయోజనం (Utility) :** మానవ కోర్కెలను తీర్చే శక్తిని "ప్రయోజనం" అంటారు. వస్తు సేవలు కోర్కెలను తీరుస్తాయి గనుక వాటికి ప్రయోజనం వుంటుంది.

**14. ప్రమేయాలు (Assumptions) :** అర్థశాస్త్రంలో ఒక విషయాన్ని గురించి కార్యకారణ సంబంధ విశ్లేషణ చేసేటప్పుడు మిగతా పరిస్థితుల్లో మార్పు లేదని ఊహించబడుతుంది. ఇలా మార్పు లేదని ఊహించిన కారకాంశాలే ప్రమేయాలు.

**15. డిమాండ్ (Demand) :** కొనుగోలు శక్తి వుండి ఒక వస్తువుని పొందాలన్న కోరికే డిమాండ్. డిమాండ్ ఎల్లప్పుడు ఒక ధరకు, సమయానికి సంబంధంతో వుంటుంది.

**16. డిమాండ్ పట్టిక (Demand Schedule) :** ఒక సమయంలో వివిధ ధరల వద్ద ఒక వస్తువు ఎంత పరిమాణంలో కొనబడుతుందో తెలియచేసేదే "డిమాండ్ పట్టిక".

**17. డిమాండ్ రేఖ (Demand Curve) :** డిమాండ్ పట్టికలోని వివిధ ధరల వద్ద వస్తువుకున్న డిమాండ్‌ను గ్రాఫ్ కాగితంపై గుర్తించి ఆ బిందువు లన్నింటిని కలిపితే వచ్చే రేఖ "డిమాండ్ రేఖ". ఇది ఎల్లప్పుడు ఎడమ నుంచి కుడికి క్రిందికి వాలుతూ వుంటుంది.

**18. గిఫెన్ వైపరీత్యం (Giffen's Paradox) :** పేదవారు ఎక్కువగా వాడే జీవితావసర వస్తువుల ధరలు పెరిగితే వారు ఇతర వస్తువులపై చేసే ఖర్చును

తగ్గించుకుని ఈ ధరలు పెరిగిన వస్తువులనే ఎక్కువగా కొనటం 'సర్ రాబర్ట్ గిఫ్పెన్' అనే ఆర్థికవేత్త గమనించాడు. ధర పెరిగినప్పుడు ఎక్కువ కొనటం డిమాండ్ సూత్రానికి మినహాయింపు.

**19. డిమాండ్ ఫలం (Demand Function) :** డిమాండ్ వస్తువు ధర యొక్క ఫలం. దీన్నే క్రింది సమీకరణం ద్వారా చూపాలి.

$Dn = f(Pn)$

ఇక్కడ Dn.... వస్తువు డిమాండ్

Pn... వస్తువు ధర

**20. ఆదాయ డిమాండ్ (Income Demand) :** ఆదాయానికి, డిమాండ్‌కు మధ్యగల సంబంధాన్ని "ఆదాయ డిమాండ్" అంటారు. మేలురకం (Superior) వస్తువులకు ఆదాయం పెరిగితే డిమాండ్ పెరుగుతుందని, నాశిరకం (Inferior) వస్తువులకు ఆదాయం పెరిగితే డిమాండ్ తగ్గుతుందని ఆదాయ డిమాండ్ తెల్పుతుంది.

**21. జాత్యంతర డిమాండ్ (Cross Demand) :** ఇతర వస్తువుల ధరల్లో వచ్చిన మార్పులవల్ల ఒక వస్తువు డిమాండ్‌లో వచ్చే మార్పును "జాత్యంతర డిమాండ్" అంటారు. ప్రతిష్టాపక వస్తువుల విషయంలో ఒక వస్తువు ధర పెరిగితే ప్రత్యామ్నాయ వస్తువు డిమాండ్ పెరుగుతుందని, పూరక వస్తువుల విషయంలో ఒక వస్తువు ధర పెరిగినప్పుడు దానితోపాటు వాడే మరో వస్తువు డిమాండ్ తగ్గుతుందని జాత్యంతర డిమాండ్ తెల్పుతుంది.

**22. ఆదాయ డిమాండ్ వ్యాకోచత్వం (Income Elasticity of Demand):** వస్తువు ధర, ప్రత్యామ్నాయ, పూరక వస్తువుల ధరలు స్థిరంగా వుండి వినియోగదారు ఆదాయంలో వచ్చే మార్పు వల్ల వస్తువు డిమాండ్‌లో వచ్చే మార్పును "ఆదాయ డిమాండ్ వ్యాకోచత్వం" అంటారు.

$$\text{ఆదాయ డిమాండ్ వ్యాకోచత్వం} = \frac{\text{వస్తువు డిమాండ్‌లో వచ్చిన అనుపాత మార్పు}}{\text{వస్తువు ధరలో వచ్చిన అనుపాత మార్పు}}$$

**23. జాత్యంతర డిమాండ్ వ్యాకోచత్వం (Cross Elasticity of Demand) :** ఒక వస్తువు ధర, వినియోగదార్ల ఆదాయాలు స్థిరంగా వుండి ప్రత్యామ్నాయ లేక పూరక వస్తువుల ధరల్లో వచ్చిన మార్పుల వల్ల వస్తువు డిమాండ్‌లో వచ్చిన మార్పును "జాత్యంతర డిమాండ్ వ్యాకోచత్వం" అంటారు.

$$\text{జాత్యంతర డిమాండ్ వ్యాకోచత్వం} = \frac{\text{వస్తువు A డిమాండ్‌లో వచ్చిన అనుపాత మార్పు}}{\text{వస్తువు B ధరలో వచ్చిన అనుపాత మార్పు}}$$

**24. పూర్తి వ్యాకోచ డిమాండ్ (Perfectly Elastic Demand) :** వస్తువు ధరలో మార్పు లేకుండానే దాని డిమాండ్ పెరగడం, తగ్గడం జరిగితే ఆ డిమాండ్‌ను "పూర్తి వ్యాకోచమైన డిమాండ్" అంటారు. పూర్తి వ్యాకోచ డిమాండ్ రేఖ X - అక్షానికి సమాంతరంగా వుంటుంది. దీని విలువ అనంతం (α).

**25. పూర్తి అవ్యాకోచ డిమాండ్ (Perfectly Inelastic Demand) :** ఒక వస్తువు ధరలో ఎంత మార్పు వచ్చినప్పటికి దాని డిమాండ్ ఏ మాత్రం మారకుండా వుంటే దాన్ని "పూర్తి అవ్యాకోచ డిమాండ్" అంటారు. పూర్తి అవ్యాకోచ డిమాండ్ రేఖ Y-అక్షానికి సమాంతరంగా వుంటుంది. దీని విలువ సున్న (0).

**26. ఏకత్వ వ్యాకోచ డిమాండ్ (Unitary Elastic Demand) :** ఒక వస్తువు ధరలో ఎంత మార్పు వస్తుందో అంతే మార్పు దాని డిమాండ్‌లో కూడా వస్తే దాన్ని "ఏకత్వ వ్యాకోచ డిమాండ్" అంటారు. ఏకత్వ వ్యాకోచ డిమాండ్ రేఖ అతి పరావలయ రేఖ (Rectangular Hyperbola) గా వుంటుంది. దీని విలువ ఒకటి (=1).

**27. సాపేక్ష వ్యాకోచ డిమాండ్ (Relatively Elastic Demand) :** వస్తువు ధరలో కలిగే మార్పుకన్న డిమాండ్‌లో వచ్చే మార్పు ఎక్కువగా వుంటే దాన్ని "సాపేక్ష వ్యాకోచ డిమాండ్" అంటారు. సాపేక్ష వ్యాకోచ డిమాండ్ విలువ ఒకటి కన్న ఎక్కువ (>1).

**28. సాపేక్ష అవ్యాకోచ డిమాండ్ (Relatively Inelastic Demand) :** వస్తువు ధరలో కలిగే మార్పు కన్న దాని డిమాండ్‌లో వచ్చే మార్పు తక్కువగా వుంటే దాన్ని "సాపేక్ష అవ్యాకోచ డిమాండ్" అంటారు. సాపేక్ష అవ్యాకోచ డిమాండ్ విలువ ఒకటికన్న తక్కువ (<1)

**29. ఉపాంత ప్రయోజనం (Marginal Utility) :** వస్తువు యొక్క ఒక యూనిట్‌ను అదనంగా తీసుకున్నప్పుడు దాని వల్ల మొత్తం ప్రయోజనంలో వచ్చే పెరుగుదల "ఉపాంత ప్రయోజనం".

'n' యూనిట్ ఉపాంత ప్రయోజనం = n యూనిట్ల మొత్తం ప్రయోజనం - (n-1) యూనిట్ల మొత్తం ప్రయోజనం.

**30. మొత్తం ప్రయోజనం (Total Utility) :** ఒక వస్తువును కొన్ని యూనిట్లలో తీసుకున్నప్పుడు వాటి అన్నింటి నుంచీ వచ్చే ప్రయోజనం "మొత్తం ప్రయోజనం".

**31. కార్డినల్ ప్రయోజనం (Cardinal Utility) :** ఏ వస్తువు యొక్క ప్రయోజనాన్నైనా ఇదమిద్దంగా కొలిచి సంఖ్యారూపంలో చెప్పటం "కార్డినల్ ప్రయోజనం'. ఉదాహరణకు, ఒక ఆపిల్‌పండు 18 యూనిట్ల ప్రయోజనాన్ని ఇస్తుందనటం. క్షీణోపాంత ప్రయోజన సూత్రం, సమోపాంత ప్రయోజన సూత్రం మొదలైనవి కార్డినల్ ప్రయోజనం ఆధారంగా చెప్పబడినట్టివి.

**32. ఆర్డినల్ ప్రయోజనం (Ordinal Utility) :** వస్తువుల ప్రయోజనాన్ని పోల్చి చెప్పవచ్చువనే భావనను "ఆర్డినల్ ప్రయోజనం" అంటారు. ఉదాహరణకు, ఆపిల్

కంటే మామిడిపండు ఎక్కువ ప్రయోజనాన్నిస్తుందనటం. ఉదాసీన వక్రరేఖా విశ్లేషణ దీని ఆధారంగా చెప్పబడింది.

**33. వినియోగదారుని మిగులు (Consumer's Surplus) :** ఒక వస్తువును కొనుట మానుటకన్నా, దానికి చెల్లించటానికి ఇష్టపడిన ధరకు, వాస్తవంగా దానికి చెల్లించిన ధరకు గల తేడాయే "వినియోగదారుని మిగులు". ఈ సిద్ధాంతాన్ని మార్షల్ ప్రతిపాదించాడు.

**34. ప్రతిష్ఠాపనోపాంతరేటు (Marginal Rate of Substitution) :** వినియోగదారుడు ఒక వస్తువు ఒక యూనిట్‌కు బదులు మరో వస్తువును ఏ రేటుతో వినియోగం చేయటానికి ఇష్టపడతాడో తెలియచేసేది ప్రతిష్ఠాపనోపాంతరేటు. ఈ ప్రతిష్ఠాపనోపాంతరేటు క్రమంగా క్షీణిస్తుంటుంది.

| వస్తువు 'X' | వస్తువు 'Y' |
|---|---|
| 1 | 10 |
| 2 | 6 |
| 3 | 4 |
| 4 | 3 |

**35. బడ్జెట్ రేఖ లేక ధర రేఖ (Budget line or Price line) :** ఒక వినియోగదారుడు తన మొత్తం ఆదాయాన్ని పూర్తిగా 'X' వస్తువు మీదనే ఖర్చు చేసేట్లయితే 'X' వస్తువు ఎంత పరిమాణంలో వస్తుందో తెలియచేసే బిందువును X - అక్షంపైన, అలాకాక మొత్తం ఆదాయాన్ని 'Y' వస్తువుపైనే ఖర్చు చేసేట్లయితే 'Y' వస్తువు ఎంత పరిమాణంలో వస్తుందో తెలియచేసే బిందువును Y- అక్షం పైన గుర్తించి ఆ రెండు బిందువులను కలిపితే వచ్చే సరళరేఖే "ధరరేఖ లేక బడ్జెట్ రేఖ". ఈ రేఖ అతడు పొందగలిగే వస్తువుల సముదాయాన్ని తెలియజేస్తుంది.

**36. ఆదాయ ప్రభావం (Income effect) :** వస్తువుల ధరలు స్థిరంగా వుండి ఆదాయంలో మార్పు వస్తే కలిగే ఫలితాలను "ఆదాయ ప్రభావం" అంటారు. వీటిని ఆదాయ వినియోగ రేఖ తెలియజేస్తుంది.

**37. ధర ప్రభావము (Price effect) :** వినియోగదారుని ఆదాయం స్థిరంగా వుండి ఒక వస్తువు ధర మాత్రమే మారితే కలిగే ఫలితాలను "ధర ప్రభావం" అంటారు. వీటిని ధర - వినియోగరేఖ తెలియజేస్తుంది.

**38. ప్రత్యామ్నాయ ప్రభావం (Substitution effect) :** వినియోగదారుని పరిస్థితిలో ఏ విధమైన మార్పు లేకుండా రెండు వస్తువుల సాపేక్ష ధరలు మారితే కలిగే ఫలితాన్ని "ప్రత్యామ్నాయ ప్రభావం" అంటారు. ఇట్టి పరిస్థితిలో వినియోగదారుని పరిస్థితి మునుపటి కంటే ఏ మాత్రం మెరుగ్గా గాని, హీనంగా గాని వుండదు.

**39. ఆదాయ వినియోగరేఖ (Income - Consumption Curve) :** వినియోగదారుని ఆదాయంలో వచ్చే మార్పుకు తదనుగుణ్యంగా వినియోగంలో వచ్చే మార్పులకు వున్న సంబంధాన్ని తెలియజేసేది "ఆదాయ వినియోగరేఖ". వివిధ ఆదాయాలకు సంబంధించిన సమతౌల్య స్థితి బిందువులను కలిపితే ఈ రేఖ వస్తుంది.

**40. ధర వినియోగరేఖ (Price - Consumption Curve) :** వివిధ ధరల వద్ద వినియోగదారుడు ఖర్చు చేసిన ద్రవ్యాన్ని, కొన్న వస్తువు పరిమాణాన్ని తెలియజేసేది "ధర వినియోగరేఖ". దీని ఆధారంగా డిమాండ్ పట్టికను తద్వారా డిమాండ్ రేఖను నిర్మించవచ్చు.

**41. గణాంక డిమాండ్ రేఖ (Emperical Demand Curve) :** వాస్తవిక పరిశీలనల ఆధారంగా ఒక డిమాండ్ పట్టికను తయారు చేసి తద్వారా ఒక డిమాండ్ రేఖను గీస్తే ఆ డిమాండ్ రేఖను "గణాంక డిమాండ్ రేఖ" అంటారు. గణాంక డిమాండ్ రేఖ ముఖ్యోద్దేశం సిద్ధాంతరీత్యా చెప్పిన విషయాలు వాస్తవిక విషయాలకు ఎంతవరకు అనుగుణ్యంగా వున్నాయో తెలుసుకోవటం.

**42. అభిలషణీయ జనాభా (Optimum Population) :** ఎంత జనాభా వున్నప్పుడు సహజ వనరులు పూర్తిగా వినియోగింపబడి, ఉత్పత్తి గరిష్టంగా వుండి తలసరి ఆదాయం అత్యధికమౌతుందో ఆ జనాభాని "అభిలషణీయ జనాభా" అనాలి. జనాభా యింత కంటే ఎక్కువగా వున్నా, తక్కువగా వున్నా తలసరి ఆదాయం అత్యధికంగా వుండాలి.

**43. శ్రమ విభజన (Division of Labour) :** సంఘంలోని ఆర్థిక కార్యకలాపాలను కొన్ని భాగాలుగా విభజించి, ఒక్కొక్క భాగాన్ని కొంతమంది వ్యక్తులు ప్రత్యేకించి చేయడాన్ని "శ్రమ విభజన" అంటారు. దీన్నే 'వృత్తి ప్రత్యేకీకరణ' (Specialisation) అని కూడా అంటారు.

**44. స్థూల శ్రమ విభజన (Simple Division of Labour) :** సంఘంలోని ఆర్థిక కార్యకలాపాలను వృత్తులుగా విభజించి ఒక్కొక్క వృత్తిని కొన్ని కుటుంబాలవారు ప్రత్యేకించి చేయటాన్ని "స్థూల శ్రమవిభజన" అంటారు. **ఉదాహరణకు,** వడ్రంగం, కుమ్మరం, వైద్యం మొదలైనవి.

**45. సూక్ష్మ శ్రమ విభజన (Complex Division of Labour) :** వృత్తులుగా విభజించిన ఒక్కొక్క వృత్తిలోని పనిని తిరిగి అనేక దశలుగా విభజించి ఒక్కొక్క దశను వేరు వేరు వ్యక్తులుగాని, సంస్థలుగాని చేయడాన్ని "సూక్ష్మ శ్రమ విభజన" అంటారు.

**46. ప్రాంతీయ శ్రమ విభజన (Territorial Division of Labour) :** వ్యక్తులు పనిని ప్రత్యేకీకరణ చేసినట్లే ప్రాంతాలు వస్తువుల ఉత్పత్తిలో ప్రత్యేకీకరణ చేయడాన్ని "ప్రాంతీయ శ్రమ విభజన" అంటారు. దీన్నే "పారిశ్రామిక కేంద్రీకరణ" అని కూడా అంటారు.

**47. మూలధనం (Capital) :** భూమి కాక సంపదలో ఏ భాగమైతే వస్తుసేవల ఉత్పత్తిలో ఉపయోగపడుతుందో అదే మూలధనం. ఉదా : యంత్రాలు, యంత్ర పరికరాలు, ఫ్యాక్టరీ భవనాలు మొదలైనవి.

**48. భూమి (Land) :** అర్థశాస్త్రంలో భూమి అంటే సహజ సంపద (natural resource) అని అర్థం. వ్యవసాయ భూమి, అడవులు, పర్వతములు, నదులు, గనులు మొదలైనవన్నీ భూమిగా పరిగణించబడతాయి.

**49. శ్రమ (Labour) :** ప్రతిఫలాన్ని ఆశించి చేసే పని శ్రమ. ఈ శ్రమ శారీరకమైనదిగా గాని లేక బుద్ధి సంబంధమైనదిగా గాని వుండవచ్చు. ఉత్పత్తి కారకాల్లో ఇది ఒకటి.

**50. పారిశ్రామిక కేంద్రీకరణ (Localisation of Industries) :** ఒకే రకమైన వస్తువును ఉత్పత్తి చేసే అనేక పారిశ్రామిక సంస్థలు ఒకచోట నెలకొల్పబడి వుండటాన్ని "పారిశ్రామిక కేంద్రీకరణ" అంటారు. బెంగాల్‌లో జనపనార పరిశ్రమ, బొంబాయి, అహ్మదాబాద్‌లలో బట్టల పరిశ్రమ ఇందుకు ఉదాహరణలు.

**51. పారిశ్రామిక వికేంద్రీకరణ (Decentralisation of Industries) :** పారిశ్రామిక సంస్థలను ఒక ప్రదేశంలోగాక దేశంలోని వివిధ ప్రదేశాలకు విస్తరింపజేయటాన్ని "పారిశ్రామిక వికేంద్రీకరణ" అంటారు. ప్రాంతీయ అసమానతలను తొలగించటానికి పారిశ్రామిక వికేంద్రీకరణ తోడ్పడుతుంది.

**52. క్షీణోపాంత ప్రతిఫల సూత్రం (Law of Diminishing Marginal Returns) :** మిగతా ఉత్పత్తి కారకాలన్నింటిని స్థిరంగా వుంచి ఒక్క ఉత్పత్తి కారకాన్ని మాత్రమే పెంచుతూ పోతే వచ్చే ఉపాంత ఉత్పత్తి క్షీణిస్తుందని ఈ సూత్రం చెబుతుంది.

**53. అంతర్గత ఆదాలు (Internal Economies) :** ఒక పారిశ్రామిక సంస్థ ఉత్పత్తి పరిమాణాన్ని పెంచటం వల్ల పొందే లాభాలను "అంతర్గత ఆదాలు" అంటారు. ఈ లాభాలు ఏ సంస్థకా సంస్థకి ప్రత్యేకించి ఉంటాయి. ఇవి వ్యాపార రహస్యాలు.

**54. బహిర్గత ఆదాలు (External Economies) :** ఒక పరిశ్రమలోని సంస్థల సంఖ్య పెరిగినప్పుడు పరిశ్రమ అంతటికి సంక్రమించే లాభాలను "బహిర్గత ఆదాలు" అంటారు. ఈ లాభాలను పరిశ్రమలోని అన్ని సంస్థలు అనుభవించవచ్చు.

**55. సాంకేతికపరమైన ఆదాలు (Technical Economies) :** పారిశ్రామిక సంస్థ పరిమాణం పెరిగినకొద్దీ సాంకేతికపరమైన ఆదాలు ఏర్పడతాయి. అధునాతనమైన, ఎక్కువ విలువైన యంత్రాలను ఉపయోగించటం, సక్రమమైన శ్రమ విభజనను ప్రవేశపెట్టటం, ఉప పదార్థాలను పూర్తిగా వినియోగించుకోవటం మొదలైన చర్యల ఫలితంగా సాంకేతికపరమైన ఆదాలు ఏర్పడతాయి.

**56. పెరుగుతున్న ప్రతిఫలాలు లేక వృద్ధి ప్రతిఫలాలు (Increasing Returns):** ఉత్పత్తి కారకాలను పెంచిన అనుపాతం కంటే, ఉత్పత్తి ఎక్కువ అనుపాతంలో పెరిగితే పెరుగుతున్న ప్రతిఫలాలు వస్తున్నాయని చెప్పాలి. **ఉదాహరణకు,** ఉత్పత్తి కారకాలను

రెట్టింపు చేస్తే ఉత్పత్తి రెట్టింపుకన్నా ఎక్కువగా వుంటుంది. దీన్నే "తగ్గుతున్న వ్యయాల (Decreasing Costs) స్థితి" అని కూడా అనవచ్చు.

**57. స్థిర ప్రతిఫలాలు లేక సమ ప్రతిఫలాలు (Constant Returns) :** ఉత్పత్తి కారకాలను పెంచిన అనుపాతంలోనే ఉత్పత్తి కూడా పెరిగితే స్థిర ప్రతిఫలాలు వస్తున్నాయని చెప్పాలి. ఉదాహరణకు, ఉత్పత్తి కారకాలను రెట్టింపు చేస్తే ఉత్పత్తి కూడా సరిగ్గా రెట్టింపే అవుతుంది. దీన్నే "స్థిర వ్యయాలు" (Constant Costs) స్థితి అని కూడా అనవచ్చు.

**58. తగ్గుతున్న ప్రతిఫలాలు (Decreasing Returns) :** ఉత్పత్తి కారకాలను పెంచిన అనుపాతం కంటే ఉత్పత్తి తక్కువ అనుపాతంలో పెరిగితే తగ్గుతున్న ప్రతిఫలాలు వస్తున్నాయని చెప్పాలి. ఉదాహరణకు, ఉత్పత్తి కారకాలను రెట్టింపు చేస్తే ఉత్పత్తి రెట్టింపు కన్నా తక్కువగా వుంటుంది. దీన్నే పెరుగుతున్న వ్యయాల (increasing costs) స్థితి అని కూడా అనవచ్చు.

**59. ద్రవ్య వ్యయాలు (Money Costs) :** ఉత్పత్తి కారకాలకు చెల్లించిన ద్రవ్యాన్ని "ద్రవ్య వ్యయాలు" అంటారు. ఉత్పత్తిదార్లు ఎక్కువగా ఈ ద్రవ్య వ్యయాన్నే పరిగణనలోకి తీసుకుంటారు.

**60. వాస్తవ వ్యయాలు (Real Costs) :** వస్తువు ఉత్పత్తిలో చేసిన ప్రయత్నాలు (effects), త్యాగాలను (sacrifices) "వాస్తవ వ్యయాలంటారు". ఇవి మానసిక పరిస్థితులవటంతో వీటిని లెక్కగట్టటం సాధ్యం కాదు. ధర నిర్ణయంలో వీటి అవసరం లేకపోయినప్పటికి సమాజదృష్ట్యా వీటికి ప్రాముఖ్యం వుంది.

**61. అవకాశ వ్యయాలు (Opportunity Costs) :** ఒక ఉత్పత్తి సాధనం యొక్క అవకాశ వ్యయం దాని తర్వాత అత్యుత్తమ ప్రత్యామ్నాయ ఉపయోగంలో వుండే ఆర్జన. ఉదాహరణకు, ఒక శ్రామికుడు రూ. 100 వేతనం పొందుతున్న ఉత్పత్తి రంగం నుండి మరో ఉత్పత్తి రంగానికి మారేట్లయితే ఈ రూ. 100 అవకాశ వ్యయం అవుతుంది.

**62. స్థిర వ్యయాలు (Fixed Costs) లేక వ్యవస్థా వ్యయాలు (Overhead Costs):** స్థిర ఉత్పత్తి కారకాలను పూర్తిగా వినియోగించినా లేక కొంతవరకే వినియోగించినా, అసలు వినియోగించకపోయినా వాటిపై చేసే వ్యయాలు స్థిరంగా వుంటాయి. కనుక ఆ వ్యయాలను "స్థిర వ్యయాలు" అంటారు. ఈ వ్యయాలకు ఉత్పత్తికి ఏ విధమైన సంబంధం వుండదు. వీటిని "వ్యవస్థా వ్యయాలు" (overhead costs) అని కూడా అంటారు.

**63. చర వ్యయాలు (Fixed Costs) లేక ప్రత్యక్ష వ్యయాలు (Direct or Prime Costs) :** చర ఉత్పత్తి కారకాలైన శ్రమ, ఇంధనం, ముడి సరుకులు మొదలైనవి ఉత్పత్తి పరిమాణంతో పాటుగా మారుతుంటాయి. కనుక వీటిపై చేసే వ్యయం కూడా

మారుతూ వుంటుంది. ఈ వ్యయాలనే "చర వ్యయాలని" లేదా ప్రత్యక్ష వ్యయాలని అంటారు.

**64. మొత్తం వ్యయం (Total Cost) :** ఉత్పత్తిలో అయ్యే స్థిర, చర వ్యయాలను కలిపితే వచ్చేదే మొత్తం వ్యయం.

మొత్తం వ్యయం = స్థిర వ్యయం + చర వ్యయం.

**65. సగటు వ్యయం (Average Cost ) :** వస్తూత్పత్తికి అయిన మొత్తం వ్యయాన్ని ఉత్పత్తి చేసిన వస్తువుల సంఖ్యతో భాగిస్తే వచ్చేదే సగటు వ్యయం.

$$\text{సగటు వ్యయం } AC = \frac{\text{మొత్తం వ్యయం}}{\text{ఉత్పత్తి పరిమాణం}}$$

**66. ఉపాంత వ్యయం (Marginal Cost) :** ఒక వస్తువును ఒక యూనిట్ అదనంగా ఉత్పత్తి చేయటం వల్ల మొత్తం వ్యయంలో వచ్చే పెరుగుదలను 'ఉపాంత వ్యయం' అంటారు.

ఉపాంత వ్యయం MC = n· యూనిట్ల మొత్తం వ్యయం - (n-1) యూనిట్ల మొత్తం వ్యయం.

**67. మొత్తం రాబడి లేక మొత్తం ఆదాయం (Total Revenue) :** విక్రయించిన ఉత్పత్తి పరిమాణాన్ని దాని ధరతో హెచ్చిస్తే వచ్చేదే మొత్తం రాబడి.

మొత్తం రాబడి = విక్రయించిన పరిమాణం × ధర

**68. సగటు రాబడి లేక సగటు ఆదాయం (Average Revenue) :** ఉత్పత్తి పరిమాణాన్ని విక్రయించగా వచ్చిన మొత్తం రాబడిని విక్రయించిన పరిమాణంతో భాగిస్తే వచ్చేది సగటు రాబడి.

$$\text{సగటు రాబడి } AR = \frac{\text{మొత్తం రాబడి}}{\text{విక్రయించిన పరిమాణం}}$$

**69. ఉపాంత రాబడి (Marginal Revenue) :** వస్తువు యొక్క ఒక అదనపు యూనిట్‌ను విక్రయించగా మొత్తం రాబడిలో వచ్చే పెరుగుదలే "ఉపాంత రాబడి".

**ఉపాంత రాబడి** MR = n యూనిట్ల మొత్తం రాబడి - (n-1) యూనిట్ల మొత్తం రాబడి

**70. అభిలషణీయ పరిమాణం (Optimum size) :** ఉత్పత్తి వ్యయం కనిష్ఠ స్థాయి వద్ద వుండే ఉత్పత్తి పరిమాణమే అభిలషణీయ పరిమాణం. ఇదే పెద్ద తరహా ఉత్పత్తిలోని ఆదాలను పొందుతూ సంస్థ సమర్థవంతంగా చేసే ఉత్పత్తి స్థాయి. అభిలషణీయమైన ఉత్పత్తిని చేసే సంస్థను "అభిలషణీయసంస్థ" అంటారు.

**71. అభిలషణీయ సంస్థ (Optimum Firm) :** అభిలషణీయమైన ఉత్పత్తిని చేసే సంస్థను "అభిలషణీయ సంస్థ" అంటారు. అభిలషణీయ ఉత్పత్తి అంటే ఉత్పత్తి

వ్యయాల కనిష్ట స్థాయి వద్ద ఉండే ఉత్పత్తి. ఈ ఉత్పత్తి స్థాయి వద్ద సంస్థ పెద్దతరహా ఉత్పత్తిలో ఉండే ఆదాలను పొందగలదు.

72. సప్లయి సూత్రం (Law of Supply) : ఇతర పరిస్థితుల్లో మార్పు లేనంతవరకు ఒక వస్తువు ధర పెరిగితే దాని సప్లయ్ పెరుగుతుంది. ధర తగ్గితే సప్లయి తగ్గుతుంది. అంటే ధరకు, సప్లయికు అనులోమ సంబంధం వుంది.

73. సప్లయి పట్టిక (Supply Schedule) : వివిధ ధరల వద్ద వస్తువు ఎంతెంత పరిమాణంలో సప్లయి చేయబడుతుందో తెలియచేసే పట్టికను "సప్లయి పట్టిక" అంటారు.

74. సప్లయి రేఖ (Supply Curve) : వివిధ ధరలవద్ద వస్తువు ఎంతెంత పరిమాణంలో సప్లయి చేయబడుతుందోఆ వివరాలను గ్రాఫ్‌లో గుర్తిస్తే వచ్చే రేఖ "సప్లయి రేఖ". ఇది సాధారణంగా ఎడమ నుండి కుడికి పైకి పోతుంది.

75. సప్లయి వ్యాకోచత (Elasticity of Supply) : వస్తువు ధరలో కలిగిన మార్పు ఫలితంగా వస్తువు సప్లయిలో కలిగే మార్పును "సప్లయి వ్యాకోచత" అంటారు. అంటే ధర మార్పుకు, సప్లయ్ మార్పుకు గల సంఖ్యాత్మక సంబంధాన్ని తెలిపేది సప్లయ్ వ్యాకోచత్వం.

76. వెనుకకు వంగు సప్లయి రేఖ (Backward bending Supply Curve): ఇది సప్లయి సూత్రానికి ఒక మినహాయింపు. ముఖ్యంగా శ్రమ విషయంలో వేతనాలు పెరిగితే శ్రామికులు విశ్రాంతిని ఎక్కువగా కోరుకోవడంతో శ్రమ సప్లయి తగ్గుతుంది. అలాంటి సప్లయి రేఖ వెనుకకు వంగి వుంటుంది.

77. మార్కెట్ (Market) : అర్థశాస్త్రంలో ఒక వస్తువును అమ్మేవారు, కొనేవారు కలసి ఆ వస్తువుకు మార్కెట్ అవుతుంది. ఉదాహరణకు గోధుమలను అమ్మేవారు, కొనేవారు కలసి గోధుమ మార్కెట్ ఏర్పడుతుంది.

78. స్థానిక మార్కెట్ (Local Market) : ఒక వస్తువు యొక్క అమ్మకందార్లు, కొనుగోలుదార్లు ఒక ప్రాంతానికే పరిమితమై వుంటే ఆ వస్తువు మార్కెట్‌ను "స్థానిక మార్కెట్" అంటారు. ఉదాహరణకు పాలు, కూరలు, మాంసం, ఇటుకరాళ్ళు మొదలైనవాటికి స్థానిక మార్కెట్ వుంటుంది.

79. జాతీయ మార్కెట్ (National Market) : ఒక వస్తువు యొక్క అమ్మకం, కొనుగోలు ఒక జాతి లేక దేశానికి మాత్రమే పరిమితమై వుంటే ఆ వస్తువు మార్కెట్‌ని "జాతీయ మార్కెట్" అంటారు. ఉదాహరణకు, ధోవతులు, చీరెలు, గాజులు, కుంకుమ మొదలైనవాటికి జాతీయ మార్కెట్ వుంటుంది.

80. అంతర్జాతీయ మార్కెట్ (International or World Market) : ఒక వస్తువు యొక్క అమ్మకం, కొనుగోలు ప్రపంచమంతా విస్తరించి ఉంటే ఆ వ మార్కెట్‌ని "అంతర్జాతీయ మార్కెట్" అంటారు. ఉదాహరణకు, వెండి, బ తేయాకు, పొగాకు మొదలైనవాటికి అంతర్జాతీయ మార్కెట్ వుంటుంది.

**81. పరిపూర్ణపోటీ మార్కెట్ (Perfect Competition) :** ఒకే వస్తువుకు, ఒకే సమయంలో మార్కెట్ అంతటా ఒకే ధర వున్న మార్కెట్‌ను "పరిపూర్ణ పోటీ వున్న మార్కెట్" అంటారు.

**82. అతి స్వల్పకాలం (Very Short Period) లేక మార్కెట్ కాల వ్యవధి (Market Period) :** సప్లయ్‌ని ఏ మాత్రం పెంచడానికి వీలులేని కాలాన్ని "అతి స్వల్పకాలం" అంటారు. ఈ కాలంలో అప్పటికే ఉత్పత్తి అయి అమ్మకానికి సిద్ధంగా ఉన్న వస్తురాశి (Stock on hand) మేరకే సప్లయ్ పరిమితమౌతుంది. ఈ కాలంలో ధర నిర్ణయంలో డిమాండ్ ప్రభావం ఎక్కువగా ఉంటుంది.

**83. స్వల్పకాలం (Short Period) :** వస్తువు డిమాండ్ కనుగుణ్యంగా సప్లయ్‌ని ఒక పరిమితికి లోబడి పెంచటానికి వీలున్న కాలాన్ని "స్వల్పకాలం" అంటారు. ఈ కాలంలో చర ఉత్పత్తి కారకాలను పెంచటం ద్వారా సప్లయ్‌ని సంస్థ యొక్క గరిష్ట ఉత్పాదక శక్తి మేరకు పెంచవచ్చు.

**84. దీర్ఘకాలం (Long Period) :** డిమాండ్‌లోని మార్పుల కనుగుణ్యంగా సప్లయ్‌ని మార్చటానికి కావలసిన కాలాన్ని "దీర్ఘకాలం" అంటారు. ఈ కాలంలో ఉత్పాదక సంస్థలు యంత్రాలతో సహా అన్ని ఉత్పత్తి కారకాలను మార్పు చేయటం ద్వారా ఉత్పత్తిని అవసరమైన మేరకు పెంచగలవు. ఈ కాలంలో ధర మీద సప్లయ్ ప్రభావం ఎక్కువగా వుంటుంది.

**85. మార్కెట్ ధర లేక అతి స్వల్ప కాల ధర (Market Price or Very Short Period Price) :** అతి స్వల్పకాలంలో వుండే ధరను "మార్కెట్ ధర" అంటారు. ఈ కాలంలో సప్లయ్ స్థిరంగా వుంటుంది కనుక ఈ ధరపై డిమాండ్ ప్రభావం ఎక్కువగా వుంటుంది. ఈ ధర ఉత్పత్తి వ్యయానికి సమంగా కాని, అంతకంటే ఎక్కువగా కాని తక్కువగాకాని ఉండవచ్చు.

**86. సహజ ధర లేక సాధారణ ధర లేక దీర్ఘకాలిక ధర (Normal Price or Long run Price) :** దీర్ఘకాలంలో వస్తువుకు వుండగల ధరను "సహజ ధర లేక సాధారణ ధర" అంటారు. ఈ కాలంలో సప్లయిని అవసరమైన మేరకు పెంచే వీలుంది కనుక ఈ ధరపై సప్లయి ప్రభావం ఎక్కువగా వుంటుంది. ఈ ధర వస్తువు వ్యయానికి సమానంగా వుంటుంది.

**87. పరిశుద్ధ ఏకస్వామ్యం (Pure Monopoly) :** ఒక వస్తువుయొక్క యావత్ ఉత్పత్తి ఒకే ఒక సంస్థ అధీనంలో వుండి, ఆ వస్తువుకు అసలు ప్రత్యామ్నాయాలేమి లేకపోతే, ఆ వస్తువు మార్కెట్‌ను "పరిశుద్ధ ఏకస్వామ్యం" అంటారు. అయితే ఇలాంటి మార్కెట్ వాస్తవంలో చాల అరుదు.

**88. సామాన్య లాభం (Normal Profit) :** వస్తువు సగటు రాబడి AR దాని సగటు వ్యయానికి AC సమానంగా వున్నప్పుడు సంస్థ పొందే లాభాలను "సామాన్య లాభాలు" అంటారు. ఈ సామాన్య లాభం ఉత్పత్తి వ్యయంలో భాగంగా వుంటుంది.

**89. ధర విచక్షణ (Price discrimination) :** ఒకే వస్తువును వివిధ ధరలకు అమ్మటాన్ని "ధర విచక్షణ" అంటారు. ఏకస్వామ్య మార్కెట్‌లోనే యిది సాధ్యమౌతుంది. ఈ విచక్షణ వ్యక్తుల మధ్యగాని, ప్రాంతాల మధ్యగాని ఉపయోగాన్ని బట్టిగాని చేయవచ్చు.

**90. చట్టపరమైన గుత్తాధిపత్యం లేక చట్టబద్ధమైన ఏకస్వామ్యాలు (Legal Monopolies) :** ఇవి ప్రభుత్వ చట్టాల ద్వారా ఏర్పడిన ఏకస్వామ్యాలు. కాపీరైట్, పేటెంట్ హక్కు, ట్రేడ్ మార్క్ మొదలైనవి. చట్టరీత్యా కొన్ని సంస్థలకు ఏకస్వామ్య హక్కుని కలిగిస్తాయి. **ఉదాహరణకు** అమృతాంజనం, నిర్మా, రెక్సోనా మొదలైనవి.

**91. సహజ ఏకస్వామ్యాలు లేక సహజ గుత్తాధిపత్యం (Natural Monopolies) :** ఇవి సహజంగా ఏర్పడిన ఏకస్వామ్యాలు. ఏదైనా ఒక వస్తువు లభ్యత ఒక ప్రాంతానికో, దేశానికో పరిమితమైతే, ఆ వస్తువు ఉత్పత్తిలో ఆ ప్రాంతం లేక దేశం ఏకస్వామ్యమౌతుంది. **ఉదాహరణకు** ఆఫ్రికా దేశం వజ్రాల ఉత్పత్తిలో ఏకస్వామ్యం కల్గి వుంది.

**92. కృత్రిమ ఏకస్వామ్యాలు (Artificial Monopolies) :** పరిశ్రమలోని సంస్థలు వాటంతట అవే పోటీని రద్దు చేసుకొని ధరపై అదుపుని సంపాదించుకుంటే అది కృత్రిమ ఏకస్వామ్య మౌతుంది. మన దేశంలో సిమెంట్ పరిశ్రమ ఇదివరలో ఇలాంటి ఏకస్వామ్యంగా వుండేది.

**93. ఏకస్వామ్య పోటీ లేక గుత్తాధిపత్యపు పోటీ (Monopolistic Competition) :** అనేక సంస్థలు ఉత్పత్తి చేసే వస్తువులు ఒకదానికొకటి సన్నిహిత ప్రత్యామ్నాయాలయినప్పుడు వుండే మార్కెట్‌ను "ఏకస్వామ్య పోటీ" అంటారు.

**94. ద్విదాధిపత్యం లేక ద్విస్వామ్యం (Duopoloy):** రెండు ఉత్పత్తి సంస్థలు ఒకే రకమైన (Identical) వస్తువులను గాని, కొద్ది తేడాతో వుండే వస్తువులనుగాని ఉత్పత్తి చేస్తూ వుండే మార్కెట్‌ను "ద్విదాధిపత్యం" అంటారు.

**95. పరిమితస్వామ్యం (Oligopoly) :** రెండుకన్నా ఎక్కువగా వుంటూ బహు తక్కువ సంఖ్యలో ఉత్పత్తి సంస్థలుంటే "పరిమిత స్వామ్యం" అంటారు.

**96. వస్తు విభేదము లేక వస్తువుల విశిష్టీకరణ (Product Differentiation):** వివిధ సంస్థలు ఉత్పత్తి చేసే వస్తువుల మధ్య స్వల్ప భేదం వుండటాన్ని "వస్తు విభేదం" అంటారు. ఏకస్వామ్య పోటీలో సంస్థలు ఉత్పత్తి చేసే వస్తువుల మధ్య విభేదం వుంటుంది. **ఉదాహరణకు** హమామ్, రెక్సోనా, సింథాల్, లిరిల్ వంటి సబ్బులు.

**97. ఉపాంత ఉత్పాదకత లేక ఉపాంత ఉత్పత్తి (Marginal Productivity):** ఒక ఉత్పత్తి కారకం యొక్క అదనపు యూనిట్‌ని ఉపయోగిస్తే మొత్తం ఉత్పత్తిలో వచ్చే పెరుగుదలను "ఉపాంత ఉత్పాదకత" అంటారు.

ఉపాంత ఉత్పాదకత = n యూనిట్ల మొత్తం ఉత్పత్తి - (n-1) యూనిట్ల మొత్తం

ఉత్పత్తి.

**98. ఉపాంత భూమి (Marginal land) లేక భాటకం లేని భూములు (No - rent Lands) :** 'రికార్డో' తన భాటక సిద్ధాంతంలో చిట్ట చివరకు సాగుచేసిన భూములను ఉపాంత భూములని చెప్పటం జరిగింది. ఆ భూములను సాగు చేసినప్పుడు కేవలం వ్యవసాయ ఖర్చులే తిరిగి వస్తాయి. కనుక వాటిపై భాటకం వుండదని 'రికార్డో' అంటాడు. అయితే వాస్తవంలో భాటకం లేని భూములంటూ కనబడవు.

**99. బదిలీ సంపాదనలు లేక మార్పిడి అర్జనలు (Transfer Earnings) :** ఒక ఉత్పత్తి కారకాన్ని ప్రస్తుత ఉపయోగంనుంచి మరొక ఉపయోగానికి తరలిస్తే ఆ రెండవ ఉపయోగంలో వచ్చే ఆదాయాన్నే "బదిలీ సంపాదన లేక మార్పిడి అర్జన" అంటారు. **ఉదాహరణకు,** ఒక భూమిలో చెరకు పండిస్తుంటే రూ. 5,000 ఆదాయం వస్తుండగా, ఆ భూమిని పసుపు పంటకు మరలిస్తే పసుపు పంటలో రూ. 4,500 ఆదాయం వస్తే, ఈ రూ. 4,500 ఆదాయం బదిలీ సంపాదన అవుతుంది.

**100. కృత్రిమ భాటకం (Quasi - rent) :** భూమికాక యితర ఉత్పత్తి సాధనాల మీద వచ్చే మిగులును "కృత్రిమ భాటకమని" 'మార్షల్' చెప్పాడు. ఇది రావటం స్వల్పకాలికం మాత్రమే.

**101. వాస్తవిక వేతనం (Real Wage) :** శ్రమకు వస్తుసేవల రూపంలో పొందే ప్రతిఫలాన్ని "వాస్తవిక వేతనమంటారు". **ఉదాహరణకు** ఒక వ్యవసాయ కూలీకి 20 కిలోల ధాన్యాన్ని ప్రతిఫలంగా యిస్తే యిది నిజవేతనమౌతుంది.

**102. ద్రవ్య వేతనం (Money or Nominal Wage) :** శ్రమకు ద్రవ్య రూపంలో పొందే ప్రతిఫలాన్ని "ద్రవ్యవేతన" మంటారు. **ఉదాహరణకు,** ఒక వ్యవసాయ కూలీకి రూ. 25 ప్రతిఫలంగా యిస్తే అది ద్రవ్యవేతన మౌతుంది.

**103. కనీస వేతనం (Minimum Wage) :** ఒక శ్రామికునికి తన శ్రమకు తగినట్లుగా ఇవ్వవలసిన ప్రతిఫలాన్ని "కనీస వేతన"మంటారు. వివిధ వృత్తుల్లో యివ్వవలసిన కనీస వేతనాలను ప్రభుత్వం చట్టరీత్యా నిర్ణయిస్తుంది. యజమానులు ఈ వేతనాన్ని చెల్లించకపోతే శిక్షార్హులు.

**104. జీవనాధార వేతనం (Subsistance Wage) :** శ్రామికుని కనీస జీవనానికి సరిపడే వేతనాన్ని "జీవనాధార వేతనం" అంటారు. వేతనం ఈ స్థాయి కంటే తక్కువగా వుంటే శ్రమ సప్లయ్ తగ్గి వేతనం తిరిగి ఈ స్థాయికి చేరుతుంది. వేతనం ఇంతకంటే హెచ్చుగా వుంటే శ్రమ సప్లయి పెరిగి వేతనం తిరిగి జీవనాధార వేతన స్థాయికి సమానమౌతుందని జీవనాధార వేతన సిద్ధాంతం చెబుతుంది

**105. కార్మిక సంఘాలు (Trade Unions) :** శ్రామికులు వారి బేరమాడే శక్తి (Bargaining Power) ని పెంచుకోటానికి సంఘటితంగా ఏర్పడితే వారినందరిని కలిపి "కార్మిక సంఘం "అంటారు. శ్రామికులు వృత్తివారీగా సంఘాలుగా ఏర్పడుతుంటారు.

**106.సమష్టి బేరము లేక జట్టు బేరము (Collective Bargaining) :** శ్రామికులు సంఘటితమై సంఘాలుగా ఏర్పడి బేరమాడటాన్ని "సమష్టి బేరం" అంటారు. సమష్టి బేరం ద్వారానే శ్రామికులు వారి న్యాయమైన కోర్కెలను తీర్చుకోగలరు.

**107. ఋణాత్మక నిధులు (Loanable Funds) :** అప్పు యివ్వటానికి సిద్ధంగా వుంచిన ద్రవ్యాన్ని "ఋణాత్మక నిధులు" అంటారు. ఇవి నాలుగు మూలాల నుండి లభిస్తాయి. పొదుపు, గుప్తధనం, వాడకం, మూలధన క్షయం, బాంక్ ఋణాలు.

**108. అమ్మకపు వ్యయాలు (Selling Costs) :** ప్రకటనలు, ప్రచారాలు, ఆకర్షణలు మొదలైనవాటిపై చేసే వ్యయాలు "అమ్మకపు వ్యయాలు". ఇవి ఏకస్వామ్య పోటీ మార్కెట్‌లో వుంటాయి. ఇవి డిమాండ్ రేఖ ఆకారమును, ఉనికిని మారుస్తాయి.

**109. తరహా ననుసరించి వచ్చే ప్రతిఫలాలు :** ఉత్పత్తి తరహా పెంచుటకు అన్ని ఉత్పత్తి కారకాలను పెంచిననూ, వచ్చే పెరిగే ప్రతిఫలాలు, స్థిర ప్రతిఫలాలు, క్షీణ ప్రతిఫలాలను "తరహాననుసరించి ప్రతిఫలాలు" అంటారు.

**110. సమోత్పత్తి రేఖలు :** ఒక నిర్దిత ఉత్పత్తిని ఉత్పత్తి కారకాల వివిధ కలయిక నిష్పత్తులలో సాధించవచ్చును. వీటిని చూపు రేఖలు "సమోత్పత్తి రేఖలు'.

**111. ద్రవ్యత్వాభిరుచి :** ద్రవ్యమును ద్రవ్యరూపంలోనే ఉంచుకొనవలెననే కోరికను "ద్రవ్యత్వాభిరుచి"అంటారు. వ్యాపార వ్యవహారాలకు, ముందు జాగ్రత్తకు, స్పెక్యులేషన్‌కు ద్రవ్య నిల్వలు వుంచుకొంటారు. ఇది ద్రవ్యానికి డిమాండు.

**112. ఉత్పత్తి ఫలము :** ఉత్పత్తి సాధనాలకు, ఉత్పత్తికి మధ్యనున్న సంబంధాన్ని చూపించునది "ఉత్పత్తి ఫలము".

**113. మూలధన సంచయనము :** మూలధన పెరుగుదలను "మూలధన సంచయనము" అంటారు. పొదుపు స్థాయి, పెట్టుబడి స్థాయి మొదలగు అంశములపై మూలధన సంచయనము ఆధారపడి వుంటుంది.

**114. పూరక డిమాండ్ :** ఒక వస్తువు ధర పెరిగినపుడు ఆ వస్తువు డిమాండ్ కాక, దాని సంబంధిత వస్తువుల డిమాండ్‌లో కూడా మార్పు వచ్చిన యెడల, దానిని "పూరక డిమాండ్" అంటారు. ఉదాహరణకు, పాలధర పెరిగితే దాని డిమాండ్ తగ్గటమే కాక కాఫీ పొడికి కూడా డిమాండ్ తగ్గవచ్చు.

**115. ఆడంబర వినియోగము :** విలాస వస్తువులు, బంగారు, వెండి మొదలగు వస్తువులపై వ్యయాన్ని "ఆడంబర వినియోగం" అంటారు.

**116. సమతౌల్య వడ్డీ రేటు :** ద్రవ్య సప్లయి, డిమాండ్‌లను సమానం చేయునది "సమతౌల్య వడ్డీరేటు".

**117. ఏంజిల్స్ వక్రరేఖ :** 'ఏంజిల్స్' అను అర్థశాస్త్రవేత్త ఆదాయం పెరిగే కొలదీ అవసర వస్తువులు, సౌకర్యాలు, విలాస వస్తువులపై వచ్చే అనుపాత మార్పులు తెలియజేసాడు. ఆదాయం పెరిగే కొలదీ అవసర వస్తువులపై వ్యయశాతం తగ్గుతుంది.

భోగవస్తువులు, సౌకర్యాలపై వ్యయశాతం పెరుగుతుంది. ఏంజిల్స్ వక్రరేఖ దీనిని సూచిస్తుంది.

**118. కాబ్ -వెబ్ సిద్ధాంతం :** ఉత్పత్తి ప్రణాళికలకు, అవి సాఫల్యం కావడానికి మధ్య కాల వ్యవధి వుండవచ్చు. తత్ఫలితంగా డిమాండ్, సప్లయిల మధ్య సమతౌల్యం ఒక చలన సర్దుబాటు విధానాన్ని అనుసరిస్తుంది. దీనిని గ్రాఫ్‌లో వ్రాస్తే చూడడానికి సాలెగూడు ఆకారంలో వుంటుంది. అందుచే దీనికి "కాబ్ - వెబ్ సిద్ధాంతం" అని పేరు వచ్చినది.

**119. కింకీ డిమాండ్ రేఖ :** పరిమితస్వామ్యంలో సంస్థ ఇప్పుడున్న ధరను తగ్గిస్తే ఇతర సంస్థల ప్రతీకార చర్య ఎలా వుంటుందో, డిమాండ్ ఎలా వుంటుందో అనిశ్చితమవుతుంది ఈ అనిశ్చిత పరిస్థితిని "డిమాండ్ రేఖలో కింక్" అంటారు.

**120. వస్తువుల విశిష్టీకరణ :** ఏకస్వామ్య పోటీలో సంస్థలు ప్రచారము, ప్రకటనలు, పాకింగ్ మొదలగువాటి ద్వారా తమ వస్తువే ఇతరులకన్నా శ్రేష్టమైనదనే భావన వినియోగదారులలో కల్పిస్తారు. దీనిని "వస్తువుల విశిష్టీకరణ లేదా "వస్తు భిన్నత్వం" అంటారు.

**121. జాతీయ ఆదాయము :** ఒక దేశంలో ఒక సం॥ కాలంలో ఉత్పత్తి చేయబడిన వస్తు సేవల మొత్తం విలువను "జాతీయ ఆదాయము" అంటారు జాతీయ ఆదాయమును బట్టి ఆర్థికాభివృద్ధిని నిర్ణయించవచ్చు.

**122. స్థూల జాతీయోత్పత్తి :** ఒక దేశంలో ఒక సం॥ కాలంలో ఉత్పత్తి చేయబడిన వస్తు సేవల మొత్తం విలువను "స్థూల జాతీయోత్పత్తి" అంటారు.

**123. నికర జాతీయోత్పత్తి :** ఒక దేశంలో ఒక సం॥ కాలంలో ఉత్పత్తి చేయబడిన వస్తు. సేవల నికర విలువల మొత్తాన్ని "నికర జాతీయోత్పత్తి" అంటారు. స్థూల జాతీయోత్పత్తిలో నుంచి ఉత్పాదక-వస్తువుల తరుగుదలను తీసివేస్తే నికర జాతీయోత్పత్తి తెలుస్తుంది.

**124. వ్యష్టి ఆదాయము :** ఒక సం॥ కాలంలో వ్యక్తుల చేతిలోకి వచ్చిన ఆదాయాన్ని "వ్యష్టి ఆదాయము" అంటారు. జాతీయ ఆదాయంలో కార్పొరేట్ పన్నులు, పంచని లాభాలు, సాంఘిక భద్రత చెల్లింపులు తీసివేసి బదలీ చెల్లింపులు కలపగా వచ్చిన మొత్తాన్ని "వ్యష్టి ఆదాయము" అంటారు.

**125. వ్యయార్హ ఆదాయము :** వ్యష్టి ఆదాయంలో నుంచి వ్యక్తులు చెల్లించిన పన్నులను తీసివేయగా మిగిలిన మొత్తాన్ని "వ్యయార్హ ఆదాయము" అంటారు.

**126. బదలీ చెల్లింపులు :** పెన్షన్‌దారులకు చెల్లించే పెన్షన్లు, నిరుద్యోగులకు యిచ్చే భృతి, ప్రభుత్వ ఋణాలపై చెల్లించే వడ్డీ మొదలగువాటిని "బదలీ చెల్లింపులు" అంటారు.

**127. స్థూల పెట్టుబడి :** ఒక సం॥ కాలంలో నూతన ఉత్పాదక వస్తువులను తయారు చేయటానికి అయ్యే మొత్తం వ్యయాన్ని "స్థూల పెట్టుబడి" అంటారు.

**128. పునఃస్థాపిత పెట్టుబడి :** ఉత్పత్తిలో ఉపయోగించటం వల్ల అరిగిపోయిన యంత్రాల స్థానంలో కొత్త యంత్రాలను స్థాపించటానికి అయ్యే వ్యయాన్ని " పునఃస్థాపిత పెట్టుబడి " అంటారు.

**129. నికర పెట్టుబడి :** స్థూల పెట్టుబడిలో నుంచి పునఃస్థాపిత పెట్టుబడిని మినహాయిస్తే నికర పెట్టుబడి వస్తుంది.

**130. ఇన్వెంటరీలు :** ఉత్పత్తి సంస్థల వద్దయున్న ముడి సరుకులు, తయారీలో యున్న వస్తువులు మొదలగువాటిని "ఇన్వెంటరీలు" అంటారు.

**131. సంపూర్ణ ఉద్యోగిత :** మార్కెట్ వేతన రేటును అంగీకరించి పనిచేయటానికి ఇష్టపడిన వారందరికి పని యుండి, నిరుద్యోగిత లేని స్థితిని "సంపూర్ణ ఉద్యోగిత" అంటాము.

**132. సంఘృష్ట నిరుద్యోగిత :** వస్తువులకు యున్న డిమాండ్‌లో మార్పుల వల్ల కొన్ని రకాలైన శ్రామికులకు ఉద్యోగ అవకాశాలు క్షీణించవచ్చు. ఇటువంటి స్వల్పకాలిక నిరుద్యోగితను "సంఘృష్ట నిరుద్యోగిత" అంటారు.

**133. సార్థక డిమాండ్ :** సమష్టి డిమాండ్, సమష్టి సప్లయి సమానము అయినప్పుడు యున్న డిమాండ్‌ను " సార్థక డిమాండు" అంటారు. యిచ్చట ఉత్పత్తి, ఉద్యోగిత స్థాయిల సమతౌల్యంలో వుంటాయి.

**134. వినియోగ ఫలభావము :** ఆదాయానికీ, వినియోగ వ్యయానికి మధ్య గల సంబంధమును "వినియోగఫలభావము" లేక "వినియోగ ప్రవృత్తి" అంటారు.

$$\text{వినియోగ ప్రవృత్తి} = \frac{\text{వినియోగవ్యయం}}{\text{ఆదాయం}}$$

**135. ఉపాంత వినియోగ ప్రవృత్తి :** ఆదాయంలోని మార్పుకు, వినియోగ వ్యయంలో వచ్చిన మార్పుకు గల నిష్పత్తిని "ఉపాంత వినియోగ ప్రవృతి" అంటారు.

$$\text{ఉపాంత వినియోగ ప్రవృత్తి} = \frac{\Delta C}{\Delta y}$$

**136. ఉపాంత పొదుపు ప్రవృత్తి :** ఆదాయంలోని మార్పుకు, పొదుపులో మార్పుకు మధ్యగల సంబంధమును "ఉపాంత పొదుపు ప్రవృత్తి" అంటారు.

$$\text{ఉపాంత పొదుపు ప్రవృత్తి} = \frac{\Delta S}{\Delta Y}$$

**137. కీన్స్ ప్రాథమిక మానసిక సూత్రం :** ఆదాయం పెరిగినప్పుడు వినియోగ వ్యయం పెరుగుతుంది. కాని ఆదాయంలోని పెరుగుదల కన్నా వినియోగ వ్యయంలోని పెరుగుదల తక్కువగా వుంటుంది. దీనినే "కీన్స్ ప్రాథమిక మానసిక సూత్రం" అంటారు.

**138. పొదుపు వైపరీత్యం :** వ్యక్తికి క్షేమకరమైన పొదుపు సంఘానికి క్షేమకరం కాకపోవచ్చు. ప్రజలు అందరూ పొదుపును పెంచితే వినియోగ వ్యయం తగ్గి ఉత్పత్తి తగ్గి, ఆదాయాలు తగ్గి మొత్తం పొదుపు తగ్గుతుంది.

**139. ప్రేరిత పెట్టుబడి :** వినియోగ వస్తువుల డిమాండ్‌లోని పెరుగుదల ఫలితంగా పెట్టుబడి పెరిగితే దానిని "ప్రేరిత పెట్టుబడి" అందురు.

**140. స్వయంప్రేరిత పెట్టుబడి :** డిమాండ్‌లోని మార్పులపై ఆధారపడకుండా దీర్ఘకాలిక అంశాలైన జనాభా, సాంకేతిక పరిజ్ఞానం మొదలగువాటిపై ఆధారపడి చేసే పెట్టుబడిని "స్వయంప్రేరిత పెట్టుబడి" అంటారు.

**141. ఉపాంత మూలధన సామర్థ్యం :** అదనంగా చేయబడిన పెట్టుబడి నుండి సంభవించగల లాభం రేటును "ఉపాంత మూలధన సామర్థ్యం" అంటారు.

**142. పెట్టుబడి గుణకము :** పెట్టుబడి వ్యయంలోని మార్పుకు, ఆదాయంలోని మార్పుకు మధ్యగల సంబంధమును "పెట్టుబడి గుణకము"అంటారు.

పెట్టుబడి గుణకము $= \frac{\Delta Y}{\Delta I}$

**143. ఉద్యోగిత గుణకము :** పెట్టుబడి వ్యయం పెరగటం వల్ల ప్రాథమికంగా ఏర్పడిన పెరుగుదలకు తద్వారా మొత్తం ఉద్యోగితలో వచ్చిన పెరుగుదలకు మధ్య గల సంబంధమును "ఉద్యోగిత గుణకము" అంటారు.

**144. ప్రభుత్వ వ్యయ గుణకము :** ప్రభుత్వ వ్యయంలో వచ్చిన మార్పుకు, తద్వారా జాతీయ ఆదాయంలో వచ్చిన మార్పుకు మధ్యగల సంబంధమును "ప్రభుత్వ వ్యయ గుణకము" అంటారు.

ప్రభుత్వ వ్యయ గుణకము $= \frac{\Delta Y}{\Delta G}$

**145. పన్ను గుణకము :** పన్నుల రేట్లలో వచ్చిన మార్పుకు తద్వారా, జాతీయ ఆదాయంలో వచ్చిన మార్పుకు మధ్యగల సంబంధమును "పన్ను గుణకము" అంటారు.

పన్ను గుణకము $= \frac{\Delta Y}{\Delta Tx}$

**146. విదేశ వ్యాపార గుణకము :** ఎగుమతులు, దిగుమతులలో వచ్చిన మార్పుకు తద్వారా జాతీయ ఆదాయంలో వచ్చిన మార్పుకు మధ్య గల సంబంధమును "విదేశీ వ్యాపార గుణకము" అంటారు.

విదేశీ వ్యాపార గుణకము $= \frac{\Delta y}{\Delta f}$

**147. వేగత్వరణం :** వినియోగ వ్యయంలోని మార్పుకు తద్వారా పెట్టుబడిలోని మార్పుకు మధ్య గల సంబంధమును "వేగత్వరణం" అంటాము.

$$\text{వేగత్వరణం} = \frac{\Delta I}{\Delta C}$$

**148. బాంకురేటు :** వాణిజ్య బాంకులకు యిచ్చిన ఋణాలపై కేంద్ర బాంకు వసూలు చేసే వడ్డీ రేటును "బాంకు రేటు" అంటారు.

**149. ఓపెన్‌మార్కెట్ వ్యవహారాలు :** మార్కెట్‌లో కేంద్ర బాంకు అమ్మే, కొనే సెక్యూరిటీల వ్యవహారాలను "ఓపెన్ మార్కెట్ వ్యవహారాలు" అంటారు.

**150. ప్రాథమిక డిపాజిట్లు :** బాంకులో నగదు పెట్టడం వలన ఏర్పడిన డిపాజిట్లను "ప్రాథమిక డిపాజిట్లు" అంటాము.

**151. ఉత్పన్న డిపాజిట్లు :** బాంకులు ఋణం యిచ్చి, ఆ సొమ్మును ఖాతాదారుల పేరిట జమ చేసినప్పుడు ఏర్పడిన డిపాజిట్లను "ఉత్పన్న డిపాజిట్లు" అంటాము.

**152. ద్రవ్యోల్బణము :** ధరలు నిరంతరము పెరుగుతూ వుండే ప్రక్రియను "ద్రవ్యోల్బణం" అంటాము.

**153. స్టాగ్‌ఫ్లేషన్ :** ఉత్పత్తిస్థాయి స్థిరంగా ఉండి ధరలు మాత్రమే పెరుగుతూ వుంటే దానిని "స్టాగ్‌ఫ్లేషన్ " అంటారు.

**154. వాస్తవిక ద్రవ్యోల్బణం :** సంపూర్ణ ఉద్యోగిత స్థాయి వద్ద సమష్టి డిమాండ్‌లోని పెరుగుదల వలన ధరలు పెరిగితే దానిని "వాస్తవిక ద్రవ్యోల్బణము" అంటారు.

**155. ప్రత్యక్ష పన్ను :** పన్ను యొక్క తొలి ప్రభావము ఒకరిమీద, అంతిమ ప్రభావము రెండూ ఒకే వ్యక్తి మీద వుంటే దానిని "ప్రత్యక్ష పన్ను" అంటారు.

**156. పరోక్ష పన్ను :** పన్ను యొక్క తొలి ప్రభావము ఒకరి మీద, అంతిమ ప్రభావము మరొకరి మీద వుంటే దానిని "పరోక్ష పన్ను" అంటారు.

**157. చక్రీయ నిరుద్యోగిత :** వ్యాపార చక్రాల వలన ఆర్థిక మాంద్యంతో సంభవించే నిరుద్యోగితను "చక్రీయ నిరుద్యోగిత" అంటారు.

**158. సగటు వినియోగ ప్రవృత్తి :** ఆదాయంలో వినియోగ వస్తువులపై చేసే వ్యయ శాతాన్ని "సగటు వినియోగ ప్రవృత్తి" అంటాము.

$$\text{సగటు వినియోగ ప్రవృత్తి} = \frac{c}{y}$$

**159. ద్రవ్యత్వాభిరుచి :** ద్రవ్యాన్ని మరి ఏ విధంగా పెట్టుబడి పెట్టకుండా ద్రవ్యం రూపంలో వుంచుకొనవలెననే కోరికను "ద్రవ్యత్వాభిరుచి" అంటారు.

**160. ద్రవ్యత్వ వలయము :** ఒక స్థాయి తరువాత ద్రవ్య సప్లయి పెరిగినప్పటికి వడ్డీ రేటు తగ్గని స్థితిని "ద్రవ్యత్వ వలయము" అంటారు.



# ఖాళీలను పూరించుట

1. మానవుని కోర్కెలను తీర్చగలిగే వస్తు గుణాన్ని ............ అంటారు. (ప్రయోజనం)
2. ఉచిత వస్తువులకు ప్రయోజనం వుంటుంది గాని ............ వుండదు. (మారకం విలువ)
3. డిమాండ్‌కు సరిపోయే సప్లయి లేని స్థితిని ............ అంటారు. (కొరత)
4. అర్థశాస్త్రానికి పితామహుడు ............ (ఆడమ్‌స్మిత్)
5. అర్థశాస్త్రానికి సంపద నిర్వచనాన్ని ఇచ్చిన ఆర్థికవేత్త ............ (ఆడమ్‌స్మిత్)
6. అర్థశాస్త్రానికి శ్రేయస్సు నిర్వచనాన్ని ఇచ్చిన ఆర్థికవేత్త ............ (మార్షల్)
7. అర్థశాస్త్రానికి కొరత నిర్వచనం ఇచ్చిన ఆర్థికవేత్త ............ (రాబిన్స్)
8. 'An Enquiry into the Nature and Causes of Wealth of Nations' గ్రంథకర్త ............ (ఆడమ్‌స్మిత్)
9. 'Elements of Pure Economics' గ్రంథకర్త ........... (వాల్రస్)
10. "Principles of Economics" గ్రంథకర్త ............ (మార్షల్)
11. Nature and Significance of Economic Science' గ్రంథకర్త .......... (రాబిన్స్)
12. లక్ష్యాల మధ్య తటస్థత వుండాలని చెప్పిన ఆర్థికవేత్త ............ (రాబిన్స్)
13. సంపద నిర్వచనాన్ని తీవ్రంగా విమర్శించినవారిలో ముఖ్యులు .......... (కార్లైల్, రస్కిన్, డికెన్స్)
14. అర్థశాస్త్రాన్ని Gospel of Mamman అని వర్ణించినది ............ (కార్లైల్)
15. విలువను ద్రవ్యరూపంలో చెబితే ............ అంటారు. (ధర)
16. ఒక ప్రమేయంతో ప్రారంభించి కార్యకారణ భావాన్ని తర్కించి సూత్రాన్ని ప్రతిపాదించే పద్ధతిని ............ అంటారు. (నిగమన పద్ధతి)
17. ఒక సమస్యకు సంబంధించిన విషయాలను సేకరించి, క్రోడీకరించి, సమగ్రంగా పరిశీలించి సూత్రాన్ని ప్రతిపాదించే పద్ధతిని ........అంటారు.(ఆగమన పద్ధతి)
18. ............ పద్ధతిని చారిత్రక పద్ధతి అని కూడా అంటారు. (ఆగమన)
19. ............ పద్ధతిని అనుభవ ప్రధాన పద్ధతి అని కూడా అంటారు. (ఆగమన)
20. జీవ పరిణామ సిద్ధాంతాన్ని (Theory of Evolution) రూపొందించినది. (చార్లెస్ డార్విన్)
21. ఏంజల్ వినియోగ సూత్రం ....... .... పద్ధతి ద్వారా ప్రతిపాదించబడినది. (ఆగమన)

22. అర్థశాస్త్రంలో సూక్ష్మ, స్థూల విశ్లేషణను ప్రవేశపెట్టింది ....... (రాగ్నార్ ఫ్రిష్)
23. సూక్ష్మ అర్థశాస్త్రాన్ని ............ సిద్ధాంతం అని పిలుస్తారు. (ధరల)
24. స్థూల అర్థశాస్త్రాన్ని ............ సిద్ధాంతమని పిలుస్తారు. (ఆదాయ, ఉద్యోగితా)
25. వైయక్తిక యూనిట్లను అధ్యయనం చేసేది ............ (సూక్ష్మ అర్థశాస్త్రం)
26. యూనిట్ల మొత్తాన్ని అధ్యయనం చేసేది ............ (స్థూల అర్థశాస్త్రం)
27. సామాజిక శాస్త్రాలలో నిశ్చల చలన విశ్లేషణను ప్రవేశపెట్టింది ............ (అగస్టి కామ్టె)
28. అర్థశాస్త్రంలో నిశ్చల, చలన పదాలను మొదటిసారిగా ఉపయోగించింది ............ (J.S. మిల్)
29. ............ అర్థశాస్త్రం ఆర్థిక కార్యకలాపాలను కాలంతో సంబంధం లేకుండా పరిశీలిస్తుంది. (నిశ్చల)
30. ............ అర్థశాస్త్రం ఆర్థిక కార్యకలాపాలలో కాలానికి తగు పరిగణనను ఇస్తుంది. (చలన)
31. ఒక పరిస్థితినుంచి మార్పు చెంది తిరిగి ఆ పరిస్థితిని చేరుకోగలిగితే దాన్ని ............ సమతౌల్య స్థితి అంటారు. (స్థిర)
32. ఒక పరిస్థితి నుంచి మార్పు చెంది తిరిగి ఆ పరిస్థితిని చేరుకోక దూరంగా జరిగితే దాన్ని ............ సమతౌల్య స్థితి అంటారు. (అస్థిర)
33. ఆర్థిక సూత్రాలను సముద్రపు అలలతో పోల్చిన ఆర్థికవేత్త ............ (మార్షల్)
34. కార్యకారణ సంబంధాన్ని వివరించే శాస్త్రాన్ని ............ శాస్త్రం అంటారు. (నిశ్చిత)
35. ఆదర్శవంతమైన విషయాలను ప్రోత్సహించి, మంచి చెడులను వివరించే శాస్త్రాన్ని ............ శాస్త్రం అంటారు. (ప్రామాణిక)
36. అర్థశాస్త్రం నీతిశాస్త్రానికి దూరంగా వుండజాలదు అన్న ఆర్థికవేత్త ............ (హాట్రే)
37. నూతన సంక్షేమ అర్థశాస్త్రానికి ఆది గురువు............ (పారెటో)
38. మార్పును కోరుకోని స్థితిని ............ అంటారు. (సమతౌల్య స్థితి)
39. సమగ్ర సమతౌల్య విశ్లేషణను అభివృద్ధిపరచిన ఫ్రెంచి ఆర్థికవేత్త ............ (వాల్రస్)
40. టీ, కాఫీలను ............ వస్తువులంటారు. (ప్రత్యామ్నాయ)
41. కప్పులు, సాసర్లను ............ వస్తువులంటారు. (పూరక)
42. పూరక వస్తువుల డిమాండ్‌ను ............ అంటారు. (జాయింట్ డిమాండ్)
43. వివిధ ధరలకు, వస్తువు పరిమాణానికి గల సంబంధం తెలిపే పట్టిక ............ (డిమాండ్ పట్టిక)
44. డిమాండ్ రేఖ సాధారణంగా ............ నుండి ............ కి క్రిందికి వాలుతుంది. (ఎడమ - కుడి)

45. ధరకు డిమాండ్‌కు గల ............ సంబంధాన్ని తెలిపేదే డిమాండ్ సూత్రం. (విలోమ)

46. గాసెన్ ప్రథమ సూత్రమని ............ సూత్రాన్ని అంటారు. (క్షీణోపాంత ప్రయోజనం)

47. పేదవారు ప్రధానంగా కొనే వస్తువులకు ధర పెరిగితే డిమాండ్ పెరుగుతుందని .......... ఆర్థికవేత్త చెప్పాడు. (రాబర్ట్ గిఫెన్)

48. పేదవారు ప్రధానంగా కొనే వస్తువుల ధర పెరిగితే డిమాండ్ పెరగడాన్ని ..... ...... అంటారు. (గిఫెన్ వైపరీత్యం)

49. గిఫెన్ వైపరీత్యం ............ సూత్రానికొక మినహాయింపు. (డిమాండ్)

50. స్పెక్యులేషన్ లేక అంచనా వ్యాపారం ............ సూత్రానికొక మినహాయింపు. (డిమాండ్)

51. ఆదాయం పెరిగితే ............ వస్తువుల డిమాండ్ పెరుగుతుంది.(మేలురకం)

52. ఆదాయం పెరిగితే ............ వస్తువుల డిమాండ్ తగ్గుతుంది. (నాశిరకం)

53. ఒక వస్తువు ధరకు, మరో వస్తువు డిమాండ్‌కు గల సంబంధాన్ని ............ అంటారు. (జాత్యంతర డిమాండ్)

54. ప్రత్యామ్నాయ వస్తువులలో ఒక వస్తువు ధర పెరిగితే, రెండో వస్తువు డిమాండ్ (పెరుగుతుంది)

55. పూరక వస్తువులలో ఒక వస్తువు ధర తగ్గితే రెండో వస్తువుకు డిమాండ్............ (పెరుగుతుంది)

56. వస్తువు ధరలో వచ్చే మార్పు వల్ల దాని డిమాండ్‌లో వచ్చే మార్పును ............ వ్యాకోచత్వం అంటారు. (ధర డిమాండ్)

57. ఒక వస్తువు ధరలో వచ్చే మార్పు వల్ల రెండో వస్తువు డిమాండులో వచ్చే మార్పును . .......... అంటారు. (జాత్యంతర డిమాండ్ వ్యాకోచత్వం)

58. వినియోగదార్ల ఆదాయంలో వచ్చే మార్పు వల్ల వస్తువు డిమాండ్‌లో వచ్చే మార్పును ............ అంటారు. (ఆదాయ డిమాండు వ్యాకోచత్వం)

59. పూర్తి వ్యాకోచ డిమాండు విలువ ............ ($\alpha$/అనంతం)

60. పూర్తి అవ్యాకోచ డిమాండు విలువ............ (0/సున్న)

61. సాపేక్ష వ్యాకోచ డిమాండు విలువ ............ ( >1 / ఒకటికంటే ఎక్కువ)

62. సాపేక్ష అవ్యాకోచ డిమాండు విలువ ............ ( <1/ఒకటి కంటే తక్కువ)

63. ఏకత్వ వ్యాకోచ డిమాండ్ విలువ ............ ( = 1/ఒకటికి సమానం)

64. పూర్తి వ్యాకోచ డిమాండు రేఖ ............ అక్షానికి సమాంతరంగా వుంటుంది. (X)

65. పూర్తి అవ్యాకోచ డిమాండ్ రేఖ ............ అక్షానికి సమాంతరంగా వుంటుంది. (Y)

66. ఏకత్వ వ్యాకోచ డిమాండ్ రేఖ ............ ఆకారంలో వుంటుంది. (అతిపరావలయం / Rectangular Hyperbola)

67. ధరలో వచ్చే స్వల్ప మార్పువల్ల డిమాండ్‌లో హెచ్చు మార్పు వస్తే దాన్ని ............ డిమాండ్ అంటారు. (సాపేక్ష వ్యాకోచ)

68. ధరలో వచ్చే హెచ్చు మార్పు వలన డిమాండులో స్వల్ప మార్పు వస్తే దాన్ని ............ డిమాండ్ అంటారు. (సాపేక్ష అవ్యాకోచ)

69. ధరలోని మార్పు, డిమాండ్‌లోని మార్పు సమానంగా ఉంటే దానిని ............ డిమాండ్ అంటారు. (ఏకత్వ వ్యాకోచ)

70. ధరలో ఎంత మార్పు వచ్చినప్పటికి డిమాండు మారకపోతే దానిని ............ అంటారు. (పూర్తి అవ్యాకోచ డిమాండు)

71. ధర తగ్గినపుడు మొత్తం ఖర్చు పెరిగితే, డిమాండ్ వ్యాకోచం = (>1/ఒకటి కంటే ఎక్కువ

72. ధర తగ్గినప్పుడు మొత్తం ఖర్చు మారకుండా వుంటే డిమాండ్ వ్యాకోచత్వం= (1/ఒకటికి సమానం)

73. ధర తగ్గినపుడు మొత్తం ఖర్చు కూడా తగ్గితే, డిమాండ్ వ్యాకోచత్వం = ............ (<1/ఒకటికంటే తక్కువ)

74. డిమాండు వ్యాకోచత్వం = $\dfrac{\text{....లోవచ్చిన అనుపాతమార్పు}}{\text{......లో వచ్చిన అనుపాతమార్పు}}$

(డిమాండ్, ధర)

75. ఆదాయ డిమాండు వ్యాకోచత్వం = $\dfrac{\text{....లోవచ్చిన అనుపాతమార్పు}}{\text{......లో వచ్చిన అనుపాతమార్పు}}$

(డిమాండ్, ఆదాయం)

76. జాత్యంతర డిమాండు వ్యాకోచత్వం =

$\dfrac{\text{X వస్తువులో వచ్చిన అనుపాతమార్పు}}{\text{Y వస్తువులో వచ్చిన అనుపాత మార్పు}}$

(డిమాండు, ధర)

77. జీవాన్స్, మెంజర్, వాల్రస్‌లు ప్రవేశపెట్టిన విశ్లేషణ (ప్రయోజన)

78. ప్రయోజనాన్ని సంఖ్యారూపంలో కొలవవచ్చుననేది ............ (కార్డినల్ ప్రయోజనము)

79. ప్రయోజనాన్ని పోల్చి చెప్పవచ్చుననేది ............ (ఆర్డినల్ ప్రయోజనం)

80. ఉపాంత ప్రయోజనం = n వస్తువుల మొత్తం ప్రయోజనం, వస్తువుల మొత్తం ప్రయోజనం (n–1)

81. ఒక వస్తువు సముదాయం పెరిగినకొద్దీ దాని ఉపాంత ప్రయోజనం క్షీణిస్తుందని మొదటిసారిగా చెప్పిన ఆర్థికవేత్త (గాసెన్)

82. క్షీణోపాంత ప్రయోజన సూత్రాన్ని రూపొందించిన ఆర్థికవేత్త ............ (మార్షల్)

83. సమోపాంత ప్రయోజన సూత్రాన్ని ప్రతిపాదించినది ............ (మార్షల్)

84. $\frac{Mux = Muy}{Px\ Py}$ అయినప్పుడు వినియోగదారుడు ............ పొందుతాడు. (గరిష్ఠ సంతృప్తి / సమతౌల్య స్థితి)

85. వినియోగదారుని మిగులు సిద్ధాంతాన్ని మొదటిసారిగా ............ అనే ఫ్రెంచి ఆర్థికవేత్త ప్రతిపాదించాడు. (డ్యుపిట్)

86. Mathematical గ్రంథకర్త ............ (ఎడ్జ్‌వర్త్)

87. ఉదాసీన వక్రరేఖా పద్ధతిని మొదటిసారిగా ప్రవేశపెట్టిన ఆర్థికవేత్త ............ (ఎడ్జివర్త్)

88. Value and Capital గ్రంథకర్త ............ (హిక్స్)

89. ఉదాసీన వక్రరేఖా విశ్లేషణను అభివృద్ధి పరచిన ఆర్థికవేత్త ............ (హిక్స్)

90. 'ప్రయోజనాన్ని పొల్చవచ్చు" అనే ప్రమేయం మీద ఆధారపడిన విశ్లేషణ ............ (ఉదాసీన వక్రరేఖ విశ్లేషణ)

91. సమాన సంతృప్తినిచ్చే వివిధ సముదాయాలను చూపే రేఖ......... (ఉదాసీన వక్రరేఖ)

92. వస్తువుల సాపేక్ష ధరలలో కలిగే మార్పుల ఫలితంగా వస్తువు కొనుగోలులో వచ్చే మార్పులను ............ అంటారు. (ధర ప్రభావం)

93. ద్రవ్యపు ఉపాంత ప్రయోజనం ............ వుంటుందని మార్షల్ భావన. (స్థిరంగా)

94. రెండు వస్తువుల మధ్య ప్రతిస్థాపనోపాంత రేటు ఆ రెండు వస్తువుల మధ్య ధరల నిష్పత్తికి సమానంగా వుంటే వినియోగదారుడు ............ లో వుంటాడు (సమతౌల్య స్థితి)

95. ఒక వస్తువు ధరలో మార్పును బట్టి ఆ వస్తువు కొనుగోలులో వచ్చే మార్పులను తెలియజేసేది. (ధర ప్రభావం)

96. వాస్తవ పరిస్థితుల ఆధారంగా గీసే డిమాండు రేఖను ............ అంటారు. (గణాంక డిమాండ్)

97. పదార్థాలకు ప్రయోజనాన్ని కల్పించటాన్ని ............ అంటారు. (ఉత్పత్తి)

98. ప్రకృతి ఉచితంగా ప్రసాదించిన ఉత్పత్తి కారకం................ (భూమి)
99. భూమికి గమనశీలత ............ (లేదు)
100. భూసారంలో వుండే వ్యత్యాసాలమీద ఆధారపడిన సిద్ధాంతం ............ (రికార్డో భాటక సిద్ధాంతం)
101. Essay on Principles of Population గ్రంథకర్త ............ (రాబర్ట్ మాల్థస్)
102. జనాభా సమస్యను గురించి మొదటిసారిగా చర్చించినది ............ (రాబర్ట్ మాల్థస్)
103. మాల్థస్ సిద్ధాంతం ప్రకారం జనాభా ............ శ్రేణిలో పెరుగుతుంది. (గుణోత్తర)
104. మాల్థస్ సిద్ధాంతం ప్రకారం ఆహారపదార్థాలు ............ శ్రేణిలో పెరుగుతుంటాయి. (అంకగణిత)
105. మాల్థస్ జనాభా సిద్ధాంతం ప్రకారం జనాభా ప్రతి ............ సంవత్సరాలకు రెట్టింపు అవుతుంది. (25)
106. ఏ జనాభావద్ద తలసరి ఆదాయం గరిష్టంగా ఉంటుందో ఆ జనాభాని ..........అంటారు. (అభిలషణీయ జనాభా)
107. తలసరి ఆదాయం పెరుగుతూ వుండటంకు ...... సూచన. (అల్ప జనాభా)
108. తలసరి ఆదాయం తగ్గుతూ ఉండటం .............. సూచన. (అధిక జనాభాకు)
109. వృత్తి విభజనను ........... శ్రమ విభజన అంటారు. (స్థూల)
110. మూలధనం ........... ఉత్పత్తి సాధనం. (మానవ నిర్మితమైన)
111. మూలధనం పెరుగుదలకు మూలం ........... (పొదుపు)
112. ఒక పరిశ్రమకు చెందిన అనేక సంస్థలు ఒకచోట నెలకొల్పటాన్ని ................అంటారు. (పారిశ్రామిక కేంద్రీకరణ / ప్రాంతీయ శ్రమవిభజన)
113. పారిశ్రామిక కేంద్రీకరణను ............ శ్రమవిభజన అంటారు. (ప్రాంతీయ)
114. మార్కెట్ వైశాల్యం .............. కు ఒక పరిమితి. (శ్రమవిభజన)
115. భౌతిక ఉత్పత్తి సాధనాలకు, ఉత్పత్తికి మధ్య వున్న సంబంధాన్ని ...................... తెలియచేస్తుంది. (ఉత్పత్తి ఫలము)
116. గణాంక ఉత్పత్తి ఫలములలో ప్రసిద్ధమైనది .......... (కాబ్ - డగ్లస్ ఉత్పత్తి ఫలము)
117. కాబ్ - డగ్లస్ ఉత్పత్తి ఫలము. (P=1. 10 LO. 75 CO. 25)
118. ఒక ఉత్పత్తి కారకానికి బదులు మరొక ఉత్పత్తి కారకాన్ని పూర్తిగా ప్రతిస్థాపన చేయగలిగితే ప్రతిస్థాపన వ్యాకోచత్వం = .......... (అనంతము/∞)
119. ఒకే ఉత్పత్తి కారకానికి బదులు మరొక ఉత్పత్తి కారకాన్ని అసలు వాడటానికి వీలులేకుంటే ప్రతిస్థాపన వ్యాకోచత్వం ............ (సున్న/(

120. మాల్థస్ జనాభా సిద్ధాంతానికి, రికార్డో భాటక సిద్ధాంతానికి ......... సిద్ధాంతం ప్రాతిపదిక. (క్షీణప్రతిఫల)
121. కొన్ని ఉత్పత్తి కారకాలను స్థిరంగా వుంచి, ఒక సాధనాన్ని మాత్రం మారుస్తూ వుంటే, వస్తువు ఉత్పత్తి ఏ విధంగా మారేది ......... సిద్ధాంతం విశదం చేస్తుంది. (క్షీణ ప్రతిఫల)
122. ఉత్పత్తి కారకాలను పెంచిన నిష్పత్తిలోనే ఉత్పత్తి కూడా పెరిగితే తరహా ననుసరించి ప్రతిఫలాలు .......... వున్నట్లు. (స్థిరంగా)
123. ఉత్పత్తి కారకాల మార్పు అనుపాతంకంటే హెచ్చు అనుపాతంలో ఉత్పత్తి పెరిగితే తరహాననుసరించి ప్రతిఫలాలు ....... అంటారు.(పెరుగుతున్నాయి)
124. ఉత్పత్తి కారకాల మార్పు అనుపాతంకన్న తక్కువ అనుపాతంలో ఉత్పత్తి పెరిగితే తరహాననుసరించి ప్రతిఫలాలు ....... అంటారు. (క్షీణిస్తున్నాయి)
125. పరిశ్రమ పెరుగుతున్నప్పుడు వచ్చే ఆదాలను....... అంటారు. (బహిర్గత ఆదాలు)
126. ఒక సంస్థ పరిమాణం లేక తరహా పెరిగినప్పుడు వచ్చే ఆదాలు ............. (అంతర్గత ఆదాలు)
127. ఉత్పత్తి పరిమాణంతో ప్రమేయం లేకుండా మారకుండా వుండే వ్యయాన్ని ......... అంటారు. (స్థిరవ్యయం)
128. ఉత్పత్తి వున్న, లేకపోయినా ........ వ్యయం వుంటుంది. (స్థిర)
129. ఉత్పత్తి పరిమాణంతోపాటు మారే వ్యయాలను ...... అంటారు. (చరవ్యయాలు)
130. ఉత్పత్తి పరిమాణం పెరిగేటప్పుడు సగటు ధర వ్యయం .........(క్షీణిస్తుంది)
131. క్షీణ ప్రతిఫలాలు వున్నప్పుడు సగటు వ్యయం ............ (పెరుగుతుంది)
132. వృద్ధి ప్రతిఫలాలున్నప్పుడు సగటు వ్యయం ................ (క్షీణిస్తుంది)
133. స్థిర ప్రతిఫలాలున్నప్పుడు సగటు వ్యయం .................. (మారదు)
134. వస్తువు ఉత్పత్తి చెయ్యడానికి చేసిన త్యాగాలు [Sacrifices], ప్రయత్నాలు [efforts] కలిపి .......... అంటారు. (నిజమైన వ్యయాలు)
135. ఒక ఉత్పత్తి సాధనం దాని తరువాత అత్యుత్తమ ప్రత్యామ్నాయ వుపయోగంలో ఆర్జించగల మొత్తాన్ని ............ అంటారు. (అవకాశ వ్యయం)
136. వస్తువును ఇంకొక యూనిట్ అదనంగా ఉత్పత్తి చేసేందుకు అయ్యే వ్యయాన్ని .......... అంటారు. (ఉపాంత వ్యయం)
137. మొత్తం వ్యయాన్ని ఉత్పత్తి పరిమాణంతో భాగిస్తే వచ్చేది ............ (సగటు వ్యయం)
138. సగటు వ్యయరేఖ ............ ఆకారంలో వుంటుంది. (U)
139. దీర్ఘకాలిక సగటు వ్యయరేఖను ...... అంటారు. (కప్పేరేఖ) [Envelop Curve]

140. పరిపూర్ణ పోటీలో సగటు రాబడిరేఖ .... వుంటుంది.

(X- అక్షానికి సమాంతరంగా)

141. వస్తువు ఒక అదనపు యూనిట్‌ను అమ్మగా వచ్చే రాబడి ............. అంటారు.

(ఉపాంత రాబడి)

142. మొత్తం రాబడిని అమ్మిన వస్తువుల సంఖ్యచే భాగిస్తే వచ్చేది .........

(సగటు రాబడి)

143. పరిపూర్ణ పోటీలోఉపాంత రాబడిరేఖ ........ వుంటుంది.

(X- అక్షానికి సమాంతరంగా)

144. సాధారణంగా సగటు రాబడిరేఖ ...................... ఉంటుంది.

(ఎడమనుంచి కుడికి కిందికి వాలుతూ)

145. సాధారణంగా ఉపాంత రాబడిరేఖ ................ ఉంటుంది.

(ఎడమనుంచి కుడికి కిందికి వాలుతూ)

146. ఉపాంత రాబడిరేఖ సగటు రాబడిరేఖకు ........ ఉంటుంది. (దిగువలో)

147. పరిపూర్ణ పోటీలో సగటు రాబడి ఉపాంత రాబడి ..... గా ఉంటాయి.

(సమంగా ఉంటాయి)

148. స్వల్పకాలిక వ్యయరేఖలన్నింటిని కప్పే రేఖను ............ అంటారు.

(Envelop Curve/Planning Curve)

149. డిమాండు వ్యాకోచత్వం = $\frac{AR}{-MR}$ (AR)

150. సప్లయ్ రేఖ సాధారణంగా ............ ఉంటుంది.

(ఎడమనుంచి కుడికి పైకిపోతూ)

151. ........... సప్లయ్ రేఖను వెనుకకు వంగు సప్లయ్ రేఖ అంటారు. (శ్రమ)

152. సప్లయ్ వ్యాకోచత్వం = $\frac{\text{....లోవచ్చిన అనుపాతమార్పు}}{\text{......లో వచ్చిన అనుపాతమార్పు}}$

(సప్లయ్, ధర)

153. వస్తువు ధరలో ఏ విధమైన మార్పు వచ్చినా సప్లయ్ మారకం స్థిరంగా ఉంటే దానిని ...........అంటారు. (పూర్తి అవ్యాకోచ సప్లయ్)

154. పూర్తి అవ్యాకోచ సప్లయి రేఖ ...... అక్షానికి సమాంతరంగా ఉంటుంది.(Y)

155. ధరలో వచ్చే అతిస్వల్ప మార్పువల్ల సప్లయిలో అనంతమైన మార్పువస్తే దాన్ని ...........అంటారు. (పూర్తి వ్యాకోచ సప్

156. పూర్తి వ్యాకోచ సప్లయిరేఖ .......... అక్షానికి సమాంతరంగా ఉంటుంది. (X)
157. ధరలో వచ్చిన అనుపాత మార్పుకన్నా, సప్లయిలో వచ్చే అనుపాత మార్పు అధికంగా ఉంటే దాన్ని .......... అంటారు. (సాపేక్ష వ్యాకోచ సప్లయి)
158. ధరలో వచ్చిన అనుపాత మార్పుకన్నా సప్లయిలో వచ్చే అనుపాత మార్పు తక్కువగా వుంటే, దాన్ని .......... అంటారు. (సాపేక్ష అవ్యాకోచ సప్లయి)
159. ధరలో వచ్చిన మార్పు, సప్లయ్‌లో వచ్చిన మార్పు ఒకే అనుపాతంలో వుంటే దాన్ని .......... అంటారు. (ఏకత్వ వ్యాకోచ సప్లయ్)
160. పూర్తి వ్యాకోచ సప్లయ్ .............. (0/సున్న)
161. పూర్తి అవ్యాకోచ సప్లయ్ విలువ = ..................... (oc/అనంతం)
162. సాపేక్ష వ్యాకోచ సప్లయ్ విలువ ................. (> 1/ఒకటికంటే ఎక్కువ)
163. సాపేక్ష అవ్యాకోచ సప్లయ్ విలువ ............. (< 1/ఒకటికంటే తక్కువ)
164. ఏకత్వ వ్యాకోచ సప్లయ్ విలువ ................. (= / ఒకటికి సమానం)
165. ............ అంటే విరామ పరిస్థితి. (సమతౌల్యం)
166. ఉపాంత వ్యయం ......... కు సమానంగా ఉన్నప్పుడు సంస్థ సమతౌల్య స్థితిలో ఉంటుంది. (ఉపాంత రాబడి/MR)
167. MC=MR ఉన్నప్పుడు సంస్థ ..... పొందుతుంది. (గరిష్ట లాభాలను)
168. సంస్థ సమతౌల్య స్థితిలో ఉన్నప్పుడు లాభాలు ..... వుంటాయి. (గరిష్టంగా)
169. పరిశ్రమ సమతౌల్యంలో వున్నప్పుడు సంస్థలన్నీ.............లాభాలు ఆర్జిస్తుంటాయి. (సామాన్య)
170. స్థిర .................. కలిపితే, వస్తూత్పత్తికి అయిన మొత్తం వ్యయం తెలుస్తుంది. (చర వ్యయాలు)
171. AC=AR ఉన్నప్పుడు సంస్థ ........ లాభాలను పొందుతుంది. (సామాన్య)
172. దీర్ఘకాలంలో అన్ని ఉత్పత్తి వ్యయాలు ......... వ్యయాలే. (చర)
173. అర్థశాస్త్రంలో మార్కెట్ ......... వారీ వుంటుంది. (వస్తు)
174. పరిపూర్ణ పోటీలో వస్తువు .......... గా వుంటుంది. (ఏకజాతీయం)
175. ........ పోటీలో వస్తు విభేదం వుంటుంది. (అపరిపూర్ణ/ఏకస్వామ్య)
176. పరిపూర్ణ పోటీలో .......... ఖర్చులు వుండవు. (రవాణా)
177. వస్తువు డిమాండు, సప్లయ్‌లు సమానమైనప్పుడు ఉండే ధర......... (సమతౌల్య ధర)
178. పరిపూర్ణ పోటీలో ఉపాంత రాబడి, సగటు రాబడి ........ గా వుంటాయి. (సమానంగా)
179. పరిపూర్ణ పోటీలో ....... కాలంలో సంస్థలు అధిక లాభాలను ఆర్జిస్తుంటాయి. (స్వల్ప)

180. పరిపూర్ణ పోటీలో ..... కాలంలో సంస్థలు సామాన్య లాభాలను ఆర్జిస్తుంటాయి. (దీర్ఘ)

181. పరిపూర్ణ పోటీలో ....... స్వల్పకాలంలో సంస్థలు లాభాలను ఆర్జిస్తుంటాయి. (అధిక)

182. పరిపూర్ణ పోటీలో దీర్ఘకాలంలో సంస్థలు ........ లాభాలను ఆర్జిస్తుంటాయి. (సామాన్య)

183. ఏకస్వామ్యంలో సగటు రాబడి రేఖ AR ................ వుంటుంది. (ఎడమ నుండి కుడికి క్రిందికి వాలుతూ)

184. ఏకస్వామ్యంలో ఉపాంత రాబడి రేఖ MR ............ వుంటుంది. (ఎడమ నుండి కుడికి క్రిందికి వాలుతూ)

185. ఏకస్వామ్యంలో ఉపాంత రాబడి రేఖ MR.......... సగటు రాబడి రేఖ ARకు వుంటుంది. (దిగువలో)

186. ఏకస్వామ్యంలో సంస్థ దీర్ఘకాలంలో .......... లాభాలను ఆర్జిస్తుంది (అధిక)

187. ఏకస్వామ్యంలో సంస్థ పరిశ్రమ రెండు ................ (ఒకటే)

188. ఏకస్వామ్యంలో ధర ..... ఉత్పత్తి .......వుంటుంది. (ఎక్కువ, తక్కువ)

189. పరిపూర్ణ పోటీలో ధర ........ ఉత్పత్తి ...... వుంటుంది. (తక్కువ, ఎక్కువ)

190. ధర విచక్షణ ..........లో వుంటుంది. (ఏకస్వామ్యం)

191. ధర విచక్షణ పాటించేటప్పుడు, డిమాండు వ్యాకోచత్వం ఎక్కువగా వున్న మార్కెట్‌లో ధర ....... గా వుంటుంది. (తక్కువ)

192. ధర విచక్షణ పాటించేటప్పుడు, డిమాండు వ్యాకోచత్వం తక్కువగా ఉన్న మార్కెట్‌లో ధర .. ..... గా వుంటుంది. (ఎక్కువ)

193. ఏకస్వామ్యదారుడు వస్తువు డిమాండు ........ వుంటే ధర తక్కువగా నిర్ణయిస్తాడు. (వ్యాకోచం)

194. ఏకస్వామ్యదారుడు వస్తువు డిమాండు ....... గా వుంటే ధర ఎక్కువగా నిర్ణయిస్తాడు. (అవ్యాకోచం)

195. ఇద్దరు ఉత్పత్తిదారులుండే మార్కెట్‌ను ..... అంటారు. (ద్విదాధిపత్యం/ద్విస్వామ్యము)

196. ద్విదాధిపత్యం నమూనాను ఇచ్చింది ................ (కారనాట్)

197. ప్రకటనలు, ప్రచారంపై చేసే వ్యయాలను ........ వ్యయాలు అంటారు. (అమ్మకం)

198. అమ్మకం వ్యయాలు .......... మార్కెట్‌లో వుంటాయి. (ఏకస్వామ్యపోటీ)

199. కొద్దిమంది ఉత్పత్తిదార్లుండే మార్కెట్‌ను ....... .అంటారు. (పరిమితస్వా

200. .......... సంవత్సరంలో ఏకస్వామ్యాలు, అంక్షాపూరిత కార్యకలాపాల చట్టం చేయబడింది. (1969)
201. ఒక ఉత్పత్తి కారకాన్ని అదనంగా ఒక యూనిట్ వినియోగించినప్పుడు మొత్తం ఉత్పత్తిలో వచ్చే పెరుగుదలను ........ అంటారు. (ఉపాంత ఉత్పాదకత)
202. ఉపాంత ఉత్పాదకతా సిద్ధాంతంతో ........... అర్థికవేత్త పేరు ముడిపడి వుంది. (J. B. క్లార్క్)
203. ఉపాంత ఉత్పాదకతా సిద్ధాంతంలో ముఖ్యమైన ప్రమేయం ...................... (పరిపూర్ణ పోటీ వుంటుందని)
204. కృత్రిమ భాటక భావనను ప్రవేశపెట్టినది ...... (మార్షల్)
205. బదిలీ సంపాదనలు అనే భావనను ప్రవేశపెట్టినది ...... (జోన్ రాబిన్సన్)
206. ఉత్పత్తి కారకాలకుండే డిమాండు ......... అంటారు. (ఉత్పన్న డిమాండు)
207. అర్థికవేత్త దృష్టిలో భాటకం "వైవిధ్యం వల్ల వచ్చిన మిగులు" (రికార్డో)
208. ................ వైవిధ్యం వల్ల వచ్చిన మిగులుగా గుర్తించబడింది. (భాటకం)
209. భాటకం రాని భూమిని (No rent land) .........భూమి అంటారు. (ఉపాంత)
210. కృత్రిమ భాటకం ........ కాలంలోనే వుంటుంది. (స్వల్ప)
211. నగదు రూపంలో ఇచ్చే వేతనం యొక్క కొనుగోలు శక్తిని...........అంటారు. (నిజ వేతనం /వాస్తవిక వేతనం)
212. శ్రమ సప్లయ్ రేఖ .......... వుంటుంది. (వెనుకకు వంగి)
213. "పోటీ పడనివాళ్ళ సమూహం (Non-competing groups) అనే భావనను వ్యక్తం చేసినది ............ (J. B. కెయిర్‌నెస్)
214. "The Distribution of Wealth" గ్రంథకర్త.......... (J. B. క్లార్క్)
215. సంఘటిత శ్రామికులు, యాజమాన్యం మధ్య పోటీని ........అంటారు. (రెండు ఏకస్వాముల మధ్య పోటీ bilateral monopoly)
216. లాకౌట్లు (Lockouts) ........ వారి బలాన్ని సూచిస్తాయి. (యాజమాన్యం)
217. వడ్డీని పరిత్యాగానికి (abstinence) ప్రతిఫలంగా చెప్పినది ........... (నాసా సీనియర్)
218. మార్షల్ పరిత్యాగం అనే పదానికి బదులుగా ........ అనే పదాన్ని వాడాడు (నిరీక్షణ)
219. పారితోషిక వడ్డీ సిద్ధాంతాన్ని చెప్పినది ........(బామ్ బావర్క్, Bohm Bawark)
220. నవ్య సాంప్రదాయక అర్థికవేత్తలు ప్రతిపాదించిన వడ్డీ సిద్ధాంతం............... (రుణాత్మక నిధుల వడ్డీ సిద్ధాంతం)
221. ద్రవ్యత్వాభిరుచి వడ్డీ సిద్ధాంతాన్ని చెప్పిన అర్థికవేత్త ......... (కీన్సు)
222. "General Theory of Employment, Interest and Money" గ్రంథకర్త .................. (J. M. కీన్సు)

223. "పొదుపు చేయనిదే ద్రవ్యనిధులు ఏర్పడటం సాధ్యం కాదు" అని చెప్పిన అర్థికవేత్త ...................... (జాకబ్ లైనర్)
224. లాభ చలన సిద్ధాంతాన్ని ప్రతిపాదించిన అర్థికవేత్త ........... (J. B. క్లార్క్)
225. F. H. నైట్‌కు అపార కీర్తి నార్జించిన గ్రంథం ......... (Risk, Uncertainty and Profit)
226. ఉత్పత్తిలో నవకల్పనలవల్ల లాభాలు ఏర్పడతాయని చెప్పినది ....... (షుంపీటర్)
227. ఉద్యోగితలేని పనివాళ్ళ సమూహం (Reserve army of unemployed) అని చెప్పినది. (కార్ల్ మార్క్స్)
228. 'The Economics of Welfare' గ్రంథకర్త (ఎ. సి. పిగూ)
229. 'The Economics of Imperfect Competition' గ్రంథకర్త............... (మిసెస్ జోన్ రాబిన్‌సన్)
230. స్థిర సమతౌల్య విశ్లేషణను మొదట ప్రవేశపెట్టినది ......... (మార్షల్)
231. 'Principles of Political Economy and Taxation' గ్రంథకర్త. (డేవిడ్ రికార్డో)
232. ధర నిర్ణయంలో కాలవ్యవధిని ప్రవేశపెట్టినది .......... (మార్షల్)
233. నష్టభయాన్ని వహించినందుకుగాను లాభాలను చెల్లించవలెనని చెప్పినది. ................ (హాలే)
234. కాలాధిక్యత వడ్డీ సిద్ధాంతాన్ని ప్రవేశపెట్టినది ........ (ఫిషర్)
235. 'Das Capital' గ్రంథకర్త ............. (కార్ల్‌మార్క్స్)
236. 'The Commonsense of Political Economy' గ్రంథకర్త ......(విక్ స్టీడ్)
237. వడ్డీ అనేది కేవలం ద్రవ్య సంబంధమైన విషయంగా వర్ణించినది ..... (J. M. కీన్స్)
238. శ్రామిక ప్రత్యేకీకరణ అనే భావనను ప్రవేశపెట్టినది ........ (బెన్‌హామ్)
239. గృహ నిర్వహణ శాస్త్రంగా అర్థశాస్త్రాన్ని వర్ణించినది ........... (అరిస్టాటిల్)
240. 'The Social Framework' గ్రంథకర్త ........... (హిక్స్)
241. అభిలషణీయ ఉత్పత్తి సాధనాల సమ్మేళనాన్ని ........ అని కూడా అంటారు. (కనిష్ఠ వ్యయ సమ్మేళనం)
242. 17, 18 శతాబ్దాలలో ఫ్రాన్స్‌లో నివశిస్తూ ప్రకృతిదే పైచేయి అని నమ్మిన అర్థశాస్త్రజ్ఞులను ........, అంటారు. (ప్రకృతి ధర్మవాదులు)
243. వాస్తవిక వ్యయాల భావనను ప్రవేశపెట్టినది ........... (మార్షల్)
244. 'Principles of Pure Economics' గ్రంథకర్త ........ (వాల్రాస్)
245. నాశిరకం వస్తువుల విషయంలో ఆదాయ డిమాండు వ్యాకోచం ..... గా వుంటుంది. (రుణాత్మకం)

246. "సంస్థ యొక్క విధానమును నిర్ణయించి, నియంత్రణ
' అని నిర్వచించినది ...............

247. మూలధన నిధినుండి ప్రతిఫలంగా వచ్చేది వడ్డీ అని చె

248. ప్రతిస్థాపన చేయగలిగిన వస్తువుల డిమాండు ...... గా

249. బహుళ ప్రయోజనాలు గల వస్తువుయొక్క డిమాండు ..

250. కొనుగోలు వాయిదా వేయటానికి అవకాశమున్న వస్తువు
వుంటుంది.

251. ఆదాయంలో అతి స్వల్పభాగం ఖర్చుచేసే వస్తువుల డిమాం

252. ........... వ్యయమనగా ఒక యూనిట్ ఉత్పత్తిని పెం
వ్యయంలో అదనంగా చేర్చబడే వ్యయం.

253. ........... వ్యయం, ఉపాంత రాబడికి సమానమైనప్పుడు సం
ఉత్పత్తి అభిలషణీయమైన స్థాయిలో వుంటుంది

254. ......... పరిమితంగా ఉంటే శ్రమవిభజన జరిగే అవకాశం

255. ధరల మార్పుకు డిమాండులో ఏర్పడే మార్పు సమాన
డిమాండు వ్యాకోచత్వం ......... గా వుంటుంది. (ఏ

256. ఏకస్వామ్య పోటీలో ఉపాంతరాబడి ........... వ్యయానికి
లాభాలు గరిష్ట స్థాయిలో ఉంటాయి.

257. సాధారణంగా శ్రమ స్వల్పకాలిక సప్లయ్ రేఖ ................
(కు

258. ఇతర వస్తువుల సేవల డిమాండ్ ఫలితంగా, వస్తుసేవల
సాధారణంగా ........ డిమాండు అంటారు.

259. సాధారణంగా వ్యవసాయరంగం ........ ప్రతిఫల సిద్ధాంతా

260. కొద్ది భారీ సంస్థలు పరిశ్రమలో ఉండి, ప్రామాణికమైన లే
వస్తూత్పత్తి చేస్తూ ఉండే మార్కెట్ నిర్మాణాన్ని.........అని
(

261. మూలకారకాలకు గల డిమాండు సాధారణంగా ....... డిమ

246. "సంస్థ యొక్క విధానమును నిర్ణయించి, నియంత్రణ చేసేదే వ్యవస్థాపకుడు' ' అని నిర్వచించినది ............... (బెన్‌హామ్)

247. మూలధన నిధినుండి ప్రతిఫలంగా వచ్చేది వడ్డీ అని చెప్పినవాడు ...... (సెలిగ్మన్)

248. ప్రతిస్థాపన చేయగలిగిన వస్తువుల డిమాండు ...... గా వుంటుంది. (వ్యాకోచం)

249. బహుళ ప్రయోజనాలు గల వస్తువుయొక్క డిమాండు ...... గా వుంటుంది. (వ్యాకోచం)

250. కొనుగోలు వాయిదా వేయటానికి అవకాశమున్న వస్తువుల డిమాండు ........ గా వుంటుంది. (అవ్యాకోచం)

251. ఆదాయంలో అతి స్వల్పభాగం ఖర్చుచేసే వస్తువుల డిమాండు .....గా వుంటుంది. (అవ్యాకోచం)

252. ........... వ్యయమనగా ఒక యూనిట్ ఉత్పత్తిని పెంచినందువల్ల మొత్తం వ్యయంలో అదనంగా చేర్చబడే వ్యయం. (ఉపాంత వ్యయం)

253. ........... వ్యయం, ఉపాంత రాబడికి సమానమైనప్పుడు సంపూర్ణ స్పర్ధలోని సంస్థ ఉత్పత్తి అభిలషణీయమైన స్థాయిలో వుంటుంది (ఉపాంతవ్యయం)

254. ......... పరిమితంగా ఉంటే శ్రమవిభజన జరిగే అవకాశంలేదు. (మార్కెట్ విస్తీర్ణం)

255. ధరల మార్పుకు డిమాండులో ఏర్పడే మార్పు సమానానుపాతంలో వుంటే డిమాండు వ్యాకోచత్వం ......... గా వుంటుంది. (ఒకటికి సమానంగా)

256. ఏకస్వామ్య పోటీలో ఉపాంతరాబడి ........... వ్యయానికి సమానమైనప్పుడు లాభాలు గరిష్ట స్థాయిలో ఉంటాయి. (ఉపాంత)

257. సాధారణంగా శ్రమ స్వల్పకాలిక సప్లయ్ రేఖ ................. కు వాలుతుంది. (కుడినుండి ఎడమకు)

258. ఇతర వస్తువుల సేవల డిమాండ్ ఫలితంగా, వస్తుసేవలకుండే డిమాండును సాధారణంగా ........ డిమాండు అంటారు. (ఉత్పన్న)

259. సాధారణంగా వ్యవసాయరంగం ........ ప్రతిఫల సిద్ధాంతానికి లోనవుతుంది. (క్షీణ)

260. కొద్ది భారీ సంస్థలు పరిశ్రమలో ఉండి, ప్రామాణికమైన లేక భిన్నత్వం కలిగిన వస్తూత్పత్తి చేస్తూ ఉండే మార్కెట్ నిర్మాణాన్ని..........అని అంటారు. (పరిమితస్వామ్యం)

261. మూలకారకాలకు గల డిమాండు సాధారణంగా ....... డిమాండు.(ఉత్పన్న)

262. నామమాత్ర వేతనాలు అనగా ........ రూపంలో గల వేతనాలు. (ద్రవ్య)

263. ఉత్పత్తి ఫలమునకు .......... పేరుకి దగ్గరి సంబంధముంది. (కాబ్-డగ్లస్)

264. ధర పెరిగినప్పుడు, మొత్తం వ్యయం కాకుండా పెరిగితే డిమాండు వ్యాకోచత్వం ఒకటికన్నా ......... (తక్కువ)

265. ఒక సజాతీయము ఉత్పత్తి ఫలమును Q=AKLLBతో సూచిస్తే దాని సజాతీయం యొక్క డిగ్రీ .......... సమానము. (ఒకటి)

266. ధర సగటు చర వ్యయానికి సమానమైనప్పుడు సంస్థ ............ కు సమానము. (Shut down point మూతపడుట)

267. సున్నాకి సమానమైన వాలు గల సగటు రాబడి రేఖయొక్క వ్యాకోచత్వము ............ బిందువును చేరుకొనును. (అనంతం)

268. పోటీ సంస్థయొక్క ఉపాంత వ్యయరేఖ, దాని ....... రేఖకు సమానము. (సప్లయ్)

269. "మైక్రో ఎకనామిక్స్" అనే పదాన్ని ...............ప్రవేశపెట్టారు. (రాగ్నార్ ఫ్రిష్)

270. ధరల నిష్పత్తికి సమానమైన వాలు గల సరళరేఖను .......... రేఖ అందురు. (బడ్జెట్ రేఖ లేక ధర రేఖ)

271. సాంప్రదాయ సిద్ధాంతంలో డిమాండు ఫలం సజాతీయంయొక్క డిగ్రీ.........గా వుండును. (ఒకటి)

272. ఉపాంత సాంకేతిక ప్రత్యామ్నాయ రేటు సమోత్పత్తి రేఖయొక్క..........కు సమానము. (వాలు)

273. ఒకే కొనుగోలుదారుడు గల మార్కెట్‌ను .................. అని చెప్పెదరు. (Monopsony మోనోప్సనీ)

274. 'An Inquiry into the Nature and Causes of Wealth of Nations' వ్రాసినవారు ................. (ఆడమ్‌స్మిత్)

275. ........మార్పు చెందే ఆర్థిక వ్యవస్థను అధ్యయనం చేసేది చలన అర్థశాస్త్రము (హెరాడ్) (ఉత్పత్తి రేటుల)

276. ..........లో వేతనాలు పెరిగితే శ్రమ సప్లయ్ తగ్గుతుంది. (అభివృద్ధి చెందిన దేశాలలో)

277. ఏకస్వామ్య సంస్థలో సమతౌల్య ఉత్పత్తికి ................ (ఉపాంత వ్యయం, ఉపాంత రాబడి సమానంగా వుంటుంది)

278. నామమాత్రపు వేతనాలు అనగా ...... రూపంలో గల వేతనాలు. (ద్రవ్య)

279. పద్ధతులు మార్పు చెందకుండా ఉన్నప్పుడు భూమిపై నియమించిన మూలధనం శ్రమలను పెంచినప్పుడు ప్రతిఫలం సాధారణంగా ............... (తక్కువ అనుపాతంలో పెరుగును - వ్యవసాయరంగంలో)

280. ఏకత్వ ఆదాయ వ్యాకోచ డిమాండు ఖర్చు పెట్టే ఆదాయంయొక్క అనుపాతం.......
(స్థిరం)

281. శుద్ధ ఏకస్వామ్యంలో డిమాండు రేఖ ........
(లంబ అతిపరావలయంగా ఉంటుంది)

282. ఒకే కొనుగోలుదారు, ఒకే అమ్మకందారు ఉన్న మార్కెట్‌ను ...........అంటారు
(Bilateral Monopoly ఇద్దరి మధ్య ఏకస్వామ్యం)

283. స్వల్పకాలిక వ్యయరేఖల ......దీర్ఘకాలిక సగటు వ్యయరేఖ
(కప్పె రేఖ enveloping curve)

284. జనాభా పెరుగుతున్న కొద్దీ భాటకం .......... (పెరుగుతుంది)

285. శుద్ధ ఏకస్వామ్యంలో డిమాండు రేఖ ఆకారం.......
(దీర్ఘ చతురస్ర అతి పరావలయం Rectangular Hyperbola)

286. రికార్డో ప్రకారం భాటకం............
(వైవిధ్యంవలన వచ్చే మిగులు Differential Surplus)

287. స్థూల ఆర్థిక విశ్లేషణ ..... పరిశీలిస్తుంది. (మొత్తాలను aggregates)

288. చలన ఆర్థిక విశ్లేషణ ......... అధ్యయనం చేస్తుంది.
(మార్పు చెందే విషయాలను)

289. ఆధునిక సిద్ధాంతం ప్రకారం దీర్ఘకాల సగటు వ్యయరేఖ ఆకారం ..........(L)

290. మొత్తం రాబడి, మొత్తం వ్యయరేఖల మధ్య దూరం.......సూచిస్తుంది.
(మొత్తం లాభాలు)

291. ఆర్థిక సూత్రాలను .........తో పోలుస్తారు.
(సముద్రపు అలలు) (Laws of Tides)

292. ...........లో ఉన్నప్పుడు సంస్థ సమతౌల్యంలో ఉంటుంది. (MC - MR)

293. భూమికి ...... లేదు. (ఉత్పత్తి వ్యయం)

294. మార్కెట్ కాలవ్యవధిలో వస్తువుయొక్క సప్లయ్ ....... (స్థిరం)

295. మొత్తం ప్రయోజనం ........ రేటుతో పెరుగును. (తగ్గుతున్న)

296. మార్షల్ వినియోగదారుని సమతౌల్యం ........ సూత్రంద్వారా తెలియపర్చెను.
(సమోపాంత ప్రయోజన)

297. సాధారణంగా డిమాండ్ అనగా ...... డిమాండ్. (ధర)

298. గిఫెన్ వస్తువులు ........ వస్తువులు. (నాశిరకం)

299. MR=MC=AR=AC ......... మార్కెట్ యొక్క సంస్థ సమతౌల్యం
(పరిపూర్ణ)

300. విచక్షణాత్మక ధరల విధానం ..... శక్తిని సూచించును. (ఏకస్వామ్య)

301. జనాభా పెరుగుదలవల్ల పెరిగే డిమాండ్‌ను ..... డిమాండ్ అందురు. (పెరిగిన)

302. .......... వేతనాల సిద్ధాంతమును వేతనాల జీవనాధార సిద్ధాంతం అందురు. (Iron/అయఃకఠిన)

303. వ్యవసాయ పరిశ్రమ ...... సూత్రమునకు లోబడి ఉన్నది. (క్షీణప్రతిఫల)

304. ........... నిర్వచనమును ఆడమ్‌స్మిత్ ఇచ్చెను. (సంపద)

305. ........... బదలీ అను సిద్ధాంతమును ప్రవేశపెట్టెను (Mrs. జోన్ రాబిన్‌సన్)

306. డిమాండ్‌రేఖ ఎడమవైపుకు జరిగిన......సూచించును. (డిమాండ్ తగ్గుదలను)

307. మొత్తం ఆదాయరేఖ, మొత్తం వ్యయరేఖలకు గల తేడా ..... సూచించును. (స్థూల లాభాలను)

308. విచక్షణాత్మక ధరలు ........ మార్కెట్‌లో జరుగును. (ఏకస్వామ్య)

309. ............. పోటీ అను సిద్ధాంతమును 'శ్రీమతి జోన్ రాబిన్‌సన్' రచించెను. (అపరిపూర్ణ)

310. ............ మార్కెట్‌లో ఒకే కొనుగోలుదారు ఉండును. (మోనోప్సని-Monopsony)

311. వ్యయాలు, ధరలకంటె ............ అయిన లాభములుండును. (తక్కువ)

312. ఏకస్వామ్య మార్కెట్‌లో ప్రకటన వ్యయాలు ........... (ఉండవు)

313. వస్తు భేదము ........... మార్కెట్‌లో కనిపించును. (ఏకస్వామ్య పోటీ)

314. ..........పోటీ సిద్ధాంతమును ఛాంబర్‌లిన్ రచించెను. (ఏకస్వామ్య)

315. ధర, వ్యయాలు ........ ఉన్నచో సాధారణ లాభాలుండును. (సమానంగా)

316. పరిపూర్ణపోటీ మార్కెట్‌లో అమ్మకపు వ్యయాలు ........... (ఉండవు)

317. అమ్మకపు వ్యయాలు ........ మార్కెట్‌లో ఉండును. (ఏకస్వామ్య పోటీ)

318. విచక్షణాత్మక ధరలు ...... మార్కెట్‌లో ఉండును. (ఏకస్వామ్య)

319. నిత్యావసర వస్తువులకు ........ డిమాండ్ ఉండును. (అవ్యాకోచ)

320. సగటు వ్యయం, సగటు ఆదాయానికి సమానమైన (AC=AR) ......... లాభాలు ఉండును. (సామాన్య)

321. ఒక సం॥ కాలంలో ఉత్పత్తి అయిన వస్తు సేవల మొత్తం విలువను........ అంటారు. (జాతీయ ఆదాయము)

322. నికర జాతీయోత్పత్తి = స్థూల జాతీయోత్పత్తి ....... (తరుగుదల ఖర్చు)

323. వ్యయార్హ ఆదాయము = వ్యష్టి ఆదాయము ........... (వ్యష్టి పన్నులు)

324. ముడి పదార్థాలను, సగం తయారు అయిన వస్తువులను ...... అంటారు. (ఇన్వెంటరీలు)

325. ద్రవ్య ఆదాయానికి లభించే వస్తురాశిని ..... అంటారు.(వాస్తవిక ఆదాయము)

326. నికర పెట్టుబడి = స్థూల పెట్టుబడి ..... (పునఃస్థాపిత పెట్టుబడి)

327. "ది జనరల్ థియరి ఆఫ్ ఎంప్లాయిమెంటు, ఇంటరెస్టు అండ్ మనీ" గ్రంథకర్త ................ (కీన్స్)

328. సార్వత్రిక సిద్ధాంత గ్రంథకర్త ...... (కీన్స్)

329. J. B. సే సిద్ధాంతాన్ని ......... అంటారు. (మార్కెట్)

330. ఎక్కువ వేతనాలే నిరుద్యోగితకు కారణమని చెప్పిన అర్థికవేత్త .......... (A. C. పిగూ)

331. ఆర్థిక వ్యవస్థలో సంపూర్ణ ఉద్యోగిత ఉంటుందనే ప్రమేయంపై ఆధారపడి ........ వేత్తలు తమ సిద్ధాంతాన్ని చెప్పినారు. (సాంప్రదాయ)

332. వినియోగము ....... పై ఆధారపడియుండును. (వ్యయార్హ ఆదాయము)

333. ఉపాంత వినియోగ ప్రవృత్తి పెరిగితే .......... తగ్గుతుంది. (ఉపాంత పొదుపు ప్రవృత్తి)

334. వినియోగ ఫలభావ సిద్ధాంతకర్త .................... (కీన్స్)

335. ఉపాంత వినియోగ ప్రవృత్తి ఒకటికన్నా ........ గా యుంటుంది. (తక్కువ)

336. ప్రవర్తనా ప్రభావమును గురించి చెప్పిన అర్థికవేత్త ................(డ్యూసన్ బెరి)

337. ఆదాయానికి, వినియోగ వ్యయానికి మధ్య గల సంబంధమును .......... అంటారు. (వినియోగ ఫలభావము)

338. ఆదాయంలో మార్పులు, వినియోగ వ్యయంలో మార్పుకు మధ్య గల సంబంధమును ..... అంటారు. (ఉపాంత వినియోగ ప్రవృత్తి)

339. ఒక యంత్రం నుండి రాగల నికర ఆదాయపు రేటును ....... అంటారు. (ఉపాంత మూలధన సామర్థ్యము)

340. పెట్టుబడి పెరిగేకొద్దీ ఉపాంత మూలధన సామర్థ్యము ...... (తగ్గుతుంది)

341. ఉపాంత మూలధన సామర్థ్యము, వడ్డీరేటు సమానంగా యున్నప్పుడు ....... సమతౌల్యంలో యుంటుంది. (పెట్టుబడి)

342. ఉపాంత మూలధన సామర్థ్యం అనే భావనను ప్రవేశపెట్టిన అర్థికవేత్త ........... (కీన్స్)

343. పొదుపు పెట్టుబడి సమానంగా ఉంటాయని భావించిన అర్థికవేత్త... (కీన్స్)

344. పొదుపు పెట్టుబడికన్నా ఎక్కువగా యున్నప్పుడు ధరలు .........(తగ్గుతాయి)

345. పొదుపు పెట్టుబడికన్నా తక్కువగా యున్నప్పుడు ధరలు .......... (పెరుగుతాయి)

346. ప్రేరిత పెట్టుబడి ...... పై ఆధారపడి యుంటుంది. (డిమాండ్)

347. ఆదాయ ప్రవాహానికి పొదుపు ......... (చిద్రము)

348. సాంప్రదాయ ఆర్థికవేత్తల ప్రకారంగా పొదుపు, పెట్టుబడులను సమాన పరచేది .......... (వడ్డీ రేటు)

349. సంపూర్ణ ఉద్యోగిత వద్ద సమష్టి డిమాండ్ పెరిగితే .................... పెరుగుతాయి. (ధరలు)

350. గుణకం విలువ ......... పై ఆధారపడి యుంటుంది. (ఉపాంత వినియోగ ప్రవృత్తి)

351. ఉద్యోగిత గుణకమును చెప్పిన ఆర్థికవేత్త ............. (R. F. ఖాన్)

352. వేగత్వరణ సూత్రంను చెప్పిన ఆర్థికవేత్త ....................... (J. M. క్లార్క్)

353. పెట్టుబడి గుణకమును చెప్పిన ఆర్థికవేత్త ............ (కీన్స్)

354. భారతదేశంలో కేంద్ర బ్యాంకును ....... అంటారు. (రిజర్వు బ్యాంకు)

355. రిజర్వు బ్యాంకు స్థాపించిన సంవత్సరము ........... (1935)

356. రిజర్వు బ్యాంకు జాతీయం చేయబడిన సంవత్సరము ........... (1949)

357. వాణిజ్య బ్యాంకులకు యిచ్చిన ఋణాలపై కేంద్రము వసూలు చేసే వడ్డీ రేటును......... అంటారు. (బ్యాంకు రేటు)

358. ద్రవ్యోల్బణ కాలంలో బ్యాంకు రేటు ....... (పెంచబడుతుంది)

359. ప్రతి ద్రవ్యోల్బణ కాలంలో బ్యాంకు రేటు ........... (తగ్గించబడుతుంది)

360. మార్కెట్‌లో సెక్యూరిటీల అమ్మటాన్ని కొనటాన్ని ..... అంటారు. (ఓపెన్ మార్కెట్ వ్యవహారాలు)

361. ద్రవ్యోల్బణ కాలంలో నగదు నిల్వల నిష్పత్తి ....... (పెంచబడుతుంది)

362. బ్యాంకులు....... ను సృష్టించును. (పరపతి)

363. స్టేట్‌బ్యాంకు స్థాపించబడిన ........... సంవత్సరము. (1955)

364. మొదటిసారిగా 14 బ్యాంకుల జాతీయం చేయబడిన సంవత్సరము ....... (1969)

365. సంపూర్ణ ఉద్యోగిత తర్వాత ఏర్పడే ధరల పెరుగుదలను ...... అంటారు. (వాస్తవిక ద్రవ్యోల్బణం)

366. మిశ్రమ ద్రవ్యోల్బణమును చెప్పిన ఆర్థికవేత్త ........... (చార్లెస్ షుల్జ్)

367. పన్ను తొలి ప్రభావము, అంతిమ ప్రభావము ఒకే వ్యక్తిపై యుంటే ఆ పన్నును .......... అంటారు. (ప్రత్యక్ష పన్ను)

368 పన్ను తొలి ప్రభావము అంతిమ ప్రభావము వేరు వేరు వ్యక్తులపై యుంటే ఆ పన్నును ......................... అంటారు. (పరోక్ష పన్ను)

# TRUE OR FALSE

క్రింద ఇచ్చిన వాక్యాలు సత్యమైతే T కి బ్రాకెట్ పెట్టుము. అసత్యమైతే F కి బ్రాకెట్

1. అర్థశాస్త్రానికి సంపద నిర్వచనం ఇచ్చినది మార్షల్.
2. అర్థశాస్త్రానికి శ్రేయస్సు నిర్వచనం ఇచ్చినది మార్షల్.
3. అర్థశాస్త్రానికి కొరత నిర్వచనం ఇచ్చినది రాబిన్స్.
4. 'Wealth of Nations' గ్రంథకర్త మార్షల్.
5. కార్లైల్, రస్కిన్, డికెన్స్ మొదలయినవారు కొరత నిర్వచనాన్ని విమర్శించినారు.
6. 'Elements of Economics' గ్రంథకర్త వాల్రాస్.
7. 'An Essay on Nature and Significance of Economic ! గ్రంథకర్త ఆడమ్‌స్మిత్.
8. అర్థశాస్త్రాన్ని 'Gospel of Mamman' అని వర్ణించినది కార్లైల్.
9. ఒక ప్రమేయంతో ప్రారంభించి కార్యాచరణభావాన్ని తర్కించి ప్రతిపాదించే పద్ధతిని "నిగమన పద్ధతి" అంటారు.
10. ఒక సమస్యకు సంబంధించిన విషయాలను స్వీకరించి, క్రోడీకరించి, ప సూత్రాన్ని ప్రతిపాదించే పద్ధతిని "ఆగమన పద్ధతి" అంటారు.
11. నిగమన పద్ధతిని "చారిత్రక పద్ధతి" అని కూడా అంటారు.
12. ఆగమన పద్ధతిని "అనుభవ ప్రధాన పద్ధతి" అని కూడా అంటారు.
13. అర్థశాస్త్రంలో సూక్ష్మ, స్థూల విశ్లేషణలను ప్రవేశపెట్టినది మార్షల్.
14. సూక్ష్మ అర్థశాస్త్రాన్ని "ధరల సిద్ధాంతం" అని పిలుస్తారు.
15. స్థూల అర్థశాస్త్రాన్ని "ఆదాయ ఉద్యోగిత సిద్ధాంతమని" పిలుస్తారు.
16. సూక్ష్మ అర్థశాస్త్రం యూనిట్ల మొత్తాన్ని అధ్యయనం చేస్తుంది.
17. స్థూల అర్థశాస్త్రం వైయుక్తిక యూనిట్లను అధ్యయనం చేస్తుంది.
18. ఒక కాలానికి సంబంధించిన ఆర్థిక చలన విషయాల మధ్య సం పరిశీలించే విశ్లేషణ నిశ్చల విశ్లేషణ.
19. అర్థశాస్త్రంలో నిశ్చల, చలన పదాలను 'J.S. మిల్' మొద ఉపయోగించాడు.
20. ఒక పరిస్థితి నుంచి మార్పుచెంది తిరిగి ఆ పరిస్థితిని చేరుకోక దూరంగా దాన్ని "స్థిర సమతౌల్య స్థితి" అంటారు.
21. ఆర్థిక సూత్రాలను 'ఆడమ్‌స్మిత్' సముద్రపు అలలతో పోల్చాడు.
22. కార్యకారణ సంబంధాన్ని వివరించేదే నిశ్చితశాస్త్రం.
23. ఆదర్శవంతమైన విషయాలను ప్రోత్సహించి మంచి చెడులను శాస్త్రమే ప్రామాణిక శాస్త్రం.

# TRUE OR FALSE

**క్రింద ఇచ్చిన వాక్యాలు సత్యమైతే Tకి బ్రాకెట్ పెట్టుము. అసత్యమైతే Fకి బ్రాకెట్ పెట్టుము**

1. అర్థశాస్త్రానికి సంపద నిర్వచనం ఇచ్చినది మార్షల్. T(F)
2. అర్థశాస్త్రానికి శ్రేయస్సు నిర్వచనం ఇచ్చినది మార్షల్. (T)F
3. అర్థశాస్త్రానికి కొరత నిర్వచనం ఇచ్చినది రాబిన్స్. (T)F
4. 'Wealth of Nations' గ్రంథకర్త మార్షల్. T(F)
5. కార్లైల్, రస్కిన్, డికెన్స్ మొదలయినవారు కొరత నిర్వచనాన్ని తీవ్రంగా విమర్శించినారు. T(F)
6. 'Elements of Economics' గ్రంథకర్త వాల్రాస్. (T)F
7. 'An Essay on Nature and Significance of Economic Science' గ్రంథకర్త ఆడమ్‌స్మిత్. T(F)
8. అర్థశాస్త్రాన్ని 'Gospel of Mamman' అని వర్ణించినది కార్లైల్. (T)F
9. ఒక ప్రమేయంతో ప్రారంభించి కార్యాచరణభావాన్ని తర్కించి సూత్రాన్ని ప్రతిపాదించే పద్ధతిని "నిగమన పద్ధతి" అంటారు. (T)F
10. ఒక సమస్యకు సంబంధించిన విషయాలను స్వీకరించి, క్రోడీకరించి, పరిశీలించి సూత్రాన్ని ప్రతిపాదించే పద్ధతిని "ఆగమన పద్ధతి" అంటారు. (T)F
11. నిగమన పద్ధతిని "చారిత్రక పద్ధతి" అని కూడా అంటారు. (T)F
12. ఆగమన పద్ధతిని "అనుభవ ప్రధాన పద్ధతి" అని కూడా అంటారు. (T)F
13. అర్థశాస్త్రంలో సూక్ష్మ, స్థూల విశ్లేషణలను ప్రవేశపెట్టినది మార్షల్. T(F)
14. సూక్ష్మ అర్థశాస్త్రాన్ని "ధరల సిద్ధాంతం" అని పిలుస్తారు. (T)F
15. స్థూల అర్థశాస్త్రాన్ని "ఆదాయ ఉద్యోగిత సిద్ధాంతమని" పిలుస్తారు. (T)F
16. సూక్ష్మ అర్థశాస్త్రం యూనిట్ల మొత్తాన్ని అధ్యయనం చేస్తుంది. T(F)
17. స్థూల అర్థశాస్త్రం వైయుక్తిక యూనిట్లను అధ్యయనం చేస్తుంది. T(F)
18. ఒక కాలానికి సంబంధించిన ఆర్థిక చలన విషయాల మధ్య సంబంధాన్ని పరిశీలించే విశ్లేషణ నిశ్చల విశ్లేషణ. (T)F
19. అర్థశాస్త్రంలో నిశ్చల, చలన పదాలను 'J.S. మిల్' మొదటిసారిగా ఉపయోగించాడు. (T)F
20. ఒక పరిస్థితి నుంచి మార్పుచెంది తిరిగి ఆ పరిస్థితిని చేరుకోక దూరంగా జరిగితే దాన్ని "స్థిర సమతౌల్య స్థితి" అంటారు. T(F)
21. ఆర్థిక సూత్రాలను 'ఆడమ్‌స్మిత్' సముద్రపు అలలతో పోల్చాడు. T(F)
22. కార్యకారణ సంబంధాన్ని వివరించేదే నిశ్చితశాస్త్రం. (T)F
23. ఆదర్శవంతమైన విషయాలను ప్రోత్సహించి మంచి చెడులను వివరించే శాస్త్రమే ప్రామాణిక శాస్త్రం. (T)F

24. 'అర్థశాస్త్రం నీతిశాస్త్రానికి దూరంగా ఉండజాలదు' అన్న ఆర్థికవేత్త రాబిన్స్. T(F)
25. సమగ్ర సమతౌల్య విశ్లేషణను వాల్రస్ అభివృద్ధిపరిచాడు. (T)F
26. కప్పులు, సాసర్లు ప్రత్యామ్నాయ వస్తువులు. T(F)
27. నూతన సంక్షేమ అర్థశాస్త్రానికి 'పారేటో' ఆదిగురువు. (T)F
28. ధరకు డిమాండ్‌కు గల అనులోమ సంబంధాన్ని తెలిపేదే డిమాండ్ సూత్రం. T(F)
29. పేదవారు ప్రధానంగా కొనే వస్తువుల ధర తగ్గితే డిమాండ్ పెరగడాన్ని "గిఫ్ఫెన్ వైపరీత్యం" అంటారు. (T)F
30. ఆదాయం పెరిగితే నాసిరకం వస్తువుల డిమాండు పెరుగుతుంది. (T)F
31. ఆదాయం పెరిగితే మేలురకం వస్తువుల డిమాండ్ పెరుగుతుంది. (T)F
32. డిమాండు వ్యాకోచత్వం విలువ '0' అయితే దాన్ని "పూర్తి అవ్యాకోచ డిమాండు' అంటారు. (T)F
33. డిమాండు వ్యాకోచత్వం విలువ ∞'. అయితే దాన్ని"పూర్తి వ్యాకోచ డిమాండు' అంటారు. (T)F
34. డిమాండు వ్యాకోచత్వం విలువ '>1' అయితే దాన్ని సాపేక్ష అవ్యాకోచ డిమాండు అంటారు. (T)F
35. ఏకత్వ వ్యాకోచ డిమాండు రేఖ సమకోణ అతి పరావలయ ఆకారంలో వుంటుంది. (T)F
36. పూర్తి వ్యాకోచ డిమాండు రేఖ Y - అక్షానికి సమాంతరంగా వుంటుంది. (T)F
37. ధర తగ్గినపుడు మొత్తం ఖర్చు పెడితే డిమాండు వ్యాకోచత్వం ఒకటి కంటే తక్కువ. (T)F
38. ధర తగ్గినప్పుడు మొత్తం ఖర్చుకూడా తగ్గితే డిమాండ్ వ్యాకోచత్వం ఒకటి కంటే తక్కువ. (T)F
39. డిమాండు వ్యాకోచత్వం =

$$\frac{\text{ధరలో వచ్చిన అనుపాత మార్పు}}{\text{డిమాండులో వచ్చిన అనుపాతమార్పు}}$$ (T)F

40. ఆదాయ డిమాండు వ్యాకోచత్వం =

$$\frac{\text{ఆదాయంలో వచ్చిన అనుపాత మార్పు}}{\text{డిమాండులో వచ్చిన అనుపాతమార్పు}}$$ (T)F

41. జాత్యంతర డిమాండు వ్యాకోచత్వం =

$$\frac{\text{X వస్తువు డిమాండులో వచ్చిన అనుపాత మార్పు}}{\text{Y వస్తువు ధరలో వచ్చిన అనుపాతమార్పు}}$$ (T)F

42. ప్రయోజనాన్ని సంఖ్యారూపంలో కొలవవచ్చుననేది ఆర్డినల్ ప్రయోజనం. T(F)
43. ప్రయోజనాన్ని పోల్చి చెప్పవచ్చుననేది ఆర్డినల్ ప్రయోజనం. (T)F
44. గాసెన్ ప్రథమ సూత్రమని "సమోపాంత సూత్రాన్ని" అంటారు. T(F)
45. సమాన సంతృప్తినిచ్చే వివిధ సముదాయాలను చూపే రేఖను డిమాండ్ రేఖ అంటారు. T(F)
46. సమాన సంతృప్తినిచ్చే వివిధ సముదాయాలను చూపే రేఖను డిమాండు రేఖ అంటారు. T(F)
47. క్షీణోపాంత ప్రయోజన సూత్రాన్ని మొదటిసారిగా చెప్పినది ఆడమ్‌స్మిత్. (T)F
48. ఉదాసీన వక్రరేఖా విశ్లేషణలో వినియోగదారుని సమతౌల్యం MRS xy $\frac{Px}{Py}$ T(F)
49. వినియోగదారుని మిగులు సిద్ధాంతాన్ని మొదటిసారిగా మార్షల్ చెప్పాడు. T(F)
50. ఉదాసీన వక్రరేఖా పద్ధతిని మొదటిసారిగా ప్రవేశపెట్టిన అర్థికవేత్త ఎడ్జివర్త్. T(F)
51. ధర - వినియోగరేఖనుండి డిమాండు రేఖను పొందవచ్చు. T(F)
52. ఆదాయ వినియోగరేఖ నుండి డిమాండు రేఖను పొందవచ్చు. T(F)
53. ఉదాసీన వక్రరేఖలు మూలబిందువుకు కుంభాకారముగా వుంటాయి (T)F
54. వృత్తి విభజనను "సూక్ష్మ శ్రమ విభజన" అంటారు. T(F)
55. భౌతిక ఉత్పత్తి సాధనాలకు ఉత్పత్తికి మధ్య వున్న సంబంధాన్ని ఉత్పత్తి ఫలం తెలియజేస్తుంది. (T)F
56. P=AL q e p ఉత్పత్తి ఫలాన్ని "హెన్రీ షుల్జ్" ప్రతిపాదించాడు. T(F)
57. భూసారంలో వుండే వ్యత్యాసాలమీద రికార్డో భాటక సిద్ధాంతం ఆధారపడింది. (T)F
58. మాల్థస్ సిద్ధాంతం ప్రకారం జనాభా అంకగణిత శ్రేణిలో పెరుగుతుంది. T(F)
59. మూలధనం ఉత్పత్తి చేయబడిన ఉత్పత్తి సాధనం. (T)F
60. తలసరి ఆదాయం పెరుగుతూ ఉన్నప్పుడు జనాభా పెరగవచ్చు. T(F)
61. మూలధనం పెరుగుదలకు మూలసంపద. T(F)
62. ఒక వుత్పత్తికారకానికి బదులు మరొక ఉత్పత్తి కారకాన్ని పూర్తి ప్రతిస్థాపన చేయగలిగితే ప్రతిస్థాపన వ్యాకోచత్వం = 0 T(F)
63. ఒక ఉత్పత్తి కారకానికి బదులు మరొక ఉత్పత్తి కారకాన్ని అసలు ప్రతిస్థాపన చేయటానికి వీలులేకపోతే ప్రతిస్థాపన వ్యాకోచత్వము=0 (T)F
64. పరిశ్రమ పెరుగుతున్నప్పుడు వచ్చే ఆదాలను "బహిర్గత ఆదా"లంటారు. (T)F

65. సంస్థ పెరుగుతున్నప్పుడు వచ్చే ఆదాలను "అంతర్గత ఆదా"లంటారు. (T)F
66. ఒక వస్తువును ఉత్పత్తి చేయడానికి చేసిన త్యాగాలు, ప్రయత్నాలను కలిపి అవకాశ వ్యయాలంటారు. T(F)
67. ఒక ఉత్పత్తి సాధనం దాని తర్వాత అత్యుత్తమ ప్రత్యామ్నాయ ఉపయోగంలో ఆర్జించగల మొత్తాన్ని "అవకాశ వ్యయం" అంటారు. (T)F
68. ఒక సంస్థ కొనుగోలు చేసిన ఉత్పత్తి సాధనాలకు చెల్లించిన వ్యయాలను నిజ వ్యయాలంటారు. T(F)
69 ఉత్పత్తిలో వచ్చే మార్పుల వలన మారేవ్యయాలను స్థిర వ్యయాలంటారు. T(F)
70. సగటు వ్యయరేఖ V ఆకారంలో ఉంటుంది T(F)
71. సగటు వ్యయరేఖ U ఆకారంలో వుంటుంది (T)F
72 సగటు రాబడిరేఖ డిమాండు రేఖ కూడా అవుతుంది (T)F
73. ఉపాంతరాబడి = సగటు రాబడి $\frac{1}{\text{డిమాండు వ్యాకోచం}}$ (T)F
74 డిమాండు వ్యాకోచత్వం = $\frac{AR}{AR - MR}$ (T)F
75. LR, MC రేఖ LR, AC రేఖను కనిష్ట బిందువువద్ద ఖండిస్తుంది. (T)F
76. స్వల్పకాలిక వ్యయ రేఖలన్నింటిని కప్పే రేఖను "Envelopes curve" అంటారు. (T)F
77. స్వల్పకాలిక వ్యయరేఖలన్నింటిని కప్పేరేఖను "Planning Curve" అంటారు. (T)F
78 శ్రమ సప్లయ్ రేఖ వెనుకకు వంగి ఉంటుంది. (T)F
79. పూర్తి అవ్యాకోచమైన సప్లయ్ రేఖ Yఅక్షానికి సమాంతరంగా ఉంటుంది. (T)F
80. ధరలో వచ్చిన అనుపాత మార్పుకన్నా సప్లయ్‌లో వచ్చే అనుపాత మార్పు తక్కువగా వుంటే, దాన్ని "సాపేక్ష వ్యాకోచం" అంటారు. (T)F
81. పూర్తి వ్యాకోచ సప్లయ్ విలువ అనంతం ($\propto$) (T)F
82. పూర్తి అవ్యాకోచ సప్లయి విలువ సున్నా. (T)F
83. సంస్థ MC=AR అయినప్పుడు సమతౌల్య స్థితిలో ఉంటుంది (T)F
84. పరిశ్రమ సమతౌల్యస్థితిలో ఉన్నప్పుడు సంస్థలన్నీ అధిక లాభాలను ఆర్జిస్తుంటాయి. T(F)
85. డిమాండు రేఖ వాలు, సప్లయ్ రేఖ వాలుకన్నా తక్కువగా వుంటే సమతౌల్యం అస్థిరంగా వుంటుంది. (T)F
86. పరిపూర్ణ పోటీలో సంస్థ సగటు రాబడి రేఖ ఎడమనుండి కుడికి క్రిందికి వాలుతూ ఉంటుంది. (T)F

87. పరిపూర్ణ పోటీలో సంస్థ ఉపాంత రాబడిరేఖ సగటు రాబడిరేఖ ARకు దిగువలో ఉంటుంది. (T)F
88. MC రేఖ MR రేఖను పైనుండి ఖండించినచోట సంస్థ సమతౌల్యస్థితిలో ఉంటుంది. T(F)
89. సగటు రాబడి, సగటు వ్యయంకన్నా ఎక్కువగా ఉన్నప్పుడు సామాన్య లాభాలు వస్తాయి. T(F)
90. పరిపూర్ణ పోటీలో సంస్థలు దీర్ఘ కాలంలో కూడా అధిక లాభాలను ఆర్జిస్తుంటాయి. T(F)
91. ఏకస్వామ్యం సంస్థ సమతౌల్యము ధర డిమాండులో వ్యాకోచత్వం ఒకటికన్నా ఎక్కువగా ఉన్నచోటనే నిర్ణయింపబడుతుంది. T(F)
92. వస్తువుయొక్క డిమాండు వ్యాకోచత్వాన్ని బట్టి ధర విచక్షణ సాధ్యమవుతుంది. (T)F
93. డిమాండు వ్యాకోచత్వం ఎక్కువగా వున్న మార్కెట్‌లో ఏకస్వామ్యదారుడు ఎక్కువ ధరను నిర్ణయిస్తాడు. T(F)
94. డిమాండు వ్యాకోచత్వం తక్కువగావున్న మార్కెట్‌లో ఏకస్వామ్యదారుడు వస్తువుకు ఎక్కువ ధరను నిర్ణయిస్తాడు. (T)F
95. ఏకస్వామ్యంలో సంస్థ దీర్ఘకాలంలో సామాన్య లాభాలను ఆర్జిస్తుంది. (T)F
96. ప్రకటనలు, ప్రచారాలపై చేసే వ్యయాలను "అమ్మకం వ్యయాల"ంటారు. T(F)
97. వస్తు విభేదం వలన అమ్మకం వ్యయాలవసరమౌతాయి. (T)F
98. కృత్రిమ భాటకం భావనను ప్రవేశపెట్టింది మార్షల్. (T)F
99. ప్రస్తుత ఆర్జన - బదిలీ ఆర్జన = భాటకం. (T)F
100. ఉత్పత్తి కారకాలకుండే డిమాండును "ఉత్పన్న డిమాండు" అంటారు. (T)F
101. రికార్డో దృష్టిలో భాటకం వైవిధ్యం వలన వచ్చిన మిగులు. (T)F
102. కృత్రిమ భాటకం స్వల్పకాలంలోనే ఉంటుంది. (T)F
103. శ్రమ సప్లయ్ రేఖ వెనుకకు వంగి ఉంటుంది. (T)F
104. ద్రవ్యత్వాభిరుచి వడ్డీ సిద్ధాంతాన్ని 'మార్షల్' ప్రతిపాదించాడు. (T)F
105. 'నైట్' లాభచలన సిద్ధాంతాన్ని ప్రతిపాదించాడు. T(F)
106. ధర నిర్ణయంలో కీన్సు కాలవ్యవధిని ప్రవేశపెట్టాడు. T(F)
107. వడ్డీరేటు రుణాత్మక నిధులు సప్లయ్, డిమాండులచే నిర్ణయింపబడుతుందని 'కీన్స్' చెప్పాడు. (T)F
108. ఉత్పత్తి కారకాలకు ఆదాయ పంపిణీ విశ్లేషణను " వైయక్తిక ఆదాయ పంపిణీ" అంటారు. T(F)

109. 'రికార్డో విశ్లేషణ' ప్రకారం జాతీయాదాయం పెరిగేకొద్దీ లాభాల వాటా పెరుగుతుంది. T(F)

110. సమోత్పాదక వక్రరేఖ (Isoquant) ఉత్పత్తి కారకాల మధ్య ప్రతిస్థాపన వ్యాకోచత్వాన్ని తెలియజేస్తుంది. T(F)

111. వ్యక్తి ఉదాసీనతా రేఖా చిత్రంలో (Indifference Map)లో అన్ని వక్రరేఖలు ఒకే సంతృప్తిస్థాయికి అనుగుణంగా ఉంటాయి. T(F)

112. ఏకస్వామ్య ధర తప్పనిసరిగా ఎక్కువగా ఉంటుంది. (T)F

113. ఉత్పత్తిని ఒక యూనిట్ పెంచినందువల్ల మొత్తం వ్యయంలో పెరుగుదల ఉపాంత వ్యయమగును. (T)F

114. ఏకస్వామ్యదారునికి ఉత్పత్తి ధరపైన నియంత్రణ కలదు. (T)F

115. భూమి సప్లయ్ అవ్యాకోచత్వం కలిగినందువల్ల క్షీణోపాంత ప్రతిఫల సిద్ధాంతం పని చేస్తుంది. (T)F

116. ఏకస్వామ్యపోటీ మార్కెట్‌లో కొద్దిమంది విక్రయదార్లు కొద్దిమంది వినియోగదార్లు వుంటారు. T(F)

117. వస్తువుల విశిష్టీకరణ (Product differentiation) లేకుండా పరిమితస్వామ్యం అసాధ్యము. T(F)

118 ధర పెరిగిన సప్లయ్ తగ్గుతుందని సప్లయ్ సిద్ధాంతం ప్రతిపాదిస్తుంది. T(F)

119 మొత్తం వ్యయం మొత్తం రాబడికి సమానమైనప్పుడు ఆ సంస్థ ఆర్థిక లాభాలను (economic profits) ఆర్జిస్తుంది T(F)

120. భూమి ప్రకృతి సిద్ధమవటంచేత, దీర్ఘకాలంలో కూడా కృత్రిమ బాడుగను ఆర్జిస్తుంది. T(F)

121. అర్థశాస్త్రంలో డిమాండు అనగా వ్యక్తికి వస్తుసేవలపై అభిరుచి, కోరిక. T(F)

122 పరిపూర్ణ పోటీలో ఎక్కువమంది అమ్మకందార్లు, తక్కువమంది వినియోగదార్లు వుండటం ముఖ్యమైన నిబంధన. T(F)

123. దీర్ఘకాల సమతౌల్యతలో వున్న సంస్థలో సగటు వ్యయం సగటు రాబడికి సమానం [AC=AR] (T)F

124. వస్తువులను తయారుచేయు సంస్థను పరిపూర్ణ ఏకస్వామ్యంగా [puremonopoly] పరిగణించాలంటే ఉత్పత్తినంతటినీ తాను నిర్ణయించిన ధరకు అమ్మేలాగా వుండవలె. T(F)

125. ఇతర మూలకారకాల ఆదాయాలకు, లాభాలకు తేడా కలదు లాభాలు అనిశ్చితమైన మిగులు అవడం చేత (T)F

126. పరిపూర్ణ పోటీలో ఒక మూలకారకములను దాని ఉపాంత రెవిన్యూ ఉత్పాదకత దాని ధరకు సమానమగునంతవరకు డిమాండు చేయబడును. (T)F

127. ద్రవ్యత్వాభిరుచి అనగా వినియోగం చేయకుండా వుండటం. T(F)
128. భూస్వామికి భూమిని వుపయోగించుటకు గాను చెల్లించు మొత్తమును ఆర్థిక భాటకమనబడును. T(F)
129. స్థూల జాతీయోత్పత్తి నికర జాతీయోత్పత్తికి ఎగుమతులు చేర్చిన సమానమగును. T(F)
130. ఒక వస్తువుకు గల వినియోగదారుని డిమాండు, ఆ వస్తువు ధరపై ఆధారపడి వుంటుంది. (T)F
131. సంపూర్ణ స్పర్థలో స్వల్పకాలంలో, విక్రయదారులు ధరను ప్రభావితం చేయలేరు. T(F)
132. ధర పెరుగుదలవల్ల డిమాండు తక్కువ అనుపాతంలో తగ్గితే, డిమాండు వ్యాకోచత్వ డిమాండు అవుతుంది. T(F)
133. మొత్తం వ్యయరేఖ మొత్తం సమానమైనపుడు ఏకస్వామ్యదారుడు ఉత్పత్తి చేయును. T(F)
134. ఒక వస్తువు ధరకు, డిమాండు చేయబడిన మొత్తానికి విలోమ సంబంధం కలదని డిమాండు సూత్రం ప్రతిపాదిస్తుంది. (T)F
135. అర్థశాస్త్రం భౌతికమైన వస్తువును గూర్చి అధ్యయనం చేయునేగాని మానవ వనరులను గురించి అధ్యయనం చేయదు. T(F)
136. పరిపూర్ణ పోటీ గల మార్కెట్‌లో వినియోగదార్లు అమ్మకందార్లపై ఎటువంటి నిబంధనలు లేకుండా స్వేచ్ఛగా వుండవలెను (T)F
137. ప్రజల ఆదాయం పెరిగినప్పుడు, వస్తువును ఎక్కువగా కొనుగోలు చేయకుంటే ఆ వస్తువును "తక్కువ రకం (inferior) వస్తువంటారు." (T)F
138. ఉత్పత్తి కారకానికి ఒప్పందం మేరకు చెల్లించే మొత్తాలని "లాభాలని" అంటారు. T(F)
139. పెక్కు సంస్థలుండి, అవి ఒక్కొక్కటి తక్కువ ఉత్పాదితం చేసే లక్షణం గలది పరిమితస్వామ్యం గల మార్కెట్. T(F)
140. డిమాండు చేయబడిన మొత్తం సమానుపాతంలోని మార్పును, సమానుపాతంలో మారిన ధరతో విభాగించగా, ఆదాయ డిమాండు వ్యాకోచత్వము వచ్చును T(F)
141. చర వ్యయాలు ఉత్పత్తి పరిమాణంతో ప్రత్యక్షంగా మారును. (T)F
142. వాస్తవమయిన ఏకస్వామ్యదారుడు లాభాలను గరిష్ఠ స్థాయికి తప్పనిసరిగా తెచ్చును. T(F)
143. సామాన్య లాభాలను అర్థశాస్త్రవేత్తలు ఉత్పత్తి వ్యయాలుగా పరిగణింతురు. T(F)

144. ఒక మూలకారక కనిష్ట సప్లయి ధరకన్నా ఎక్కువగా వచ్చే ప్రతిఫలాన్ని "ఆర్థిక మిగులు" అంటారు. (T)F

145. క్షీణోపాంత ప్రతిఫల సిద్ధాంతం, సాంద్ర, విస్తృత వ్యవసాయాలకు వర్తిస్తుంది. (T)F

146. అన్ని ఉత్పత్తి సాధనాలలోను భాటకం వుంది. (T)F

147 ప్రస్తుతం ఆర్జించేది ఒక ఉత్పత్తి కారకం అవకాశవ్యయం T(F)

148. స్వేచ్ఛా మార్కెట్‌లో సాధారణ పరిస్థితులలో వున్నదే సామాన్య ధర T(F)

149. ఏకస్వామ్యంలో ఉపాంత రాబడి ధరకు సమానం. T(F)

150. పోటీ వ్యవస్థలో అన్ని సంస్థలూ సమతౌల్య దశలో వున్నప్పుడు పరిశ్రమ కూడ సమతౌల్యదశలో తప్పనిసరిగా వుండును T(F)

151 సంతృప్తికి పరిమితిలేదనే ప్రమేయంపై ఉదాసీన వక్రరేఖలు గీయబడినవి. (T)F

152. శూన్య లాభాలను ఆర్జించే సంస్థను అభిలషణీయ సంస్థ అని వర్ణిస్తారు. T(F)

153. 'చాంబర్లిన్ ' విశ్లేషణలో పేర్కొన్న భేదమును సూచించు వస్తువుల మధ్యగల జాత్యంతర వ్యాకోచత్వం ధనాత్మకమై వుండును. T(F)

154. ఒక వస్తువుయొక్క ధర మరియు ఆదాయ వ్యాకోచత్వాలు రుణాత్మకమైన అట్టి వస్తువును తక్కువ రకమైన (Inferior) వస్తువుగా వర్ణిస్తారు. T(F)

155 దీర్ఘకాల వుపాంత వ్యయరేఖ వాస్తవంగా స్వల్పకాలిక ఉపాంత వ్యయరేఖల యొక్క మూత. T(F)

156. ఏకస్వామ్యదారుడు సమతౌల్యమును సగటు రాబడి రేఖపై వ్యాకోచత్వము ఒకటికన్నా తక్కువవున్న బిందువువద్ద సాధించుటకు ఇష్టపడును. (T)F

157. భారతదేశంలో వ్యవసాయ రంగంలో శ్రామికుల వేతనములు వారి ఉపాంత ఉత్పత్తిచే నిర్ణయించబడును. T(F)

158 సగటు రాబడి రేఖయొక్క వ్యాకోచత్వం అనంతమైనప్పుడు ఉపాంత రాబడి సున్నాకి సమానం T(F)

159 ఏకస్వామ్యదారుని లాభములపై విధించబడిన పన్ను ధరల పెంపుదలద్వారా ఎత్తివేయబడును. (T)F

160. గిఫ్ఫెన్ వైపరీత్యంలో ధర తగ్గిన ఎడల డిమాండు పెరుగుతుంది. T(F)

161. పూర్తి అవ్యాకోచమైన డిమాండు వున్న యెడల వ్యాకోచం "O"కి సమానం. (T)F

162 కార్డినల్ ప్రయోజనంలో ప్రయోజనమును ఖచ్చితంగా యూనిట్లలో కొలవవచ్చు. T(F)

163. ఉదాసీనతా వక్రరేఖ మూల బిందువునకు కుంభాకారంగా వుంటుంది. (T)F

164. మూలధనం ఉత్పత్తి చేయబడిన ఉత్పత్తి సాధనం. T(F)

165. దత్తాంశాల సహాయంతో సిద్ధాంతీకరణము చేయునదే ఆగమన పద్ధతి.(T)F
166. ఉదాసీన వక్రరేఖ కేంద్రం నుంచి పుటాకారంగా వుంటుంది. T(F)
167. ద్రవ్యత్వాభిరుచి ఆర్థిక వ్యవస్థలోని పెట్టుబడి రేటును సూచిస్తుంది T(F)
168. సగటు రాబడి రేఖయొక్క వ్యాకోచము అనంతమైనప్పుడు ఉపాంత రాబడి సున్నా అవుతుంది. T(F)
169. మూలధనం, శ్రమ అనేవి సంపూర్ణ ప్రత్యామ్నాయాలు కావు. (T)F
170. ఉదాసీనతా వక్రరేఖా పటం ఆర్డినల్ ప్రయోజన స్థాయిలను తెల్పును. T(F)
171. సంపూర్ణ స్పర్ధలో ఒక పరిశ్రమ యొక్క డిమాండు రేఖ పూర్తి వ్యాకోచము గలిగి వుండును. T(F)
172. ఆర్థిక శాస్త్రమునందు చారిత్రక విశ్లేషణ పద్ధతులను ఉపయోగించెదరు.(T)F
173. చాప వ్యాకోచమనగా ఒక బిందువువద్ద వ్యాకోచము. T(F)
174. సగటున స్థిర వ్యయరేఖ పెరుగుదల వాలు కలిగి వుండును. T(F)
175. వృద్ధి ప్రతిఫల సిద్ధాంతం పెరుగుతున్న సగటు రాబడిని తెలియజేయును. T(F)
176. సమగ్ర సమతౌల్యము, నిశ్చల సమతౌల్యము ఒక్కటే. T(F)
177. బీదదేశములో ఆవశ్యక వస్తువులు వ్యాకోచమైన డిమాండు కలిగి వుండును. (T)F
178. వస్తువుల విశిష్టీకరణ అనగా విచక్షణత అని అర్థం. T(F)
179. ఆర్థికాభివృద్ధి వలన తలసరి ఆదాయం పెరుగుతుంది. (T)F
180. సమోత్పాదక వక్రరేఖలు, వివిధ ఉత్పత్తి స్థాయిలను సూచించును. T(F)
181. సంపూర్ణమైన పోటీలో వృద్ధిచెందుతున్న ప్రతిఫలాలున్నప్పుడు సమతౌల్యము సాధ్యము. T(F)
182. సంస్థ ఉత్పత్తిలో స్థిరవ్యయాలు మారవు. T(F)
183. వినియోగదారుని విలాస వస్తువులు ముఖ్యము, అవసరం. T(F)
184. పెద్ద సంస్థలకు తరహా ననుసరించి వచ్చు నష్టదాయకాలుండవు. (T)F
185. ఉపాంత ప్రయోజనం యొక్క కొలమానం ధర. T(F)
186. మార్కెట్ సప్లయ్ మాత్రమే ధరను నిర్ణయించును. T(F)
187. వ్యాపార ప్రకటనలు, మార్కెట్లను సంపూర్ణమైన మార్కెట్లుగా రూపొందించును. (T)F
188. ద్విదాధిపత్యంలో సమతౌల్యం స్థిరంగా వుండును T(F)
189. శుద్ధమైన పోటీ, సంపూర్ణమైన పోటీ ఒక్కటే. T(F)
190. పరిపూర్ణ పోటీలో డిమాండు వ్యాకోచము లేక వుండును. T(F)
191. ఏకస్వామ్యంలో ధరలు హెచ్చిన డిమాండు హెచ్చును. T(F)
192. ఉదాసీన వక్రరేఖలు వినియోగదారులు పొందు ప్రయోజనముల మొత్తమును కొలుచును. T(F)

193. సమగ్ర సమతౌల్యం, ఉత్పత్తి కారకముల మార్కెట్‌లోని సమతౌల్యములను తెలియచేయును. T(F)
194. పరిపూర్ణ పోటీలో సమతౌల్య ధరలు ఉత్పత్తిలో కలుగు ఉపాంత వ్యయములకు సంబంధించి వుండును. (T)F
195. సంభావ్య ధర, వాస్తవిక ధర ఒకటేయైనచో వినియోగదారుని మిగులు కానరాదు. (T)F
196. సహేతుకమైన ఎంపిక చేయుటవలననే వినియోగదారులు గరిష్ట ప్రయోజనమును పొందుదురు. (T)F
197. కనిష్ట వేతనసిద్ధాంతం పరిపూర్ణ ఉద్యోగిత కలదనే ప్రమేయం మీద ఆధారపడును. (T)F
198. సూక్ష్మ ఆర్థిక విశ్లేషణ ధరల సిద్ధాంతమును పరిగణించును. (T)F
199. మార్షల్ ఉత్పత్తికై సంస్థల పరిమాణమును విశ్లేషించెను. T(F)
200. సంపూర్ణ ప్రత్యామ్నాయాలైన వస్తువుల యొక్క వివిధ కూటములను సూచించే ఉదాసీనతా వక్రరేఖ ఒక పుటాకార రేఖ. T(F)
201 డిమాండు పెరగటంలో సప్లయి కూడా పెరిగినచో సమతౌల్య పరిమాణము పెరుగును కాని సమతౌల్యాన్ని ధర ఆ నిర్ణయము indeterminate. (T)F
202. వినియోగదారుల కోర్కెలు వస్తువుల మార్కెట్ యొక్క డిమాండు పక్షమును తెలుపబడును T(F)
203. ఉపాంత ప్రయోజనము క్షీణించుచున్న యెడల మొత్తం ప్రయోజనము కూడా తప్పక క్షీణించుచుండును. T(F)
204 ఉపాంత రాబడి ఒక అదనపు యూనిట్ అమ్మగా మొత్తము రాబడికి కలిగి యున్నది (T)F
205. ఆదాయ ప్రభావము డిమాండు సిద్ధాంతము యొక్క మినహాయింపును వివరించును. T(F)
206. ఉత్పత్తి పరిమాణము పెరిగిన కొద్దీ ప్రత్యక్షముగా పెరుగు వ్యయాలను చర వ్యయాలని నిర్వచించవచ్చు. (T)F
207. అల్పకాలమందు శుద్ధ ఏకస్వామ్యదారు అతడు ఉత్పత్తి చేసి అమ్మే వస్తువునకు మార్కెట్ భరించగల అత్యధికమయిన ధరను విధించును. (T)F
208. పరస్పర సంబంధము అనగా పరిమిత స్వామ్యమందలి ఉత్పత్తిదారులు మొత్తం మార్కెట్‌యందలి తమ వాటా కొరకు ధరమీద ఆధారపడియుందురు. (T)F
209. ఒక వస్తువు యొక్క డిమాండు దాని ఉత్పాదకత మరియు అది ఉత్పత్తి చేయు వస్తువుయొక్క మార్కెట్ విలువమీద ఆధారపడి వుండును. (T)F

210. భాటకము ప్రోత్సాహక విధి నిర్వహించును. రేషనింగు విధిని కాదు. (T)F
211. డిమాండు పెరిగిన సమయంలో సప్లయి తగ్గినచో సమతౌల్య ధర హెచ్చును. (T)F
212. ఉత్పత్తి పెరిగినంత కాలం సగటు స్థిర వ్యయం క్షీణించును. (T)F
213. ఏకస్వామ్య పోటీ ఉత్పత్తిదారులు అధిక లాభాలను గడింతురు. T(F)
214. స్వచ్ఛంద స్పర్థ ఉత్పత్తిదారుడు ధర, ఉపాంత వ్యయమునకు సమానంగా వున్నంతవరకు ఉత్పత్తిని సాగించి గరిష్ట లాభమును పొందును T(F)
215. ఏకస్వామ్య స్వర్థయందు నిర్వహించబడు సంస్థకు దీర్ఘకాలమందు సామాన్య లాభాలను పొందుటకు గల కారణమేమనగా అవి వాటి సగటు వ్యయ వక్రరేఖ కనిష్ట బిందువువద్ద కొనసాగవలసిన పరిస్థితి ఏర్పడుతుంది. T(F)
216. భూమిమీద లభించు వివిధ భాటకములు దాని ఉపాంత ఆదాయ ఉత్పాదకతను ప్రతిబింబిస్తాయి T(F)
217 ఏకస్వామ్యంలో సగటు రాబడి = ఉపాంత రాబడి T(F)
218. సంపూర్ణమయిన పోటీలో సంస్థ డిమాండురేఖ ఎడమనుండి కుడికి వాలును T(F)
219. ఒక వస్తువు డిమాండు వ్యాకోచత్వం ఒకటికి సమానమైనప్పుడు ధర మార్పు చెందిననూ, ఆ వస్తువుపై అదే మొత్తం వెచ్చింపబడును. (T)F
220. క్షీణ ప్రతిఫల సిద్ధాంతము పరిశ్రమకు వర్తించదు. (T)F
221. ఏకస్వామ్యాలు ధరనుగాని, సప్లయి పరిమాణాన్ని గాని అదుపు చేయును. (T)F
222. ఏకస్వామ్యదారునికి ఉపాంత రాబడి ధరకన్నా ఎల్లప్పుడు తక్కువ. (T)F
223. రికార్డో ప్రకారం ఆర్థిక భాటకం మిగులు గాని, వ్యయంకాదు (T)F
224. సంపూర్ణ పోటీలో పరిశ్రమ డిమాండు వక్రరేఖే సంస్థ డిమాండు వక్రరేఖ అవుతుంది. (T)F
225. కొత్త సంస్థలు పరిశ్రమలో ప్రవేశించుటవలన సామాన్య లాభాలు ఎక్కువకాలం కొనసాగవు. (T)F
226. ఉత్పత్తి సున్నా అయినా కూడా మొత్తం స్థిరవ్యయాలు వెచ్చింపబడతాయి. (T)F
227. వ్యక్తుల మధ్య ఆదాయ పంపిణీని విధి నిర్వహణ వలన లభించిన ఆదాయ పంపిణీ అంటారు. T(F)
228. మొత్తం వ్యయం, మొత్తం రాబడి సమానమయినప్పుడు ఏకస్వామ్యదారుడు ఉత్పత్తి చేయును. T(F)
229. స్వల్పకాలంలో మూలధన పరికరాల సముపార్జనే కృత్రిమ భాటకం. (T)F
230. గిఫ్ఫెన్ వస్తువుల ఆదాయ వ్యాకోచత్వం ఋణాత్మకంగా వుంటుంది. (T)F

231 పరిమితస్వామ్యంలోని సంస్థలు ఎల్లప్పుడూ సాధారణ లాభాలను సముపార్జిస్తాయి. T (F)
232 కీన్స్ వడ్డీ సిద్ధాంతాన్ని ద్రవ్యేతర వడ్డీ సిద్ధాంతమని కూడా అంటారు. T (F)
233. సగటు రాబడి రేఖ ఉపాంత రాబడి రేఖకు దిగువలో వుంటుంది. T (F)
234. జాత్యంతర డిమాండు రేఖ క్రిందికి వాలుతూ వుంటే, తీసుకున్న రెండు వస్తువులు పూరక వస్తువులని తెలియజేస్తుంది. (T) F
235 వినియోగదారుని మిగులుకి, ధరకి మధ్య విలోమ సంబంధం కలదు. (T) F
236. కాబ్-డగ్లస్ ఉత్పత్తి ఫలములో శ్రమ, మూలధనం యొక్క ఘాతాంకాల మొత్తం ఒకటికంటే ఎక్కువగా వుంటే క్షీణ ప్రతిఫలాన్ని తెలియజేస్తుంది. T (F)
237 ఉదాసీనతా వక్రరేఖ సరళరేఖగా వుంటే తీసుకున్న రెండు వస్తువులు సంపూర్ణ ప్రత్యామ్నాయాలు. (T) F
238 ఏకస్వామ్య పోటీలో సంస్థ దీర్ఘకాలములో అధిక లాభాలు పొందవచ్చు. T (F)
239. డిమాండు వ్యాకోచం ఒకటికంటే ఎక్కువగా వున్న ఉపాంతరాబడి రుణాత్మకంగా వుండును. T (F)
240. మూల బిందువుకు దూరంగా వున్న ఉదాసీన వక్రరేఖలు అధిక సంతృప్తిస్థాయిని సూచిస్తాయి. (T) F
241. ధర పెరిగితే వినియోగదారుని మిగులు తగ్గును. (T) F
242. కాలవ్యవధి ఎక్కువ అవుతున్న కొద్దీ సప్లయి వ్యాకోచం తగ్గును. (T) F
243. ఏకస్వామ్యదారు దీర్ఘకాలంలో అధిక లాభాలను పొందలేడు. T (F)
244. తక్కువ రకం వస్తువుల విషయంలో ఆదాయ ప్రభావం ఋణాత్మకంగా వుంటుంది. (T) F
245. సప్లయి రేఖ ఎడమవైపు జరిగితే సప్లయి తగ్గుదలను సూచిస్తుంది (T)F
246. భారతదేశం ఎక్కువగా రాబడి కొరకు పరోక్షపన్నులపై ఆధారపడి వున్నది. (T)F
247 ఉత్పత్తి పెరుగుతున్నకొద్దీ సగటు స్థిర వ్యయం కూడా పెరుగుతుంది. T (F)
248. వేరు వేరు స్థాయి గల ఉదాసీనతా వక్రరేఖలు పరస్పరం ఖండించుకొనును. T (F)
249. ఉత్పత్తి ఆదాలు సాంకేతిక విభాజ్యాలపైన ఆధారపడి వుండును. (T) F
250 సమాన ఉత్పాదక రేఖలను కీన్స్ వివరించెను. T (F)
251 కాబ్ - డగ్లస్ ఉత్పత్తిలో వృద్ధి ప్రతిఫలాలను ప్రాతిపదికగా తీసుకొనిరి. T (F)
252. ద్రవ్యరూప వ్యయాలకు వాస్తవిక వ్యయాలకు భేదం లేదు. T (F)
253 ఎడమనుండి కుడి ప్రక్కకు పెరుగుచున్న ఆదాయ డిమాండ్‌రేఖ మేలు రకపు వస్తువుల డిమాండ్‌ను సూచించును. (T)F
254. కృత్రిమ భాటకం కేవలం తాత్కాలికం. (T)F
255. ఉపాంత ప్రయోజనం సున్న అయినప్పుడు మొత్తం ప్రయోజనం గరిష్ట స్థాయిలో వుండును. (T)F
256. డిమాండ్ రేఖపైన బిందువు డిమాండ్ వ్యాకోచతను తెలియజేయును. (T)F

257. 'y'అక్షమునకు సమాంతరంగా నిలువుగా వున్న డిమాండ్ రేఖ పూర్ణ వ్యాకోచతను సూచించును. T(F)

258. ఇద్దరు గుత్తాధిపతుల మధ్య పోటీని "గుత్తాధిపత్య పోటీ మార్కెట్" అంటారు. T(F)

259. పరిమితస్వామ్య మార్కెట్‌లో 'కింక్డ్' డిమాండ్‌రేఖ వుంటుంది. (T) F

260. మార్కెట్ ధర, సామాన్య ధర రెండూ ఒకటే. T(F)

261. వేతనాల చెల్లింపు పనికి సంబంధం వుండదు. T(F)

262. మార్షల్ కృత్రిమ భాటక సిద్ధాంతమును వివరించెను. (T)F

263. సాధారణంగా ఆదాయానికి వస్తువు డిమాండ్‌కు ప్రత్యక్ష సంబంధం వుంది. (T)F

264. అసాధారణ డిమాండ్‌రేఖలు గిఫ్ఫెన్ వస్తువుల రేఖను పోలియుండును. T(F)

265. సంపూర్ణపోటీ మార్కెట్‌లో వస్తువులు సజాతీయాలు. (T)F

266. ద్విదాధిపత్యంలో కొనుగోలుదార్లు యిద్దరు, వినియోగదార్లు అనేకులు వుందురు. T(F)

267. గుత్తాధిపత్యపు పోటీ మార్కెట్ వాస్తవానికి దూరం. T(F)

268. ద్విదాధిపత్యం, పరిమితస్వామ్యపు డిమాండ్ రేఖ ఒకటే . T(F)

269. వినియోగదార్ల సంఘాలు గుత్తాధిపత్యాన్ని అదుపులో వుంచగలవు. (T)F

270. పరిపూర్ణపోటీ మార్కెట్‌లో వస్తువులు సజాతీయములు కావు. T(F)

271. కొనువారు తక్కువగాను, అమ్మువారు అధికంగాను వున్న మార్కెట్‌ను పరిమితస్వామ్యమందురు. T(F)

272. ఒకే కొనుగోలుదారు, ఒకే విక్రయదారుడు వున్న మార్కెట్‌ను గుత్తాధిపత్యమందురు. T(F)

273. ద్విదాధిపత్యంలో 'కింక్డ్' డిమాండ్‌రేఖ వుండదు. (T)F

274. సగటు వ్యయరేఖ పెరిగినప్పుడు ఉపాంత వ్యయరేఖ పడిపోవును. T(F)

275. ఉదాసీన వక్రరేఖలు పరస్పరం ఖండించుకొనును. T(F)

276. శ్రేయస్సు నిర్వచనం 'ఆడమ్‌స్మిత్' చెప్పెను. T(F)

277. రికార్డో భాటక సిద్ధాంతం భేదాత్మక భాటకం. (T)F

278. పరిపూర్ణ పోటీ మార్కెట్‌లో సంస్థ యొక్క డిమాండ్‌రేఖ అనంతవ్యాకోచత కలిగి వుండును. (T)F

279. సంపద ఒక నిధి. ఆదాయం ప్రవాహము లాంటిది. (T)F

280. NNP = GNP − తరుగుదల (T)F

281. ప్రత్యక్షపన్నుల వలన వ్యయార్హ ఆదాయము తగ్గదు. T(F)

282. వ్యయార్హ ఆదాయము = వ్యష్టి ఆదాయము + పన్నులు. T(F)

283. మూలధన వస్తువులకు చెందే డిమాండ్‌ను "ఉత్పన్న డిమాండ్" అంటారు. (T)F

284. 1930 సం॥లో తీవ్ర ఆర్థిక మాంద్యము ఏర్పడినది. (T)F

285. సమష్టి సప్లయి రేఖ X అక్షానికి సమాంతరంగా వుంటుంది. T(F)

286. కీన్స్ ప్రకారంగా వేతనాల తగ్గింపు ఉద్యోగితా స్థాయిని పెంచును. T(F)

287. కీన్స్ తన ఉద్యోగితా సిద్ధాంతములో సమష్టి సప్లయి కన్నా సమష్టి డిమాండ్‌కే ప్రాధాన్యత యిచ్చాడు. (T)F

288. కీన్స్ ప్రకారంగా సమష్టి డిమాండ్ కొరత వల్ల నిరుద్యోగిత ఏర్పడుతుంది. (T)F

289. ఉపాంత వినియోగ ప్రవృత్తి ఒకటికి సమానంగా వుంటుంది. T(F)

290 గుణకం విలువ ఉపాంత వినియోగ ప్రవృత్తిని బట్టి వుంటుంది. (T)F

291. సగటు వినియోగ ప్రవృత్తి ఉపాంత వినియోగ ప్రవృత్తికన్నా ఎక్కువగా వుంటుంది. (T)F

292. డిమాండు స్థాయిలోని మార్పుల ప్రభావంగామారేది ప్రేరిత పెట్టుబడి (T)F

293. ఆర్థిక మాంద్యకాలంలో పెట్టుబడికన్నా పొదుపు తక్కువగా వుంటుంది. T(F)

294. వడ్డీరేటు, పెట్టుబడికి మధ్య విలోమ సంబంధము వుంటుంది. (T)F

295. ప్రభుత్వ వ్యయ గుణకం ఋణాత్మకంగా వుంటుంది. T(F)

296. గుణక సిద్ధాంతముకన్నా వేగత్వరణ సూత్రం పురాతనమైనది. (T)F

297. ద్రవ్యోల్బణకాలంలో బ్యాంకు రేటు తగ్గించబడుతుంది. T(F)

298. ద్రవ్యోల్బణకాలంలో ద్రవ్యం విలువ తగ్గుతుంది. (T)F

299. ద్రవ్యోల్బణ కాలంలో ఋణదాతలు లాభం పొందుతారు. T(F)

300. ద్రవ్యోల్బణం కన్నా ప్రతి ద్రవ్యోల్బణం ఎక్కువ హానికరము. (T)F

301. ద్రవ్యోల్బణం వల్ల బ్లాక్ మార్కెటింగ్ పెరుగుతుంది. (T)F

302. ఆదాయపన్ను ప్రత్యక్షపన్నుకు మంచి ఉదాహరణ. (T)F

303. పురోగామిపన్ను విధానంలో ఆదాయం పెరిగేకొద్దీ పన్నురేటు తగ్గుతుంది. T(F)

304. పరోక్ష పన్నులలో పన్నుల భారమును బదలీచేయటానికి వీలుండదు. T(F)

★ ★ ★

# బహుళ ఎంపిక ప్రశ్నలు

**క్రింది ప్రశ్నలకు నాలుగు జవాబులు ఇవ్వబడినాయి. అందులో సరైనదానిని ఎంపిక చేయండి.**

1. "Wealth of Nations" గ్రంథకర్త ........ (డి)
ఎ) మార్షల్ బి) రికార్డో సి) మార్క్స్ డి) ఆడమ్‌స్మిత్
2. అర్థశాస్త్రానికి సంపద నిర్వచనం ఇచ్చినది ....... (ఎ)
ఎ) ఆడమ్‌స్మిత్ బి) మార్షల్ సి) రాబిన్స్ డి) పిగూ
3. అర్థశాస్త్రానికి శ్రేయస్సు నిర్వచనం ఇచ్చినది ....... (బి)
ఎ) ఆడమ్‌స్మిత్ బి) మార్షల్ సి)రికార్డో డి) రాబిన్స్
4. అర్థశాస్త్రానికి కొరత నిర్వచనం ఇచ్చినది ....... (సి)
ఎ) ఆడమ్‌స్మిత్ బి) మార్షల్ సి) రాబిన్స్ డి) పిగూ
5. "Elements of Pure Economics" గ్రంథకర్త ....... (సి)
ఎ) ఆడమ్ స్మిత్ బి) మార్షల్ సి) కీన్సు డి) వాల్రాస్
6. లక్ష్యాల మధ్య తటస్థత వుండాలని చెప్పిన ఆర్థికవేత్త ....... (సి)
ఎ) కార్‌లైల్ బి) మార్షల్ సి) రాబిన్స్ డి) ఆడమ్‌స్మిత్
7. సూక్ష్మ, స్థూల ఆర్థిక విశ్లేషణను ప్రవేశపెట్టినది ....... (సి)
ఎ) మార్షల్ బి) బెవరిడ్జి సి) రాగ్నార్ ఫ్రిష్ డి) ఇర్వింగ్ ఫిషర్
8. ప్రమేయం ఆధారంగా కార్యకారణ సంబంధాన్ని తర్కించేది ....... (బి)
ఎ) ఆగమన పద్ధతి బి) నిగమన పద్ధతి
సి) సూక్ష్మ అర్థశాస్త్రము డి) స్థూల అర్థశాస్త్రము
9. ధరల సిద్ధాంతమని పిలవబడేది ....... (ఎ)
ఎ) సూక్ష్మ ఆర్థిక విశ్లేషణ బి) స్థూల ఆర్థిక విశ్లేషణ
సి) నిశ్చల ఆర్థిక విశ్లేషణ డి) చలన ఆర్థిక విశ్లేషణ
10. వైయక్తిక యూనిట్లను అధ్యయనం చేసేది ....... (సి)
ఎ) స్థిర సమతౌల్యం బి) అస్థిర సమతౌల్యం
సి) సూక్ష్మ విశ్లేషణ డి) స్థూల విశ్లేషణ
11. సమగ్ర సమతౌల్య విశ్లేషణను అభివృద్ధి పరచిన ఆర్థికవేత్త ....... (సి)
ఎ) డ్యూసిట్ బి) గాసన్ సి) వాల్రాస్ డి) షుంపీటర్

12. విభిన్న కాలాలకు సంబంధించిన ఆర్థిక చలన విషయాల మధ్య సంబంధాన్ని విశ్లేషణ చేసేది ....... (సి)
ఎ) సమగ్ర సమతౌల్యం బి) పాక్షిక సమతౌల్యం
సి) చలన విశ్లేషణ డి) నిశ్చల విశ్లేషణ

13. టూత్‌పేస్టు, బ్రష్ ...... (డి)
ఎ) ఉత్పాదక వస్తువులు బి) గిఫ్ఫెన్ వస్తువులు
సి) ప్రత్యామ్నాయ వస్తువులు డి) పూరక వస్తువులు

14. గాసెన్ ప్రథమ సూత్రం ....... (ఎ)
ఎ) క్షీణోపాంత ప్రయోజన సూత్రం బి) సమోపాంత సూత్రం
సి) ప్రతిస్థాపన సూత్రం డి) డిమాండు సూత్రం

15. గిఫ్ఫెన్ వైపరీత్యం అంటే ....... (సి)
ఎ) పేదవారు కొనే వస్తువులకు డిమాండు పెరగడం
బి) పేదవారు కొనే వస్తువులకు డిమాండు తగ్గడం
సి) పేదవారు కొనే వస్తువులకు ధర పెరిగినప్పుడు డిమాండ్ పెరగడం
డి) పేదవారు కొనే వస్తువులకు ధర తగ్గినప్పుడు డిమాండ్ పెరగడం

16. గిఫ్ఫెన్ వైపరీత్యం సూత్రానికి మినహాయింపు ....... (డి)
ఎ) క్షీణోపాంత ప్రయోజన సూత్రం బి) సమోపాంత సూత్రం
సి) క్షీణ ప్రతిఫల సూత్రం డి) డిమాండు సూత్రం

17. ఆదాయం పెరిగితే డిమాండు తగ్గే వస్తువులు ....... (ఎ)
ఎ) నాసిరకం వస్తువులు బి) మేలురకం వస్తువులు
సి) ప్రత్యామ్నాయ వస్తువులు డి) గిఫ్ఫెన్ వస్తువులు

18. ఒక వస్తువు డిమాండు దాని ధరపై ఆధారపడి వుంటుందని తెలియజేసేది ....... (సి)
ఎ) ఆదాయ డిమాండు బి) జాత్యంతర డిమాండు
సి) డిమాండు ఫలం డి) డిమాండు షెడ్యూలు

19. ధర పెరిగితే డిమాండ్ పెరగడాన్ని ....... (డి)
ఎ) ఆదాయ ప్రభావం బి) ప్రత్యామ్నాయ ప్రభావం
సి) డిమాండు ఫలం డి) గిఫ్ఫెన్ వైపరీత్యం

20. X వస్తువులో ధర మార్పు వలన Y వస్తువు డిమాండు మారటాన్ని ....... (సి)
ఎ) ఆదాయ ప్రభావం బి) ప్రత్యామ్నాయ ప్రభావం
సి) జాత్యంతర డిమాండు డి) గిఫ్ఫెన్ వైపరీత్యం

21. డిమాండు వ్యాకోచత్వం విలువ 1 కన్నా ఎక్కువ అయినప్పుడు ....... (బి)
ఎ) పూర్తి వ్యాకోచత్వం బి) సాపేక్ష వ్యాకోచత్వం
సి) సాపేక్ష అవ్యాకోచత్వం డి) ఏకత్వ వ్యాకోచత్వం

22. లంబ అతిపరావలయ ఆకారంలో వుండే రేఖ ....... తెలియజేస్తుంది (డి)
ఎ) పూర్తి వ్యాకోచ డిమాండు బి) పూర్తి అవ్యాకోచ డిమాండు
సి) సాపేక్ష వ్యాకోచ డిమాండు డి) ఏకత్వ వ్యాకోచ డిమాండ్

23. పూర్తి వ్యాకోచ డిమాండు రేఖ ....... (ఎ)
ఎ) X అక్షానికి సమాంతరంగా వుంటుంది
బి) Y అక్షానికి సమాంతరంగా వుంటుంది
సి) ఎడమనుంచి కుడికి క్రిందికి వాలుతుంది
డి) కుడినుంచి ఎడమకు క్రిందికి వాలుతుంది

24. పూర్తి అవ్యాకోచ డిమాండు రేఖ ....... (బి)
ఎ) X - అక్షానికి సమాంతరంగా వుంటుంది
బి) Y- అక్షానికి సమాంతరంగా వుంటుంది
సి) కుడి నుంచి ఎడమకు క్రిందికి వాలుతుంది
డి) ఎడమనుంచి కుడికి క్రిందికి వాలుతుంది

25. వస్తువు ధరలో వచ్చిన మార్పుకంటే డిమాండ్‌లో హెచ్చు మార్పువస్తే ....... అంటారు. (బి)
ఎ) వ్యాకోచ డిమాండు బి) సాపేక్ష వ్యాకోచ డిమాండు
సి) పూర్తి వ్యాకోచ డిమాండు డి) ఏకత్వ వ్యాకోచ డిమాండు

26. పూర్తి వ్యాకోచ డిమాండు విలువ ....... (డి)
ఎ) 1 కన్న ఎక్కువ బి) 1 కన్న తక్కువ సి) O డి) OC

27. ధర పెరిగినప్పుడు మొత్తం ఖర్చు పెరిగితే డిమాండు వ్యాకోచత్వం .......(సి)
ఎ) O బి) >1 సి) <1 డి) OC

28. ఆదాయ డిమాండు వ్యాకోచత్వం ....... (ఎ)

ఎ) $\dfrac{\text{డిమాండులో వచ్చిన అనుపాత మార్పు}}{\text{ఆదాయలో వచ్చిన అనుపాత మార్పు}}$

బి) $\dfrac{\text{ఆదాయంలో వచ్చిన అనుపాత మార్పు}}{\text{డిమాండులో వచ్చిన అనుపాత మార్పు}}$

సి) $\dfrac{\text{ధరలో వచ్చిన అనుపాత మార్పు}}{\text{ఆదాయంలో వచ్చిన అనుపాత మార్పు}}$

డి) $\dfrac{\text{ఆదాయంలో వచ్చిన అనుపాత మార్పు}}{\text{ధరలో వచ్చిన అనుపాత మార్పు}}$

29. జాత్యంతర డిమాండు వ్యాకోచత్వం ...... (ఎ)

ఎ) $\frac{\text{X వస్తువు ధరలో వచ్చిన అనుపాతమార్పు}}{\text{Y వస్తువు డిమాండులో వచ్చిన అనుపాత మార్పు}}$

బి) $\frac{\text{X వస్తువు డిమాండులో వచ్చిన అనుపాతమార్పు}}{\text{Y వస్తువు ధరలో వచ్చిన అనుపాత మార్పు}}$

సి) $\frac{\text{X వస్తువు ధరలో వచ్చిన అనుపాతమార్పు}}{\text{Y వస్తువు ధరలో వచ్చిన అనుపాత మార్పు}}$

డి) $\frac{\text{X వస్తువు డిమాండులో వచ్చిన అనుపాతమార్పు}}{\text{Y వస్తువు డిమాండులో వచ్చిన అనుపాత మార్పు}}$

30. వస్తువు ధర తగ్గినపుడు మొత్తం ఖర్చు పెరిగితే డిమాండు వ్యాకోచం........ (ఎ)
ఎ) సాపేక్ష వ్యాకోచం బి) సాపేక్ష అవ్యాకోచం
సి) పూర్తి వ్యాకోచం డి) పూర్తి అవ్యాకోచం

31. ప్రయోజనాన్ని సంఖ్యారూపంలో కొలవవచ్చేది ....... (బి)
ఎ) సమోపాంత సూత్రం బి) కార్డినల్ ప్రయోజనం
సి) ఆర్డినల్ ప్రయోజనం డి) క్షీణోపాంత ప్రయోజన సూత్రం

32. $MRS\ XY = \frac{PX}{PY}$ అంటే ...... (ఎ)
ఎ) ప్రతిస్థాపనోపాంత రేటు బి) వినియోగదారుని మిగులు సూత్రం
సి) ఉత్పత్తిదారుని సమతౌల్యం డి) ద్విదాధిపత్యంలో ధర నిర్ణయం

33. వినియోగదారుని మిగులు సిద్ధాంతాన్ని మొదటిసారిగా ప్రవేశపెట్టింది. (బి)
ఎ) మార్షల్ బి) డ్యూపిట్ సి) గాసెన్ డి) కానన్

34. ఉదాసీన వక్రరేఖా పద్ధతిని మొదటిసారిగా ప్రవేశపెట్టింది. ...... (డి)
ఎ) మార్షల్ బి) హిక్స్ సి) ఎల్లెన్ డి) ఎడ్జ్‌వర్త్

35. 'Value and Capital' గ్రంథకర్త ..... (బి)
ఎ) మార్క్స్ బి) హిక్స్ సి) ఫిషర్ డి) కీన్స్

36. సమాన సంతృప్తినిచ్చే వివిధ సముదాయాలను చూపే రేఖ....... (బి)
ఎ) డిమాండు రేఖ బి) ఉదాసీన వక్రరేఖ
సి) ధర వినియోగ రేఖ డి) ఆదాయ డిమాండు రేఖ

37. వాస్తవ పరిస్థితుల నాధారంగా గీసే డిమాండు రేఖను .... అంటారు. (డి)
ఎ) ఆదాయ డిమాండు రేఖ బి) బడ్జెట్ రేఖ
సి) ఉదాసీన వక్రరేఖ డి) గణాంక డిమాండు రేఖ

38. ఉత్పత్తి సాధనాలకు ఉత్పత్తికి గల సంబంధాన్ని తెలియచేసేది....... (బి)
ఎ) ఉత్పత్తి సిద్ధాంతం బి) ఉత్పత్తి ఫలం
సి) ప్రతిస్థాపనోపాంత రేటు డి) ఉత్పత్తి వ్యయాలు

39. వ్యవస్థాపకుని స్వంత ఉత్పత్తి కారకాలకు చెల్లించే వ్యయాలు........ (డి)
ఎ) నిజ వ్యయాలు బి) అవకాశ వ్యయాలు
సి) ప్రకటిత వ్యయాలు డి) అప్రకటిత వ్యయాలు

40. మూలధనం పెరుగుదలకు మూలం........ (సి)
ఎ) ఆదాయం బి) సంపద సి) పొదుపు డి) పెట్టుబడి

41. ఒక ఉత్పత్తి సాధనం దాని తర్వాత అత్యుత్తమ ప్రత్యామ్నాయ ఉపయోగంలో ఆర్జించగలిగినది ........ (బి)
ఎ) నిజ వ్యయాలు బి) అవకాశ వ్యయాలు
సి) ప్రకటిత వ్యయాలు డి) అప్రకటిత వ్యయాలు

42. ఉత్పత్తి చేయడానికి చేసిన త్యాగాలు, ప్రయత్నాలు-వ్యయాలు అవుతాయి... (ఎ)
ఎ) నిజ వ్యయాలు బి) అవకాశ వ్యయాలు
సి) ఉత్పత్తి వ్యయాలు డి) అప్రకటిత వ్యయాలు

43. సగటు వ్యయరేఖ ....... (సి)
ఎ) ఎడమనుంచి కుడికి క్రిందికి వాలుతుంది
బి) కుడినుంచి ఎడమకు క్రిందికి వాలుతుంది.
సి) U ఆకారంలో ఉంటుంది డి) గొడుగుకర్ర అకారంలో ఉంటుంది.

44. ఉపాంత వ్యయరేఖ....... (ఎ)
ఎ) U ఆకారంలో ఉంటుంది బి) గొడుగుకర్ర ఆకారంలో ఉంటుంది
సి) కుడినుంచి ఎడమకు వాలుతుంది డి) ఎడమనుంచి కుడికి వాలుతుంది.

45. సగటు రాబడి రేఖ ........ (డి)
ఎ) U ఆకారంలో ఉంటుంది బి) గొడుగుకర్ర ఆకారంలో ఉంటుంది
సి) కుడినుండి ఎడమకు వాలుతుంది డి) ఎడమనుండి కుడికి వాలుతుంది

46. ఉపాంత రాబడి రేఖ ...... (సి)
ఎ) U ఆకారంలో ఉంటుంది బి) గొడుగుకర్ర ఆకారంలో ఉంటుంది
సి) ఎడమనుండి కుడికి వాలుతుంది డి) కుడినుండి ఎడమకు వాలుతుంది.

47. సమతౌల్య ఉత్పత్తి స్థాయిని తెలియచేస్తుంది........ (సి)
ఎ) AC = AR బి) AC = MC సి) MC = MR డి) MR = AR

48. MC = MR మరియు AC = AR క్రింది దాన్ని తెలియచేస్తుంది....... (డి)
ఎ) గరిష్ట లాభాలు బి) సామాన్య లాభాలు
సి) సంస్థ సమతౌల్యం డి) పరిశ్రమ సమతౌల్యం

49. పరిపూర్ణ పోటీలో సగటు రాబడి రేఖ ఉంటుంది ....... (ఎ)
ఎ) x- అక్షానికి సమాంతరంగా బి) y- అక్షానికి సమాంతరంగా
సి) ఎడమనుంచి కుడికి వాలుతూ డి) కుడినుంచి ఎడమకు వాలుతూ

50. పరిపూర్ణ పోటీలో ..... (బి)
ఎ) AC = MR బి) AR = MR
సి) MC = AC డి) MC = AR

51. డిమాండు వ్యాకోచత్వం ............. (ఎ)
ఎ) $\frac{AR}{AR - MR}$ బి) $\frac{MR}{AR - MR}$
సి) $\frac{AR - MR}{AR}$ డి) $\frac{AR - MR}{AR}$

52. సంస్థ సామాన్య లాభాలు....... (బి)
ఎ) MC = MR బి) AC = AR సి) MC = AR డి) MC = MR

53. పరిశ్రమ సమతౌల్యంలో ఉన్నప్పుడు ..... ఆర్జిస్తుంటాయి. (బి)
ఎ) సంస్థలన్నీ గరిష్ట లాభాలు బి) సంస్థలన్నీ సామాన్య లాభాలు
సి) ఎక్కువ సంస్థలు గరిష్ట లాభాలు, కొద్ది సంస్థలు సామాన్య లాభాలు
డి) కొద్ది సంస్థలు గరిష్ట లాభాలు, ఎక్కువ సంస్థలు సామాన్య లాభాలు

54. ఏకస్వామ్య సంస్థ సమతౌల్యం సూచిస్తుంది ...... (బి)
ఎ) AC = MC బి) AC = MR
సి) MC = MR డి) MC = AR

55. ధర విచక్షణ అంటే ...... (ఎ)
ఎ) వివిధ వస్తువులకు వివిధ ధరలు బి) వివిధ మార్కెట్లలో వివిధ ధరలు
సి) స్వల్పకాలంలో హెచ్చు ధర, దీర్ఘకాలంలో తక్కువ ధర
డి) స్వల్పకాలంలో తక్కువ ధర, దీర్ఘకాలంలో హెచ్చు ధర

56. ఏకస్వామ్యంలో AR, MR రేఖలు ............... ఉంటాయి. ( సి )
ఎ) AR, X అక్షానికి, MR, Y అక్షానికి సమాంతరంగా
బి) AR, Y అక్షానికి, MR, X అక్షానికి సమాంతరంగా
సి) AR, MR లు రెండూ ఎడమ నుంచి కుడికి క్రిందికి వాలుతూ
డి) AR, MRలు ఒకదాని నొకటి ఖండించుకుంటూ

57. ఏకస్వామ్యంలో MC, MR రేఖలు ఉంటాయి .......... ( బి )
ఎ) రెండూ ఎడమ నుంచి కుడికి క్రిందికి వాలుతూ
బి) ఒకదానినొకటి ఖండించుకుంటూ సి) MCకి ఎగువ MR రేఖ
డి) MCకి దిగువ MR రేఖ

58. ఏకస్వామ్య పోటీ ప్రధాన లక్షణం....... ( ఎ )
ఎ) వస్తు విభేదం బి) ధర విచక్షణ
సి) సన్నిహిత ప్రత్యామ్నాయాలుండకపోవటం
డి) వినియోగదార్ల మధ్య పోటీ లేకపోవటం

59. ప్రకటనలు, ప్రచారాలపై చేసే వ్యయాలు ........ ( బి )
ఎ) ఉత్పత్తి వ్యయాలు బి) అమ్మకం వ్యయాలు
సి) నిజ వ్యయాలు డి) అప్రకాశ వ్యయాలు

60. కింకీ డిమాండు రేఖ (Kinky demand curve) సిద్ధాంతం క్రింది మార్కెట్‌లో ఉంది .......... ( బి )
ఎ) ద్విదాధిపత్యం బి) పరిమితస్వామ్యం
సి) ఏకస్వామ్యపోటీ డి) అపరిపూర్ణపోటీ

61. ధరల నాయకత్వం పద్ధతి క్రింది మార్కెట్ నిర్మాణంలో ఉంటుంది.....( డి )
ఎ) ఏకస్వామ్యం బి) ద్విదాధిపత్యం
సి) ఏకస్వామ్య పోటీ డి) పరిమితస్వామ్యం

62. ఉపాంత ఉత్పాదకతా సిద్ధాంతంతో పేరు ముడిపడి ఉన్న అర్థికవేత్త......( సి )
ఎ) J. S. మిల్ బి) J. B. సే సి) J. B. క్లార్క్ డి) J. M. కీన్సు

63. కృత్రిమ భాటకం అనే భావనను ప్రవేశపెట్టినది ........ ( బి )
ఎ) డేవిడ్ రికార్డో బి) మార్షల్
సి) జె. యమ్. కీన్సు డి) కారల్ మార్క్సు

64. బదిలీ సంపాదన అనే భావనను ప్రవేశపెట్టినది ....... ( డి )
ఎ) బెవరిడ్జి బి) ఎడ్జ్‌వర్త్ సి) లయోనల్ రాబిన్స్ డి) జోన్ రాబిన్‌సన్

65. సప్లయిరేఖ వెనుకకు వంగి ఉంటుంది .......... ( బి )
ఎ) భూమి బి) శ్రమ సి) మూలధనం డి) వ్యవస్థాపన

66. వడ్డీని పరిత్యాగానికి ప్రతిఫలం అని చెప్పిన అర్థికవేత్త......... ( సి )
ఎ) మార్షల్ బి) కీన్సు సి) నాసాసీనియర్ డి) ఇర్వింగ్ ఫిషర్

67. కాలాధిక్యత వడ్డీ రేటు సిద్ధాంతాన్ని చెప్పినది....... ( బి )
ఎ) నాసాసీనియర్ బి) ఇర్వింగ్ ఫిషర్
సి) సాంప్రదాయ అర్థికవేత్తలు డి) నవ్య సాంప్రదాయ అర్థికవేత్తలు

68. కీన్సు సిద్ధాంతం ప్రకారం వడ్డీరేటు క్రింది అంశాలచేత నిర్ణయింపబడుతుంది ......... ( డి )
ఎ) ఋణాత్మక నిధుల సప్లయ్, డిమాండు బి) మూలధన ఉపాంత ఉత్పాదకత
సి) పొదుపు డిమాండు, సప్లయి డి) ద్రవ్యం డిమాండు, సప్లయి

69. జోన్‌రాబిన్‌సన్ దృష్టిలో భాటకం అనగా ....... ( బి )
ఎ) ఉత్పత్తి వ్యయంపై మిగులు బి) బదిలీ అర్జనపై మిగులు
సి) వైవిధ్యంవల్ల మిగులు డి) ఉపాంత భూమిపై మిగులు

70. నవ్యసాంప్రదాయ ఆర్థికవేత్తల వడ్డీ సిద్ధాంతం ......... ( ఎ )
ఎ) ఋణాత్మక నిధుల వడ్డీ సిద్ధాంతం
బి) పొదుపు డిమాండు సప్లయిల సిద్ధాంతం
సి) నవకల్పన సిద్ధాంతం డి) ద్రవ్యం డిమాండు, సప్లయిల సిద్ధాంతం.

71. లాభచలన సిద్ధాంతాన్ని ప్రతిపాదించిన ఆర్థికవేత్త ....... ( సి )
ఎ) F. H. నైట్ బి) షుంపీటర్ సి) J. B. క్లార్క్ డి) ఫిషర్

72. "Risk uncertainty and profit" గ్రంథకర్త........ ( బి )
ఎ) నాసాసీనియర్ బి) F.H. నైట్ సి) J.B. క్లార్క్ సి) షుంపీటర్

73. నవకల్పనల లాభ సిద్ధాంతాన్ని చెప్పింది........ ( సి )
ఎ) నాసాసీనియర్ బి) ఫిషర్ సి) షుంపీటర్ డి) నైట్

74. ధర నిర్ణయంలో కాల వ్యవధిని ప్రవేశపెట్టినది ....... ( ఎ )
ఎ) మార్షల్ బి) రికార్డో సి) ఫిషర్ డి) కీన్సు

75. నష్టభయానికిగాను లాభాలను చెల్లించాలన్నది...... ( ఎ )
ఎ) హాలే బి) హాబ్రే సి) క్లార్క్ డి) షుంపీటర్

76. నాసిరకం వస్తువుల విషయంలో ఆదాయ డిమాండు వ్యాకోచత్వం..... (సి)
ఎ) అనంతం బి) సున్న సి) రుణాత్మకం డి) ఒకటి

77. ప్రతిస్థాపన చేయగలిగిన వస్తువుల డిమాండు........ ( ఎ )
ఎ) వ్యాకోచ డిమాండు బి) అవ్యాకోచ డిమాండు
సి) ఉత్పన్న డిమాండు డి) రుణాత్మక డిమాండు

78. బహుళ ప్రయోజనాలు గల వస్తువుల డిమాండు......... ( ఎ )
ఎ) వ్యాకోచ డిమాండు బి) అవ్యాకోచ డిమాండు
సి) ఉత్పన్న డిమాండు డి) జాత్యంతర డిమాండు

79. ధరల నిష్పత్తికి సమానమైన వాలుగల సరళరేఖ...... ( సి )
ఎ) డిమాండు రేఖ బి) ఉదాసీన రేఖ
సి) బడ్జెట్ రేఖ డి) సమోత్పాదక రేఖ

80. ఒకే కొనుగోలుదారు, ఒకే అమ్మకందారు ఉన్న మార్కెట్....... ( ఎ )
ఎ) ఏకస్వామ్యం బి) ఏకస్వామ్యపోటీ
సి) ఇద్దరి మధ్య ఏకస్వామ్యం డి) ద్విదాధిపత్యం

## విశ్వవిద్యాలయ పరీక్షలలో అడిగిన ప్రశ్నలు

81. అర్థశాస్త్రానికి కొరత నిర్వచనాన్నిచ్చింది........ ( బి )
ఎ) A.C. పిగూ బి) లయనల్ రాబిన్స్
సి) ఎడ్విన్ కానన్ డి) రాబిన్‌సన్

82. ఆర్థిక సిద్ధాంతములనగా........ ( డి )
ఎ) వినియోగదారుని ప్రవర్తనకు సంబంధించిన ప్రాథమిక ప్రతిపాదనలు
బి) పోటీలేని మార్కెట్ పనిచేయుటకు కావలసిన సూత్రాలు
సి) ఒక సమాజంలో విస్తృతంగా అంగీకరించిన ఆర్థిక విలువల సార్వత్రిక ప్రతిపాదనలు
డి) ఆర్థిక ప్రవృత్తుల ప్రతిపాదనలు

83. ఈ క్రింది వానిలో వినియోగదారుని మిగులు అత్యధికంగా ఉంటుంది....
ఎ) నిత్యావసరాలు బి) సౌకర్యాలు సి) విలాసాలు ( ఎ )
డి) సాంప్రదాయకమైన లేక అచారబద్ధమైన అవసరాలు

84. ఆదాయ వ్యాకోచ డిమాండును క్రింది విధంగా తెలియచేయవచ్చును .....

ఎ) $\dfrac{\text{డిమాండు చేయబడిన శాతంలోని మార్పు}}{\text{ఆదాయ మార్పులోని శాతం}}$ (ఎ)

బి) $\dfrac{\text{ఆదాయ మార్పులోని శాతం}}{\text{డిమాండు చేయబడిన మొత్తంలోని మార్పు}}$

సి) $\dfrac{\text{డిమాండు మొత్తంలోని మార్పు} \times \text{ఉపాంత ఆదాయంలోని మార్పు}}{100}$

డి) $\dfrac{100}{\text{డిమాండు చేయబడిన మొత్తంలోని మార్పు}}$

85. వస్తుసేవలపై వివేచన గల వినియోగదార్లు తమ వ్యయాన్ని కేటాయించడాన్ని ఈ క్రింది విధంగా విశదపరచవచ్చు....... ( బి )
ఎ) క్షీణోపాంత ప్రయోజన సిద్ధాంతం బి) సమోపాంత ప్రతిఫలసూత్రం.
సి) ఉపాంత ప్రత్యామ్నాయ రేటు డి) గిఫ్ఫెన్ వైపరీత్యం.

86. రెండు మార్కెట్లలోను (ఈ క్రింది వానిలో ఏవైనా) ఉన్న విచక్షణాత్మక ఏకస్వామ్యం వీలువుతుంది...... ( సి )
ఎ) పెరుగుతున్న వ్యయ వక్రరేఖలు
బి) పెరుగుతున్న, తగ్గుతున్న వ్యయ వక్రరేఖలు.
సి) వివిధ డిమాండు వ్యాకోచితలు
డి) డిమాండు వ్యాకోచితాలు సమానంగా ఉండటం.

87. క్రిందివానిలో ఏది ఏకస్వామ్యం మార్కెట్‌ని తెలియచేయును..... ( ఎ )
ఎ) ఒక్క అమ్మకందారుడు, పెక్కు వినియోగదార్లు.
బి) ఒక వినియోగదారుడు, పెక్కు అమ్మకందార్లు.
సి) ఒక వినియోగదారుడు, ఒక అమ్మకందారుడు.
డి) కొద్దిమంది అమ్మకందార్లు, పెక్కుమంది వినియోగదారులు.

88. పరిపూర్ణ పోటీలో శ్రమ ఉపాంత రెవెన్యూ ఉత్పాదన క్రింది విధంగా కొలవవచ్చు ......... (ఎ)

ఎ) $\frac{\text{శ్రమ ఉపాంత ఉత్పాదన}}{\text{ఉత్పాదన ధర}}$  బి) $\frac{\text{శ్రమ ఉపాంత ఉత్పాదన}}{\text{ఉపాంత రెవెన్యూ}}$

సి) శ్రమ ఉపాంత ఉత్పాదన × ఉత్పాదన ధర
డి) శ్రమ ఉపాంత ఉత్పాదన × ఉపాంత రాబడి

89. కృత్రిమ బాడుగ అనగా...... ( సి )
ఎ) శ్రామిక వేతనాలు బి) శ్రామికులు భూస్వాములు పంచుకున్న భాటకం
సి) స్వల్పకాలంలో స్థిర సప్లయిగల మూలకారక ప్రతిఫలం

90. సాధారణంగా మొత్తం ప్రయోజనం హెచ్చుగా వున్న వినియోగ స్థాయిలో ఉపాంత ప్రయోజనం ........ ( డి )
ఎ) మొత్తం ప్రయోజనానికి సమానం బి) మొత్తం ప్రయోజనంలో సగం
సి) ఒకటికి సమానం డి) సున్న

91. పూర్తి వ్యాకోచ డిమాండును, ఈ క్రింది విధంగా చూపవచ్చు ..... ( ఎ )
ఎ) క్షితిజ సరళరేఖ బి) ఊర్ధ్వ సరళరేఖ
సి) ఎడమనుంచి కుడికి వాలుతున్న సరళరేఖ డి) ఒక కింకీ వక్రరేఖ

92. ఈ క్రింది పరిశ్రమలలో ఏది పరిపూర్ణ పోటీ గల మార్కెట్ దాదాపు అన్వయిస్తుంది...... ( డి )
ఎ) మోటార్లు బి) సిగరెట్లు
సి) న్యూస్‌ప్రింటు డి) గోధుమ వ్యవసాయం

93. పరిమితస్వామ్యం అనగా ...... ( సి )
ఎ) పెక్కుమంది అమ్మేవారు కొనేవారు వుండడం.
బి) ఒకరు కొనేవారు, పెక్కుమంది అమ్మేవారు ఉండటం.
సి) కొద్దిమంది అమ్మేవారు, పెక్కుమంది వినియోగదార్లు వుండటం.
డి) ఒకరు కొనేవారు, ఒకరు అమ్మేవారు వుండటం.

94. ఆర్థిక వస్తువు కాని దానికి ఉదాహరణ ........ ( సి )
ఎ) సిగరెట్టు బి) సిగరెట్టు ముట్టించే లైటర్
సి) ఎడారిలో యిసుక డి) బాడుగకు తీసుకున్న యంత్రం

95. ఏకస్వామ్య పోటీలో సంస్థ సగటు వక్రరేఖ సామాన్యంగా ....... ( బి )
ఎ) ఎడమనుంచి కుడికి పైకి పోతుంది
బి) ఎడమ నుంచి కుడికి క్రిందికి వాలుతుంది.
సి) క్షితిజ అక్షానికి సమాంతర రేఖగా వుంటుంది.
డి) ఊర్ధ్వ అక్షానికి సమాంతరంగా ఉంటుంది.

96. ఒక మూలకారకం యొక్క అవకాశ వ్యయం ఏదనగా ....... ( డి )
ఎ) ప్రస్తుత ఉపయోగంలో తాను ఆర్జించునది.
బి) దీర్ఘకాలంలో తాను ఆర్జించబోవునది.
సి) ఇతర ఉపయోగంలో తాను ఆర్జించబోవునది.
డి) ప్రస్తుత ఉపయోగంలో ఆ మూలకారకాన్ని వుంచడానికి చెల్లించవలసింది

97. క్రింది వాటిలో అమ్మకపు వ్యయాలు అవసరం ( డి )
ఎ) పరిపూర్ణ ఏకస్వామ్యం బి) పరిపూర్ణ పోటీ
సి) అపరిపూర్ణ ఏకస్వామ్యం డి) దేనిలోను కాదు

98. సంస్థాపరునికి ఏ పరిశ్రమలోనైనా, సామాన్య లాభాలు ఏవనగా ........ ( డి )
ఎ) స్వల్పకాలంలో మాత్రమే ఆర్జించినవి.
బి) పన్నులు చెల్లించిన తరువాత మిగిలినవి.
సి) వాటాదార్లు ఆపేక్షించే సగటు లాభాల స్థాయికి అనుగుణ్యంగా వుండేవి.
డి) పరిశ్రమలో వుండేలాగా, ప్రోత్సహించడానికి చాలినవి.

99. ఆదాయం సమానంగా పంపిణీ చాలావరకు క్రింది వానిలో సాధించవచ్చు... ( బి )
ఎ) ఏకస్వామ్యం బి) పరిపూర్ణ పోటీ
సి) ఏకస్వామ్య పోటీ డి) పరిమితస్వామ్యం

100. కృత్రిమ భాటక భావనను రూపొందించినవాడు....... ( బి )
ఎ) డేవిడ్ రికార్డో బి) ప్రొఫెసర్ మార్షల్
సి) ప్రొఫెసర్ పిగూ డి) వీరెవరూ కాదు

101. పాక్షిక సమతౌల్య విశ్లేషణ అనగా ........ ( బి )
ఎ) ఆర్థిక వ్యవస్థకు సంబంధించినది. బి) ఒక సంస్థకు సంబంధించినది.
సి) ఒక ఆర్థిక భావన డి) ఒక సిద్ధాంతం

102. ఈ క్రిందివాటిలో ఏవి సంపూర్ణ స్పర్ధ లక్షణాలు ....... ( ఎ )
ఎ) చాలామంది పోటీగల కొనుగోలుదార్లు, విక్రయదార్లు
బి) ఉత్పాదనాల భిన్నత్వం సి) బాగా సంఘటితమైన మార్కెట్
డి) నిబంధనల నుంచి స్వేచ్ఛ

103. ఈ క్రిందివాటిలో దేనిలో సంస్థలు స్వేచ్ఛగా వచ్చుటకు పోవుటకు వీలు కాదు........... ( బి )
ఎ) ఏకస్వామ్యం బి) పరిపూర్ణ పోటీ
సి) ఏకస్వామ్య పోటీ డి) పరిమితస్వామ్యం

